శ్రీరస్తు.

శ్రీహరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## విరాటపర్వము.

చదలువాడ సుందరరామశాస్త్రులచేతను
దండిగుంట సూర్యనారాయణశాస్త్రులచేతను
వ్రాయఁబడిన భారతసంజీవని యను వ్యాఖ్యతోఁ గూడినది.

చెన్నపురి
శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రితమయి ప్రకటింపఁబడెను.



1913.

# INTRODUCTION.

There have been several editions of the text of Sri Mahabharatam in Telugu. The earliest edition issued is that by the late Puranam Hayagriva Sastrulu who was in his time Telugu Pandit of the Government Presidency College. That edition was issued about fifty years ago and discloses evidence of some care taken to avoid faulty readings and to adopt the generally accepted texts. Since then there have been several other editions, but until we come to the edition issued recently, by the Proprietors of the Ananda Press, it does not appear that any attempt was made to gather together the several recensions of this voluminous National Epic, extant in various parts of the country, and to reconcile the differences between them. And it is also noteworthy that no systematic endeovour was made to apply the modern tests of critical enquiry, and to fix the true original text where different readings occur.

The Telugu Mahabharatam is professedly a translation of the original Sanskrit. The Sanskrit recensions also disclose various differences and it is conceivable that following the different Sanskrit texts, various emendations were made in the Telugu texts by Pandits from time to time, acting independently and on their own authority. There has been of late a considerable revival of interest in Telugu literature, and the time seems to be opportune for a systematic attempt being made to critically examine the various texts and to recover the true original as far as practicable.

The Telugu Mahabharatam is the joint work of three eminent scholars and poets. From a literary point of view great importance is attached to this work. for, so far as we can now ascertain, it was the first large attempt made to give to the Telugu language a recognized literary character. There probably existed previous to and at the time of the composition of this great work, many dialectal forms of Telugu as is the case at present also. But by universal assent through all the centuries since its composition, this great work has been looked upon as

the great exemplar of an easy-flowing, elegant style of literary diction, demonstrating the vigour and suitability of the language as a vehicle of refined expression.

The Telugu Mahabharatam comprises eighteen cantos, following the Sanskrit original. The first two cantos and a portion of the third as it has come down to us, were composed by Nannayya Bhatta—the father of Telugu literature. He lived in the time of the great Eastern Chalukya Prince Raja Raja Narendra who ascended the throne in A. D. 1022 and ruled in Rajahmandry. Nannayya Bhatta dedicated the work to his sovereign Rajah Rajah, and appears to have died shortly after completing the three cantos. The latter portion of his third canto, however, has been lost to us, and Errapragada, known also as Prabandha Parameswara and Sambhu Dasa supplied the loss by writing afresh the missing portion. The remaining 15 cantos, forming by far the largest portion of the work, were contributed by that inimitable master of the language, Thikkana Somayajee. Whereas Nannayya Bhatta belonged to Rajahmundry, Thikana and Yerrapragada were natives of the Nellore country. Thikkana wrote his matchless work on the banks of the Pennar. Of this triad of poets, the first Nannayya Bhatta, lived as already stated in the middle of the eleventh century A. D. The second Thikkana Somayajee lived in the middle of the 13th century, and Yerrapragada, who restored the lost portion of the third canto, lived in the 14th century. The composition of the work was thus spread over a long time, and the high standard of excellence of the work of the three authors, who were separated from each other by long periods of time, shows that the language itself had at that early date acquired a fixed literary form well understood by the people.

This is not the place for discussing how at a later period there grew up a distorted and pedantic form of literature in Telugu, known as the Prabandha or Kava style, which, leaning more and more on the rich vocabulary of the Sanskrit, rendered the literary form "caviare to the general." This reliance on Sanskrit is not absent from the Telugu Mahabharatam and in parts of it, such as the portion contributed by Nannayya Bhatta and the latter portions of Thikkanna's cantos, it is somewhat pronounced. It will be futile to expect to do without the aid of Sanskrit altogether, which has

permeated all Dravidian languages in Tadbhava and Tatsama forms, but this obtrusion of Sanskritis less pronounced in the Mahabbharatam than in the later Prabandhams or Kavyams. The correction to this pedantry must come, however, from a revival of the easier form of diction exemplified in the Telugu Mahabharatham and other works of the earlier periods, and not by ignoring the grammatical frame-work of the language in favor of unconventional and corrupt forms of local speech as is now attempted to be done by a few people. That there has been very little change in the structural form of the language since the period when Thikkana and his colleagues wrote, is shown by the great popularity of their work and its more or less easy comprehension by the present generation of its readers.

Apart from the great value of the Telugu Mahabharatham as a work of superior literary excellence, it is also much prized as a book containing a vast mass of high ethical instruction. It is a familiar sight in villages and towns, to see large numbers of people, after their day's work is over, squatted on the bare floor of the streets or on the outer pials of houses, listening with rapt attention to the recitation or exposion of episodes from the Mahabharat. The Mahabharatham and the Ramayanam have been and are the chief means of imparting ethical instruction to the masses. The Mahabharata deals with every aspect of human life. It not only discusses the high principles and aims which should guide man in his daily life, but also illustrates their practical application in the numerous interesting episodes with which the work abounds. So great is the veneration in which the book is held that it is styled the fifth Veda.

Every attempt to present a work of such supreme importance in a form that will merit the approval both of the erudite and of the large number of less educated men to whom it is a fountain of perennial inspiration, must be a welcome one. The present edition is issued by Pandits C. Sundara Rama Sastrulu and D. Suryanarayana Sastrulu who are scholars both in Saskrit and Telugu, and who have spared no pains to secure accuracy in their work. They are both well qualified for the task they have undertaken and their aim is, after examining the various recensions, critically to fix and

present the original and true text in this edition. The labour entailed by the enterprise is great, but I have little doubt they will satisfactorily carry it out. Further, to make the work easy of comprehension, they have undertaken to embody in the edition, a commentary explaining the difficult passages, the technicalities of grammar and other details. This will facilitate the study of the work to all students, and thus enhance the value of this edition to them.

DAK BANGALOW,
Madura, 9th August,
1913.

M. ADINARAYANA IYAH,
*Dewan Bahadur,*
*Retired Settlement Deputy Commissioner,*
*MADRAS.*

శ్రీ

శ్రీహరిహరనాథాయ నమః.

# అవతారిక.

సకలవిద్యాస్థానరత్నంబులకు సముద్రం బనం బరఁగినసంస్కృతభాష యందు శ్రీమన్మహాభారతము కౌస్తుభముపోలె వెలయుచున్నది. అమ్మహాగ్రంథము సంకీర్ణము లైనవేదముల విభజించుటకు నవతరించిన శ్రీమన్నారాయణుఁ డైనవేద వ్యాసునిచే రచియింపఁబడినది. వేదములుంబోలె సకలధర్మంబులను బ్రతిపాదించున దియగుటవలనను శ్రీమద్భగవద్గీతోపనిషద్గర్భం బగుటవలనను నిమ్మహాగ్రంథము పంచమవేదం బని శ్రుతిస్మృతిపురాణములచేఁ జెప్పఁబడినది. పుణ్యశ్లోకు లగు మహారాజర్షుల యుత్తమచరిత్రము ప్రతిపాదించుద్వారమునఁ బండితులకును బామరులకును ధర్మము సుబోధ మగునట్లు మిత్రసమ్మితిని నిరూపించునది యగుటవలన దీనికి వేదములకన్నను బ్రాశస్త్యము చెప్పఁబడినది.—

ఏకత శ్చతురో వేదాః భారతం చైత దేకతః।
పురా కిల సురై స్సర్వై స్సమేత్య తులయా ధృతమ్॥
చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యో హ్యధికం యదా।
తదా ప్రభృతి లోకే ఽస్మి న్మహాభారత ముచ్యతే॥
మహత్త్వేచ గురుత్వేచ ధ్రియమాణం యతో ఽధికమ్।
మహత్త్వా ద్భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే॥

అని (భారతము ఆదిపర్వము ప్రథమాధ్యాయమున.)

ఇట్లు చతుర్విధపురుషార్థంబులకును నిదానభూతం బగునిమ్మహనీయగ్రంథము మహాకవులచే నానాదేశభాషలయందుఁ బరివర్తనము చేయంబడి తత్తద్దేశీయులచేత భక్తిశ్రద్ధలతోఁ బఠింపఁబడుచున్నది. ఇప్పు డిప్పుడు ఖండాంతరవాసు లైనపాశ్చాత్యవిద్వాంసులు గూడ నియ్యితిహాసరత్నమును స్వదేశభాషలయందుఁ బరివర్తించి దీని మహిమం గొనియాడ నేర్చిరి. సంస్కృతభాషానభిజ్ఞులును నాంధ్రభాషారసజ్ఞులు నగువారీతత్పంచమవేదసారము చవిగొని పఠనశ్రవణాదులచే నిర్భరానందము పొందునట్లు దీనిని నన్నయభట్టారక తిక్కయజ్వ ప్రబంధపర

మేశ్వరు లంగీకరించిరి. ఇమ్మహాకవులమహిమము వీరి కసాధారణమై నిరుపపదమైనకవిత్రయనామము సర్వజన సంప్రతిపన్నముగాఁ గలుగుటచేతనే వెల్లడి యగుచున్నది. ఏతత్కవిత్రయప్రణీత మయిన శ్రీమదాంధ్రమహాభారత మాంధ్రలోకమునందు సర్వజనులచేఁ బ్రశస్యమానంబై శ్రోతలకును బఠితలకును వ్యాఖ్యాతలకును నుభయలోకసుఖసాధనం బగుచున్నదనుట యెల్లరకును విదితంబై యున్నయది. మఱియు నిమ్మహాగ్రంథరత్నమే యాంధ్రకవిత్వమునకు మార్గప్రదర్శకంబై యాంధ్రభాషాలక్షణమున కంతయుఁ బ్రధానప్రమాణముగా నాదరింపఁబడుచున్న దనుటయు సర్వలోకప్రసిద్ధము. కావున నిట్టిగ్రంథము చక్కఁగాఁ బరిశీలించి నిర్దుష్టముగా ముద్రింపఁబడియున్న నే తత్పఠనశ్రవణాదికము యథావిధికృతమై యథోక్తదృష్టాదృష్టార్థఫలప్రదం బగును. లక్షణమునందును సంశయవిపర్యయంబులు సంభవింపక భాష వన్నె గాంచును. మఱియు నియ్యది యిదివఱ కెవ్వరిచేతను వ్యాఖ్యాతము కాదయ్యె. సంస్కృతాంధ్రములయందుఁ జక్కనిసాహిత్య మున్నవారికిం గాని దీని యర్థము తెలియుట యసాధ్యము. అర్థజ్ఞానములేక పారాయణాదిక ముక్తఫలప్రదము కాఁజాలదు. భాషయందు వ్యుత్పత్తిఁ గోరువిద్యార్థులకును సర్వలక్ష్యలక్షణప్రమాణభూత మయినయిమ్మహాకావ్యముయొక్క యర్థావబోధపర్యంతపఠనం బత్యంతావశ్యకము. కావున నీకొఱఁతను నివారించుటకై బహుపండితసాహాయ్యముచే నేతద్వ్యాఖ్యానప్రయత్నము చేయఁబడినది. అందుఁ దొలుత భారతమున కంతయు మకుటప్రాయం బగువిరాటపర్వము ప్రారంభింపఁబడియె.

ఇందుఁ దొలుతటి యాదిసభారణ్యపర్వములు మూఁడును నన్నయభట్టు శాలివాహనశకము 944 వ సంవత్సరమునకు సరియయిన క్రీస్తుశకము 1022 వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁ డయిన ప్రాచ్యచాళుక్యకులదీపకుం డగురాజరాజనరేంద్రుని కంకితముగా రచియించెను. పదంపడి విరాటపర్వము మొదలు తక్కిన పదునేను పర్వములను, తిక్కనసోమయాజి శాలివాహనశకము 1172 వ సంవత్సరమునకు సరియయిన క్రీస్తుశకము 1240 వ సంవత్సరప్రాంతమునందు నెల్లూరుపినాకినీనదీతీరమున వెలసి యుండినహరిహరనాథున కంకితముగా విరచించెను.

నన్నయభట్టు మొదటి మూఁడుపర్వములను రచించినట్లును, తక్కిన పర్వములను బదునేనింటిని దాను రచించినట్లును తిక్కనసోమయాజి విరాటపర్వాది నిట్లు చెప్పియున్నాఁడు —

ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొంది యుండ నం

దాదిఁ దొడఁగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండు సేసె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

ఈయర్థము నే తిక్కనసోమయాజిశిష్యుఁడైన మారనయుఁ దనమార్కండేయపురాణము ప్రథమాశ్వాసమున నిట్లు వచియించెను—

సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మును ద్రిపర్వము నెవ్వఁ డొనర్చె నట్టివి
ద్యాగమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్.

ఇట్లు తిక్కనమారనకాలములయందు నన్నయభట్టరచితము లయిన యాదిసభారణ్యపర్వములు సమగ్రములై యుండి పడంపడి కాలక్రమమున నరణ్యపర్వోత్తరభాగ ముత్సన్నమగుటయు నాయుత్సన్నభాగమును ప్రబంధపరమేశ్వరుఁడు నాఁ బ్రసిద్ధి గాంచినయెఱ్ఱాప్రెగ్గడకవి రచియించి భారతపూర్తి గావించెను. ఇట్లు కవిత్రయముచే భారతము తెనిఁగింపఁబడినది యని యెఱుంగనగు.

కొందఱు నన్నయభట్టరణ్యపర్వమును సమగ్రముగా రచియింపక విడిచెననియు నెఱ్ఱాప్రెగ్గడ తదవశిష్టభాగమును బూర్తి గావించెననియు నుడివెదరు. అయ్యది తిక్కనమారనలవాక్యంబులకు విరుద్ధం బగుటచే ననాదరణీయము.

ఈవిరాటపర్వము మొదలు తుదివఱకుఁ దిక్కనసోమయాజికవిత్వంబై యున్నయది. తిక్కనసోమయాజియే

హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట నుద్యోగాదులుం గూడఁ గాఁ
బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపుసం
పది ముట్టంగ రచించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.

అని విరాటపర్వమును హృదయాహ్లాదిప్రభృతిశబ్దములచే వర్ణించినవాఁడగుటవలనను, నిది పరదేవతాంకిత మగుటవలనను మొట్టమొదట నీవిరాటపర్వము ప్రారంభింపఁబడియె.

ఈమహాభారతము వ్రాఁతపుస్తకములయందు దేశభేదముచేతను లేఖకభేదముచేతను నానాపాఠములుగలదిగాఁ గానంబడుచున్నది. అందుఁ గొన్నిపాఠములు సమానార్థకములుగాను గొన్ని భిన్నార్థకములుగాను నున్నవి. కొన్నిపాఠములు

మాత్ర మిప్పటి ముద్రితపుస్తకములయందలి పాఠములకంటె రసవత్తరములుగాఁ జూపట్టుచున్నవి. మఱికొన్ని నిస్సారములు విరుద్ధార్థకములు చ్యుతసంస్కారదుష్టములునై యున్నవి. ఇదివఱకు నీగ్రంథమును బ్రకటించిన పురాణము హయగ్రీవశాస్త్రి ప్రభృతులు వారికిదొరికిన పుస్తకములను సవరించి యుక్తపాఠమును గ్రహించి ముద్రించియున్నారు. ఇటీవల నేతద్గ్రంథప్రకటయితలగు నానందముద్రాశాలాధిపతులు, ఇదివఱకు ముద్రితములయిన పుస్తకములను మఱికొన్ని నానాదేశములనుండిఁ దెప్పించిన వ్రాఁతపుస్తకములను విమర్శపూర్వముగా సవరణచేయించి క్రొత్తకూర్పున వెలయించిరి. అయినను నిట్లిదివఱకుఁ బ్రకటింపఁబడిన యేతద్గ్రంథములయందుఁ బాఠభేదములు గలిగి యిదియే యుక్తపాఠమని నిశ్చయింప వలను గాక యున్నది. పూర్వముద్రితపాఠములయందె కొన్ని సారతరములై యున్నయవి. కొన్ని నవీనముద్రితములైన పాఠములు యుక్తతరములుగాఁ గన్పట్టుచున్నవి. ఇట్టెడ యిద మిత్థమ్మని సిద్ధాంతించుటకు విమర్శపూర్వకవ్యాఖ్యానము లేక శక్యముకాదు. అందువలన మేమిప్పుడీవివిధముద్రితపుస్తకములను నానాదేశానీతంబులగు వ్రాఁతపుస్తకములను జదివి తదీయపాఠములను విమర్శించి తదర్థవివరణపూర్వకముగా గుణదోషములను సారాసారములను నిరూపించి యుక్తతరం బగుపాఠమును సిద్ధాంతించి ప్రకటించుచున్నారము. ఈముద్రణమునందు శ్రీకరాలపాటి రంగయ్యగారిచే సంస్కరింపఁబడి ముద్రింపఁబడిన పుస్తకమును, ఆనందముద్రాయంత్రప్రకటితమగునపుస్తకమును, మాయొద్దనుండుప్రాచీనతాళపత్రసంపుటములును, రాజకీయప్రాచ్యలిఖితపుస్తకశాలయందలి ప్రాచీనతాళపత్రగ్రంథములును, ఆనందముద్రాయంత్రవిద్వాంసు లగు శ్రీయుతతంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారిచేఁ బ్రీతిపూర్వకముగా నొసంగఁబడిన యయిదుతాళపత్రమాతృకలను ముఖ్యసహకారులుగా నవలంబించి యున్నారము. ఈమానిరూపణపద్ధతి యస్మదీయగ్రంథపాఠకులకు విశద మగుచున్నను దిక్ప్రదర్శనముగా నిందుఁ గొన్నిటి నుదాహరించుచున్నారము.

శ్రీ యనఁ గౌరినా......ఈపద్యమునందుఁ «జెల్వకుఁ జిత్తము" అని ప్రాచీనముద్రితగ్రంథములయందును, ప్రాచీనతాళపత్రలిఖితములయందు నేకవచనాంతపాఠమే ప్రసిద్ధమై యుండఁగా «చెల్వలచిత్త» మని బహువచనాంతముగాఁ గొందఱు సవరించిరి. అది శ్రీ గౌరి యని యిద్దఱు నాయికలు ప్రతిపాదింపఁబడుటచే చెల్వశబ్దమునకు బహుత్వం బుండ వలసినట్లు వారు తలంచి యుందురు కాఁబోలు. హరిహరం బగురూపము దాల్చి యనుచోట నేకవచనమును, విష్ణురూపాయ నమశ్శి

వాయ యని హరిహరులకుఁ బరస్పరాభేదమును జెప్పఁబడుటవలన నిచటఁగూడ శ్రీగౌరులకు నభేదమే వివక్షిత మనుట యుక్తము. కావున నేకవచనాంతపాఠమే సముచితమును సర్వసంప్రతిపన్నము నగుటవలన గ్రహింపఁబడినది.

10 వ పద్యము —సుజనకుండు...... ఈపద్యమునందు "మధుకీర్తివిస్తరస్ఫారుఁడు" అని పూర్వముద్రితగ్రంథములయం దంతటను గనఁబడుచున్నది. "విస్తారో విగ్రహో వ్యాస స్సతు శబ్దస్య విస్తరః" అని యమరసింహుఁడు శబ్దేతరవిషయమునందు విస్తారశబ్దమనియు శబ్దవిషయమునందు విస్తర మనియు నర్థభేదమును బట్టిరూపభేదమును నిరూపించియున్నాఁడు. ఈవిషయమునఁ బాణినీయాష్టాధ్యాయి తృతీయాధ్యాయము తృతీయపాదము ముప్పదిమూఁడవసూత్రము "ప్రథనేవావశబ్దే" ఇందుకు, విపూర్వాత్ స్తృణాతేః ఘఞ్ స్యాత్ అశబ్దవిషయే ప్రథనే అనివృత్తి, పటస్యవిస్తారః, అశబ్దేకిమ్ గ్రన్థవిస్తరః, అనియుదాహరణము. ఇట్లు అశబ్దవిషయమయిన ప్రథనమునందు మాత్రమే విపూర్వక స్తృధాతువునకు ఘఞ్ ప్రత్యయము విధింపఁబడినది. శబ్దవిషయ ప్రథనమునందు ఘఞ్ ప్రత్యయమునకుఁ బ్రాప్తి లేకపోవుటచే సామాన్యముగా "ఋదోరప్" అనుసూత్రముచే విధింపఁబడిన యప్ప్రత్యయమువచ్చి విస్తర మనియే రూప మేర్పడును. ఈసిద్ధాంతము తెలిసియే సోమయాజి యేతత్ప్రథమాశ్వాసము 20 వ పద్యమున శబ్దేతరవిషయమునందు "విస్తారసహితముగన్" అనియు, 208 వ పద్యమున శబ్దవిషయమునందు "వాక్యవిస్తర చతురత్వమేర్పడఁ గన్" అనియుఁ బ్రయోగించియున్నాఁడు. కావునఁ నిట సోమయాజి శాస్త్రీయమర్యాద నుల్లంఘించి శబ్దేతరవిషయంబున "మధుకీర్తివిస్తరస్ఫారుఁడు" అని విస్తరశబ్దమును బ్రయోగించినాఁడనుట సాహసము. వ్రాఁతప్రతులయందుఁ గొన్నిటియందు మధురకీర్తి విస్తృతిస్ఫారుఁ డనుపాఠము చూపట్టుచున్నది, ఇది నిర్దోషమయినది కావున నాదరణీయమగును. ఇటీవల నేతద్విషయమున మఱికొన్ని వ్రాఁతపుస్తకములను బరిశీలింపఁగా నందు "మధురకీర్తివిస్తారసారుఁడు" అనుపాఠము కనఁబడెను. ఇది పూర్వపాఠముకన్నను బ్రశస్తతరము.

ద్వితీయాశ్వాసము 26 వ పద్యము —ఎందును నిట్టిరూపు...... ఈపద్యమున "కన్గొనఁ జాలదె దీని నిందిరానందను నాజ్ఞ యేచి భువనంబునఁ బ్రబ్బదె" అని పూర్వముద్రితపాఠము. ఈపాఠమునందు నిందిరానందను నాజ్ఞ యేచి భువనంబునఁ బ్రబ్బుటకు సాధనవాచక మయినపదము లేనందువలనను గన్గొనన్ అను దానికిఁ గర్మపదము ప్రథమపాదమునందలి రూపు అనునది యనువర్తించుటవలనను

వ్రాఁతపుస్తకము ననుసరించి "పీస సిందిరానందను నాజ్ఞ" యని ముద్రింపఁబడినది. షష్ఠియు ఇందలి చతుర్థపాదమునందు "ఫలసిద్ధి పురాతనపుణ్యసమృద్ధికిన్" అను ముద్రిత పాఠమునువిడిచి "ఫలసిద్ధిపురాతనపుణ్యబుద్ధికిన్" అనువ్రాఁతపుస్తకముల యందలి పాఠ మంగీకరింపఁబడినది. పుణ్యముయొక్క యభివృద్ధియొక్క ఫలసిద్ధి యనుటకంటెఁ బుణ్యసంపదయొక్క ఫలసిద్ధి యనుట యుక్తతరము కదా!

50 వ పద్యము —చనునె యిమ్మాట......అనుపద్యము చతుర్థపాదమున "ఏ పతివ్రత నగునన్ను సడుగఁ దగునె" అనుపాఠము ముద్రితగ్రంథములయందుఁ గానవచ్చుచున్నది. వ్రాఁతపుస్తకములయందుఁ గొన్నింటఁ "ఐన పతివత్ని నగునన్ను నడుగఁ దగునె" అనుపాఠము దొరకెను. ఇది "పరదారాస్మి భద్రంతే, అనుసంస్కృతమున కనురూప మగుటవలనను బ్రకృతోచిత మగుటవలనను గ్రహింపఁబడియె.

తృతీయాశ్వాసము 19 వ పద్యము.—పిత్రావణము దెసకున్...అనుపద్యమునందు పిత్రావనము అని ణత్వాభావపాఠమును ముద్రించిరి. "పూర్వపదాత్సంజ్ఞాయామగః" అనుసూత్రముచే నిట వనశబ్దనకారమునకు ణత్వము రావలయును. అందుచే నది పితృవణ మని సవరింపఁబడినది

238 వ పద్యము.—అపరిమితప్రకార...ఇందుఁ దృతీయపాదమున "దేవపితృపథప్రవర్తనవివర్జనసక్తలచిత్తచోరం" అని ముద్రిత గ్రంథపాఠము, వ్రాఁత పుస్తకములయందుఁ బెక్కింటియందు దేవ.....చిత్తబోధ అనుపాఠము కానఁబడుచున్నది. ఇటఁ జోరశబ్దార్థ ముచితము కాకపోవుటవలనను బోధశబ్దార్థము శాంతికి హేతువై సముచితం బగుటవలనను వ్రాఁతపుస్తకముపాఠమే యాదరణీయము.

చతుర్థాశ్వాసము 80 వ పద్యము.—వెలవెలఁబాఱుచు...ఈపద్యమున "నిర్మలాష్టవైడూర్యములు" అని ముద్రితగ్రంథపాఠము. "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" అను సూత్రముచే నసంజ్ఞయందు సంఖ్యావాచక మయిన పూర్వపదముతోఁ గర్మధారయసమాసము నిషిద్ధ మగుటవలన నిర్మలాష్టవైడూర్యమును అను పాఠం బాదృత మయ్యె. సోమయాజి పెక్కుచోట్ల సంఖ్యావాచక పూర్వపదముతో నసంజ్ఞయందుఁ గర్మధారయము చేయక ద్విగువే ప్రయోగించియున్నాఁడు.

85 వ వచనము.—ఇట్లు సవ్యసాచి......ఇందు "నియుద్ధాయుధం బైన శమీవృక్షసమీపంబునకున్" అని పూర్వముద్రితపాఠము. ఇం దేకదేశాన్వయదోషము ప్రసరించుచున్నది. కావున "శమీవృక్షంబుసమీపంబునకున్" అని

తాళపత్త్రిపుస్తకపాఠము గ్రహింపఁబడినది. ఇట్లు ప్రథమాశ్వాసము 185 వ పద్య మునందును « చాలు సార్వభౌమపదవికిన్ » అనుదానిని « చాలు సార్వభౌమ పదవికిన్ » అని నిర్దోషముగా ముద్రించినారము.

పంచమాశ్వాసమున 46 వ పద్యము —సమవిషమ ...... ఇందు « చిత్రముక్రియన్ » అని యానందముద్రాయంత్ర ముద్రితపాఠము. దీనికన్నను « చిత్తముక్రియన్ » అను ప్రాచీన ముద్రితపాఠము యుక్తతరం బగుటవలన నదియే స్వీకరింపఁబడినది.

96 వ వచనము అనుచు వాలమ్ములు......ఇట « అర్జునుండును బ్రీతుండై » అని ప్రాచీనముద్రితపాఠము. కుపితుండై యని క్రొత్తగా ముద్రించిరి. « ప్రతిజగ్రాహ తాన్ పార్థః ప్రీయమాణో మహారథః » అను సంస్కృతమునకు సరి యగుటవలనఁ బూర్వపాఠమే గ్రాహ్యము.

ఇట్లు పెక్కుస్థలములయందుఁ బెక్కువిశేషములు మాముద్రించిన గ్రంథము చదువువారలు తెలియఁగలరు. ఇట గ్రంథవిస్తరభీతిచే దిక్ప్రదర్శనము చేయఁబడినది.

ఆంధ్రీకరణ ప్రకారము.

శ్రీమహాభారతమును శ్రీమత్కవిత్రయమువారు మూలమునితివృత్తము గ్రహించి యందు కవిసిద్ధముగాఁ బ్రసంగప్రాప్తము లైనయుపాఖ్యానములను గొన్నిటిని సంగ్రహించియుఁ గొన్నిటిని విస్తరించియుఁ దత్తత్సందర్భానుగుణముగాఁ బండితపామరజనరంజకముగాఁ దెనిఁగించిరి. సందర్భములన్నియు వస్తువునకును రసమునకును నుచితం బగునట్లు గూర్పఁబడినవి. ఏభాగము చదివినను నందలివిష యం బచ్చటిసందర్భమునకు మిక్కిలి యనువై పాఠకులకు హృదయోల్లాసము గలిగించుచుండును. ఏవిషయంబును నెన్నిమాఱులు చదివినను గొంచెమైనను విసు గుకలుగక యనుక్షణమును నభినుచి హెచ్చుచుండును. సంస్కృతములోఁ గొన్ని యంశము లాంధ్రభాషకును నిప్పటియాంధ్రజనులకును ననువై హృదయంగమ మగునట్లు ముఖ్యతాత్పర్యమున కవిరుద్ధముగా మార్పఁబడియున్నవి. ఆమార్పు లన్నియు మిక్కిలి రసోచితములై యుండుఁ గాని మూలమునకు విరుద్ధము లని తోఁ పవు. మూలము పురాణరూపకావ్య మగుటవలనఁ బెక్కుభాగములయం దంతగా రసపోషణము లేకయున్నను, ఆంధ్రీకరణమునం దాయాయిభాగములు సంద ర్భోచితగుణాలంకారాదులు గలిగి రసవంతములై యుండునట్లాంధ్రీకరింపఁబడినవి.

ఈవిషయమునందు ముప్పురు మహాకవులును నేకమార్గావలంబులై యున్నవారు. ప్రకృతము సోమయాజి యాంధ్రీకరణమును గుఱించి విచారించెదము.

హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి యని యభివర్ణించుటచే నిమ్మహాకవికి విరాటపర్వమునం దెక్కుడు ప్రీతియున్న ట్లూహింపఁదగు కావుననే యిక్కవిబ్రహ్మ యీపర్వమును మూలముకన్నను నధికముగాఁ బెంచి నానారసాలంకారభరితముగా రచియించి యున్నాఁడు.

ఉత్తరాభిమన్యుల వివాహప్రస్తావంబున శృంగారరసంబును, దక్షిణోత్తర గోగ్రహణప్రసంగంబున వీరరసంబును, ద్రౌపదీ పరిదేవనంబునఁ గరుణరసంబును, కీచకవధంబున నద్భుతరసంబును, బృహన్నలా కవచధారణమున హాస్యరసమును, ఉత్తరపలాయనమునందు భయానకరసంబును, కీచకశవదర్శనంబున బీభత్సరసంబును, ద్రౌపదీపరాభవ దర్శనమున భీమసేనాలంబనముగా రౌద్రరసంబును, యుధిష్ఠిరసభాప్రవేశంబున శాంతరసమును, ఇట్లన్నిరసములును నిందుఁ బొందుపడి యున్నవి.

మఱియు నిమ్మహాకవి సూర్యోదయ సూర్యాస్తమయ యుద్ధరంగాది వర్ణనమునందు లోకోత్తర చమత్కారము నావిష్కరించియున్నాఁడు. ఈవిషయములన్నియు నేతద్గ్రంథపాఠకులకుఁ గరతలామలకముగాఁ దెలియవచ్చును. కాన నిట విస్తరింప వలసినదిలేదు.

సంస్కృత మహాభారతము నానాదేశములందు నానావిధపాఠములు గలిగి యధ్యాయము లధ్యాయములుగా భిన్నానుపూర్వీ సహితములై మాఱుపడియుండుటవలన నే దేశపాఠమునుబట్టి యాంధ్రీకరించిరో నిర్ధారింప వలనుగాక యున్నది. ఈదేశమునందుఁ బురాణము హయగ్రీవశాస్త్రిలుగారిచే నాంధ్రలిపిని ముద్రిత మైనసంస్కృతభారతమునకుఁ గొన్నియెడలఁ దెనుఁగుభారతము సరిరాక యుండుటనుబట్టి కొంద ఱాంధ్రీకరణము మూలానుసారము గాదని తలంచుచున్నారు. ఇతరదేశములందలి కొన్నిపాఠములను బట్టి చూడఁగాఁ గవిత్రయమువారి యాంధ్రీకరణము మూలవిరుద్ధము కాదని చెప్పవలసియున్నది. అట్లు వారు మూలవిరుద్ధముగాఁ దెనిఁగించుటకును గారణము మృగ్యము. ఆంధ్రలిపిసంస్కృతభారతమును జూచియే కాఁబోలు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు కవిత్రయము వారి యాంధ్రీకరణము మూలవిరుద్ధం బనియు నందు విశేషించి తిక్కనసోమయాజి విరాటపర్వాంధ్రీకరణం బత్యంతము మూలవిరుద్ధ మనియు నాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికయం దిట్లు ప్రకటించిరి.—

భారతకవులు మువ్వురును గొన్నిచోట్ల మూలములోనికథలు సంగ్రహించియుఁ బెంచియు మార్చియుఁ జెప్పియుఁ దాఱుమాఱుచేసియుఁ దీసివేసియు యథేచ్ఛముగా గ్రంథరచన చేసియున్నారు.

“తెలుఁగు భారతములోఁ దమతో నడవులంబడి యున్న వారి నెల్లంబుచ్చి పాండవు లజ్ఞాతవాసంబేఁగుచు ధౌమ్యులతో రథములెక్కి కొంతచని రథములవారిని సేవకులను వంటలవారిని దాసీజనమును ధౌమ్యునిం బుచ్చినట్లున్నది. సంస్కృత భారతములో నిట్లుకాక యజ్ఞాతవాసంబున వారువారు చేయఁదలంచుకొనినపనులు మొదలగునవి నిర్ణయించికొనిన వెనుకనే యెల్లరను బంచినట్లున్నది. ఇంద ఉన్నప్పుడు రహస్యము చెడునని యూహించి తొలుత బ్రాహ్మణులం బుచ్చినట్లు తిక్కన వ్రాసి యుండును. బ్రాహ్మణు లేఁగినను వంటలవారు, నింద్రసేనాదులు, దాసులు, ధౌమ్యులు, మొదలగు వా రున్నారు. వారున్నప్పుడే విరటునిపాలి కరుగునట్లు నిర్ణయించికొనిరి.

“ఇద్దఱితో నేకాంతము ముగ్గురతో లోకాంతము” అను సామెతయుండ నిట్లు మాత్రము తగునా? అట్లుకాదు. పాండవుల ననుసరించి యడవులఁ బండ్రెండేండ్లు శ్రమపడిన వారెల్లరును వారికై ప్రాణములైన విడుచువారే. వారియెడ నట్టిరహస్యంబైనం జెల్లును. కావున మూలమం దున్నట్లే తెలుఁగున నుండుట సమంజసము. ఇట నీమార్పు నిరవసరమని నాయభిప్రాయము. పాండవులు ప్రేతభూపరిసరమున నస్త్రములు పెట్టి పురప్రవేశము చేయుచు “యాజ్ఞసేనీ పురస్సరంబుగాఁ బుణ్యనదీ తీర్థావతరణంబుచేసి” అని పాండవులు నదీస్నానముచేసినట్టు వ్రాసియున్నాఁడు. ప్రేతభూమికిని బురమునకును నడుమ నదియున్నట్లును వీరుస్నానాదికము చేసినట్లును మూలమున లేదు. లేకున్నను ప్రేతభూమియొద్దనుండి వచ్చిరి కావున నదిసూర్యోదయ సమయము గావునఁ గరిష్ఠుండగు తిక్కనసోమయాజి శుద్ధ్యర్థమట్లు చెప్పియుండఁ బోలును. ఇది సాధువని తలంచెదను. ఈ స్థలమున మూలమున నొక యధ్యాయము ధర్మరాజు దుర్గాస్తవము సేసినట్లున్నది. అది తెలుఁగున గగనకుసుమం బయ్యె. మూలములో ధర్మరాజు కంకుఁడను బ్రాహ్మణుఁడై విరటు నాశ్రయించినట్లుండఁగాఁ దెలుఁగున సన్న్యాసియని చెప్పియున్నాఁడు. ఇట్లే తిక్కనసోమయాజి పెక్కుస్థలములఁ బెంచి పెక్కుకథలు మార్చి పెక్కుకథలు తీసివేసి తనయిష్టమువచ్చినట్లు గ్రంథము చేసియున్నాఁడు.”

అని ప్రకటించిరి. ప్రకృతము కుంభఘోణపట్టనమున నాగరలిపిని ముద్రితమయిన మహాభారతకోశమును బరిశీలించినయెడ నీయాక్షేపము నిరస్తం బగును.

అందు విరాటపర్వ ప్రథమాధ్యాయాంతమున

అజ్ఞాతచర్యా సమయిదం శేషం వర్షం త్రయోదశమ్
తద్వత్స్యామః క్వచిచ్ఛన్నాః త దనుజ్ఞాతు మర్హథ.
ఇత్యుక్త్వా ధర్మరాజేన బ్రాహ్మణాః పరమాశిషః
ప్రయుజ్యాపృచ్ఛ్య భరతాన్ యథాస్వం ప్రయయు ర్గృహాన్.
సర్వే వేదవిదో ముఖ్యా యతయో మునయ స్తదా
ఆశీ రుక్త్వా యథాన్యాయం పునర్దర్శనకాఙ్క్షిణః.
తేతు భృత్యాశ్చ దూతాశ్చ శిల్పినః పరిచారకాః
అనుజ్ఞాప్య యథాన్యాయం పునర్దర్శనకాఙ్క్షిణః.
సహ ధౌమ్యేన విద్వాంసః తథా తే పఞ్చ పాణ్డవాః
ఉత్థాయ ప్రయయు ర్వీరాః కృష్ణామాదాయ భారతాః.
క్రోశమాత్ర మతిక్రమ్య తస్మా ద్వాసా న్నిమి త్తతః
శ్వోభూతే మనుజవ్యాఘ్రాః ఛన్నవాసార్థ ముద్యతాః.
పృథక్ శాస్త్రవిద స్సర్వే సర్వే మన్త్రవిశారదాః
సంధివిగ్రహతత్త్వజ్ఞా మన్త్రాయ సముపావిశన్.

ఇట్లు బ్రాహ్మణులను బాహ్యపరివారమును నిలువరించి ధౌమ్యునితో మంత్రాలోచనమునకుఁ గడంగినట్లు ప్రతిపాదింపఁబడియున్నది.

ఈప్రకరణమున సోమయాజియాంధ్రీకరణము.——

గీ. ఎఱిఁగిరేనిఁ జాల ♦ నెగ్గు వాటిల్లు న, ట్లగుట మమ్ము నింక ♦ నతి రహస్య
వృత్తిమై నిరస్త♦విఘ్నులరై చరి, యింపుఁ డని యనుగ్ర♦హింపవలయు.

* * * * *

౧౫ వ. అట్టిసమయంబున నవ్విప్రులందఱు మొక్కి మొగిచిన మీతలంపునకు దైవం బనుకూలంబు గావుత మని పాండుపుత్త్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని నిజస్థానంబులకుం జనిరి. తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సముచితప్రకారంబున వీడుకోలు వడసి తమతమపొందుపట్లకుం బోయిన.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడుం సతియుఁ ♦ దా నరదంబులతోడఁ గ్రోశమా
త్ర మ్మొక చోటి కల్లఁ జని ♦ ధర్మతనూభవుఁ డందు నాఁటి రే

యిమ్ముల సల్పి వేగుటయు • నీప్సితకార్యము సేయఁగా విచా
రమ్మున నున్నచో నమర•రాజతనూభవుఁ జూచి యిట్లనున్.»

ఇందు పరిహారమునకు బాహ్యపదవిశేషణమును గ్రోశమాత్రగమనమునకు అరదంబులతోఁడఁ అనువిశేషణమును మాత్రమే యధికము. అయ్యాది యింద్రసేనాదిసారథులను మంత్రనిశ్చయానంతరము పంపఁబోవుటవలన నెంతయు నముచితమై యున్నది. కావున నిట మూలవిరుద్ధ మనుట పొసంగదు.

నవమాధ్యాయారంభమున

తతస్తు తే పుణ్యజలాం శివాం శుభాం
మహర్షి గన్ధర్వ నిషేవితోదకామ్
త్రిలోకకాన్తా ముపతీర్య జాహ్నవీ
మృషీంశ్చ దేవాంశ్చ పితౄ నతర్పయన్.

అని పుణ్యనదికిఁ బోయి యందు దేవర్షి పితృతర్పణములు చేసినట్లు చెప్పఁబడి యున్నది.

ఈ విషయమున సోమయాజి యాంధ్రీకరణము.

« వ. యాజ్ఞసేనీపురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు సేసి తదీయస్నానంబునం బరిశ్రమం బపనయించి దేవపితృతర్పణమంగళజపహోమధ్యానాద్యనుష్ఠానంబు లొనర్చిరి. »

ఇందుఁ దదీయస్నానంబునం బరిశ్రమం బపనయించి యనుటయు మంగళజపహోమధ్యానాది యనుటయు నధికము. దేవర్షి పితృతర్పణము స్నానపూర్వకం బగుటవలనను మంగళజపహోమధ్యానాదికము తదనంతరావశ్యం భావియగుటవలనను దద్వర్ణనం బనుపపన్నము కాదు. మఱియొకపాఠం బేతద్వర్ణనపరమై యే దేని యుండనచ్చును.

ఇఁక శ్రీదుర్గాస్తవము మాత్రము కుంభఘోణ ముద్రితపుస్తకమునందుఁ గూడ నొక యధ్యాయముగాఁ గానంబడుచున్నది. సోమయాజి దాని విడుచుటకుఁ గారణము కానరాదు. సర్వవిషయములను సంక్షేపించియో విస్తరించియో రచియించిన కవిబ్రహ్మ దీనిని బుద్ధిపూర్వకముగాఁ బరిత్యజించినాఁ డని నిశ్చయింప శక్యము కాదు. కావున నమ్మహాకవి తనయాంధ్రీకరణమున కాధారముగా నవలంబించిన కోశమునం దేతద్గ్రంథపాఠ మూహ్యంబు.

- ఆంధ్రలిపిమాతృకయందు

సభాస్తారో భవిష్యామి తస్య రాజ్ఞో మహాత్మనః
కఙ్కోనామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనః.

అని ప్రథమాధ్యాయంబునను

యుధిష్ఠిర స్యాస మహాం పురా సభా
సైయ్యాఘ్రపద్యః పున రస్మి విప్రః.

అని సప్తమాధ్యాయంబునను ధర్మరాజు బ్రాహ్మణమాత్రవేషము ధరించినట్లు ప్రతిపాదింపఁబడి యున్నను గుంభఘోణ ముద్రితపుస్తకమునందు

విరాటం స మనుప్రాప్య రాజానం మాత్స్యనన్దనమ్
సభాస్తారో భవిష్యామి విరాటస్యేతి మే మతిః.

*      *      *      *      *      *

దేవిష్యామి యథాకామం స విహారో భవిష్యతి
కఙ్కోనామ్నా పరివ్రాట్చ విరాటస్య సభాసదః.

అని ద్వితీయాధ్యాయమునందును,

సవై ద్విజాతి స్తరుణ స్త్రిదణ్డభృ త్కమణ్డలూ ష్ణీషధరో వ్యజాయత
సురక్తమాఞ్జిష్ఠవరామ్బర శ్శిఖీ పవిత్రపాణి ర్దదృశే తదా ఉద్భుతమ్.

అని ధర్మానుగ్రహంబున ధర్మరాజునకు సన్న్యాసివేషము కలిగినట్లును

ద్విజోవ్రతే నాస్మి నచ స్వతః ప్రభో సమ్ముణ్డితః ప్రవ్రజిత స్త్రిదణ్డభృత్

అని ధర్మరాజు విరాటునితోఁ దానుబ్రతార్థము సన్న్యాసము నవలంబించినట్లు పలికినట్లును నవమాధ్యాయంబునను బ్రతిపాదింపఁబడియున్నది. కావున నేతద్విషయంబుల మూలవిరోధంబు గల దనుటయే విరుద్ధము.

మఱియు నయ్యాంధ్రసాహిత్యపరిషత్పత్రిక యందే శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు

“ శ్లో. వృకోదర విరాటే త్వం వత్స్యసే కేనహేతునా ”

“ ఈశ్లోకార్థమును పురస్కరించుకొని సోమయాజి:—

“ సీ. కడిమిమై సౌగంధికమున యక్షులమద మడఁచి కృష్ణకుఁ బువ్వులట్లు తెచ్చెఁ
గిమ్మీరదానవు నమ్మెయి సడ్డించి విగతకంటకము గావించె వనము

బకదైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁజేసి రక్షించె నేకచక్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జటాసురునడరి దండితుఁజేసి మనలఁ బెట్టించుకొనియె
నితఁడు పుట్టినకోలెను నెపక మొనఁగ
దర్పమునన వర్తిల్లె నుదగ్రమూర్తి
యకట యొరుచిత్తమున కెక్కునట్లు గాఁగ
మెలఁగి యేమివిధంబునఁ గొలుచువాఁడు.

"అని పెంచి వ్రాసినాఁడు. మూలములో ధర్మరాజును గూర్చి యర్జునుఁడును, అర్జునుంగూర్చియు, ద్రౌపదిం గూర్చియు, ధర్మజుఁడును, ఇట్టి సమయంబున నెట్లు విరాటుపాలఁ బ్రవర్తించువారో యని నిర్వేదించుచుం బలికినట్లు మూలముననుండి భీమసేన నకుల సాత్యకులకు నందు ముఖ్యముగా భీమునకు నట్లు లేమి యనుకూలముగ లేదని సోమయాజి యిట్లు పెంచి వ్రాసియుండు ననియు నిది తగుననియు నా యభిప్రాయము.

"శ్లో. తతః కేశాన్ సముత్క్షిప్య వేల్లితాగ్రా ననిందితాన్
కృష్ణాన్ సూక్ష్మాన్ మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా
జుగూహే దక్షిణే పార్శ్వే మృదూ నసితలోచనా
వాసశ్చ పరిధాయైకం కృష్ణా సుమలినం మహత్
కృత్వా వేషంచ సైరంధ్ర్యాస్తతో వ్యచరదార్తవత్."

"క. గారవమున నిజదేశా । చారముమై నల్లియున్న జడ యగుకబరీ
భారంబు విచ్చి తుఱుముగ । సైరంధ్రీజాతివేషసముచిత భంగిన్."

క. వలపలి దిక్కున కించుక । మలఁగంగాఁ దుఱిమి కురులు మాపుడుపుట్టం
బలవడఁగట్టి జటావ । ల్కలమున నవ్వీఁగుఁజన్నుఁగవఁ గప్పి తగన్.

క. పరిచారికాత్వరేఖా । పరిణతిఁ దనమేన నచ్చుపడ భావనకుం
దిరమై తలకొనునంతః । కరణముతోఁ బురము ద్రుపదకన్యక సొచ్చెన్."

"ఇట్లు తెలిఁగింపఁబడినది. మూలమందున్న ద్రౌపదీవేషము సరిగఁ దెలుఁగున రాలేదనియు, మొదటి పద్యము మూలార్థము నతిక్రమించినట్ల యున్నదనియు, మూఁడవపద్య మధికమనియుఁ దలంపనగు."

అని వ్రాసియున్నారు. ఈయాక్షేపముగూడ నాంధ్రలిపి ముద్రితసంస్కృతభారతమును దక్క నితరకోశములను బరిశీలింపమిచేతనే సంభవించినది. కుంభఘోణనాగరలిపి ముద్రితసంస్కృత భారతమునందు:—

విరాటపర్వము తృతీయాధ్యాయమున

ఏవం నిర్దిశ్య చాత్మానం నిశ్శ్వసన్నుష్ణ మూర్త్రిజమ్
విముఞ్చ న్నశ్రు నేత్రాభ్యాం భీమసేన మువాచహ
భీమసేన కథం కర్మ మాత్స్య రాష్ట్రే కరిష్యసి
హత్వా క్రోధవశాం తత్ర పర్వతే గన్ధమాదనే
యక్షాన్ క్రోధాభితామ్రాక్షాన్ రాక్షసాం శ్చాపి పౌరుషాత్
ప్రాదాః పాఞ్చాలకన్యాయై పద్మాని సుబహూ న్యపి
బకం రాక్షసరాజానం భీషణం పురుషాదకమ్
జఘ్నివా నసి కౌన్తేయ బ్రాహ్మణార్థ మరిన్దమ
క్షేమా చాభయసంపీతా సైకచక్రా త్వయా కృతా
హిడిమ్బంచ మహావీర్యం కిర్మీరం చైవ రాక్షసమ్
త్వయా హత్వా మహాబాహో వనం నిష్కణ్టకం కృతమ్
ఆపదం చాపి సంప్రాప్తా ద్రౌపదీ చారుహాసినీ
జటాసురవధం కృత్వా వయంచ పరిమోక్షితాః
మత్స్యరాజా న్తికే తాత వీర్యపూర్ణో త్య మర్షణః
వృకోదర విరాటస్య బలీయాన్ దుర్బలీయసః
సమీపే నగరే తస్య వత్స్యసే కేన కర్మణా

అనియుఁ జతుర్థాధ్యాయమునందు

ఇత్యేవ ముక్త్వా పురుషప్రవీరః తథార్జునో ధర్మభృతాం వరిష్ఠః
వాక్యం తథాసౌ విరరామ భూయో నృపో పరం భ్రాతరమాబభాషే
కింకర్తా కింసమాచారో నకులోయం భవిష్యతి
సుకుమారశ్చ శూరశ్చ దర్శనీయ స్సుఖోచితః
అదుఃఖార్హశ్చ బాలశ్చ లాలితశ్చాపి నిత్యశః
సోయ మార్తశ్చ శాన్తశ్చ కిన్ను రోచయతా త్రివాహ
కిం త్వం నకుల కుర్వాణ స్తస్య తాత చరిష్యసి
కర్మ తత్త్వం సమాచక్ష్వ రాజ్యే తస్య మహీపతేః

అనియు

"నకులే నైవ ముక్తస్తు ధర్మరాజో బ్రవీ ద్వచః
బృహస్పతి సమో బుద్ధ్యా నయే చోశనసా సమః

మన్త్రి ర్నానావిధై ర్నీతః పథ్యేషు పరినిష్ఠితః
సుప్రణీత స్సుమార్గస్థో రాజత స్త్రి మవాప యః
నచాస్య స్ఖలితం కించిత్ దదృశు స్తద్విదో జనాః
సునీతిజ్ఞశ్చ శూరశ్చ సర్వమన్త్రవిశారదః
అధికో మాతు రస్మాకం కున్త్యాః ప్రియతమ స్సదా
సహదేవ కథం కర్మ తస్య రాజ్ఞః కరిష్యసి॥

అనియు భీమసేననకులసహదేవులం గూర్చియు ధర్మజుం డిట్టి సమయంబున నెట్లు విరాటునపాలఁ బ్రవర్తించువారో యని నిర్వేదించుచుం బలికినట్లు వర్ణింపఁబడియున్నది. భీమసేనునిం గూర్చిన తెనుఁగుపద్యము శ్రీశాస్త్రిగారి యాక్షేపమునందే యుదాహరింపఁబడియున్నది. నకుల సహదేవులం గూర్చినవి యుదాహరించెదము.

గీ. అనిన నిది భూపాలు నని యియ్యకొనియజాత, వైరియల్లన నకులునివలను సూచి
నెమ్మనంబున నుమ్మలికమ్ము గదుర, నెలుఁగుచందంబు వేఱుగా నిట్టు లనియె.

ఉ. ఒప్పెడుమేనుఁ జెంపు గలయుల్లము నాగరకంపుఁజందముం
జప్పక చూప కీతనివిశేషముఁ దెల్పెడుఁ గొల్చు టెంతయుం
దప్పర మేమి సేయుదుఁ గడిందివిచారము పుట్టె నెట్లితం
డప్పరి సంచరించునొకొ యన్యు లెఱుంగక యుండునట్లుగన్.

*　　*　　*　　*　　*

క. అనినఁ గడు లెస్స యని నె, మ్మనమున నూఱడి విభుం డమానుష తేజో
ధనుఁ డగుసహదేవుఁ గనుం, గొని యిట్లను వగలు మిగిలి కొందలపడుచున్.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దునే
యుకొడుకు మేను లేఁత దనయుల్లము మెత్తన యిట్టియాతఁ డె
ట్లొకొ యొరు నాశ్రయించు విధి దూపడ యెవ్వరి నెట్లు సేయఁగన్.

ఆంధ్రీకరణము పైఁ దెనుఁగును సంస్కృతమును జూచువారికి మూలతాత్పర్యము విడువక యొనర్పఁబడిన దని స్పష్టముగాఁ దెలియవచ్చును.

మఱియు ద్రౌపదీదేవి ధరించినసైరంధ్రీవేషము విషయమునను దెనుఁగు మూలవిరుద్ధం బనుట యుక్తము కాదు. కుంభఘోణముద్రితగ్రంథమునం దాప్రకరణమున

తతః కృష్ణా సుకేశీ సా దర్శనీయా శుచి స్మితా
వేణీకేశాన్ సముత్క్షిప్య పీనవృత్తకుచా శుభా
జుగూహే దక్షిణే పార్శ్వే మృదూ నసితలోచనా
వాసశ్చ పరిధాయైకం కృష్ణా సుమలినం మహత్
కృత్వా వేషంచ సైరన్ధ్ర్యాః కృష్ణా వ్యచర దార్తవత్
ప్రవిష్టా నగరం భీరుః సైరన్ధ్రీ వేషసంయుతా.

ఇట్లు కనఁబడుచున్నది. ఇట వేణీకేశాన్ సముత్క్షిప్య అనుదానికి « గారవమున నిజ దేశాచారము మై నల్లియున్న జడ యగుకబరీభారంబు విచ్చి » అనియు, కృత్వా వేషంచ సైరన్ధ్ర్యాః" అనుదానికి « సైరంధ్రీజాతివేష సముచితభంగిన్ " అనియు « జుగూహే దక్షిణేపార్శ్వే మృదూన్ » అనుదానికి « తుఱుముగ వలపలి దిక్కున కించుక మలఁగంగాఁ దుఱిమి కురులు » అనియు « వాసశ్చ పరిధాయైకం కృష్ణా సుమలినం మహత్ " అనుదానికి «మాపుడు పుట్టం బలవడఁ గట్టి » అనియు « పీనవృత్తకుచా శుభా » అనుదానికి « జటావల్కలమున నవ్వీఁగుఁ జన్నుఁగవ గప్పి » అనియు « ప్రవిష్టా నగరం భీరుః సైరన్ధ్రీ వేషసంయుతా " అనుదానికి « పరిచారికా త్వ రేఖా..."అనుపద్యమును నాంధ్రీకరణమై యున్నది. ఇం దేవిధ మైన మూలవిరోధమును గానరాదు. పీనవృత్తకుచా యనుటచేతనే కుచాచ్ఛాదనము స్వరసిద్ధ మగుచున్నది. అది మాపుడు పుట్టమునకుఁ దగినట్లు జటావల్కలముగాఁ జెప్పఁబడినది. సోమయాజి పరిగ్రహించినకోశమునందు జటావల్కల వాచకశబ్ద ముండినను నుండవచ్చును. "వాసశ్చపరిధాయైకమ్" అనుచోటి చకారముచేత నంతరీయకముతో నుత్తరీయము కూడ సముచ్చితము గావచ్చును.

ఇట్లు పరిశీలింపఁగా నాంధ్రీకరణము మూలతాత్పర్యము ననుసరించియే చేయఁబడిన దని యేర్పడుచున్నది. కుంభఘోణ ముద్రితగ్రంథమునకుఁ దిక్కన యాంధ్రీకరణము సంక్షేపవిస్తరభేదమునం దక్క నితరవిధమున నెంతమాత్రము విరుద్ధము కాదు. కావునఁ దిక్కన విరాటపర్వమును మూలవిరుద్ధముగా స్వేచ్ఛమై రచించినాఁ డనుట నిరాకరము.

మఱియు యుధిష్ఠిరాదుల విరాట సభాప్రవేశమును దిక్కన జ్యేష్ఠానుక్రమముగా వర్ణించి తదనంతరము ద్రౌపది యంతఃపురప్రవేశమును వర్ణించి యున్నాఁడు, కుంభఘోణ ముద్రితమూలగ్రంథమునందును నట్లే వర్ణింపఁబడి

యున్నది. అయినను ద్వితీయాశ్వాసమున ద్రౌపది తనభంగపాటును భీమసేనునితోఁ జెప్పుకొనునపుడు గ్రంథసందర్భ మిట్లున్నది:—

క. భరమున నీపోరెడునెడఁ బరమవిషాదంబు నీవు బలిమి మెఱసి యు
ద్ధురవృత్తి జయము గొనినం బరితోషముఁ బొందుదన్న భావించి మదిన్.

వ. ఊహించి సుధేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన.

క. వలలుని దెస మాలినిచూ డ్కులతెఱఁగెదఁ బొందుఁ దెలిపెడుం గంటిరె వీ
రలు వచ్చిన సమయంబును దలఁపఁగ నొక్కటియ యివ్విధం బెట్లొకో.

ఇందుచేత భీమసేనుఁడును ద్రౌపదియును ఏకకాలముననో యవ్యవహితా నంతరకాలముననో ప్రవేశించినట్లు చెప్పఁబడినది. ఈ సందర్భమునఁ గుంభఘోణ ముద్రిత సంస్కృత గ్రంథమునందును « తుల్యకాలనివాసినౌ » అని వీరు సమకాలమున విరటునగరు చేరినట్లు ప్రతిపాదింపఁబడినది.

ఇది జ్యేష్ఠానుక్రమముగాఁ బాండవప్రవేశానంతరము ద్రౌపది ప్రవేశించిన దని ప్రతిపాదించు పూర్వోక్తగ్రంథమునకు విరోధించుచున్నది. పాండవు లేవు రును జ్యేష్ఠానుక్రమముగాఁ బ్రవేశించి రనుటయు నుచితముగాఁ దోఁపదు. ఒకరి వెంబడి నొకరు వరుసగాఁ బ్రవేశించినచో వీరిని గుర్తించుట సంభవింపవచ్చును గదా! అందువలన నాంధ్రలిపిని ముద్రిత సంస్కృతగ్రంథమునందుఁ గనఁబడు పాండవప్రవేశప్రకారమే సముచితంబును నుత్తరగ్రంథావిరుద్ధంబు నగుచున్నది. అందు మొదట ధర్మరాజును అనంతరము భీముఁడును అటుపిమ్మట ద్రౌపదియు నంత సహదేవుఁడును బిదప నర్జునుఁడును బదంపడి నకులుండును నిట్లు వ్యుత్క్రమముగా విరాటునినగరు చేరినట్లు వర్ణింపఁబడినది. ఇది పాండవుల యజ్ఞాతవాసమున కనుకూలమగుటవలనను నుత్తరగ్రంథావిరుద్ధం బగుటవలనను నీసందర్భమున నాంధ్రలిపి ముద్రితసంస్కృత గ్రంథపాఠమే యుక్తతరంబని గ్రహింపనగు. పాండవులప్రవేశము ఒక్కొకరిదియు నొక్కొకయధ్యాయముగా వర్ణింపఁబడియుండుటంజేసి వ్యుత్క్రమముగా నుండుట సరికా దని క్రమసిద్ధి కలుగునట్లు అధ్యాయములు ముందు వెనుకలుగా మార్చియుండినను నుండవచ్చును.

సోమయాజి యాంధ్రలిపిగ్రంథమును బట్టి తెనిఁగింపక పోయినను గొన్ని సందర్భము లాంధ్రలిపి గ్రంథములోనివి యుపపన్నములుగా నున్నవి. సంస్కృత

భారతి యొక్క తీరుసలేక యనేకవిధము లయిన పరస్పరవిరుద్ధము లగు పాఠభేదములు గలిగి యధ్యాయము లధ్యాయములే క్రమము తప్పియు మాఱుపడియు నుండుట మిక్కిలి శోచనీయము.

అజ్ఞాతవాససమయమున ద్రౌపది భీమసేనుని పత్నిగా నుండనోపు నని భీమసేనునితో ద్రౌపది యేకాంతభాషణ మొనర్చుటచేతను, ద్రౌపదికి భీమసేనుని యందలి యనురాగమును గవి వర్ణించుటచేతను, దక్కినవారియం దట్లు వర్ణింపక పోవుటచేతను నిర్ధారింపఁదగియున్నది.

శ్రీమత్కవిత్రయమువారి కవిత్వము శైలి భాషాలక్షణము లోనగు తక్కినవిషయములను గుఱించి గ్రంథమంతయు ముద్రించినపిదప విపులముగాఁ జర్చింపఁదలంచినారము, కావున నిట విరమించుచున్నారము.



శ్రీ
శ్రీకృష్ణాయ నమః.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



పంచమాశ్వాసము.





శ్రీ

శ్రీశారదాగురుభ్యో నమః.

# పాఠాంతరానుక్రమణిక.

## ప్రథమాశ్వాసము.

| పద్యము. | పాదము. | |
|---|---|---|
| 1 | 2 | మూర్తిశా |
| 2 | | నిరతిశయానుభావానంద |
| 3 | 2 | సంయమిప్రవర |
| 4 | 1-2 | నిఖిలస్మృతివాదంబులకుం బురాణ వర్గంబులకుఁ |
| 6 | 1 | సారకలితార్థ |
| | 2 | సంభవమై పెంపొందుచుండు |
| 7 | 4 | జనసంతోషంబు నిండారుటకుఁ |
| 8 | 4 | యనుతలంపు గొనకొనుమదితోఁ |
| 10 | 3 | మహితకీర్తి విస్తారసారుఁ డా |
| | గీ. 2 | నస్మదీయప్రణామంబు నాదరించి |
| | 3 | తుష్టి దీపించుకరుణాద్రి |
| 11 | | పద్యంబు గూఢార్థంబు |
| 12 | 3 | నెఱసినతో......గరళంపుఁజాయ |
| | 4 | ప్రథమాద్రి నుదయించుభానుబింబ మునాఁగ నురమునఁ గౌస్తుభ మ్ముల్లసిల్ల |
| 13 | | భక్తినయంబుగా.......ప్రమోద బాష్పసలిల విలసితంబులుం |
| 14 | 3 | చింతలేక |
| 15 | 1 | వైదికధర్మమార్గ మగువర్తనముం గని |
| | 2 | భేదము లేక భక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండు |
| | 4 | సమ్మోదము పొందు కావ్య |
| 18 | 1 | శాసను నిర్మింపఁ దివురుటయును |
| | 3 | దీని కెద నియ్యకొని |
| 19 | | వచనామృతంబున నాయుల్లంబు పల్లవితంబుగా |
| 20 | 2 | క్షీరాంబుధిలోన నామచిత్తంబును |
| 21 | 4 | తలఁగునట్లుగఁ జేసి కృతార్థ |
| 22 | | తనకొలంది |
| 23 | 1 | సంసారదుఃఖ |
| 25 | 2 | సరినెలసి |
| 27 | 2 | పూజ్యమూర్తినయి |
| | 4 | కావ్యకవిత్వ మహావిభూతికిఁ |
| 28 | 4 | రమణీయుఁడ నయ్యెద |
| 30 | 1 | నానఁగ్రోలి |
| 31 | | పుణ్యప్రస్తావంబులు |
| 34 | 4 | క్రతుభూషామణికి |
| 35 | 1 | శమనియత |
| 39 | 2 | భువనస్తుత్యా |
| 42 | 4 | చెప్పవలసియుండు |
| 44 | 2 | నిరూఢవృత్తిమై |
| | 3 | అప్రభేద్యమగు |
| 46 | | సముచితంబుగా నలిపి.....నజ్ఞాతవాస సమయంబునకు.....కరకమలంబులు మొగిచి |
| 47 | 2 | పొందితి రిబ్భంగిఁ బోయెఁ గాల |
| | 4 | చెలువను జూతురు |
| | గీ. 2 | అట్లగుటఁజేసి మమ్ము నతిరహస్య |
| 49 | 3 | సుఖముందఁ |
| 50 | | తత్సమీపంబున |
| 51 | 1 | మహనీయబుద్ధి |
| | 4 | మరపిల్లనేటికిఁ—మరపిల్లుటొప్పనే |
| 53 | 3 | కాలావధికిని |
| | 4 | దలఁచుకొని |
| 54 | గీ. 1 | పడినవీరులు |
| 55 | 2 | కలఁకదేఱి |
| 56 | 1 | సంశమిత |
| 57 | | నిజనివాసంబులకుఁ—నిజాస్థానంబులకుం |
| 59 | 1 | మన మొకయేవురమాయం |
| 60 | | నాఖండలనందనుం డిట్లనియె |
| 61 | 2 | ప్రీతితో |
| 62 | | నానాజనాకీర్ణంబులు |

| పద్య. | పాద. | |
|---|---|---|
| 63 | 2 | ఇచ్చినయట్టివరము |
| 64 | 1 | సత్పథవర్తి |
| | 4 | నడచు టభిమతంబు |
| 65 | 4 | తప్పక చెప్పఁడా |
| 66 | | నయ్యమతనయుం |
| 67 | 1 | మహానీయకీర్తియు...సరసతయును |
| | గీ. 4 | వనఘు చెప్పుము |
| 69 | 2 | సద్వృత్తమునన్ |
| 70 | 2 | జ్యోతిర్విద్యలు వహించి |
| 71 | 2 | దగం గడఁగి |
| | 4 | నాల్పశిల్పప్రౌఢిన్ |
| 72 | 3 | అడ్డసారెలు |
| 73 | | మఱియు నాతనిచిత్తంబునకుం దగి న తెఱంగున నవసరో........ బొమ్మంబులు నిగుడ నీక |
| 76 | 4 | నిచ్చ మెలఁగుదు |
| 80 | 2 | విఱిచినలీలన—విఱిచినయట్లయ |
| 81 | 2 | నొక్కెడ...జంపనొల్లక |
| 83 | | ఆతనిమనంబు వడయుదు...ఆస్మై యికి సమ్మతించి |
| 84 | 4 | ఎట్టులు గొల్చువాఁడొకో |
| 85 | 4 | దాని కొఁగా దనుఁడీ! |
| 86 | | ఈశాపంబుఫలంబు...గుణకిణాంకం బులకు |
| 89 | 1 | అనరపతి |
| 97 | 2 | శీలుఁ డసమానుఁ డుదాత్తుఁడు |
| 100 | 1 | పొఁడిగొనఁగన్ |
| | 4 | నత్తావులను నైన నలువునవెరపున |
| 101 | | ఖిన్నాంతరంగుం డగుచు |
| 102 | 2 | చాలదు భీతచిత్త |
| 104 | 4 | పిలువఁబంపఁగాఁగందుఁదగన్— బంపఁగాఁ జెలు వమరన్ |
| 109 | 3 | తులువలతలఁపులు |
| 111 | 4 | సౌజన్యనిధీ |
| 117 | 3 | మలసివర్తిల్లి |
| 118 | 4 | కొలవిరోధంబు మఱచి |
| 132 | 4 | శుభము లొలయు |
| 134 | 4 | ఒకచోటు చూపినను |
| 135 | 2 | మహీపాలునిపొమ్ము |
| 136 | 2 | గుప్తవర్తనంబు గాఁగ |
| 137 | 2 | పాపవంతులు |

| పద్య. | పాద. | |
|---|---|---|
| 138 | 2 | తోడనైనమైత్రి దొడరవలయు |
| | 4 | తారెంత పూజ్యులైనజనుల పొందు లెస్స |
| 141 | 3 | తెఱంగు లెల్లను |
| 142 | 2 | వత్సర మొకఁడు నెట్టులైన నుడిగి మడిగి |
| 146 | | పక్షికులప్రకారానేక...మండలంబు గడిసేరి—కదిసితి మని |
| 147 | 1 | నంగుళిపుటంబులు |
| | 3 | వచ్చితి మెంత |
| | 4 | నోపనెమ్మెయిన్ |
| 149 | 4 | ద్రుపదాత్మజ నాతనికొయ్యనఁజూపి పిదప |
| 150 | 3 | తడవు నడచితిమి |
| 151 | 1 | అనిన విని యతఁడు గ్రక్కున |
| | 4 | పనిచె నాతఁ డవశుం డైనన్ |
| 154 | 4 | ధర్మజుం డిట్లనియె |
| 155 | 2 | నిక్కెదండములు నయిన |
| 156 | | తనుమధ్య |
| 157 | 2 | రొకభంగి విచటికిని |
| 158 | | అనవుడు నర్జునుం డిట్లనియె |
| 159 | 4 | తుదినొకభంగి నైచుటది |
| 160 | | చిత్తంబు నుత్తలపాటు...నిక్షేపిం చుటయు కర్తవ్యంబుగా |
| 161 | 1 | నిగిడిన కొనలేచి—నెరసిన కొనలేచి ...నవులఁ ద్రోచుచు |
| 163 | 4 | యుం! ర్వీనాథ |
| 164 | 1 | కనుఁబొమవు |
| 166 | | గాండివం బుపలక్షించి |
| 167 | 2 | ధనువునఁ గాదె గెల్తు సముద్ర— గెల్చుట యుదగ్ర |
| 171 | 2 | నిర్జితు లైరి ఘనభుజాండ |
| 177 | | తిత్తిరిదేశవర్తు లైన |
| 178 | 1 | ఇది యొకవృద్ధ |
| | 2 | కులప్రవృత్త |
| 179 | | వనచారు లెవ్వరుం—వనచరు లెవ్వరుం |
| 181 | | అనుచు ననుజన్ములం జూచి పగచి |
| 183 | | నిడికొని చని |
| 186 | 4 | కడవ నొసఁగుదున్ |
| 187 | 1 | మహిమ కుప్యకుండు—మహిమకు నీశుండు |

| పద్య. | పాద. | |
|---|---|---|
| | 4 | సుతసుహృద్భటాళి — సుతసుహృద్భటాక్య |
| 188 | | తోడుకొనిసభకుఁ దెచ్చి సముచితాసనంబున |
| 194 | 4 | విశోకకరసంపత్తి |
| 195 | 2 | నొప్పనిజనంబులు—నొవ్వని జనంబులు |
| | 4 | విరక్తిపుట్టి |
| 203 | | ధర్మతనయుం డతని కిట్లనియె |
| 206 | 1 | ద్యూతాదులదెస |
| | 3 | రేతెఱఁగున వర్తించిన |
| 210 | 4 | చూపదెల్లను దనరూపంబు చూ |
| 212 | 1 | ఆభినవ [డ్కి |
| 2 3 | | రూపరేఖాతిశయంబునను |
| 215 | 2 | నామం బెయ్యదియు నగునో |
| 217 | 2 | చిత్తంబున న్వచ్చునట్లే–చిత్తంబు నన్నెచ్చఁగానే |
| 219 | 2 | నిషుషదినమ్మవచ్చు |
| | 4 | చనవరికొల్వు—జనపతి కొల్వు |
| 221 | 3 | కిచ్చమెచ్చుఁబు |
| 222 | 3 | బలమును లావు విద్యమెయి బంటుతనంబునఁ జేర్చి |
| 225 | 1 | రూపమును నేడ్తెఱ—రూపమునకే డ్తెఱ |
| | 3 | నిల్చుట యభీష్టము |
| | 4 | నూపకరులెల్లను |
| 229 | | మత్స్యమహీవల్లభుండు |
| 232 | 2 | నాటపాటగఱపుదు |
| 234 | 2 | హేమచంద్రకలసద్వర్ణంబు |
| 248 | 3 | హృదయ మలరి |
| 251 | 2 | నీగురువు పౌత్రి |

| పద్య. | పాద. | |
|---|---|---|
| 253 | 1 | నిచ్చటచ్చటనన — నిక్కడక్కడయన |
| 258 | 2 | డశ్వశిక్ష |
| 262 | 3 | వ్యాయామసాధ్య — వ్యాయామసత్త్వ |
| 265 | 2 | నేర్పుపనులవెంట |
| | 3 | వలయుఁ గాక నగరి |
| 269 | 3 | పనిగొనఁ దలఁచిననే లెడి దను |
| 271 | 4 | పనిగొమ్ము పేర్మితోఁ |
| 274 | 1 | పలుపులపొది |
| 277 | 2 | భూపతిలక |
| 283 | 4 | మును నేగఱుపంపుఁ గార్యముల |
| 286 | 1 | పట్టగుఁ గాక |
| 289 | 2 | చారము మెయి నమరి |
| 290 | 2 | మలఁగంగాఁ గొప్ప దుఱిమి |
| 291 | 1 | పరిచారికత్వ |
| | 2 | నచ్చుపడుభావమునం |
| 293 గీ. | 2 | మార్పడి |
| 294 | 1 | మనుష్యమాత్రయే |
| | 2 | గాచికోలు |
| 296 | 2 | యేవలనం—యే వెంటను |
| 298 | 2 | వడరెడుమదితో |
| | 4 | నిది తగవగు నే |
| 303 | 4 | దయచిగురొత్తఁ |
| 305 | 1 | తనపిలిచినపనియారసి |
| 311 | 3 | డెచట నుండఁదలఁచి—డెటకు బుద్ధిఁదలఁచి |
| | 4 | నిగురుఁబోఁడి |
| 314 | 1 | దరహాసము—దరస్మితము |
| 315 | 3 | నాదుప్రాణంబు |

## ద్వితీయాశ్వాసము.

| | | |
|---|---|---|
| 6 | | క్రొమ్మెక్కి భుజాస్ఫాలనంబు చేసియిట్లనియె |
| 7 | 3 | యగ్గలించియు బాహువులప్పళించి—యగ్గలించి నాయెదురఁజే యుప్పళించి |
| | 4 | గడఁగఁజాలెడు |
| 18 | 3 | జెట్టిమల్లులతోఁ గూడ |
| 19 | 1 | తాలిమి మదిలో |
| | 2 | తిరిగి ధరణీతలముం |
| 22 | | పాంచాలిం గాచికొని తాము ......క్రొక్కం జనువాఁ డద్దివి |
| 23 | 1 | చెల్వమున నాత్మజు |
| 26 | 1 | వరు లెక్కడ |
| 27 | 1 | నాయనంగుం డేచి పార్వతీశ్వరుడైననోర్వ |

| పద్య. | పాద. | |
|---|---|---|
| 34 | | ఇట్లు కందర్పగోచరుండైన కీచకుండు |
| 35 | 1 | వోవఁగనీక టు పెంపుతోడ |
| 39 | 4 | జూపి వెగడుపడి |
| 46 | | తమకంబున మల్లడిగొనుచు |
| 47 | 1 | సుదతి నీసెమ్మోముఁ |
| | 2 | మదిఁబూనర్చిన మాటి |
| | 3 | పడఁతి నీకెంగేలు |
| 48 | | వావృతోడన తప్పిం |
| 50 | 4 | నైపవిత్రను నగు నాకు |
| 51 | 1 | అని విడనాడఁగఁ బలికిన, మ |
| 54 | 1 | అని పలికినపలుకులకం, గనకోపము |
| 56 | 1 | నాయలఘుబాహు |
| 59 | 4 | మనముతో సింహబలుఁడు |
| 62 | 2 | అకటదీనవపాయమేమగునోయింక |
| 64 గీ. | 1 | మెఱయుచెయ్యాలరాగంబు |
| 68 | | అలందురి ప్రమందురు నవిన |
| 75 | 2 | ఘనబాహాబలశక్తి నన్ను |
| 76 | 4 | పిలిపింపు కొమినిజ |
| 78 | 2 | జాటిచెప్పి నజ |
| | 3 | కావల మైనవీఁడు |
| 79 | 1 | అని మనమునందుఁ దలఁచుచు |
| 81 | 4 | కొరలు—క్రోలు మథిమతకేళిజ |
| 86 | 2 | కమృతసేవనము గాదె |
| | 4 | లలన మెల్పునన్ను నెఱయింపఁ |
| 87 | | బహుప్రలాపంబులం— బహుప్రకారంబులం |
| 88 | 2 | వాడెదు రాజ |
| 93 | 1 | న న్నుడుగు మొడ్డులఁ |
| 95 | 4 | యపాయము వచ్చిన |
| 96 | 2 | నన్నుఁ బుచ్చనగునె నిన్ను నాఁడ |
| 98 | 4 | నెయ్యము కల్మియె చెప్పుమా సఖీ |
| 103 | | తనయొదురెదుర |
| | | తన్నునిచిన యనుచిత వ్యాపారంబు నకు నిర్వే |
| 104 | 1 | మాయవిధి |
| | 4 | తెతంబడుజ |
| 106 | 1 | విన్నఁదనంబు—చిన్నఁదనంబు గదిరె |
| | 2 | తనులతఁ గంప మదరె |
| గీ. | 1 | తలఁపు ముట్టె |
| 108 | 3 | కీచకునిబారి |
| 110 | 3 | నాక్కుయసురజ |
| 111 | | యంబరతలంబున |
| 112 | 4 | సొచ్చులేటిచందంబునఁ |
| 113 | 2 | మేనిపెల్లుతాపం |
| 114 | 3 | దుర్నికారం |
| 115 | | తదనంతరంబ ద్రుపదపుత్రి కీచకుండున్నతత్ప్రి |
| 117 | 1 | దీర్ఘఁజాలితి—జాఁగితి |
| | 3 | నీవిలసితసం—నీదువినయసం |
| 118 | 3 | నింపొరుచెయ్యల నెలమిఁ గొకొని యాడఁ గానని కోర్కుల తన లుటయును |
| గీ. | 3 | నన్ను బంటుగా నేలుమీ |
| | 4 | యింకనిగ్గదియది యొల్లమేలనీకు—యింతనిగ్గేల నీకు నోయింతి యనిరెను |
| 121 | 3 | పదనసరోజసౌరభమువారుణి |
| | 4 | ట్రిదుఁడగు |
| 122 | 3 | సరసిరుహ నయన—వదన |
| 123 | 2 | రోగాగ్యాచార |
| 125 | | అనుచు లేచి సింహ |
| 126 | 1 | తనుఁ గావ |
| | 3 | తనిచె యదల్చి |
| 127 | | రహస్యప్రకారవిశేద వివేకంబు |
| 128 గీ. | 4 | కూలఁదన్నె |
| 129 | | రక్షకుండై వచ్చిన |
| 130 | 3 | లేచివెనుకఁజని—లేచి తనమదిని |
| 133 | 3 | దనవిక్రుతాస్య |
| | 4 | పరిణద్ధమా రియో |
| 134 | 2 | గూర్చి యొండొంటితో |
| గీ. | 3 | గందళించిన |
| 135 | | యున్న తానసీజంబు |
| 136 | 1 | వలలా యెక్కుడఁ జూచె దొం |
| 141 | 3 | మానుగఁదగదనియెదుపలు |
| 142 | 1 | పవిత్రతాగుణా |
| | 4 | గొందతికినవిందుఁ గృప |
| 144 | 4 | తనిమదికుండు |
| 146 | 2 | మాలదైవం |
| గీ. | 3 | దుల్లమునను౦డి |
| 147 | 2 | రోపరసంబునొంపి యుం |
| 148 | 4 | గలిగిన యట్లయినఁ గవలరిచట |
| గీ. | 3 | తనవుగా నిల్చి యుండియు |
| 149 | | చూచి యకొ౦ంతరపు మదియు |
| 152 | 1 | నటుఁ దొట |
| | 3 | పతులవిధమె కొళ నకులు |

| పద్య. | పాద. | |
|---|---|---|
| | • | లూషిఁ |
| 155 | 1 | చలిన నయ్యోల శాగ ససంభ్రమంబు |
| | 4 | నెలుఁగు వేడుక |
| 156 | గీ. 4 | భంగపఱతుఁ జెఱతుఁ బఱతునను చు |
| 160 | 2 | నే వని నయంబున |
| 162 | 3 | పెరలక మజ్జన |
| 163 | | సుశ్లేష్ణయుఁ బరిజనంబులు...... యుండిరి |
| 165 | | పరిధానపరీవృతయై |
| 166 | 3 | కన్ను మొగుడ్ప |
| 170 | 3 | విన్నను వెల్లను |
| 171 | 1 | విడియఁగఁ బల్కిన మఱియును |
| 175 | 3 | తన్ను టెఱుఁగుదు |
| 179 | 4 | నాచపలాత్ము......నాపరివారము |
| 181 | 2 | యందుఁ జరింపంగ |
| | 4 | నీరజనయనా |
| 186 | 4 | దినధృతిదూలి |
| 189 | గీ. 2 | యతులకీర్తి |
| | 3 | కరుణోత్తరుఁడు |
| 190 | 2 | బలిమికిఁ దోడైన |
| | 4 | కోలఁదిమనను |
| 193 | | అని మఱియు నిట్లనియె. (ఈపద్యము పిమ్మట అధిక పాఠము) |
| 199 | | బెక్కువిధంబులం దమలోన |
| 200 | 2 | గెపపొందు |
| 201 | | లే దనుసందియంబులం బెక్కు |
| 202 | 1 | మఱియు నీమూర్తి |
| 205 | 3 | ద్వ్యాపారగుం డుదారుం |
| | 4 | డాపదలకుఁ దాన యిప్పు డగ్గం బయ్యెన్ |
| 208 | 4 | తనవితరణకేళి విని కల్పతరువైనఁ దలయూఁచి కొనియాడ వలయు వాఁడు |
| | గీ. 4 | నోర్తుఁ జిత్తంబు |
| 215 | | వాసాయాసగతుం డగు |
| 218 | 1 | ప్రచారముం |
| 223 | 2 | తోయజాననమొగ మల్లఁ దుడిచి తుడిచి |
| 225 | 4 | కొఱడిపాటుదెచ్చె |
| 226 | 2 | సొక్కితెనే |
| 228 | 3 | కావలమైన |
| 229 | 3 | నగ్నిమైనను నే విష మానినయైన |
| 233 | | డెందం బలరునట్లు గా నిట్లు |
| 234 | 1 | వాంఛకై శర్యాతిసద్వన |
| | 4 | దుర్వారఘోర, నిరతిశయ |
| 235 | | మెయిగానక—మెయిత్రోడన |
| | | వాసెబగునిం వెగటార్చి |
| | | ఇమ్మాటల వెలిపుచ్చమిందలంపు |
| | | గలిగిసేయుదముగాని తెలతెలవేగు |
| | | అంకిలిజేటిన డెందంబునఁ గొందలం బుతోడి నిశ్చయంబు శౌరయని ద్రంబొరయనికినుకంగనుదోయి |
| 236 | 4 | మూఁతలు విచ్చునెత్తమ్మి |
| 238 | 1 | పెనఁకువఁ దనరిన—దనియని |
| | గీ. 3 | మేనులతని గప్పు—తగు నింపు |
| 240 | | నెగసి విరిసినంబొలుచు కలువకట్టలుంబోని—విరిసిన చాలుచుక్కల కట్టలుం బోని |
| | | వెల్లునం దగగొని కదిసి |
| | | మీనకేతన పురాణబాణ |
| 241 | 1 | భవ్యతపః పుణ్య ఫల మనంగ |
| | 3 | ఘుటిక యనఁగ |
| 243 | 3 | దిగువ నొఁటేని |
| | 4 | గనుగొనఁగాఁ గాక |
| 245 | 2 | యుక్తిమై |
| | 3 | నిక్కము దాఁచి |
| 246 | 4 | అనురాగ వికాస నిరత |
| 247 | 3 | జనువెడ యోల |
| 248 | 4 | యనుపున నట్లుండె భీమునాస కలుగుటన్ |
| 250 | 1 | పసలేని వెంగలి |
| | 4 | లీలఁ గంబంబు |
| 251 | | దుర్విలాసంబులు |
| 252 | 4 | భాగ్యము గందునే—ప్రమందునే |
| 254 | 2 | నాదరింప |
| 256 | 4 | దేవాఁడు గలండు |
| 257 | 1 | నట్లు తాఁప |
| | 3 | దగఁగంటి |
| 265 | 2 | కమనీయ రహస్యవిధిం గదంగియున్ |
| 268 | 2 | ప్రౌఢ్దనయము వెడ |
| 293 | 3 | ధైర్యము వూలిన |
| | 4 | గుందుఁ జేదృడున్ |
| 295 | 3 | వచ్చుటకుఁ దా నొందు వింతలు పుట్టకుండ నోర్కొ |

| పద్య. | పాద. | |
|---|---|---|
| 300 | | మఱియుఁమఱియు |
| 304 | 2 | జెగ్గళించు మిగుల నగ్గలముగ |
| 306 | 1 | ఇంపారఁ బ్రియకాంత యిచ్చినవు కరండమూ |
| 310 గీ. | 4 | నప్పళింతు |
| 316 | 1 | ఆమ్మెయిని నధికమగు తా |
| 319 | 4 | మదం బెసఁగఁగ |
| 332 | 3 | దర్పవచనంబుల సొంపు |
| 358 | 4 | జేరినయట్టి వారలకు |
| 363 | 3 | నిర స్తసాప |

## తృతీయాశ్వాసము.

| | | |
|---|---|---|
| 4 | 1 | వడిఁ గోలదివియలు—దివ్వెకోలలు |
| 5 | 1 | కడువడి |
| 7 | 1 | నిట్టికసుమాలపుఁ |
| 11 | 1 | ఎవరి పిలిచిన |
| 17 | 4 | దయాపరిసర్జితులై రయంబునఁగ |
| 22 | 1 | చలం బెసలగ |
| | 2 | చెనకిన వైవ |
| | గీ. 3. | వీరె యరుగుచున్న |
| 23 | 2 | వెండియుఁ వీంద్రుడును |
| 39 | 3-4 | గొనవీక ద్రుపదనందన యనియె నిజ కృతార్థప్రవృత్తి యంతయుఁ జెలి యగ |
| 46 | | సైరంధ్రికి సాభిప్రాయంబుగా ని |
| 55 | | శోకాయత్త చిత్త యగు కేకయ రాజనందన కడకుఁ జనునప్పుడు |
| 61 | 1 | బిరుదు గల మగలు |
| 66 | 2 | కారణ మిది యేమి యేమి—కార ణము మ ఉయిద్దెనఁ |
| 77 | 2 | కర్త గురుసుత శకుని దుశ్శాసనులును |
| 90 | | విరాటుండును బ్రతిభటుఁడై భం గించుచుండుఁ గావునఁ |
| 95 | 2 | సమ్మద లీలా |
| 96 | 1 | వారొక యూఁటలేని |
| 98 | 3 | పొందునె యొందును |
| 100 | 4 | వారిఁగాంచుట—వారిఁగాన్పుకు |
| 102 | 4 | బుద్ధిఁదా ర్కొనునేనిఁగ |
| 111 | 1 | ఏచినచలమునఁ బోరఁగ |
| 120 | 1 | విరాటునిభూమిమీఁదికిం |
| 125 | 3 | కార్యభారమునకుం |
| 131 | 4 | వ్వరును దీనిఁ దలఁప వలను లేదు— దలఁప వెరవు లేర |
| 136 | 2 | వెగడొం దెను |
| 145 | | ఐరచిత వీరపతాకాలంకార |
| 146 | 3 | నాకలోప్ప జ్వలవిభ్రమంబున |
| 149 | 3 | రోల్లసితుం డసంఖ్య |
| 164 | 1 | పేర్మి పెంపునఁగ |
| 172 | 2 | ప్రస్థపీగగనాంతర |
| 174 | 1 | సిద్ధింప కు |
| 179 | | అతిభీషణంబుగా |
| 180 | 4 | తనమునకై రథంబు వెస దండడిఁ బోవఁగ నిమ్ము నాపుడుఁగ |
| 227 | 2 | సంతోషంబు నాత్మముప్పిరిగొనఁగా |

## చతుర్థాశ్వాసము.

| | | |
|---|---|---|
| 4 | | ఇట్లు నడిచి పశుగణంబులంబోదిని పట్టె...... ఎఱింగి జెగ్గళించుచు ద్వారంబు సొచ్చి రథావతరణంబుచేసి |
| 7 | 1 | నెప్పుడును వేవుర |
| 10 | 2 | పగతుర నిర్జించు—సాధించు |
| | 4 | సూతుఁ డప్పుఁడు వానిఁగ |
| 11 | 1 | మద్భుజా బల, స్ఫుర |
| 16 | 2 | విక్రమము లీ బృహ |
| 26 | 1 | పద్మరాగములు కట్టినవేల కరణిఁ. |
| | 3 | బ్రేఁగైనవేవలి వెనువెంటఁ దగులు కామాంధకారము లీల నతికియల్ల |
| | 4 | మీక్షణ రోచుల |
| 29 | | వచ్చిన మాయన్న సన్నద్ధుండై |
| 34 | 4 | వీరత్వము బాహుబలము వెరవును |
| 49 | | వినుచు వలగొని రథారో |
| 50 | గీ. 2 | డివికి వెసఁగాపు |
| 56 | | ఆనిన విని మందస్మితముఖుం డగుచు ననిమిషపతి తనయుండు డతనికి |
| 58 | 4 | దంతి తురంగసద్భట కదంబముచూ చి తొలంగు టొప్పనే |
| 62 | గీ. 4 | దప్పు దప్పుల నిట్లయిన |
| 63 | 1 | అమ్మనుజేంద్ర తనూజుఁ |
| 80 | 1 | దడుపుచు నెంతయుఁ దల్ల డిల్లు |
| | గీ. 4 | ఇచ్చెద ననుఁ గదు |
| 89 | 1 | మొన లొప్పఁగఁ |

| పద్య. | పాద. | |
|---|---|---|
| 90 | | వదనం బుపలక్షించి |
| 96 | 2 | అరయ దుర్లభ |
| 111 | 3 | జనపాలపుత్త్రి నే |
| 114 | 3 | క్ష్మితిని వెడలె నావిందుల |
| 122 | | పదంపడి ఖాండవ దహనంబున న ద్భుత |
| 128 గీ. | 2 | లుండు నతని యవరజుండు |
| 133 | | మనవీట నవ్యాపన్నులై |
| 149 | | అప్రతిహత బాణంబు లక్షయతూణీరంబు లొసంగిరి |
| | | శలిమి వెలయ మెలంగుదు |
| 150 | 4 | ప్రమోదరసంబునఁ బొంది |
| 151 | 4 | సనాథుఁడ నైతిన్ |
| 154 | 4 | దెరల్చు మరల్చు గోవులన్ |
| 170 | | ఉత్తరు సింహపతాకంబు |
| 172 | 4 | గ్రహతారకా గణము |
| 177 | 2 | కపిరాజ పతాకము |
| 180 | 1 | సంక్షోభంబు నొందించె |
| 181 | 2 | భీషణరోషుఁడైన–భీషణమూర్తియైన |
| 191 | | ఆచార్యులు దవ్వులఁ గార్యంబు తెలంగు గనిరొడు వారు గాథ |
| | | కయ్యంబిచ్చు తెలంగు వారల |
| | | నడుగ వలవదు |
| | | అయోధపరిశ్రమసమయంబుల |
| 192 | 4 | సైన్యావలియైనఁ బాల్పడక యాతల కేర్పడుట లేదు నెనియున్ |
| 193 | | నవమానింపంబడినవాఁ డగుటంజేసి |
| 200 | | వీతెఁడిఁజేయఁ బాడియే |
| 201 | 4 | నర్జును గాత్రశాలలన్ |
| 202 | 4 | చూపెదను జక్కం జూడుఁడీ |
| 203 | 4 | నేన యనిని శర |
| 205 | 1 | అంతకంతకు నెక్కుడు న |
| 208 | 4 | గీడు వాటిల్లుఁ |
| 212 | 4 | కొనంగఁ జూపుము వృథా |
| 217 | 3 | మేలనికొని లింద్రాతని |
| 222 | 1 | భీరము లావును గలిగెడి |
| 224 | | కురుబలంబున కొకకీడు పుట్టిన |
| 229 | 1 | భీష్ముని పలికిన యపుడ |
| 230 | 4 | మూఁగఁగ వలయున్ |
| 236 | 2 | నెట్లు పొందు పొసఁగు |

## పంచమాశ్వాసము.

| పద్య. | పాద. | |
|---|---|---|
| 4 | 2 | లాంగూల భాసిత |
| 7 | 2 | జయోద్ధతుం డగు |
| 9 | 2 | శౌర్యఘనుఁ డితఁడు |
| 17 | 2 | మహాం దరి |
| 18 | 4 | సహాయుఁ డగు నచటఁ దాను స న్నిధి యగుటన్ |
| 21 | | మందస్మితాన నుండగుచు |
| 24 | | ఘూర్ణమాన తారకుం డగుచు |
| 25 | 4 | జలంబు ధీరతయు |
| 26 | 1 | అని కడఁగెడు నినజునకున్ |
| 28 | 1 | దాఁకిన–దన్కిన భానునిఁగానరాదు |
| 29 | | శతమఖ తనయుండు |
| 30 | 1 | గోటియుగంబునఁ గ్రేళ్లు వాఱ |
| 31 | 4 | ముంగలి మొన గదియుటకు |
| 34 | 4 | పరిచాలనం బుదగ్రంబుగాఁగ |
| 35 | 3 | నిడ్డవసిన–పసగ |
| 36 | 1 | వివిధ మర్మ |
| 39 | 1 | పొల్పుఘట్టముల్–వాడు సంతసం |
| | 2 | మద్దిన సూతి రథంబు |
| | 4 | నుద్భటంబుగాన్ |
| 40 | 1 | వేల్పు సోఁకిన–వట్టిన |
| 41 | 2 | వడి నిండన్ |
| 44 | 2 | తతుల దెల్లన్ |
| 45 | 4 | నెడ్డు మూఁడగన్ |
| 51 | 1 | నరుభల్లంబుల–బాణంబుల తాఁకువ |
| 53 | 4 | పుత్త్రిందు కృపన్ |
| 55 | 2 | రకినిమ్మాఁగఁగఁ–నర్తిలిఁ |
| 60 | | తురంగ ఖురంబులం |
| | | నిశిత విశిఖ పరం పరలును |
| | | లయ కాల సంధ్య |
| | | నికృత్తచరణాంబులను |
| 68 | | ప్రాపున నేచి |
| | | వికర్ణ దుర్ముఖ ప్రముఖ |
| 70 | 1 | గ్రాలెడుఁ జూచితే–నిందిదె, యూ |
| | 4 | నితని–వీనితోడ మనము |
| 72 | 1 | యాతని పరాక్రమ |
| 75 | 1 | అంతయు |
| | 2 | దోహల మహరం |
| 77 | 2 | శాతఘనశరము చేకొని–శాతశర ముద్ధతిం గొని |

| పద్య. | పాద. | |
|---|---|---|
| | 4 | యాతత వేగమున నేసి |
| 80 | 4 | పటుబాణమునన్ |
| 83 | 4 | యుండి రయ్యెడం గురువీరుల్ |
| 88 | 1 | సరి నాకు లే రని |
| 90 | 3 | పుత్త్రిక నొలుకంగ |
| 93 | 1 | నిల్చితి పో |
| 94 | 2 | బీర యనుచు నాసమెయి నర |
| | 4 | ధర్మ సారము |
| 102 | | దెగి తఱిమి పయిం బడిన |
| 105 | 1 | కోపంబు భీషణ |
| 109 | | గయ్యంబున లజ్జ విడిచి పాఱిన |
| 112 | 2 | న్మిక్కిలి శౌర్యము న్వరుస నిర్భర |
| 118 | 4 | కణఁక యుడిగి—తఱిఁగి |
| 121 | 2 | పగ్గము లేర్పడ |
| 123 | 4 | యిపు డలుగకుఁడీ |
| 128 | 2 | మఱి గలఁడె |
| 142 | 3 | దగ్రుఁడు గదె యీ |
| 143 | 4 | చ్చుఱపిడుగుల్......చొప్పున |
| 148 | | కనకదీప్త ఘనబాణంబులఁ గపికే తువుం |
| | | ఢిక్కులు పెల్ల గిల్ల |
| 150 | 3 | తలయు నొక్కొక్కట |
| 151 | 3 | వెక్కసము దన్కఁగ ఖడ్గము |
| 156 | 2 | కుల సమరము |
| 161 | | ప్రహర్షోల్లాస భాసుర |
| 163 | 1 | బలువిడి నాదివ్యాస్త్రంబుల |
| 170 | 2 | వడిం దొరఁగఁ జేయఁ |
| 172 | 2 | నవ్విధంబున నారసంబు లన్నియు వఱఁడున్ |
| 173 | 2 | పటువిలుంఛన |
| 176 | 2 | నిశాత కొండరయ |
| 179 | 2 | లందఱు ప్రౌఢై |
| 181 | 1-2 | చూడు వీఁడె వచ్చు చున్నాఁడు |
| | | పార్థుఁడే, మేమి |
| 182 | 1 | అని తను సల్లసమాటకు |
| 184 | 3 | మేనులు తూఁగాడ |
| 186 | 1 | ఉడుగ కదేమి కయ్యమున కోపఁగ |
| 189 | 4 | శాతశరములన్—శరశతకమునన్ |
| 190 | 2 | బాలార్క బింబంబు |
| | 4 | రొగిచి |
| 192 | 2 | కావలి రథికులు |
| 194 | 3 | పలిశ ధారాహతిఁ |
| 195 | 3 | ధరంబడి యున్నను |
| 196 | | కాలుదూసి పోవుటయు |
| 204 | 2 | జాలములు దాల్చి యొనరఁ జేరో లగం బుండఁగలదె |
| 208 | 2 | మెడలు కాళ్లు నిలువ కొఱఁగ |
| 210 | 3 | పచ్చన కుంభసంభవ కృపా |
| 218 | 1 | ముంచిన లజ్జ నెఱుంగ కు |
| 220 | 2 | మనమియ్యెడ మసల నేల మ |
| 225 | 1 | తక్కువ గలవారు |
| 230 | 4 | పేటోక మాట |
| 231 | | రొప్పటి యుత్తరుసింహపతాకంబు |
| 234 | 2 | జనియెఁ బాతఁడు |
| 235 | 3 | వొకరుండు కొకల బృహన్నల సారథి యైన |
| | 4 | విక్రమవిభ్రమం |
| 237 | 4 | బ్రహ్మాదులకున్ |
| 242 | 4 | చారణ ప్రతతులం |
| 247 | 3 | శౌర్య సంపద |
| 252 | 3 | గాంచి మహోగ్ర విక్రమా |
| 255 | 1 | నోపు మాటలు |
| 256 | 4 | తోడఁదగనశంకితబుద్ధిన్—వృత్తిన్ |
| 257 | 3 | నొక్కటి ద్రిక్కక |
| | 4 | నావచనంబు చూడు మీ |
| 263 | 2 | విమిశ్ర లాజాక్షత వ్ర |
| 264 | 1 | సహస్రము గొల్వఁగ |
| 274 | 1 | అని పలికిన విని తన నె |
| 279 | 2 | దర్పమెలర్పఁగఁ జేర్చి యుల్లస |
| 283 | 4 | బఖిలంబును మాకుఁ జెప్పుమా |
| 291 | 4 | ధాత్రిం బడి రెన్నఁ జూడ దడపై యుండున్ |
| 296 | 3 | ప్రచల ద్దోః స్తంభ |
| 297 | 2 | విశిఖ తతులఁ—విశిఖపంక్తిఁ |
| 302 | 1 | దేవకు మారుఁ డాతఁ డగుఁ |
| 303 | | ప్రాంతంబు-చీర చెఱంగునఁ జక్కం బొదివి కొని |
| | | జూడ వొల్లక యుండె |
| | | తనయుండు చెప్ప నెఱింగి యును దెలియక |
| | | సంభావించి యతనిం బోవం బనిచిన |
| | | తిడియ తెఱంగు ధర్మ |
| | | నోర్చిన భంగి యొఱింగించె |
| 304 | 2 | గాంచుటయును బ్రియంబున గార |

| పద్య. | పాద. | |
|---|---|---|
| | | పించి |
| 305 | | సలిపె నంతఁ బాండవులు ధర్మ |
| 306 | 4 | నేర నయ్యెడ నెట్లుగా |
| 307 | | అనిన విని ధర్మజుం డిట్లనియె |
| 308 | 2 | టుండు తనతనూజుఁ |
| 309 | 1 | బొగడి తన్ని |
| 313 | 3 | కీడు సేత |
| | 4 | గనియుఁగా మదోద్ధతి |
| 317 | 3 | విస్మయంబు దోఁప |
| 318 | 2 | మాగద్దియపై |
| 320 | 2 | జనయాజ్ఞ చెల్లించె ధర్మైక నిరతి మచ్చిగ నేల నాలుగు చెఱఁగులందు |
| | 4 | దిక్కుల నన్నింటఁ |
| | గీ. 3-4 | రాజవంశపయోనిధి రాజుధర్మ-వంశ జలనిధి పూర్ణ జైవాతృకుండు, రాజవరుఁడు మహాన్యాయవినీతమా యితఁడు |
| 324 | 1 | హాసుర మర్దించి |
| | 2 | ప్రియము గావించెఁ |
| 328 | 2 | తికిఁ బ్రాణం బితఁడు మిగుల-తికిఁ బ్రాణము దలఁప నితఁడు |
| | 3 | వకుటిల మతి నృపనీతి |
| | 4 | పావనుఁ డధిపా |
| 330 | 4 | తనయ నృపాలా |
| 331 | 2 | కీచకతతిఁ బట్టి రాత్రి |
| 333 గీ. | 4 | ధార్తరాష్ట్రుని విడిపించెఁ దగని తండు |
| 333 | 3 | నికిమది లెక్క-లేమి-నికి మది శంక లేమి |
| | 4 | టిక చనుఁ గాక |
| 338 | 2 | జగతీ పతి |
| | 4 | దరుగు మనియె నాతనితోడఁగా |
| 339 | 1 | అనిన విరటుఁ డపుడు నత్యాదరంబున |
| 341 | 1 | ప్రీతి యినుమడింప |
| | 4 | దృష్టు లడర నిలిచె |
| 342 | 2 | వలువొప్పఁగ నప్పుడు |
| | 3 | సోదర పుత్త్రి వర్గకో |
| 348 | 3 | నిర్భరతను |
| | | బంధులు నెప్పుడుఁ-బంధులునుంద |

| పద్య. | పాద. | |
|---|---|---|
| | | గఁగొల్చి యుండెదరుగా |
| | 4 | యంత దీర్చెదగా |
| 350 | | గల దవధరింపుము |
| 351 | 2 | తేజము దాఁచి యున్కి |
| 354 | | బంధు జన పురోహితమంత్రుల మొగంబు |
| 356 | | గొడుగులు పట్టించి |
| | | ధారాధర నికర మనోహర |
| 357 | 4 | దలుమును నీపనుపు సేయఁదగుదుమఁ దలఁపగా |
| 358 | | అని నిజతనూజుం జూపి యిట్లనియె-అని పలికి యక్కన్నియం జూపి మఱియును |
| 359 | 4 | నిమ్మెయి మిముఁ జేరి |
| 363 | 1 | బాహు శౌర్య పటు వీర్య |
| 368 | 2 | నింప కుండంగఁ బార్థుండు నిన్న బయలు |
| 370 | 4 | నిండెననుము నిండె ననుము నిక్కంబునకుగా |
| 374 | 2 | వెర వెఁడి యే ఫ |
| 375 | | పౌరజన పద సమానీత నానావిధోప హారంబులు |
| 376 | 4 | యోగ్య వర్తనము నడపె |
| 378 | 1 | లలితము లగు మణిభూషణ |
| 380 | 3 | సైన్య సమేతుఁడై |
| | 4 | సమ్మదంబునఁ బొందె |
| 383 | 1 | వివిధాలంకారంబుల |
| 384 | 4 | వాను నయాది కృత్య |
| 386 | 1 | అతులరత్న |
| 389 | | పట్టపు దట్టంబు-పట్టంబు |
| | | వస్తువులు విస్తరిల్లఁ బుణ్యాంగనాజనంబులు క్రంతనడప |
| 391 | 3 | పరఁగఁ గృష్ణయుధిష్ఠిర |
| 393 | 1 | విన్నవిధంబులఁ జిత్తవృత్తిలో |
| 396 గీ. | 4 | నెఱుకలు బయలుపడఁగ |
| 398 | 4 | మ్ములఁ బరఁగింతు |
| 399 | 2 | మెఱుఁగుఁ బోఁడి |
| 402 | 3 | మార్పడి |
| | గీ. 3 | రసము పెన్నిట్టలును బోలి గ్రమ్ము దేర |
| 406 | 2 | నిర్వాపణ నిపుణ |
| 407 | 4 | సానందసంధార్యమాణా |

శ్రీరస్తు.

శ్రీహరిహరనాథాయ నమః.



# సవ్యాఖ్యానాంధ్ర మహాభారతము

## విరాటపర్వము, ప్రథమాశ్వాసము.



శ్రీయన గౌరి నాఁ బరఁగు♦ చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహ♦రం బగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని ♦ పల్కెడుభక్తజనంబువైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చుపర♦తత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. 1

శ్రీకృష్ణాయ నమః.



శమ్భో ర్మాధవతాం హరేశ్చ హరతా మావేదయ న్వైదిక
శ్రేణీభక్తివశేన యో హరిహరం రూపం దధౌ లీలయా
శ్రీ గౌర్యాఖ్య విలాసవర్ష్మ దధతీం దేవీం సమారఞ్జయన్
మాయాలమ్బనదివ్యమఙ్గళగుణాఢ్య పాయా త్పరేశ స్స వః.

శ్రీమత్పూర్వమహాకవిత్రయి రచిం♦చెన్ సాధుశబ్దార్థవి
ద్యామానం బగుభారతంబు సకలా♦ర్థప్రాప్తిమూలంబు న
ద్దామం బయ్యది పాఠభేదగహన♦త్వం బొందఁగా నిప్పు డాం
ధ్రామోదం బొదవింపఁ బూనితిమి త♦ద్వ్యాఖ్యాసమారంభమున్.

1. శ్రీ = లక్ష్మి; అనన్; గౌరి = పార్వతి; నాన్ = అనఁగా; పరఁగుచెల్వకున్ = ఒప్పునట్టి స్త్రీకి; చిత్తము=మనస్సు; పల్లవింపన్=చిగిరించునట్లు, సంతోషించునట్లనుట; భద్రాయితమూర్తియై= మంగళస్వరూప మగు నాకారముగలదై; హరిహరంబు= హరిహరుఁ డను పేరుగలది; అగురూపము; తాల్చి = ధరించి; విష్ణురూపాయ = విష్ణువైన; శివాయ = శివునికొఱకు; నమః = నమస్కారము. అని = ఇట్లు; పల్కెడుభక్తజనంబువైదికధ్యాయితకున్ = చెప్పునట్టి భక్తజనులయొక్క వేదోక్తమయిన ధ్యానమువలన; ఇచ్చన్=మనస్సునందు; మెచ్చుపరతత్త్వమున్= సంతోషించునట్టి పరబ్రహ్మ

వ. అని సకలబ్రహ్మప్రార్థనంబు సేసి తత్ప్రసాదాసాదితకవిత్వతత్త్వనిరతిశయాను
రూపానందభరితాంతఃకరణుండ నగుచుండి యొక్కనాఁ డిట్లని వితర్కించితి. 2

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యం బైనయామ్నాయమున్. 3

మును; ఇష్టసిద్ధికిన్=కోరిక నెఱవేఱుటకు; కొల్చెదన్=సేవించెదను. లక్ష్మియనియుఁ బార్వతియనియుఁ బేరుగల ప్రియురాలికి సంతోషము గలుగునట్లు హరిరూపము ను హరరూపము ను గల దివ్యమంగళమయిన యాకారము ధరించి విష్ణువనుచు శివుఁడనుచు అభేదముగా భక్తి సేయుభక్తుల ననుగ్రహించు నట్టి పరబ్రహ్మము నా కోరిన కార్యము నెఱవేఱుటకై నమస్కరించెద నని తాత్పర్యము. ఇందు విష్ణురూపాయ నమశ్శివాయ యని విష్ణువనుచు శివుఁడనుచు అభేదము ననుసంధించి యట్లు లక్ష్మీపార్వతులకును అభేదానుసంధానముచే చెల్వకున్ అని యేకత్వము చెప్పఁబడినది. చెల్వల చిత్తమని పాఠము కల్పించినయెడ నీయభేదానుసంధానము విరోధించును. భద్రాయిత—భద్రమువలె నాచరించుచున్నది, భద్రమువంటిదనుట, నిర్గుణతత్త్వమునందు భద్రాభద్రముల రెంటికిని సంబంధము లేమింజేసి భద్రరూపముగూడఁ గల్పితమని సూచించుటకై భేదఘటితముగా నాచారార్థకక్విప్ప్రత్యయాంత ప్రయోగము చేయఁబడినది. హరిహరంబు—హరియు హరుఁడును నయినది, హరిత్వమును హరత్వమును నొక్కరూపమునందే యుండుటవలన రూపమునకు విశేషణములగుటచే విశేషణోభయపద కర్మధారయము చేయఁబడినది. విష్ణురూపాయ—ఇట రూపశబ్దము అభేదార్థకము. వైదికధ్యాయిత—ధ్యాయిత—ధ్యాయి (ధ్యానించువాని) యొక్క భావము, ధ్యానమనుట, వైదికధ్యాయిత—వేదోక్తమయిన ధ్యానము. పంచమ్యర్థమున షష్ఠి.

2. సకలబ్రహ్మప్రార్థనంబు = కళలతోఁ గూడిన బ్రహ్మముయొక్క ప్రార్థించుటను, సగుణబ్రహ్మప్రార్థనము ననుట. తత్...అంతఃకరణుండను—తత్ = ఆసగుణ బ్రహ్మముయొక్క, ప్రసాద = అనుగ్రహముచేత, ఆసాదిత = పొందఁబడిన, కవిత్వతత్త్వ= కవిత్వరహస్యము చేతఁ గలిగిన, నిరతిశయ = సర్వాతిశాయి యయిన బ్రహ్మానందమునకు, అనురూప = సమానమైన, ఆనంద = ఆనందముచేత, భరిత=నిండిన, అంతఃకరణుండను= మనస్సుగలవాఁడను. ఇచట నిరతిశయశబ్దమునకు సర్వాతిశాయియని యర్థము, అనురూపపదము ఉపమానము నాకాంక్షించుటవలనను తద్విశేష్యము ఆనందమగుటవలనను ఈనిరతిశయశబ్దము సర్వాతిశాయిబ్రహ్మానందమును బోధించుచున్నది. హరిహరనాథుని ప్రసాదముచేఁ గలిగిన కవిత్వమువలన బ్రహ్మానందమువంటి యానందము ననుభవించుచున్నవాఁడనని తాత్పర్యము. నిరతిశయానుభావ అనుపాఠమునందు సర్వాతిశాయిమహిమ గల అని యర్థము.

3. విద్వత్...ఆవేశుండు = పండితులచేఁ బొగడఁదగిన మేలికవిత్వముయొక్క పొందిక గలవాఁడు. విజ్ఞాన...విఖ్యాతుఁడు = తెలివియొక్క యతిశయముచేఁ బ్రసిద్ధుఁడు. సంయమి...అనుభావుండు= ఋషులసమూహములచే గౌరవింపఁదగిన ప్రభావముగలవాఁడు. కృష్ణద్వైపాయనుఁడు= వ్యాసుఁడు, ద్వీపము అయనము (జన్మభూమి) గాఁగలవాఁడు ద్వీపాయనుఁడు, ద్వీపాయనుఁడే ద్వైపాయనుఁడు, కృష్ణుఁడైన ద్వైపాయనుఁడు కృష్ణద్వైపాయనుఁడు, కృష్ణనామము గలవాఁడును

క. వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణ♦వర్గంబులకున్
వా దైనచోటులను దా, మూదల ధర్మార్థకామ♦మోక్షస్థితికిన్. 4

వ. అదియును. 5

ఉ. ఆదరణీయసారవివి♦ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ♦సంభృతమై పెనుపొంది యుండ నం
చాదిఁ దొడంగి మూఁడుకృతు♦ లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహి♦తాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. 6

యమునాద్వీపమునందుఁ బుట్టినవాఁడును ననుట. అర్థిన్ = ప్రీతితో, దీనికీయర్థమున సంస్కృతభాష యందుఁ బ్రయోగములేదు. లోకహితనిష్ఠన్=లోకమునకు మేలుచేయుటయందలియునికిని. ధర్మఅద్వైతస్థితిన్ = ధర్మమునందు రెండవదిలేని యునికిగలదానిని, ధర్మము తెలుపుటయందు సాటి లేనిదానిని, ఇది యామ్నాయమునకు విశేషణము; భారత ఆఖ్యము= భారత మను పేరుగలది, భారతము—వ్యు. భరత వంశరాజుల నధికరించి చేయఁబడిన గ్రంథము. లేఖ్యంబు=వ్రాయఁదగినది. ఆమ్నాయమున్ = వేదమును. వ్యు. చక్కఁగా నభ్యసింపఁబడునది. కావించెన్ = చేసెను. వేదవ్యాసుఁడు లోకహితము కొఱకు సకలధర్మములను దెలుపునట్టి వేదతుల్యమయిన భారతమును రచించె నని తాత్పర్యము. వేదము వ్రాయఁగూడనిది, వేదము వ్రాయుట ధర్మశాస్త్రములందు నిషేధింపఁబడి యున్నది. ఈ భారతం బను వేదము వ్రాయఁదగినది, అని భారతమునం దాధిక్యము చెప్పుటచే నధికాభేదరూపకాలంకారము. ఆమ్నాయంబు లేఖ్యంబు గాన్ అను పాఠమునందు లేఖ్యంబుగా ననునది క్రియావిశేషణ మగుటచే భారతమునందు అలేఖ్యత్వము పూర్వ ముండె ననియు దానిని లేఖ్యముగా నిపుడు కావించె ననియు భారతమును లేఖ్యముగాఁ గావించెను గాని తత్స్వరూపంబుఁ గావింప లే దనియు విరుద్ధార్థంబు దోఁచుచున్నది. మఱియు నీపాఠమునందు యతిభంగదోషమును బొసంగుచున్నది.

4. అఖిలస్మృతివాదములకున్ = సర్వస్మృతులయొక్క వాక్యములకును. బహుపురాణవర్గంబులకున్ = అనేకములయిన పురాణముల సమూహములకును. వాదు= విరోధము. ఐనచోటులను=అయిన ప్రకరణములయందు. ధర్మఅర్థకామమోక్షస్థితికిన్=ధర్మార్థకామమోక్షముల నిశ్చయమునకు. తాన్— భారతము. మూదల = ప్రమాణము. వేదములు మొదలగు వానియందుఁ బరస్పరవిరోధములు తోఁచినచోట్లయందు ఈ భారతము ఆవిరోధములను బరిహరించి ధర్మార్థకామమోక్షములను నిశ్చయించి వానియథార్థస్వరూపమును తెలుపు నని తాత్పర్యము.

6. ఆదరణీయ...స్ఫురణంబు=ఆదరింపఁదగినవియు నుత్తమములును నానావిధములునగు విషయములయొక్క స్వరూపముయొక్క తెలియుట. అష్టాదశ...సంభృతమై = పదునెనిమిదిపర్వములచే సమాప్తిఁబొందుటచే నిండినదై. ఆదిన్ తొడంగి = మొదలుమొదలుకొని. మూఁడుకృతులు — మూఁడుపర్వములను, ఇది ద్వితీయార్థమునఁ బ్రథమ. విద్యాదయితుండు = విద్యకుఁ బ్రియుఁడు, ఇందుచే వాగనుశాసనబిరుదము సూచితము. నన్నయభట్టు=నన్నయభట్టారకుఁడు, అపూర్వగ్రంథమును నిర్మించిన వాఁడు భట్టుఁడనఁబడును, నన్నయ యట్టివాఁడుకావున నీబిరుదనామ మీతనికెంతయుఁ బొసఁగియున్నది. భట్టశబ్దము వృద్ధాదులలోఁ జేరినది. దక్షతన్= సామర్థ్యముచేత, ఇటఁ దృతీయార్థమున ద్వితీయ. ఒన

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథో♦పేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట్ల నుద్యోగాదులుం గూడఁగాఁ
బదునేనింటిఁ దెనుంగుబాస జనసం♦ప్రార్థ్యంబులై పెంపునం
దుది ముట్టంగ రచించు టొప్పు బుధసం♦తోషంబు నిండారఁగన్. 7

క. అని రచనాకౌతుకమున, మన మలరఁగ నీప్రబంధ♦మండలి కధినా
థునిఁగా నేపురుషునిఁ జే, ర్కొనువాఁడనొ యనుతలంపు ♦ గూరినమదితోన్. 8

వ. ఇంచుక నిద్రించుసమయంబున. 9

సీ. మజ్జనకుండు స♦న్మాన్యగౌతమగోత్ర, మహితుండు భాస్కర♦మంత్రితనయుఁ
డన్నమాంబాపతి ♦ యనఘులు కేతన, మల్లనసిద్ధనా♦మాత్యవరుల
కూరిమితమ్ముండు ♦ గుంటూరివిభుఁడు కొ, మ్మనదండనాథుఁడు ♦ మధురకీర్తి
విస్తృతిస్ఫారుఁ డా♦పస్తంబసూత్రప, విత్రశీలుఁడు సాంగ♦వేదవేది

ర్చెన్ = చేసెను. ఆభారతము పదునెనిమిది పర్వములలో మొదటి మూఁడైనయాదిసభారణ్యపర్వములను వాగనుశాసన బిరుదముగల నన్నయభట్టారకుఁడు తెనిఁగించెనని తాత్పర్యము. మూఁడుపర్వములను నన్నయభట్టారకుఁడు తెనిగించె నని చెప్పుటచే నన్నయభట్టారకుఁ డారణ్యపర్వము సమగ్రముగాఁ దెనిఁగింపలే దనువాదము నిరాకరము.

7. హృదయ ఆహ్లాది= మనస్సును సంతోషింపఁజేయునది. చతుర్థము=నాలవది. ఊర్జితకథా ఉపేతంబు = ఉత్తమము లయిన కథలతోఁగూడినది. నానారస అభ్యుదయ ఉల్లాసి = నానావిధములయిన రసముల యుత్పత్తిచేఁ బ్రకాశించునది. ఉద్యోగ ఆదులున్ = ఉద్యోగపర్వము మొదలగునవియును. జనసంప్రార్థ్యంబులై = జనులచ్చేఁ గోరఁదగినవియై. బుధసంతోషంబు = పండితులకు సంతోషము. నాలవది యగువిరాటపర్వము మొదలు దక్కిన పదునేను పర్వములును పూర్ణములగునట్లు రచించి పండితులకు సంతోషము కలిగించుట యుక్త మని తాత్పర్యము.

8. రచనాకౌతుకమునన్=రచనయందలివేడుకచేత. మనము—మనస్సుయొక్క రూపాంతరము. ఈ ప్రబంధ మండలికిన్ = ఈప్రబంధముల (పర్వముల) సమూహమునకు. అధినాథునిన్ కాన్ = నాయకునిఁగా. కూరినమదితోన్ = కలిగిన మనస్సుతో. ఇటఁ గూరిన యనుధాతుజన్య విశేషణము కూరుటయొక్క అధికరణమైనమదికిఁ బ్రాధాన్యవివక్షచేమదితో సమసించెను, ఇది తెనుఁగుభాష జాతీయప్రయోగము. స్వాభావికముగా—మదిఁగూరిన తలంపుతో నని చెప్పవలసినది.

10. సన్మాన్యగౌతమగోత్ర మహితుండు = సత్పురుషులచేఁ బూజింపఁదగిన గౌతమ గోత్రమునం దుత్తముఁడు. అనఘులు = పాపములేనివారు, షష్ఠీవిశేషణ మగుటచేఁ బ్రథమ. అమాత్యవరుల = మంత్రిశ్రేష్ఠులయొక్క. కొమ్మన దండనాథుఁడు = కొమ్మనయను సేనాధిపతి. మధురకీర్తి విస్తృతి స్ఫారుఁడు=మనోజ్ఞమయిన కీర్తియొక్క విరివిచేఁ బ్రకాశించువాఁడు. ఆపస్తంబసూత్ర పవిత్రశీలుఁడు= ఆపస్తంబసూత్రముచేఁ బవిత్ర మయిన యాచారము గలవాఁడు. సాంగవేద వేది= అంగములతోఁగూడిన వేదముల నెఱింగినవాఁడు. వాత్సల్యము = ప్రేమ. అస్మదీయ ప్రణామంబులు= నావైన నమస్కార

యర్థిఁ గల వచ్చి వాత్సల్య ♦ మతిశయిల్ల, నస్మదీయప్రణామంబు ♦ లాదరించి
తుష్టిఁ దీవించి కరుణార్ద్ర♦దృష్టిఁ జూచి, యెలమి నిట్లని యానతి♦యిచ్చె నాకు.

శ్లో. కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే.

వ. అని నీవు తొల్లి రచియించినపద్యంబు గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుం డగు హరిహరనాథుండు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుఁ గృతార్థునిఁ జేయఁ గార్యార్థియై నాకలోకనివాసి నైన నాకుఁ దనదివ్యచిత్తంబునం గల యాకారుణ్యంబు తెలియం గెఱుంగునట్టిశక్తిఁ బ్రసాదించి నన్ను నాకర్షించి కొలిపించికొని వీఁడె విజయంచేయుచున్నవాఁ డనుచుఁ జూపుటయు సవిశేషసంభ్రమ సంభరిత హృదయుండనై యవ్వేలను గలయం గనుంగొనునప్పుడు. 11

సీ. కరుణారసము పొంగి ♦ తొరఁగెడుచాడ్పున, శశిరేఖ నమృతంబు ♦ జాలువాఱ
హరినీలపాత్రిక ♦ సురభిచందన మున్న,గతి నాభి ధవళపం♦కజము మెఱయ

ములను, ఆత్మార్థమున నస్మచ్ఛబ్దమునకు బహువచనము, మదీయ ప్రణామము లని భావము. ఎలమిన్ = సంతోషముతో. నాతండ్రి యగు కొమ్మనదండనాథుఁడు స్వప్నమున సాక్షాత్కరించి యిట్లు ఆజ్ఞాపించె నని తాత్పర్యము. విస్తరస్ఫారుఁ డను పాఠమునందు, విస్తరశబ్దము శబ్దముల విరివిని బోధించునది యగుటచేఁ గీర్తియొక్క విరివిని బోధింపదు. "విస్తారో విగ్రహో వ్యాస స్సతు శబ్దస్య విస్తరః" అని యమరసింహుఁడు. శబ్దేతర విషయమునందు 'విస్తారమహిమముగన్' అని 20వ పద్యమునందును, శబ్దవిషయమునందు 'వాక్యవిస్తరచతురత్వము' అని 209వ పద్యమునందును సోమయాజియే విస్తారవిస్తర శబ్దములను భిన్నవృత్తులుగాఁ బ్రయోగించి యున్నాఁడు. కావున నిట శబ్దేతర విషయమునందు విస్తరశబ్దము సోమయాజి ప్రయోగించె నని కల్పించుట యుచితము కాదు.

త్వమ్ = నీవు. పరిష్క్రియాయామ్= అలంకారమునందు. అస్థిమాలాం కిమ్ = ఎముకల పేరునా? వా = లేక. కౌస్తుభంకిము = కౌస్తుభమణినా? బహుమన్యసే = గొప్పగా తలంచుచున్నాఁడవు. ప్రభో = ఓస్వామీ! కాలకూటః కిమ్ = విషమా? వా = లేక. యశోదాస్తన్యం కిము = యశోదయొక్క చనుపాలా? తవ = నీకు. స్వాదు = మధురము. మే=నాకు. వద=చెప్పుము. నీవు ఎమ్ముల పేరును కౌస్తుభరత్నమును సమానప్రేమతో ధరించినవాఁడవును, కాలకూటవిషమును యశోదాస్తన్యమును సమానప్రీతితో నాస్వాదించినవాఁడవును, కావున నీకు సర్వప్రపంచము సమాన మని తాత్పర్యము.

11. గాఢ ఆదరంబునన్ = అధికమైన ప్రీతితో. అవధరించి= చిత్తగించి. నాకలోక నివాసిని = స్వర్గలోకమునం దున్నవాఁడను. సవిశేష సంభ్రమ సంభరిత హృదయుండనై = అతిశయముతోఁ గూడిన వేగిరపాటుచే నిండిన మనస్సు గలవాఁడనై. అవ్వేలను = ఆదిక్కు.

12. కరుణారసము= దయయనునీరు. పొంగి తొరఁగెడు చాడ్పునన్=పొరలి ప్రవహించుచున్నదో యనునట్లు. శశిరేఖన్=చంద్రరేఖనుండి, జాలువాఱన్=ప్రవహించుచుండఁగా. చంద్రరేఖనుండి

గుఱుతై యైనచెలువున ♦ మెఱసినలోకరక్షణ మన గరళంబు♦చాయ దోఁపఁ
బ్రథమాద్రిఁ దోఁతెంచు♦భానుబింబము నా ను, రమ్మునఁ గౌస్తుభ♦రత్న మొప్ప
సురనదియును గాళిందియు ♦ బెరసినట్టు, కాంతిపూరంబు శోభిల్ల ♦ శాంతమూర్తి
నామనంబు నానందమ♦గ్నముగఁ జేయ, నెలమి సన్నిధియయ్యె స♦ర్వేశ్వరుండు.

యమృతము ప్రవహించుట దయారసము పొంగి ప్రవహించుచున్నదో యనునట్లుండె ననిభా. ఇదిహరుని విశేషణము. హరినీలపాత్రికన్=ఇంద్రనీల మణుల పాత్రమునందు. సురభిచందనము=మంచివాసనగల గంధము. ఉన్నగతిన్ = ఉన్నదో యనునట్లు. నాభిన్ = పొక్కిలి యందు. ధవళపంకజము = తెల్లతామరపూవు. మెఱయఁగన్ = ప్రకాశింపఁగా. నల్లని పొక్కిలియందు తెల్ల తామర యుండుట నీలమణి పాత్రమునందు చందన మున్నట్లుండె నని తాత్పర్యము. ఇది హరి విశేషణము. గుఱి = గుఱుతు. ఐన చెలువునన్ = అయినట్టి చక్కఁదనముచేత. మెఱసిన లోకరక్షణము అనన్ = ఒప్పినలోకములరక్షించుటయో యనునట్లు. గరళంబుచాయ = విషముయొక్క కాంతి. తోఁపన్ = కనఁబడఁగా. కంఠమునందలి గరళము కాంతి యెల్లలోకములను కంఠమునం దుంచికొని రక్షించుట గుఱుతుగాఁ గనఁబడుచున్నదియో యనున ట్లుండె నని తాత్పర్యము. ఇదిహరునివిశేషణము. భూమినీల వర్ణం బని కవిసమయము, అట్లు శ్యామాం విచిత్రామ్బ్రం భూదేవి ధ్యానశ్లోకమునందుఁ జెప్పఁబడినది, శ్రీవక్షోజకురంగనాభ మను మనుచరిత్రమంగళపద్యమునం దాంధ్ర కవితాపితామహుండును వచించి యున్నాఁడు. ప్రథమాద్రిన్ = మొదటి పర్వతమునందు, ఉదయపర్వతమునం దనుట. తోఁతెంచు భానుబింబము నాన్ = ఉదయించునట్టి సూర్యబింబమో యనునట్లు. ఉరమ్మునన్ = ఱొమ్మునందు. కౌస్తుభరత్నము = కౌస్తుభమణి. ఒప్పన్ = ప్రకాశింపఁగా. వక్షఃస్థలమునందలి కౌస్తుభరత్నము ఎఱ్ఱగా నుండుటచే నుదయించుసూర్యబింబమో యనున ట్లుండె నని తాత్పర్యము. ఇది హరి విశేషణము. సురనదియును = గంగయును. కాళిందియున్ = యమునయును. బెరసినట్టు = కలసినవియో యను నట్లు. కాంతిపూరంబు = కాంతుల ప్రవాహము. శోభిల్లన్ = ప్రకాశింపఁగా. హరుని ధవళకాంతియు హరియొక్క నీలకాంతియు గంగా యమునానదులు గలసి యున్నవో యను నట్లొప్పె నని తాత్పర్యము. శాంతమూర్తిన్ = శాంతమైన రూపముతో. సర్వేశ్వరుండు. నామనంబున్. ఆనంద మగ్నముగన్. సంతోషమునందు మునిఁగినదానినిగా. చేయన్. ఎలమిన్ = సంతోషముతో. సన్నిధి యయ్యెన్ = ప్రత్యక్షమయ్యెను. వివాహమయ్యెన్ మొదలగుదానివలె నిదియు సన్నిహితుఁ డయ్యె ననునర్థమునందు జాతీయ ప్రయోగము. పాఠాంతరము.—సీసము ద్వితీయపాదమున "సురభిచందనమునగతిన్" సురభిచందనముయొక్క విధమున అని యర్థము. తొరఁగెడుచాడ్పునన్, మెఱసినలోకరక్షణమనన్, తోఁతెంచుభా బింబము నాన్ అని తక్కిన మూఁడు పాదములయందును ఉత్ప్రేక్ష స్పష్టమగునట్లు ధాతుజన్య విశేషణములు ప్రయోగించి యుండుట వలన నిటఁగూడ ఉన్నగతిన్ అను వ్రాఁతప్రతులయందలి ప్రాచీన పాఠమే కవిసమ్మత మని చెప్పఁదగియున్నది. తృతీయపాదమున "అనంగగళంబు చాయదోఁపన్"—అను నట్లు కంఠముయొక్క కాంతితోఁపఁగా నని యర్థము. తక్కిన పాదములయందు అవయవములను వర్ణింపక హరిహరనాథునిచే ధరింపఁబడిన శశిరేఖయు ధవళపంకజమును గౌస్తుభమును వర్ణితము లగుటం జేసి యిటఁగూడ గరళ వర్ణనమే కవి హృదయ మని యెంచవలయును. గీతమునందు "బెరసినట్టికాంతిపూరంబు" కలసినట్టి కాంతిప్రవాహమువంటి కాంతిప్ర

వ. ఏనును భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దొలంగి వినయావనతుండనై లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి నయనంబులు నవయవంబులును బ్రమదబాష్పసలిలవిలులితంబులుఁ బులకపటలపరికలితంబులును గా నంతంత నిలిచిన నద్దేవుండు. 13

క. అనుకంపాతిశయంబునఁ, దనదక్షిణనేత్రమును సు◆ధారోచియ కా
నను వింత లేక చూచి వ, దనమున దరహాసరసము ◆ దళుకొత్తంగన్. 14

ఉ. వైదికమార్గనిష్ఠ మగు◆వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేనిభక్తి నతి◆నిర్మలవృత్తిఁ గఁ జేయుచుండి మ
త్పాదనిరంతరస్మరణ◆తత్పరభావముకల్మి నాత్మ న
మ్మోదముఁ బొంది కావ్యరస◆ముం గొనియాడుచు నుండు దెప్పుడున్. 15

వాహ మని యర్థము. సురనదీ కౌళింమల కాంతిపూరమునకును హరిహరనాథుని కాంతిపూరమునకును నైక్యారోపముచేఁ బదార్థవృత్తినిదర్శనాలంకారము. అంతట నుత్ప్రేక్షయు నిట మాత్రము నిదర్శనయుఁ గల్పించుటకన్నను బేరసినట్టు కాంతిపూరం బను పాఠము ప్రక్రమానురూపం బగుటంజేసి యుక్తతరము. "శోభిల్లుశాంతమూర్తి" ప్రకాశించునట్టి శాంతమూర్తి యని యర్థము. ఈపాఠము నందుఁ గాంతిపూర ముపసర్జనమై తద్వర్ణన మప్రధాన మగును. పద్యమం దంతటను హరిహరనాథసంబంధి శశిరేఖాదులుప్రధానములుగా వర్ణింపఁబడినవి. అట్లు ఇచటఁగూడ కాంతిపూరమును ప్రధానముగా వర్ణించుట ప్రక్రమోచితము. కావున శోభిల్లన్ అనుపూర్వపాఠమే కవిసమ్మతంబని తెలియవలయు.

13. భక్తిమయంబు= భక్తిచే నిండినది, మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థకము. వినయావనతుండనై=అణఁకువచే వంగినవాఁడనై. లలాట ఉపరిభాగంబునన్= నుదుటిమీఁది భాగమునందు. అంజలిపుటంబు = దోఁపవంటి చేమోడ్పును. ప్రమదబాష్పసలిలవిలులితంబులున్ = ఆనంద బాష్పముల నీటిచేఁ జలింపఁజేయఁ బడినవియు. పులకపటల పరికలితంబులును = గగుర్పాల సమూహములతోఁ గూడినవియును. కన్నులు ఆనందబాష్పజలములు గలవియు నవయవములు రోమాంచముతోఁ గూడినవియు నని యథాసంఖ్యము. అంతంతన్ = కొంచెము దూరమున.

14. అనుకంపా అతిశయంబునన్ = దయయొక్క యతిశయముచేత. తనదక్షిణనేత్రమును= తన కుడికన్నుగూడ. సుధారోచియ కాన్ = చంద్రుఁడే యను నట్లు. సుధారోచి—వ్యు. అమృతకిరణుఁడు, చంద్రుఁడు, రోచిశ్శబ్దము సకారాంతమయినను సకారము వైకల్పికముగా లోపించి సుధారోచి యనురూప మేర్పడెను, రూ. సుధారోచిస్సు. వింతలేక చూచి=క్రొత్తలేక చూచి. వదనమునన్=మోమునందు. దరహాసరసము=చిఱునగవుకాంతి. తళుకొత్తంగన్=ప్రకాశింపఁగా. హరిహరనాథుఁడు తన దక్షిణనేత్రము సూర్యుఁడైనను అదియును చంద్రుఁడే యనునట్లు దయచేత నన్నుఁ జల్లగాఁజూచి చిఱునవ్వు నవ్వుచు నని తాత్పర్యము.

15. వైదిక మార్గనిష్ఠము = వేదమునందుఁ జెప్పఁబడినమార్గమునం దునికి గలది. వర్తనమున్= వృత్తిని. అతి నిర్మలవృత్తిగన్ = మిక్కిలిపరిశుద్ధ మగు తలంపు గలుగునట్లుగా. మత్ పాదనిరంతరస్మరణ తత్పరభావము కల్మిన్ = నాయడుగులయొక్క యెడతెగని స్మరణమునందు ఆసక్తి కలిగి

వ. అనుడును. 16

క. పారాశర్యునికృతియయి, భారత మను పేరఁ బరఁగు ♦ పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద, ద్గౌరవ మూహించి నీ న ♦ ఖండితభక్తిన్. 17

గీ. తెనుఁగుబాస వినిర్మింపఁ ♦ దివురు టరయ, భవ్యపురుషార్థతరుపక్వ ♦ ఫలము గాదె
దీని కే నియ్యకొని వేడ్క ♦ నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ ♦ దిక్కనార్య.

వ. అనిన సద్దివ్యవచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొనినఁ బునఃప్రణామంబు చేసి
యప్రమేయప్రభావాతీతుం డయ్యు నప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంతసులభుం
డని బుధులవలన విని యునికిం జేసి నాబోంటిబాలస్వభావునకు నిట్టిమహనీయమహి
మ దొరకొనుటయుఁ గలుగున కాక యని తలంచుచు నవ్విభునకు విన్నపంబు సే
యువాఁడనై కొమ్మనామాత్యునాననం బాలోకించి తదనుమతి వడసి యి ట్లంటి. 19

క. భూరిభవత్కారుణ్య, క్షీరాంబుధి నాదుతుచ్ఛ ♦ చిత్తంబును వి

యుండుటచేత. ఆత్మన్ = మనస్సునందు. సమ్మోదమున్ = సంతోషమును. నీవు వేదోక్తమైన యాచారమునం దుండి నాయందు అభేదభావనతో భక్తి యుంచి నాపాదస్మరణము సేయుచు దానిచే ఆనందముఁ బొందిన వాఁడవై కావ్యరసముమీఁదఁ బ్రీతి కలిగి యుందు వని తాత్పర్యము. పాఠాంతరము.—భక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండు మత్పాదనిరంతరస్మరణ తత్పరభావము కల్మిన్ — భక్తిన్ = భక్తితో; మతిన్ = మనస్సు; నిర్మలవృత్తిగన్ = పరిశుద్ధ మగుతలంపు గలది యగునట్లుగా; చేయుచుండుమత్పాద...కల్మిన్ = చేయుచున్న నాయడుగుల యెడ తెగనిస్మరణము వందలియాసక్తి కలిగియుండుటచేత. ఇట్లు కష్టముచే అన్వయము సంభవించుచున్నది. కాని ఏకవాక్యమునం దేకార్థము లగు నాత్మమతిశబ్దముల ప్రయోగము చింతనీయము. దీనికన్నను బ్రాచీన పాఠము అక్లిష్టతరము.

17. పారాశర్యునికృతి = వేదవ్యాసునికావ్యము. ఆరాధ్యము = ఆరాధింపఁదగినది. తద్గౌరవము = ఆభారతముయొక్క గొప్పతనమును. పాఠాం.—అఖండితబుద్ధిన్.

18. వినిర్మింపన్ = చేయుటకు. తివురుట = కోరుట. భవ్యపురుషార్థ తరుపక్వఫలము = మంగళకరమయిన పురుషార్థము అను వృక్షముయొక్క పండినపండు. భారతమును దెనిఁగించుటచేఁ బురుషార్థసిద్ధి యగునని భావము. అలం. నిదర్శన.

19. అద్దివ్యవచన అమృతంబు = ఆయుత్తమమయినవచనము అనునమృతము. ఉల్లంబునన్ = మనస్సునందు. వెల్లిగొనినన్ = ప్రవహింపఁగా. అప్రమేయ ప్రభావ అతీతుండు = కొలఁదిలేని ప్రభావముగలవారలను గూడ దాఁటినవాఁడు, అట్టివారికిని అందనివాఁడనుట. మహనీయమహిమ = గొప్ప ప్రభావము. దొరకొనుటయున్ = కలుగుటయు. ఆననంబు = ముఖమును. పాఠాం.—పునఃపునఃప్రణామంబులాచరించి = పెక్కు మాఱులు నమస్కారములు చేసి. అప్రమేయ ప్రభావభావనాతీతుండు = కొలఁదిలేని ప్రభావముగలవారితలంపునుగూడ దాఁటినవాఁడు.

20. భూరిభవత్ కారుణ్య క్షీర అంబుధిన్ = పాల సముద్రమువంటి గొప్పదైన నీదయచేత. నాదుతుచ్ఛ చిత్తంబును = నాయొక్క యల్పపుమనస్సును గూడ. విస్తారసహితముగన్ = అతిశయ

స్తారమహితముగ నునిచితి, వారయ నచ్చెరువు గాదె ♦ యఖిలాండపతీ! 20

ఉ. ఇంతను నేర్చునీకు నొక♦యింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెం పెసఁగు♦నట్టినినుం గొనియాడఁ జేఁత దా
నెంతయుఁ బెద్ద నీకరుణ ♦ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖము ల్దొలఁగు♦నట్లు గఁ జేసి సుఖాత్ముఁ జేయవే. 21

వ. అని యుపలాలితుం డగుడింభుండు కొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీతలం బగునమస్కారంబు చేసిన నజ్జగన్నాథుండు. 22

గీ. జననమరణాదు లైనసం♦సారదుఃఖ, ములకు నగపడ కుండుని♦మ్మునకుఁ దెరువు
గనువెలుంగు నీ కిచ్చితి ♦ ననఁగ లేచి, నిలిచి సంతోష మెద నిండి♦నెలవుకొనఁగ.

వ. ఇట్లు మేలుకాంచి. 24

క. ఎలమియు నచ్చెరువును మది , నెలసి పొదల మానసమున♦ నెంతయుఁ బ్రొద్దేఁ
గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితి సభక్తి♦తాత్పర్యమునన్. 25

వ. తదనంతరంబ. 26

ముచే నొప్పినది యగునట్లుగా. ఉనిచితివి = కావించితివి. అఖిల అండపతీ = ఎల్ల బ్రహ్మాండములకును నాథుఁడా! నీ దయాతిశయముచేత నాయల్పబుద్ధిని మిక్కిలి గొప్పగాఁ జేసితి వని తా.

21. ఇంతకున్—నాతుచ్ఛచిత్తమునుగూడ గొప్పగాఁ జేయుట కనుట. మదీయవాణిన్ = నావాక్కుచేత. అత్యంత విభూతిన్ = ఎక్కువ గొప్పతనముచేత. కొనియాడఁ జేఁత = స్తుతింపఁజేయుట. ఎంతయున్ బెద్ద = మిక్కిలి యధికమా? నాయల్పబుద్ధిని గొప్పగాఁజేసిన నీవు నావాక్కునుగొప్పగాఁ జేయుట యెంత మాత్ర మని భావము. పదస్థుఁడన్ = గొప్పస్థానమునందున్నవాఁడను. జన్మాంతరదుఃఖముల్ = ఇతర జన్మములు అనుదుఃఖములు. సుఖఆత్మున్ = సుఖస్వరూపుని. చేయవే—వ్యా. చేయుము + ఏ—సంప్రార్థనమున మువర్ణకమునకు వువర్ణము ఆదేశము. పాఠాం:—ఎంతటిపెద్ద = ఎంతగొప్పతనము?

22. ఉపలాలితుండు = బుజ్జగింపఁ బడినవాఁడు. డింభుండు = పిల్లవాఁడు. కొలంది—శక్తిని. సర్వఅంగ ఆలింగిత మహీతలంబు = అన్ని యవయవములచేతను గాఁగిలింపఁబడిన భూప్రదేశముగలది.

23. జనన మరణ ఆదులు = పుట్టుక చావు మొదలు గాఁగలవి. అగపడక ఉండు ఇమ్మునకున్ = విషయము కానిచోటికి, సంసారదుఃఖములు లేనిచోటికి, మోక్షమున కనుట. కనువెలుంగు = చూచునట్టి జ్ఞానమును. ఎదన్ = మనస్సునందు. నెలవుకొనఁగన్ = నిలువఁగా.

25. ఎలమియున్ = సంతోషమును. మదిన్ = బుద్ధియందు. ఎలసి = వ్యాపించి. పొదలన్ = ఒప్పఁగా. ఏన్. సభక్తితాత్పర్యమునన్ = భక్తితాత్పర్యములతోఁ గూడినట్లుగా. పాఠాం:—సరి యెలసి పొదలుమానసమునన్ = సమానముగా వ్యాపించి యొప్పునట్టి మనస్సునందు అని యర్థము. ఈ పాఠమునందు మది మానసము అను సమానార్థకపదములు రెంటి ప్రయోగము లేదు.

ఉ. ఇట్టిపదంబు గాంచి పర♦మేశ్వరుసిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి యగు♦భారతసంహిత చెప్పఁ గంటి నా
పుట్టు కృతార్థతం బొరసెఁ ♦ బుణ్యచరిత్రుఁడ నేన యవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమ♦కారుణికత్వమహావిభూతికిన్. 27

ఉ. కూర్చుట నూత్నరత్నముస♦కుం గనకంబునకుం దగ న్జనా
భ్యర్చిత మైనభారత మ♦పారకృపాపరతంత్రవృత్తిమైఁ
జేర్చినదేవదేవునకుఁ ♦ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వర♦ణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. 28

వ. ఇది యనన్యసామాన్యాకారం బగుపరమధర్మప్రకారంబు. 29

ఉ. కావున భారతామృతముఁ ♦ గర్ణపుటంబుల నారఁ గ్రోలి
యాంధ్రావలి మోదముం బొరయు♦నట్లుగ సాత్యవతేయసంస్కృతి

27. ఇట్టిపదంబు = ఇట్టిగొప్పస్థానమును. కృతినాథున్ = కృతిపతిని. ఏపట్టునన్ = ఏప్రకరణమునందును. పూజ్యమూర్తి = పూజింపదగిన యాకారముగలది. భారతసంహిత = భారత మను నితిహాసమును. నాపుట్టు = నాజన్మము. కృతఅర్థతన్ = చేయఁబడిన ప్రయోజనము కలది యగుటను. పొరసెన్=పొందెను. అవ్విభున్=ఆప్రభువును, హరిహరనాథు ననుట. అప్రతిమ కారుణికత్వమహావిభూతికిన్—సాటిలేనిదయగలిగినవాఁడగుట యను గొప్పసంపదకు. పట్టముగట్టెదన్ అని యన్వయము.

28. తగన్ = ఒప్పునట్లు. జనఅభ్యర్చితము = జనులచేఁ బూజింపఁబడినది. అపారకృపాపరతంత్రవృత్తిమైన్ = కడలేని దయ కధీనమయిన వ్యాపారముచేత. చేర్చిన దేవదేవునకున్ = అతిశయించిన హరిహరనాథునకు. ఇచ్చుట—ఇది కర్తృపదము. నూత్నరత్నమునకున్ = క్రొత్తమణికిని. కనకంబునకున్= బంగారమునకును. కూర్చుట—కూర్చుటవంటిది అని యర్థము. అలం. నిదర్శన. క్రొత్త రత్నమును బంగారముతోఁ గూర్చిన నెట్లు ప్రకాశించునో యట్లు భారతమును హరిహరనాథున కంకితము చేసినచో వన్నెకెక్కు నని తా. సర్వసిద్ధిన్ = అన్నివిధము లయిన సిద్ధిచేత. నా నేర్చిన భంగిన్= నాయొక్క నేర్చిన విధమున, సర్వసిద్ధినైన నేను నేర్చినవిధమున నని యైనం జెప్పనొప్పు. వరణీయుఁడన్ = శ్రేష్ఠుఁడను. భక్తకోటికిన్ = భక్తుల సమూహములో. తగన్ అనుపాఠమునందుఁ గూర్చుటయె తగున్ అని యన్వయము.

29. అనన్య సామాన్య ఆకారంబు= ఇతరములకు సాధారణము కాని ఆకారముగలది. పరమధర్మప్రకారంబు=ఉత్తమ మగుధర్మముయొక్క విధము. అనన్యసామాన్యకారణంబు, అనుపాఠ మనర్థకం బగుటచేతను అంత్యప్రాసభంగముచేతనుం బరిత్యాజ్యము. అనన్య సామాన్య కరణంబు = ఇతరులకు సాధారణము కానిచేయుటగలది. ఇతరు లెవ్వరు చేయనిది యనుట. ఇందు స్వోత్కర్షము చెప్పఁబడుచున్నది. ప్రాసభంగము సమానము.

30. కర్ణపుటంబులన్ = చెవులు అను దొప్పలచేత. ఆరన్ = నిండునట్లు. ఆంధ్ర ఆవలి = ఆంధ్రులసమూహము. పొరయునట్లుగన్ = పొందునట్లు. సాత్యవతేయ సంస్కృతి శ్రీవిభవ అస్ప

శ్రీవిభవాస్పదం బయిన♦చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల ♦ గద్యముల న్రచియించెదం గృతుల్. 30

వ. అని పూని యాదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు
నొక్కయారాధనవిశేషం బగుటంజేసి. 31

( షష్ఠ్యంతములు. )

క. ఓంకారవాచ్యునకు నన, హంకారనిరూఢభావ♦నారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా, లంకారోల్లాసనిత్య♦లాలిత్యునకున్. 32

క. త్రిభువనశుకదృఢపంజర, విభవమహితునకు సమస్త♦విష్టపనిర్మో
కభుజంగపతి కఖిలజగ, దభిన్నరూపునకు భావ♦నాతీతునకున్. 33

క. శ్రుతిసీమంతమణికి నా, శ్రితవాంఛాపూర్తికరణ♦చింతామణి కా
నతదురితతమోద్యుమణికిఁ, గ్రతుభూషణమణికి లోక♦రక్షామణికిన్. 34

దంబు = వ్యాసుని స్మరణము అను సంపదయొక్క యతిశయమునకుఁ జోటు. చిత్తముతోడన్ = మనస్సుతో. మనస్సునందు వేదవ్యాసుని చక్కఁగా స్మరించి యనుట. మహాకవిత్వ దీక్షావిధిన్ = గొప్ప కవిత్వదీక్షయొక్క విధమును. కృతుల్ = ప్రబంధములను. భారతము నాంధ్రులు చదివి సంతోషించునట్లు వ్యాసులను మనస్సున ధ్యానించుచు కవిత్వదీక్ష నవలంబించి గద్యపద్యాత్మకముగాఁ బర్వములను రచించెద నని తా. పాఠాం.—సాత్యవతేయ సంస్కృత శ్రీవిభవాశ్రితంబు = వేదవ్యాసుని సంస్కృతగ్రంథముయొక్క లక్ష్మియొక్క విభవమును ఆశ్రయించినది యని యర్థము. సంస్కృతభారత తాత్పర్యమును పరిశీలించినది యనుట. ఇంతకన్నను వ్యాసుల స్మరణము చెప్పుటయే సముచితము.

31. ఈదృశంబులు = ఇట్టివి. ఒక్క ఆరాధనవిశేషంబు = ఒకవిధమయిన పూజ.

32. ఓంకారవాచ్యునకున్ = ఓంకారముయొక్క యర్థ మయినవానికి. అనహంకార నిరూఢ భావనా ఆరాధ్యునకున్ = అహంకారములేని నిశ్చల మయిన ధ్యానముచేత సేవింపఁదగినవానికి. హ్రీం ...లాలిత్యునకున్ = హ్రీంకారమంత్ర రూపమయిన చక్కని యలంకారము గల యానందకర మయిన నిత్య మయిన సౌందర్యము గలవానికి. హ్రీమ్ అనునది మాయాబీజము. మాయావిశిష్టుఁడై భక్తుల కానందకరమయిన బ్రహ్మ విష్ణు శివాది దివ్యమంగళ సుందరరూపములు పొందినవాని కనుట.

33. త్రిభువన...మహితునకున్ = ముల్లోకములు అను చిలుకకు దిట్టమయిన గూఁటియొక్క యతిశయమువంటి యతిశయముచేత గొప్ప యయినవానికి, ముల్లోకములను దనయందు ధరించినవాని కనుట. సమస్త...పతికిన్ = ఎల్లలోకములు అను కుబుసమునకుఁ బాఁపఱేఁడయిన వానికి, సమస్త లోకములను దన స్వల్పాంశముచే సృజించినవాని కనుట. అఖిల...రూపునకున్ = ఎల్లలోకముల కంటె వేఱుగాని రూపము గలవానికి, తానే జగద్రూపముగాఁ దోఁచుచున్న వాని కనుట. భావనా అతీతునకున్ = తలంపు నతిక్రమించినవానికి.

34. శ్రుతి సీమంతమణికిన్ = వేదములన్ను నాయికకు పాపటమానికమయినవానికి, శ్రుతియందు స్త్రీత్వారోపము గమ్యము. వేదములచేఁ బ్రతిపాద్యుఁడై వాని కలంకార మయిన వాని కనుట. ఆశ్రి

క. పరమశమనిరతసంయమి, వరమానసకుముదహాస♦వర్తనచంచ
చ్చరణనఖచంద్రికావి, స్ఫురణవిచిత్రప్రకార♦శోభాఢ్యునకున్. 35

క. హరిహరనాథునకు మరు, త్సరిదాకల్పితమనోజ్ఞ♦చరణశిరస్సుం
దరమూర్తికి భావనత, త్పరచేతోయుక్తభక్త♦పరతంత్రునకున్. 36

వ. ఏను విన్నపంబు చేయు తెఱంగు గా నంతస్సన్నిధిం గలిగించికొని యమ్మహావా
క్యంబునర్థంబు సంగతంబు చేసెద. 37

త...చింతామణికిన్ = భక్తులకోర్కులపూర్తిచేయుటయందుఁ దలంపు మానిక మయిన వానికి. ఆనత దురిత తమోద్యుమణికిన్=మ్రొక్కినవారి పాపము అను చీఁకటికి సూర్యుఁడయినవానికి. క్రతుభూషణ మణికిన్=యజ్ఞము అను నాభరణమునకు రత్న మయినవానికి, యజ్ఞముచే నారాధింపఁదగినవాని కనుట. లోకరక్షామణికిన్ = లోకముల రక్షించురత్నమయిన వానికి.

35. పరమ......శోభాఢ్యునకున్—పరమ = ఉత్తమమయిన, శమ = ఇంద్రియ నిగ్రహమునందు, నిరత = ఆసక్తులయిన, సంయమివర = ఋషిశ్రేష్ఠులయొక్క, మానసకుముద= మనస్సులు అను తెల్లకలువలకు, హాస = వికాసముయొక్క, వర్తన = కలిగించునట్టి, చంచత్ = ఒప్పుచున్న, చరణనఖచంద్రికా = పాదములయందలి గోళ్ల వెన్నెలయొక్క, విస్ఫురణ= మెఱయుటయొక్క, విచిత్ర= వింతయయిన, ప్రకార = విధములు గల, శోభా = కాంతులచేత, ఆఢ్యునకున్ = ఒప్పినవానికి. ఋషులమనస్సులు అను తెల్ల కలువలను వికసింపఁజేయునట్టి పాద నఖచంద్రుల వెన్నెల గలవాని కనుట, ఋషులచేత ధ్యానింపఁబడినవాఁడై వారి కంతఃకరణశుద్ధి గలిగించువానికని భావము, నఖచంద్రిక యనుచోట నఖమునందుఁ జంద్రత్వారోపము గమ్యము. పాఠాం.—మానస కమల హంస వర్తన = మనస్సులు అను కమలములకు సూర్యవ్యాపారమువంటి వ్యాపారముగల యని యర్థము, ఈ పాఠమునందు చంద్రికాత్వారోపము నిష్ప్రయోజన మగును.

36. మరుత్...మూర్తికిన్—మరుత్సరిత్ = దేవతల యేటిచేత, మందాకినిచేత, ఆకల్పిత = అలంకరింపఁబడిన, మనోజ్ఞ = చక్కని, చరణ = పాదమును, శిరః = తలయునుగల, సుందరమూర్తికిన్ = చక్కని రూపము గలవానికి, గంగ పాదమునందును శిరస్సునందును గలవాని కనుట. విష్ణువు గంగను పాదమునందు పుట్టించినవాఁడును శివుఁడు గంగను శిరస్సునందు ధరించినవాఁడును గావున వారి యిద్దఱి వ్యాపారములును హరిహరనాథునియందుఁ జెప్పఁబడినవి. భావన...పరతంత్రునకున్—భావన=ధ్యానమునందు, తత్పర=ఆసక్తమయిన, చేతః=మనస్సుతో, యుక్త=కూడిన, భక్త=భక్తులకు, పరతంత్రునకున్=లోఁబడినవానికి, తన్ను ధ్యానించుభక్తులకు వశ్యుఁడయినవానికనుట. హరిహరనాథునకున్—వ్యు. హరియును హరుఁడును హరిహరులు, హరిహరరూపుఁడయిన నాథుఁడు. ఓంకారవాచ్యునకున్ అనునది మొదలు ఇదివఱకు చెప్పఁబడిన పదము లన్నియు నీహరిహరనాథునకు విశేషణములు.

37. అంతఃసన్నిధిన్ = లోపలసన్నిహితుఁ డగుటను. అమ్మహావాక్యంబు నర్థంబు = హరిహరనాథుఁడు కవితోఁ దనకంకితముగా భారతమును దెనిఁగింపు మనిచెప్పిన యాపూజ్య మయిన వాక్యముయొక్క యర్థమును. సంగతంబు = నెఱవేఱినదానినిగా. పాఠాం.—అమ్మహాకావ్యంబు నర్థంబు = ఆ భారతముయొక్క యర్థమును. ప్రసక్తిచేతను దచ్ఛబ్దస్వారస్యముచేతను సంగతకరణోక్త్యనురూపతచేతను పూర్వోక్తపాఠమే కవిసమ్మత మని గ్రహింపఁదగియున్నది.

క. శరణాగతసంశ్రితభయ, హరణా సురనికరశేఖ♦రానర్ఘమణి
స్ఫురణాపరిచయరంజిత, చరణా వనమాలికాభు♦జంగాభరణా. 38

క. అజగవశార్ఙ్గాలంకృత, భుజగర్వనిరస్తదైత్య♦ భూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యా, భుజగసమాచరితశయన♦భూషణకృత్యా. 39

క. జలనిధిహిమవద్భూధర, కలితజననకేళికౌతు♦కవ్యక్తావ్య
క్తలలితసౌందర్యస్ఫుర, దలఘుతనుస్త్రీసనాథ ♦ హరిహరనాథా. 40

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. 41

38. శరణ ఆగత సంశ్రిత భయహరణా = శరణుచొచ్చిన భక్తుల భయమును పోఁగొట్టువాఁడా! సుర...చరణా—సురనికర = దేవతా సమూహముయొక్క, శేఖర = కిరీటము లందలి, అనర్ఘమణి = వెలలేని రత్నాలయొక్క, స్ఫురణా = కాంతిజోడి, పరిచయ = సంబంధముచేత, రంజిత = ప్రకాశింపఁ జేయఁబడిన, చరణా = పాదములు గలవాఁడా! దేవతలచే నమస్కరింపఁబడునట్టి వాఁడా యనుట. అలం. పర్యాయోక్తము. వనమాలికా భుజంగ ఆభరణా = తోమాలెయుఁ బాములును భూషణముగాఁ గలవాఁడా! విష్ణువు తోమాలెను శివుఁడు సర్పములను భూషణముగా ధరించిన వా రనుట. పాఠాం.—అనర్ఘ్యమణి = అర్ఘ్యము (పూజ) కొఱకయినది అర్ఘ్యము, పూజార్థ మియ్యఁదగినది యనుట, అర్ఘ్యము కానిది అనర్ఘ్యము, ఇట్లు విరుద్ధార్థ ప్రదమగుటచే నీపాఠ మప్రశస్తము.

39. అజగవ...దైత్య—అజగవ = పినాక మను ధనుస్సుచేతను, శార్ఙ్గ = శార్ఙ్గమను ధనుస్సుచేతను, అలంకృత = అలంకరింపఁబడిన, భుజ = చేతులయొక్క, గర్వ = గర్వముచేత, నిరస్త = జయింపఁబడిన, దైత్య = రాక్షసులు గలవాఁడా! శివుని ధనుస్సునకు అజగవమనియు విష్ణు ధనుస్సునకు శార్ఙ్గమనియు పేరు, ఈరెండుధనుస్సులను ధరించి రాక్షసులను జయించినవాఁ డని భావము. భూమస్తుత్యా = ఆధిక్యముచే స్తుతింపఁదగినవాఁడా! భూమ—ప్ర. బహుభావము, సర్వాధికుఁ డని స్తుతింపఁదగినవాఁడని భావము. త్రిజగత్ ధారణనిత్యా = ముల్లోకముల ధరించుటయందు నిత్యుఁడయినవాఁడా! ముల్లోకములకును నధిష్ఠానమయినవాఁ డనుట. భుజగసమాచరితశయన భూషణకృత్యా = సర్పముచేతఁ జేయఁబడిన పాన్పుయొక్కయు ఆభరణముయొక్కయుఁ గార్యము కలవాఁడా! సర్పము హరికి పానుపనియు హరునకు భూషణమనియు భావము.

40. జలనిధి...స్త్రీసనాథ—జలనిధి = సముద్రమువలనను, హిమవత్ భూధర = మంచుకొండవలనను, కలిత = పొందఁబడిన, జననకేళి = పుట్టుక యను క్రీడయందలి, కౌతుక = వేడుకచేత, వ్యక్త = కనఁబడినది యయిన, అవ్యక్త = వ్యక్తముకాని, లలిత = చక్కని, సౌందర్య = చక్కఁదనముచేత, స్ఫురత్ = ప్రకాశించుచున్న, అలఘు = గొప్పదయిన, తను = దేహముగల, స్త్రీ = భార్యతో, సనాథ = కూడినవాఁడా! అవ్యక్తమయిన మాయ లీలావిగ్రహమున నావిర్భవింపఁగోరి సముద్రమువలనను హిమవంతునివలనను లక్ష్మీరూపమును గౌరీరూపమును గలిగి లీలాజన్మమును పొందఁగా అద్దేవి భార్యగాఁ గలవాఁ డని తా.

గీ. కథ జగత్ప్రసిద్ధి ♦ గావునఁ బూర్వప, ర్వార్థయుక్తి చేయు♦నట్టియెడల
యత్న మించుకంత ♦ యయినను వలవదు, వలసినట్లు చెప్ప♦వచ్చి యుండు. 42

వ. ఇమ్మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమతశుభావహంబును గావున నొక్క మహాఫలంబు గోరి జనమేజయుండు వ్యాసమహామునికారుణ్యంబు వడసి తదీయప్రియశిష్యుం డయినవైశంపాయనునివలన వినినకథ యగుటం జేసి తత్ప్రకారంబు నడపెద నది యె ట్లనినఁ బరమపవిత్రు లగుపాండుపుత్త్రులచరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబు చేయుచుండ వారలవనవాససమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 43

చ. మహితసముజ్జ్వలాకృతులు ♦ మానధను ల్జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి ♦ సమ్యగుపాయనిగూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ ♦ నాపదుమూఁడవయేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్ర♦మంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా. 44

42. జగత్ప్రసిద్ధి = లోకమునందుఁ బ్రసిద్ధిగలది. పూర్వాపర్వ అర్థయుక్తి = పూర్వాపర్వముల యభిప్రాయముతోడి కూడికను. అందఱకును దెలిసిన కథ కావునఁ బర్వముఁ బ్రారంభించునపుడు ముందటి పర్వముకథను ఎక్కువగాఁ జెప్పవలసినది లే దని తా.

43. సమస్తదురిత అపహంబును = సమస్తపాపములను బోఁగొట్టునదియును. అపహారంబును అను పాఠమునఁ బ్రాసభంగము. అభిమత శుభ ఆవహంబును = కోరఁబడిన మంగళముల నిచ్చునదియు. కారుణ్యంబు = దయను. ఉపాఖ్యాన సహితంబు గాన్ = ఉపకథలతోఁ గూడినట్లుగా. వ్యాఖ్యానంబు = చెప్పుటను. వనవాససమ్యక్ అనుష్ఠానంబు = అడవియందునికియొక్క చక్కగాఁ జేయుటను.

44. మహిత సముజ్జ్వల ఆకృతులు = పూజింపఁబడినవియు మిక్కిలి యొప్పిదములు నగు నాకారము గలవారలును. మానధనుల్ = మానమే (చిత్తౌన్నత్యమే) ధనముగాఁ గలవారలును. జనమాన్యులు = జనులచేఁ బూజింపఁదగినవారును. మత్ పితామహులు = నాతాతలు, నాపూర్వులనుట. అంగనాసహితము గాఁగన్ = స్త్రీతోఁ గూడినట్లుగా. సమ్యక్ ఉపాయ నిగూఢవృత్తిమైన్ = మంచి యుపాయముగల రహస్యమయిన వ్యాపారముచేత. అహితులకున్ = శత్రువులకు. అప్రభేద్యముగన్ = భేదింపరానిదియగు నట్లు, తెలియరానియట్లుగా ననుట, క్రియావిశేషణము. అప్రభేద్యమగు నను పాఠమునందుఁ బదుమూఁడవ యేఁటికి విశేషణము, అప్పుడు పదుమూఁడవ యేఁటికిఁ బదుమూఁడవయేఁటి చర్య యని లక్షణ కల్పింపవలెను. పాండవులు ద్రౌపదితోఁగూడ శత్రువులకుఁ దెలియనియట్లు అజ్ఞాతవాసము చేయవలసిన యాపదుమూఁడవసంవత్సరము నెట్లు గడపిరో నాకుఁ దెలుపుమని తాత్పర్యము. ఇందు మహిత సముజ్జ్వలాకృతులు మొదలగు విశేషణములు అజ్ఞాతవాసము అసాధ్య మని తెలుపునవియై సాభిప్రాయము లగుటచేఁ బరికరాలంకారము.

క. అని యడిగిన వైశంపా, యనుఁ డమ్మనుజేంద్రచంద్రు♦నధికౌత్సుక్యం
బునఁ గలిమికిఁ దనహృదయం, బున గాఢాదరము భరిత♦ముగ ని ట్లనియెన్. 45

వ. పాండవులు వనవాసంబు సముచితంబుగా జరపి పండ్రెండవయేఁటికడపటఁ దమకు ధర్మదేవతాసమాగమం బయినం దత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబు గాకుండునట్లుగా వరంబు వడసి యంతకు మున్ను తమవెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడ్కొని వర్తిల్లుభూసురోత్తములు తమ్ముఁ బరివేష్టించి యుండఁ దా రనుష్ఠింపం బూనినపని వారల కెఱింగింపం దలంచి కరంబులు మొగిచి సవినయంబుగా ని ట్లనిరి. 46

సీ. తెల్లంబు గాదె మీ♦కెల్ల సుయోధను, చేసినదుష్టవి♦చేష్టితంబు
లకట మాతో మీరు ♦ నడవుల నిడుమలఁ, బొందితి రొకభంగిఁ ♦ బోయెఁ గాల
మిది పదుమూఁ డగు♦నేఁడు మా కజ్ఞాత, వాసంబు సలుపంగ ♦ వలయు నందు
ధార్తరాష్ట్రులు సూత♦తనయసౌబలులును, జెఱుపన వేతురు ♦ చిన్న సన్న
యెఱిఁగి రేనిఁ జాల ♦ నెగ్గు వాటిల్లు న, ట్లగుట మమ్ము నింక ♦ నతిరహస్య
వృత్తిమై నిరస్త♦విఘ్నులరై చరి, యింపుఁ డని యనుగ్ర♦హింపవలయు. 47

45. వైశంపాయనుఁడు—ఇతఁడు వ్యాస శిష్యుఁడు, జనమేజయునకు భారతకథను జెప్పినవాఁడు. అమ్మనుజ...కలిమికిన్—అమ్మనుజ ఇంద్ర చంద్రు = ఆరాజశ్రేష్ఠుఁడయిన జనమేజయునియొక్క, అధికౌత్సుక్యంబున కలిమికిన్ = ఎక్కుడుత్సాహము కలిగియుండుటకు, ఔత్సుక్యంబు + కలిమికిన్—షష్ఠీ సమాసమునందు నవర్ణాగమము వైకల్పికము, కలిమికిన్—తృతీయార్థమున షష్ఠి. గాఢ ఆదరము = అధికమగు ప్రీతి. భరితముగన్ = నిండినది కాఁగా. అట్లు జనమేజయుఁ డడుగఁగా నా రాజునకుఁ గథ వినుటయందు మిక్కిలి యుత్సాహము కలుగుటవలన సంతోషించినవాఁడై వైశంపాయనుఁ డిట్లు చెప్పెనని తాత్పర్యము.

46. ధర్మదేవతా సమాగమంబు = ధర్మదేవతతోడి కూడిక.

47. సుయోధను చేసిన దుష్టవిచేష్టితంబులు = దుర్యోధనుఁడు చేసినట్టి చెడుకార్యములు. పాఠాం:—కుటిల విచేష్టితంబులు = కపటకృత్యములు, అనుప్రాసాలంకృత మగుటచేఁ బూర్వపాఠమే కవిసమ్మతము. ఇడుమలన్ = కష్టములను. పదుమూఁడగు నేఁడు = పదుమూఁడు సంవత్సరములు ముగియునట్టియేఁడు, కరణమునకుఁ బ్రాధాన్యవివక్షచే నిట ధాతుజన్య విశేషణ మయిన అగు అను నది యేఁడు శబ్దముతో సమసించెను, ఏయేఁటితోఁ బదుమూఁడగునో యాయేఁడు అని యర్థము. ఇట్లు వివక్షాభేదముచేతఁ బూరణార్థక మయిన యవగాగమము ఇటఁ బ్రయోగింపలేము. అజ్ఞాతవాసంబు = తెలియఁబడని యునికి. అందున్ = ఆయజ్ఞాతవాసమునందు. ధార్తరాష్ట్రులన్ = ధృతరాష్ట్రునికొడుకులును. సూతతనయ సౌబలులును = కర్ణుఁడును శకునియును. చెఱుపన్ అ = చెఱుచుటకే. వేతురు = కాచియుందురు, వేచుధాతువు తద్ధర్మార్థకము. సన్న = జాడను. ఎగ్గు = కీడు. వాటిల్లున్ = కలుగును. అతిరహస్య వృత్తిమైన్ = మిక్కిలి రహస్యమయిన యునికిచేత. నిరస్తవిఘ్నులరు ఐ = పోఁగొట్టఁబడిన విఘ్నము కలవారలై.

వ. అని చెప్పి రట్టిసమయంబున ధర్మనందనుండు విషణ్ణహృదయుండై. 48

క. ఒకనాఁ డేమును నాపద, లకు విడుమరఁ గాంచి విప్రు♦లం జుట్టలఁ బె
ట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకో యిప్పాటెందుఁ గలదె ♦ యొరులెవ్వరికిన్.

వ. అని గద్గదికఁ బెట్టి దుఃఖపరవశుం డగుచుండ నమ్మహీసురవరులుం దమ్ములు నతని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్న ధౌమ్యుండు తదీయవిషాదాపనోదనంబు చేయం దలంచి యిట్లనియె. 50

( ధౌమ్యుఁడు పాండవుల నూరార్చుట. )

ఉ. ధర్మనిరూపకత్వమున ♦ ధైర్యమున న్మహనీయవృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతుర♦తామహిమ న్దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ♦ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ
పేర్మికి నీడె దుర్దశల♦పెల్లునకున్ దురపిల్లు టారయన్. 51

వ. అట్లుం గాక. 52

48. విషణ్ణహృదయుండై = దుఃఖము నొందిన మనస్సుగలవాఁడై.

49. ఏమునున్ = మేముగూడ. ఆపదలకున్ = ఆపదలనుండి, పంచమ్యర్థమున షష్ఠి. విడుమరన్ = విడుదలను. చుట్టలన్—రూ. చుట్టములను, ఇది ఆవు ప్రభృతులలోఁ జేరినది. ఉండన్ = ఉండుటను. పడయుదుము ఒకో = పొందుదుమో. ఇప్పాటు = ఇట్టికష్టము. ఒరులు = ఇతరులకు, షష్ఠీ విశేషణమునకుఁ బ్రథమ. మేము ఈయాపదలు తొలఁగి బ్రాహ్మణులతోను బంధువులతోను సుఖముగా నుండుకాలము వచ్చునో రాదో తెలియదు, ఇట్టికష్ట మితరుల కెవ్వరికిని లే దని తా.

50. గద్గదిక = గద్గదస్వరమును. దుఃఖపరవశుండు = దుఃఖముచేఁ బరాధీనుఁడు. అమ్మహీసురవరులున్ = ఆ బ్రాహ్మణోత్తములును. ఆశ్వాసించుచున్ = ఊఱడించుచు. తదీయ విషాద అపనోదనంబు = వానిపైన దుఃఖముయొక్క పోఁగొట్టుటను.

51. ధర్మ నిరూపకత్వమునన్ = ధర్మము నిర్ణయించువాఁ డగుటయందును. ధైర్యమునన్—వికారహేతువు లున్నను వికారము నొందకుండుట ధైర్యమనఁబడును. మహనీయ వృత్తిన్ = ఉత్తమమయిన యాచారమునందును. సత్ కర్మ విధిజ్ఞతన్ = మేలికర్మముల ప్రకారమును దెలిసినవాఁ డగుటయందును. చతురతా మహిమన్ = చాతుర్యముయొక్క యతిశయమునందును. దృఢబుద్ధిన్ = నిశ్చలమయిన బుద్ధియందును. ధర్మజు పాటి = ధర్మరాజునకు సాటి, పాటి—నిత్యైకవచనాంతము. ధాత్రిన్ = భూమియందు. నీపేర్మికిన్ = నీ గొప్పతనమునకు. దుర్దశల పెల్లునకున్ = కష్టదశల యతిశయమువలన. దురపిల్లుట = తపించుట. ఈడు ఎ = తగినదా ? ధర్మనిర్ణయము మొదలగువానియందు నీయట్టివారు లే రని ప్రసిద్ధి నొందిననీకుఁ గష్టము వచ్చినపుడు దుఃఖించుట యుక్తము కా దని తా.

52. అట్లుం గాక = అదియునుగాక.

క. దేవతల కైన నొక్కొక, చో వలయున కాదె శత్రు♦సూదనవిధికా
లావాప్తికి మును దమస, ద్భావము లడఁచికొని యడఁగఁ♦బడి యుండంగన్. 53

సీ. నిషధాద్రియం దని♦మిషపతి ప్రచ్ఛన్న, సంచరణమున వ♦ర్తించుటయును
నదితిగర్భంబున ♦ నవతారమై వామ, నాకారమున హరి ♦ యడఁగుటయును
జననియూరుప్రదే♦శంబున నతినిగూ, ఢంబుగా నౌర్వుండు ♦ డాఁగుటయును
ధేనుశరీరవి♦లీనుఁడై యజ్ఞాత, చర్య మార్తాండుండు ♦ సలుపుటయును
వినమె యిట్లు పడిన♦వీరలు పదపడి, తమకు నగ్గమైన♦తఱి జయింప
రెట్లు ప్రబలరిపుల ♦ నీవును నాపద, కోర్చి భంగపాటు ♦ దీర్చికొనుము. 54

క. అనవుడు నప్పలుకులు విని, తనచిత్తము కలఁక దేఱ ♦ ధర్మతనూజుం
డనుజన్ములదెసఁ జూచిన, ననిలసుతుం డిట్టు లనియె ♦ నాతనితోడన్. 55

మ. భవదాజ్ఞాదృఢబంధసంయమితశుం♦భద్వేగమై కాక నాఁ
డవలీల న్మనయర్జునద్విపము క్రో♦ధావేశదుర్దాంతద

53. ఒక్కొకచోన్=ఒక్కొక సమయమునందు. శత్రుసూదన విధికాల అవాప్తికిన్ = శత్రువుల చంపుట యను కార్యముయొక్క సమయము పొందుటకంటె. తమ సద్భావములు = తమగొప్పతనములను. అడఁగఁబడి యుండంగన్ = అణఁగియుండుట. వలయున్ అకాదె = వలయునే కదా యని యన్వయము. అడఁగఁబడి—ఇటఁ బడుస్వార్థికము. పాఠాం—అడంచి యుండుగఁబడి= అణఁచికొని కృశించి యని యర్థము. దేవతలు గూడ శత్రువులను జయించుకాలము వచ్చువఱకు అడఁగి యుండిరి, ఇఁక మనుష్యు లట్లుండ వలయు నని వేఱచెప్పవలసినది లే దని తా. అలం. కావ్యార్థాపత్తి.

54. నిషధ అద్రియందున్ = నిషధపర్వతమునందు. అనిమిషపతి = దేవేంద్రుఁడు. ప్రచ్ఛన్న సంచరణమునన్= రహస్యమయిన సంచారముతో. వామన ఆకారమునన్ = వామనరూపముతో. హరి= విష్ణువు. జనని ఊరుప్రదేశంబునన్ = తల్లితొడ ప్రదేశమునందు. అతినిగూఢంబుగాన్ = మిక్కిలి రహస్యముగా. ఔర్వుండు=బడబాగ్ని. ధేనుశరీరవిలీనుఁడై=ఆవుదేహమునందు దాఁగినవాఁడై. అజ్ఞాతచర్యన్ = తెలియఁబడనియునికిని. మార్తాండుండు = సూర్యుఁడు. ఇట్లు పడినవీరలు = ఇట్లుకష్టము లనుభవించిన యింద్రాదులు. పదపడి = పిమ్మట. ప్రబలరిపులన్ = గొప్పశత్రువులను. అగ్గము = అనుకూలము. తఱిన్ = సమయమునందు. ఎట్లు జయింపరు ? అని యన్వయము. భంగపాటున్ = అవమానమును. పాఠాం—ప్రబలి = అతిశయించి.

55. తనచిత్తము=తనమనస్సు. కలఁక తేఱన్=ప్రసన్నతనొందఁగా. ధర్మతనూజుండు=ధర్మరాజు. అనుజన్ములదెసన్=తమ్ముల దిక్కును. అనిలసుతుండు=వాయుపుత్త్రుఁడగు భీముఁడు. ధౌమ్యునిమాటలు విని ధర్మరాజు ప్రసన్నుఁడై తమ్ములను చూడఁగా భీముఁడు ధర్మరాజుతో నిట్లుచెప్పెనని తాత్పర్యము.

56. భవత్...వేగమై—భవత్ = నీయొక్క, ఆజ్ఞా = ఆజ్ఞయను, దృఢబంధ = గట్టికట్టుచేత, సంయమిత = చక్కఁగా నిలుపఁబడిన, శుంభత్ = అతిశయించుచున్న, వేగము ఐ= వేగము గలదై, నాఁడు—ద్యూతసమయమునం దనుట. అర్జున ద్విపము = అర్జునుఁ డను నేనుఁగు. క్రోధ...భంగిన్— క్రోధ = కోపముయొక్క, ఆవేశ = పూనికచేతను, దుర్దాంత = అణఁపరాని, దర్ప= అహంకారము

ర్పవిలాసోద్భటభంగి నేపడరి కౌ ♦ రవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయఁడె యొక్కక్రేల్మిడిన నీ ♦ కు స్వేచ్ఛ సంధిల్లఁగన్. 56

వ. అనిన విని ధర్మనందనుండు తెలివొందిన మొగంబుతోడ శిరఃకంపంబు చేసె నట్టి సమయంబున నవ్విప్రు లందఱు నొక్కమొగిన మీతలంపులకు దైవం బనుకూలంబు గావుత మని పాండుపుత్త్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సముచితప్రకారంబున వీడ్కోలు వడసి తమతమపొంకుపట్లకుం బోయిన. 57

ఉ. తమ్ములు ధౌమ్యుఁడు న్సతియుఁ ♦ దాను రథంబులతోడఁ గ్రోశమా
త్ర మ్మొకచోటి కల్లఁ జని ♦ ధర్మతనూభవుఁ డంద నాఁటిరే
యిమ్ముల నిల్చి వేగుటయు ♦ నీప్సితకార్యము చేయఁగా విచా
రమ్మున నున్నచో నమర ♦ రాజతనూభవుఁ జూచి యిట్లనున్. 58

క. మన మేవురమును నీయం,గనయుం దో నరుగు దేరఁ ♦ గా నెయ్యెడఁ బో
యిన నెఱుఁగ కుండుదురె యీ, దినములు గడపంగ నెద్ది ♦ తెఱఁ గయ్యెడునో.

యొక్క, విలాస = అతిశయముచేతను, ఉద్భట = భయంకర మయిన, భంగిన్ = విధముచేత. ఏపు అడరి = విజృంభించి. సంధిల్లఁగన్ = కలుగునట్లు. క్రేల్మిడిన్ అ = నిమిషములోనే. కౌరవ్య అంబుజ శ్రేణిన్ = కౌరవులు అను కమలముల సమూహమును. చిక్కుపడన్ చేయఁడు ఎ = కలియఁబెట్టఁడా? అలం. రూపకము. ద్యూతకాలమునందు అర్జునుఁడు నీ యాజ్ఞకుఁ గట్టువడి యుండెను గాని కానిచో నప్పుడే కౌరవుల దండించి యుండు నని తాత్పర్యము.

57. తెలివి + ఒందిన — తెలివిశబ్దము ఏమ్యాదులలోఁ జేరినది. శిరఃకంపంబు = తలయూఁచుటను. ఒక్కమొగిన్ అ = ఒక్కమాఱుగానే. కావుతన్ + అని — కావుతమని = అగుఁగాక యని, ఆశీరర్థమున నచ్చుపరంబగునపుడు ద్రుతమునకు మకారము, ఇట్లు అయ్యెడున్ + అనుచున్ — అయ్యెడుమనుచున్. తత్ అనంతరంబు అ = అటుపిమ్మటనే. బాహ్యపరివారంబు = వెలుపలి పరిజనము.

58. సతియున్ = ద్రౌపదియు. క్రోశమాత్రమ్ము = కోసుదూరముగలది, షష్ఠీ విశేషణ మగుటచేఁ బ్రథమ. నాఁటి రే = ఆరాత్రి, రేయి శబ్దము రూపాంతరము, కాలవాచక మగుటచేఁ బ్రథమ. ఇమ్ములన్ = సుఖముగా, ఈ యర్థమునం దీశబ్దము ద్వితీయా బహువచనాంతముగానే ప్రయోగింపఁబడి యున్నది. వేగుటయున్ = తెల్లవాఱఁగానే. ఈప్సితకార్యము = కోరఁబడినపనిని. విచారమ్మునన్ = ఆలోచనముతో. ఉన్నచోన్ = ఉండునపుడు. అమరరాజ తనూభవున్ = అర్జునుని. పాండవులు ధౌమ్యునితోను ద్రౌపదితోను రథములమీఁదఁ గోసుదూరము పోయి యచ్చట నారాత్రి గడపి ప్రాతఃకాలమున నజ్ఞాతవాసమునుగూర్చి యందఱు నాలోచించునపుడు ధర్మరాజు అర్జునునితో నిట్లనియె నని తా.

59. ఈఅంగనయున్ = ఈ స్త్రీయును. తోన్ = వెంట. ఎయ్యెడన్ = ఎచటికి. తెఱఁగు = ఉపాయము. మన మయిదుగురమును ద్రౌపదియును గలసి యెచటికిఁ బోయినను జనులు మనలను తెలిసికొందురు కావున నజ్ఞాతవాసమున కుపాయము తోఁపలేదని తాత్పర్యము.

వ. అనిన నతం డి ట్లనియె. 60

గీ. ధర్మదేవత నీదుసత్కర్మమునకు, మెచ్చి యెంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి
వరము గలుగంగ మన మేమివర్తనమున, నెచటనుండిననొరులకు నెఱుఁగనగునె.

వ. కురుదేశంబుచుట్టుం బాంచాల చేది మత్స్య సాల్వ విదేహ బాహ్లిక దశార్ణ శూర
సేన కళింగ మగధ దేశంబులు సుభిక్షంబులు జనాకీర్ణంబులు నతిస్థిరంబులునై ని
వాసయోగ్యత గలిగి యున్నయవి యని విందు వానియందు మీకుఁ జూడం బో
లినయెడఁ దగినచందంబున నిలుచువారము గాక యనినఁ బ్రియం బంది ధర్మనంద
నుం డి ట్లనియె. 62

క. అగు నది యట్టిద దైవము, దగ నిచ్చినయవ్వరంబు దప్పునె మనకుఁ
విగతభయవాసయోగ్యం, బగ నొక్కెడ చెప్పు మిపుడ పోవఁగ వలయుఁ.

గీ. నాకుఁ జూడ మత్స్యనరపతి సద్ధర్మ, వర్తి సుజనహితుఁ డవార్యబాహు
బలుఁడుఁ గాన నతనిపాల నందఱుఁ దగ, వైనపనుల నిలుచు టభిమతంబు. 64

—* పాంచాలీపాండవులు తనతన మెలంగ వలయుపనుల నిశ్చయించుకొనుట. *—

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటుమనము వడయుద మది యె
ల్లను నేర్పరించి యందఱుఁ, దనతనమది నున్న తెఱఁగు తథ్యము చెప్పఁడా. 65

61. ఏమి వర్తనమునఁ = ఏ నడవడిలో. ధర్మదేవత నీకిచ్చిన వరము కలదుకావున మన మెట్లై చ్చటనుండినను నెవ్వరు నెఱుఁగఁజాల రని తాత్పర్యము.

62. సుభిక్షంబులుఁ = మంచిభిక్ష (అన్నము) గలవియు. జనఆకీర్ణంబులుఁ = జనులచే నిం డినవియు. అతిస్థిరంబులుఁ—మనకు నిలుకడగా నుండఁదగినవియు. విందుఁ—అను నీ ప్రాచీనమయిన యేకవచనాంత పాఠమే సంస్కృతమున కనురూపము.

63. విగతభయవాసయోగ్యంబుగఁ = పోయిన భయముగలదియు వాసమునకుఁ దగినదియు అని. విగతభయ + వాసయోగ్యంబు—విశేషణోభయపదకర్మధారయసమాసము. ఒక్కఎడ = ఒక చోటును. నీవు చెప్పినట్లే దైవవరంబు తప్పదు కావున మనకు భయము లేదు, భయములేక యుండఁ దగినచో టొకటి చెప్పుము అప్పటి కిపుడే పోవుద మని తాత్పర్యము.

64. మత్స్యనరపతి = మత్స్యరాజు, విరాటుఁ డనుట. సద్ధర్మవర్తి = మంచిధర్మమునం దున్న వాఁడు. అవార్య బాహుబలుఁడుఁ=అడ్డగింపరానిచేతుల లావుగలవాఁడును. అతనిపాలఁ=అవిరాట రాజునొద్ద. తగవు=తగినవి, స్త్రీ సమ విశేషణ మగుటచే నేకవచనము వైకల్పికము. అభిమతంబు= ఇష్టము. విరాటుఁడు యోగ్యుఁడును గొప్పవాఁడును గావున నతనియొద్దఁ జేరుట నా కిష్ట మని తా.

65. ఎమ్మెయి పనివెంటను=ఏవిధ మయిన కార్యముయొక్క విధముచేత. విరటు మనము=విరాటుని మనస్సును. పడయుదము=పొందుదము. మదిఁ=మనస్సునందు. తథ్యము అ=నిజముగానే. మనలో విరాటునొద్ద నెవఁ డేపనిచేయవలయునో యది నిశ్చయించి మీమీయభిప్రాయమును చెప్పఁ డని తా.

వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుగా నతని నుపలక్షించుచు ని ట్లనియె. 66

సీ. మహనీయమూర్తియు ♦ మానవైభవమును, సౌకుమార్యంబును ♦ సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వ♦మహిమయు నపగత, కల్మషత్వంబును ♦ గౌరవంబు
శాంతియు దాంతియుఁ ♦ జాగంబు భోగంబుఁ, గారుణ్యమును సత్య♦సారతయును
ధర్మమయక్రియా♦తత్పరత్వంబును, గీర్తిధనార్జన♦క్రీడనంబుఁ
గలిగి జనుల నేలఁ ♦ గాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ ♦ వెరవు లేని
యట్టినీవు విరటు ♦ నెట్టిచందంబున, ననుసరించువాఁడ ♦ వధిప చెప్పుమ. 67

క. అనినం దమ్ముని నెమ్మన, మునఁ బుట్టినవగపు భావ♦మున నెఱిఁగియు గీ
టునఁబుచ్చుచుఁ బ్రస్తుతకా, ర్యనిరూపణదశ మెఱయఁగ ♦ నతఁ డిట్లనియెన్. 68

క. సన్న్యాసివేషమున రా, జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి ♦ సభ్యత్వమునన్

66. సవ్యసాచి = అర్జునుఁడు. సవితర్కంబును = సందేహముతోఁ గూడినట్లుగాను. సవిషాదంబును = దుఃఖముతోఁ గూడినట్లుగాను. సగౌరవంబునుగాన్ = గొప్పతనముతోఁ గూడినట్లుగాను. ఉపలక్షించుచున్ = చూచుచు.

67. మహనీయమూర్తియున్ = పూజ్యమయిన యాకారమును. మానవైభవమును = మానముయొక్క యతిశయమును. సౌకుమార్యంబును = సుకుమారభావమును. సరళతయును = కపటము లేకుండుటయును. మార్దవంబున్ = మెత్తఁదనమును. సౌకుమార్యము దేహధర్మముగాను మార్దవంబు మనోధర్మముగాను గ్రహింపవలెను. ప్రభుత్వమహిమయున్ = దొరతనముయొక్క యతిశయమును. అపగత కల్మషత్వంబును = పోయినపాపము గలవాఁ డగుటయును. శాంతియున్ = అంతరింద్రియ నిగ్రహమును. దాంతియున్ = బహిరింద్రియ నిగ్రహమును. చాగంబున్ = ఈవియు. భోగంబున్ = సుఖమును. సత్యసారతయును = సత్యముచేత శ్రేష్ఠుఁ డగుటయును. ధర్మమయక్రియా తత్పరత్వంబును = ధర్మముచే నిండిన కర్మములయం దాసక్తిగలవాఁ డగుటయును. కీర్తిధన అర్జన క్రీడనంబున్ = కీర్తి యను ధనముయొక్క సంపాదించుట యను విహారమును. కాని = కాక. వెరవు = నేర్పు. అధిప = రాజా! ధర్మరాజు సంబోధనము. నీవు చక్కఁదనము లో నగుగుణములు గలిగి యెల్లపుడును జనులను ఏలుచుంటివి కాని యితరులను గొలిచినవాఁడవు కావు, అట్టి నీవు విరాటరాజు నెట్లు కొలువఁగలవో చెప్పుమని తాత్పర్యము.

68. తమ్ముని నెమ్మనమునన్ = తమ్ముఁ డయినయర్జునుని నిండుమనస్సునందు. వగపు = దుఃఖమును. భావమునన్ = మనస్సునందు. గీటునన్ పుచ్చుచున్ = అలక్ష్యము చేయుచు. ప్రస్తుతకార్యనిరూపణదశ = ప్రకృతపు పనియొక్క నిశ్చయించు నవస్థ. మెఱయఁగన్ = ప్రకాశింపఁగా. అర్జునుని మాటలు విని ధర్మరాజు అర్జునుని మనస్సులోనిదుఃఖము నెఱిఁగియు దానిని లక్ష్యముసేయక జరుగవలసిన కార్యముం గూర్చి యిట్లు చెప్పె నని తా.

69. రాజన్యునిన్ = రాజశ్రేష్ఠుఁ డయిన విరాటుని. సభ్యత్వమునన్ = సభ్యుఁడ నగుటచేత, సభ్యుఁడు—వ్యు. సభయందు సాధువు. మాన్యుఁడనై = పూజ్యుఁడనై. పుణ్యకథావిన్యాసము =

మాన్యుఁడనై పుణ్యకథా, విన్యాస మొనర్తు నతని♦వేడుకకుఁ దగన్. 69

క. శ్రౌతస్మార్తనిమిత్త, జ్యోతిర్విద్యలు గ్రహించి ♦ యోగ్యసమయసం
జాతప్రాగల్భ్యుఁడనై, చాతుర్యము మెఱసి మాన♦సం బలరింతున్. 70

క. అతనితో నెక్కొ కమరి, కౌతూహలవృత్తికిం ద♦గం దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ నక్ష♦శిక్షాప్రౌఢిన్. 71

గీ. మణిమయమ్ములుఁగలధౌత♦మయములునుసు,వర్ణమయములునాదిగా♦వలయునట్టి
యడ్డసాళులు గలవు నా♦కభిమతముగ, వానిఁగొనిపోయి చూపుదు♦వరుసతోడ.

వ. మఱియు నవసరోచితంబు లగువినోదంబులం బ్రమోదంబు పుట్టించుచుఁ బ్రసాదం
బునకుం బాత్రభూతుండ నయి కంకుం డనునామధేయంబు ధరియించి చరి
యింతు నయ్యుర్వీశ్వరుండు మత్పూర్వవర్తనం బరసెనేని ధర్మపుత్త్రుతోడిమైత్త్రి
గలిగి యతనిపాల వసియింతు సనం గలవాఁడ నని చెప్పి యనిలతనయు నిరీక్షించి

పవిత్రము లగు కథలు చెప్పుటను. సన్న్యాసివేషముతో సభయందు విరాటరాజునకుఁ గథలు చెప్పుచు నతని సంతోషపఱచుచుందు నని తా. సన్న్యాసి శబ్దమునందు సమానము లగు రెండు నకారము లున్నను సమాన హల్లులగుటచేఁ బ్రాసంబునఁ దక్కినచో నట్లు లేకపోవుట దోషము కాదు.

70. శ్రౌతస్మార్త నిమిత్త జ్యోతిర్విద్యలు = శ్రౌతము స్మార్తము శకునము జ్యోతిషము అను విద్యలను, శ్రౌతము–శ్రుతి (వేదమున) యందుఁ జెప్పఁబడినది. స్మార్తము–స్మృతులయందుఁ జెప్పఁబడినది. గ్రహించి = తెలిసి. యోగ్యసమయ సంజాత ప్రాగల్భ్యుఁడనై = తగిన సమయములయందుఁ గలిగిన ప్రతిభగలవాఁడనై. చాతుర్యము = నేర్పును, మెఱసి = వెల్లడిచేసి. మానసంబు = మనస్సును. అలరింతున్ = సంతోషపఱతును. నేను శ్రౌతము మొదలగు విద్యలు నేర్చినవాఁడ నగుటచే నా యాసమయములందుఁ దగునేర్పుతో నారాజును సంతోషపఱిచెద నని తా.

71. కౌతూహలవృత్తికిన్ = కౌతూహలము అను మనోవృత్తికి, వేడుక కనుట. మృదుద్యూతంబునన్–జయింపవలయు నను పట్టుదలలేని జూదముచేత. చేతోముదము = మనస్సునకు సంతోషము. ఒదవన్ = కలుగునట్లు. అక్ష శిక్షా ప్రౌఢిన్ = పాచికలయందలి నేర్పుయొక్క యతిశయముచేత. పాఠాం.—అక్షశిల్పప్రౌఢిన్= పాచికల విద్యయందలి నేర్పుచేత. ఒక్కొకప్పుడు విరాటరాజు మనస్సునకు సంతోషము గలుగునట్లు నేర్పుతో జూదమాడెద నని తా.

72. మణిమయమ్ములున్ = రత్నాలచేఁ జేయఁబడినవియును. కలధౌత మయములును= వెండిచేఁ జేయఁబడినవియు. సువర్ణమయములున్ = బంగారుచేఁ జేయఁబడినవియును. వలయునట్టి అడ్డసాళులు = కావలసినట్టి పాచికలు. అభిమతముగన్ = ఇష్టమగునట్లు. రత్నములు మొదలగువానిచేఁ జేయఁబడిన పాచికలు నాయొద్ద నున్నవి, వానిం గొనిపోయి విరాటునకుఁ జూపెద నని తా.

73. అవసరఉచితములు = సమయమునకుఁ దగినవి. ప్రమోదంబు = సంతోషమును. అయ్యుర్వీశ్వరుండు = ఆ పుడమిఱేఁడు. మత్ పూర్వవర్తనంబు= నా తొల్లింటి వృత్తాంతమును. అనిలతన

తత్కాలజనితం బయినఖేదంబునం, దొరఁగ సముకట్టుబాష్పజలంబులు మగుడ నించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యి ట్లనియె. 73

సీ. కడిమిమై సౌగంధి♦కమున యక్షులమద, మడఁచి కృష్ణకుఁ బువ్వు♦ లిట్లు దెచ్చెఁ
గిమ్మీరదానవు♦ నమ్మేయి నిర్జించి, విగతకంటకముగా♦వించె వనము
బకదైత్యుఁ దొడరి యా♦భంగి రూపఱఁ జేసి, రక్షించె నేకచ♦క్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జ♦టాసురు నడరి దం, డితుఁ జేసి మనలఁ బె♦ట్టించికొనియె
నితఁడు పుట్టినకో♦లెను ♦ నెసక మెసఁగ, దర్పమునన వర్తిల్లె సు♦దగ్రమూర్తి
యకటయొరుచిత్తమున కెక్క♦నట్లుగాఁగ, మెలఁగియేమివిధంబునఁ♦గొలుచువాఁ [డు.

వ. అనిన భీమసేనుం డి ట్లనియె.

గీ. ఏను వంటలవాఁడనై ♦ యానరేంద్రుఁ, గొలిచి కరకరగాఁ గూడు♦ గూర చిత్త
మునకు వచ్చినచందంబు♦నన యొనర్చి, నేర్చి మెలఁగుదుఁ గరము వి♦నీతి మెఱసి.

ఉ. ఆఱురసంబులం జవుల♦యందలిక్రొత్తలు వుట్ట నిచ్చలుం
వే ఱొకభంగిఁ బాకములు ♦ విన్నను వొప్పఁగ సంఘటించి న
న్మీఱఁగ బానసీని నొక♦రుం బురిఁ గాననియట్లు గాఁగ మే
గాఱియ వెట్టియైన నొడి♦కంబుగ వండుదు నెల్లకూరలున్. 77

యుఁ = భీముని తత్కాల జనితంబు = ఆకాలమునఁ గలిగినది. సముకట్టు బాష్పజలంబులు = ప్రవహించు కన్నీళ్లను.

74. కడిమిమైన్ = పరాక్రమముచేత. సౌగంధికమునన్ = సౌగంధిక పుష్పములు గల కొలని నుండి, సుగంధము గలది సౌగంధికము—ఎఱ్ఱగలువ, సౌగంధికములు గల కొలను సౌగంధికము, మత్వర్థీయము అచ్ప్రత్యయము. కృష్ణకున్ = ద్రౌపదికి. కిమ్మీరదానవున్ = కిమ్మీరుఁ డను రాక్షసుని. విగతకంటకమున్ = పోయిన శత్రువులు గలదానినిగా. రూపఱన్ = రూపు చెడునట్లు. అప్పాటన్ = అప్రకారముగా. పెట్టించికొనియెన్ = విడిపించుకొనెను. పుట్టినకోలెను = పుట్టినది మొదలు. ఎసకము = పరాక్రమము. ఉదగ్రమూర్తి = ఉత్తమ మయిన రూపము గలవాఁడు.

76. వినీతి = వినయము. మెఱసి = చూపి. నేను చక్కఁగా వంటచేసి వినయము గలిగి విరాటరాజును మెచ్చించెద నని తాత్పర్యము.

77. చవులయందలి క్రొత్తలు = క్రొత్తరుచులు, నిచ్చలు — ఎల్లప్పుడును. వేఱొకభంగిన్ = వేఱైనవిధమున, ఇతరులకుఁ దెలియని విధమున ననుట. విన్నను వు = నేర్పు. సంఘటించి = కూర్చి, మీఱఁగన్ = అతిశయించుటకు. బానసీనిన్ = వంటవానిని. పురిన్ = పట్టణమునందు. మే = దేహమును. కాఱియవెట్టి యైనన్ = కష్టపఱచి యైనను. ఒడికంబుగన్ = మనోహరముగా. నేను నావంటివంటవాఁడు లేఁ డని తోఁచునట్లు మిక్కిలి రుచిగాఁ గూరలు మొదలగువానిని వండిపెట్టుదు నని తాత్పర్యము.

వ. ఇట్లు నానాప్రకారంబుల నతని మన్నించి నడయుడు నలలుం డను నామధేయంబు
వహింతు నమ్మహీపతి కీ వెవ్వరివాఁడ వని యడిగెనేనిఁ బాండవాగ్రజునకు బాన
సంబు సేయుదు నని గలవాఁడ ననిన విని ధర్మతనయుం డమ్మాటలకు సమ్మతించి.
బీభత్సు వీక్షించి ఘూర్ణమానమానసుం డగుచు ని ట్లనియె. 83

ఉ. ఖాండవ మేర్చె దేవతలుఁ గానని యాశ్వయుఁ గాంచె దోర్బలో
ద్దండమహాసురప్రతతిదర్ప మడంచె ప్రియం బొనర్చె యా
ఖండలుఁ డున్నగద్దియసగంబున నుండె మహానుభావుఁ డీ
తం డొకమర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁ డొకో. 84

క. అనుమాటలు విని సంక్రం, దననందనుఁ డిట్టు లనియె దైవంబుకతం
బున నాకు నొక్కచందం, బను వయి యున్నయది దీని నేఁ గాదనుఁడా. 85

వ. అమరనగరంబున కరిగిన యెడ నూర్వశి నన్ను నపుంసకుం గా శపియించిన నాకు
నాకేశుండు కరుణించి యీశాపఫలంబు భవదజ్ఞాతవాసవత్సరంబున ననుభవించి
తదనంతరంబున శాపమోక్షంబు వడయు మని దీవించెం గావునఁ బేడితనంబు
దాల్చి బాహులదీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబు
లును మాటు చేసికొని విరాటుకడకుం జని. 86

క. ఉత్తమకన్యాజనులకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు త
ద్వృత్తమునకు వన్నెలుము, చిత్తమునకు నెక్కఁ బనులు చేసెద నందున్.

83. బానసంబు=వంటను. బీభత్సున్ = అర్జునుని. ఘూర్ణమానమానసుండు = తిరుగుడు పడుచున్న మనస్సుగలవాఁడు.

84. ఖాండవము=ఖాండవ మనువనమును. ఏర్చెన్=కాల్చెను. దోర్బల ఉద్దండమహత్ అసుర ప్రతతి దర్పము=బాహుబలముచే భయంకరు లయిన కాలకేయ నివాతకవచ మను రక్కసులసమూహము యొక్క గర్వమును. ఆఖండలుఁడు=ఇంద్రుఁడు. అనుదాత్తతన్=తక్కువతనముచేత. ఖాండవవనమును దహించినవాఁడును శివుని మెప్పించినవాఁడును కాలకేయ నివాతకవచులం జయించి యింద్రుని యర్ధాసనమునఁ గూర్చున్నవాఁడు నగు నీయర్జునుఁ డొకమనుష్యునియొద్ద నెట్లు సేవచేయు నని తా.

85. సంక్రందననందనుఁడు=ఇంద్రునికుమారుఁ డయిన యర్జునుఁడు. ఆమాటలువిని యర్జునుఁ డిట్లనియె. దైవవశంబున నాకును నొకయుపాధియు గలిగియున్నది. అది సరియో కాదో చెప్పుఁ డని తా.

86. అమరనగరంబునకున్=స్వర్గమునకు. నాకేశుండు=ఇంద్రుఁడు. బాహులదీర్ఘత్వంబునకున్= భుజములయొక్క నిడుపతనమునకు. గుణకిణంబులకున్=అల్లెత్రాటిచేఁ గలిగిన కాయలకు. కంచుకంబును=రవికయును. శంఖవలయంబులును = శంఖముచేఁ జేయఁబడిన గాజులును. క్రమాన్వయము.

87. నృత్తము = ఆటను. తద్వృత్తమునకున్ = ఆకార్యమునకు. నేను గన్యకలకు నాటను నేర్పుటకు ఆపనికి నన్నుంచు కొమ్మని చెప్పుదు నని తాత్పర్యము.

క. అని కొలిచి యే బృహన్నల, యనునామముతోడఁ గన్య♦కాంతఃపురవ
ర్తన మొనరించుచు లాసిక, తనమున నిపుణుండ నై య♦తని మెప్పింతున్. 88

క. మానవపతి న న్నెక్కడి, దానవు నీ వనియె నేని ♦ ద్రౌపదికడ స
మ్మానము వడసి మెలంగుదు, నానగరున నృత్తగురువ ♦ ననఁ గలవాఁడన్. 89

గీ. అనిన నిది పోలు నని యియ్య♦కొని యజాత, వైరి యల్లన నకులుని♦వలను చూచి
నెమ్మనమ్మున నుమ్మలి♦కమ్ము గదుర, నెలుఁగుచందము వేఱుగా ♦ నిట్టు లనియె.

ఉ. ఒప్పెడుమేనుఁ బెంపు గల♦యుల్లము నాగరకంపుఁజందముం
జెప్పక చూప కీతనివి♦శేషము దెల్పెడుఁ గొల్వు వెంతయున్
దెప్పర మేమి చేయుదుఁ గ♦డిందివిచారము పుట్టె నెట్లొతం
డప్పురి సంచరించు నొకొ ♦ యన్యు లెఱుంగక యుండునట్లుగన్. 91

వ. అనిన నప్పలుకులు విని నకులుం డి ట్లనియె. 92

గీ. అశ్వశిక్షకుండ ♦ నయి మత్స్యభూవిభుఁ, గొలుచువాఁడ గుఱ్ఱ♦ములకు వలయు

88. కన్యకా అంతఃపుర వర్తనము = కన్యకలయొక్క లోపలియింటియం దుండుటను. లాసికతనమునన్ = ఆటకత్తెతనమునందు. నిపుణుండనై = నేర్పరినై. నేను బృహన్నల యను పేరతోఁ గన్యకాంతఃపురమునం దాటకత్తెనై యుండెద నని తా.

89. మానవపతి= రాజు. పాఠాం.—నగళులన్. విరాటుఁడు తొల్లి నీ వెక్కడ నున్నదానవని యడిగినయెడ ద్రౌపదికడ నున్నవాఁడ ననియు ధర్మరాజునగరున నృత్తాచార్యుఁడ ననియుఁ జెప్పుదు నని తా.

90. పోలున్ = తగును. ఉమ్మలికమ్ము=దుఃఖము. ఎలుఁగుచందము=కంఠధ్వనియొక్క విధము. వేఱు= భిన్నము. అర్జునునిమాటకంగీకరించి ధర్మరాజు నకులుని దిక్కుఁజూచి దుఃఖితుండై డగ్గుత్తికతో నిట్లనియె నని తాత్పర్యము.

91. ఒప్పెడుమేనున్ = చక్కనిశరీరమును. పెంపు = గొప్పతనము. ఉల్లమున్ = మనస్సును. నాగరకంపుచందమున్ = నాగరకుని విధమును, నగరమునందుఁ బుట్టినవాఁడు నాగరుఁడు, నాగరుఁడే నాగరకుఁడు. విశేషమున్ = గొప్పతనమును. దెప్పరము = అశక్యము. కడిందివిచారము = గొప్పచింత. ఈతనిరూపము మొదలగు వానిచేత నీతఁడు గొప్పవాఁడని స్పష్టముగాఁ దెలియవచ్చును. కాఁబట్టి యితరు లెఱుంగకుండ నాపట్టణమునం దీతఁడు కొల్వుసేయుట మిక్కిలి కష్టమని తాత్పర్యము. పాఠాం.—.నాగరికంపుఁజందమున్. నాగరికుఁడనఁగా నగరమునందు నియుక్తుఁడయిన తలారివాఁడని యర్థము, కాఁబట్టి యిట నాగరికశబ్దము విరుద్ధార్థక మగుటచే నగ్రాహ్యము.

93. అశ్వశిక్షకుండను అయి=గుఱ్ఱములకు విద్య నేర్పువాఁడనై. [illegible] యున విధములను. రూపుగాన్= నిశ్చయముగా. నేనుగుఱ్ఱముల విషయమంతయు [illegible] నవాఁడ నగు

తెఱఁగు లెల్లఁ జూచి ♦ యెఱుఁగుదు రూపు గా, నరయు నేర్తు వాని ♦ ననుదినంబు.

సీ. గోడిగజాతిలోఁ ♦ గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించు ♦ మార్దవంబుఁ
త్రాడులఁ బట్టంగఁ ♦ దక్కి యైనకొదమల, సంచు లెఱింగి శి♦క్షించు నేర్పుఁ
గళ్యాలఁ బదిలంబు ♦ గానిగుఱ్ఱంబులఁ, గ్రొత్తముట్టున కియ్య♦కొలుపు వెరవుఁ
బెనఁగుఁ గాకలముల ♦ బిరుదుతనంబునఁ, జలము డింపక తీర్పఁ ♦ జాలుటయును
నలవరించినవాఁడ లా♦యమున నున్న, యప్పుడు దొసఁగించుకయు లేని♦యట్లు గాఁగ
మాటిమాటికిఁ బరికించి ♦ మందడీల, కెల్ల నూఱట యగుచు వ♦ర్తిల్ల నేర్తు. 94

క. దామగ్రంథి యనఁగ నొక, నామము వెట్టుకొనువాఁడ ♦ నా తొంటివిధం
బా మనుజేశ్వరుఁ డడిగిన, నే మీకడవాఁడ నందు ♦ నిది తెఱఁ గధిపా. 95

క. అనినఁ గడు లెస్స యని నె, మ్మనమున నూఱడి విభుం డ♦మానుష తేజో
ధనుఁ డగుసహదేవునిఁ గనుఁ, గొని యిట్లను వగలు మిగిలి ♦ కొందలపఱుపన్.

టచే విరాటునియొద్ద గుఱ్ఱములకు శిక్ష నేర్పుకొలువు చేసెదనని తాత్పర్యము. పాఠాం.— చాల నెఱుఁగుదున్ = చక్కఁగా నెఱుఁగుదును.

94. గోడిగజాతిలోన్ = గుఱ్ఱపుజాతిలో. కొదమపెంటులన్ = ఈడైనయాఁడుగుఱ్ఱములను. ఏర్చి = ఏర్పరించి. మావులన్ = మగగుఱ్ఱములను. హత్తించుమార్దవంబున్ = కూర్చునట్టి మెత్తఁదనమును. పట్టంగన్ = పట్టుటకు. కొదమలన్ = పిల్లలను. సంచులు = జాడలను. త్రాడులచేఁగట్టుట కీడైనగుఱ్ఱపుఁబిల్లలను బట్టి వానిజాడలు తెలిసి మరపుట యందుసామర్థ్యము నని తా. కళ్యాలన్ = కళ్లెములచేత. పదిలంబు = భద్రము. క్రొత్తముట్టునకున్ = క్రొత్తతాఁకుడునకు. ఇయ్యకొలుపు వెరవున్ = మరగించునట్టియుపాయమును. కళ్లెములకోర్వనిగుఱ్ఱములను వానిక్రొత్తతాఁకుడున కోర్చునట్లు చేయుటయని తా. పెనఁగు కాకలములన్ = ఎగురునట్టి చెడ్డగుఱ్ఱములను. బిరుదుతనంబునన్ = సామర్థ్యముచేత. చలము = పట్టుదలను. డింపక = విడువక. తీర్పన్ = చక్కఁబఱచుటకు. దుష్టాశ్వములను శిక్షకు లోఁబడునట్లు చేయుసామర్థ్యము నని తా. అలవరించినవాఁడన్ = నేర్చినవాఁడను. దొసఁగు = ఆపద. పరికించి = విచారించి. మందడీలకున్ = గుఱ్ఱపువాండ్రకు. లాయములోని గుఱ్ఱపువాండ్రకు ననుకూలముగా నుందు నని తాత్పర్యము.

95. దామగ్రంథి—ప్ర. పలుపులముడుచువాఁడు. తొంటివిధంబు = మునుపటివృత్తాంతమును. మీకడవాఁడన్ = మీయొద్దనున్నవాఁడను. తెఱఁగు = ఉపాయము. అధిపా! ధర్మరాజు సంబోధనము. నేను దామగ్రంథి యను పేరుపెట్టుకొని నాపూర్వవృత్తాంతము విరాటుఁడడిగినయెడ ధర్మరాజు నొద్దనున్నవాఁడ నని చెప్పుదు నని తాత్పర్యము.

96. విభుండు = ధర్మరాజు. అమానుషతేజోధనుఁడు = మనుష్యసంబంధి గాని తేజస్సే ధనము గాఁగలవాఁడు. వగలు = దుఃఖములు. మిగిలి = అతిశయించి. కొందలపఱుపన్ = కలఁతపెట్టఁగా- ధర్మరాజు నకులుని మాట కంగీకరించి గొప్పతేజస్సుగల సహదేవునిం జూచి దుఃఖముతో నిట్లు చెప్పెనని తాత్పర్యము.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు శాంతుఁడు గొంతి ముద్దుసే
యు కొడుకు మేను లేఁత దన యుల్లము మెత్తన యట్టియీతఁ డె
ట్లొకొ యొరు నాశ్రయించు విధి యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్. 97

క. అనుడు నతఁడు దనచిత్తం, బునఁ దోఁచినవిధము ధర్మపుత్త్రునితో ని
ట్లని చెప్పె నాతనికిఁ బు, ట్టినయుత్తలపాటు గొంత డిందుపడంగన్. 98

క. కీలారితనమునకు నేఁ, జాలుదు నని కొలిచి మత్స్యజనపాలకుచే
మే లగునడవడిఁ దంత్రీ, పాలుం డనుపేరితోడఁ బరఁగుదు నధిపా. 99

సీ. వంజల నైనను వల నేర్పడఁగ నొక, భంగిఁ జేపడఁగఁ జేసి పాలుకొనఁగ
బడుగుల నైనను బాటించి పరికించి, గోమున మెయిఁ గండ గ్రొవ్వ దేఱఁ
దెవులుగొంటుల నైనఁ దీర్చి సంకటమున, కోపి మున్దటియట్లు రూపుసేయ
నజ్జుల నైనను నలు వైనవెరవున, ముట్టి యంటఁగఁ బట్టి కట్టి విడువఁ
బిదుకఁ గదుపు చేర్ప బెదరు వాపఁగ నీరు, మేపు గలుగునెడల మెలఁగ మలుప

97. అకుటిలుఁడు = కపటములేనివాఁడును. ఆర్యసమ్మతుఁడు = పెద్దలకుఁ బ్రియుఁడయిన వాఁడును. అహంకృతిదూరుఁడు = అహంకారములేనివాఁడును. నీతినిర్మలాత్మకుఁడు = నీతిచేతఁ బరిశుద్ధమయిన మనస్సుగలవాఁడును. అనవద్యశీలుఁడు = నిందింపరానినడవడిగలవాఁడును. సధర్ముఁడు = ధర్మముతోఁ గూడినవాఁడును, ఇది సధర్మన్ అని నకారాంతశబ్దము, నకారాంతములకు స్త్రీత్వము బహుళముగావున నిట స్త్రీత్వము లేనప్పుడు సధర్ముఁడన్ని రూపమేర్పడెను, రూ. సధర్మ. గొంతి = కుంతీదేవికి. విధి = దైవము. ఎవ్వరిన్ ఎట్లు. చేయఁగన్. ఓపదే = చాలదా, చాలునన్నట. ఇట్టిసహదేవుఁడు ఇతరుల నాశ్రయించుట కష్టము. దైవమెట్టివారికైనను నెట్టికష్టము నైనను గలిగించు నని తా.

98. ఉత్తలపాటు = పరితాపము. డిందుపడంగన్ = తక్కువయగునట్లు. ధర్మరాజుమాట విని సహదేవుఁడు ఆతనిదుఃఖము తగ్గునట్లు తనకుఁ దోఁచినయుపాయముఁ జెప్పెనని తా.

99. కీలారితనమునకున్ = గొల్లవాని పనికి. నేను ఆవుల మేపుదు నని చెప్పి విరాటునియొద్ద తంత్రీపాలుఁ డను పేరితోఁ గొలువుచేసెద నని తాత్పర్యము.

100. వంజలన్ = గొడ్డుపోతులను. వలను = ఉపాయము. బడుగులన్ = బక్కవానిని. గోమునన్ = కోమలత్వముచేత. మెయిన్ = దేహమునందు. తేఱన్ = కలుగునట్లు. తెవులుగొంటులన్ = రోగము గలవానిని. తీర్చి = రోగమును పోఁగొట్టి. సంకటమునకున్ = కష్టమునకు. ఓపి = చాలి. రూపు = విధము. నజ్జులన్ ఐనను = సులభముగాఁ బాలుపిదుకనియ్యని యావులనైనను. నలువు ఐనవెరవునన్ = చక్కనైన యుపాయముచేత. ముట్టి = చేరి. కట్టివిడువన్ = పిదుకుటకును. కదుపు = మందను. మలపన్ = త్రిప్పుటకును. మృగమున్ = దుష్టమృగమును. పసికిన్ = పశువులకు. కూర్తున్ = ప్రియపడుదును. పాఠాం.—గీతమునందు. మెలఁగనెలువన్ = తిరుగఁబోలుటకు న

మృగము నరయ మ్రుచ్చు ♦ రేవగలును గొట్ట, నేర్తుఁ బసికిఁ జాలఁ ♦ గూర్తు నేను.

వ. నన్ను విరాటుండు మున్న నీ వెం దుండు దని నిరూపించె నేని యుధిష్ఠిరుగోష్ఠంబున కధిష్ఠాతనై యుండుదు నందునని పలికినఁ గౌంతేయాగ్రజుం డిది యుక్తం బగు నని యనుమతి చేసి పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుం డగుచు ని ట్లనియె. 101

చ. ఇది కడు ముద్దరాలు పను ♦ లెవ్వియుఁ జేయఁ గ నేర దెంతయున్
మృదు వొకకీడుపాటునకు ♦ మేకొనఁ జాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కోర్వ దొక ♦ టేనియుఁ దా సవరించుచొప్పెఱుం
గదు తగ నొడ్లనుం గొలువఁ ♦ గా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా. 102

క. అనిన నతనిచిత్తంబున, వెనుఁబా టంతయును బాయు ♦ వెరవుకలిమి యె
ల్లను దెలియునట్లు గా ని, ట్లనియెం బాంచాలి యుచిత ♦ మగుచందమునన్. 103

క. సైరంధ్రీవేషంబునఁ, జేరుదు నంతఃపురంబు ♦ చెంతకు నన్నా

అని యర్థము. మెకము నరయమ్రుచ్చు మెలఁగిన వెలకొట్టన్—వెలకొట్టన్—వెడలఁగొట్టుటకు అని యర్థము కానోపు.

101. గోష్ఠంబునకున్ = మందకు. అధిష్ఠాతనై = అధికారినై. కౌంతేయ అగ్రజుండు = కుంతి కొడుకులయందుఁ బెద్దవాఁడు. పాంచాలిన్ = ద్రౌపదిని. ఖిన్న అంతఃకరణుండు = దుఃఖించినమనస్సు గలవాఁడు.

102. ముద్దరాలు = ముగ్ధస్త్రీ. నేరదు—నేర్చుధాతువు వ్యతిరేక తద్ధర్మార్థక ప్రథమపురుషైక వచనము. మృదువు = మెత్తనిది. కీడు పాటునకున్ = నీచత్వమునకు. మేకొనన్ = అంగీకరించుటకు. ఉదాత్తచిత్త = గొప్పమనస్సుగలది. ఒంటి= ఒంటరితనముచేత. సవరించుచొప్పు = చక్కఁబెట్టువిధమును. ఒడ్లనున్=ఇతరులనుగూడ. వెరవు = ఉపాయము. ఎమ్మెయిన్ = ఏవిధమున. ఈ ద్రౌపది యేకార్యములును తెలియనిది. గొప్పమనస్సుగలదగుటచే నీచకార్యము లొల్లదు. ఒంటరిగా నుండఁజాలదు. తనకార్యములే చేసికొనఁ జాలనిది. ఇతరులను గొలుచుట కష్టమని తా. ఒంటి శబ్దము విశేష్యవాచకము, ఇట ద్రుతప్రకృతికము కాక యుండుటచేఁ దృతీయార్థమునఁ బ్రథమ జాతీయ మని యెఱుంగవలయును. పాఠాం:—ఒకటిం దనుఁ దా సవరించుచొప్పు—అర్థము సమానము.

103. అతనిచిత్తంబున వెనుఁబాటు = ఆయుధిష్ఠిరుని మనస్సునందలి చింతను. పాయు వెరవుకలిమి = తొలఁగు నుపాయము కలుగుట. పాంచాలి = ద్రౌపది. ఉచితము= తగినది. ధర్మరాజు మాటవిని ద్రౌపది యతని దుఃఖము పోవుట కుపాయము కల దని యిట్లు చెప్పె నని తాత్పర్యము.

104. సైరంధ్రీవేషంబునన్ = గట్టువాలు వేషముతో, పర గృహమున నుండి యలంకారము మొదలగుకార్యములు చేయుచు మంచి నడవడి గలిగి స్వేచ్ఛగానుండు స్త్రీ సైరంధ్రియనఁబడును. అభూర

భూరమణుదేవి యెంతయు, గారవమునఁ బిలువ నంపఁ ♦ గాఁ గందుఁ దగన్.

క. కని కొలువు చేసికొని మా, లిని నాఁ జని సాధ్వి యిది మ♦లీమసవృత్తం

బునఁ బొంతఁ బోవ దెన్నఁడు, ననుప్రేంకఁదనంబు దోఁచు♦నట్లు చరింతున్. 105

సీ. కలపంబు లభినవ♦గంధంబులుగఁ గూర్చి, తనువున నలఁదుదు ♦ ననువు గాఁగ

మృగమదపంకంబు♦ మృదువుగా సారించి, తిలకంబు వెట్టుదుఁ♦ జెలువు మిగులఁ

బువ్వులు బహువిధం♦ బులఁ గట్టి ముడి కొ, క్క భంగి గా నెత్తులు ♦ వట్టి యిత్తు

హారము లైమెఱయునొ♦య్యారంబులుగ గ్రుచ్చి, యందంద వింతగా ♦ నలవరింతు

వివిధశిల్పములఁబ్ర♦వీణనై మఱియును, వలయుపనుల వెంట ♦ మెలఁగ నేర్తు

మత్స్యరాజమహిషి♦మనమున మక్కువ, నెలకొనంగ నిట్లు ♦ గొలువ నేర్తు. 106

క. మును నీ వెచ్చో నిలుతే, పనిమెయి వర్తిల్లు దనినఁ ♦ బాంచాలికి నే

ననుచారిణినై తగఁ బం, చినగరువపుఁబనులు నేర్చి ♦ చేయుదు నందున్. 107

మణుదేవి=ఆరాజుభార్య. గారవమునన్ = ప్రీతితో. పిలువనంపఁగాఁ గందున్= పిలిపించుకొందును. నేను గట్టువాలు వేషముతో నంతఃపురమునకుఁబోయి విరాటుని భార్య నన్నుఁ బిలువ నంపునట్లు చేసికొందునని తా. పాఠాం.—పిలువనంపఁగా వినయమునన్—ఈపాఠమునఁబై పద్యముతో నన్వయము.

105. కొలువుచేసికొని = పని కుదుర్చుకొని. సాధ్వి = యోగ్యురాలు. మలీమస వృత్తంబున పొంతన్ = పాపపుకార్యముల తెరువున, ఉదంతశబ్దమునకు షష్ఠీసమాసమున నవర్ణాగమము. ప్రేంకఁదనంబు = గౌరవము. నేను కొలువు కుదుర్చుకొని మాలిని యను పేరుగలదాననై యిది దురాచారము లేనిది యోగ్యురా లను గౌరవము గలుగునట్లు నడచుకొందు నని తా.

106. కలపంబులు = గంధములను. అభినవగంధంబులుగన్ = క్రొత్తవాసనగలవియగునట్లు. తనువునన్ = దేహమునందు. అలఁదుదున్ = పూయుదును. మృగమదపంకంబు = కస్తూరిపంకమును. సారించి = చక్కఁజేసి. తిలకంబు = బొట్టును. చెలువు = అందము. మిగులన్ = అతిశయింపఁగా. ఎత్తులు = దండలను. పుష్పములను ముడిముడికిని వింతవింత విధములచేత హారములుగాఁ గట్టి యిత్తు నని తా. మెఱయు ఒయ్యారంబులుగన్= ప్రకాశించునట్టి విలాసములు గలుగునట్లు. అందంద = మఱిమఱి. అలవరింతున్ = కూర్తును. మిక్కిలి నేర్పుతో ముత్యాలు మొదలగు హారములను గట్టుదు నని భావము. వివిధశిల్పములన్ = నానావిధము లయిన యలంకారములయందు. ప్రవీణను = నేర్పరిని. మహిషి=పట్టపుదేవి. నెలకొనంగన్= నిలుకడయగునట్లు. పాఠాం:—చతుర్థపాదమునందు. మెఱయనొయ్యారంబు గాన్ = ప్రకాశించునట్లు విలాసముగా నని యర్థము. అందంబువింతగాన్ = చక్కఁదనము వింతయగునట్లని యర్థము.

107. నిలుతు = ఉందువు, రూ. నిలుతువు, ఏపనిమెయిన్ = ఏకార్యముచేత. వర్తిల్లుదు = ఉందువు. అనుచారిణిని = పనికత్తెను. పంచినగరువపుఁ బనులు = ఆజ్ఞాపించిన గౌరవపుఁ బనులను. తొల్లి నీ వెచ్చట నేపని చేయుచుందు వని యడిగినయెడ నేను ద్రౌపదియొద్ద గౌరవపుఁబనులు చేయుచుందునని చెప్పెద నని తా.

వ. అనవుడు ధర్మతనయుండు ద్రుపదనందన కిట్లనియె. 108

క. మనవంశంబునవృత్తం, బును పెంపును గావఁ జాలు♦పుణ్యసతివి దు
ర్జను లగుతులువలమనములు, గనుఁగొని యేమఱక మెలఁగఁ♦గా వలయుఁజుమీ.

వ. అనిన విని యాజ్ఞసేని సాదరమందస్మితసుందరవదనారవింద యై యతని కిట్లనియె.

క. అరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక ♦ పాతివ్రత్యా
చారముమై వర్తింతురు, సైరంధ్రీజాతివారు ♦ సౌజన్యమునన్. 111

క. కావున నుచితము లగు నా, కావెంటం గొలిచి తిరుగు♦నప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం, భావనమును గౌరవంబుఁ ♦ బాపభయంబున్. 112

క. అని చెప్పిన విని యగుఁ బో, మ్మని కైకొని ధర్మతనయుఁ ♦ డందఱమునుని
ట్లనపాయత వర్తిల్లుద, మని తమ్ములతోడ నిశ్చ♦యంబుగఁ బలికెన్. 113

వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు రక్షించువారు వంటలవారు మహానసాధ్యక్షులును పాంచాలిపరిచారికలును ద్రుపదుపురంబున నిలుచువారు రథంబులు గొని యింద్రసేనాదు లైనసారథులు ద్వా

109. మనవంశంబున వృత్తంబును = మనవంశముయొక్క సదాచారమును. పెంపును = గౌరవమును. కాపన్ = కాపాడుటకు. చాలు పుణ్యసతివి = చాలిన పతివ్రతవు. తులువలమనములు = దుష్టుల మనస్సులను. నీవు మనవంశమునకుఁ గీర్తిఁ జాలిన దానవు అయినను దుష్టుల నెఱిఁగి యెచ్చరికతోఁ బ్రవర్తింపవలె నని తా. పాఠాం:—మనవంశంబును = మనకులమును అని యర్థము. తులువల తలఁపులు—అర్థము సమాసము, అనుప్రాసము విశేషము.

110. సాదరమందస్మిత సుందరవదన అరవింద = ఆదరముతోఁ గూడిన చిఱునగవుచేఁ జక్కని కమలమువంటి మోముగలది. పాఠాం:—అనాదరమందస్మిత = ఆదరము లేమిచేఁ గలిగిన చిఱునవ్వుచేత, యుధిష్ఠిరుని వాక్యమునం దనాదరము చెప్పుట యుచితము కాదు, కావునఁ బూర్వపాఠమే యుక్తము.

111. గౌరవభారంబు = గొప్పతనముయొక్క యతిశయమును. ఎడలంగన్ ఈక = తొలఁగ నీయక. పాతివ్రత్యఆచారముమైన్ = పతివ్రతతనముయొక్క నడవడితో. సౌజన్యమునన్ = మంచితనముతో. సైరంధ్రీవృత్తిగలవారు తమ గౌరవమును బోఁగొట్టుకొనక పతివ్రతలై యుందు రని తా.

112. ఆవెంటన్ = ఆపనిచేత. మితభాషావిరచనమును = కొలఁది మాటల చెప్పుటయును. వ్రతసంభావనమును = నియమము నాదరించుటయును. ఉచితము లగు నని యన్వయము. అందువలన నేను ఆవృత్తియం దుండునపుడు మితముగా మాటలాడుచు వ్రతముగలదాననై గౌరవమును పాపభయంబును గలిగియుండుట యావశ్యక మని తా.

113. కైకొని = అంగీకరించి. అనపాయతన్ = అపాయము లేకుండుటచేత. ద్రౌపదిమాటను విని యంగీకరించి ధర్మరాజు ఇట్లే యపాయములేక యుండవలయు నని తమ్ములతోఁ జెప్పె నని తా.

114. కార్యంబు = చేయవలసినదానిని. ధౌమ్యులు—పూజార్థమునందు బహువచనము. మహాన

రకానగరంబున కరుగువారు మీరెల్లను దక్షిణాపథంబున కరుగు ద్వైతవనంబున మమ్ము విడిచి పోయి రట నెఱుఁగ మనం గలవా రని చెప్పి యిత్తెఱం గునసభ్యంతరపరివారంబు నెల్ల నిలువ నియోగించి వీడుకొలిపె నయ్యవసరం బునధౌమ్యుండు పాండుకుమారుల కిట్లనియె. 114

——( ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱిఁగించుట. )——

క. ఎఱిఁగెడువారికి నైనను, గఱపక తక్కరు చిత ప్రకారము లెల్లం
గొఱలు హితు లట్లగుట నం, దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్.

వ. అదియునుం గాక. 116

గీ. కౌరవాన్వయజాతులై గౌరవమునఁ, బెరిఁగినట్టిమీ రొండొకనరునిఁ గొలిచి
మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁకువతోడుత నునికి యరిది.

క. ప్రాలి వివిధాస్త్రశస్త్ర, జ్వాలల వెలుఁగొందుపాండవజ్వలనం బా
భీలత మండం దొడఁగినఁ, గ్రాలు విరోధంబు నుచితకార్యముఁ దప్పన్. 118

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నానేర్చినవిధంబున నుపదేశంబు సేయుట యవశ్యకర్తవ్యంబు రాజులఁ గొలిచి యెమ్మెయి నైనను బ్రదుకుజనంబులు గీడు

ను అధ్యక్షులును = వంటసాలకు నాయకులును. అటన్ = పిమ్మట. అభ్యంతర పరివారంబున్ = లోపలి పరిజనమును.

115. ఎఱిఁగెడు వారికిన్ ఐనను = తెలిసినవారికిఁగూడ. ఉచితప్రకారములు= తగినవిధములను. కఱపక = నేర్పక. తక్కరు = విడువరు. హితులు = మేలు గోరువారు. కొఱలు = కొఱఁతలను. తెలిసినవారికిఁగూడ హితులు యుక్తాయుక్తములు చెప్పుదురు, కావున మీకు నందఱకును సమయము నకుఁ దగిన బుద్ధు లుపదేశింపవలయు నని తా. పాఠాం:—ఉచితప్రకారము శుభమున్.

117. కౌరవ అన్వయజాతులు ఐ = కౌరవవంశమునఁ బుట్టినవారలై. అడఁకువతోడుతన్ = వినయముతో. ఇటఁ దోడకుఁ దోడుత నని రూపాంతరము. కౌరవవంశమునఁ బుట్టి గౌరవముగాఁ బెరిఁ గినట్టి మీరు ఇతరుని సేవించి మానావమానములు చూడక యడఁగియుండుట కష్టమని తా. పాఠాం:- అడఁకువతోడన—వినయముతోడనే యని యర్థము.

118. ప్రాలి= విజృంభించి. వివిధ అస్త్రశస్త్రజ్వాలలన్=పలువిధములగు నస్త్రములుశస్త్రములు ననుమంటలచేత. వెలుఁగుఒందుపాండవజ్వలనంబు=వుండునట్టిపాండవులుఅనునగ్ని. ఆభీలతన్=భయంక రత్వముచేత.తొడరినన్=అరంభించినయెడ. విరోధంబు=కీడు. క్రాలున్=కలుగును.ఉచితకార్యమున్= తగినపనియును. ఒకవేళ నవమానము నోర్వఁజాలక మీరు బయలుపడి పరాక్రమించినపక్షమున మీకా ర్యముచెడి కీడు మూఁడు నని తా. అలం. రూపకము. పాఠాం:—కాలవిరోధంబుమఱచి= అజ్ఞాత వాసకాలముయొక్క విరోధము మఱచి. మండం దొడరిన నని యన్వయము.

119. అప్రమాద అర్థంబుగాన్ = ఏమఱుపాటు లేకుండుటకొఱకు. అవశ్యకర్తవ్యంబు = అవ

వారయ కుండునట్టిసాధారణనీతి సంక్షేపంబుగా నెఱింగించెద సావధానుల రయి
వినుండు. 119

క. తగఁ జొచ్చి తనకు నర్హం, బగునెడఁ గూర్చుండి రూప ♦ మవికృతవేషం
బుగ సమయ మెఱిఁగి కొలిచిన, జగతీవల్లభున కతఁడు ♦ సమ్మాన్యుఁ డగున్.

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ ♦ దేఁకువ లేక
మ్మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని ♦ పుట్టక యున్నే. 121

ఉ. రాజగృహంబుకంటె నభి♦రామము గా నిలు గట్టఁ గూడ దే
యోజ నృపాలుఁ డాకృతికి ♦ నొప్పగు వేషము లాచరించు నే
యోజ విహారము ల్సలుప ♦ నుల్లమునం గడు వేడ్క సేయు నే
యోజ విదగ్ధుఁడై పలుకు ♦ నొడ్డులకుం దగ దట్లు చేయఁగన్. 122

క. పుత్రులుఁ బౌత్రులు భ్రాతలు, మిత్రు లనరు రాజు లాజ్ఞ ♦ మీఱినచోటన్
శత్రులకాఁ దమయలుకకుఁ, బాత్రము సేయుదురు నిజశు♦భస్థితిపొంటెన్.

క. చనువాని చేయుకార్యం, బున కడ్డము చొచ్చి యేరు♦పున మెలఁగుచుఁ దా

క్యము చేయవలసినది. పొరయక = పొందక. సావధానులరు = ఎచ్చరికతోఁ గూడినవారలు.

120. అర్హంబు = తగినది. అగుఎడన్ = అయినప్రదేశమునందు. అవికృత వేషంబుగన్ = వికారములేని వేషము గలది యగునట్లుగా. సమ్మాన్యుఁడు = పూజింపఁదగినవాఁడు. సభకు యోగ్యమగునట్లు పోయి తగినచోటఁ గూర్చుండి యోగ్యమయిన వేషముతో రాజును గాంచినయెడ రాజునకుఁ బ్రీతి కలుగు నని తాత్పర్యము.

121. అలవడన్ = తగునట్లు. తేఁకువ = భయము. తప్పన్ = తొలఁగునట్లు. హాని = కీడు. నేను రాజు ప్రీతిని సంపాదించితినని భయములేక మర్యాదతప్పినచోఁ గీడు కలుగు నని తాత్పర్యము.

122. అభిరామముగాన్ = మనోహరముగా. ఏఓజన్ = ఏవిధముగా. ఆకృతికిన్ = ఆకారమునకు. ఒప్పు = చక్కన. విహారముల్ = క్రీడలను. ఉల్లమునన్ = మనస్సునందు. విదగ్ధుఁడుఐ = నేర్పరియై. ఒడ్డులకున్ = ఇతరులకు. రాచనగరువంటి గృహమును రాజుధరించు వేషమువంటి వేషమును రాజు విహరించునట్టి విహారమును రాజుమాటలాడునట్లు మాటలాడుటయును ఇతరులకుఁ దగదని తా.

123. పౌత్రులు = మనుమలు. భ్రాతలు = తోఁబుట్టువులు. శత్రులు అకాన్ = శత్రువులేయని. పాత్రము = చోటునుగా. నిజశుభస్థితిపొంటెన్ = తమ మేలి యునికికొఱకు. రాజులు తమయాజ్ఞ తప్పినయెడఁ గొడుకులు మొదలయినవారినిగూడఁ దమ మేలుకొఱకై దండింతు రని తా.

124. చనువాని చేయుకార్యంబునకున్ = తగిన వాఁడు చేయుకార్యమునకు. ఏరుపునన్ = కడుపుమంటతో. పయిన్ పూసికొనినన్ = మీఁద వేసికొన్నయెడ. తన మును మెలఁగెడు మెలఁకువకును = తనయొక్క మునుపటి స్థితికిని. ముప్పు = కీడు. సమర్థుఁడు చేయుపని కడ్డము

ననుబయిఁబూసికొనినఁ దన, మును మెలఁగెడు మెలఁకువకును ♦ ముప్పగుఁ బిదపన్.

గీ. రాజునొద్దఁ బలువురకు సంకటంబు గాఁ, జిరుగుపనుల నెంత ♦ తేజ మయిన
వాని బుద్ధి గలుగు♦వా రొల్ల రటుమీఁదఁ, జేటు దెచ్చు నట్లు ♦ సిద్ధ మగుట.

క. ఊరక యుండక పలువుర, తో రవ మెసఁగంగఁ బలుకఁ ♦ దొడరకయు మదిం
జేరువ గలనాగరకులుఁ, దారుఁ గలసి పలుక వలయు ♦ ధరణీశుకడన్. 126

క. వే ఱొక తెఱఁగున నొరులకు, మాఱాడక యునికి లెస్స ♦ మనుజేంద్రునకుం
దీఱమి గలచోటులఁ దా, మీఱి కడఁగి వచ్చి పంపు ♦ మెయికొన వలయున్.

చ. ధరణిపుచక్కఁ గట్టెదురు ♦ దక్కి పిఱుందును గానియట్లు గా
నిరుగెలనం దగం గొలిచి ♦ యే మనునో యెటు చూచునొక్కొ యె
వ్వరిదెస నెప్పు డేతలఁపు ♦ వచ్చునొ యీతని కంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన ♦ చేర్చి యుండుట నీతి కొల్వునన్. 128

క. నగళులలోపలిమాటలు, తగునే వెలి నుగ్గడింపఁ ♦ దన కేర్పడ నొం

వచ్చి యోర్వలేనితనముచేఁ దా నాపనిని చేయఁబూనినయెడఁ రాజునొద్దఁ దనకు మునుపు గలిగినగౌరవముకూడఁ జెడునని తా. పాఠాం:—నేరుపునన్ = సామర్థ్యముచేత అని యర్థము.

125. తేజము = ప్రభావము. అయినన్ = ఉన్నను. వానిన్ = అట్టిపనులకు. రాజునొద్ద నసేవులకుఁ గష్టము గలిగించుపని యెంత గొప్పదైనను దానివలన ముందు కీడే గలుగును గావున ఆపనిని బుద్ధిమంతులు విడుతు రని తా.

126. రవము = ధ్వని. తొడరకయున్ = ఆరంభింపకయు. నాగరకులున్ = నగరమునందుఁ బుట్టినవారును, నేర్పరులనుట. రాజునొద్ద నూరకుండుటయు అందఱితో గట్టిగా మాట్లాడుటయుఁ దగదు. రాజునకు మనస్సుగలసినట్టి బుద్ధిమంతులతో మాత్రమే మాటలాడవలయునని తా. పాఠాం:—తొడరుపక—తొడరునట్లుచేయక యని యర్థము.

127. తీఱమి = అక్కఱ. పంపు = ఆజ్ఞను. మెయికొనవలయున్ = అంగీకరింపవలయును. ఎప్పుడును ఎవ్వరికిని ఎదురుమాటాడరాదు. రాజున కక్కఱ కలిగినప్పుడుమాత్రము తానే రాజునెదుటికిఁబోయి యతనియాజ్ఞను బొందవలయు నని తా.

128. ధరణిపుచక్కఁగట్టెదురు = రాజుయొక్క చక్కని యెదుటి చోటును. తక్కి = విడిచి. పిఱుందును = వెనుకప్రక్కయును. ఇరుగెలనన్ = రెండుప్రక్కలయందును. సుస్థిరముగన్ = మిక్కిలినిలుకడగా. రాజునకు నెదుటఁగాని వెనుకఁ గాని యుండక యతని రెండుపార్శ్వముల యందునుండి యతని మోమునందే తనచూపు నిలిపి యెప్పుడేమి చెప్పునో యేవైపునఁ జూచునో యెవ్వనియెడ నేమి యభిప్రాయము పడునో యని కనుపెట్టి యుండుట సేవాధర్మమని తాత్పర్యము.

129. ఉగ్గడింపన్ = చెప్పుటకు. ఏర్పడన్ = స్పష్టమగునట్లు. ఒండు = మఱియొక. కడన్ = చోట. సర్వనామ మగుటచే ముందు ప్రయోగింపఁ బడిన యొండు శబ్దమునకుఁ బ్రథమ, ప్రథమమీఁది పరుషమునకు గకారాదేశము. ఘట్టినన్ = కలిగినయెడ. పతి = రాజు. చెప్పెడిది = చెప్పవలసినది.

ము గడం బుట్టినఁ బతి విన, నగుపనిఁ జెప్పెడిది గాక ◆ యాతనితోడన్. 129

క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీ డంతకంటె ◆ నెగ్గు తదీయో
పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడిపొందు◆కలిమి భటునకున్. 130

గీ. ఉత్తమాసనములు ◆ నుత్కృష్టవాహనం, బులును గరుణఁ దమకు ◆ భూమిపాలుఁ
డీక తార యెక్క ◆ నెంతటిమన్నన, గలుగువారి కైనఁ ◆ గార్య మగునె. 131

క. మన్నన కుబ్బక యవమతి, ద న్నొందిన స్రుక్కఁబడక ◆ ధరణీశుకడన్
ము న్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు ◆ నాపద లడఁగున్.

క. జనపతి యెవ్వారి నైనను, మనుపఁ జెఱుపఁ బూని యునికి ◆ మదిఁ దెలియ నెఱిం
గిన యేనిఁ దాను వెలిపు, చ్చునె మనుమ న్నెట్టిపాల◆సుండైనను దానిన్.

ఉ. ఎండకు వాన కోర్చి తన◆యిల్లు ప్రవాసపుఁజోటు నాక యాఁ
కొండు నలంగుదు న్నిదుర◆కుం దఱి దప్పెను డప్పి వుట్టె నె
క్కండన యెట్లొకో యనక ◆ కార్యము ముట్టినచోట నేలినా
తం డొకచాయ చూపినను ◆ దత్పరతం బని సేయుటొప్పగున్. 134

వేఱుప్రదేశములందు జరగిన సంగతులు తనకుఁ జక్కఁగాఁ దెలిసినయెడ నందు రాజువినఁదగినవానిని రాజుతోఁ జెప్పవలయునుగాని రాజునగరిసంగతులను బైటఁజెప్పరా దని తాత్పర్యము.

130. తదీయ...కలిమి—తదీయ = ఆయంతఃపురమునకు సంబంధించినవారును, ఉపాంతచర = సమీపమునఁ దిరుగువారునగు, కుబ్జ = గూనివారును, వామన = పొట్టివారును, కాంతా = స్త్రీలును, ఆదులతోడి పొందుకలిమి = మొదలగువారితోడి స్నేహముయొక్క కలుగుట. అంతకంటెన్. ఎగ్గు = కీడు, అని యన్వయము. సేవకునకు అంతఃపుర స్త్రీలతోను వారి పనివాండ్రతోను స్నేహముతగదనితా.

131. ఉత్తమాసనములున్ = శ్రేష్ఠములయిన యాసనములును. ఉత్కృష్ట = శ్రేష్ఠములయిన. ఈక = ఇయ్యక. తార = తమయంతనే. రాజు ఇయ్యకయే సేవకులు ఉత్తమాసనములను ఉత్తమవాహనములను దమంతఁ దామే యెక్కరా దని తా.

132. అవమతి = అవమానము. స్రుక్కఁబడక = దుఃఖింపక. ఒదవున్ = కలుగును. రాజు గౌరవించినపుడు గర్వమును నవమానించినపుడు దుఃఖమును బొందక యెప్పటియట్లు ప్రవర్తించువానికి నాపదలు తొలఁగి సంపదలు గలుగు నని తా.

133. మనుపన్ = రక్షించుటకును. ఉనికి = ఉండుట. తెలియన్ = చక్కఁగా. ఎఱింగినన్ ఏనిన్ = ఎఱిఁగినప్పటికిని. ఎట్టి పాలసుండును = ఎట్టిమూఢుఁడును. రాజు ఎవ్వరికేని మేలుగాని కీడుగాని చేయఁదలంచి యుండుట తనకుఁ దెలిసినయెడ సేవకుఁడు దాని నితరులకుఁ దెలుపరా దని తా.

134. ప్రవాసపుఁజోటు = పరదేశము. నాక = అని తలంపక. ఆఁకొందున్ = ఆఁకలికొందును. ఆఁకొను ధాతువు తద్ధర్మార్థకోత్తమ పురుషైకవచనము, రూ. ఆఁకొందున్, ఆఁకొందుదున్. ఏలిన తండ్రి = రాజు. ఒకచాయ = ఒకదారి. తత్పరతన్ = దానియందాసక్తిచేత. రాజు పని చెప్పినప్పుడు దానికి మారాడక కష్టపడియైనను జేయవలయుఁ గాని తనకష్టము చెప్పుకోరా దని తా.

క. తా నెంత యాప్తుఁ డైన న, హీనాయకుసొమ్ము పాము♦నెమ్ములు గా లో
నూనినభయమునఁ బొరయక, మానిసఁ గొ కేల గలుగు ♦ మానము బ్రదుకున్.

గీ. ఆవులింత తుమ్ము ♦హాసంబు నిష్ఠీవ, నంబు గుప్తవర్త♦నములు గాఁగఁ
జలుపవలయు నృపతి♦కొలువున్న యెడల బా, హిరము లైనఁ గెలని ♦కెగ్గులగుట.

క. వైరులదూతలు నేరము, వారు నిరాకృతులుఁ బాప♦వర్తులుఁ దమకుం
జేరువగా వర్తించుట, నేరమి తుదిఁ బొరయుఁ జేటు ♦ నిందయు వచ్చున్. 137

గీ. వసుమతీశుపాల ♦ వర్తించునేనుంగు, తోడ నైనఁ దోమ♦తోడ నైన
వైర మగు తెఱంగు ♦ వలవదు తా నెంత, పూజ్యుఁ డైన జనుల♦పొందు లెస్స.

క. కలిమికి భోగముల కదా, ఫల మని తా మెఱసి బయలు♦పడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే, డ్కలు సలుపఁగ వలయు భటుఁ డ♦డంకువతోడన్.

వ. అని యిట్లు పురోహితుండు సేవాధర్మంబు లెఱింగించిన ధర్మజ భీమార్జున నకుల సహదేవులు ప్రసన్నచిత్తులై యిట్లనిరి. 140

క. తల్లియుఁ దండ్రియు దైవము, నెల్లసుహృజ్జనులు మీర ♦ యిట్లు కొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ, దెల్లము సేసితిరి బ్రతికి♦తిమి మీకరుణన్. 141

135. పాము ఎమ్ములుగాన్ = సర్పముయొక్క యెముకలుగా. లోన్ = మనస్సునందు. పొరయక = పొందక. సేవకుఁడు రాజున కెంతయాప్తుఁడయినను రాజుధనమును ముట్టరా దని తా.

136. హాసంబు = నవ్వుట. నిష్ఠీవనంబు = ఉమియుట. గుప్తవర్తనములు. రహస్యమయిన చేయుట గలవి. బాహిరములు = బహిరంగములు. కెలనికిన్ = ప్రక్కనున్నవారికి. ఎగ్గులు = రోఁతలు. ఆవులింత లోనగునవి రోఁత గలిగించునవి గనుక రాజుసభయందు రహస్యముగాఁ జేయవలయు నని తాత్పర్యము.

137. నిరాకృతులున్ = త్రోయఁబడినవారును. పాపవర్తులున్ = పాపమునందుండు వారలును. నేరమి = తప్పు. శత్రురాజులదూతలు మొదలగువారితోఁ జేరియుండుట చేటు గలిగించును, గావున వారితోఁ జేరరాదని తా. పాఠాం:—ఎరవగువారు = భేదముగలవారు అని యర్థము.

138. వసుమతీ ఈశుపాలన్ = రాజునొద్ద. జనులపొందు = జనులతో స్నేహము. రాజునొద్ద నుండువారలతోఁ బెద్దలతోఁగాని చిన్నలతోఁగాని వైరము పెట్టుకోరాదు, తానెంత గొప్పవాఁడైనను నందఱితో స్నేహముగా నుండవలయు నని తా.

139. కలిమికిన్ = సంపదకు. పెల్లుగన్ = అధికముగా. సంపదకలిగినందుకు భోగము లనుభవించుటయే ఫల మని సేవకుఁడు వెల్లడిగా భోగింపరాదు, తనవేడుకలు రహస్యముగాఁ జేసికొనవలయు నని తాత్పర్యము.

140. ప్రసన్నచిత్తులు ఐ = నిర్మలమయిన మనస్సుగలవారై.

141. ఎల్లసుహృత్ జనులున్ = ఎల్లమిత్త్రజనులును. వర్తిల్లెడు తెఱంగులు = ఉండునట్టి విధములు. మాకు మీరు తప్ప వేఱు బంధువులు లేరు, సేవాధర్మములం దెలిపి మమ్ము బ్రదికించితి రని తా.

గీ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె సంవత్సర, మకట యెట్టు లయిన నడఁగి మడఁగి
సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడవలయు. 142

క. అనవుడు నట్టుల చేసెద, మని వారలు భక్తియుక్తి నతనికి నభివం
దన మొనరించినఁ దగుదీ, వన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. 143

క. భూదేవోత్తమునాశీ, ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది వారలు ప్రస్థా
నాదరపరు లగుటయు స, మ్మోదావహపుణ్యకర్మముల కుద్యతుఁడై. 144

గీ. అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలం, బుగ నొనర్చి కాల్యపూజ దీర్చి
యానసమయమంగళార్థంబు లగుమంత్ర, సంచయములు దగ జపించుచుండె.

వ. తదనంతరంబ హుతవహునకుం బురోహితునకుం బ్రదక్షిణంబు చేసి యమ్మహీసు రవరేణ్యు ననుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతం డును దోడన యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణ దేశంబునుత్తరంబునఁ బాంచాలజనపదయామ్యదిగ్భాగంబున సాల్వశూరసేన

142. నిస్తరించి = దాఁటి. నెగడవలయున్ = బయలుపడి ప్రకాశింపవలయును. ఈ యొక యేఁ డెట్టులైనను నడఁకువతోనుండి కష్టపడి వెనుక నెగడవలయు నని ధౌమ్యుఁడు చెప్పె నని తా. పాఠాం:—ఒకఁడు—ఉడిగి మడఁగి = కృశించి వంగి యని యర్థము.

143. భక్తియుక్తిన్ = భక్తితోడి కూడికచేత. అభివందనము = నమస్కారమును. గాఢవాత్స ల్యమునన్ = అధికమయిన ప్రీతితో. ధౌమ్యుని వాక్యము విని పాండవులు అట్లేచేసెద మని యతనికి నమస్కరింపఁగా ధౌమ్యుఁడు వారి నాశీర్వదించె నని తా.

144. భూదేవోత్తము = బ్రాహ్మణశ్రేష్ఠుఁడయిన ధౌమ్యునియొక్క. ప్రస్థాన ఆదరపరులు = ప్రయాణమునందలి యాసక్తి కధీనులు, ప్రయాణమునకుఁ బూనినవారలు. సమ్మోద ఆవహపుణ్యకర్మ ములకున్ = సంతోషము కలిగించునట్టి మంచికార్యములకు. ఉద్యతుఁడు ఐ = పూనినవాఁడై. ధౌ మ్యుని యాశీర్వాదములకు సంతోషించి పాండవులు ప్రయాణమునకు యత్నింపఁగా నా ధౌమ్యుఁడు వారికి శుభము గలిగించు కర్మములు చేయుటకుఁ బూనినవాఁడై యని తా.

145. నియతితోడన్ = నియమముతో. సముజ్జ్వలముగన్ = వెలుంగునట్లుగా. కాల్యపూజ= కాలమునందుఁ జేయఁదగినపూజను. యాన సమయ మంగళార్థంబులు = ప్రయాణకాలమునందు మం గళమే ప్రయోజనముగాఁ గలవి. మంత్రసంచయములు = మంత్రముల సమూహములను. ధౌమ్యుఁడు నియమముతో నగ్నిని ప్రణయించి యాకాలమునఁ జేయవలసిన పూజచేసి ప్రయాణసమయమునందు మంగళము గలిగించు మంత్రములను జపించుచుండె నని తా. పాఠాం.—కామ్యపూజదీర్చి.

146. హుతవహునకున్ = అగ్నికి. పురోహితునకున్—ధౌమ్యునకు. అమ్మహీసురవరేణ్యు అను మతి = ఆ బ్రాహ్మణశ్రేష్ఠుఁ డయిన ధౌమ్యునియొక్క సమ్మతిని. పురస్కరించుకొని = ముందుంచు కొని. యామ్యదిక్భాగంబునన్ = దక్షిణదిక్ప్రదేశమునందు. విషయంబులలోనన్ = దేశములయం దు. కాళిందీ = యమునయొక్క. పశ్చిమ అభిముఖ ప్రయాణంబులన్ = పడమటికి నెదురుమోము గల పయనములచేత. ఎడనెడన్ = నడుమనడుమ. వన్య ఆహారంబులన్ = అడవియందుఁ బుట్టినయా

విషయంబులలోనఁ గాళిందీదక్షిణతీరం బారసికొని పశ్చిమాభిముఖప్రయాణం
బుల నెడనెడ వన్యాహారంబుల శరీరయాత్రలు నడపుచు నానామృగవివిధవధ
విహరణంబులను మనోహరకుసుమకదంబగంధమకరందబిందుసందోహసుందరత
రుచ్ఛాయాసేవనంబులను గమలపరాగ పరంపరా ధూసరితభాసురజలాశయ
సమవగాహనంబులను సరిత్సంగమ స్నానాద్యనుష్ఠానంబులను బహుప్రకారపాద
పగుల్మలతా వలోకనంబులను బక్షికులప్రవరానేకభంగివిరుతాకర్ణనంబులను వి
నోదించుచుఁ గాననమార్గంబుల నరిగి మత్స్యమండలంబు గదిసి ధౌమ్యుని వీడు
కొనిన నవ్విప్రవరుండు నొక్కపుణ్యాశ్రమంబున వసియించె వా రూళ్లు చొరక
యడవితెరువుల నడచి విరాటునగరంబున కనతిదూరం బగుకాంతారంబునఁ
దఱిమిపోవుసమయంబునఁ బథిశ్రమంబు నొంది యాజ్ఞసేని ట్లనియె. 146

హారములచేత. శరీరయాత్రలు = దేహపోషణములను. నానామృగ వివిధ వధ విహరణంబులను = పలువిధములయిన మృగముల నానావిధములుగా వధించుటలు అను క్రీడలచేతను, పాఠాం:—నానామృగవివిధ విహారంబులను = పలుమృగములయొక్క నానావిధములయిన క్రీడలచేతను అని యర్థము. ఈ పాఠమున విహారము మృగనిష్ఠము చెప్పఁబడినది, సేవనములు మొదలగునవి పాండవనిష్ఠములే వెనుక వర్ణింపఁబడినవి. ఇట్లు అననురూపత వలనను అంత్యప్రాసభంగమువలనను నీపాఠము కవిసమ్మతము కాదని తోఁచుచున్నది, "విధ్యన్తో మృగజాతాని" అను సంస్కృతమూలము కూడఁ బూర్వపాఠమున కనుకూలము. మనోహర...ఆసేవనంబులను—మనోహర = ఇంపైన, కుసుమకదంబ = పూలగుత్తుల యందలి, గంధ = వాసనయు, మకరందబిందు సందోహ = పూఁదేనె బిందువుల సమూహములును గల, సుందర = చక్కని, తరుచ్ఛాయ = చెట్ల నీడలయొక్క, ఆసేవనంబులను = ఆశ్రయించుటల చేతను. తరు+ఛాయ—ఛాయాశబ్దము షష్ఠీ తత్పురుష సమాసాంతమునఁ బూర్వపదార్థ బహుత్వమునందు నిత్యముగాను, పూర్వపదార్థైకత్వమునందు వైకల్పికముగాను నపుంసకలింగమగును, ఇటఁ దరుశబ్దార్థమునకు బహుత్వము వివక్షించినయెడఁ దరుచ్ఛాయ ఆసేవనంబుల నని చెప్పవలెను. ఏకత్వము వివక్షించినయెడఁ దరుచ్ఛాయా + సేవనంబులను, అనియు విభాగము చేయవచ్చును. కమల...సమవగాహనంబులను—కమల = తామరలయొక్క, పరాగ = పుప్పొడియొక్క, పరంపరా = వరుసలచేత, ధూసరిత = కొంచెము తెల్లగాఁ జేయఁబడిన, భాసుర = ప్రకాశించుచున్న, జలాశయ= కొలఁకులయందు, సమవగాహనంబులను=చక్కఁగా మునుఁగుటలచేతను. సరిత్ సంగమ స్నానాదిఅనుష్ఠానంబులను=నదుల కలయుచోటులయందు స్నానము మొదలగువానియొక్క చేయుటలచేతను. బహుప్రకార పాదపగుల్మలతా అవలోకనంబులను= పలువిధములయిన వృక్షములయొక్కయుఁ బొదలయొక్కయుఁ దీఁగెలయొక్కయుఁ జూచుటలచేతను, పక్షి...ఆకర్ణనంబులను—పక్షికుల = పక్షులసమూహమునందు, ప్రవర = శ్రేష్ఠములయిన వానియొక్క, అనేకభంగి = పెక్కువిధములుకల, విరుత = ధ్వనులయొక్క, ఆకర్ణనంబులను = వినుటలచేతను. పాఠాం.—కులప్రకర—ఈపాఠము సమానార్థక పదద్వయము కలుగుటచే నుపేక్ష్యము. మత్స్యమండలంబు = మత్స్యదేశమును. కదిసి = చేరి. పాఠాం.—మత్స్య...గడిసేరి = మత్స్యదేశముయొక్క యెల్లను చేరి యని యర్థము, "మత్స్యస్య

ఉ. దప్పి జనించె వ్రేళులపు♦టంబులు పొక్కెఁ దొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు ♦ చిత్తము నాకుఁ గడు న్వశంబు గా
దప్పుర మిచ్చొ టచ్చొ టను♦నాసల వచ్చితి నెంత దవ్వొకో
యిప్పటిభంగి నొక్కడుగు ♦ నేగెడుదానికి నోర్వ నెమ్మెయిన్. 147

వ. అనవుడు. 148

క. తనమదిఁ గరుణయు ఖేదం,బును బెరిగొనుచుండ ధర్మ♦పుత్రుఁడు నకులుం
గనుఁగొని ద్రుపదాధిపనం,దనదెస యాతనికిఁ జూపి ♦ తగ ని ట్లనియెన్. 149

గీ. అకట మనము వచ్చి♦నది కడు దవ్వు నేఁ, డప్పురంబు సొత్త ♦ మని దలంచి
తఱిమి నడచితిమి ల♦తాతన్వి యిది వడఁ, గొనియె మోచి తెమ్ము ♦ కొంతదవ్వు.

క. అనిన విని పూని గ్రక్కునఁ, జనుదేరమి నతఁడు డస్సెఁ ♦ జాలం డని నె
మ్మనమున నెఱింగి యాతని, యనుజన్మునిఁ బనిచె నతఁడు ♦ నలసుం డయినన్.

వ. సవ్యసాచిం జూచి. 152

విషయం ప్రావిశన్ వనాత్ ” అను సంస్కృతమువలన మత్స్యమండలంబు గదిసి యను పూర్వపాఠమే కవి హృదయమని తోఁచుచున్నది. అనతిదూరంబు = దగ్గఱ. కాంతారంబునన్ = అడవియందు. తఱిమి = వేగిరపడి. పథిశ్రమంబున్ = దారిబడలికను. యాజ్ఞసేని = ద్రౌపది.

147. వ్రేళుల పుటంబులు = దొప్పలవంటి వ్రేళ్లు. చిప్పిలఁ జొచ్చెన్ = వెడలసాగెను. ఇప్పటి భంగిన్ = ఇప్పటి విధముచేత. మిక్కిలి కష్టపడుచున్నదానను, విరాటునిపట్టణము దగ్గఱ యను నాసచే నింతదూరము నడచివచ్చితిని, అది మిక్కిలి దూరముగాఁ దోఁచుచున్నది. ఇఁక నేనెంతమాత్రము నడవఁజాల నని తా.

149. కరుణయున్ = దయయును. ఖేదంబును = దుఃఖమును. పెరిగొనుచుండన్ = పెనఁగొనుచుండఁగా. ద్రుపద అధిపనందనదెస=ద్రుపదరాజు కూఁతురయిన ద్రౌపదియవస్థను. ధర్మరాజు ద్రౌపదికష్టమును నకులునకుం జూపి యాతనితో నిట్లనె నని తా.

150. లతాతన్వి = తీఁగవలె సన్ననిది, ద్రౌపది. వడగొనియెన్ = తాపము నొందెను. నేఁడే విరాటుని నగరము చేరవలయునని మిక్కిలివేగముగాఁ జాలదూరము నడచి వచ్చితిమి, కావునఁ గోమల దేహముగల యీ ద్రౌపది మిక్కిలి యలసినది. దీనిం గొంతదూరము మోచికొనిరమ్మని తా.

151. గ్రక్కునన్ = శీఘ్రముగా. చనుదేరమిన్ = రాకుండుటచేత. చాలండు = శక్తుఁడు కాఁడు. ఆతని అనుజన్మునిన్ = ఆనకులునితమ్ముని, సహదేవుని. అలసుండు = అలసినవాఁడు. నకులుఁడు ద్రౌపదిని మోచికొని రాఁజాలక పోవుట చేత నకులుఁడును అలసినాఁడని తెలిసి సహదేవుని కాజ్ఞాపింపఁగా నతఁడు నశక్తుఁడు కాఁగా నని తాత్పర్యము.

152. సవ్యసాచిన్ = అర్జునుని.

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన • కీనడుమ న్విడియంగ నొందుచో
టిమ్ముగ గాదు నిక్కముగ • నేమును డస్సితి మట్లు గాన నీ
వెమ్మెయి నైన దీని భరి•యించి పురంబుసమీపభూమికిం
దెమ్మని చెప్పె నాతఁడును • దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలన్. 153

క. మోచికొని వాసవాత్మజుఁ, డాచెలువం దేర నిట్టు • లరిగి పురము దృ
గ్గోచర మగుటయుఁ దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మ•సుతుఁ డి ట్లనియెన్.

క. చక్కనిచిక్కనిమేనులు, నిక్కోదండములుఁ జూచి • యెఱుఁగరె మన మీ
చక్కటి నిలుత మె శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేష•యోజనములకున్.

వ. అనిన నది కార్యం బని పాండవమధ్యముం డాసుమధ్య నొక్కశీతలసికతాతలం
బున డించె దక్కినవారు నట్ల చేయుదు మని నిలిచి రట్టియెడఁ బాండవాగ్ర
జుండు గాండీవిచేతివి ల్లుపలక్షించి యతని కి ట్లనియె. 156

క. మనశస్త్రాస్త్రంబులు ద, క్కినయవి యొకభంగి పీటి•కిని గాండివముం
గొని పోయితి మేని సుయో, ధనునకు నగపాటు నిశ్చి•తం బూహింపన్. 157

153. ఇమ్మదిరఅక్షి=మత్తుగొనిన కన్నులుగలయీద్రౌపది. ఇమ్మును=అనుకూలమును. భరియించి=మోచి. పుష్పకోమలన్= పువ్వులవలె కోమలయైనదానిని, ద్రౌపదిని. ఈద్రౌపదిమిక్కిలి యలసినది, మేమునుఅలసినారము, మనకు నేఁడవశ్యము విరాటుని నగరము చేరవలసియున్నది, అపట్టణము సమీపమువఱకు నీవే ద్రౌపదినిమోచి తెమ్మనఁగా నర్జునుఁడుదానిమోచి తెచ్చె నని తా. పాఠాం:—పుష్పకోమలిన్—కోమలిశబ్దము తద్భవము, దీనికి సంస్కృతముతో సమాసము అప్రశస్తమగుటవలన నీపాఠము అసాధువు.

154. వాసవఆత్మజుఁడు = ఇంద్రునికుమారుఁడయినయర్జునుఁడు. తేరన్ = తీసికొనిరాఁగా. దృక్గోచరము = కంటికగపడినది. అర్జునుఁడు ద్రౌపదినిమోచికొనిరాఁగా విరాటునిపట్టణమునొద్దకుఁ బోయి ధర్మరాజు తమ్ములతో నిట్లు చెప్పెనని తా.

155. చిక్కని = బలిసిన. ఇక్కోదండములున్ = ఈధనుస్సులను. ఈచక్కటిన్ = ఈచోట. శస్త్రములు = ఆయుధములను. వేషయోజనములకున్ = వేషముల కూర్చుకొనుటకును. ఒక్కెడన్ నిలుత మె అని యన్వయము. మనదేహములను ధనుస్సులను జూచినయెడ మనలను గుఱుతుపట్టుదురు కావున మనయాయుధములు దాఁచుటకును మాఱువేషము వేసికొనుటకును నిచ్చటనొకచోట నిలుతమని తా. పాఠాం:—ఇక్కోదండములునైనన్ = ఈధనుస్సులును ఉన్నయెడ అని యర్థము.

156. పాండవమధ్యముండు= పాండవులయందు నడిమివాఁడు, అర్జునుఁడు. ఆసుమధ్యన్=ఆద్రౌపదిని. శీతలసికతాతలంబునన్=చల్లనియిసుకదిబ్బమీఁద. గాండీవి=అర్జునునియొక్క. ఉపలక్షించి=చూచి.

157. ఒకభంగి = ఒకవిధము. పీటికిని = పట్టణమునకు. అగపాటు = అగపడుట. నిశ్చితంబు = నిశ్చయము. మన తక్కినయాయుధము లెట్లున్నను గాండీవము మనయొద్దనున్నయెడమాత్రము దుర్యోధనుఁడు మనలనిశ్చయముగాఁ గనుపెట్టఁ గలఁడని తాత్పర్యము.

వ. అనవుడు. 158

చ. ఇది పెనుఁబాముచందమున ♦ నెంతయు భీషణమై జనంబులన్
బెదరఁగఁ జేయు నట్లగుటఁ ♦ బెట్టి చన న్వలయుం దలంప నా
హృదయము దీనిఁ బాయుటకు ♦ నియ్యకొనం జొర దెట్లు చెప్పినం
దుది నొకచోట వైచుటయుఁ ♦ దోఁచినకార్యము నయ్యెడుం గటా. 159

వ. అని వితర్కించుచుఁ గిరీటి యురియాడుచిత్తంబు నుత్తలం బుడిపికొని యాయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలికి యోగ్యస్థలనిరూపణంబునకు నలుదిక్కులుం బరికించి ప్రేతభూపరిసరారణ్యంబునందు. 160

సీ. నెగసికొన లేచి ♦ నింగి యంతంతకు, నవులఁ ద్రోవఁగఁ దన♦రారుదాని
సాఁగినశాఖ లా♦శాచక్రములకొలఁ, దులు బార వెట్టంగఁ ♦ బొలుచుదానిఁ
గవటలొండొంటితోఁ♦ గదియుచు నెడములు, ద్రింగిప్రబ్బఁగ సొంపు♦మిగులుదాని
లోనిజొంపము పవ♦లును బెనుఁజీఁకటి, నొదవించి పొదలంగ ♦ నొప్పుదానిఁ

159. భీషణము ఐ = భయంకరమై. పాయుటకున్ = విడుచుటకు. ఇయ్యకొనన్ చొరదు = ఇష్టపడదు. వైచుటయున్ = వేసిన పిమ్మట. ఈగాండీవముంజూచి జనులుభయపడుదురు, కాఁబట్టి దీనిని విడుచుటయే యుక్తము, నామనస్సు దీనిని విడుచుట కిష్టపడక పోయినను అవశ్యము దీనిని విడిచి, ననేకాని మనకార్యము నెఱవేఱదని తా.

160. వితర్కించుచున్ = ఆలోచించుచు. కిరీటి = అర్జునుఁడు. ఉరియాడుచిత్తంబు ఉత్తలంబు = చలించుచున్న మనస్సుయొక్క పరితాపమును. నిక్షేపించుట అ = ఉంచుటయే. కర్జంబు = యుక్తము. యోగ్యస్థల నిరూపణంబునకున్ = తగినచోటు నిశ్చయించుటకు. పరికించి = చూచి. ప్రేతభూపరిసరఅరణ్యంబునందున్ = శ్మశానము దగ్గఱనుండు నడవియందు.

161. నెగసినకొనలు = పైకిఁ బెరిఁగినచివరలు. ఏచి = పెరిఁగి. నింగి = ఆకాశమును. అవులన్ = అవతలికి. తనరారుదానిన్ = ఒప్పుదానిని. చెట్టుచివరలు ఆకాశమును మీఁదికిఁ ద్రోయునట్లున్నవని తా. సాఁగినశాఖలు = నిడివియయినకొమ్మలు. ఆశాచక్రములకొలఁదులు = దిక్కులసమూహములయొక్క మేరలను. బారవెట్టంగన్ = బారలతోఁగొలుచుటకు. కొమ్మలు దిక్కులను బారతోఁ గొలుచునట్లుపొడవులై యున్నవని తా. కవటలు = పెద్దకొమ్మలు. ఎడములు = అవకాశములను. ప్రబ్బఁగన్ = అతిశయింపఁగా. పెద్దకొమ్మలు బలిసియొకటితో నొకటికలిసినట్టుగా నున్నవనితా. లోనిజొంపము = లోపలియాకులగుబురు. జొంపముదట్టముగానుండుటచేఁ బగలుకూడఁ బెనుఁజీఁకటి గలిగియున్నదనితా.
పవమాన వివిధనర్తనకళానివర్తిన్ = గాలియొక్క నానావిధములయినయాటలు అనువిద్యలను నిలుపుదానిని, పెద్దదగుటచే గాలివీచుటకు నడ్డముగా నుండు దాని నని తా. పాఠాం:—నర్తనకళా అనువర్తిన్ = ఆటలు అనువిద్యలను అనుసరించినదానిని, గాలికిఁ గదలుచున్నదానిని అని తా. కాక... పరిసరవర్తిన్—కాక = కాకులయును, ఘూక = గూబలయును, ఆరవ = కూఁతలయొక్క, స్ఫూర్తి = అతిశయమువలన, జాత = కలిగిన, భీతి = భయముగలిగిన, పరిసరవర్తిన్ = సమీపమున నుండుజనులు

గనియెఁ బవమానవివిధవ♦ ర్తనకళాని, వర్తిఁ గాకఘూకారవ♦స్ఫూర్తిజాత
భీతిపరిసర్వర్తి నా♦భీలభుజగ, చండమూర్తి శమీతరు♦చక్రవర్తి. 161

వ. కని యమ్మహీరుహంబు ధర్మనందనునకుం జూపి యిట్లనియె. 162

శా. పక్షివ్యాకులముం బరేతనిలయ♦ప్రాంతోత్థముం డాకినీ
రక్షోభూతపిశాచగోచరము దు♦ర్గంధంబునై చూడఁ జి
త్తక్షోభం బొనరించు నట్లగుటఁ జెం♦తం జేర రా దీశమీ
వృక్షం బెవ్వరి కిందుఁ బెట్టుదమె పృ♦థ్వీనాథ శస్త్రాస్త్రముల్. 163

క. పెనుఁబొడువు పఱపు జొంప, మ్మును గలయది దీన నెల్ల♦పురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు సేరం, జనఁ జూడఁగ నరయ నెక్క ♦ సమకట్టంగన్. 164

ఉ. కావున దీనియం దిడుట ♦ కార్యము గైదువు లెల్లఁ గేశచ
ర్మావృతసంచయంబుగ శ♦వాకృతి గా నొనరించి కట్టినం
బోవరు దీనిది క్కెవరులు ♦ భూవర నెమ్మది నూఱడిల్లు మె
చ్చో వసియించినం బిదపఁ ♦ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్. 165

వ. అని చెప్పి యందఱు నత్తెఱంగున కియ్యకొనుటయు నతండు గాండీవంబు నవలోకించి.

కలదానిని, కాకులు మొదలగువానికూఁతలచే దగ్గఱకుఁ బోయినవారికిభయమును గలిగించుచుండుదానిని అని తా. శమీతరు చక్రవర్తిన్ = జమ్మివృక్షముల యందు శ్రేష్ఠమయినదానిని. కనియెన్. అని యన్వయము. అలం. అతిశయోక్తి, అంత్యప్రాసము.

162. మహీరుహంబు = వృక్షమును.

163. పక్షివ్యాకులమున్=పక్షులచే నిండినదియును. పరేతనిలయ ప్రాంతఉత్థమున్ = శ్మశానము నొద్ద మొలచినదియును. డాకినీరక్షోభూతపిశాచగోచరమున్=ఆఁడుదయ్యములకును రాక్షసులకును భూతములకును పిశాచములకును ఉనికిపట్టైనదియు. చిత్తక్షోభంబు=మనస్సునకుఁగలఁతను. ధర్మరాజా ? ఈజమ్మిచెట్టుశ్మశానముదగ్గఱ మొలచినదై పెద్దపక్షులును పిశాచములును గలిగి దుర్గంధమైయున్నది కావున దీనింజూచుజనులు భయపడుదురు, దీనియందుమనయాయుధములుంపవచ్చునని తా. పాఠాం:—పరేతనిలయోపాంతోత్థమున్—అర్థము సమానము. దుర్గస్థంబున్ ఐ=చొరరానిచోటనున్నదై యని యర్థము.

164. పఱపు = వైశాల్యమును. ఒకఁడు = ఒకటి. ఇది మిక్కిలి పొడువును విరివియునైయున్నది. దీనియొద్దకు వచ్చి చూచి దీని నెక్కుట కెవ్వనికి నేమియుఁ గార్యము లేదని తా.

165. కైదువులు = ఆయుధములను. ఇడుట = ఉంచుట. కేశచర్మ ఆవృతసంచయంబుగన్ = వెంట్రుకలతోను తోళ్లతోను కప్పఁబడినకట్టగా. శవఆకృతిగాన్ = పీనుఁగువలె. మనముదీనియందాయుధములను వెంట్రుకలతోనుచర్మములతోనుజుట్టి శవాకారముగాఁగట్టియుంచినయెడ దీనియొద్దకెవ్వరునుబోరు. మనమెచ్చటనున్నను మరల వచ్చి దీనిందీసి కొనవచ్చునని తా.

165. గాండీవంబు — అర్జునునిధనుస్సు.

( పాండవులు దమ యాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట. )

చ. అనిమిషదానవాంబరచరాదికజాతుల నెల్లఁ బోర నీ
ధనువునఁ గాదె గెల్చితి నుదగ్రవిరోధిభయావహంబు దీ
నిని నొక ప్రామఁ గట్టి చన నిశ్చయముం దగఁ జేసె దైవ మే
మనఁ గల దట్ల కాక యని యాత్మ నలందురి మందచేష్టుఁడై. 167

వ. ఎక్కుడించినఁ బాండవాగ్రజుండు. 168

క. దనుజకులత్రాసకరం, బును రిపుభంజనము రత్నభూషితరూపం
బును గురుదేశాహ్లాదక, మును నగునిజకార్ముకంబు మో పెడలించెన్. 169

వ. తదనంతరంబ భీమనకులసహదేవులదెస గనుంగొని. 170

సీ. సైంధవయక్షుపాంచాలత్రిగర్తుల, దీనన యోర్చితి మానధనుఁడ
సౌరాష్ట్రనాథాదిశత్రులు దీనిచేఁ, గాదె మర్దితు లైరి ఘనభుజుండ
కాళింగపాండ్యమాగధుల నిర్జించుచో, నిదియ కైదువు నీకు విదితయశుఁడ
యని క్రమంబున వార లందఱవిండులు, పెంపెసలార వే ర్వేఱఁ బొగడి

167. అనిమిష...జాతులన్—అనిమిష = దేవతలు, దానవ = రాక్షసులు, అంబరచర = ఆకాశమునఁ దిరుగుగంధర్వులు, ఆదిక=మొదలుగాఁగల, జాతులన్. జాతులను. ఉదగ్ర విరోధిభయ ఆవహంబున్=భయంకరులయిన శత్రువులకు భయము గలిగించుదానిని. ఆత్మన్=మనస్సునందు. అలందురి= దుఃఖించి. మంద చేష్టుఁడై =తగ్గినవ్యాపారము గలవాఁడై, చేష్టలు తగ్గినవాఁడైయనుట. ఈగాండీవము చేతనే దేవతలు మొదలగువారిని జయించితిని. అట్టి దీని నిప్పు డొకచెట్టునకుఁ గట్టి పోవలసినట్లు విధి నిర్ణయించెనే యని దుఃఖించి యని తాత్పర్యము.

168. ఎక్కు = అల్లెత్రాటిని. డించినన్ = వదలఁగా.

169. దనుజకులత్రాసకరంబును = రాక్షసులసమూహమును భయపఱచునదియు. రిపుభంజనమున్ = శత్రువుల నశింపఁజేయునదియు. రత్నభూషిత రూపంబును = రత్నాలచే నలంకరింపఁబడిన యాకారము గలదియును. కురుదేశ ఆహ్లాదకమునున్ = కురుదేశమునకు సంతోషము కలిగించునదియును. నిజకార్ముకంబు మోవు = తన ధనుస్సుయొక్క నారిని. ఎడలించెన్ = వదలించెను. ధర్మరాజు తన ధనుస్సుయొక్క నారిని సడలించె నని తాత్పర్యము. "యేన వీరః కురుక్షేత్ర మభ్యరక్ష త్పరంతపః" అని సంస్కృతము, కావున గురు దేవాహ్లాదక మను పాఠము కవి హృదయము కాదు.

171. మానధనుఁడ = మానమేధనముగాఁ గలవాఁడా! భీమసేనుని సంబోధనము. సైంధవయక్షుపాంచాల త్రిగర్తులన్ = సైంధవుని యక్షులను పాంచాలరాజును త్రిగర్తదేశరాజును. ఓర్చితి = ఓడించితివి. ఘనభుజుండ=గొప్పచేతులు గలవాఁడా! నకులుని సంబోధనము. మర్దితులు = కొట్టఁబడినవారు. విదితయశుఁడ = ప్రసిద్ధమయిన కీర్తిగలవాఁడా! సహదేవుని సంబోధనము. కైదువు= ఆయుధము. పెంపు ఎసలారన్ = గొప్పతనము ప్రకాశించునట్లు. గొనయములు = అల్లెత్రాడులను.

గొనయములు వదల్ప ♦ ననుమతి సేయుడు, వార లట్ల చేసి ♦ తేరఁ జాప
ములును దోనలు వర్మ♦ములు నసిముద్గరా, ద్యాయుధములుఁ గూడ♦నతఁడు గట్టె.

వ. ఇట్లు పూర్వోక్తప్రకారంబునం బొదివి మహోరగంబులం బెట్టి కట్టుచందంబున బంధించి వానిం గొనుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతాదత్తవరుం డగుటం జేసి నిశ్శంకం బయిన యంతఃకరణంబుతోడ శమీవృక్షసమారోహణం బాచరించి.

గీ. బ్రహ్మవిష్ణుమహేశది♦క్పాలచంద్ర, సూర్యవనదేవతాపితృ♦స్తుతు లొనర్చి
దివియుభువియునుజూచిప్రా♦ర్థించియొక్క, విపులశాఖనాయుధములు♦ వ్రేలఁగట్టె.

వ. ఇట్లు గట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి. 174

క. నరునకు నాకును దక్కఁగ, నొరులకు మీరూపు చూప ♦ కున్నతవిషవి
స్ఫురితభుజంగౌఘభయం, కరమూర్తులు దాల్చి యుండఁ ♦ గా వలయుఁ జుఁడీ. 175

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రునెడ ♦ భీషణరోషుఁడు చిత్త మెప్పు డె
ల్లె మద మెత్తునో యతని♦యుగ్రహవృత్తికి లోను గాక మీ

తేరన్ = తేఁగా. చాపములును = ధనుస్సులును. దోనలున్ = అమ్ములపొదులును. వర్మములున్ = కవచములును. అసి ముద్గర ఆది ఆయుధములున్ = కత్తి గుదియ మొదలుగాఁగల యాయుధములును. ధర్మరాజు భీమ నకుల సహదేవులతో మీ ధనుస్సులకుఁగూడ నారి సడలింపుఁడని యాజ్ఞాపించి వా రట్లు చేసి తీసికొని రాఁగా ధర్మరాజు వానిని తక్కిన యాయుధములను జేర్చి కట్టె నని తా.

172. పూర్వ ఉక్త ప్రకారంబునన్ = ముందు చెప్పఁబడిన ప్రకారముగా. పొదివి = కప్పి. మహత్ ఉరగంబులన్ = పెద్దపాములను. అజాతశత్రుండు = ధర్మరాజు. ధర్మదేవతా దత్తవరుండు = ధర్మదేవతచే నియ్యఁబడిన వరముగలవాఁడు. నిశ్శంకంబు = భయములేనిది.

173. బ్రహ్మ...స్తుతులు—బ్రహ్మయొక్కయు విష్ణువుయొక్కయు శివునియొక్కయు దిక్పాలకుల యొక్కయు చంద్రునియొక్కయు సూర్యునియొక్కయు వనదేవతలయొక్కయు పితృదేవతలయొక్కయు స్తోత్రములను. దివియున్ = ఆకాశమును. విపులశాఖన్ = పెద్దకొమ్మయందు. ధర్మరాజు బ్రహ్మాది దేవతా స్తుతు లొనర్చి యొక పెద్దకొమ్మయం దాయుధములు వ్రేలాడఁ గట్టె నని తాత్పర్యము.

174. తదీయ అధి దైవతంబులన్ = ఆయాయుధములయధిష్ఠానదేవతలను.

175. నరునకున్=అర్జునునకు. ఒరులకున్= ఇతరులకు. ఉన్నత విషవిస్ఫురిత భుజంగ ఓఘ భయంకర మూర్తులు = ఎక్కువవిషముచేఁ బ్రకాశించుచున్న సర్పముల సమూహముయొక్క భయమును గలిగించునట్టి యాకారమువంటి యాకారములను. మీరు నాకును అర్జునునకును దప్ప నితరులకు సర్పములుగాఁ గనఁబడవలె నని తాత్పర్యము. పాఠాం:—భుజగభంగిన్ భయంకరమూర్తులు = సర్పములవలె భయంకరమయిన యాకారములను అని యర్థము.

176. ధార్తరాష్ట్రునెడన్ = దుర్యోధనునియందు. భీషణరోషుఁడు= ఎక్కువకోపముగలవాఁడు. ఉగ్రహవృత్తికిన్=కోపముయొక్క వ్యాపారమునకు. లోనుగాక= లోఁబడక. ఏ మెయిన్ ఐనన్ =

రేమియు నైన వంచన వ♦హించి తొలంగుట మత్సమీహితం
బేమఱ కుండఁ గా వలయు ♦ నివ్విషమాబ్దములోన నాతనిన్. 176

వ. అని వేఁడుకొని వృక్షంబు డిగ్గి దానికిఁ బ్రదక్షిణంబుగా వచ్చి ప్రణమిల్లి భీమసేనుదెస మరలి సాంత్వనవచనసమేతంబుగా నతనిఁ గౌఁగిటం జేర్చుకొని యనునయించి తమచేసినవిధంబు తత్ప్రదేశస్థు లయినగోపాలాదిక్షుద్రజనంబులకు మఱువెట్టం దలంచి వారల కభిముఖు లయి పాండునందను లిట్లనిరి. 177

చ. ఇది శతవృద్ధ మాజనని ♦ యిప్పుడు మృత్యువుఁ జెందె నిట్లు చే
యుదుము కులప్రయుక్త మగు ♦ చున్నసనాతనధర్మ మిత్తెఱ
గ దహనకర్మ మొల్ల మది ♦ గానిది గా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధ♦ముం గొనియాడితి మేము నియ్యెడన్. 178

వ. అని యిట్లు పలుమఱుం దెలియఁ బలికి శస్త్రాస్త్రంబులనిక్షేపణంబు నిగూఢంబగుటకు నూఱడిల్లి యచ్చేరువం జచ్చినపసరంబు పడి యున్నం జూచి సహదేవుం బనిచి ధర్మతనయుండు దానిచర్మం బొలిపించి తెప్పించి శీతవాతాతపవర్షపరిహారంబుగా నాయుధంబులకట్టఁ బొదివించి మఱియును దత్సమీపంబున నున్నశుష్కశవంబు నవలోకించి యిది యుంఛవృత్తి నైన మానవుకళేబరంబు

ఎట్లైనను. మత్ సమీహితంబు = నాకోరిక. ఇవ్విషమ అబ్దములోనన్ = ఈకష్టమయిన సంవత్సరమునందు. భీముఁడు దుర్యోధనుని మీఁద మిక్కిలి కోపము గలవాఁడు కాఁబట్టి యెప్పుడైన నొడలెఱుంగక యతనిమీఁదికిఁ బోవఁదలఁచును. మీరు వానికి స్వాధీనులు కాక యుండవలయును, ఎట్లైనను ఈసంవత్సరమంతయు భీముని జాగ్రత్తగాఁ జూచుకొన వలయు నని తాత్పర్యము.

177. ప్రణమిల్లి = నమస్కరించి. సాంత్వన వచన సమేతంబుగాన్ = ఊఱడించు మాటలతోఁ గూడినట్లుగా. అనునయించి = ఊఱడించి. తత్ ప్రదేశవర్తులు = ఆచోటనున్న వారలు. గోపాల ఆదిక్షుద్ర జనంబులకున్ = గొల్లలు మొదలుగాఁగల యల్పజనులకు. మఱువెట్టన్ = మఱుఁగు పఱచుటకు.

178. శతవృద్ధ = నూఱేండ్లముసలిది. జనని = తల్లి. మృత్యువున్ = మరణమును. కుల ప్రయుక్తము = వంశమునందుఁ జేయఁబడినది. సనాతనధర్మము = నిత్యమైనధర్మము. ఇత్తెఱంగు అ = ఇట్టిదే. అది = ఆ దహనకర్మమును. కానిది కాన్ = తగని దానినిగా. మా మొదలిటివారు = మా పూర్వులు. మాతల్లి మిక్కిలి ముసలిది యిపుడు మృతినొందెను. మా పెద్దలు దహింపక యిట్లే శవమును బ్రేలఁ గట్టుట కులాచారముగా నేర్పఱచిరి. కావున మేమును మాతల్లిశవమును చెట్టునకు బ్రేలఁ గట్టితి మని తాత్పర్యము.

179. నిక్షేపణంబు = దాఁచుట. నిగూఢంబు = రహస్యము. శీతవాత ఆతపవర్ష పరిహారంబుగాన్ = చలిగాలియెండవానల తొలఁగించుట యగునట్లుగా. పొదివించి = కప్పించి. శుష్కశవం

గావలయు ననుచు నదియును గైదువులకొట్టపయిం బెట్టి కట్టించె నివ్విధంబున నత్యంతగుప్తి యాచరించి దీనిదుర్గంధంబున వనచరాదు లెవ్వరుం జేర రని న వ్వృచు వార లచ్చోటు వాసి విరాటపురాభిముఖులయి చను చుండి యజ్ఞాతవాసకాలంబునం దమరహస్యవ్యవహారంబునకు ననువుగా నేవుర పేళ్లను గ్రమంబున జయుండును జయంతుండును విజయుండును జయత్సేనుండును జయద్బలుండు నని సంకేతించుకొని యాజ్ఞసేనీపురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు చేసి తదీయస్నానపానంబులఁ బథిశ్రమం బపనయించి దేవర్షిపితృతర్పణమంగళజపహోమాధ్యానాద్యనుష్ఠానంబు లొనరించిరి తదనంతరంబ యక్కాంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుండయి నిర్మలచిత్తంబున ధర్మదేవతం దలంచి యి ట్లనియె.

గీ. తండ్రి నీవు నాకు ♦ దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి ♦ వలయు తెఱఁగు
సమయసముచితముగ ♦ సమకట్టు మయ్య యీ, రాకుమారు లవిధిఁ♦బొకయుండ.

వ. అనుచు ననుజులదెసకు దూర వగచి డగ్గుత్తిక వెట్టి మఱియును. 181

ఉ. అంబరవర్తి వైనఁ గని ♦ యక్షునిచే నగపడ్డవీరిప్రా
ణంబులు మున్ను ని న్నడిగి ♦ నల్వురకు న్నయవిక్రమప్రభా
వంబులు వేఁడికొన్న నతి♦వత్సలభావముఁ బొంది యాదరా
ర్ద్రిం బగుచూడ్కితోఁ బ్రియహి♦తస్థిరభాషల నూఱడింపవే. 182

బుక్ = ఎండినపీనుఁగును. ఉంఛవృత్తి = గింజలేఱుకొనుట జీవనముగాఁగలవాఁడు. అత్యంతగుప్తి= మిక్కిలిరక్షణమును. యాజ్ఞసేనీపురస్సరంబుగాన్ = ద్రౌపదిముందు గలుగునట్లుగా. పుణ్యనదీతీర్థ అవతరణంబు = పవిత్రమయిన యేటిరేవున దిగుటను. పథిశ్రమంబు = దారిబడలికను. అపనయించి= పోఁగొట్టుకొని. ప్రాక్ ముఖుండు = తూర్పుమోముగలవాఁడు.

180. వలయు తెఱఁగున్ = కావలసిన విధమును. సమయసముచితముగన్ = కాలమునకుఁ దగినట్లు. సమకట్టుము= సమకూర్పుము. రాకుమారులు= రాజపుత్త్రులు, పాండవులనుట. అవిధిన్ = కష్టముచేత. నీవు నాకిచ్చిన వరము చొప్పున మాకుఁ గష్టము కలుగకుండునట్లు ఈసమయమునకుఁ దగిన యుపాయమును సమకూర్పు మని తా.

181. అనుజులదెసకున్ = తమ్ములయవస్థకు. దూర = మిక్కిలి.

182. అంబర వర్తివి ఐనన్= ఆకాశమునందున్న వాఁడవైనప్పుడు. నయవిక్రమ ప్రభావంబులు= నీతియుఁ బరాక్రమమును మహిమయును. అతివత్సలభావమున్ = మిక్కిలిప్రేమ గలిగియుండుటను. ఆదరఆర్ద్రింబు= ప్రీతిచేఁదడిసినది. ప్రియహితస్థిరభాషలన్ = సంతోషకరములును మేలుగలిగించునవియు స్థిరములునగు మాటలచేత. తొల్లి నీవు ఆకాశమునం బొడచూపినప్పుడు యక్షునిచే మృతినొందిన నాతమ్ముల ప్రాణముల నిన్ను వేఁడఁగానీవు ప్రీతితో నాతమ్ముల బ్రదికించినన్నాదరించితి వని తా. ధర్మదేవతయే యక్షుఁడని యేర్పడినను మొదటయక్షుఁడే భీమసేనాదులప్రాణముల హరించె నని ధర్మరాజు

వ. అని వారు మున్ను భూసురవరునరణిఁ దేర నరిగిననాఁడు సరోవరతీరంబునఁ దమకు ధర్ముండు చేసినమన్నన దోఁప విన్నవించినవారలై కరకమలంబులు మొగిచి ఫాలభాగంబునం గదియించి సంప్రార్థనంబు గా వినయవినమితమస్తకుం డగుటయుఁ దదనుగ్రహంబునఁ బాండవాగ్రజునకు నున్నయునికిన సన్న్యాసిరూపం బలవడి ధాతుపటదండకమండలుకలితమూర్తి యయ్యె నయ్యవసరంబున వార లందఱు మహాద్భుతం బంద వారివారికి నయ్యైవేషంబుల కనుగుణంబు లగునం బరాభరణమాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబు లయినం జూచి సంతసిల్లి యెల్లవారిం గలయం గనుంగొని క్రమంబున నొంటిమెయిం జనుదెం డని నియోగించి యతండు నానావిధంబులైనయక్షంబులముడి కక్షంబున నిడికొని దైవయోగంబున విరాటుండు వెడలి వచ్చి బయలికొలు విచ్చుటం జేసి తదాస్థానంబు చేరం జనునప్పుడు. 183

( ధర్మరాజు సన్న్యాసివేషమున విరటుఁ గొల్వ వచ్చుట. )

ఉ. దవ్వులఁ జూచి మత్స్యవసు♦ధాపతి యీ చనుదెంచుచున్నవాఁ
డెవ్వఁడొ నాదుచూడ్కులకు ♦ నెంతయు వ్రేఁగయి తోఁచె నిట్టితం
డెవ్విధిఁ బొందెనో జగము ♦ లెల్లను నేలఁ గఁ జాలు తేజ మా
మువ్వురతోడ జో డగుసు♦మూర్తి యతీంద్రునియొప్పు గంటిరే. 184

తలఁచినాఁడు కావున నాతలఁపు చొప్పున నిప్పుడు భేదముగాఁ జెప్పఁబడినది. పాఠాం:—యక్షతిన్ = యక్షుఁడవగుటచేత; నీకున్. నీవు యక్షరూపమున ఆకాశమునందుఁ గనఁబడఁగా నీచే మృతినొందిన నాతమ్ములప్రాణముల అని తా.

183. భూసురవరు అరణి = బ్రాహ్మణశ్రేష్ఠుని యరణిని, అరణియనఁగా నిప్పుచిలుకు జమ్మికొయ్య. ఫాలభాగంబునన్ = నుదుటిప్రోటియందు. వినయవినమితమస్తకుండు = అడఁకువచే వంపఁబడిన శిరస్సుగలవాఁడు. ధాతుపటదండకమండలుకలితమూర్తి = కావివస్త్రముతోను దండముతోను గమండలువుతోను గూడినరూపము. అనుగుణంబులు = తగినవి. అంబర ఆభరణ మాల్య ఆది ఉపకరణంబులు = వస్త్రము సొమ్ము పూదండ మొదలుగాఁగల సాధనములు. ఒంటిమెయిన్ = ఒంటరితనముచేత. నియోగించి = ఆజ్ఞాపించి. అక్షంబులముడి = పాచికలమూటను. కక్షంబునన్ = చంకయందు. తత్ ఆస్థానంబు = ఆ విరాటునిసభను.

184. మత్స్యవసుధాపతి = విరాటరాజు. వ్రేఁగు అయి = భారమై. ఎవ్విధిన్ = ఏవిధముచేత. చాలు తేజము = చాలిన తేజస్సును. ఆమువ్వురతోడన్ = ప్రసిద్ధులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులతో. జోడు = ఈడు. అగు సుమూర్తి = అయిన మంచిదేహమును; ఇట్టు పొందెనో యని యన్వయము. యతీంద్రుని ఒప్పు = సన్న్యాసిశ్రేష్ఠుని చక్కఁదనమును. విరాటుఁడు ధర్మరాజు వచ్చుటను దూరమునందే చూచి యిట్లనియె. ఈవచ్చువాఁడెవ్వఁడో మహాపురుషుఁడుగా నున్నాఁడు. ఇతని తేజస్సును ఆకారమును జూడఁగా లోకముల నన్నిటిని బాలింపఁ జాలినవాఁడుగాను బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో సమానుఁడుగాను గనఁబడుచున్నాఁ డని తా.

సీ. కరచరణాద్యంగ♦కమ్ము లేలొకొ రత్న, భూషణప్రకరంబు♦పొందు దొఱఁగ
నుభయపార్శ్వంబుల ♦ నిభఘట లేలొకొ, చనుదేవు సమదాళి♦సమితి మొరయఁ
బాయు తొలంగు మం ♦ చాయతవేత్రహ, స్తులమొత్త మేలొకొ ♦ తోడరాదు
ధవళాతపత్రము ♦ ల్తఱుచుగా నేలొకొ, పట్టరు మౌక్తిక♦ప్రభలు వెలుఁగ
నితఁడు రా జగు రా జను♦నింతమాత్ర, గాదు మూర్ధాభిషిక్తవ♦ర్గంబు దనదు
చరణయుగ్మంబు గొలిపింపఁ ♦ జాలుసార్వ, భౌమపదవికిఁ దగియెడు♦భంగివాఁడు.

క. మనకడకు నేమిటికి వ, చ్చె నొకొ యే నిమ్మహాత్ము♦చెప్పినపను లె
ల్లను జేయువాఁడఁ గోరిన, కనకాంబరమణులు తలఁపు ♦ గడవఁగ నిత్తున్. 186

గీ. మత్స్యవిషయరాజ్య♦మహిమకు యుక్తుండు, గాఁగఁ దలఁచె నేని ♦ గారవమున
నట్ల చేసి భక్తి ♦ ననుసరింతు నమాత్య, సుతసుహృద్భటాద్య ♦ యుతము గాఁగ.

వ. అని సమస్తజనంబులుఁ దదభిముఖులై భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు చేయఁ దా
నును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరించి యతనియాశీర్వాదంబులు వైకొ

185. కరచరణ ఆది అంగకమ్ములు = చేతులు పాదములు మొదలుగాఁగల యవయవములు. రత్నభూషణ ప్రకరంబుపొందు = రత్నాలసొమ్ముల సమూహముయొక్క పొందుటను. తొఱఁగన్ = విడచెను. ఉభయపార్శ్వంబులన్ = రెండుప్రక్కలయందును. ఇభఘటలు = ఏనుఁగులగుంపులు. సమదఅళిసమితి = మదముతోఁ గూడిన తుమ్మెదల సమూహము. చనుదేవు = రావు. పాయు = పాము. ఆయతవేత్ర హస్తుల మొత్తము = పొడువులయిన పేములుచేతియందుఁ గలవారిసమూహము. ధవళ ఆతపత్రముల్ = వెల్లగొడుగులు. మౌక్తికప్రభలు = ముత్యాలకాంతలు. రాజు అను ఇంతమాత్ర = రాజుఅనుటమాత్రమే. మూర్ధభిషిక్తవర్గంబున్ = పట్టాభిషిక్తుల సమూహమును. కొలిపింపన్ = కొలుచునట్లు చేయుటకు. చాలు సార్వభౌమపదవికిన్ = చాలినట్టి చక్రవర్తియొక్క స్థానమునకు. తగియెడు భంగివాఁడు = తగిన విధముగలవాఁడు. ఇతఁడు రాజ సామాన్యుఁడుగాఁడు. ఎల్లరాజులును నమస్కరించు పాదములుగల చక్రవర్తిగానుండుటకుఁ దగినవాఁడని తా. పాఠాం:—సార్వభౌమపదవికిన్—ఈపాఠమునం దేకదేశాన్వయాదోషము.

186. కనకఅంబరమణులు = బంగారమును వస్త్రమును రత్నములను. తలంపు = కోరిక. కడవఁగన్ = మీఱునట్లు. ఇతఁడుమనయొద్ద కేలవచ్చుచున్నాఁడో తెలియదు. నేను ఈతఁడు చెప్పినపనులుచేసి కోరినవస్తువుల నిత్తు నని తా.

187. మత్స్యవిషయరాజ్యమహిమకున్ = మత్స్యదేశము యొక్క దొరతనము అను గొప్పతనమునకు. యుక్తుండు = పూనినవాఁడు. అమాత్యసుతసుహృత్ భట ఆద్యయుతము గాఁగన్ = మంత్రులు కొడుకులు మిత్రులు భటులు మొదలగువారితోఁ గూడినట్లుగా; అనుసరింతున్ అని యన్వయము. ఇతఁడు మత్స్యదేశము నడిగినను ఇచ్చి నేను మంత్రులు మొదలగువారితో నీతని సేవింతు నని తా.

188. తత్ అభిముఖులు = వానికెదురైనమోముగలవారు. ప్రత్యుత్థానంబు = ఎదురుకొలుపు. సమం

ని సగౌరవంబుగాఁ దోడుకొని చనుదెంచి సముంచితసమున్నతాసనంబున నునిచి వినయావనతుండై. 188

ఉ. ఎయ్యది జన్మభూమి కుల ♦ మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు ♦ నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నింతయును ♦ నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్నరూ
పయ్యెడు నావుడు న్నరవ♦రాగ్రణి కయ్యతిముఖ్యుఁ డి ట్లనున్. 189

గీ. ఉన్నరూప పలుకు♦నన్నరు లెక్కుడఁ, గలరు తోఁచినట్లు ♦ పలుకు పలుక
నైనచంద మయ్యె ♦ నంతియు కా కంత, పట్టి చూడఁ గలరె ♦ యెట్టివారు.190

వ. అని మందహాసంబు చేయుచు మఱియును. 191

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము ♦ మేకొని నిక్కం
బేనరునకుఁ జెల్లింపం, గా నగు సత్యంబు నడపు♦క్రమ మ ట్లుండెన్. 192

వ. అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి, 193

క. ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ, సుజనప్రియుఁ డైనధర్మ♦సుతుసఖుఁడఁ బరి

చితసమున్నత ఆసనంబునన్ = చక్కని యెత్తుపీటయందు. వినయ అవనతుండై = అడఁకువచేవంగినవాఁడు.

189. జన్మభూమి = పుట్టినచోటు. కతంబు = కారణము. ఉన్నరూపు = ఉన్నవిధము. నర వర అగ్రణికిన్ = రాజశ్రేష్ఠుఁడయిన విరాటునితో. అయ్యతిముఖ్యుఁడు = ఆసన్న్యాసిశ్రేష్ఠుఁడగు ధర్మరాజు. విరాటుఁడు ధర్మరాజుయొక్క జన్మభూమిమొదలగువానిని యథార్థముగాఁ జెప్పుమనియడుగఁగా నాధర్మరాజు విరాటునితో నిట్లుచెప్పె నని తా.

190. ఉన్నరూపు అ = యథార్థమునే. నరులు = మనుష్యులు. పలుకు=మాటను. వినచందము= అయినవిధము. యథార్థమే చెప్పువారుండరు. తోఁచినట్లు చెప్పినయెడ నెట్లు కావలెనోయట్లగును గాని యెవ్వరును నంతగా విచారింప రా దని తా.

191. మందహాసంబు = చిఱునవ్వును.

192. నానావిధ భూతమయము = పలువిధములగు భూతములచేఁ గలిగినది, పంచమహాభూతములచేఁ గలిగిన దనుట. మేను = శరీరము. మనము = మనస్సు. అతిచంచలము. మేకొని = పూని. నిక్కంబు = నిజమును. చెల్లింపంగాన్ = నడపుట. పృథివ్యాది పంచ మహాభూత మయమయినది దేహము. మిక్కిలి చంచలము మనస్సు. కావున సత్యము చెప్పువాఁడు దుర్లభుఁడు అని తా.

194. ద్విజుఁడన్ = బ్రాహ్మణుఁడను, క్షత్త్రియుఁడ నని యాంతరంగి కార్థము. కురువిషయజాతుఁడన్ = కురుదేశమునఁ బుట్టినవాఁడను. సుజనప్రియుఁడు=సత్పురుషుల కిష్టుఁడు. ధర్మ సుతుసఖుఁడన్=ధర్మపుత్త్రునికిఁ జెలికాఁడను, తనకుఁదాను జెలికాఁడే కావున దానే ధర్మరాజని యాంతరంగి

ప్రజనాశ్రమకలితుండ నమ, నుజవల్లభయోగ్యబహువి♦నోదపరుండన్. 194

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నోర్వ♦నిజనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరి, భూతి యొనర్చిన విరక్తి ♦ పోడమి వెడలితిన్. 195

చ. నృప నయవిద్యకుం దగిన♦నేర్పలవడ్డది గొంత నాకు ధ
ర్మపరులసంగతిం దగిలి ♦ మచ్చిక నుండుదుఁ బేరు కంకుఁ డే
వపుఁగొలు వైన నాకు నిలు♦వ న్మది గొల్పదు గాన నిన్ను భూ
మిపతులలోన సాధుజన♦మిత్త్రుఁడు నా విని కొల్వ వచ్చితిన్. 196

గీ. వత్సరంబునఁ గడచను♦వ్రతము నాకు, దాని నీపాల సల్పి యు♦త్సాహవృత్తి
మెఱయ నీకుఁ గృతజ్ఞత ♦ నెఱపి తొల్లి, యెగ్గు చేసినవారి జ♦యింపఁ బోదు.

వ. అనిన విని సంప్రీతచేతస్కుం డగుచు విరాటుం డతని కిట్లనియె. 198

గీ. అట్లు చేయుఁడు రుచిరోన్న♦తాసనములు, వాహనములు భోజనములు♦వస్త్రములును

కార్థము. పరివ్రజనఆశ్రమ కలితుండన్=సన్న్యాసాశ్రమమునుపొందినవాఁడను. మనుజవల్లభ యోగ్య బహు వినోదపరుండన్= రాజులకుఁ దగిన పెక్కు వేడుకలు ప్రధానముగాఁగలవాఁడను, పెక్కు వేడుకలు చేయువాఁడ ననుట.

195. ద్యూతక్రీడకున్= జూదముఅనునాటకు. కొండొక = కొంచెము. నేతున్ = నేర్తును, నేర్చుధాతువు తదర్థార్థ కోత్తమ పురుషైకవచనము. పరిభూతి = అవమానమును. పాఠాం:—ఒవ్వని జనంబులు=కిట్టనివారని యర్థము. జూదమాడుటకుఁ గొంచెము నేర్పు గలదు. సరిపడనివారు కపటముచే సాధనముం గొని యవమానము సేయఁగా విసుగుచే నందుండి వెడలి వచ్చితి నని తా.

196. నృప=రాజా! విరాటుని సంబోధనము. నయవిద్యకున్=నీతి శాస్త్రమునకు. అలవడ్డది= సిద్ధించినది. ధర్మపరులసంగతిన్ = ధర్మమునం దాసక్తిగలవారి కూడికయందు. మచ్చికన్ = స్నేహముతో. ఏవపు కొలువు = నీచమయిన పని. మది = మనస్సు. కొల్పదు=ఇష్టపడదు. సాధుజన మిత్త్రుఁడు = సజ్జనులకుఁ జెలికాఁడు. రాజా! నాకు రాజనీతియుఁ గొంచెము తెలియును. ధర్మ పరుల సహవాసము చేసినవాఁడను, నాపేరు కంకుఁడు, నీచకార్యములు చేయఁజాలను, రాజులలో నీవు మంచివాఁడ వని విని నిన్నుఁ గొలువ వచ్చితి నని తా.

197. కడచనువ్రతము = ముగియువ్రతము. నాకున్. కలదని యధ్యాహార్యము. సల్పి = జరపి. ఉత్సాహవృత్తి = ఉత్సాహమనువ్యాపారము. నెఱపి = చేసి. నాకొకసంవత్సరము వ్రతము కలదు, దాని నీయొద్ద నెఱవేర్చుకొని నీకు ప్రత్యుపకారముచేసి యటువెనుకఁ బూర్వము నాక పకారము చేసినవారిని జయించుటకుఁ బోవుదునని తా. పాఠాం:—నాకుఁ గృతఘ్నత నెఱపి— నాకుఁ గృతఘ్నులై యపకారము చేసిన వారిని...అని యర్థము.

198. సంప్రీతచేతస్కుండు = మిక్కిలిసంతోషించిన మనస్సుగలవాఁడు.

199. రుచిర ఉన్నత ఆసనములన్ = చక్కని యుత్తమములయిన గద్దియలును. ఎల్లవర్తనము

వలయుభోగంబులును నెల్ల ♦ వర్తనములు, నాకు నెట్లట్ల మీకును ♦ నడపువాఁడ.

క. నాయనుచరులం దెవ్వఁడు, మీయెడ భయభక్తి లేక ♦ మిగిలి మెలఁగె నే
నాయుధమున దండింతుఁ గాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్ర♦సిద్ధుం డైనన్.

వ. అట్లుం గాక. 201

చ. వెలయఁగ మత్స్యరాజ్యపద♦వీపరిపాలన చేయఁ గా మదిం
దలఁచుట యెంతయుం బ్రియము ♦ తమ్ములుఁ బుత్రులు బంధులుం బ్రధా
నులును బలంబు నేను సుమ♦నోవిభుతుల్యుఁడ వైననిన్ను మి
క్కిలి యనుభక్తిఁ గొల్చి కృత♦కృత్యత నొందుదు మట్లు చేయవే. 202

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె. 203

క. ఏను హవిష్యము గుడుతును, భూనాయక నాకు శయ్య ♦ భూమియ యిమ్మైఁ
బూని వ్రతంబులు సలిపెద, వానికి నిన్నియును నిట్లు ♦ వలయునె చెప్పుమా.

గీ. అనిన విరటుఁ డిట్టు ♦ లనియె నెత్తెఱఁగున, నడవ నిష్ట మట్లు ♦ నడచి మీకు
మనసు వచ్చునన్ని ♦ దినములు గడపుఁ డి, చ్చోట నదియ మాకు ♦ శోభనంబు.

క. ద్యూతజ్ఞులదెసఁ గొండొక, ప్రీతియుఁ గల దట్లు గాక ♦ పెద్దల రగుమీ

లున్ = ఎల్లనడవడులును. మీయిష్టముచొప్పునఁ జేయుఁడు, నాకెట్లో యట్లే మీకును సమస్తభోగములును నడపువాఁడ నని తా.

200. అనుచరులందున్ = సేవకులయందు. భయభక్తి — సమాహారద్వంద్వసమాసము. మిగిలి = మీఱి. నా సేవకులలో నెవ్వఁడైనను మీయాజ్ఞమీఱినయెడ వాఁ డెంత గొప్పవాఁడైనను వానిం దండింతు నని తా.

202. మత్స్యరాజ్యపదవీపరిపాలన = మత్స్యదేశపు దొరతనముయొక్క మార్గముయొక్క యేలుటను. ప్రియము = ఇష్టము. ప్రధానులును = మంత్రులును. బలంబున్ = సేనయును. సుమనోవిభుతుల్యుఁడవు = దేవేంద్రునితో సమానుఁడవు. నీవు మత్స్యరాజ్యమునంతయుఁ బరిపాలింపఁ దలంపు గలిగినయెడ నీవట్లు చేయుట నాకు మిక్కిలియిష్టము, నేనును నావారును నిన్నుఁ గొలిచి కృతార్థుల మయ్యెద మని తా.

203. దరహసితవదనుండు = చిఱునవ్వుగల మోముగలవాఁడు.

204. హవిష్యము అ = ఇగురఁబెట్టిన యన్నమునే. ఇమ్మైన్ = ఈవిధమున. నేను వ్రతము పట్టి యున్నాఁడను కావున హవిస్సు భుజియించి నేలమీఁద నే శయనింతును, రాజ్యసుఖములు నాకు వల దని తా.

205. అనినన్ — అనిధర్మరాజుచెప్పఁగా. ఎత్తెఱఁగునన్ = ఏవిధమున. ధర్మరాజుమాటవిని విరాటరాజు చెప్పెను, మీయిష్టప్రకారముతోఁచినన్ని దినములు మాయింట వసింపుఁడు, అదియే మాకు మేలని తా.

206. ద్యూతజ్ఞులదెసన్ = జూదమునెఱింగినవారియందు. కొండొక = కొంచెము. చేతోమోదంబు = మనస్సంతోషము. అగును అని క్రియయధ్యాహార్యము. నెమ్మిన్ = ప్రీతితో. నాకు

రే తెఱఁగున విహరించినఁ, జేతోమోదంబు తగ వసింపఁడు నెమ్మిన్. 206

వ. అని పలికి కౌంతేయాగ్రజు నత్యంతసంతుష్టాంతరంగుం జేసి. 207

చ. పొరిఁబొరిఁ బ్రీతికిం దగ నపూర్వవిలోకన మాచరించుఁ ద
త్పర మగుసద్వివేకమున భావనిరూపణ చేయుఁ గౌతుక
స్ఫురణఁ గరంబుఁ దత్కరముఁ బొంద నయంబునఁ జేర్చు వాక్యవి
స్తరచతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితోన్. 208

వ. ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిసికొని పరివారంబును దానును దదీయ
సంభావనాతత్పరుండై యుండె నంత. 209

( భీముఁడు వంటలవాఁడై విరటుఁ గొల్వ వచ్చుట. )

సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ, దగిలించి సురియతో బిగియ దిండు
గట్టిననుఁజేలక ప్పొంతయును జెన్నుఁ, జేయఁగ డాపలి చేతియందు

జూదము నెఱింగినవారి మీఁదఁ గొంచెము ప్రీతియుఁ గలదు. అట్లుకాకపోయినను పెద్దలగుమీరు మీమనస్సు వచ్చినవిధమున విహరింపవచ్చు నని తా.

207. అత్యంతసంతుష్ట అంతరంగున్ = మిక్కిలిసంతోషించిన మనస్సుగలవానిని.

208. పొరిన్ పొరిన్ = మాటిమాటికి. అపూర్వవిలోకనము = క్రొత్తగాఁ జూచుటను. ఆచరించున్ = చేయును. తత్పరము = ఆసక్తము. సత్ వివేకమునన్ = మేలి తెలివిచేత. భావనిరూపణ = అభిప్రాయముయొక్క నిశ్చయమును. కౌతుకస్ఫురణన్ = కౌతుకముయొక్క యతిశయముచేత. కరంబున్ = చేతిని. తత్ కరమున్ = ఆధర్మరాజుచేతిని. నయంబునన్ = ప్రీతితో. వాక్యవిస్తరచతురత్వము = మాటలవిరివి యందలినేర్పు. ఏర్పడఁగన్ = తేటపడునట్లు. అర్థితోన్ = ప్రీతితో. సల్లపనంబు= ముచ్చటను. ఒనరించున్ అని యన్వయము. విరాటుఁడు ధర్మరాజును మాటిమాటికి మిక్కిలి యాశ్చర్యముతోఁ జూచుచుండెననియు, ధర్మరాజు మాటలయందు జాగ్రత్తతో నభిప్రాయము గ్రహించుచుండె ననియుఁ, బ్రీతిచేఁ దనచేతితో ధర్మరాజు చేతిని పట్టుచుండె ననియు, నానావిధములుగా ముచ్చటలాడుచుండెననియుఁ దా. పాఠాం:— ప్రీతిరెట్టిగన్ = ప్రీతిరెండింతలగునట్లుగా నని యర్థము.

209. తదీయ సంభావనా తత్పరుండై = ఆధర్మరాజునైన గౌరవించుటయందు దాసక్తి గలవారై. ఇచట ఆత్మార్థక మగు తానుశబ్ద మేకవచనాంతమగుటచే విశేషణమునకును క్రియాపదమునకును నేకవచనము, "ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయివచనంబు ధాతువిశేషణంబుల కగు" అనిబాలవ్యాకరణము. కావున తత్పరులైయుండిరంత అను బహువచనాంత పాఠము అసాధువు.

210. చట్టువంబు= గరిటెను. ఖడ్గము= కత్తిని. సురియతోన్= చురకత్తితో. బిగియన్= బిగువుగా. దిండు=దట్టి. కట్టిననుఁ జేలకప్పు=ధరించిన మృదువైన వస్త్రముయొక్కనలుపు. చెన్ను= అందమును. డాపలి చేతియందున్=ఎడమచేతియందు. బెడిదంపుఁ గోలలు=భయంకరము లగుకట్టెలు.

బెడిదంపుఁగోలలు ♦ బెడఁ గొందీ బహువర్ణ, చిత్రితాజినము పై♦చీర గాఁగఁ
జూపఱు లెల్లను ♦ జూడ్కికి రూపంబు, ప్రేఁగైన నత్యంత♦విస్మయంబుఁ
బొందు చుండ సమీరణ♦పుత్త్రుఁ డగ్ర, జుండు పోయినదెస దప్ప ♦ నొండువలన
సమదవారణపతిగమ♦నమున మత్స్య, ధరణినాయకు సభ చేర ♦ నరుగుటయును.

వ. అంతంతం గనుంగొని. 211

క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనముతోడ ♦ ధాత్రీరమణుం
డలఘుభుజవిపులవక్షః, స్థలరేఖాకాంతిఁ బరవ♦శత్వముఁ బొందెన్. 212

వ. ఇట్లతనిరూపాతిశయంబునకు నోటువడి చూచుచు నిజాంతర్గతంబున. 213

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ ♦ జనుదెంచినప
ద్మహితుఁడో హిమకరుఁడో శచీ, గృహమేధియొ కాక యితఁడు ♦ కేవలనరుఁడే.

బెడఁగు ఒందన్=ప్రకాశింపఁగా. బహువర్ణ చిత్రిత అజినము= పలువన్నెలచేఁ జిత్రముగలదైనతోలు. పైచీర = ఉత్తరీయము. చూపఱులు= చూచువారు. రూపంబు = ఆకారము. ప్రేఁగు = దుస్సహము. అత్యంత విస్మయంబున్ = మిక్కిలియాశ్చర్యమును. సమీరణపుత్త్రుఁడు = వాయువు కొడుకయిన భీముఁడు. అగ్రజుండు = అన్న, ధర్మరాజు. ఒండువలనన్ = వేఱుదిక్కునుండి. సమదవారణపతిగమనమునన్ = మదముతోఁ గూడిన గజశ్రేష్ఠముయొక్క నడకవంటి నడకచేత. మత్స్యధరణినాయకుసభ = విరాటరాజు సభను. భీముఁడు కుడిచేత గరిటెను ఎడమచేతఁ గట్టెలను జంకయందుఁ గత్తిని ధరించి నల్లవస్త్రమును చుఱుకత్తితోఁజేర్చి దట్టి గట్టి నానావర్ణములుగల చర్మము ఉత్తరీయముగా ధరించి ధర్మరాజు పోయినమార్గము తప్పించి వేఱుమార్గమున జనులు తనయాకారమును జూచి యాశ్చర్యపడుచుండఁగాఁ మదపుటేనుఁగువలె నడచుచు విరాటరాజు సభకుఁ బోవుచుండఁగా నని తా.

211. అంతంతన్ = కొంచెముదూరమున.

212. ఉలుకును = భయమును. వెక్కసపాటును = దుస్సహత్వమును. తలకొను నెమ్మనముతోడన్ = కలుగునట్టి నిండుమనస్సుతో. ధాత్రీరమణుండు = విరాటరాజు. అలఘు...కాంతిన్– అలఘు = గొప్పవైన, భుజ = చేతులయొక్కయు, విపుల = వెడలుపయిన, వక్షః స్థల = ఱొమ్ము ప్రదేశముయొక్కయు, రేఖా = లక్షణములయొక్కయు, కాంతిన్ – అతిశయముచేత. పరవశత్వమున్ = పరాధీనుఁ డగుటను. విరాటుఁడు భీముని చేతులను ఱొమ్మును లక్షణములను జూచి భయము నొంది పరవశుఁ డయ్యె నని తా.

213. రూప అతిశయంబునకున్ = ఆకారముయొక్క గొప్పతనమునకు. ఓటుపడి = భయపడి. నిజ అంతర్గతంబునన్–తన మనస్సులో.

214. విహరింపన్=తిరుగుటకు. మానవ ఆకృతి సహితంబుగన్=మానవరూపముతోఁ గూడినట్లుగా. మహికిన్=భూమికి. పద్మహితుఁడు ఒ=సూర్యుఁడో. హిమకరుఁడుఒ=చంద్రుఁడో. శచీగృహమేధి ఒ = ఇంద్రుఁడో. ఇతఁడు భూమిమీఁద విహరించుటకై మనుష్యరూపముతోవచ్చిన సూర్యుఁడు మొదలగుదేవతలలో నొకఁడుగా నుండవలెనుగాని సామాన్యమనుష్యుఁడు కాఁ డని తా.

క. ఏమికులంబునవాఁడొకొ, నామం బెద్ది యగు నొక్కొ ♦ నాభృత్యులలో
నీమనుజోత్తముఁ దొల్లియు, నే మెఱుఁగుదు మనఁగ నిచట ♦ నెవ్వరు గలరో. 215

క. అను చుండ ననతిదూరం, బున కల్లన వచ్చి పవన♦పుత్త్రుఁడు మనుజేం
ద్రునకు జయశబ్దయుతము గ, వినయంబున మ్రొక్కి విన్న♦వించెం బ్రీతిన్. 216

శా. దేవా నాలవజాతివాఁడ నిను న♦ర్థిం గొల్వఁ గా వచ్చితిన్
సేవాదక్షత యొండుమై నెఱుఁగ నీ♦చిత్తంబున న్మెచ్చున
ట్లే వండం గడు నేర్తుఁ బానసమునం ♦ దిచ్చోటనే కాదు న
న్నేవీట న్నిగులంగ నెవ్వఁడును లేఁ ♦ డేభంగులం జూచినన్. 217

క. పేరు వలలుండు గూడుం, జీరయు నిడి సాకతంబు ♦ చేసినఁ జాలుం
గోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు ♦ నిశ్చలభక్తిన్. 218

చ. అనవుడు మత్స్యభూరమణుఁ ♦ డాతని కిట్లను నెట్లు శూద్రుఁ గా
నినుఁ దలఁపంగ వచ్చు ధర♦ణీభరణక్షమమూర్తి నీవు నీ

215. ఈమనుజ ఉత్తముఁన్ = ఈమనుష్యశ్రేష్ఠుని. వీనికులమును పేరును నెవ్వి? వీని నెఱింగిన వారు నాభృత్యులలో నెవ్వరైన నున్నారా యని తా.

216. అనతిదూరంబునకున్ = మిక్కిలిదూరముకానిచోటికి, దగ్గఱకనుట. పవనపుత్త్రుఁడు = భీముఁడు. జయశబ్దయుతముగన్ = జయయను శబ్దముతోఁ గూడునట్లుగా. ఇట్లు విరాటుఁడు తలంచుచుండఁగా భీముఁడు సమీపంబునకు వచ్చి జయ యని చెప్పి నమస్కరించి యిట్లని మనవిచేసె నని తా. పాఠాం:—విన్నవించె నిభృతుఁడై—నిభృతుఁడై—నిశ్చలుఁడై యని యర్థము.

217. దేవా = రాజా! నాలవజాతివాఁడన్—శూద్రుఁడ ననుట, లక్షణచే శూద్రునికార్యము చేయువాఁడ నని యాంతరంగికార్థము. అర్థిన్ = ప్రీతితో. సేవాదక్షత = కొలువునందలి నేర్పును. ఒండుమైన్ = మఱియొకవిధమున. నీచిత్తంబునన్ = నీమనస్సునందు. బానసమునందున్ = వంటయందు. ఏవీటన్ = ఏపట్టణమునందును. రాజా నేను శూద్రుఁడను, నిన్నుఁ గొలుచుట కిచ్చటికి వచ్చితిని, వంటతప్ప మఱియొకకొలువు నాకుఁ దెలియదు. వంట చేయుటయందు నాయంతటి సమర్థుఁడు ఏచోటను లేఁ డని తా.

218. సాకతంబు = అనుగ్రహము. నేరిమిన్ = నేర్పును. నెఱపి = చూపి. నాపేరు వలలుఁడు, నాకన్నవస్త్రము లిచ్చినం జాలును, నీకోరినట్లు వంటచేయుచు భక్తితోఁ గొలుతు నని తా.

219. ధరణీభరణక్షమమూర్తివి = భూమినేలుటకు సమర్థమయిన రూపముగలవాఁడవు. అనుగుణము = తగినది, యానమునున్ = వాహనమును. రుచిరఆతపత్రమున్ = చక్కనిగొడుగును. చనుపరి = తగినసైన్యమును. గజవ్రజమున్ = ఏనుఁగుల సమూహమును. పెంపుతోన్ = గొప్పతనముతో. పరికింపు = చూడుము. భీమునిమాటవిని విరాటుఁ డిట్లుచెప్పెను. నీయాకారమును జూడఁగా భూమి నంతయుఁ బాలింపఁ జాలినవాఁడవుగాఁ దోఁచుచున్నాఁడవు కానిశూద్రుఁడవుగాఁ గనఁబడవు, కావున నీకుఁ దగినవాహనము మొదలగువాని నిచ్చెదను, వానిం గ్రహించి యేలు మని తా. పాఠాం:—చనవరి

కనుగుణ మైనయానమును ♦ నాసనమున్ రుచిరాతపత్రముం
జనుపఁగఁ గొల్వు నిచ్చెద గ♦జప్రజమున్ బదికింపు పెంపునన్. 219

క. అనుటయును మొఱకుచందం, బున మో మడ్డము గదల్చి ♦ భూవిభుఁడు సభా
జనములు విన ననిలజుఁ డి, ట్లనియెం బ్రస్ఫుటనిరర్గ♦ళాలాపములన్. 220

ఉ. నా కవి యెల్ల నేల నర♦నాథులకుం బ్రియ మొందునట్లు గాఁ
బాకము సేయ నేర్తు జన♦పాలక ధర్మసుతుండు పెద్దయుం
జేకొని యుండుఁ బానసము ♦ సేయువిధంబున కిచ్చ మెచ్చి పు
ణ్యాకరమూర్తి వైననిను ♦ నాతనిఁ గొల్చినయట్ల కొల్చెదన్. 221

చ. వలసిన నేలు మేను బల♦వంతుఁడఁ గారెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి ♦ పోరుదు శూరత యుల్లసిల్లఁ గాఁ
దళమున లావు విద్య మెయి♦దర్పము పేర్చి పెనంగు జెట్టిమ
ల్లుల విఱుతు న్వడి న్గడియ♦లోనన చూడ్కికి వేడ్క సేయుదున్. 222

క. కొలువు గొను మొల్ల కుంచుట, గలిగినఁ బో మ్మనుట యంత♦కం టెను మే లే

కొల్వున్ = చనవుగలసేవను అని యర్థము. రాజార్హములైన యాతపత్రాదులు చెప్పఁబడి యుండు టచే నీపాఠ మంత ప్రశస్తము కాదు.

220. మొఱకుచందంబునన్ = మూర్ఖునివిధమున. ప్రస్ఫుటనిరర్గళఆలాపములన్ = మిక్కిలిస్పష్టములై యడ్డులేని మాటలచేత. విరాటునిపలుకు విని భీముఁడు మోటుతనముగా ముఖము నడ్డముగ నాడించి యందఱును వినునట్లు గట్టిగా ని ట్లనియె నని తా.

221. నరనాథులకున్ = రాజులకు. ఒందునట్లుగాన్ = కలుగునట్లుగా. పాకము=వంటను. జనపాలక=రాజా! విరాటరాజు సంబోధనము. ధర్మసుతుండు=ధర్మరాజు. పానసము=వంటను. పుణ్యఆకరమూర్తివి = పుణ్యమునకు గని యయినయాకారము గలవాఁడవు. రాజా! నాకవియన్నియు వలదు. రాజులకు సంతోషము గలుగునట్లు వండఁగలను, మున్ను ధర్మరాజు నావంటకు మెచ్చి నన్నుఁ జేరఁ దీసినవాఁడు. అతనిం గొలిచినట్లే నిన్నుఁ గొలుతు నని తా.

222. వలసినన్ = కావలసియున్నయెడ. ఏలుము = పాలింపుము. కారు ఎనుపోతున్ = అడవి దున్నపోతును. దంతిన్ = ఏనుఁగును. మృగనాథునిన్ = సింహమును. తొడరి = ఎదిరించి. శూరత = శౌర్యము. ఉల్లసిల్లఁగాన్ = ప్రకాశింపఁగా. పోరుదున్. అని యన్వయము. దళమునన్ = ఆధిక్యముచేత. లావు =బలమును. మెయిదర్పమున్ = దేహగర్వమును. పేర్చి = అతిశయించి. పెనంగుజెట్టిమల్లులన్ = పోరునట్టి మేలిజెట్టులను. విఱుతున్ = ఓడింతును. నాతోఁ బని యున్నయెడ నన్నుంచుకొనుము. నేను మిక్కిలిబలము గల వాఁడను. అడవి యెనుపోతు మొదలగు మృగములతోను గొప్పజెట్టులతోను పోరి జయించి నీకు వేడ్క కావింతు నని తా.

223. వలసినకడకున్ = ఇచ్చవచ్చినచోటికి. నన్నుంచుకొనియెదో పొమ్మనియెదో నీయభి

వలసినకడ కేఁగెద నీ, తలఁ పెయ్యది యానతిమ్ము ♦ ధరణీనాథా. 223

వ. అనిన విని భూనాథుండు సానునయంబుగా నిట్లనియె. 224

ఉ. ఇమ్మహనీయరూపమున ♦ యేడ్తెఱ గన్గొని నీకు వేడ్క యో
గ్యమ్మగుభంగిఁ జెప్పితిమి ♦ గాని నరోత్తమ యొండు గాదు నీ
వెమ్మెయి నైన నిల్చుటయ ♦ యిష్టము వంటలమేరవాఁడవై
యిమ్ముల నుండు సూదజను ♦ లెల్లను నీ దగుపంపు సేయఁగన్. 225

క. అని హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బల్కి మత్స్య ♦ మనుజాధీశుం
డనిలసుతు నేలె నాతఁడుఁ, దనమనమున నూఱడిల్లెఁ ♦ దదవసరమునన్. 226

(అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వవచ్చుట.)

సీ. కాళ్లయొప్పిద మూఁదు ♦ కట్టనుజ్జ్వలము సే, యంగ సంకుల బాహు ♦ లంద మెడలఁ
గంచుక మంగంబు ♦ కాంతికి మాటుగా, మెడ హేమపట్టిక ♦ మెఱయ కుండ
వదనంబు కొమరు భా ♦ వనఁ జేసి వేఱు గ, నుదటిసొం పలకల ♦ నొదుఁగఁబడఁగ
బవడంపుజొత్తులఁ ♦ జెవులరూ పడఁగంగఁ, బావట తలకట్టు ♦ భంగిఁ గప్ప

ప్రాయమునం జెప్పుము. నేను మఱియెచ్చటికైనం బోయెద నని తా.

224. సానునయంబుగాన్ = ఊఱడించుటతోఁ గూడునట్లుగా.

225. ఇమ్మహనీయరూపమున ఏడ్తెఱ = ఈపూజింపఁదగిన యాకారముయొక్క గొప్పతనమును. యోగ్యమ్ము = తగినది. అగుభంగిన్ = అయినవిధమును. ఒండు = వేఱు. నరఉత్తమ = మనుష్యులయందు శ్రేష్ఠుఁడా! భీమునిసంబోధనము. సూదజనులు = వంటవారు. పంపు = ఆజ్ఞను. ఇమ్ములన్ = సుఖముతో. నీరూపమునకుఁ దగినమాట చెప్పితిమి కాని వేఱుకాను, నీవెట్లైనను నుండుటయే మాయిష్టము. నీయిష్టము చొప్పునవంటవారికి నాయకుఁడవై యుండుమని తా.

226. హర్షఉత్కర్షంబునన్ = సంతోషముయొక్క యతిశయముచేత. ఏలెన్ = ఉంచుకొనెను. తత్ అవసరమునన్ = ఆసమయమునందు. ఇట్లు భీమునితోఁ జెప్పి విరాటుఁడు సంతోషముతో వానినుంచుకొనెను. భీముఁడును సంతోషముతో నచ్చటనుండెను. ఆసమయమునం దని తా.

227. కాళ్ళఒప్పిదము = పాదములయొక్క చక్కఁదనమును. అనుజ్జ్వలము = ప్రకాశింపనిదానిగా. సంకులన్ = శంఖపుగాజులచేత. బాహులు = చేతులు. అందము = చక్కఁదనమును. ఎడలన్ = విడువఁగా. కంచుకము = అంగీ. అంగంబుకాంతికిన్ = దేహముయొక్క కాంతికి. మాటుగాన్ = మఱుఁగుకాఁగా. హేమపట్టికన్ = బంగారు పట్టెడచేత. వదనంబు కొమరు = మోముయొక్క చక్కఁదనము. భావనన్ చేసి = పసుపు మొదలగువాని పూఁతచేత. వేఱు = వేఱువిధము. కన్ = కాఁగా. నుదుటిసొంపు = నెత్తియొక్క చక్కఁదనము. అలకలన్ = ముంగురులచేత. ఒదుఁగఁబడఁగన్ = తొలఁగఁగా. పవడంపుజొత్తులన్ = పగడములయొజ్జఁదనముచేత. చెవులరూపు = చెవులచక్కఁదనము. భంగిన్ = విధమును. మంచు మఱుఁగుపడిన

మంచుమఱుఁగు వడిన♦మార్తాండుఁడును బోలె, నివుఱు గవిసి యున్న♦నిప్పుఁబోలె
వేషధారి యైన♦విష్ణుండుఁ బోలె న, వ్విరటుకొలువు సేర♦నరుఁడు వచ్చె. 227

క. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర♦వాసవసుతుఁ డా
మనుజాధీశునకు సభా, జనులకుఁ దనుఁ జూపి మంద♦సంచారమునన్. 228

వ. మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు దనయొద్దివారలతో ని ట్లనియె. 229

మ. వనితావేషము గల్గి యున్నయది చె♦ల్వం బాఁడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు ని♦ర్దోషత్వమున్ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁడో యొకజగ♦త్పూజ్యుండు క్రీడార్థ మి
ట్లొనరం దాల్చినరూపు గా వలయు మీ♦రూహింపుఁడా యట్లగున్. 230

గీ. అనినఁ బరిజనములు విస్మ♦యంబు గదుర, నిశ్చయము చేసి పలుకంగ♦నేర్పులేక
చూచుచుండఁగ నాసవ్య♦సాచి చేరఁ, జని విరాటనృపాలుతో♦సవినయముగ.

క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు నాట గఱపఁ♦గా నోపుదు వి
ద్వన్నుత మన్నామంబు బృ, హన్నల యేఁ బేడి ననుడు♦నతఁ డి ట్లనియెన్.

మార్తాండుఁడునుపోలెన్ = మంచుకప్పిన సూర్యునివలెను. నివుఱు = బూడిద. కవిసి = కప్పి. నరుఁడు = అర్జునుఁడు. ఆఁడుకట్టు మొదలగునవి తనపురుషరూపమును మాటుపఱచి స్త్రీరూపమును దోఁపఁజేయఁగా నర్జునుఁడు మంచుచేఁ గప్పఁబడిన సూర్యునివలెను, బూడిదచేఁగప్పఁబడిన యగ్నివలెను, మోహినీవేషము ధరించినవిష్ణువువలెను నున్నవాఁడై విరాటునిసభకువచ్చె నని తా.

228. పేడితనమును=నపుంసకత్వమును. వనితారూపంబున్=ఆఁడురూపును. వాసవసుతుఁడు= ఇంద్రునికుమారుఁడయిన యర్జునుఁడు. ఆ మనుజ అధీశునకున్=ఆ విరాటరాజునకును. మందసంచారమునన్=తిన్ననినడకతో. అర్జునుఁడు విరాటునిసభకు వచ్చి తన్నందఱును జూచునట్లు తిన్ననినడకతోనని తా.

230. వనితావేషము = ఆఁడుదాని వేషము. చెల్వంబు = చక్కఁదనము. ఆఁడుచందంబు = ఆఁడుదాని విధము. నిరూపింపన్ = చక్కఁగాఁ జూడఁగా. మహానుభావతయున్= గొప్ప ప్రభావము గలిగినవాఁ డగుటయు. నిర్దోషత్వమున్ = దోషము లేనితనమును. రాజసంబును = గాంభీర్యమును. శోభిల్లెడున్ = ఒప్పుచున్నవి. జగత్ పూజ్యుండు = లోకములచేఁ బూజింపఁదగినవాఁడు. క్రీడా అర్థము = విలాసము కొఱకు. ఒనరన్= ఒప్పునట్లు. దీనివేషము స్త్రీవేషముగా నున్నను చక్కఁగాఁ జూడఁగా మహాపురుషలక్షణములు గలిగి యున్నది. కావున నెవఁడో యొకమహాపురుషుఁడు ఈరూపముతో విహరింపవచ్చి యుండవలయు. మీరును ఆలోచింపుఁడని తా.

231. విస్మయంబు=ఆశ్చర్యము. కదురన్=కలుగఁగా. ఆసవ్యసాచి=ఆయర్జునుఁడు. విరాటునిమాట విని సేవకులేమియుఁ బలుక నేరక చూచుచుండఁగా నర్జునుఁడువిరాటునొద్దకుఁబోయి వినయముతోనని తా.

232. ఓపుదున్ = చాలుదును. విద్వత్ నుత = పండితులచేఁ బొగడఁబడినవాఁడా! విరాటుని సంబోధనము. రాజా! నాపేరు బృహన్నల. నేను పేడిని. పడుచులకు నాట నేర్పఁగలను. నిన్నుఁ గొలుచుటకై వచ్చితి నని చెప్పఁగా విరాటుఁ డిట్లనె నని తా.

ఉ. ఆయతబాహులున్ వెడఁద ♦ లైన సమున్నతవక్షముల్ సరో
జాయితలోచనంబులుఁ బ్ర♦సన్నముఖంబు నుదాత్తరేఖ యుం
గాయజుఁ గ్రేణిసేయు నవఁ ♦ గౌశికు మీఱు ననంగ విభ్రమ
శ్రీయును బెంపునుం గలుగఁ ♦ జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే. 233

శా. మత్కోదండచయంబులోన నొకస♦మ్మానాస్త్రచాపంబు భా
స్వత్కాండంబులు హేమచిత్రితలస♦ద్వర్మంబు నీ కెంతయున్
సత్కారంబున నిచ్చి వాహనపరి♦ష్కారాంకసంభావ్యసం
పత్కల్యాణునిఁ జేసి వైభవము ద♦ర్పంబు న్విజృంభింపఁగన్. 234

క. ఏము నిను మత్స్యరాజ్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ ♦ జేయఁ దలంపం
గా మామనోరథమునకు, నీమాట విరుద్ధ మయ్యె ♦ నిది యెట్లొకో. 235

వ. అనిన విని యమ్మహీపతికి బృహన్నల యిట్లనియె. 236

233. ఆయత బాహులున్ = దీర్ఘములైన చేతులును. వెడఁద = విశాలము. సమున్నత వక్షముల్ = మిక్కిలి యెత్తైన ఱొమ్మును. సరోజాయిత లోచనంబులున్ = కమలమువంటి కన్నులును. ప్రసన్న ముఖంబును = నిర్మలమయిన మోమును. ఉదాత్తరేఖయున్ = గొప్పలక్షణమును. కాయజున్ = మన్మథుని. క్రేణిచేయున్ = గేలిచేయును. కౌశికున్ = ఇంద్రుని. విభ్రమశ్రీయును = విలాసముయొక్క సంపదయును. పెంపునున్ = గొప్పతనమును. విధాతృఁడు = బ్రహ్మ. విధాత్రాది శబ్దముల కత్వ స్త్రీపద్భావంబులు వైకల్పికము, రూ. విధాత. నిడుదలగు చేతులు మొదలగు వానిని చూడఁగా నీవు చక్కఁదనముచే మన్మథునికన్నను, గొప్పతనముచే నింద్రుని కన్నను నధికుఁడవని తోఁచుచున్నది. నీ కిట్టి లక్షణములు గలుగఁజేసి బ్రహ్మ పేడితనమును గలిగించుట యన్యాయ్యమని తా. అలం. యథాసంఖ్యము.

234. మత్ కోదండ చయంబులోనన్ = నాధనుస్సుల సమూహములో. ఒక సమ్మాన అస్త్రచాపంబు = ఒక యుత్తమ మయిన ధనుస్సును. భాస్వత్ కాండంబులు = ప్రకాశించుచున్న బాణములను. హేమ చిత్రిత లసత్ వర్మంబు = బంగారు చిత్రములు గల మెఱయుచున్న కవచమును. సత్కారంబునన్ = గౌరవముచేత. వాహన...కల్యాణునిన్ — వాహన = వాహనములచేతను. పరిష్కార = సొమ్ములచేతను, అంక = బిరుదములచేతను, సంభావ్య = గౌరవింపఁ దగిన, సంపత్ = సంపదచే, కల్యాణునిన్ = మంగళముగలవానిని. దర్పంబున్ = గొప్పతనమును. నాధనుస్సులలో నొక గొప్పధనుస్సును నుత్తమ బాణములను శ్రేష్ఠమయిన కవచము నిచ్చి వాహనములు మొదలగు సమస్త సంపదలతోఁ గూడినవానినిగాఁ జేసి యని తా. పాఠాం:—హేమచంద్రక కనత్ వర్మంబు = బంగారు బొట్లచే నొప్పుచున్న కవచమును అనియర్థము.

235. మత్స్యరాజ్య శ్రీమహిమకున్ = మత్స్యదేశపు రాజ్య లక్ష్మియొక్క గొప్పతనమునకు. యుక్తున్ = పూనినవానినిగా. మేము నిన్ను మత్స్యరాజ్యమున కంతకు నిర్వాహకునిఁగాఁ జేయఁదలఁచి యుండఁగా నీవిప్పుడు చెప్పినమాట మాకోరికకు విరుద్ధముగా నున్న దని తా.

ఉ. ఆఁడుదనంబు నిక్కముగ ♦ నారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి తప్పి యున్నది న♦పుంసకజన్మ మవశ్యభోగ్యమై
వాఁడిమి గల్గుశాపమున ♦ వచ్చెఁ బురాకృతకర్మభాగ్య మే
వాఁడును నేర్చునే తొలఁగ ♦ వైవఁగ నోర్వక పోవ వచ్చునే. 237

వ. కావున. 238

గీ. ఒండుపనులకు సెలవు లే ♦ కునికిఁ జేసి, యభ్యసించితి శైశవ ♦ మాది గాఁగ
దండలాసకవిధమును ♦ గుండలియును, ప్రేంఖణంబు తెఱంగును ♦ బ్రేరణియును.

క. విశ్రుతవాద్యములును మం, జుశ్రుతిసంభావ్యగీత♦సుగతులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్యర, సాశ్రయములు నైనయభిన♦యంబు లెఱుఁగుదున్.

గీ. ఇన్నితెఱఁగుల శ్రమముసే♦యింతుఁ జతుర, తావిహీనము లైనపా♦త్రములనైన
నట్టువోజ్జనై మెలఁగుదు ♦ నగళులందు, నిపుణనైపథ్యవిధులకు ♦ నేర్తు నధిప.

237. నిక్కముగన్=యథార్థముగా. ఆరసి=విచారించి. ఆఁడుదనంబున్. లేదు అని యన్వయము. పుంస్త్వమున్=మగతనమును. పురాకృత కర్మభాగ్యము=తొల్లి చేయఁబడిన కర్మముయొక్క ఫలమును. నేను ఆఁడుదానను గాను, పురుషుఁడనుగాను, నాకొకశాపముచే నీపేడితనము గలిగినది, ఇది పూర్వ కర్మఫలము అనుభవింపక తప్ప దని తా.

239. ఒండుపనులకున్ = వేఱుకార్యములకు. సెలవు = ఉపయోగము. శైశవము = చిన్నతనము. ఆది = మొదలు. దండలాసకవిధమును — నృత్యవిశేషమును. కుండలియును = కుండలాకార నృత్యమును, ప్రేంఖణంబు తెఱంగును=అభినయముతోడి నృత్యముయొక్క విధమును. ప్రేరణియును= కుండమీఁది నృత్యమును. అభ్యసించితి నని యన్వయము. నే నితరములయిన పనుల కుపయోగపడను కావునఁ జిన్ననాటనుండి నానావిధములయిన నృత్యముల నేర్చితి నని తా. పాఠాం:—ప్రెక్కణంబు తెఱంగును బేరణంబు—అర్థము సమానము.

240. విశ్రుతవాద్యంబులున్=ప్రసిద్ధములగు వాద్యములను. మంజుశ్రుతి సంభావ్యగీతసుగతులున్= చక్కనిశ్రుతిచేత గౌరవింపఁదగిన గానములయొక్క మేలివిధములను. సత్ భావ ఆశ్రయములున్ = మంచిభావములకు స్థానములును. తత్ జన్యరస ఆశ్రయములున్ = అభావములచేఁ బుట్టునట్టి శృంగారము మొదలుగాఁగల రసములకు స్థానములును. ఎఱుఁగుదున్ అని యన్వయము. నాకు వాద్యమును గానమును అభినయమును చక్కఁగాఁ దెలియు నని తా.

241. చతురతా విహీనములు = చాతుర్యముచే విడువఁ బడినవారు. పాత్రములన్ ఐనన్ = పడుచుల నైనను. ఇన్నితెఱఁగులన్ = ఇన్నివిధములయందును. శ్రమముచేయింతున్ = శిక్షనొందింతును. నట్టువఒజ్జను ఐ = నాట్యోపాధ్యాయుఁడనై. నిపుణ నైపథ్యవిధులకున్ = సమగ్రము లయిన యలంకారములు చేయుటలకు. రాజా! ఎంతనేర్పులేని పడుచులకును ఇన్నివిద్యలను నేర్పుదును. నేను రాజగృహములయందు నాట్యము నేర్పుటయందును అలంకరించుటయందును సమర్థుఁడ నని తా.

చ. అనుడు విషణ్ణ మైనహృద♦యంబున గారవ మొంద నైపుణం
బున నుచితంబు మై నరసి ♦ పొచ్చెము లేమిఁ దదీయసేవ గై
కొనుటకు నిశ్చయించి తన♦కూఁతు విరాటుఁడు పిల్వఁ బుచ్చె న
ర్తనమునకై బృహన్నలకుఁ ♦ దత్పరతం దగ నప్పగింపఁగన్. 242

వ. ఇట్లు రావించిన. 243

సీ. అల్లఁదనంబున♦యనుపు మైకొనఁ జూచు, నడపు కాంతికి వింత♦తొడవు గాఁగ
వెడవెడ నూఁగారి ♦ వింతమై యేర్పడఁ, దారనివళులలో ♦ నారు నిగుడ
నిట్టలఁ ద్రోచుచు ♦ నెలవులకలమేర, లెల్లను జిగి నెక్కి ♦ యేర్పడంగఁ
దెలుపును గప్పును♦ వెలయంగ మెఱుఁగెక్క, తారకంబులఁ గల్కి♦తనము దొడరఁ
జరణములును నడుముఁ ♦ జన్నులుఁ గన్నులు, జవ్వనంబు చెన్ను ♦ నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ♦ నుత్తర చనుదెంచె, నలరువిలుతుపువ్వు♦టమ్ముఁ బోలె. 244

242. విషణ్ణము = దుఃఖముగలది. హృదయంబునన్ = మనస్సునందు. గారవము = ప్రేమను. నైపుణంబునన్ = చాతుర్యముచేత. ఉచితంబుమైన్ = తగినవిధమున. అరసి = ఆలోచించి. పొచ్చెము = లోపము. తదీయసేవ = ఆయర్జునునిదైన యూడిగమును. నర్తనమునకై = ఆటకై. తత్పరతన్ = ఆసక్తిచేత. బృహన్నలపలుకు విని విరాటుఁడు గొంచెము మనసునఁజింతించి బృహన్నల మాటను జక్కఁగా విచారించి దోషములేకుండుటవలన నాతనియొద్ద నాట్యము నేర్చుకొమ్మని చెప్పుటకుఁ దనకూఁతుఁ బిలిపించె నని తా.

244. అల్లఁదనంబున అనుపు = తిన్నఁదనముయొక్క సౌందర్యమును. మైకొనన్ = పొందుటకు. నడపు = నడక. తొడవు = అలంకారము. పాదములకు నడకయందు మాంద్యము కొంచెకొంచె మలవడుచున్న దని తా. వెడవెడన్ = కొంచెము కొంచెముగా. నూఁగు = లేఁతదనము. ఆరి = కలిగి. తారనివళులలోన్ = కదియని ముడుతలయందు. ఆరు = రోమావళి. నిగుడన్ = నిక్కఁగా. నూగారును వళులును కొంచెకొంచెము నడుమునం దేర్పడుచున్నదని తా. నిట్టలన్ = చోటులను. నెలవులకలమేరలు = ఆయాస్థానములందుఁగల హద్దులు. జిగి = కాంతి. ఏర్పడంగన్ = చక్కఁగాఁ దెలియఁగా. స్తనములు వృద్ధి పొందుచుండుటచే వానిచుట్టునున్న చోటులకు హద్దులేర్పడుచున్నవని తా. కప్పును = నలుపును. తారకంబులన్ = కంటిపాపలయందు. కల్కితనము = చక్కఁదనము. తొడరన్ = కలుగఁగా. కన్నులయందు ధావళ్యమును నైల్యమును హెచ్చుచున్నదని తా. చరణములును = అడుగులును. జవ్వనంబుచెన్ను = యౌవనముయొక్క యందము. నివ్వటిల్లుచునికిన్ = ఆరంభించుచుండుటను. అలరువిలుతు పువ్వుటమ్ముఁబోలెన్ = మన్మథునిపుష్పబాణమో యనునట్లు. ఉత్తర. చనుదెంచెన్ అనియన్వయము. అలం. స్వభావోక్తి, యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష. ఇందు మందగమనము మొదలగునవి కొంచెకొంచెము ఏర్పడుచుండునట్లు వర్ణించుటచేఁ బ్రథమయౌవనము చెప్పఁబడినది. ఇటఁ జరణములయందుఁ గమలరూపతయు, రోమావళియందు భృంగరూపతయు, స్తనములయందుఁ బద్మముకుళాకారతయు, నేత్రములయందుఁ గుముదకుసుమ యాకారతయు ధ్వనితంబై యలరువిలుతు పువ్వుటమ్ముఁ బోలెన్ అను నుత్ప్రేక్షకు నౌచిత్యము నెఱపుచున్నవి.

గీ. వచ్చి కొలువు సొచ్చి ♦ నెచ్చెలిపిండు నం, తంత నిలువఁ బనిచి ♦ యల్లనల్లఁ
గదిసి ప్రౌఢవనిత♦కైవడి ముద్దియ, ముద్దుపట్టిఁ దనకు ♦ మ్రొక్కుటయును. 245

చ. తిగిచి కవుంగిలించి జగ♦తీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ ♦ మోపఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరింబొరి న♦పూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పగుమృదుమౌళి నుజ్జ్వలన♦ఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్. 246

వ. ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి బృహన్నలదెస గనుంగొని సాదరదర స్మితరుచిరాననుండై యిమ్మగువ నీకు నాట గఱపం దగుపాత్రం బగునే యని యడిగి తత్ప్రతివచనంబులయందలినాగరకత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధురసల్లాపంబు చేసి కర్పూరసహితం బగుతాంబూలంబు వెట్టి చిత్రంబు లగు చీనాంబరంబు లిచ్చి మణిమయంబు లగునాభరణంబు లొసంగి సంభావించి యవ్విభుండు. 247

గీ. నీవు చతురమతివి ♦ నీకు నిక్కన్నియ, నప్పగింప నేల ♦ యైన నాదు
హృదయ మలరు దీని♦యెడఁ గడు నార్ద్రమై, యుండుఁ గానఁ జెప్ప ♦ కుండ రాదు.

245. నెచ్చెలిపిండున్ = ప్రియసఖులసమూహమును. కదిసి = చేరి. ప్రౌఢవనితకైవడిన్ = చతురస్త్రీవలె. ముద్దియ—ఉత్తర. ఉత్తర యట్లు సభకువచ్చి తనసఖుల దూరమున నిలిపి ప్రౌఢనాయికవలె జంకులేక రాజునకు మ్రొక్కఁగా నని తా.

246. జగతీవిభుఁడు = విరాటరాజు. అక్కమల ఆయత అక్షిన్ = కమలములవలె నిడుద లయిన కన్నులు గల యాయుత్తరను. మొగంబునన్ = తన ముఖమునందు. కదియన్ = చేరునట్లు. కర అంగుళులన్ = చేతివ్రేళ్లచేత. కపోలము = చెక్కిలిని. పుడుకున్ = దువ్వును. అపూర్వవిలోకనము = క్రొత్తగాఁ జూచుటను. కప్పు=నల్లనిది. మృదుమౌళిన్=మెత్తనిశిరస్సునందు. అర్మిలిన్= ప్రీతితో. ఉజ్జ్వలనఖ అంకురచేష్ట = ప్రకాశించుచున్న గోళ్లమొలకలయొక్క వ్యాపారమును, గోళ్లతో వెంట్రుకల చిక్కుదీయుట ననుట. ఒనర్చున్=చేయును. విరాటుఁడుత్తరను జేరఁదీసి యాలింగనము చేసికొని మిక్కిలి ప్రీతితో నాదరించె నని తా.

247. గాదిలికూఁతున్ = ముద్దుకూఁతును. ఉపలాలించి = బుజ్జగించి. సాదరదరస్మితరుచిరఆననుండు ఐ= అదరముతోఁ గూడిన చిఱునవ్వుచేఁ బ్రకాశించుచున్న మోముగలవాఁడై. తగుపాత్రంబు= తగినపనుచు. తత్ ప్రతివచనంబులయందలి నాగరకత్వంబునకున్=బృహన్నలబదులుమాటయందలి నాణెమునకు. మధురసల్లాపంబు = తియ్యనిముచ్చటను. చీనఅంబరంబులు=చీనదేశపువస్త్రములను. సంభావించి = గౌరవించి. అవ్విభుండు = ఆవిరాటరాజు.

248. చతురమతివి= నేర్పరియయిన బుద్ధిగలవాఁడవు. దీనియెడన్=ఈయుత్తరయందు. అలరున్= సంతోషించును. ఆర్ద్రమై = తడిసినదై. నీవు మిక్కిలి బుద్ధిమంతుఁడవు కావున నీకన్య నొప్పగింపు నపుడు నీకుఁ జెప్పవలసినది లేకున్నను నాకు దీనియందు మిక్కిలి మక్కువ యుండుటచేఁ జెప్పుచున్నాఁడ నని తా. పాఠాం:—హృదయమతులు = మనోబుద్ధులు అని యర్థము.

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చికఁ దనయిచ్చ నాడ ♦ మరగిన యదియై
విచ్చలవిడి నింతకు ము, న్నిచ్చేడియ మెలఁగు శిక్ష ♦ యెఱుఁగదు సుమ్మీ. 249

గీ. బాలకేలిమీఁది♦భరము క్రమంబున, విడువఁ గళలయందు ♦ వేడ్క జొనిపి
నయముతోడ నర్త♦నంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు ♦ నీవ కాదె. 250

చ. అని యుచితంబుగాఁ బలికి ♦ యంగనహస్తముఁ బట్టి తత్కరం
బునఁ గదియించి నీగురువు ♦ బోటి దగం గొనియాడు మిట్లు నె
ప్పె నటుల భక్తిమై నడుపు ♦ పెంపెసలారఁగఁ గూడుఁ గూర చం
దనకుసుమాదులు న్నడపి ♦ తప్పక యారసి గారవింపుమీ. 251

గీ. ఎల్లచుట్టములును ♦ దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ ♦ జెలువ నీకు
గురువ యింక నొక్క♦కొఱఁతయు లే దింపుఁ, జేరి బ్రతుకు బుద్ధి♦గౌరవమున.

క. మనయింట నిచ్చ టచ్చో, టన కెచ్చో నైన నీబృ♦హన్నల మెలఁగం
జనియెడుమానిసి తనమన, మున కిమ్మగునట్టిచరిత♦మున వర్తించున్. 253

వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చినయనంతరంబ
నకులుండు. 254

249. ఇచ్చేడియ = ఈ స్త్రీ. మెలఁగున్ = తిరుగును. ఈయుత్తరయెప్పుడును చెలులతో నాటలాడుచుండినదియే కాని యింతవఱకు శిక్షలో నుండినది కాదని తా.

250. బాలకేలిమీఁదిభరము = బాలక్రీడలయందలి యాసక్తిని. విడువన్ = విడుచునట్లుగా. కళలయందున్ = విద్యలయందు. వేడ్క = ఆసక్తిని. చొనిపి = కలిగించి. నెలఁతకున్ — ఉత్తరకు. ఏడుగడయున్ = ఏడువిధములయిన రక్షకుఁడును, తల్లి, తండ్రి, విద్య, గురువు, దైవము, దాత, పురుషుఁడు, ఇది సప్తవిధరక్షకము. నీవీయుత్తరకు నాటలమీఁదియాసక్తి మాని విద్యలయందుఁ బ్రవేశము గలుగునట్లుచేసి మంచితనముచే నాటలను నేర్పవలయును, నీవే యన్నివిధముల దీనికి రక్షకుఁడవని తా.

251. ఉచితంబుగాన్ = తగినవిధమున. అంగనహస్తమున్ = ఉత్తరయొక్క చేతిని. తత్కరంబునన్ = ఆబృహన్నలచేతియందు. కదియించి = చేర్చి. బోటి = ఓస్త్రీ! ఉత్తరసంబోధనము. కొనియాడుము = గౌరవింపుము. చందనకుసుమ ఆదులున్ = గంధము పువ్వులు మొదలుగాఁ గలవానిని. ఇట్లు విరాటుఁడు బృహన్నలతోఁ జెప్పి యుత్తరహస్తమును బృహన్నలచేతిలోనుంచి యుత్తరతో నిట్లనియె. నీవు నీగురువును గారవించి యితఁడు చెప్పినట్లు నడచుకొనవలెను, ఇతనికి భోజనములోనగునవి చక్కఁగా జరగునట్లు నీవే విచారించుకోవలెనని తా.

252. గురువు అ — బృహన్నలయే. బుద్ధిగౌరవమునన్ = బుద్ధియొక్క గొప్పతనముచేత. నీకింకఁ జుట్టములు మొదలగువారు గురువే కావున గురువును సేవించుచు గొప్పబుద్ధిగలిగి యుండుమని తా.

253. ఇమ్ము = ఇష్టము. అగునట్టిచరితమునన్ = అయినట్టినడవడిచేత. వర్తించున్ = ఉండును. ఈబృహన్నల మనగదులందుఁ దనకిష్టమువచ్చినచోటఁ దిరుగుచు నిష్టముచొప్పున నుండవచ్చునని తా.

( నకులుఁ డశ్వపాలకుఁడై విరటుఁ గొల్వ వచ్చుట. )

ఉ. అంబుజము ల్సముద్యదరు♦ణాంశునిఁ గన్నవిధంబున న్వికా
సంబున నుల్లసిల్లి జన♦చారువిలోచనము ల్నిజోజ్జ్వలాం
గంబున కర్థితో నభిము♦ఖంబులుగాఁ జనుదెంచి దైవయో
గంబున భూవిభుండు దుర♦గంబులఁ దేరఁగఁ బంచి చూడఁగన్. 255

వ. ఆస్థానంబు చేర వచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్నరేంద్రుండు గనుం
గొని పరిజనంబుల కతనిం జూపి. 256

క. ఇతఁ డెవ్వఁ డొక్కొ రూపు ని, రతిశయమై మనమునకుఁ బ్రి♦యంబొసఁగెడుఁ జూ
చితి శే చిత్తంబునుదా, త్తత గానఁగ నయ్యెడు న్వ♦దనమునభంగిన్. 257

క. తురగంబులఁ జూచువిధం, బరయఁగ నితఁ డశ్వవిద్య♦యందు నిపుణతా
స్ఫురణము గలవాఁ డగు బం, ధురమూర్తిఁ బరాక్రమాన్వి♦తుఁడు గానోపున్.

క. మీ రెఱిఁగినఁ జెప్పుఁ డీతని, పే రెఱుఁగనియట్టులైనఁ ♦ బెంపారంగాఁ
జేరం జని యల్లన నొకఁ, డారసి యెఱుఁగంగ వలయు ♦ ననుసమయమునన్.

255. అంబుజముల్ = కమలములు. సముద్యత్ అరుణ అంశునిన్ = ఉదయించుచున్న సూర్యుని. కన్నవిధంబునన్ = చూచినట్లు. వికాసంబునన్ = సంతోషముచేత. ఉల్లసిల్లి= ప్రకాశించి. జనచారు విలోచనముల్ = జనుల చక్కని కన్నులు. నిజ ఉజ్జ్వల అంగంబునకున్= తనప్రకాశించు నట్టిదేహమునకు. అర్థితోన్ = ప్రీతితో. అభిముఖంబులు కాన్ = ఎదురు కాఁగా. తురగంబులన్ = గుఱ్ఱములను. సూర్యోదయ సమయమునఁ గమలములు వికసించునట్లు జనులనేత్రములు ప్రీతిచే వికసించినవై తనమనోహరాకారమును జూచుచుండఁగా నకులుఁడు విరాటరాజు గుఱ్ఱములఁ దెప్పించి చూచుచుండు నప్పుడచటికిఁ బోయి యని తా.

256. ఆస్థానంబు = కొలువును. ఘోటకంబులన్= గుఱ్ఱములను. ఉపలక్షించుచున్ = చూచుచు. నరేంద్రుండు = విరాటరాజు.

257. రూపు=రూపము. నిరతిశయము ఐ = ఉత్తమమై. ప్రియంబు=సంతోషమును. వదనమున భంగిన్ = ముఖముయొక్క విధముచేత. చిత్తంబు ఉదాత్తత = బుద్ధియొక్క గొప్పతనము. కానఁగన్. అయ్యెడున్ అని యన్వయము. ఇతఁడు మిక్కిలి చక్కఁదనముగలవాఁడు. ఇతని మోము చూడఁగా గొప్పబుద్ధిగలవాఁడని తోఁచుచున్నది. ఇతఁ డెవ్వఁడో తెలియ దని తా.

258. తురగంబులన్ = గుఱ్ఱములను. నిపుణతాస్ఫురణము = నేర్పుయొక్కయతిశయము. బంధురమూర్తిన్ = = ఉత్తమమయిన యాకారముచేత. పరాక్రమ అన్వితుఁడు = పరాక్రమముతోఁగూడినవాఁడు. కాన్ ఓపున్= కాఁజాలును అని యన్వయము. ఇతఁడు గుఱ్ఱములను బరీక్షించు విధము చూడఁగా నశ్వవిద్యయందు సమర్థుఁడనియు, నితనిదేహముయొక్క పటుత్వము చూడఁగాఁ బరాక్రమవంతుఁ డనియుఁ దోఁచుచున్నదని తా.

259. పెంపు = గొప్పతనము. మీరు తెలిసినయెడ ఇతని పేరేమో చెప్పుఁడు, తెలియనియెడ విచారించి చెప్పుఁ డని చెప్పుచుండఁగా నని తా.

క. చేరఁ జనుదెంచి పాండవ, వీరుఁడు మత్స్యాధిపునకు ♦ వినతుండై దే
వా రాజవాహనము లగు, వారువముల నరయ నేర్తు ♦ వల నేర్పడఁగన్. 260

వ. దామగ్రంథి యనువాఁడ నాకు నశ్వవిషయం బయినవిచక్షణత్వం బెల్లను గల
దవధరింపు మని యి ట్లనియె. 261

సీ. అవయవలక్షణం ♦ బాయుఃప్రమాణంబు, గర్భంబు లింగితా ♦ కారములును
మాత్రాంతరము వయో ♦ మానంబు దేశకా, లోచితాహారప్ర ♦ యోగభంగి
జాత్యనురూపశి ♦ క్షావిధి క్రమగత, వ్యాయామసాత్త్వప్ర ♦ వర్తనంబు
ప్రమదవిషాదాది ♦ బహువిధచిత్తధ, ర్మము పోషణప్రకా ♦ రము చికిత్స
పరిచితములు ధరణీ ♦ పాలక ముందట, రూపురేఖ మెఱయఁ ♦ జూప నేర్తు
బవర మైన నాకుఁ ♦ బని యేమి యనఁ జేతి, బలిమికలిమి నెఱపఁ ♦ దలఁపు గలదు.

వ. అనిన విరాటుం డతని కి ట్లనియె. 263

క. నీకుఁ దగుపదవి యిచ్చెద, నాకలిమికి నెల్ల రక్ష ♦ ణం బొనరింపం

260. పాండవవీరుఁడు=నకులుఁడు. వినతుండై= మ్రొక్కినవాఁడై. రాజవాహనములు = రాజులను వహించునవి. వారువములన్ = గుఱ్ఱములను. వలను = ఉపాయము. నకులుఁడు విరాటుని యొద్దకుఁ బోయి యాతనికి మ్రొక్కి యిట్లనియె. రాజా! రాజు లెక్కఁదగిన గుఱ్ఱములను నేర్పుతోఁ బరీక్షింపఁగల నని తా.

261. విచక్షణత్వంబు = పాండిత్యము. అవధరింపుము = చిత్తగింపుము.

262. అవయవలక్షణంబు = అవయవముల గుఱుతును. ఆయుః ప్రమాణంబు= ఆయుస్సుయొక్క కొలఁదియు. ఇంగిత ఆకారములును = హృదయమునందలి యభిప్రాయము ఇంగితము, ఆయభిప్రాయముచే శరీరంబునందుఁ గలుఁగు భేదము ఆకారము. మాత్రాఅంతరము = పరిమాణముయొక్క భేదమును. వయః మానంబు = వయస్సుయొక్క కొలఁదియు. దేశకాల ఉచిత ఆహార ప్రయోగభంగి= దేశకాలములకుఁ దగిన యాహారము నిచ్చువిధమును. జాతి అను రూపశిక్షా విధి = జాతికిఁ దగిన శిక్షచేయుటయును. క్రమగత వ్యాయామ సాత్త్వ ప్రవర్తనంబు = వరుసచేఁ గలిగినపరిశ్రమము యొక్కయు బలముకలిగించు నౌషధసేవ మొదలగువానియొక్కయు చేయుటను. ప్రమదవిషాదఆది బహువిధ చిత్తధర్మము = సంతోషము దుఃఖము మొదలుగాఁగల పలువిధములయిన మనోధర్మమును. పోషణ ప్రకారము = పోషించువిధమును. చికిత్స = వైద్యమును. పరిచితములు = అలవాటైనవి. రూపురేఖ = రూపలక్షణము. బవరము = యుద్ధము. అనన్ = అని చెప్పను. చేతిబలిమి కలిమి = చేతుల లావుయొక్క యతిశయమును. నెఱపన్ = నిండించుటకు. నాకు గుఱ్ఱములలక్షణములును వానికి సంబంధించిన యన్ని విషయములును దెలియును, యుద్ధము పొసఁగినఁ బరాక్రమము చూపుదుఁ గాని యూరకుండ నని తా.

264. తగుపదవి = తగిన యధికారమును. నాకలిమికిన్ = నాసంపదకు. ఒనరింపన్ = చేయుటకు. కాక = కాని. హయశిక్షకుండు = గుఱ్ఱముల శిక్షించువాఁడు. అను ఆకొలఁది ఎ = అను

గాఁగ హయశిక్షకుం డను, నాకొలఁదియె యిట్లు పలుకు ♦ టనుచిత మరయన్.

గీ. అనుడు నకులుఁ డిట్టు ♦ లను దేవ తమతమ, నేర్చుపనులవలన ♦ నెగడి బ్రదుక
వలయుఁ గాక నగరఁ ♦ దలము దప్పినమెలం, కువ లల్పు లియ్య ♦ కొనుట దగునె.

ఉ. ధర్మసుతుండు వెంచె ననుఁ ♦ దాన తురంగమశాస్త్రశిక్షలం
గర్మఠుఁ జేసి యాత్మతుర ♦ గంబుల కెల్లను నన్న యుక్తుఁ గా
నర్మిలి నిల్పి యీగియుఁ బ్రి ♦ యంబును నాయెడ నాఁడు నాఁటికిన్
బేర్మి వహించుచుండ నడి ♦ పెం దనతమ్ములలోనివానిఁగాన్. 266

క. ఆవిభుఁడు రాజ్యసుఖలీ, లావిముఖత వెడలి బంధు ♦ లం దొఱఁగి యథే
ష్టావాసత బ్రుంగుడువడి, పోవుట నెచ్చోటఁ గడుపుఁ ♦ బ్రోతునొ యనుచున్.

క. తిరిగి తిరిగి లోకోత్తర, చరితుఁడు సుజనుండు మత్స్య ♦ జనవిభుఁడు యుధి
ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ, గర మనురాగమునఁ గొలువఁ ♦ గా నియ్యెడకున్.

క. చనుదెంచి కాంచి నానే, ర్చినతెఱఁగున విన్నపంబు ♦ సేసితి నన్నుం

నంతమాత్రమా ? నీకుఁ దగిన యధికారమిచ్చెదను, నీవు నారాజ్యమంతయుఁ బాలింపఁ దగినవాఁడవు కాని యశ్వశిక్షకుఁడుగా నుండఁదగినవాఁడవు కా వని తా.

265. తమతమ నేర్చు పనులవలనన్ = తమకుఁ దమకుఁ దెలిసిన కార్యములవలన. నగరన్ = రాజగృహమునందు. తలము = శక్తి. తప్పిన మెలంకువలకున్ = మీఱిన కార్యములకు. అల్పులు = శక్తి లేనివారు. విరాటునిమాట విని నకులుఁ డిట్లు చెప్పెను. రాజా ! అల్పజనులు తమకుఁ దగిన యుద్యోగములవలన బ్రదుకవలయుఁ గాని శక్తికిమీఱిన పనులకుఁ జేరరా దని తా.

266. ధర్మసుతుండు = ధర్మరాజు. తురంగమశాస్త్రశిక్షలన్ = అశ్వవిద్యల నేర్పుటలయందు. కర్మఠున్ = కర్మమునందు సమర్థుని. ఆత్మతురగంబులకున్ = తనగుఱ్ఱములకు. యుక్తున్ కాన్ = అధికారినిగా. అర్మిలిన్ = ప్రీతితో. ఈగియున్ = దానమును. ప్రియంబును = ప్రేమయును. పేర్మి = అతిశయమును. ధర్మరాజు నన్ను అశ్వశాస్త్రమునందు సమర్థునిఁ గావించి తనగుఱ్ఱములకెల్లను నధికారినిగాఁ జేసి దానమానంబుల మన్నించుచుఁ దనతమ్ములలో నొకనిఁగాఁ జూచుచుండె నని తా.

267. ఆవిభుఁడు=ఆధర్మరాజు. రాజ్యసుఖలీలావిముఖతన్=దొరతనముచేతఁ గలుగు సుఖముయొక్క విలాసమునకుఁ బెడమొగమైనవాఁ డగుటచేత, తొఱఁగి=విడిచి. యథేష్టఆవాసతన్=ఇచ్చవచ్చిన చోటునను నునికిగలవాఁ డగుటచేత. బ్రుంగుడువడి=మఱుఁగుపడి. ఆధర్మరాజు రాజ్యమును బంధువులను విడిచి యథేచ్ఛ నెచ్చటికో మఱుఁగుపడిపోఁగా నే నుదరపోషణమునకుఁ దగినచోటు వెదకుచు నని తా.

268. లోకఉత్తరచరితుఁడు = లోకమునందు శ్రేష్ఠమయిన నడవడిగలవాఁడు. మత్స్యజనవిభుఁడు = మత్స్యదేశపురాజు. యుధిష్ఠిరునట్ల = ధర్మరాజువలెనే. కరము = మిక్కిలి. బహుదేశములు తిరిగి విరాటరాజు ధర్మరాజు వంటివాఁడని విని నిన్నుఁ గొలువఁ గోరి యని తా.

269. నానేర్చినతెఱఁగునన్ = నాకుఁ దెలిసినవిధమున. పనిగొనన్ = ఏలుటకు. వచ్చి నిన్నుఁ జూచి

బనిగొనఁ దలఁచిన నిలిచెద, ననుమానము గలిగెనేని ♦ నరిగెద నధిపా. 269

వ. అనవుడు. 270

ఉ. ఆనరనాథుఁ డి ట్లనినె ♦ నశ్వములం బరికించి యున్కి యిం
పేనిఁ దురంగశాలలకు ♦ నెల్లను ముఖ్యుఁడవై తదీయనా
నానియతిప్రకారకర♦ణంబులఁ ద్రిమ్మరుచున్న వారి ము
న్నే నెటు లట్ల నీ వరసి ♦ యిచ్ఛ మెయిం బనిగొమ్ము నెమ్మితోన్. 271

క. అని చెప్పి యధికసమ్మా, ననపూర్వము గాఁగ మత్స్య♦నరపతి మాద్రీ
తనయుఁ దగ నిల్పె నాతఁడుఁ, దనమదిఁ బ్రియ మందె నతని♦తమ్ముం డంతన్.

( సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట. )

క. భావన శాంతత్వము నిజ, భావంబున నూష్మలతయుఁ ♦ బ్రకటంబులు గా
నావిధుఁడు మనుజవేషుం, డై వచ్చె నో శిఖి శరీరి ♦ యయ్యెనో యనఁగన్.

నాయభిప్రాయము విన్నవించితిని. ఇఁక నీవు నన్నుంచుకొన్న యెడ నుండెదను, పొమ్మన్నఁ బోయెదనని తా. పాఠాం:—ఏలెడిది = ఏలునది యని యర్థము.

271. పరికించి = పరీక్షించి. ఇంపుఏనిన్ = ఇష్టమయినయెడ. తురంగశాలలకున్ = అశ్వశాలలకు. తదీయ...కరణంబులన్—తదీయ = ఆగుఱ్ఱపుశాలల సంబంధులయిన, నానా = పలువిధములగు, నియతి = నియమములయొక్క, ప్రకార = విధములయొక్క, కరణంబులన్ = చేయుటలయందు. త్రిమ్మరుచున్నవారిన్ = తిరుగుచున్నవారిని. విరాటుఁడు నకులునితో ని ట్లనియె, అశ్వములను విచారించుచుండుటయే నీకిష్టమయినయెడ నాయశ్వశాలలకు నాయకుఁడవై వాని నిదివఱకు విచారించుచుండు నధికారులను నాయట్లు నీవు విచారించి పని గొనుచుండు మని తా.

272. అధికసమ్మానపూర్వముగాఁగన్ = మిక్కిలిగౌరవించుట ముందుగలుగునట్లుగా. మాద్రీతనయున్ = మాద్రికొడుకయిన నకులుని. ఇట్లు చెప్పి విరాటుఁడు నకులుని మిక్కిలి గౌరవముతోఁ దనయొద్ద నిలుపుకొనెను, అతఁడును సంతోషించెను. అంతసహదేవుఁ డని తా.

273. భావనన్ = ఆకారమునందు. శాంతత్వమున్ = శాంతుఁడగుటయును. నిజభావంబునన్ = తనమనస్సునందు. ఊష్మలతయున్ = వేఁడిమిగలిగియుండుటయు, శౌర్యముననుట. ప్రకటంబులు గాన్ = వెల్లడికాఁగా. ఆవిధుఁడు = ప్రసిద్ధుఁ డగు చంద్రుఁడు. మనుజవేషుండు ఐ = మనుష్యవేషముగలవాఁడై. శిఖి = అగ్ని. శరీరి = దేహముగలవాఁడు. ఆకారమునందు శాంతి దోఁచుటచేత మనుష్యవేషము ధరించినచంద్రుఁడో యనునట్లును, మనస్సున ప్రతాపము గలిగి యుండుటచే నాకారము ధరించిన యగ్నియో యనునట్లును నున్నవాఁడై యని తా. అలం. యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష, ఉల్లేఖము. పాఠాం:—పావనశాంతత్వము = పరిశుద్ధమయిన శాంతత్వము అని యర్థము. ఈపక్షమున నూష్మలతకు నిజభావమువలె శాంతత్వమున కధికరణము సిద్ధింపకపోవుటచేతను, రెండింటికిని పరస్పర విరుద్ధములకు నిజభావమే యధికరణ మగుట యనుచిత మగుటచేతను వేఱు వేఱుగాఁ జెప్పుటయే యుత్ప్రేక్షాద్వయమునకు అనురూప మగుటచేతను, పావనశబ్దమైయర్థ్యముచేతను ఈపాఠం బనాదరణీయము.

క. తలుగులపోది యొకదెసఁ బె, ట్యేలదామెన యొక్కవలన ♦ ననువై యుండన్
మొల మోపి పెక్కుచుట్లం, జిలుత్రాటం జుట్టి గోప♦భావం బమరన్. 274

చ. నునుసెలగోల చేకొని మ♦నోహర మాతసమేను రాజుచూ
పును బ్రజచూడ్కులం దిగువఁ ♦ బుష్కరపత్త్రనిభంబు లైనలో
చనములు మూర్తి దెల్పఁగ స♦సంభ్రమతం జనుదెంచె నల్లన
ల్లన వెడభీతి దోఁప జను♦ల న్వెగ డయ్యెడుదృష్టిఁ జూచుచున్. 275

వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు సంతంతం జేరి వినయావనతుండగుచు నిట్లని యె.

క. నీపసులఁ గావఁ బెట్టుము, భూపాలక నన్ను నేను ♦ బూని యరసినన్
గోపంక్తులు రుజ వడ వొరు, చే పడ వెన్నఁడును దప్పిఁ ♦ జేడ్పడ వెందున్. 277

గీ. తొలఁగుపోకుండ మెకములు♦గఱవకుండఁ, బొఁడిదఱఁగకయుండ నా♦పాటిగొల్ల
లిచ్చ మెచ్చఁగ నీదృష్టి ♦ కెక్కఁగదుపు, నరయ నేర్తు న న్నేలుము ♦ ధరణినాథ.

వ. అనిన విరటుండు పాండవావరజున కిట్లనియె. 279

274. తలుగులపోది= పలుపులమోపు. ఒకదెసన్= ఒకవైపునను. దామెన = పెద్దత్రాడు. ఒక్కవలసన్ = ఒకవైపునను. అనువై = అమరినదై. గోపభావంబు = గొల్లతనము. ఒకప్రక్క పలుపులను మఱియొక ప్రక్క దామెనను మొలయందు దోఁపి పెద్దత్రాడు నడుమునకుఁ జుట్టి గొల్లవేషముతో నని తా.

275. నునుసెలగోల = చక్కనిపశువుల మేపుకఱ్ఱను. తిగువన్ = లాగఁగా. పుష్కరపత్త్రనిభంబులు = తామరరేకులతో సమానములు. లోచనములు = కన్నులు. మూర్తి = గొప్పతనమును. ససంభ్రమతన్ = తొట్రుపాటుగలవాఁ డగుటచేత. వెడభీతి = కొంచెము భయము. వెగడు = తడఁబాటు. అయ్యెడుదృష్టిన్=కలుగుచూపుచేత. చనుదెంచెన్=వచ్చెను. ముల్లుకఱ్ఱ చేతఁ బట్టుకొని తన చక్కఁదనమునకు రాజును జనులును మెచ్చి చూచుచుండఁగా విశాలనేత్రములు తన గొప్పతనమును వెల్లడిసేయుచుండఁగాఁ గొంచెము భయపడినట్లు తడఁబడుచూపుతో జనులను చూచుచు తొట్రుపాటుతో సహదేవుఁడు వచ్చె నని తా.

277. అరసినన్ = చూచినయెడ. గోపంక్తులు = ఆవుల మందలు. రుజ = రోగమును. పడవు = పొందవు. ఒరుచే = ఇతరునిచేతిని. పడవు = పొందవు. చేడ్పడవు = బాధపడవు. రాజా! నన్ను నీపసులకాపరినిగా నుంచుకొనుము, నేను గాచినయెడ నీపశువులు రోగము దప్పి మొదలగువాని నొందవు, దొంగలకుఁ జిక్కవు అనితా.

278. తొలఁగు పోకఉండన్ = పశువులు తప్పించుకొని పోకుండునట్లును. కదుపున్ = ఆవుల మందను. రాజా! పశువులు తప్పించుకొనిపోక యుండునట్లును, పులులు మొదలగునవి కఱవకయుండునట్లును, పాఁడితగ్గక యుండునట్లును, గొల్లలు మెచ్చునట్లును, నీకు సంతోషము గలుగునట్లును నేను పశువులను గావఁగల నని తా.

279. పాండవఅవరజునకున్ = పాండవులయందుఁ జిన్నవానితో.

ఉ. ఎక్కడిమాట గొల్లతన ♦ మించుక యేనియు లేదు నీమెడం
జక్కనిమేను నీగరువ♦చందముఁ గాంతియుఁ జూడ వచ్చినన్
నిక్కువ మీవు సూర్యశశి♦నిర్మలవంశజులైనరాజులం
దొక్కమహానుభావుతన♦యుండవు గా వలయు న్నరోత్తమా. 280

గీ. వలయుపదవియందు ♦ నిలిచి నారాజ్య మం, తయును జక్కఁబెట్టి ♦ నయము విక్ర
మంబు నడపునంత ♦ మానిసివై యుండి, కుత్సితంపుబ్రదుకు ♦ గోరఁ దగునె.

వ. ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నీ కిచ్చెద మత్స్యదేశంబున భవ
దభిమతస్థలం బొసంగెద మదీయసేనాపరిపాలనంబు సేసి వర్తిల్లుము. 282

క. అనవుడుఁ బాండునృపాలక, తనయుఁడు మ్రొక్కుచు విరాట♦ధరణీశున కి
ట్లను హీనకులుఁడ బాలుఁడ, మును నాగరకంపుఁగార్య♦ములవెర వెఱుఁగన్.

గీ. పసులఁ గాచి కాని ♦ బ్రదుకఁ గౌరవులప్రాఁ, తలము నేము మున్ను ♦ ధర్మపుత్త్రి
పశుగణంబు నెల్లఁ ♦ బాలింతు నమ్మహీ, వరునిచిత్తమునకు ♦ వచ్చువాఁడ. 284

వ. తంత్రీపాలుం డనం బరఁగినవాఁడ నాచేతం గ్రేపులు పురాణించుటంజేసి కొండొ

280. మేనున్ = శరీరమును. గరువచందమున్ = గొప్పవిధమును. సూర్యశశి నిర్మలవంశజులు = సూర్యచంద్రుల పరిశుద్ధ మయిన వంశమునందుఁ బుట్టినవారలు. ఒక్కమహానుభావుతనయుండవు = ఒక్కగొప్పమహిమగలవాని కుమారుఁడవు. నరఉత్తమా = మనుష్యశ్రేష్ఠుఁడా! సహదేవుని సంబోధనము. మనుష్యశ్రేష్ఠుఁడా! నిన్నుఁ జూడఁగా గొల్లవాఁడవుగాఁ గనఁబడవు, నీరూపము చూచినయెడ సూర్యచంద్రుల యుత్తమ వంశమునఁ బుట్టిన యొక్కమహారాజు కుమారుఁడవుగాఁ దోఁచుచున్నాఁడ వని తా.

281. వలయుపదవియందున్ = కావలసినయధికారమునందు. నయము = నీతిని. విక్రమంబు = పరాక్రమమును. కుత్సితంపుబ్రదుకు = నీచమయిన జీవనమును. నీవు గొప్పయధికారమువహించి నారాజ్యమంతయుఁ బరిపాలింప సమర్థుఁడవై యుండి నీచమయినపశుపాలకత్వమును గోరుట యుక్తము కాదని తా.

282. మహనీయ ఆయుధంబులు = మేలైనయాయుధములను. భవత్ అభిమతస్థలంబు = నీకోరిన చోటును.

283. పాండునృపాలకతనయుఁడు = సహదేవుఁడు. హీనకులుఁడన్ = తక్కువకులముగలవాఁడను. వెరవు = విధమును. విరాటునిమాట విని సహదేవుఁడు మ్రొక్కి యిట్లనియె. నేను తక్కువజాతివాఁడను పసివాఁడను, అదిగాక యిదివఱకెన్నఁడు నిట్టి గొప్పపనులఁ జేసి యెఱుఁగ నని తా.

284. కౌరవులప్రాఁతలము = కౌరవుల భృత్యులము. ధర్మపుత్త్రిపశుగణంబున్ = ధర్మరాజు పశువులమందను. నేనిదివఱకుఁ బశువులనుగాచియే బ్రదుకుచుంటిని. మావంశమువారు కౌరవుల భృత్యులు. నేను ధర్మరాజు పశువులనుగాచి యతనిమన్నన వడసినవాఁడ నని తా.

285. క్రేపులు = గోవులు. పురాణించుటంజేసి = వృద్ధిపొందుటచేత. పెనుపున్ = వృద్ధిపొందిం

కకాలంబున నీకదుపులం బెనుతు నే నగు నని కైకొనిన నాఁబోతుపంచితంబు మూర్కొనినఁ బై గాలి వీచిన గొడ్డున కైనను జూలు నిలుచు నుంగిడి యదురుఁ ద్రిక్క యనుదానికి నా పేరు సెప్పినం జాలు మఱియును బసికి వలయు తెఱంగు లెల్ల నెఱుంగుదు వే ఱొక్కపనికిం గాను గాని యే నీవెంట నీమనసు వడయం జాలుదు నావలనం బ్రయోజనంబు గొనవలయు నేని నొండుమాటలు దక్కి పసులం బరికింప నియోగింపుము. 285

చ. అనుటయు నెట్టకేలకు ధ♦రాధిపుఁ డట్టుల కాక యంచు నా
తనివదనంబు చూచి యుచి♦తం బగు నేనిఁ బ్రియంబ యేని నె
ట్లును గురుకార్యవర్తనము♦లున్ రచియింపక యుండు నేని గో
ధనముల కెల్ల రక్షణముఁ ♦ దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. 286

క. మున్ను గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి ♦ నీపని సేయన్
మన్ననమానిసివై నీ, వున్నం గడు మేల కాక ♦ యొప్పమి గలదే. 287

వ. అని పలికి యతనియభిమతంబు సలిపి నిలిపె నట్లయ్యేవురు విరాటుం గొల్చి రతద నంతరంబ. 288

( ద్రౌపది సైరంధ్రీవేషమున సుధేష్ణఁ గొలువ వచ్చుట. )

క. గారవమున నిజదేశా, చారముమై నల్లి యున్న♦జడ యగుకబరీ
భారంబు విచ్చి తుఱుముగ, సైరంధ్రీవేషమునను ♦ సముచితభంగిన్. 289

తుస. మూర్కొనినను = వాసనచూచినను. ఉంగిడి, అదురుఁద్రిక్క—ఇవి పశురోగవిశేషములు. పసికిన్ = పశువులమందకు. ఈవెంటన్ = ఈకార్యముచేత. నియోగింపుము = ఆజ్ఞాపింపుము.

286. ఎట్టకేలకున్ = అతికష్టముచేత. ధరాధిపుఁడు=విరాటుఁడు. వదనంబు = మోమును. గురుకార్యవర్తనములున్ = గొప్పపనులచేయుటలును. సహదేవునిమాట విని విరాటుఁడు కష్టముతో నంగీకరించి యిట్లు చెప్పెను. నీకు గొప్పకార్యము లిష్టపడక పశువుల మేపుటయే యిష్టమగుపక్షమున నాపశువుల కంతకు ముఖ్యరక్షకుండవై యుండుమని తా.

287. గోపవర్గము = గొల్లలసమూహము. మన్ననమానిసివి = గౌరవముగల మనుష్యుండవు. ఒప్పమి = ఇష్టములేమి. ఇదివఱకున్న గొల్లలందఱు నీయాజ్ఞమీఱక నిన్నుఁ గొలుచుచుండఁగా నీవు గౌరవముతో మాయొద్దనుండుటయే మాకు మేలని తా.

259. గారవమునన్ = గౌరవముచేత. నిజదేశఆచారముమైన్ = తనదేశముయొక్క యాచారము చొప్పున. కబరీభారంబు = కొప్పుయొక్క సమూహమును. సైరంధ్రీ జాతివేషసముచితభంగిన్ = గట్టువాలుజాతియొక్క వేషమునకుఁ దగినవిధమున. తుఱుముగన్ = కొప్పగునట్లు. ద్రౌపది తన దేశాచారముచొప్పున నల్లియున్నజడను విచ్చి గట్టువాలువేషమునకుఁ దగినట్లు కొప్పుగా నని తా.

క. వలపలిదిక్కున కించుక, మలఁగం గాఁ దుఱిమి కుఱుచ♦మాపుసుపుట్టం
బలవడఁ గట్టి జటావ, ల్కలమున నవ్వీఁగుచన్నుఁ♦గవ గప్పి తగన్. 290

క. పరిచారికాత్వరేఖా, పరిణతి దనమేన నచ్చు♦పడ భావనకుం
దిరమై తలకొనునంతః, కరణముతోఁ బురము ద్రుపద♦కన్యక చొచ్చెన్. 291

వ. ఇట్లు సొచ్చిన. 292

సీ. పఱమొయి ల్గప్పినఁ ♦ బాడఱి నునుఁగాంతి, గదలినయమృతాంశు♦కళ యనంగఁ
బెనుమంచు మీఁదఁ బ♦ర్వినవికాసము దప్పి, చెలువు గుందినసరో♦జినివిధమున
ధూమంబు వొదివినఁ ♦ దుఱఁగలి మెఱుఁగులు, నలఁగి మాసినదీప♦కళికభంగి
ధూళి పైఁ బొరసినఁ ♦ దొంగలించుట మాని, లావణ్య మెడలిన♦లతిక మాడ్కి

290. మలఁగంగాన్ = వంగునట్లు. తుఱిమి = ముడిచి. కుఱుచమాపుసు పుట్టంబు = చిన్నదై మాసిన చీరను. అలవడన్ = అనుకూలమగునట్లు. జటావల్కలమునన్ = ఊడల నారచీర చేత. వీఁగు = నిక్కినట్టి. కొంచెము కుడివైపునకు వ్రాలునట్లు దోఁపి వెడలుపు లేని మాసిన చీరగట్టి నారచీర పైఁట వేసికొని యని తా. కుఱుచ మాపుసుపుట్టంబు అను పాఠము, తుఱిమియను దానికిఁ గబరీ భారంబు కర్మ మగుచుండఁగాఁ గురులు శబ్ద మనాకాంక్షితమై వ్యర్థమగుటంజేసి యనాదరణీయము, కుఱుచశబ్దము పరిచారికోచితమగుటచే నౌచిత్యముం బోషించుచున్నది. మఱియుఁ గుఱుచమాపుసు పుట్టం బనుపాఠము ప్రాచీన పుస్తకములయందే కాక శబ్దరత్నాకరమునందును గానఁ బడుచున్నది. తుఱుమిడి అను పాఠముకూడఁ బూర్వపద్యమునుండి తుఱుముగాఁ దుఱుమిడి యని యన్వయింపవలసివచ్చుటచే నస్వరసము. పాఠాం:—.జటివల్కలమునన్ = ముదుగు నారచీర చేత నని యర్థము. నెవ్వీఁగుఁ జన్నుఁగవ = నిండిననిక్కిన చన్నుఁగవ యని యర్థము.

291. పరిచారికాత్వరేఖా పరిణతి = పనికత్తెతనముయొక్క లక్షణముయొక్క పరిణామము. తనమేనన్ = తన శరీరమునందు. అచ్చుపడన్ = తేటపడఁగా. భావనకున్ = ఆకారమునకు. తలకొను అంతఃకరణముతోన్ = కూడుకొన్న మనస్సుతో. ద్రుపదకన్యక = ద్రౌపది. పురమున్ = పట్టణమును. చొచ్చెన్ అని యన్వయము. ద్రౌపది తనయందుఁ బనికత్తెతనము తేటపడునట్లు వేషముగలదై యావేషమునకుఁ దగిన భావముతో విరాటనగరమును బ్రవేశించె నని తా.

293. పఱమొయిల్ = గొప్ప మేఘము. పాడఱి = పాడుపడి. నునుఁగాంతి = చక్కనికాంతి. కదలిన అమృత అంశుకళ అనంగన్ = పోయిన చంద్రరేఖయో యనునట్లు. పనికత్తెవేషము ధరించుటచే ద్రౌపది మేఘము కప్పుటవలనఁ గాంతిహీన మయిన చంద్రకళవలె నున్నదని తా. పర్వినన్ = వ్యాపింపఁగా. చెలువు = చక్కఁదనము. కుందిన సరోజిని విధమునన్ = చెడినతామరతీఁగవలె. రాత్రియందు మంచు గురియుటచే వికసింపక కాంతిహీనమైన తామరతీఁగవలె నుండె నని తా. ధూమంబు = పొగ. పొదివినన్ = కప్పఁగా. తుఱఁగలి మెఱుఁగులు = ప్రకాశించునట్టి కాంతులు. దీపకళిక భంగిన్ = మొగ్గవంటిదీపమువలె. పొగ క్రమ్ముటచేతఁ గాంతిహీనమైన దీపమువలె నుండె నని తా. ధూళి = దుమ్ము. తొంగలించుట = ప్రకాశించుటను. లావణ్యము = చక్కఁదనము. ఎడలిన లతికపగిదిన్ = పోయిన తీఁగవలెను. దుమ్ము గప్పుటచేఁ గాంతిలేని తీఁగవలె నుండె నని తా. గంధ

గంధకారికావేషంబు♦కతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱువడి♦యుండఁబాండు
తనయమహిషి యంచితగతిఁ ♦ జనఁగ రాజ, వీథిఁ బౌరజనంబు ల♦వ్వేలఁదిఁజూచి.

ఉ. రోహిణి యొండె నొండెను న♦రుంధతి గాక మనుష్యజాతియే
యీహరిణాక్షి చెల్వమున ♦ కేడ్తెఱఁ జూడ్కులు నాఁచికోలు గా
దా హితగౌరవం బగుశు♦భాంగము దేజముఁ జూడ బుద్ధి సం
దేహముఁ బొందుచున్నది స♦తీజన మిట్టిదె యేజగంబులన్. 294

వ. అనుచు నంతంతం జేరి. 295

క. నీ వెవ్వ రేమి పనికై, యేవలనికిఁ బోవు చునికి ♦ యిది నావుడు న
ద్దేవియు సౌముఖ్యము సం, భావనముం దోఁప నుచిత♦భంగిం జెప్పెన్. 296

గీ. ఏను గట్టువాలు♦దాన నా కెవ్వరు, కడుపుకూడు వెట్టి ♦ కట్టఁ జీర
యిచ్చి సాకతమున ♦ నేలుదు రట్టివా, రలకుఁ బనులు సేసి ♦ మెలఁగుబుద్ధి. 297

క. వచ్చితి ననవుడు విని జను, లచ్చెరువును సందియంబు ♦ నందెడుమదితో

కారికావేషంబుకతనన్ = గట్టువాలు వేషముయొక్క కారణముచేత. మూర్తి ఉజ్జ్వలత్వంబు = ఆకారముయొక్క కాంతి. మఱువడి = మఱుఁగుపడి. పాండుతనయ మహిషి = ద్రౌపది. అంచితగతిన్ = మందగమనముచేత. పనికత్తెవేషము తాల్చియుండుటచే తనమేని యతిశయము తెలియకుండ ద్రౌపది రాజవీథిఁ బోవుచుండఁగా జను లాబిడను చూచి యని తా.

294. రోహిణి=చంద్రునిభార్య. అరుంధతి = వసిష్ఠునిభార్య. ఈహరిణ అక్షి చెల్వమునకున్= జింక కన్నులవంటి కన్నులు గల యీద్రౌపది చక్కఁదనమునకు. ఏడ్తెఱన్ = అతిశయముచేత. నాఁచికోలు = దక్కినవి. కాదా-ఔననుట. హిత గౌరవంబు =ధరింపఁబడిన గొప్పతనముగలది. శుభ అంగమున్ = మంచిదేహమును. సతీజనము= స్త్రీజనము. ఈమె చక్కఁదనము చూడఁగాఁ గన్నులు చెదరుచున్నవి. ఈమె రోహిణియో యరుంధతియో కావలెను గాని మనుష్యజాతి కాదు, ఇట్టిరూపమును గాంతియుఁ గల స్త్రీ యెచ్చటను లేరని తా.

296. ఏవలనికిన్ = ఏదిక్కునకు. పోవుచునికి = పోవుచుండుట. అద్దేవియున్ = ఆద్రౌపది యును. సౌముఖ్యమున్ = ప్రసన్నతయును. సంభావనమున్ = గౌరవమును. ఉచితభంగిన్ = తగినవిధమున. నీవెవ్వరవు, ఎచ్చటికేపనికై పోయెద వని యడుగఁగా ద్రౌపది ప్రసన్నయై వారి నాదరించి యిట్లు చెప్పె నని తా.

297. గట్టువాలుదానన్ = సైరంధ్రిని. సాకతమునన్ = అనుగ్రహముచేత. మెలఁగుబుద్ధిన్ = ఉండుతలంపుతో. నేను పనికత్తెను, నాకుఁ గూడు గుడ్డ యిచ్చి కాపాడువారికిఁ బనులుచేసి బ్రదుక వలయు ననుతలంపుతో నని తా.

298. అందెడుమదితోన్ = పొందునట్టి మనస్సుతో. ఇచ్చెలువ = ఈ స్త్రీ. పలుకు = మాట.

నిచ్చలువ కడుపుకూటికి, నెచ్చటనైన నిలుచునటె ♦ యిది పలు కగునే. 298

వ. అనుచుం గనుంగొనుచు ముసరికొనుచుండఁ బాంచాలరాజనందన రాజమందిరం బుచక్కటికి నరుగునవసరంబున. 299

క. ముద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువునఁ బ్రణయసఖుల♦తోడ విహారా
స్పద మగునెలవున మెలఁగెడు, సుధేష్ణ తజ్జాలకములఁ ♦ జూచెం బ్రీతిన్. 300

వ. ఇత్తెఱంగున మత్స్యరాజమహిషి ద్రౌపదీదేవి నాలోకించి కుతూహలంబున. 301

ఉ. ఎక్కడనుండి యెక్కడకు ♦ నేగెడినో యిది యొక్క కాంత రూ
పెక్కుడు పెంపుసొంపు మన ♦ కేర్పడుచున్నది దా వినీతయై
స్రుక్కుచు నీచభామినుల♦చొప్పునఁ బల్కెడుఁ బౌరులుం గడున్
వెక్కస మంది చూచెదరు ♦ వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. 302

క. అని పలికి పనుపఁ బ్రౌఢాం, గన లిరువురు వోయి ద్రుపద♦కన్యకతో ని
ట్లనిరి విరాటమహిషి నినుఁ, దనపాలికిఁ బిలువఁ బంపె ♦ దయ పెంపెసఁగన్.

వచ్చితి వని చెప్పఁగా జనులామాట విని యాశ్చర్యము నొంది యిట్టి యందకత్తె కడుపుకూటికిఁ బని చేయునా? యీమాట నమ్మఁదగినది కాదని తా.

299. ముసరి కొనుచున్ = చుట్టుకొనుచు. పాంచాలరాజనందన = ద్రౌపది. రాజమందిరంబు చక్కటికిన్ = రాచనగరునొద్దకు.

300. ముదము = సంతోషము. ఒదవన్ = కలుగునట్లు. రమ్యహర్మ్యము తుది నిలువునన్ = చక్కని మేడయొక్క కడపటి యంతస్తునందు. ప్రణయ సఖులతోడన్ = కూరిమి చెలులతో. విహార ఆస్పదము = విహరించుస్థానము. అగు నెలవునన్ = అయినచోటియందు. తత్ జాలకములన్ = దాని కిటికీల నుండి. సుధేష్ణ మేడమీఁద చెలికత్తెలతోఁ గూడి విహరించుచున్నదై రాజవీథిఁ బోవుచున్న యాద్రౌపదిని కిటికీలనుండి చూచినది యని తా. ఇందు దథలకుఁ బ్రాసము చెప్పఁబడినది. అప్పకవి యీప్రాసమును స్వవర్గజప్రాసమని చెప్పియున్నాఁడు. సంస్కృతమునందు సుధేష్ణా శబ్దము తవర్గీయ చతుర్థ వర్ణఘటితముగానే కనఁబడుటవలన సుదేష్ణ యని కల్పించుట యుచితము కాదు.

301. మత్స్యరాజమహిషి = విరాటుని పట్టపుదేవి. ఆలోకించి = చూచి. కుతూహలంబునన్ = కోరికతో.

302. కాంత = స్త్రీ. రూపు = చక్కఁదనము. పెంపుసొంపు = గౌరవముయొక్క యతిశయము. వినీత ఐ = వినయముగలదై. స్రుక్కుచున్ = సోలుచు. నీచభామినుల చొప్పునన్ = నీచ స్త్రీలవిధమున. పౌరులున్ = పట్టణమునందలి జనులును. ఈ స్త్రీచక్కఁదనమును గౌరవమును గలిగియు నడఁకువతో నీచ స్త్రీవలెఁ బలుకుచున్నది. జనులందఱు నీమె నాశ్చర్యముతోఁ జూచుచున్నారు. ఈమె యెచ్చటికిఁ బోవుచున్నదో తెలిసికొని యీమెను బిలుచుకొనిరండు అని తా.

303. పనుపన్ = ఆజ్ఞాపింపఁగా. ప్రౌఢఅంగనలు = నేర్పుగలస్త్రీలు. పెంపెసఁగన్ = అతిశయింపఁగా. అనిచెప్పిపంపఁగా నిద్దఱు స్త్రీలు పోయి ద్రౌపదితో నిన్ను విరాటరాజు భార్య పిలుచుకొని రమ్మనిన దని చెప్పి రని తా.

వ. అనువుడు. 304

క. తనతలఁపు నెరసె నని యి, వ్వనితా రత్నంబు వినయ♦వైభవము సతీ
తను వొందినచందంబునఁ, జనియెం గేకయసుతాను♦చారికలబడిన్. 305

వ. ఇవ్విధంబునం జని సౌధంబునుపరిభాగం బెక్కి. 306

సీ. పదతలంబులకెంపు ♦ పరఁగినతలము కుం, కుమలిప్త మైనచం♦దము వహింప
నంగంబునునుఁగాంతి ♦ యడరినగోడలు, వేదులు మణిమయ♦విధము నొందఁ
గనుఁగవమెఱుఁగులు ♦ గదిరినముందఱ, పుష్పోపహారంబు♦పోలుపు దాల్ప
వేనలికప్పు ప♦ర్వినమీఁదు నీలదు, కూలంపుమేల్కట్టు♦కొమరు వడయఁ

305. నెరసెన్ = నిండెను. అవ్వనితారత్నంబు = ఆయుత్తమ స్త్రీ, ద్రౌపది. వినయవైభవము = అడఁకువయొక్క యతిశయము. సతీతనువు = స్త్రీరూపమును. కేకయసుతా అనుచారికలబడిన్ = కేకయరాజుకూఁతురయిన సుధేష్ణ పనికత్తెలవెంబడి. చనియెన్, అని యన్వయము. ద్రౌపదితనకోరిక నెఱవేఱిన దని సంతోషించి వినయమున సుధేష్ణపనికత్తెలవెంటఁబోయె నని తా. పాఠాం:—తలసీరయరసి = మేలిముసుఁగును సవరించుకొని యని యర్థము. "ఏకవాససమ్" అని సంస్కృతమునందుఁ జెప్పఁబడినది, ఇందును మేలిముసుఁగు ద్రౌపది ధరించినట్లు వర్ణింప లేదు, కావున ఈపాఠము కవిసమ్మతము కాదు. మఱియు తలసీరయనుచో చకారమునకు సకారాదేశము చింత్యము.

306. సౌధంబు ఉపరిభాగంబు = మేడయొక్క పైభాగమును.

307. పదతలంబులకెంపు = అడుగుల యెఱ్ఱఁదనము. పరఁగినతలము = వ్యాపించిననేల. కుంకుమలిప్తము = కుంకుమముచేఁ బూయఁబడినది. ఐనచందము = అయినవిధమును. వహింపన్ = పొందఁగా. ద్రౌపది పాదతలముల కాంతి వ్యాపించినప్రదేశము కుంకుమము పూసినట్లెఱ్ఱగా నొప్పె నని తా. అంగంబునునుఁ గాంతి = దేహముయొక్క చక్కని కాంతి. అడరిన గోడలు = వ్యాపించినగోడలును. వేదులు = అరఁగులును. మణిమయ విధమున్ = రత్నాలు నిండినరీతిని. ఒందన్ = పొందఁగా. ద్రౌపదిదేహకాంతి ప్రసరించినగోడలును తిన్నెలును రత్నమయములుగా నున్నట్లు తోఁచె నని తా. హస్తములు నఖములు పెదవులు మొదలగువాని రక్తశ్వేతకాంతులచే పద్మరాగములు వజ్రములు తాఁపినట్లు తోఁచెనని భావము. కనుఁగవ మెఱుఁగులు = కనుదోయియొక్క కాంతులు. కదిరిన ముందఱ = వ్యాపించిన ముందటి భాగము. పుష్ప ఉపహారంబు పోలుపు = పువ్వుల చల్లుటయొక్క విధమును. తాల్పన్. కటాక్షములు ప్రసరించిన ముందటి నేలపూలు చల్లినట్లొప్పెనని తా. చూపులుపార్శ్వములందుఁ బ్రసరించినట్లు వర్ణింపక ముందుభాగమునఁ బ్రసరించినట్లు వర్ణించుటచే ద్రౌపదీవినయము ధ్వనించుచున్నది. పాఠాం:—కదరినముందల—ముందలయనఁగా శిరోగ్రభాగ మని యర్థము, శిరోగ్రభాగమునకుఁ గటాక్షప్రసార మసంభవము, మఱియు నీపద్యమునం దంతటను విరాటునిగృహమునందే ద్రౌపదీలావణ్యవిశేషముచే నతిశయము దోఁచినట్లు వర్ణింపఁబడియున్నది. కావున నీపాఠ మసంగతము. వేనలికప్పు = కొప్పుయొక్క నల్లఁదనము. పర్వినమీఁదు = వ్యాపించిన మీఁదిభాగము. నీలదుకూలంపు మేల్కట్టుకొమరు = నల్లపట్టువస్త్రము చందువయొక్క చక్కఁదనమును. పడయన్ = పొందఁగా. కొప్పుయొక్కకాంతి పైకిఁ బ్రసరించుటచే మీఁదిభాగమున నల్లపట్టుచందువ కట్టినట్లుండె

దాను జొచ్చినకతన మత్స్యక్షితీశు, నింట నిమ్మెయిఁ గ్రొత్త యొ♦ప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ ♦ కల్లనల్లఁ, బాండురాజతనూభవ♦పత్ని యరిగె. 307

వ. కేకయరాజనందన యును. 308

చ. కనుఁగొని గారవంబును మొ♦గంబునఁ గేలఁ బురఃప్రసారముం
దనువున నమ్రభావమును ♦ దంతమరీచుల సామినిర్గమం
బును దనలోఁ గడల్కొనఁగ ♦ భూరితరాదరరేఖ నిందు ర
మ్మనవుడు నంత నంత ద్రుప♦దాత్మజ సేరి వినీతి నిల్చినన్. 309

నని తా. మత్స్యక్షితీశునింటన్ = విరాటుని యింటియందు. ఇమ్మెయిన్ = ఈవిధమున. క్రొత్తయొప్పు = క్రొత్తచక్కఁదనము. ఎసకము ఎసఁగన్ = అతిశయింపఁగా. పాండురాజ తనూభవపత్ని = పాండుపుత్త్రుల భార్యయగు ద్రౌపది. అమ్మహాదేవి = ఆసుధేష్ణ. ఉన్న ఎడకున్ = ఉన్నచోటికి. అల్లనల్లన్ = మెల్లమెల్లగా. అరిగెన్ = పోయెను. ద్రౌపది ప్రవేశించునపుడు ఆమె లావణ్యవిశేషముచే విరాటునినగరు వింతకాంతి నొంది ప్రకాశించె నని తా.

308. కేకయరాజనందనయును = కేకయరాజుకూఁతురయిన సుధేష్ణయును.

309. కనుఁగొని = చూచి. మొగంబునన్ = మోమునందు. గారవంబును = గౌరవమును. కేలన్ = చేతియందు. పురఃప్రసారమున్ = ముందటికిఁ జాఁగుటయును. తనువునన్ = దేహమునందు. నమ్రభావమును = వంగినది యగుటయును. దంత మరీచులన్ = దంతకాంతులయందు. సామి నిర్గమంబును = సగము వెడలుటయును. తనలోన్ — సుధేష్ణయం దనుట. కడల్కొనఁగన్ = వ్యాపింపఁగా. భూరితర ఆదరరేఖన్ = మిక్కిలి యెక్కుడయిన యాదరముయొక్క లక్షణముచేత. ఇందున్. రమ్ము. అనవుడున్ = అని సుధేష్ణ చెప్పఁగా. అంతన్ అంతన్ — తిన్నతిన్నగా ననుట. ద్రుపద ఆత్మజ = ద్రౌపది. చేరి. వినీతిన్ = వినయముతో. నిల్చినన్. సుధేష్ణ చూచి తన మోమున ద్రౌపదిమీఁద గౌరవభావము తోఁపఁగా చేయిచాఁచి కొంచెమువంగి చిఱునవ్వుగలదై మిక్కిలి యాదరముతో దగ్గఱకు రమ్మని పిలువఁగా ద్రౌపది తిన్నగా నామెయొద్దకుఁ బోయి నిలిచె నని తా. పాఠాం:—గారవంబును మొగంబును, గేలుఁ బురఃప్రసారముం, దనువును, నమ్రభావమును, దంతమరీచులు సామినిర్గమంబును, దమలోఁ గడల్కొనఁగన్—ఈపాఠంబునందు గారవము మొదలగునవియు మొగంబు మొదలగునవియుఁ గడల్కొనిన ట్లర్థమగుచున్నది. కడల్కొనుధాతువు అకర్మకమగుటవలన నన్నియుఁ బ్రథమాంతములుగానే యన్వయింపవలెను. తమలోన్ అను బహువచనముచేత మొగంబును గారవంబును లోనగు ద్వంద్వములు పరస్పరము నొకదానిలో నొకటి కడల్కొన్నట్లర్థము చెప్పవలయును, కానిచో బహువచన మన్వయింపదు. గారవము మొదలగునవి మొగము మొదలగువానియందుఁ గడల్కొన వచ్చును గాని గారవము మొదలగువానియందు మొగము మొదలగునవి కడల్కొనుట యసంభవము. ఇట్లన్నివిధములచేతను అన్వయానుపపత్తిం జేసి యీపాఠ మసమంజసము. ఇట్లు ప్రథమాంతములుగానే పఠించి తనలోఁ గడల్కొనఁగ నని యొక యేకవచనాంత పాఠము కల్పించెదరు. అపుడును తనలోన్ అనఁగా సుధేష్ణలో నని యర్థము చెప్పవలెను. కడల్కొనుధాతువు అకర్మక మగుటవలన గారవంబును మొగంబును మొదలయిన ప్రథమాంతద్వంద్వములకు అన్వయము సంభవింపమి యను పూర్వోక్తదోషము తదవస్థమైయున్నది. కావున నీపాఠమును అసమంజసము.

క. ఆపాదమస్తకముఁ ద, ద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్
భూపాలమహిషి యిట్లను, నాపొలఁతుకతోడ నుచిత ♦ మయ్యెడుభంగిన్. 310

గీ. ఏది కులము నామ ♦ మెయ్యది యెవ్వరి, దాన వేమి పనికిఁ ♦ బూని యిప్పు
డెచటు బుద్ధిఁదలఁచి ♦ యేగెద వింతయు, నెఱుఁగఁజెప్పు మాకు ♦ మెఱుఁగుఁబోఁడి.

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను సైరంధ్రీజాతిసంభూత నభిధానంబు మాలిని పురుషపంచకసనాథనై యుండుదు నొక్కకారణంబున నుద్ధతు లగువిరోధులచేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబున కరిగి వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి నిట మీఁద నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు గొఱంత గలదు నీవు ధర్మవర్తినివని వినుటం జేసి నానేర్చుపనులవెంట నీకడ నిలువం దలంచి యిందు వచ్చితి ననవుడు సుధేష్ణ యిట్లనియె. 312

క. సురగరుడఖచరవిద్యా, ధరకిన్నరయక్షసిద్ధ ♦ తరుణులలో నీ
వరయఁగ నొక్కతె వగు ది, వ్వరికిం జనుదేరఁ గతము ♦ బొంకక చెపుమా.

క. అనవుడు దరహసితము మో, మునకుం దగుతొడవు గాఁగ ♦ ముద్దియ యేఁ గృ
ష్ణునిదేవి సత్యభామకుఁ, బని సేయుదుఁ దొల్లి పిదపఁ ♦ బాంచాలికడన్. 314

310. ఆపాదమస్తకమున్ = పాదములు మొదలు శిరస్సువఱకు. తద్రూపమున్ = ఆ ద్రౌపది యొక్క చక్కఁదనమును. వీక్షించుచున్ = చూచుచు. భూపాలమహిషి = విరాటరాజుభార్య. ఆ పొలఁతుకతోడన్ = ఆ ద్రౌపదితో. ఉచితము = తగినది. ఇట్లు సుధేష్ణ ద్రౌపది యందమును చక్కఁగాఁ జూచినదై ద్రౌపదితో నిట్లు చెప్పె నని తా.

311. ఎచటు = ఏచోటును. మెఱుఁగుఁబోఁడి = మెఱపువంటి శరీరముగలదానా! ద్రౌపది సంబోధనము. నీ వేకులమునఁ బుట్టితివి, నీ పేరేమి? ఏమిపనికై యెచ్చటికిఁ బోయెదవు? మాకుఁ జెప్పు మని తా.

312. యాజ్ఞసేని = ద్రౌపది. సైరంధ్రీజాతి సంభూతన్=గట్టువాలుజాతియందుఁ బుట్టినదానను. అభిధానంబు = పేరు. పురుషపంచక సనాథను ఐ = పురుషుల యయిదుగురితోఁ గూడినదాననై. ఉద్ధతులు = గర్వము గలవారు. వల్లభసహితంబుగాన్ = భర్తలతోఁ గూడినట్లుగా. వన్యఆహారంబులన్=అడవియందుఁబుట్టిన యాహారములచేత. నియమఆచరణంబునకున్=బ్రహ్మచర్యవ్రతము చేయుటకు. ధర్మవర్తినివి = ధర్మమునం దున్నదానవు.

313. తరుణులలోన్ = స్త్రీలలో. కతమున్ = కారణమును. నీవు దేవతలు మొదలగువారిలో నొక్కతెగా నుండవలెను, ఈ పట్టణమునకు వచ్చినకార్యమును యథార్థముగాఁ జెప్పు మని తా.

314. దరహసితము = చిఱునవ్వు. తగుతొడవు = తగినయలంకారము. ముద్దియ = ద్రౌపది. సుధేష్ణమాట విని ద్రౌపది చిఱునవ్వునవ్వుచు నిట్లు చెప్పెను, నేను మొదట సత్యభామకుఁ బనికత్తెనై యుంటిని, పిదంపడి ద్రౌపదియొద్ద నని తాత్పర్యము.

గీ. తగవుమైఁ బరిచారికా♦ధర్మములకు, నెల్లఁ జాలి వర్తించితిఁ ♦ దల్లి వినుము
నాకుఁ బ్రాణంబు ప్రాణమై♦ నన్నుఁ దన్న, కాఁగ భావించి యాదేవి ♦ గారవించు.

వ. నీవును. 316

క. నీచము లయ్యెడిపనులకు, నాచాలమి యెఱిఁగి మన్న♦నకుఁ బాత్రము గా
నీచిత్తంబునఁ గైకొని, యాచారము దప్పకుండ ♦ నరయుము నన్నున్. 317

వ. అని యిట్లు దేవజాతి యనుసందియంబు వాయం బలికి మఱియు. 318

క. కలపములు గూర్ప బహువిధ, తిలకంబులు వెట్ట వింత♦ తెఱఁగునఁ బలుపూ
వులు గట్టఁ గట్టి ముద్దుగఁ, దల ముడువఁగ సరులు గ్రువ్వఁ ♦ దద్దయు నేర్తున్.

మ. అనినం గేకయరాజనందన ప్రభూ♦తాశ్చర్యయై యిట్లనున్
విను నీరూపము చూచి మాన్నృపతి యు♦వ్విళ్లూరు నే నేమెయిం
బనిగొందుం దగ నింతులుం దగిలి నీ♦పైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనము ల్విస్మయ మందఁ జూచెదరు భా♦మా పల్కు లిం కేటికిన్. 320

క. దుర్భర వగునినుఁ గర్కటి, గర్భము ధరియించునట్లు ♦ గైకొని నాకై

315. తగవుమైన్ = తగినవిధమున. పరిచారికాధర్మములకున్ = పనికత్తె ధర్మములకు. తల్లి! సుధేష్ణసంబోధనము. తగినపనులు చేయుచుంటిని, ఆమె నన్నుఁ దనవలెనే తలఁచి గౌరవించుచుండె నని తా. ఆమెయే నే నని యాంతరంగికార్థము.

317. నాచాలమి=నాయశక్తతను. మన్ననకున్=గౌరవమునకు. నన్ను నీచకార్యములకు నియోగింపక గౌరవంబునఁ జూచుకొమ్మని తా.

318. వాయన్ = పోవునట్లు.

319. కలపములు = గంధములను. బహువిధతిలకంబులు=పలువిధములగు తిలకములను. సరులు= దండలను. గ్రువ్వన్ = కూర్చుటకును. తద్దయున్ = మిక్కిలి. గంధములు కూర్చుటకును, తిలకములు దిద్దుటకును, పూవులుగట్టి చక్కఁగాఁ దలయందు ముడుచుటకును, హారములు కూర్చుటకును నేను సమర్థురాల నని తా.

320. కేకయరాజనందన_సుధేష్ణ. ప్రభూతఆశ్చర్యయై = గొప్పయాశ్చర్యముకలదై. మాన్నృపతి= మారాజు, విరాటుఁ డనుట. ఉవ్విళ్ళూరున్=ఆశపడును. ఏమెయిన్= ఏవిధమున. ఇంతులున్ = స్త్రీలును. తగిలి = ఆసక్తలై. నెక్కొల్పి = నిలిపి. విస్మయము = ఆశ్చర్యమును. భామా = ఓ స్త్రీ! ద్రౌపదిసంబోధనము. ద్రౌపదిమాట విని సుధేష్ణ యాశ్చర్యపడి యిట్లనియె, నీచక్కఁదనము చూచి స్త్రీలుగూడ మోహించుచున్నారు, ఇఁక మారాజు మోహించు ననుటకు సందేహము లేదు, నేను నిన్నెట్లుంచుకొందు నని తా.

321. దుర్భరవు = భరింపరానిదానవు. కర్కటి = ఆఁడుఎండ్రకాయ [illegible] ఆవిర్భావమున్ = మిక్కిలి యధికమయిన చేటు అను అవస్థయొక్క కలుగుటను. వేరవు [illegible]

నిర్భరవిధ్వంసదశా, విర్భావముఁ దెచ్చికొనుట ♦ వెరవై యున్నే. 321

గీ. అనిన నీతలంచి♦నట్లు కా దేర్పడ, వినుము నాదుపతులు ♦ వెరవు లావు
నలఘువిక్రమంబుఁ ♦ గలుగుగంధర్వు లే, మఱియ నన్ను నొక్క♦మాత్రమైన. 322

క. నీచమతి నన్ను నెవ్వఁడు, చూచిన నారాత్రిలోనఁ ♦ జూతురు తెగఁ దా
రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమము ల♦ఖర్వము లైనన్. 323

క. బంధుశతంబులు శౌర్యమ, దాంధములై శక్తిసంప♦దాభీలతమై
సింధురసదృశత నున్నను, సంధులు సంధు లెడలించి ♦ చంపుదు రతనిన్. 324

వ. కావునఁ బురుషులు నాకడం జేఱి చూడ వెఱతు రదియునుం గాక. 325

క. నాచిత్తము తాదృశులకు, గోచరమే యస్మదీయ♦కులజనసంశి
క్షాచరణమహిమ యట్టిది, యే చెప్పరు తద్విధాతి♦హీనవచనముల్. 326

ఉన్నే = ఉండునా? ఆఁడుమెంగ్రకాయ గర్భముధరించి చచ్చునట్లు నిన్నుంచుకొని నేనే నన్నుఁ జెఱ చుకొనుట యుక్తముకా దని తా.

322. నాదుపతులు = నామగలు. వెరవున్ = ఉపాయమును. లావున్ = బలమును. అలఘు విక్రమంబున్ = గొప్ప పరాక్రమమును. ఒక్కమాత్ర ఐనన్ = ఒకక్షణమైనను. నన్నున్. ఏమఱరు అని యన్వయము. సుధేష్ణమాట విని ద్రౌపది యిట్లనియె. నీవు తలఁచినట్లు కాదు, ఏలయనఁగా నామ గలు గంధర్వులు మిక్కిలి శూరులును సమర్థులును నన్ను క్షణమైన నేమఱి యుండ రని తా.

323. నీచమతిన్ = నీచపుతలంపుతో. ఆచపలున్ = ఆచపలచిత్తుని. హరిహరఆదులు = విష్ణువు శివుఁడు మొదలుగాఁ గలవారలు. బలవిక్రమములు = బలమును బరాక్రమమును. అఖర్వ ములు=అధికములు. తెగఁజూతురు=చంపుదు రనుట. నన్నెవ్వఁడైనను అవమానించినయెడ వాఁ డెంత బలవంతుఁడైనను వాని నెవ్వరు గాపాడినను నామగ లారాత్రిలోనే వానిం జంపుదు రని తా.

324. బంధుశతంబులు = చుట్టాలనూఱులు, పెక్కురుచుట్టా లనుట. శౌర్యమదఅంధములు ఐ= పరాక్రమముయొక్క గర్వముచే గ్రుడ్డివై. శక్తిసంపత్ ఆభీలతమైన్= సామర్థ్యముచేతను సంపదచేతను భయంకరము లగుటచే. సింధురసదృశతన్= ఏనుఁగులతో సమానము లగుటచేత. సంధులుసంధులు = ప్రతిసంధిబంధములను. ఎడలించి = వదలఁగొట్టి. అతనిన్. చంపుదురు అని యన్వయము. వానికి బలవంతులును సామర్థ్యసంపన్నలు గలవారు నగు చుట్టాలు ఏనుఁగులవంటివా రెందఱున్నను వాని కీలుకీలు వీడఁగొట్టి నామగలు వానిం జంపుదు రని తా.

326. నాచిత్తము = నామనస్సు. తాదృశులకున్ = అట్టివారికి. గోచరము ఏ = విషయమా? లోఁబడని దనుట. అస్మదీయకుల జనసంశిక్షాచరణమహిమ=మాదైన వంశమునందలి జనుల చక్కని శిక్ష యొక్కయు ఆచారముయొక్కయు మహిమ. అట్టిది ఏ — అట్టిది కా దనుట. తత్ విధ అతిహీనవచన ముల్ = అట్టి మిక్కిలి నీచపుపలుకులను. చెప్పరు అని యన్వయము. నామనస్సు అట్టి నీచులకు లోఁబ డదు. మావంశముయొక్క పద్ధతి యంత నీచమయినది గాదు, అట్టి నీచపుపలుకు లాడరు మని తా.

చ. మనమున నూఱడిల్లు మను♦మానము మానుము నన్ను నేలు మే
పనులు నుదాత్తనాగరక♦భంగుల నీమది కెక్కునట్లు నే
ర్పున భయభక్తులు న్మెఱయ ♦ రూపుగఁ జేసెదఁ దజ్జులైనస
జ్జనులు నుతింప వర్తనము ♦ సాధులు వృద్ధులు మెచ్చ సల్పెదన్. 327

క. నను గుచ్ఛితంపుఁబనులకుఁ, బనుపక యెంగిలికి లోను♦పఱుపక తగుమ
న్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి కొలుతు ♦ రస్మత్పతులున్. 328

గీ. అనిన సంతసిల్లి ♦ యద్దేవి సైరంధ్రి, నూఱడిల్లఁ బలికి ♦ యునిచికొనియె
నంతిపురముచరిత ♦ కలవడ మెలఁగుచు, నుండె నవ్వధూటి♦యును ముదమున.

క. ఇవ్విధమున నయ్యేవురు, నవ్వేలఁదియు సకలజనుల ♦ కజ్ఞాతముగా
నవ్విరటుప్రోలఁ బ్రమదము, నివ్వటిల వసించి రుచిత♦నిభృతత్వమునన్. 330

వ. అనిన విని వారలవర్తనం బటమీఁదఁ జెల్లినతెఱం గెఱింగింపు మనిన. 331

327. ఉదాత్త నాగరకభంగులన్ = గొప్ప నగరవాసులయొక్క విధములచేత. నీమదికిన్ = నీమనస్సునకు. రూపుగన్ = చక్కఁగా. తజ్జ్ఞులు= ఆపను లెఱింగినవారు. వర్తనము=అచారమును. సాధులున్ = సత్పురుషులును. వృద్ధులున్ = పెద్దలును. మెచ్చన్. సల్పెదన్ అని యన్వయము. నీవు సందియమును మాని నన్నుఁ బాలింపుము. నే నేపనినైనను ఆపనిని జక్కఁగా నెఱింగినవారు మెచ్చుకొనునట్లు భయభక్తులతోఁ జేసెదను. నానడవడికి సత్పురుషులును పెద్దలును మెచ్చుకొందు రని తా.

328. కుచ్ఛితంపుపనులకున్ = నిందింపఁ దగినకార్యములకు. లోనుపఱుపక = లోఁబడునట్లు చేయక. తగు మన్ననతోడన్ = తగినమర్యాదతో. అరయువారలకున్ = చూచువారికి. అస్మత్పతులున్ = నామగలును, బహువచనము ఆత్మార్థకము. అనురాగమున్. నెఱపి = నిండించి. కొలుతురు. నన్ను నీచపుపనులకుఁ బంపక యెంగిలి తినునట్లు చేయక మర్యాద చేయువారిని నామగలుగూడ గౌరవింతు రని తా.

329. అద్దేవి = అసుధేష్ణ. అంతిపురముచరితకున్ = అంతఃపురముయొక్క యాచారమునకు. అలవడన్ = యుక్తమగునట్లు. అవ్వధూటియును = ఆద్రౌపదియును. ముదమునన్ = సంతోషముతో. మెలఁగుచుండెన్ = నడచుచుండెను. ద్రౌపదిమాట విని సుధేష్ణ ద్రౌపదిని మంచిమాటలతో సమాధానపఱచి తనయొద్ద నుంచికొనెను, ద్రౌపదియును నంతఃపురమునకుఁ దగుపనులు చేయుచు సంతోషంబున నుండె నని తా.

330. అవ్వేలఁదియున్ = ఆద్రౌపదియును. అజ్ఞాతముగాన్ = తెలియనియట్లుగా. అవ్విరటుప్రోలన్ = ఆ విరాటుని పట్టణమునందు. ప్రమదము= సంతోషము. నివ్వటిలన్ = నిండునట్లు. ఉచితనిభృతత్వమునన్ = తగినరహస్యభావముచేత. వసించిరి. అని యన్వయము. ఇట్లు పాండవులు అయిదుగురును ద్రౌపదియును నెవ్వరికిని దెలియ నట్లు విరాటరాజుపట్టణమునందు సంతోషముతో రహస్యముగా వాసము చేసి రని తా.

331. వర్తనంబు= సమాచారము, చెల్లినతెఱంగు = జరగినవిధమును. అనినన్—దీనికి జనమేజయుఁడు కర్త, ద్వితీయాశ్వాసమునందలి దేవా వైశంపాయనుండు అనువచనముతో నన్వయము.

ఉ. బాంధవశాత్రవాకలిత◆భావభవా◆భవపాశబంధసం
బంధవిరామరామ పరి◆పక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమ◆కారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితస◆మీక్షణ నిత్యమహాద్భుతప్రభా. 332

క. అన్నమయత్వాదివిరా, మోన్నతివాఙ్మనసదూర ◆ యోగిస్మేరా

332. బాంధవ...భవా—బాంధవ = బంధుత్వముచేతను, శాత్రవ = శత్రుత్వముచేతను, ఆకలిత= పొందఁబడిన, భావభవా= మన్మథుఁడుకలవాఁడా! మన్మథుఁడు హరికిఁబుత్రుఁడును హరునికి శత్రువు నగుటచే హరిహరనాథునియందీయుభయధర్మము చెప్పఁబడినది. భవ...రామ—భవపాశ = సంసారము అను త్రాటియొక్క, బంధ=కట్టుతోడి, సంబంధ = సంబంధముయొక్క, విరామ = పోఁగొట్టుటచేత, రామ = మనోహరుఁ డయినవాఁడా! సంసారమును పోఁగొట్టువాఁడా యని తా. పరి...విభేదనా—పరిపక్వ = పండిన, వివేక = తెలివిచేత, నిరూఢ = ప్రసిద్ధులగు, భక్త = భక్తులయొక్క, హృత్= హృదయమునందలి, గ్రంథి= ముడియొక్క, విభేదనా= భేదించువాఁడా! వివేకముగల భక్తులయంతఃకరణములోనియావరణరూప మయినముడిని విచ్చి యాత్మస్వరూపమును దెలుపువాఁడా యని తా. పరమకారుణికా = మిక్కిలిదయగలవాఁడా! పరిమాణదూర = కొలఁదిమీఱిన వాఁడా! దుఃఖఇంధనపావకాయితసమీక్షణ= దుఃఖము అనుకట్టెలకు నిప్పువంటి చూపుగలవాఁడా! దుఃఖమును పోఁగొట్టునట్టి కటాక్షముగలవాఁడా యని తా. నిత్యమహత్ అద్భుతప్రభా= నిత్యమయి మిక్కిలియాశ్చర్యకరమయిన తేజస్సుగలవాఁడా! హరిహరనాథునిసంబోధనములు. ఈపద్యమునందు బిందుపూర్వక థ ధలకుఁ బ్రాసము ప్రయోగింపఁబడినది. ఈ పద్యమును మఱికొన్నిటిని నుదాహరించి ఇట్టివానికి అప్పకవి స్వవర్గజప్రాసమని పేరుపెట్టెను. ఇట్లుండఁగా 'హృద్గంధవిభేదనా' అని పాఠమును గల్పించుట సాహసము. హృదయమునందలి వాసనను భేదించువాఁడా యని దానియర్థము. అప్పుడు విభేదనపదార్థస్వారస్యమును చెడుచున్నది. 'భవపాశవల్లికా బంధ' యనుపాఠమునందు భవమునందుఁ బాశత్వారోపమును మరల దానియందువల్లికాత్వారోపమును అనుచితంబగుటచే నాపాఠంబసంగతము. 'చైత్య మహాద్భుతప్రదా' అను పాఠము అనన్వితము నశ్లీలార్థకము నగుటచే ననాదరణీయము. "దైత్యమహాద్భుతప్రభా= రాక్షసులకు మిక్కిలియాశ్చర్యము గలిగించునట్టి తేజస్సు గలవాఁడా యని యర్థము. అస్వారస్యార్థం బగుటచే నీపాఠముగూడ నుపేక్ష్యము.

333. అన్నమయత్వ...దూర—అన్నమయత్వ ఆది = అన్నమయ మగుట మొదలుగాఁ గలవానియొక్క, విరామ = బాధయొక్క, ఉన్నతి=అతిశయముచేత, వాక్ మనస = వాక్కువకును మనస్సునకును, దూర=దూరమయినవాఁడా! ఆదిశబ్దముచేఁ బ్రాణమయత్వము, మనోమయత్వము, విజ్ఞానమయత్వము, ఆనందమయత్వము గ్రహింపఁబడుచున్నవి. అన్నమయత్వాది పంచకోశములును ఆత్మ గాదని దేర్పడుటచే వాక్కునకును మనస్సునకును విషయమగునది యంతయు నాత్మ కాదని తా. యోగిస్మేరా= యోగులయందుఁ బ్రకాశించువాఁడా! భిన్న...ప్రకారా—భిన్న = వేఱైన, ఆకార= రూపములచేత, ఛన్న = కప్పఁబడినదియును, అచ్ఛన్న= కప్పఁబడనిదియు నగు, ఆత్మీయ= తనదైన, ప్రకార=స్వరూపముగలవాఁడా! పరస్పరభిన్నము లయినఘటాదిదృశ్యవస్తువులయందు ఆత్మ తెలియవచ్చియు తెలియరాకయు నుండును అని తా. జగత్ ఆధారా = లోకముల కధిష్ఠానమైనవాఁడా!

భిన్నాకారచ్ఛన్నా, చ్ఛన్నాత్మీయప్రకార ♦ జగదాధారా. 333

మాలిని. కమలభవకిరీట♦గ్రామపద్మావలీసం
గమసుభగపదాబ్జా ♦ గాఢభక్తిప్రకార
ప్రముదితమునిశశ్వ♦ద్భావనాగమ్యరమ్య
క్రమపరిణతమూర్తీ ♦ శ్రౌతశాఖాగ్రవర్తీ. 334

## గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయినవిరాటపర్వంబునందుఁ

ప్రథమాశ్వాసము.



హరిహరనాథుని సంబోధనములు. "అన్నమయత్వాది విరామోన్నత" అని పాఠము కల్పించి అంత వఱకు వేఱుపదముగా చేయుపక్షమున విరామముచేత నున్నతుఁడా యని యర్థము. ఇది యస్వరసమగుటచే తను, ప్రాసభంగమగుటచేతను కవిసమ్మతముకాదు. భిన్నాభిన్నాకారచ్ఛన్నాత్మీయప్రకార= భిన్నములును అభిన్నములు నగు నవతారవిగ్రహములయందుఁ గప్పఁబడిన తనదైన స్వరూపము గలవాఁడా! యనియర్థము. అవతారాకారములయందు ఈశ్వరస్వరూపము అప్రచ్ఛన్నముగానే యుండును. ప్రచ్ఛన్నమగుచో నవతారకృత్యము నెఱవేఱదు. కావున నీపాఠమునభిప్రాయము విరుద్ధముగాఁ దోఁచుచున్నది. గ్రంథకర్త్రభిమతమైన యద్వైతార్థమున కనురూపమగుటచేఁ బ్రాచీనపాఠమే కవిసమ్మతము.

334. కమలభవ...పదాబ్జా—కమలభవ = బ్రహ్మయొక్క, కిరీటములయొక్క, గ్రామ = సమూహము అను, పద్మ ఆవళీ = తామరలసమూహముతోడి, సంగమ = కూడికచేత. సుభగ=మనోహరములయిన, పదాబ్జా = కమలములవంటి పాదములుగలవాఁడా! బ్రహ్మదేవునిచే నమస్కరింపఁబడినవాఁడా యనుట. గాఢ...మూర్తీ—గాఢ=ఎక్కుడయిన, భక్తి= భక్తియొక్క, ప్రకార=విధముచేత, ప్రముదిత = సంతుష్టులయిన, ముని = ఋషులయొక్క, శశ్వత్ భావనా=నిత్యధ్యానమునకు, గమ్య = విషయమయిన, రమ్య = మనోహరమయిన, క్రమ = రీతిచేత, పరిణత = పరిణామముపొందిన, మూర్తీ=ఆకారము గలవాఁడా! భక్తులగు ఋషు లెట్టిరూపముగలవానిఁగా నిన్ను ధ్యానింతురో యట్టి రూపమును వహించి వారిననుగ్రహించువాఁడా యని తా. శ్రౌతశాఖా అగ్రవర్తీ= వేదసంబంధిశాఖల యొక్కయగ్రముల నుండువాఁడా! వేదాంతములచేఁ బ్రతిపాదింపఁబడినవాఁడా యనుట. హరిహరనాథుని సంబోధనములు.

శ్రీమత్......ప్రణీతంబు—శ్రీమత్ = గొప్పతనముగల, ఉభయకవి = సంస్కృతాంధ్రకవులకు, మిత్త్రి = స్నేహితుఁడును, కొమ్మనఅమాత్యపుత్త్రి = కొమ్మనమంత్రి కుమారుఁడును, బుధ ఆరాధన విరాజి = పండితుల సేవచేఁ బ్రకాశించువాఁడు నగు, తిక్కనసోమయాజిప్రణీతంబు = తిక్కనసోమయాజిచేఁ జేయఁబడినది. ఇది—ముగిసెను.



శ్రీరస్తు.

శ్రీహరిహరనాథాయ నమః.

# సవ్యాఖ్యానాంధ్ర మహాభారతము

## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము.

క. శ్రీమదపాంగాలోకన, ధామసకృత్సంగరూఢ♦తాదృశవిభవో
ద్దామాశ్రితలోకా లో, కామయనిర్హరణనిపుణ ♦ హరిహరనాథా. 1

వ. దేవా జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె నట్టియెడ ధర్మసూనుండు సభాజనంబులయుల్లంబులు రంజిల్ల రాజునకు వినోదంబులు వివిధప్రకారంబుల నలుపుచు నొక్కొక్కమాటు మధురప్రసంగంబు గా నాడిననెత్తంబున గెలిచినవిత్తంబులు తమ్ముల కొసంగు చుండు వాయునందనుండు వంటకు మిగిలిన మాంసంబు లమ్మునెపంబున నిచ్చలు సహోదరుల కిచ్చుచుండు వివ్వచ్ఛుండు సంగీతప్రసంగంబున మెచ్చు వడసినకనకాంబరాదులు సోదరులకుం జేర్చుచుండు నకులుండు తురంగప్రసంగంబునం గనినధనంబులు తోడంబుట్టువులకుం బెట్టుచుండు సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతోషించినసమయంబున సముపార్జితంబు లగుపదార్థంబు లన్నియు నన్నలవశంబు సేయుచు వార

శ్రీమత్...లోకా—శ్రీమత్ = సర్వాతిశాయియైన, అపాంగఆలోకన = కడగంటిచూపు యొక్క, ధామ = కాంతియొక్క, సకృత్సంగ = ఒకమాఱుసంబంధముచేత, రూఢ = కలిగిన, తాదృశ = అట్టి, విభవ = మహిమచేత, ఈశ్వరత్వముచేత ననుట, ఉద్దామ = అధికులయిన, ఆశ్రిత లోకా = భక్తజనులు గలవాఁడా! ఒక్కమాఱు నీకటాక్షము భక్తులమీఁదఁ బ్రసరించినంతనే వారు నీరూపమువంటి రూపముగలవారై సర్వాధికులై యొప్పుదు రని తా. లోకఆమయ నిర్హరణనిపుణ = జనులదుఃఖము పోఁగొట్టుటయందు సమర్థుఁడ వయినవాఁడా! హరిహరనాథా!

2. ఉల్లంబులు = మనస్సులు. వివిధప్రకారంబులన్ = పలుతెఱంగులచేత. పాఠాం:—వివిధ ఉదాత్తప్రకారంబులన్ = నానావిధము లయిన యుత్తమవిధములచేత. మధురప్రసంగంబు గాన్ = ప్రియమైన సందర్భము కలుగునట్లుగా. నెత్తంబునన్ = జూదమునందు. విత్తంబులు = ధనములను. వాయునందనుండు = భీముఁడు. నిచ్చలు = ఎల్లప్పుడును. వివ్వచ్ఛుండు = అర్జునుఁడు. సంగీతప్రసంగంబునన్ = సంగీతప్రస్తావముచేత. మెచ్చువడసిన కనకఅంబరఆదులు = బహుమానముపొందిన బంగారువస్త్రములు మొదలగువానిని. సోదరులకున్ = తోఁబుట్టువులకు. తురంగప్రసంగంబునన్ =

లకు గోరసంబులం దుష్టి సలుపుచుండు ద్రౌపది తన్నరసికొని తిరుగువీరలఁ
గన్నులారం జూచుచు నుచితంపునడవడి మెలంగుచుండు. 2

గీ. ఇట్లు తమతమ వర్తించు♦నెడల సకల, జనములకు హృదయానురం♦జన మొనర్చి
తాల్మిపుయిలోటయడఁకువ♦తగవుమెలపు, నెఱితెఱంగును బాటింప♦నేర్పుగలిగె.

క. ఉన్నతఱి వివిధదేశో, త్పన్నులు నద్భుతవిధాయి♦బలవిక్రమసం
పన్నులు నగుమల్లులు విభ, వోన్నతుఁ డగువిరటుపాల♦ నుద్భటవృత్తిన్. 4

క. తమలోన మాటలాడెడు, సమయంబున నొక్కరుఁడు వి♦శాలోరస్కుం
డమితబలుఁడు పంచానన, సమమూర్తిస్ఫూర్తి యధిక♦సంరంభమునన్. 5

వ. అన్నరపతికట్టెదుర నిల్చి యిట్లనియె. 6

గీ. నేలనాలుగుచెఱఁగుల♦నృపులకొలువు, లందు నేను వర్తించితి♦నవనినాథ
యగ్గలించి నాయెదుర బా♦హాప్ఫళించి, గడవఁ జాలినమల్లుఁ♦ గాన నెందు. 7

గుఱ్ఱములసంబంధముచేత. భూవల్లభుండు = రాజు. సముపార్జితంబులు = సంపాదింపఁబడినవి. తుష్టి = తృప్తిని.

3. తమతమవర్తించుఎడలన్ = తాముతామున్నస్థలములందు. హృదయఅనురంజనము= మనస్సుయొక్కసంతోషమును. తాల్మి = ఓర్పు. పుయిలోట = దాక్షిణ్యము. తగవు=యుక్తత. మెలపు= జాగ్రత్త. నెఱితెఱంగు = న్యాయముయొక్కవిధమును. పాటింపన్= ఆదరించుటకు. ఈప్రకారము పాండవులును ద్రౌపదియుఁ దాముండుచోటుల నుండుజనుల నందఱను సంతోషపఱచుచుఁ దాలిమి మొదలగుగుణములు గలవారై యని తా.

4. ఉన్నతఱిన్ = ఉన్నసమయమునందు. వివిధదేశఉత్పన్నులున్ = నానావిధములయిన దేశములందుఁబుట్టినవారును. అద్భుతవిధాయి బలవిక్రమసంపన్నులున్ = ఆశ్చర్యముకలిగించునట్టి బలపరాక్రమములతోఁ గూడినవారును. విభవఉన్నతుఁడు = సంపదచేతగొప్పవాఁడు. ఉద్భటవృత్తిన్ = శౌర్యముచేత. అట్లుండునపుడు నానావిధదేశములనుండి వచ్చిన బలవంతులగు మల్లులు విరాటునిసభయందు శౌర్యముతో నని తా.

5. విశాలఉరస్కుఁడు = వెడల్పుఱొమ్ముగలవాఁడు. అమితబలుఁడు = ఎక్కువబలముగలవాఁడు. పంచాననమూర్తిస్ఫూర్తి= సింహముతో సమానమయిన యాకారము యొక్క యతిశయము గలవాఁడు. అధికసంరంభమునన్ =ఎక్కువయాటోపముతో. తమలోఁదాము మాటలాడుచుండునపుడు ఒకమల్లుఁడు అధికమగు బలముగలవాఁడు ఆటోపముతో వచ్చి యని తా.

6. కట్టెదురన్—కడు + ఎదురన్ = ఎట్టయెదుట. భుజఆస్ఫాలనంబు = భుజమునుతట్టుటను.

7. నేలనాలుగుచెఱఁగుల నృపులకొలువులందున్ = భూమియందలి నాల్గుదిక్కులయందున్న రాజులసభలయందు. వర్తించితిన్ = ఉంటిని. అవనినాథ= రాజా! విరాటునిసంబోధనము. అగ్గలించి = ఉత్సహించి. బాహు = చేతిని. బాహుబాహు శబ్దములకు పువర్ణకలోపము వైకల్పికము. అప్పళించి = చఱచి. కడఁగన్ = పూనుటకు. నేను నాలుగుదిక్కులయందును రాజసభలలో నుంటిని. నాతో జగడమాడఁ జాలినమల్లు లెందును లే రని తా.

చ. అనునెడ వానియుగ్రసమ♦దాకృతియుం బటువాక్యవృత్తియుం
గని విని మల్లు రెల్ల భయ♦కంపితమూర్తులు దాల్చి మాఱు వ
ల్కను గను విచ్చి చూడను మొ♦గం బెగయింపను జాల కున్న న
జ్జనపతివేడ్క ప్రోడుపడు♦చందముఁ గాంచి యుధిష్ఠిరుం డనున్. 8

క. వీనికి మార్కొనఁ జాలెడు, దానికిఁ దగువాని ధర్మ♦తనయునిపురిలో
నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి నిపుణు♦ డిందుల నతఁడున్. 9

క. మనబానసీఁడు వలలుం, డనుశూద్రుఁడు నాకుఁ దెల్ల ♦ మధికబలుల నో
ర్చినవాఁ డనేకమల్లుల, నిను మెచ్చింపంగఁ జాలు ♦ నిజ మిది యధిపా. 10

క. అనవుడు భూపతి పిలువం, బనిచె నతని నతఁడు నపుడ ♦ భయభక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గముఁ, గని మై వెఱుగంగ నిలిచెఁ ♦ గౌతూహలియై. 11

8. వాని ఉగ్రసమదఆకృతియున్ = ఆమల్లునియొక్క భయంకరమయినదియు మదముతోఁ గూడినదియు నగు నాకారమును. పటువాక్యవృత్తియున్ = స్ఫుటమైన మాటలవ్యాపారమును. భయకంపితమూర్తులు = భయముచే వణఁకుచున్న యాకారములను. మొగంబు = ముఖమును. ఎగయింపను = ఎత్తుటకును. అజ్జనపతివేడ్క = ఆవిరాటరాజుయొక్కయుత్సాహము. ప్రోడుపడు చందము = మొక్కపోవువిధమును. యుధిష్ఠిరుండు = ధర్మరాజు. అనున్ = చెప్పును. అట్లు చెప్పుచుండఁగా నామల్లునియాకారమును చూచియు వాని స్ఫుటములయిన మాటలను వినియుఁ దక్కిన మల్లులందఱు భయపడి మోమువాంచి మాఱాడఁజాలకయుండఁగా విరాటునికుత్సాహము చెడిన దని తెలిసికొని ధర్మరా జిట్లు చెప్పె నని తా. అలం. యథాసంఖ్యము.

9. మార్కొనన్ = ఎదుర్కొనుటకు. చాలెడుదానికిన్ = చాలుటకు. ధర్మతనయుని పురిలోన్ = ధర్మరాజుపట్టణమునందు. నానానియుద్ధలంపటున్ = పలువిధములయిన బాహుయుద్ధములం దాసక్తుని. వీని నెదుర్కొనిపోరుటకుఁ దగినవాఁడును బాహుయుద్ధమునందు సమర్థుఁడు నగువానిని తొల్లి ధర్మరాజుపట్టణమునఁ జూచితిని. ఆతఁ డిప్పు డిచట నని తా. పాఠాం:—నిపుణుఁ డిందుల కతఁడున్—ఇందులకున్—ఈయుద్ధమునకు, నిపుణుఁడు అని యన్వయింపవలెను. అప్పుడు పైపద్యముతో నన్వయము అంత స్వరసము కాదు.

10. బానసీఁడు= వంటవాఁడు. అధికబలులన్ = ఎక్కువబలము గలవారిని. అనేకమల్లులన్ = పెక్కురుజెట్లను. ఓర్చినవాఁడు = ఓడించినవాఁడు. తెల్లము= స్పష్టము. అని యన్వయము. అతఁడు మనవంటలవాఁడై యున్నాఁడు. వాఁడు పెక్కండ్రుమల్లులను జయించుట నేనెఱుఁగుదును. అతఁడు నీకు సంతోషము కలిగించు నని తా.

11. భూపతి = విరాటరాజు. అతనిన్ = ఆభీముని. మల్లవర్గమున్ = మల్లులసమూహమును. మై = దేహము. వెఱుగంగన్ = పొంగఁగా. కౌతూహలి ఐ= ఉత్సాహము గలవాఁడై. ధర్మరాజు మాట విని విరాటుఁడు భీమునిఁ బిలువఁబంపఁగా భీముఁడు భయభక్తులతో వచ్చి మల్లులను జూచి యుప్పొంగి నిలిచె నని తాత్పర్యము.

వ. అట్లు నిలిచిన పవనతనయు నవలోకించి యవనీవల్లభుం డమ్మల్లముఖ్యుం జూచి యితనితోడియుద్ధంబునకు సన్నద్ధుండవు గమ్మనిన నతండు ధర్మతనయుకనుసన్న గైకొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో ని ట్లనియె. 12

గీ. అధిప ధర్మజుపాల నున్నప్పు డతని, వేడుకకుఁ దగఁ బెనఁగుదు ♦ వింత లైన
యట్టిమల్లులతో నిప్పు ♦ డట్ల పోలె, నీదువేడ్కకుఁ బెనఁగెద ♦ నేర్చినట్లు. 13

(భీముఁడు మల్లునితో యుద్ధము సేయుట.)

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబునం బ్రాంగణంబు సొచ్చి భూపాలునిముందట భుజాస్ఫాలనంబుచేసి ప్రొక్కి మరలు నెడ నంతకు మున్న మల్లవరుండు నన్నరపతియనుమతి వడసి కృతపరికరబంధుండై యరుగుదెంచి యచ్చట నునికింజేసి యతండు ననిలసుతుండును పరస్పరమూర్తు లవలోకించి యుద్ధరంగంబు మన్ను ఫాలప్రదేశంబుల ధరియించి శరీరంబులపైఁ జల్లుకొని రెండుచేతులమునివ్రేళ్లను గొండొక పుచ్చికొని యొండొరులదెసకు వైచి యున్నతంబు లగునపసవ్యకరంబుల నాకుంచితసవ్యబాహుతలంబు లప్పళించుచప్పుళ్లు గలసి యొక్కటుండ మల్లచఱచినచందంబున వీతేర వింతతానకంబుల నిలిచి కదిసినప్పుడు వృకోదరుండు. 14

12. పవనతనయున్ = భీముని. అవలోకించి = చూచి. అవనీవల్లభుండు = విరాటరాజు. సన్నద్ధుండవు = ఆయితమయిన వాఁడవు. కనుసన్న = నేత్రసంజ్ఞను.

13. అధిప = రాజా! విరాటునిసంబోధనము. పెనఁగుదున్ = పోరుదును. వింతలు = ఆశ్చర్యమును గలిగించువారు. రాజా! నేను ధర్మరాజునొద్ద నున్నప్పుడు అతనివినోదమునకై జెట్టులతోఁ బోరుదును. అట్లే యిపుడు నీవేడుకకుఁ బోరెద నని తా. పాఠాం:—జెట్టిమల్లులతో నిప్పు ♦ డట్లు వోలె—జెట్టిమల్లులతోన్ = మేలిజెట్లతో నని యర్థము.

14. ఇయ్యకొని = అంగీకరించి. గర్జించి = సింహనాదముచేసి. గజాలస్యంబునన్ = ఏనుఁగుయొక్క మందగమనమువంటి మందగమనముచేత. ప్రాంగణంబు = యుద్ధభూమిని. భుజ ఆస్ఫాలనంబు = భుజముతట్టుటను. అమ్మల్లవరుండు = ఆ జెట్టిమేటి. కృతపరికరబంధుండు ఐ = చేయఁబడిన నడికట్టు గలవాఁడై. పరస్పరమూర్తులు = ఒండొరుల యాకారములను. ఫాలప్రదేశంబులన్ = నెత్తి మీఁద. కొండొక = కొంచెము. ఒండొరులదెసకున్ = ఒకరొకరివైపునకు. ఉన్నతంబులు = గొప్ప వైనవి. అపసవ్యకరంబులన్ = కుడిచేతులచేత. ఆకుంచితసవ్యబాహుతలంబులు = ముడుచుకొనఁబడిన యెడమభుజములను. అప్పళించుచప్పుళ్లు = చఱచునట్టి ధ్వనులు. మల్లచఱచినచందంబునన్ = అప్పళించినవిధమున. వీతేరన్ = కలుగఁగా. ఇద్దఱు నేకకాలమునందు భుజాస్ఫాలనము చేయుటచేత రెండుధ్వనులును గలసి యొక్కటియై వినఁబడఁగా నని తా. తానకంబులన్ = జెట్లు కూర్చుండువిధములచేత. వృకోదరుండు = భీముఁడు.

సీ. ఉపతాయిలోఁ దన ♦ కొదవినతోరహ, త్తము చూపి వ్రేయక ♦ సమదవృత్తిఁ
బాసి క్రమ్మఱఁ జేరు ♦ బలువిడి వాఁడు పై, నడరినఁ బెణుగక ♦ యవనిఁ గ్రుంగి
నిలుచు నొత్తొరవున ♦ వలసినయప్పుడు, కొనిపోయి యవలీలఁ ♦ గూల వైచుఁ
జడికి పట్టిస మను ♦ సన్నపువిన్నాణ, ములు దొరకొన్నను ♦ ముట్టికొనఁడు
కాలిదెసఁ జొర వచ్చుట ♦ గానిపించు, నుడుగు సీసానఁ బట్టియు ♦ నుప్పళించి
పోవ నిచ్చు మగుడ నేచి ♦ పోరఁ జేరు, నెడల సరిసేయ నగుతడ ♦ వీక హత్తు.

వ. మఱియు ననేకగతులయోజలు మెఱయుచుఁ గొండొకసేపు విరాటునకు వినోదంబు సేసి. 16

గీ. కచ్చ యమరఁ బట్టి కాళ్ళను జేతులు, వ్రేల మత్తగజము♦లీల మెఱయ

15. ఉపతాయిలోన్ = మల్లశాస్త్రమునందు. తనకున్—భీమునకు. ఒదవినతోరహత్తము = కలిగిన మల్లబంధవిశేషమును. చూపి. వ్రేయక = కొట్టక. సమదవృత్తిన్ = గర్వముతోఁ గూడిన యునికిచేత. పాసి = తొలఁగి. క్రమ్మఱన్ = మరల. చేరున్ = సమీపించును. మల్లశాస్త్రముచొప్పునఁ దనకుఁ దోరహత్తము అనుబంధవిశేషము ప్రయోగించుట కవకాశము గలిగినపుడు భీముఁడు దానిం జూపి ప్రయోగింపకయే వెనుకకుఁ బోయి యామల్లుని సమీపించు నని తా. బలువిడిన్ = పరాక్రమముచేత. వాఁడు—ఆమల్లుఁడు. పైన్ = తనమీఁదికి. అడరినన్ = రాఁగా. పెణుగక = పెనఁగక. అవనిన్ = భూమియందు. క్రుంగి = తగ్గి. నిలుచున్. ఆమల్లుఁడు తనమీఁదికి వచ్చినపుడు భీముఁడు దానికి బదులుచేయక కొంచెము వంగి తప్పించుకొను నని తా. ఒత్తొరవునన్ = మిక్కిలి యదుముడుచేత. వలసినఅప్పుడు = కోరినప్పుడు. కొనిపోయి. అవలీలన్ = చులుకనగా. కూలన్ = పడునట్లు. వైచున్ = వేయును. కోరినపుడు ఆమల్లుని నదిమిపట్టి లాఘవముచే నెత్తి పడవైచు నని తా. చడికి పట్టిసము అనుసన్నపువిన్నాణములు= చడికి పట్టిసము అనునట్టి యల్పము లయిన యుపాయములు. దొరకొన్నను = దొరకినను. ముట్టికొనఁడు = తాఁకఁడు. చడికి పట్టిసము అను మల్లయుద్ధోపాయములు ప్రయోగించుటకుఁ దనకు అవకాశము కలిగినను భీముఁడు వానిం బ్రయోగింపఁడు అని తా. కాలిదెసన్ = కాలిదిక్కునకు. చొరవచ్చుట = చొచ్చుటను. కానిపించి = అగపఱచి. ఉడుగున్ = నిలుచును. సీసానన్ = మల్లబంధవిశేషముచేత. పట్టియున్ = పట్టుకొనియు. ఉప్పళించి = తొలఁగి. పోవనిచ్చున్. భీముఁడు కాళ్లసందునఁ జొచ్చునట్లు నటించి మానును. సీసము అను మల్లబంధమున వానిం బట్టియు తొలఁగి పోనిచ్చును అని తా. మగుడన్ = మరల. ఏచి = విజృంభించి. పోరన్ = పోరుటకు. చేరుఎడలన్ = చేరునపుడు. సరిచేయన్ = చక్కఁ జేయుటకు. అగుతడవు = అయిన యవకాశమును. ఈక = ఇయ్యక. హత్తున్ = చేరును. ఆమల్లుఁడు మరలఁ దనమీఁదికి వచ్చినపుడు భీముఁడు వాని కవకాశ మియ్యఁ డని తా. ఇట్లు భీముఁడు విరాటునకు వినోదము కలిగించుటకై వెంటనే మల్లు నోడింపక కొంతవడి వానితో వేడుకగాఁ బోరుచుండె నని భావము.

16. అనేకగతులఓజలు = పలువిధములయిన ప్రకారములను. మెఱయుచున్ = చూపుచు.

17. కచ్చ = దట్టిని. అమరన్ = చక్కఁగా. వ్రేలన్ = వ్రేలాడునట్లు. మత్తగజములీలన్ = మదపుటేనుఁగువిలాసమువంటి విలాసము. ముష్టిబలపు = పిడికిలిబలము. నెఱయన్ = నిండఁగా. వాత

ముష్టిబలువు నెఱయ ♦ ముక్కున వాతను నెత్తు రొలుక మల్లు ♦ నెత్తి వైచె.

వ. ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి వీఁపున మండి వెట్టిన. 18

క. పెలుకుఱి తాళం బీ మదిఁ, దలఁచి యనువు గాక ధరణి♦తలముఁ గరపుటం
బుల నప్పళించె వాఁడ, క్కాలు వార్వఁగ విడిచి మెఱసెఁ ♦ గుంతీసుతుఁడున్.

వ. ఇవ్విధంబున మహాబలుఁబట్టి యాజెట్టి నెట్టన గెల్చిన మత్స్యపతి మెచ్చి తనకిచ్చిన ధనంబు లచ్చటియర్థిజనంబులకు నిచ్చి నిజనివాసంబునకుం జనియె మఱియు నిత్తెఱంగున నతనికి వేడ్క నలుపుచుండఁ జిక్కనిమల్లులు లేనితఱి నంతిపురంబు నింతులు చూడ నయ్యవనీకాంతుండు పోరింప శార్దూలశుండాలాదులతోడ నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు. 20

క. పెఱవారలుఁ దమ మెలఁగెడు, తెఱఁగుల దొరఁకొన్న వింత♦తెరువుల నేర్పుల్
మెఱయుచుఁ బతిచిత్తము గొన, నొఱపు గలిగి మాన్యవృత్తి♦నుండుదు రగన్.

ను=నోటను. భీముఁడు మదపుటేనుఁగువలె నామల్లుని దట్టిపట్టి వానికాళ్ళను చేతులను వ్రేలాడఁగా నొక్కిపిడికిటిపోటున వాని ముక్కునను నోటను నెత్తురు కాఱ వాని నెత్తి పడవైచె నని తా.

18. మండి = మోఁకాలితో నదుముటను.

19. పెలుకుఱి = విలవిలఁబోయి. తాళంబు = మల్లబంధవిశేషము. ఈన్ = ఇచ్చుటకు. మదిన్ = మనస్సునందు. అనువు = అనుకూలము. వాఁడు—ఆమల్లుఁడు. కరపుటంబులన్ = దోప్పలవంటిచేతులచేత. ధరణితలమున్ = భూప్రదేశమును. అప్పళించెన్ = తట్టెను. అక్కాలువు = ఆసభవారు. ఆర్వఁగన్ = అఱవఁగా. విడిచి. కుంతీసుతుఁడున్=భీముఁడును. మెఱసెన్. మల్లుఁడు బలహీనుఁడై తాళము అను మల్లబంధమును బ్రయోగింపఁ దలఁచి యశక్తుఁ డగుటచే నేలను చేతితోఁ దట్టి తనపరాజయమును దెలిపె ననియు నంత నాసభవారు పొగడఁగా భీముఁడు అతని విడిచె ననియుఁ దా.

20. మహాబలుఁబట్టి = వాయుపుత్త్రుఁ డయిన భీముఁడు. నెట్టన = అనివార్యముగా. అర్థిజనంబులకున్ = యాచకులకు. చిక్కనిమల్లులు = బలవంతు లగుమల్లులు. అంతిపురంబు నింతులు= అంతఃపుర స్త్రీలు. అయ్యవనీకాంతుండు = ఆవిరాటరాజు. శార్దూలశుండాలఆదులతోడన్ = పెద్దపులి యేనుఁగు మొదలగువానితో. ఈడంబోక = వెనుదీయక. పెనంగి = పోరి. భంగంబునకున్ = ఓడిపోవుటకు.

21. పెఱవారలున్ = ఇతరు లయినపాండవులును. తమ మెలఁగెడు తెఱఁగులన్ = తా ముండు వృత్తులయందు. దొరఁకొన్న వింతతెరువులన్ = పూనిన వింత లగుమార్గములయందు. నేర్పుల్ = సామర్థ్యములను. మెఱయుచున్ = చూపుచు. పతిచిత్తము = రాజుయొక్కమనస్సును. కొనన్ = పొందుటకు. ఒఱపు = ఉపాయము. మాన్యవృత్తిన్ = పూజింపఁదగిన నడవడిచేత. తగన్. ఉండుదురు. ఇతరు లయిన ధర్మరాజు మొదలగువారుగూడఁ దాము చేయుపనులయందు నానావిధములుగాఁ దమనేర్పులు చూపి విరాటుని మెప్పించి యతని మన్నన వడయుచుండి రని తా.

వ. ఇట్లు పాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరంబున వర్తించుచుఁ గతిప యదినంబులు గొంతగా నేఁడుకాలంబు గడపినసమయంబున మత్స్యపతిమఱం దియు దండనాథుండును గీచకాగ్రజుండును రూపాభిమానియు నానాభరణధరణ శీలుండును దుర్విదగ్ధుండును బలగర్వితుండును నగుసింహబలుండు దనయప్ప సుధేష్ణకు మ్రొక్కం జనుదెంచి యద్దేవి కనతిదూరంబున నున్న ద్రుపదరాజ నందనం గనుంగొని. 22

ఉ. అక్కజ మైనరూపమున ♦ నాత్మకు వ్రేఁ గయి పొల్చుపొ ల్తిపై
నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మఱుప ♦ నేరక యూరక నిల్చెఁ గాముచేఁ
జిక్కిన నెమ్మనంబుఁ గదుఁ జే♦ ష్టడుమానముఁ జేష్టితంబులం
దక్కినయంగముం దలఁకు ధైర్యము నై ♦ యతఁ డప్పు డయ్యెడన్. 23

గీ. ద్రౌపదీరూపమ♦నుసరిఁదగిలితనదు, హృదయమనుమృగ మత్తతి♦నుదిలకొనుచుఁ గాముఁ డనుబల్లిదపువేఁట♦కాని బారిఁ, బడుట కెంతయు నాసింహ♦బలుఁడు దలరి.

వ. నిజాంతర్గతంబున. 25

22. కతిపయదినంబులు = కొన్నిదినములు. ఏఁడుకాలంబు = సంవత్సరకాలమును. దండనాథుండును = సేనానాయకుండును. కీచకఅగ్రజుండును= కీచకులకన్నయును. రూపఅభిమానియున్= చక్కఁదనపు గర్వము గలవాఁడును. నానాఅభరణధరణ శీలుండును = పలువిధము లగు భూషణములను ధరించుస్వభావము గలవాఁడును. దుర్విదగ్ధుండును = దుష్టుఁడును. బలగర్వితుండును= బలముచే గర్వించినవాఁడును. సింహబలుండు = కీచకుఁడు.

23. అక్కజము = అధికము. ఐనరూపమునన్ = అయినచక్కఁదనముచేత. ఆత్మకున్ = మనస్సునకు. వ్రేఁగుఅయి = దుస్సహమై. పొల్చుపొల్తిపైన్ = ఒప్పునట్టి ద్రౌపదిమీఁద. నెక్కొనుచూడ్కిన్ = నిలుచునట్టి చూపును. క్రమ్మఱుపన్= మరలించుటకు. కాముచేన్= మన్మథునిచేత. చిక్కిన నెమ్మనంబు = చిక్కిన నిండుమనస్సును. కదున్ = మిక్కిలి. చేష్టడుమానమున్ = చలించునట్టి మానమును. చేష్టితంబులన్ = చేష్టలను. తక్కినయంగమున్ = విడిచినదేహమును. తలఁకు ధైర్యమున్ = చలించునట్టి ధైర్యమును. ఐ = కలవాఁడై. అయ్యెడన్ = అచోట. ఊరక నిల్చెన్ = అని యన్వయము. ద్రౌపదియొక్క యధికమయిన సౌందర్యమునకు వెఱఁగుపడినవాఁడై మన్మథునకులోనై కీచకుఁడు మానము విడిచి చేష్టలుతక్కి ధైర్యమువీడి యామెనుండి తనచూపును మరల్పలేక యూరక నిలిచియుండె నని తా.

24. అనుసరిన్ = అనువులయందు. మృగము = జింక. ఉదిలకొనుచున్ = పరితపించుచు. కాముఁడు = మన్మథుఁడు. బల్లిదపు = బలిష్ఠుఁడయిన. తలరి = చింతించి. తన మనస్సు ద్రౌపది చక్కఁదనమునకు వశమై మన్మథబాధిత మగుటకుఁ గీచకుఁడు చింతించి యని తా. అలం. రూపకము.

25. నిజఅంతర్గతంబునన్ = తనమనస్సునందు.

ఉ. ఎందును నిట్టిరూపు నరు ♦ లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సం
క్రందనసూతికిం దగిలి ♦ కన్గొనఁ జాలదె దీన నిందిరా
నందనునాజ్ఞ యేచి భువ♦నంబునఁ బ్రబ్బదె యిత్తలోదరిం
జెందఁగఁ గాన్పు గాదె ఫల♦సిద్ధి పురాతనపుణ్యబుద్ధికిన్. 26

సీ. ఇయ్యింతిప్రాపున ♦ నయ్యనంగుఁడు పార్వ, తీశు నైనను దక్క ♦ నేల కున్నె
యిన్నాతిచెలువంబు ♦ గన్న శచీప్రియుం, డైనను గనుకని ♦ నలయ కున్నె
యిత్తన్వి కెన లేమి ♦ కెదిరి పన్నిదము భా, షావిభుతో నైనఁ ♦ జఱవ రాదె
యిత్తలోదరి జీవి♦తేశున కిందిరా, పతి నైన మెచ్చక ♦ పలుకఁ జనదె

26. నరులు = మనుష్యులు. నాకన్ అ = కీచకునకుమాత్రమే. సంక్రందనసూతికిన్ = ఇంద్రుని కుమారుఁ డయిన జయంతునకు. తగిలి = పూని. కన్గొనన్ = చూచుటకు. చాలదు ఎ = తగదా? దీనన్ = ఈ రూపముచేత. ఇందిరానందను ఆజ్ఞ = లక్ష్మీపుత్త్రుఁ డయిన మన్మథునియొక్క యాజ్ఞ. ఏచి = అతిశయించి. భువనంబులన్ = లోకములయందు. ప్రబ్బదు ఎ = వ్యాపింపదా? ఇత్తలఉదరిన్ = అఱచేతివంటినడుముగల యీ స్త్రీని. చెందఁగన్ కాన్పు = పొందఁగాంచుట. పురాతనపుణ్యబుద్ధికిన్ = తొల్లింటిపుణ్యములసంపదకు. ఫలసిద్ధి = ఫలానుభవము. కాదె—అగుననుట. ఇట్టిరూపమును మనుష్యు లెవ్వరును జూచియుండరు, జయంతుఁడుకూడ దీనిని ఆశతోఁ జూచును, ఈరూపముచేత మన్మథునియాజ్ఞకు మిక్కిలి గొప్పతనము కలుగుచున్నది. దీనిం బొందినయెడ పూర్వపుణ్యములు ఫలించి నట్లని తా. పాఠాం:—దీని నిందిరానందనునాజ్ఞ—ఇచట 'దీనిన్' అను ద్వితీయాంతము అనావశ్యకము. చాలదె యనుటకుఁ బ్రథమాంతమయిన కర్తృపదమే యపేక్షితము. కన్గొనన్ అనునదియె కర్త యగును. కన్గొనన్ అనుదానికిఁ గర్మపదము కావలసినను రూపున్ అనునదియే యిటఁగూడ నను వర్తించును. ఇందిరానందనునాజ్ఞ యేచుటకు సాధన మపేక్షితము కావున "దీనన్" అను తృతీయాంతపాఠమే యుక్తముగాఁ దోఁచుచున్నది. పుణ్యవృద్ధికిన్ = పుణ్యముల యభివృద్ధికి అని యర్థము.

27. ఇయ్యింతిప్రాపునన్ = ఈ స్త్రీయొక్క యండచేత. అయ్యనంగుఁడు = ప్రసిద్ధుఁ డగు మన్మథుఁడు. పార్వతీ ఈశున్ ఐనను = శివునినైనను. దక్కన్ = లోఁబడునట్లు. ఏలక ఉన్నె = కొనకుండునా? ఈకాంతయొక్క యాశ్రమముచేత మన్మథుఁడు శివునిఁగూడ లోఁబఱచుకొను నని తా. ఇన్నాతిచెలువంబు = ఈ స్త్రీయొక్క చక్కఁదనమును. కన్నన్ = చూచినయెడ. శచీప్రియుండు ఐనను = ఇంద్రుఁడైనను. కనుకనిన్ = తొట్రుపాటుచేత. అలయక ఉన్నె = శ్రమపడకుండునా? ఈమె చక్కఁదనము చూచినచో నింద్రుఁడుగూడ మోహించును అని తా. ఇత్తన్వికిన్ = ఈ స్త్రీకి. ఎన = సాటి. లేమికిన్ = లేకుండుటకు. ఎదిరి = ఎదురొకని. పన్నిదము = పందెము. భాషావిభుతోన్ ఐనన్ = బ్రహ్మదేవునితో నైనను. చఱవరాదె — వేయరాదా! ఈకాంతకు సాటి లేదని బ్రహ్మదేవునితోఁగూడ పందెము వేయవచ్చు నని తా. ఇత్తలఉదరిజీవితేశునకున్ = ఈమెయొక్క భర్తకు. ఇందిరాపతిన్ ఐనన్ = విష్ణువునైనను. మెచ్చక. పలుకన్ చనదె = పలుకరాదా? ఈ స్త్రీయొక్క మగఁడు విష్ణువునుగూడ మెచ్చఁ డని తా. పార్వతీశున్, శచీప్రియుండు, భాషావిభుతోన్, ఇందిరాపతిన్—ఈనాలుగుపదములును పార్వతీ శచీ సరస్వతీ లక్ష్మీదేవులకన్నను ద్రౌపది చక్కని దని

కుసుమబాణునిబాణముల్ ♦ గూడ నైదుఁ, గరఁగి నేరిమి వాటించి ♦ కరువు గట్టి
ప్రోది చేసి చైతన్యసం♦పుటము దగ ఘ, టించిరో కాక యిట్టిచే♦డియలు గలరె.

క. ఈ నెలఁతఁ గన్న మన్మథుఁ, డైనఁ జిగురుగొడుగు పువ్వు♦టమ్ములపొదులున్
లోనుగ సెజ్జలు సేయం, దా నియమింపండె విరహ♦తాపము పేర్మిన్. 28

వ. అని వెండియు. 29

సీ. దీనిజన్మంబునఁ ♦ దేజంబు నొందిన, యింతియుఁ బతియును ♦ నెవ్వ రొక్కొ
దీనినామాకృతి ♦ గా నోఁచి పడసిన, యిం పగువర్ణంబు ♦ లెవ్వి యొక్కొ
దీనివల్లభుఁ డనఁ ♦ గా నిల సొబగుసొం, పెసఁగ వర్తిల్లువాఁ ♦ డెవ్వఁ డొక్కొ
దీనివసించుటఁ ♦ దా నొప్పి పెంపున, నేపారుమందిరం ♦ బెద్ది యొక్కొ

సూచించుచు సాభిప్రాయవిశేష్యము లగుటచేఁ బరికరాంకురాలంకారము. ఇందు ద్వితీయపాదము చతుర్థపాదముగా నుండుట యుక్తతరము. కుసుమబాణునిబాణముల్ = మన్మథునిబాణములు. వియన్—అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము, ఇవి మన్మథుని యయిదుబాణములు, ఈయయిదింటిని. కూడన్ = చేరునట్లు. కరఁగి = కరఁగించి. నేరిమి= నేర్పును. వాటించి= ఆవలంబించి. కరువుగట్టి = అచ్చునఁబోసి. ప్రోదిచేసి = వృద్ధినొందించి. చైతన్యసంపుటము= చైతన్యముగల సంపుటముగా, ప్రాణము గలదానినిగా ననుట; తగన్. ఘటించిరి ఓ = కూర్చిరో. సృష్టికర్తలు అనుకర్తృపదము అధ్యాహార్యము. కాక. ఇట్టిచేడియలు= ఇట్టి స్త్రీలు. కలరుఎ—లే రనుట. మన్మథుని యయిదుబాణములను గరఁగించి నేర్పుతో నచ్చులోఁ బోసి రూప మేర్పఱచి ప్రాణము గలిగించి యుండవలయును గాని యిట్టి చక్కనిది యెచ్చటను గలుగఁజాల దని తా. మన్మథబాణము లుపాదానకారణముగాఁ జెప్పుటచే ద్రౌపదియందు లోకోత్తరసౌకుమార్యాదులు సూచింపఁబడినవి. పాఠాం:—పోసి విధి చేసి చైతన్యపుటము దగ ఘటించెనో = పోసి బ్రహ్మ చైతన్యపుటముగాఁ జేసి యిట్లు కూర్చెనో యని యర్థము.

28. ఈనెలఁతన్ = ఈ స్త్రీని. పువ్వుటమ్ములపొదులున్ = పుష్పబాణములసమూహములును. లోనుగన్ = మొదలుగాఁగలవానిని. సెజ్జలు = శయ్యలు. విరహతాపము పేర్మిన్ = విరహతాపముయొక్క యతిశయముచేత. తాన్. నియమింపండె అని యన్వయము. ఈకొంతను చూచినయెడ మన్మథుఁడుగూడ విరహతాపము పొంది తాపశాంతికై చిగురుగొడుగును తనబాణము లైనపుష్పములను పాన్పుగాఁ జేయ నాజ్ఞాపించె నని తా. పాఠాం:—సజ్జలుచేయన్ అని శబ్దరత్నాకరపాఠము = సిద్ధపఱచుటకు అని యర్థము. ఈపాఠమునకు అన్వయము లేనందువలన నిది యస్వరసముగాఁ దోఁచుచున్నది.

30. దీనిజన్మంబునన్ = ఈ స్త్రీయొక్క పుట్టువుచేత. తేజంబున్ = గొప్పతనమును. ఒందిన ఇంతియున్ = పొందిన స్త్రీయును. పతియును = భర్తయును. ఈ స్త్రీయొక్క తల్లిదండ్రు లెవ్వరో యని తా. దీని నామ ఆకృతి = ఈ స్త్రీయొక్క పేరుయొక్కయాకారము. కాన్ = అగునట్లు. నోఁచి = నోములు చేసి. పడసిన ఇంపు అగువర్ణంబులు = పొందిన మనోజ్ఞము లయిన యక్షరములు. ఈ స్త్రీ పేరేమో యని తా. దీనివల్లభుఁడు= దీనిమగఁడు. ఇలన్=భూమియందు. సొబగుసొంపు=

దీనిఁ బొందఁ గాంచు ♦ తెఱఁగు నా కెయ్యది, యొక్కొ యిట్టిపనికి ♦ నూఱడించి
తోడు కొనఁగ నిచట ♦ నీ డగుచుట్టంబుఁ, దడవి యెట్టు లొక్కొ ♦ పడయువాఁడ.

చ. అని యని యుగ్గడించు ధృతి ♦ యల్లలనాడినఁ దల్లడించుఁ బై
కొనుతలఁ పోరగించు మదిఁ ♦ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచ♦టన్ జనులం బరికించు బుద్ధి మా
లిన వెస నెంతయుం గళవ♦ళించు మనోజవికారమగ్నుఁడై. 31

క. మాసినచందముఁ దనుఁ గని, రోసినడెందంబుఁ గలత♦రుణిచేఁ గడు బి
ట్టేసినమదనునిచే ధృతి, వాసిన బెగ డొందు సింహ♦బలుఁ డట్టియెడన్. 32

సీ. వెఱవక ననుఁ జూచె ♦ వీఁ డని యెదఁ గలు, షించిన నొండొండ ♦ చెమట ప్రేడము
ననుచితకృత్యంబు ♦ లాచరించువిధాతృ, బలిమికి నెవ్వాఱ♦పాటు దోఁప

చక్కఁదనముయొక్క యతిశయము. ఎసఁగన్ = అతిశయింపఁగా. దీనిప్రియుఁ డెవ్వఁడో యని తా. దీనివసించుటన్ = ఇది యుండుటచేత. పెంపునన్ = గొప్పతనముచేత. ఏపారుమందిరంబు = అతిశయించునట్టి యిల్లు. ఇది వాసముచేయుగృహ మెద్దియో యని తా. తోడు = సాహాయ్యమును. కొనఁగన్ = గ్రహించుటకు. ఈడు = తగినవాఁడు. తడవి = వెదకి. పడయువాఁడన్ = పొందువాఁడను ? దీని నెట్లు నేను పొందఁగలనో యిందుకుఁ దగినసహాయము ఎట్లు దొరకునో యని తా.

31. అనిఅని = ఇట్లు పలుమా ఱనుకొని. మనోజవికారమగ్నుఁడు ఐ = మన్మథవికారమునందు మునిఁగినవాఁడై. ఉగ్గడించున్ = చెప్పును. ధృతి = ధైర్యము. అల్లలనాడినన్ = చలింపఁగా. తల్లడించున్ = చలించును. పైకొనుతలఁపు = మీఱునట్టి కోరికను. ఓరగించున్ = తొలఁగునట్లు చేయును, కొంచెము తగ్గించుకొను ననుట. మదిన్ = మనస్సునందు. కోర్కులు, పేర్చినన్ = అతిశయింపఁగా. అప్పళించున్ = ఉత్సాహపడును. నెట్టన = అనివార్యముగా. తెగన్ = తెగించుటకు. అగ్గలించున్ = ఉత్సహించును. అచటన్. జనులన్. పరికించున్ = చూచును. బుద్ధి మాలినన్ = చెడుటచేత. వెసన్ = శీఘ్రముగా. ఎంతయున్ = మిక్కిలి. కళవళించున్ = కలఁతపడును. కీచకుఁడు ఇట్లు పలుకుచు మన్మథబాధితుండై నానావిధవికారములను బొందె నని తా.

32. మాసినచందమున్ = మలిన మయిన విధమును. తనున్ — కీచకుని. కని = చూచి. రోసినడెందంబున్ = అసహ్యపడినమనస్సును. కలతరుణిచేన్ = కలిగిన స్త్రీచేత. కడున్ = మిక్కిలి. బిట్టు = శీఘ్రముగా. ఏసినమదనునిచేన్ = కొట్టిన మన్మథునిచేత. ధృతి = ధైర్యము. పాసినన్ = పోఁగా. సింహబలుఁడు = కీచకుఁడు. బెగడుఁబొందున్ = శ్రమపడును. అట్టియెడన్ = ఆసమయమునందు. మలినయును దన్నుఁ జూచి యసహ్యపడునదియు నగుద్రౌపది నుద్దేశించి మన్మథుఁడు బాధింపఁగాఁ గీచకుఁడు మిక్కిలి శ్రమపడె నని తా. అట్టిద్రౌపదిని వలచుటచేఁ గీచకుఁడు మిక్కిలి యవివేకి యని భావము.

33. వెఱవక = భయపడక. ఎదన్ = మనస్సునందు. కలుషించినన్ = కలఁతపడఁగా. ఒండొండ = క్రమక్రమముగా. అనుచితకృత్యంబులు = తగనిపనులను. ఆచరించువిధాతృబలిమికిన్ =

నిచ్చట దిక్కు లే రెవ్వరు నాకును, భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమి యుపాయంబు లేమి నా, ననమున వెల్లఁదనంబు గదుర
నున్న పాంచాలిఁ గనుఁగొని యన్నరాధ
ముఁడు వివేకవిహీనుఁ డై ముదితుఁ డగుచు
మదనవికృతి యకాఁ దనమదిఁ దలంచి
రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె. 33

వ. అయ్యవసరంబున. 34

చ. పొలఁతుకకాంతి యింత పొలివోవఁగ నీ కెసలారుతార నీ
శ్చలతఁ గడంగి క్రోలికొనఁ జాలుటఁ గీచకముఖ్యలోచనం
బులు నయనం ప్రధాన మనుపూర్వవచఃస్థితి దప్ప కుండఁగా
నెలమి వహించెఁ దక్కఁగల యింద్రియవర్గము ధిక్కరించుచున్. 35

చేయునట్టి బ్రహ్మదేవునిబలమునను. నివ్వెఱపాటు = నిశ్చేష్టత. తోఁపన్ = కలుగఁగా. మేనన్ = దేహమునందు. కంపంబు = వడఁకు. లేమిన్ = లేకుండుటచేత. ఆననమునన్ = ముఖమునందు. వెల్లఁదనంబు = వివర్ణత. కదురన్ = కలుగఁగా. అన్నరాధముఁడు = ఆనీచుఁ డయిన కీచకుఁడు. వివేకవిహీనుఁడు ఐ = వివేకమునకు దూర మయినవాఁడై. ముదితుఁడు = సంతోషించినవాఁడు. మదనవికృతి అకాన్ = మన్మథవికారమని. రాగసాగరపూరనిర్మగ్నుఁడు = అనురాగము అను సముద్రము ప్రవాహమునందు మునిఁగినవాఁడు. ద్రౌపదికిఁ గీచకుఁడు తన్ను నిర్భయముగాఁ జూచుచున్నాఁడని కోపముచేఁగలుగు చెమటయు, ఇట్టి యకార్యములను బ్రహ్మ చేయుచున్నాఁడే యని కలిగిననిశ్చేష్టతయును, తన కెవ్వరు నచట రక్షకులు లేరని భయముచే దేహమునఁగలిగినవడంకును, తప్పించుకొనుట కుపాయము తోఁపకుండుటచే ముఖమునఁగలిగిన వివర్ణతయును జూచి, కీచకుఁడు వివేకము లేనివాఁడై యాచెమట మొదలగువానిని ద్రౌపదికిఁ దనమీఁది యనురాగంబుచేఁ గలిగిన సాత్త్వికభావము లని భ్రమించి యామెయెడ మఱియు హెచ్చిన యనురాగము కలవాఁ డయ్యె నని తా. ఇచటఁ గ్రమముగా స్వేదమును, స్తంభమును, వేపథువును, వైవర్ణ్యమును అను సాత్త్వికభావములు కీచకునకు భ్రమవిషయములు.

35. పొలఁతుకకాంతి = ద్రౌపదియొక్క సౌందర్యమును. ఇంత = కొంచె మయినను. పొలివోవఁగన్ ఈక = వ్యర్థము కానీయక. ఎసలారుతారుత = అతిశయించునట్టి తారే, నేత్రముతే యనుట. నిశ్చలతన్ = కదలిక లేని వగుటచేత. కడంగి = పూని. క్రోలికొనన్ = గ్రహించుటకు. చాలుటన్ = సమర్థము లగుటచేత. కీచకముఖ్యలోచనంబులు = కీచకశ్రేష్ఠునికన్నులు. నయనమ్ = కన్ను. ప్రధానమ్ = ముఖ్యము. అనుపూర్వవచఃస్థితి = అనునట్టి పెద్దలవాక్యముయొక్క యునికి. తప్పక. ఉండఁగాన్ = ఉండునట్లు. తక్కఁగల యింద్రియవర్గమున్ = ఇతరము లయిన యింద్రియములసమూహమును, త్వక్ శ్రోత్రజిహ్వాఘ్రాణముల ననుట. ధిక్కరించుచున్ = తిరస్కరించుచు. ఎలమిన్ = వికాసమును. వహించెన్ = పొందెను. ద్రౌపది చక్కఁదనము నంతయు మేమే గ్రహింపఁజాలుదు మని కీచకునినేత్రములు "సర్వేంద్రియాణాం నయనం ప్రధాన" మ్మను నభియుక్తవాక్యము తప్పనియట్లు ఇతరము లయిన యింద్రియములను అణంచి వికాసము పొందె నని తా. కీచకుఁడు ద్రౌపదిని దక్కినయింద్రియవ్యాపారములు మఱచి యాదరముతోఁ జూచుచుండె నని భావము.

క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచు నుండఁ ♦ దగ వేది కరం
బొప్పనితమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబు ♦ గదురఁగ నచ్చోన్. 36

సీ. తన్వంగిమవ్వంపుఁ♦దనులత నెసఁగెడు, నునుఁగాంతి వెల్లువ ♦ ముసుఁగఁ బాఱఁ
గిసలయహస్తకెం♦గేల నేపారుక్రొ, మ్మించను లేఁతయెండ ♦ మిగులఁ బర్వఁ
గమలాస్యముద్దుమొ♦గంబు లేమెఱుఁగుల, మొత్తంబుపరి చుట్టు ♦ ముట్టికొనఁగ
ధవళాక్షితొంగలి♦తఱచుఱెప్పలచెన్ను, కప్పనుచీఁకటి ♦ గవియుదేర
బెగ్గలం బంత కంతకు ♦ నగ్గలింప, నొదవుచెమ్మటఁ జిత్తంబు ♦ సెదరి యొందు
మెలఁగఁ దలఁ పేది యాసింహ♦బలుఁడనంగు, పట్టియాడెడుజంత్రంబు♦పగిది నుండె.

( కీచకుఁడు సుదేష్ణవలన ద్రౌపదితెఱం గెఱుంగఁ గోరుట. )

36. అప్పయున్ = అక్కయయిన సుదేష్ణయును. తగవు = యుక్తత. ఏది = చెడి. కరంబు = మిక్కిలి. ఒప్పనితమకము = తగనిమోహము. చిత్తమున్ = మనస్సును. కప్పికొనుటన్ = ఆక్రమించుటచేత. ఉత్తలంబు = కలఁత. కదురఁగన్ = కలుగఁగా. అచ్చోన్ = ఆసమయమునందు. సుదేష్ణయుఁ బరివారంబును దన్నుఁ జూచుచుండఁగాఁ గీచకుఁడు యోగ్యాయోగ్యములు తెలియక మోహపరవశుండై యని తా. ఇందుఁ బూజ్యురాలగు సుదేష్ణయును నీచులగు పరిజనులును జూచుచుండఁగాఁ గీచకుఁ డిట్టియవస్థ నొందుట యత్యంతము ననుచితత్వముఁ బోషించుచున్నది.

37. తన్వంగి మవ్వంపుతనులతన్ = చిక్కనిశరీరము గల ద్రౌపదియొక్క కోమలమయిన తీఁగవంటి దేహమునందు. ఎసఁగెడు నునుఁగాంతి వెల్లువ = అతిశయించునట్టి చక్కనికాంతిప్రవాహము. ముసుఁగఁబాఱన్ = ముంచుకొనఁగా. ద్రౌపదియొక్క దేహకాంతి ప్రవాహము కీచకుని ముంపఁగా నని తా. కిసలయహస్తకెంగేలన్ = చిగురువంటి చేయిగల ద్రౌపదియొక్క యెఱ్ఱనిచేతియందు. ఏపారుక్రొమ్మించు = ప్రకాశించునట్టి క్రొత్తకాంతి. అనులేఁతయెండ = అనునట్టి లేఁతయెండ; మిగులన్ = మిక్కిలి. పర్వన్ = వ్యాపింపఁగా. ద్రౌపది హస్తకాంతి యను బాలాతపము కీచకునిమీఁద వ్యాపింపఁగా నని తా. కమలాస్యముద్దుమొగంబు లేమెఱుఁగుల మొత్తంబుపరి = కమలమువంటి మోముగల ద్రౌపదియొక్క చక్కనిముఖముయొక్క లేఁతకాంతుల సమూహము అనుసేన. చుట్టున్; ముట్టికొనఁగాన్ = ముట్టడింపఁగా. ద్రౌపది ముఖకాంతిసమూహము అనుసేన కీచకుని చుట్టుకొనఁగా నని తా. ధవళఅక్షితొంగలి తఱచుఱెప్పల చెన్నుకప్పు = తెల్లనికన్నులుగల ద్రౌపదియొక్క వాలునట్టి దట్టమయిన ఱెప్పలకాంతియొక్క నల్లఁదనము. కవియుదేరన్ = క్రమ్మఁగా. ద్రౌపది కంటిఱెప్పలనల్లనికాంతి యను చీఁకటి కీచకునిమీఁద వ్యాపింపఁగా నని తా. బెగ్గలంబు = భయము. అగ్గలింపన్ = అతిశయింపఁగా. ఒదవుచెమ్మటన్ = కలిగినట్టిచెమటచేత. చిత్తంబు = మనస్సు. చెదరి = కలఁగి. మెలఁగన్ = తిరుగుటకు. ఏది = చెడి. అనంగుపట్టిఆడెడుజంత్రంబుపగిదిన్ = మన్మథుఁడు పట్టుకొని యాడునట్టి యంత్రమువలె. ఉండెన్. ద్రౌపదిదేహకాంతిప్రవాహమునకు బెగ్గలంబుపొంది, హస్తకాంతియను లేఁతయెండకుఁ జెమ్మట చెంది, ముఖకాంతులసమూహము అనుసేన ముట్టడించుటకు చిత్తము చెదరినవాఁడై, కనుఱెప్పలకాంతి యనుచీఁకటిచేత నెచ్చటికిని బోవఁజాలనివాఁడై కీచకుఁడు మదనపరవశుండై యుండె నని తా. అలంకారము, యథాసంఖ్యము, రూపకము.

వ. ఇట్లు కందర్పదర్పగోచరుం డై నకీచకుండు నిజసహోదరివలన నక్కోమలికలరూపు దెలియం దలంచి దానిదెసం దగిలినదృష్టి యెట్టకేనియుం దిగిచికొని చని యద్దే వికిం బ్రణమిల్లిన. 38

క. కాంచనపీఠము వెట్టఁగఁ, బంచి ప్రియము చూడ్కి ముసుఁగు♦వడఁ దను సంభా వించునెడ నాతఁ డప్పకుఁ, బాంచాలిం జూపి వేగ♦పడి యిట్లనియెన్. 39

ఉ. ఇయ్యరవిందగంధికుల ♦ మేమి చరిత్రముచంద మెట్లు పే
రెయ్యది నాథుఁ డెవ్వఁ డిది ♦ యెచ్చట నెప్పుడు నుండు నిప్డు దా
నియ్యెడ కేసు దేవలయు ♦ చేపని సేయఁగఁ బూని దీనిపై
నెయ్యముకల్మి యేకొలఁది ♦ నీమది కింతయు నాకుఁ జెప్పుమా. 40

క. అనవుడు నయ్యంగన యితఁ, డనంగశరదళితహృదయుఁ ♦ డయ్యో నకట యీ తనిచిత్తవృత్తి మరలుప, ననురూపం బగునుపాయ ♦ మది యెయ్యదియో. 41

వ. అని తలంచుచుఁ గీచకునిమాటలు గీటునంబుచ్చి యొండుపలుకులు జరపిన నతం డును సత్త్వహీనుండు గావున సత్వరుండై క్రమ్మఱి ద్రౌపది యున్న యెడకుం జని యాసనమీపంబున నట్టాడుచు నమ్మానవతితో ని ట్లనియె. 42

38. కందర్పదర్పగోచరుండు = మన్మథునిగర్వమునకు విషయ మయినవాఁడు. కలరూపు = యథార్థస్థితిని. ఎట్టకేనియున్ = మిక్కిలికష్టముచేత. ప్రణమిల్లినన్ = నమస్కరింపఁగా.

39. కాంచనపీఠము=బంగరుగద్దెను. ప్రియముచూడ్కి=ప్రియమయినచూపు. ముసుఁగువడన్= కప్పుకొనఁగా. తనున్=కీచకుని. సంభావించుఎడన్ = గౌరవించునపుడు. సుధేష్ణ ప్రీతితోఁ గీచ కునకు బంగరుపీఁట వేయించి గౌరవింపఁగా నతఁడు ద్రౌపదిని జూపి సుధేష్ణతో నిట్లు చెప్పె నని తా.

40. ఈఅరవిందగంధికులము = కమలమువంటి దేహవాసనగల యీద్రౌపదియొక్క జాతి. చరి త్రముచందము = నడవడియొక్క విధము. నాథుఁడు = మగఁడు. ఏగు దేవలయుట= రావలయుట. నెయ్యముకల్మి = ప్రీతికలుగుట. ఏకొలఁది= ఎంతమాత్రము? ఈకాంత కుల మేమి? నడత యెట్టిది? పే రేమి? దీని మగఁ డెవ్వఁడు? ఇది యెచ్చటనుండును? ఇప్పు డిచ్చటికి కేపని చేయ వచ్చినది? దీనిమీఁద నీకెట్టిప్రీతి గలదు? నా కివి యన్నియు వివరించి చెప్పు మని తా.

41. అయ్యంగన = ఆసుధేష్ణ. అనంగశరదళితహృదయుఁడు = మన్మథబాణములచే భేదింపఁ బడినమనస్సుగలవాఁడు. అకట = అయ్యో! అనురూపంబు = తగినది. కీచకునిమాట విని సుధేష్ణ యీ తఁడు మన్మథునకు లోనై యున్నాఁడు, ఇతనిమనస్సును ఏయుపాయముచే మరలింపవచ్చునో యని తా.

42. గీటునన్బుచ్చి = అనాదరముచేసి. ఒండుపలుకులు= వేఱుమాటలను. సత్త్వహీనుండు= ధైర్యముచే విడువఁబడినవాఁడు. సత్వరుండువి = వేగిరపాటు గలవాఁడై. క్రమ్మఱి=మరలి. అట్టా డుచున్ = తిరుగుచు. అమ్మానవతితోన్ = ఆమానముగల ద్రౌపదితో.

క. ఇవ్వసుమతి నేపొలఁతుల, కివ్విధమునఁ జెల్వు గలదె ♦ యెన్నంగను నీ
వెవ్వరితనయవు నీపతి, యెవ్వఁడు పే రేమి సెప్పు ♦ మిందునిభాస్యా. 43

వ. అనిన నప్పలుకులు వినియు వినమి భావించి యప్పాంచాలి నిర్వికార యై యూరకున్న నచ్చపలుండు వెండియు ని ట్లనియె. 44

సీ. తెలిగన్నుఁగవకాంతి ♦ పొలుపార నించుక, కను విచ్చి చూచినఁ ♦ గాదె యబల
చెలువంపునెమ్మోము ♦ నెలమిసొం పినుమడి, గా నల్ల నవ్వినఁ ♦ గాదె యింతి
దంతమౌక్తికరుచి ♦ దలకొన మఱుమాట, పలికినఁ గాదె యు♦త్పలదళాక్షి
యుల్లంబుసరసత ♦ దెల్లంబుగా లీలఁ, గైకొన్నఁ గాదె పం♦కరుహవదన
యనుచుఁ జూచుఁ గేరు ♦ నమ్ముగ్ధపలుకులు, వినఁగఁ గోరుఁ గేలు ♦ దనదు కేలఁ
గీలుకొలుపఁ దలఁచుఁ ♦ గీచకాధముఁడు ని, జానురక్తి దెలుప ♦ నప్పళించు. 45

43. ఇవ్వసుమతిన్ = ఈభూమియందు. చెలువు = చక్కఁదనము. తనయవు = కుమార్తెవి. పతి = మగఁడు. ఇందునిభఆస్యా = చంద్రునితో సమానమయిన ముఖముగలదానా! ఓకాంతా! నీచక్కఁదనము లోకమున నెవ్వరికిని లేదు, నీ వెవ్వరికొమార్తవు, నీ మగఁ డెవ్వఁడు? నీ పేరేమి? చెప్పుమని తా.

44. వినమిన్ = వినకుండుటను. భావించి = నటించి. నిర్వికారచిత్తయై = వికారము లేని మనస్సుగలదై. అచ్చపలుండు = అచంచలచిత్తుఁ డయిన కీచకుఁడు.

45. అబల = ఓస్త్రీ! ద్రౌపదిసంబోధనము. తెలిగన్నుఁగవకాంతి = తెల్లనికన్నులజంటయొక్కకాంతి. పొలుపారన్ = ప్రకాశించునట్లు. ఇంచుక = కొంచెము. విచ్చి = తెఱచి. చూచినన్ కాదె = చూడరాదా? ఓకాంతా! నీనేత్రకాంతి పర్వునట్లు కన్ను దెఱచిచూడు మని తా. ఇంతి = ఓస్త్రీ! చెలువంపు నెమ్మోము ఎలమిసొంపు = చక్కనిముఖముయొక్కవికాసముయొక్క యతిశయము. ఇనుమడిగాన్ = రెండింతలగునట్లుగా. అల్లన్ = తిన్నగా. నవ్వినన్ కాదె = నవ్వరాదా? నీచక్కనిముఖమునకుఁ గాంతి యెక్కువగునట్లు కొంచెము నవ్వు మని తా. ఉత్పలదళాక్షీ = కలువరేకులవంటి కన్నులు గలదానా! దంతమౌక్తికరుచి = ముత్తెములవంటి దంతములకాంతి. తలకొనన్ = ప్రసరించునట్లు. మఱుమాట = బదులుమాటను. నీదంతకాంతి వెలువడునట్లు బదులుమాట పలుకు మని తా. పంకరుహవదన = కమలములవంటి మోము గలదానా! ఉల్లంబుసరసత = మనస్సుయొక్క రసికత. తెల్లంబుగాన్ = స్పష్ట మగునట్లు. లీలన్ = విలాసముచేత. కైకొన్నన్ కాదె = గ్రహింపరాదా? నీమనస్సునందలి యనురాగము స్పష్ట మగునట్లు నాహస్తమును గ్రహింపు మని తా. కేరున్ = నవ్వును. అమ్ముగ్ధపలుకులు = ఆద్రౌపదియొక్క పలుకులను. కేలు = ఆమె చేతిని. కీలుకొలుపన్ = పట్టుకొనుటకు. నిజఅనురక్తి = తన యనురాగమును. అప్పళించున్ = యత్నించును. ద్రౌపదిని కన్ను దెఱచిచూడు మని కీచకుఁడు తా నామెను జూచు ననియు, చిఱునవ్వు నవ్వు మని తాను నవ్వు ననియు, ఆమె పలుకులు వినఁ గోరి తాను పలుకు ననియు, నామె చేయి తనచేతం బట్టఁగోరి చేయి చాఁచు ననియు నిట్లు తనయనురాగము నామెకుఁ దెలియఁజేసె నని తా. అలం. యథాసంఖ్యము.

వ. ఇట్లు దాన తమకంబున వడిగొనుచు నప్పు డయ్యంగనయింగితం బూహింప
వెరవు మాలి మఱియును. 46

సీ. సుదతి నీమైఁ జక్కఁ ♦ జూచుట కోడెదఁ, గనుఁబాటు వారయునో ♦ యని తలంచి
మది నిగిర్చినమాట ♦ మగువ నీపెంపునఁ, గుదిసి నానాలుక ♦ తుదికి రాదు
పడఁతి నీకరములు ♦ పట్టంగఁ దివిరి శం, కించి వడంకెడుఁ ♦ గేలు సూడు
నెఱి నిట్టి దని యింతి ♦ నీనెమ్మనం బెన్ని, భంగుల నరసినఁ ♦ బట్టువడదు
చెలువ యింక నొక్కిఁంచుక ♦ సేపు నీ వ
నాదరంబున నెప్పటి ♦ యట్ల యున్న
మన్మథుఁడు సమయించిన ♦ మగుడ నన్నుఁ
బడయ వచ్చునె యెన్నియు ♦ పాయములను. 47

వ. అని తనయభిలాషంబు దేటపడం బలికిన నబ్బోటి కలుషించియు దుర్వారంబైన
పరిభవవికారంబు దోఁప కుండఁ దన్నుం దాన యుపశమించుకొని వీఁడు దురభి
మాని యై యున్నవాఁడు వేగిరపడుట వెరవు గాదు నేరుపుతోడన తప్పించు
కొనవలయు నని తలంచి యతని కి ట్లనియె. 48

46. తమకంబునన్ = మోహముచేత. వడిగొనుచున్ = తిరుగుడువడుచు. అంగనఇంగితంబు = ద్రౌపదియొక్క మనోభావమును. వెరవుమాలి = ఉపాయముచెడి.

47. సుదతి = ఓమంచిదంతములు గలదానా! ద్రౌపదిసంబోధనము. నీమై = నీదేహమును. కనుఁబాటు = దృష్టిదోషము. వారయునో = కలుగునో. అని. తలంచి. చక్కన్ చూచుటకున్. ఓడెదన్ = భయపడుదును. ఓ స్త్రీ! నీకు దృష్టిదోషము కలుగు నని నిన్నుఁ జక్కఁగాఁ జూడ వెఱతు నని తా. మదిన్ = మనస్సునందు. ఇగిర్చినమాట = పుట్టినపలుకు. మగువ! ద్రౌపదిసంబోధనము. నీపెంపునన్ = నీగొప్పతనముచేత. కుదిసి = అడఁగి. నేను ఆడఁదలఁచినమాట నీకు భయపడి పలుకఁజాల కున్నాఁడ నని తా. నీకరములు = నీచేతులను. తివిరి = కోరి. శంకిం = భయపడి. నీహస్తము పట్టుటకై పూనియుఁ బట్టఁజాలక నాచేయి వడంకుచున్నది చూడు మని తా. నెఱిన్ = వాస్తవమున. నీనెమ్మనంబు = నీయొక్క నిండుమనస్సు. ఇట్టిది. అని. ఎన్నిభంగులన్ = ఎన్నివిధములచేతను. అరసినన్ = ఆలోచించినను. పట్టువడదు = తెలియరాదు. ఎంత యాలోచించినను నీమనోభావ మిట్టిదని నిజముగాఁ దెలియరా దని తా. చెలువ=చక్కనిదానా! ఒక్కిఇంచుక= ఒక్కశబ్ద మిట వాక్యాలంకారార్థకము. అనాదరంబునన్=ఆదరము లేమిచేత. సమయించినన్=చంపిన యెడ. ఓకాంతా! యిట్లే యింకఁ గొంతసేపు నీవు నన్నాదరింపక యుందువేని మన్మథుఁడు నన్నుఁ జంపివేయును, ఆటుపిమ్మట నీకు నన్నుఁ బొంద శక్యము కా దని తా.

48. అభిలాషంబు = కోరిక. అబ్బోటి = ఆద్రౌపది. కలుషించియున్ = కోపించియు. దుర్వారంబు = అడ్డగింపరానిది. పరిభవవికారంబు = అవమానముచేఁ గలిగిన వికారము. ఉపశమించుకొని = అడఁచుకొని. దురభిమాని ఐ = దురహంకారము గలవాఁడై. వెరవు=తగినది.

క. నాయున్నబాము దలఁపవ, యీయొడ లీక్షించ యిట్టి♦యేవపుఁజందం
బోయన్న మదనవిక్రియఁ, జేయు ననుట యెంతయును ని♦షిద్ధము గాదే. 49

గీ. చనునె యిమ్మాట లాడ స♦జ్జనుల కేఁడుఁ, బుట్టువులతోడ నీవును ♦ బుట్టినాఁడ
వట్లుఁ గాకయు హీనవం♦శాభిజాత, నైన పతివత్ని నగు నన్ను ♦ నడుగఁ దగునె.

క. అని పెడఁగఁ బల్కిన న, మ్మనుజాధముఁ డంతఁ బోక ♦ మదనోన్మాదం
బునఁ దన్ను నెదిరి నెఱుఁగక, వనితకు ని ట్లనియె గార♦వంపుఁబలుకులఁ. 51

సీ. నెత్తమ్మిరేకుల♦మెత్తఁదనము దెచ్చి, యచ్చునఁ బెట్టిన ♦ ట్లుండ దొంది
చక్రవాకంబుల♦చందంబు గొని వచ్చి, కుప్పలు సేసిన ♦ ట్లొప్పు మెఱసి
చందురునునుఁగాంతి ♦ కందు దేర్చి కూర్చి బా, గునకుఁ దెచ్చినయట్లు♦ గొమరుమిగిలి
యళికులంబులకప్పు ♦ గలయంతయును బుచ్చి, నాఱు వోసినభంగి♦ నవక మెక్కి

49. నాఉన్నబాము = నాయుండునట్టి దుఃఖమును. తలఁపవు అ = తలఁపనే తలఁపవు. ఒడలు = దేహము. ఏవపుచందంబు = రోఁత యయినవిధము. ఓ అన్న ! కీచకునిసంబోధనము. మదనవిక్రియ౯ = మన్మథవికారమును. నిషిద్ధము = నిషేధింపఁ దగినది. నాదుఃఖస్థితి తలఁపక నారూపమును దేహమును నావస్త్రమును నాయసహ్య మగువిధమును చూచి మోహము నొందుట మిక్కిలి యయుక్త మని తా.

50. సజ్జనులకు౯ = సత్పురుషులకు. హీనవంశఅభిజాతను = నీచ మయినవంశమునఁ బుట్టినదానను. పతివత్నిని = భర్త గలదానను. సత్పురుషు లిట్టిమాట లాడరాదు, నీవును నాఁడుతోఁబుట్టువులు కలదు, ఇదిగాక హీనజాతిని, పరస్త్రీని, అట్టి నన్నిట్లు పలుకుట యుచితము కాదని తా. నైపతివ్రత నగు నన్ను అని యచ్చుప్రతులయందుఁ బాఠము గనఁబడుచున్నది. అయినను, స్వరసతచేతను "పరదారాస్మి భద్రం తే" అనుసంస్కృతమునకు అనురూప మగుటచేతను "ఐనపతివత్ని నగు నన్ను" అనుపాఠమె యాదరణీయము.

51. పెడఁగ౯ = స్పష్టముగా. అమ్మనుజఅధముఁడు—ఆకీచకుఁడు. అంత౯ = అంతటితో. మదనఉన్మాదంబున౯ = మన్మథవికారముచేత. ఎదిరి౯—ద్రౌపదిని. ఇట్లు స్పష్టముగాఁ జెప్పినను నా కీచకుఁడు అంతటితోఁ బోక మన్మథపరవశుం డగుటచే ద్రౌపదయభిప్రాయము దెలియక గౌరవముగా నిట్లు చెప్పె నని తా.

52. నెత్తమ్మిరేకులమెత్తఁదనము = చక్కనితామరరేకుల మృదుత్వమును. ద్రౌపది యడుగులు తామరరేకుల మెత్తఁదనమును అచ్చులోఁ బోసిరోయనున ట్లుండు నని తా. చక్రవాకంబులచందంబు = చక్రవాకపక్షులయొక్కవిధమును. ఒప్పు మెఱసి = ప్రకాశించి. ద్రౌపదిస్తనములు చక్రవాకపక్షుల చక్కఁదనమును ప్రోవులుగాఁ జేసిరో యనున ట్లుండె నని తా. చందురునునుఁగాంతి = చంద్రుని చక్కనికాంతిని. కందు = కళంకమును. ఏర్చి = వేఱుచేసి. కొమరుమిగిలి = అందమై. ద్రౌపదిమోము చంద్రబింబము కళంకముఁ దొలఁగించి బాగు చేయఁబడినదియో యనున ట్లుండె నని తా. అళికులంబులకప్పు = తుమ్మెదలసమూహములయొక్క నల్లఁదనము. కలఅంతయును = ఉన్నయంతయును. పుచ్చి = తీసి. నవకము = కోమలత్వము ద్రౌపదికొప్పు తుమ్మెదనల్లఁదన మంతయుఁ దీసి

యంఘ్రితలములుఁ గుచములు ♦ నాననంబుఁ
గచభరంబును నిట్లున్న ♦ రుచిరమూర్తి
యనుపమానభోగములకు ♦ నాస్పదంబు
కాదె యీత్రిప్పు లేటికిఁ ♦ గమలవదన. 52

సీ. నీవు దుర్జాతి గామికి ♦ నీవ సాక్షి, పరసతీసంగమున వచ్చు ♦ పాపమునకు
నోర్తుఁ గాని సైరింపఁగ ♦ నోపఁ బచ్చ, విలుతుతూపులతాఁకున ♦ కలరుఁ బోఁడి.

క. అనుపలుకుల కయ్యంగన, ఘనకోపము గదిరి నీచు ♦ గావున జంకిం
చినఁ గాని మెత్తఁబడి పోఁ, డని మనమునఁ దలఁచి యిట్టు ♦ లనియెం బెలుచన్.

నాటువోసిన మొలకలో యనునట్లుండె నని తా. అంఘ్రితలములున్ = అడుగులప్రదేశములును. ఆననంబున్ = ముఖమును. కచభరంబునున్ = వెండ్రుకలసమూహమును. ఉన్నరుచిరమూర్తి = ఉన్నట్టి చక్కనియాకారము గలది. అనుపమానభోగములకున్ = సాటిలేని సౌఖ్యములకు. ఆస్పదంబు = చోటు. ఈత్రిప్పులు = ఈకష్టములు. కమలవదన = తామరవంటి మొగముగలదానా! ఇట్టి చక్కనిరూపము గల నీవు భోగముల ననుభవింపవలసినదానవు గాని పనికత్తెగా నుండఁ దగినదానవు కా వని తా. అలం. సీసము నాలుగుపాదములయం దుత్ప్రేక్ష, సీసము నాలుగుపాదములకు గీతమునందలి అంఘ్రితలములు మొదలగువానితోఁ గ్రమాన్వయము కలిమింజేసి యథాసంఖ్యము, రుచిరమూర్తిత్వము భోగాస్పదత్వంబునకు సమర్థక మగుటచేఁ గావ్యలింగము. పాఠాం:—చతుర్థపాదమునందు "కలయంతయును దెచ్చి"—తెచ్చి యనుపదము ప్రథమపాదమునందును బ్రయుక్త మగుటచేఁ బూర్వపాఠమే కవిసమ్మతము, "నైకం పదం ద్విః ప్రయోజ్యం ప్రాయేణ" ఒకపదమును సాధారణముగా రెండుమాఱులు ప్రయోగింప రాదు. అని ప్రమాణము.

53. దుర్జాతి = నీచజాతి గలదానవు. కామికిన్ = కాకపోవుటకు. సాక్షి—సాక్షాత్తుగాఁ జూచినదానవు. పరసతీసంగమునన్ = పరస్త్రీసంబంధముచేత. పచ్చవిలుతుతూపుల తాఁకునకున్ = మన్మథుని బాణములస్పర్శమునకు. సైరింపఁగన్ ఓపన్ = ఓర్వఁ జాలను. అలరుఁబోఁడి = పుష్పమువంటి దేహము గలదానా! నీరూపమువలననే నీవు నీచజాతివి కా వని యేర్పడుచున్నది. నేను పరస్త్రీసంబంధమున వచ్చునట్టి పాపమును సహింపఁ గలను గాని యీమన్మథునిబాధను సహింపఁజాల నని తా. నీవ సాక్షి—ఇచ్చట సాక్షిశబ్దము ద్రౌపదీవిశేషణ మగుటచే సాక్షిణి యని స్త్రీలింగముగాఁ బ్రయోగింపవలెను. అయినను "సామాన్యే నపుంసకమ్" అనుటచే సామాన్యమును వివక్షించి నపుంసకలింగము ప్రయోగింపవచ్చును కావున నిట నపుంసకలింగముగా ప్రయోగింపఁబడిన దని గ్రహింపవలయును.

54. ఆయ్యంగన = ఆద్రౌపది. ఘనకోపము = ఎక్కుడుకోపము. కదిరి = కలిగి. నీచు = అల్పుఁడు, రూపాంతరము నీచుఁడు. జంకించినన్ = బెదరించినయెడ. పెలుచన్ = గొప్పధ్వనిచేత. కీచకునిమాటలకు ద్రౌపది మిక్కిలి కోపపడినదై యితఁడు నీచుఁ డగుటచే భయపఱచిననేగాని తొలఁగిపోఁ డని తలఁచి యిట్లు గట్టిగాఁ జెప్పె నని తా. పాఠాం:—అను నప్పలుకుల కయ్యం♦గన కోపము—అర్థము సమానము.

( ద్రౌపది కీచకునితోఁ బరుషవాక్యంబులు పలుకుట. )

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసా◆స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవి◆ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రెద్దు నిను దో◆ర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట త◆థ్యం బెమ్మెయిం గీచకా. 55

గీ. అనుడు నతఁ డిట్టు లనియె నా◆యతులబాహు
బలముఁ జెనయంగ భవదీయ◆పతుల కారు
మూఁడులోకంబులందు నె◆వ్వాఁడు లేఁడు
నిక్కువం బింత నమ్ముము ◆ నీరజాక్షి. 56

వ. అనిన విని సైరంధ్రి సైరణ దక్కి ధిక్కరించి యి ట్లనియె. 57

క. చనుఁ జన దని చూడక యం, దని మ్రానులపండ్లు గోయఁ◆ దలఁచుట హితమే
మును చెడినరావణాదుల, విని యెఱుఁగవె యెన్నఁడును వి◆వేకవిహీనా. 58

గీ. ఇవ్విధంబునఁ బలికిన◆యింతిపలుకు, గాన నేరక తమయప్పఁ◆గడకు మగుడ

55. దుర్వార...పారగుల్—దుర్వార= అణఁపరాని, ఉద్యమ = ఉత్సాహముచేతను, బాహువిక్రమరస = భుజపరాక్రమాతిశయముచేతను, అస్తోక= తక్కువకాని, ప్రతాప= ప్రతాపముచేతను, స్ఫురత్ = ప్రకాశించుచున్న, గర్వ = కావరముచేత, అంధ = కన్నులు తెలియని, ప్రతివీర = శత్రువీరులయొక్క, నిర్మథన = వధించుటయందు, విద్యా = నేర్పుయొక్క, పారగుల్ = తుద ముట్టినవారు. మత్పతుల్ = నామగలు. గీర్వాణాకృతులు = దేవతలయాకారమువంటి యాకారము గలవారు. గంధర్వుల్. దోర్లీలన్ = భుజములవిలాసముచేత. గిట్టి = తాఁకి. తథ్యంబు = నిజము. కీచకా! గొప్పపరాక్రమము గల శత్రువులను వధించి ఖ్యాతి గాంచిన నామగలు గంధర్వు లయిదుగురును ఇప్పుడే నీమానప్రాణములను హరింతు రని తా.

56. అలఘుబాహుబలముఁ = తక్కువకాని చేతులబలమును. చెనయంగన్ = ఎదిరించుటకు. భవదీయపతులు అ = నీమగలుమాత్రమే. నిక్కువంబు = నిజము. నీరజాక్షీ = కమలములవంటి కన్నులు గలదానా! ద్రౌపదిమాటలకుఁ గీచకుఁ డిట్లు చెప్పెను. నన్నెదిరించుటకు నీమగలు గాని ముల్లోకములందలి మఱియొక్కఁడు గాని సమర్థులు కా రని తా.

57. సైరణ = ఓర్పును. ధిక్కరించి = నిందించి.

58. చనున్ = తగును. వివేకవిహీనా = తెలివిచే విడువఁబడినవాఁడా! తగును దగ దని యాలోచింపక దుర్లభము లయినవానిని కోరుట మేలు కాదు, తొల్లి రావణాదులు ఇట్టి కోర్కులు గోరి చెడి రని యెఱుఁగవా యని తా.

59. ఇంతిపలుకు = ద్రౌపదిమాటను. కాననేరక = తెలియఁజాలక. నెవ్వఁగ = నిండుసంతా

నత్తెఱంగున రేఖయు ♦ నవ్విధంబు, గరువచందంబు నమ్మేయి ♦ కలికితనము
నట్టి చెన్నును సైరంధ్రి ♦ యందె కాక, కలవె యొరులకు నెఱుఁగక ♦ పలికి తబల.

వ. కావున నాచెలనాగ నేమియుపాయంబున నైన నన్నుం జేర్ప నైతేనిఁ గందర్ప దర్పంబున నలందుఱుదు ననిన నవ్వాలంతి వెండియు ని ట్లనియె. 68

గీ. ఆయు రైశ్వర్య కీర్తుల ♦ నపహరించు
పరసతీసంగమము ధర్మ ♦ పథమునందుఁ
బరఁగువారలు పరిహరిం ♦ పంగఁ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వి ♦ వేక మగుట. 69

సీ. పతి యెఱింగినఁ దన ♦ ప్రాణంబుపై నమ్మ, ననుభయంబున నుల్ల ♦ మదరుచుండ
జనులు గాంచిన మానుషము దూలుఁ దనకను, పుయిలోటమున మోము ♦ పుల్లగిలఁగ
బోటికిఁ దోఁచినఁ ♦ బొలియుఁ దేఁకువ యను, వెగడునఁ జెయ్వులు ♦ పీడువడఁగ
బంధుల కగపడ్డఁ ♦ బాయు నన్వయ మను, కలఁక మైఁ జెమటలు ♦ గ్రమ్ముదేరఁ

చక్కఁదనమును. ఈనాలుగును నీయు నాలుగుపాదములయందలి కోమలిగ మొదలగు నాలింగింటితోను సంబంధించును. అబల = ఓ స్త్రీ—సుదేష్ణకు సంబోధనము. సైరంధ్రిసౌందర్యమువంటి సౌందర్యము ఇతర స్త్రీల కెవ్వరికిని లే దని తా.

68. ఆచెలనాగ = ఆ స్త్రీ, సైరంధ్రి. కందర్పదర్పంబునన్ = మన్మథగర్వముచేత. అలందుఱుదున్ = బాధపడుదును. ఆవ్వాలంతి = ఆసుదేష్ణ.

69. ఆయురైశ్వర్యకీర్తులన్ = ఆయుస్సును ఐశ్వర్యమును కీర్తిని. అపహరించుపరసతీసంగమమున్ = పోఁగొట్టునట్టి పరస్త్రీసంబంధమును. ధర్మపథమునందున్ = ధర్మమార్గమునందు. పరఁగువారలు = ప్రవర్తించువారు. పరిహరింపంగన్ = విడువఁగా. దుర్వివేకము = దుర్బుద్ధి. అగుట. తెలియవె యని యన్వయము. పరస్త్రీ పొందు ఆయువును ఐశ్వర్యమును కీర్తిని నశింపఁజేయు నని ధార్మికులు నిషేధింతు రని తెలిసియు నీ విట్టిదుర్బుద్ధి వహించుట తగ దని తా.

70. పతి = మగఁడు. ఉల్లము = మనస్సు. పరస్త్రీకి మగఁ డెఱుఁగు ననుభయముచేఁ మనస్సు అదరుచుండు నని తా. మానుషము = పరువు. తూలున్ = పోవును. అను పుయిలోటమునన్ = అనునట్టి సంకోచముచేత. పుల్లగిలంగన్ = వెలవెలఁబోఁగా. జనులకుఁ దెలిసినచోఁ బరువుచెడు నని మోము వెలవెలఁబోవు నని తా. బోటికిన్ = చెలికత్తెకు. తోఁచినన్ = తెలిసినయెడ. తేఁకువ = గౌరవము. పొలియున్ = నశించును. అను వెగడునన్ = అనుభయముచేత. చెయ్వులు = విలాసచేష్టలు. పీడువడఁగన్ = వ్యత్యాసపడఁగా. చెలికత్తెకుఁ దెలిసినయెడ నవమానము గలుగు ననుభయముచేత విలాసచేష్ట లుడుఁగు నని తా. పాయున్ = పోవును. అన్వయము = వంశము. అనుకలఁకన్ = అనుభయముచేత. మైన్ = దేహమునందు. బంధువులకుఁ దెలిసినయెడ వెలివేయుదు రనుభయముచేత దేహము చెమటపట్టు నని తా. కౌతుకంబు = ఉత్సాహము. ఊరియాడన్ = చలింపఁగా. జారపొందు = ఱంకుటాలికూడిక. చేయమిన్ = చేయకపోవుటచేత. ఎఱుక = జ్ఞానము. అందువలన క్రీడాకాలము

క్రీడ దేఱఁ గౌతుకం బుఱియాడ రతుల, నేర్పులు గొనియాడ నేరని ♦ జారపొందు
హృదయమున కింపుసేయమి ♦ నెఱుకగలుగు,వారు దీని సుఖంబుగాఁ ♦ గోరరెందు.

వ. అదియునుం గాక. 71

క. బలవిక్రమసంపన్నులు, గల రేవురు దానిపతులు ♦ గంధర్వులు వా
రలఁ దలఁచిన నాచిత్తము, దలఁకెడు నది యేల నీకుఁ ♦ దమ్ముఁడ చెప్పుమా. 72

గీ. కానితెరువునఁ బోయినఁ ♦ గలుగునయ్య, బ్రదుకుచవి యెంతయైన న♦పథ్యములకు
వేడ్క సేయుదురయ్య వి♦వేకు లెవ్వి, ధమున నాబుద్ధి వినవయ్య ♦ తమక ముడిగి.

క. అనవుడు నమ్మాటలు దన, మనమునకు సహింప రామి ♦ మల్లడిగొనుచున్
మనసిజపరతంత్రత ని, ట్లని పల్కె సుధేష్ణతోడ ♦ నతఁ డుద్ధతుఁడై. 74

మ. వనితా యే నొకపల్కు పల్కెదఁ జతు♦ర్వారాశిమధ్యంబునన్
ఘనబాహాబల మొప్ప నన్ను నెదురం ♦ గా నొక్కఁడున్ లేఁడు యె
వ్వనికిం దెల్లము గాదె దానిమగలన్ ♦ వజ్రాహతిం గూలుశై
లనికాయంబున మద్భుజాసమదలీ♦లన్ గీటడంగించెదన్. 75

వందుఁగూడ మనస్సు కలఁగియుండుటచే నప్పటిసుఖము ననుభవింపఁజాలదు కావునఁ బరస్త్రీపొందు సుఖకరము కాదని తెలివిగలవారలు దాని విడుతు రని తా.

72. బలవిక్రమసంపన్నులు = బలముతోను బరాక్రమముతోను గూడినవారలు. తలఁకెడున్ = చలించుచున్నది. దానికి బలవంతులగు పతు లయిదుగురు కలరు, వారిం దలంచిన నాకు భయము గలుగుచున్నది, నీవు దాని స్వీకరింపు మని తా.

73. కానితెరువునన్ = చెడుమార్గమునందు. బ్రదుకుచవి = జీవితాశ. కలుగునయ్య = కలుగదు. అపథ్యములకున్ = హితము కానివానికి. వివేకులు = బుద్ధిమంతులు. తమకము = మోహమును. చెడ్డమార్గమునఁ బోయినయెడ బ్రదుకు కలుగదు, బుద్ధిమంతులు హితములు గానివానిని గోరరు, కావున నెట్లయినను నీవు నేను చెప్పు బుద్ధిని వినుమని తా.

74. మల్లడిగొనుచున్ = పరితపించుచు. మనసిజపరతంత్రతన్ = మన్మథునకు లోఁబడినవాఁడగుటచేత. ఉద్ధతుఁడు ఐ = గర్వించినవాఁడై. సుధేష్ణ మాటలు విని యోర్వఁజాలనివాఁడై మన్మథునకు లోనై గర్వించి యిట్లు చెప్పె నని తా.

75. వనితా! సుధేష్ణసంబోధనము. చతుర్వారాశిమధ్యంబునన్ = నాలుగుసముద్రములనడుమ; ఘనబాహాబలము = గొప్పచేతులలావు. వజ్రఆహతిన్ = వజ్రాయుధము దెబ్బచేత. కూలుశైలనికాయంబు అనన్ = పడునట్టి పర్వతములసమూహమో యనునట్లు. మద్భుజాసమదలీలన్ = నా చేతులయొక్క మదముతోఁగూడిన విలాసముచేత. గీటడంగించెదన్ = చంపెదను. సుధేష్ణా! నామాట వినుము, భూమండలమున బాహుబలముచే నన్నెదిరించువాఁడు లేఁడు. దానిమగలను నేను వధించెద నని తా.

ఉ. బుద్ధులు సెప్పి తెల్ల నటు ♦ వో విడు మెన్మెయి నైన సౌఖ్యసం
సిద్ధి యొనర్పు నాకు నెడ ♦ సేసినఁ దాపము రూపుమాపు నా
వృద్ధియ కోరుదేని నవి ♦ వేకిపి నీ వని నన్ను నిట్లసం
బద్ధము లైన వాక్యములు ♦ పల్కక వే పిలిపింపు కోమలిన్. 76

గీ. అనుచు దైన్యంబు నొందెడు ♦ నాననంబు, తోడ దిగ్గన లేచి య♦త్తోయజాక్షి
చరణపీఠంబుకడఁ జక్క ♦ జాఁగి మ్రొక్కి, యున్న నద్దేవి గనుఁగొని ♦ చిన్నఁబోయి.

ఉ. ఆనల వచ్చునాపదల ♦ కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి నా
కీవెడమాటలన్ మరలఁ ♦ జెన్నివిధంబులఁ జూపి చెప్పినం
గావరుఁ డైనవాఁడు దగు ♦ కార్యము పట్టునె వీని కెమ్మెయిం
జావు నిజంబు మన్మథుని ♦ శాతశరంబుల నైన నక్కటా. 78

క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని నల్ల నెత్తి ♦ దండడి దొరఁగం
జనుదెంచునశ్రుపూరము, కనుఁగవలోఁ గ్రుంగికొనుచుఁ ♦ గామిని పలికెన్. 79

గీ. ఇంత దలర నేల ♦ యెమ్మెయి నైనను, గొమ్మ నలవరించి ♦ కూర్చు టరుదె

76. విడు = విడిచిపెట్టుము. ఎడ = విఘ్నము. తాపము = మన్మథబాధ. అసంబద్ధములు = అసంగతములు. కోమలిన్ — సైరంధ్రిని. నీవు నాకు బుద్ధులు చెప్ప వలదు, ఎట్లైనను నాకు సౌఖ్యము సిద్ధింపఁజేయుము, దానికి విఘ్నము చేయుదువేని నేను మన్మథతాపముచే నశియింతును, కావున నీవు నా మేలు కోరినపక్షమున నన్ను నిందింపక శీఘ్రముగా దానిం బిలిపింపు మని తా.

77. దైన్యంబున్ = దీనత్వమును. ఆననంబుతోడన్ = ముఖముతో. అత్తోయజాక్షి చరణపీఠంబుకడన్ = అసుదేష్ణయొక్క యడుగుపీటదగ్గఱ. అట్లు చెప్పుచు దీనుండై లేచి సుదేష్ణయడుగులం బడి లేవకయున్న నాయమ పరితాపము నొంది యని తా.

78. లతాంగిన్ = సైరంధ్రిని. ఈవెడమాటలన్ = ఈవట్టిమాటలచేత. కావరుఁడు = దుష్టుఁడు. తగుకార్యము = తగినపనిని. మన్మథుని శాతశరంబులన్ ఐనన్ = మన్మథుని వాఁడిబాణములచేతనైనను. వెనుక నెన్నియాపదలు వచ్చినను ఇపు డెట్లైనను సైరంధ్రిని వీనికిఁ గూర్చినంగాని వ్యర్థపుమాటలచే నుపయోగము లేదు, మిక్కిలి గర్వము కలవాఁడు కావున నెన్నివిధములఁ జెప్పినను తగుమాటను గ్రహింపఁజాలఁడు, వీఁ డెట్లైనను సైరంధ్రిమూలముచేఁ గాకపోయినను మన్మథబాణములచే నైనను మృతి నొందు నని తా.

79. దండడి = దట్టముగా. దొరఁగన్ = కాఱుటకు. అశ్రుపూరము = కన్నీటిప్రవాహము. కామిని = సుదేష్ణ. అని యనుకొనుచుఁ గీచకుని లేవనెత్తి కన్నులనుండి కాఱుకన్నీళ్లను నణఁచుకొని సుదేష్ణ యిట్లు చెప్పె నని తా.

80. తలరన్ = చింతించుట. కొమ్మన్ — సైరంధ్రిని. అలవరించి = అనుకూలపఱచి. ఊమ్మ

యుమ్మలంబు దక్కి • యూఱటఁ బొడ సీ, కొంగు మసల వలదు • డింక నిచట. 80

క. ఆసవమున కని నీదుని, వాసమునకు దినములో న•వశ్యంబును నే
నా సుదతిం బుత్తెంతు ని, జాసక్తి ఫలింప నలువు • మభిమత కేళిన్. 81

( కీచకుండు ద్రౌపదియందలి మోహంబునఁ బరితపించుట. )

వ. అనిన విని కీచకుండు ముదితహృదయుం డయి నిజసదనంబునకుం జని వివిధమధు రసంబు లొనరించి సముచితఖాద్యంబులు సమకట్టి తత్ప్రదేశంబు విజనంబు గా వించి యొక్కరమ్యస్థలంబున నుండి పాంచాలివలనితగులు చిత్తంబు నుత్తల పఱుపం దలరి నెవ్వగల కగపడి తలపోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున నమ్ముగ్ధకుం దనసన్నిధిఁ గామవికారంబు ప్రస్ఫుటంబు గలుగ భావించుచు. 82

సీ. కేళిమై నొక్కటఁ • గేలఁ ద్రెళ్లఁగెడు, వాలుగసోఁగల•మేలు డించి
కరువలి సుడియమిఁ • గందక చెన్నొందు, నఱవిరితమ్ముల • నుఱక తెగడి

లంబు = సంతాపమును. మసలవలదు = ఉండవలదు. నీ వింతదుఃఖపడవలదు, ఎట్లైనను సైరంధ్రి నొప్పించి కూర్చెదను, ఇఁక నీ వ్రాఁజడిల్లి యిటనుండక యింటికిఁ బొమ్మని తా.

81. ఆసవమునకున్ = మద్యమునకు. నీదునివాసమునకున్ = నీయింటికి. దినములోన్ = పగటిలో. ఆసుదతిన్ = ఆ స్త్రీని. పుత్తెంతున్ = పంపుదును. నిజఆసక్తి = నీకోరిక. అభిమతకేళిన్ = ఇష్టమయిన క్రీడను. నేను మద్యమునకై సాయంకాలములోపల సైరంధ్రిని మీయింటికిఁ బంపెదను: అప్పుడు నీకోరిక నెఱవేర్చుకొమ్మని తా. పాఠాం:—దివములోన్—అర్థము సమానము.

82. ముదితహృదయుండు = సంతోషించిన మనస్సుగలవాఁడు. నిజసదనంబునకున్ = తన యింటికి. వివిధమధురసంబులు = నానావిధము లయిన మద్యరసములను. సముచితఖాద్యంబులు = తగిన భక్ష్యములను. సమకట్టి = సిద్ధపఱచి. తత్ప్రదేశంబు = ఆచోటును. విజనంబు = జనులు లేనిదా నిని. తగులు = మోహము. ఉత్తలపఱుపన్ = బాధింపఁగా. తలరి = చలించి. నెవ్వగలకున్ = ఎక్కుడు సంతాపములకు. దుర్విదగ్ధుండు = అవివేకి. అమ్ముగ్ధకున్ = ఆసైరంధ్రికి. తనసన్నిధిన్ = తనదగ్గఱ. కామవికారంబు = మన్మథవికారము.

83. కేళిమైన్ = క్రీడచేత, ఒక్కటన్ = ఒకటిగా. త్రెళ్లఁగెడువాలుగసోఁగలమేలు = ఎగిరిపడుచున్న వాలుగచేఁపలయొక్క దీర్ఘతలయొక్క చక్కఁదనమును. డించి = తక్కువపఱచి. ఏకకాలమునందు ఎగిరిపడెడు నిడుపులయిన వాలుగచేఁపలను బోలి యని తా. కరువలి = గాలి. సుడియమిన్ = వీవకయుండుటచేత. కందక = వాడక. చెన్నొందు నఱవిరితమ్ములన్ = ప్రకాశించునట్టి సగమువికసించిన కమలములను. ఉఱక = లక్ష్యము చేయక. తెగడి = తిరస్కరించి. గాలి వీవకుండుటచేత వాడక మనోహరములై యున్న సగము వికసించినకమలములవలెనున్నవై యని తా. చెన్నొందన్ = అందము గలుగునట్లు. మై = ఆకారమును. తొడసిన వలరాజు వాలికతూపులన్ = కడిగిన మన్మథునియొక్క వాఁడియయినబాణములను. చక్కఁగాఁ దుడిచి కడిగిన మన్మథునివాఁడి

బెడఁ గొందఁ దుడిచి మైఁ ♦ దొఁగసినవలరాజు, వాలికతూపులఁ ♦ దూలఁ దోలి
పొలపంబు మెఱసి ది♦క్కులఁ గాంతిపూరించు, క్రొక్కారుమెఱుఁగుల♦నుక్కడంచి
తనవిలోచనములు నాదు♦మనము నాఁచి
కొనఁగ నయ్యింతి నన్నుఁ గనుఁ♦గొనియె నాత్మఁ
నైకొనియె రాగరసమునఁ ♦ గడలుకొనియె
మదనవిక్కృతి బయల్పడ ♦ నుదిలకొనియె. 83

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ ♦ జిక్కఁగ వెండియు నాలతాంగి య
చ్చొత్తినయట్లు నాకుఁ దన♦యుల్లము దెల్లము సేయ కున్కి దా
నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట ♦ నడ్డము సొచ్చినసిగ్గుపెంపు న
న్నుత్తల మందఁ జేయుటకు ♦ నో తలపోసి యెఱుంగ నయ్యెడన్. 84

సీ. అనుచుఁ గొందలపడుఁ గోర్కె♦లగ్గలించి, చిట్టుముట్టాడుచుండ న♦చ్చెలువయందుఁ
దగిలి తనయిచ్చఁ బాఱుచి♦త్తంబుపజ్జ, నరిగి యిట్లను నక్కీచ♦కాధముండు.

బాణములవలె నున్నవై యని తా. పొలపంబు = వ్యాపించునవై. పూరించు క్రొక్కారుమెఱుఁగులన్ = నిండించునట్టి వర్షాకాలమునందలి మెఱపులను. అంతటను వ్యాపించి మెఱయునట్టి మెఱపులతో సమానములై యని తా. తనవిలోచనములు = సైరంధ్రియొక్క కన్నులు. నాఁచికొనన్ = అపహరింపఁగా. అయ్యింతి–ఆసైరంధ్రి. ఆత్మన్ = మనస్సునందు. రాగరసమునన్ = అనురాగరసముచేత, కడలుకొనియెన్ = అతిశయించెను. మదనవిక్కృతి = మన్మథవికారము. ఉదిలకొనియెన్ = తపించెను. ఇట్టి తనచూపులు నామనస్సును అపహరింపఁగా సైరంధ్రి నామీఁదియనురాగమును బయలుపఱిచె నని తా. పాఠాం.—నెఱవిరితమ్ములన్ = నిండుగా వికసించిన కమలములను.

84. చిత్తము = మనస్సు. నావలనన్ = నాయందు. చిక్కఁగన్ = అసక్తము కాఁగా. అలతాంగి = ఆస్త్రీ. అచ్చొత్తినయట్లు = స్పష్టముగా. ఉల్లము = మనస్సును. తెల్లము = స్పష్టము. క్రొత్తకాన్పు = క్రొత్తగాఁ జూచుట. సిగ్గుపెంపు = సిగ్గుయొక్క యతిశయము. ఉత్తలము = సంతాపమును. చేయుటకున్ ఓ = చేయుటకో. అయ్యెడన్ = ఆసమయమునందు. మనస్సు నాయందుఁ దగిలియున్నను సైరంధ్రి తనభావము నాకు వెల్లడి చేయక పోవుట, ప్రథమదర్శన మగుటచే నాకు సంతాపము గల్గింప సిగ్గు అడ్డపడుటచేతనై యుండవచ్చును. అప్పుడు ఆలోచించి తెలియఁజాలక పోయితి నని తా. పాఠాం.—సిగ్గుపెంపు తన్నుత్తల మందఁ జేయుటకునో = సిగ్గుయొక్క యతిశయము తన్ను – సైరంధ్రిని కలఁత నొందఁజేయుటచేతనో. ఇదియె స్వరసతరమైన పాఠము.

85. కొందలపడున్ = క్షోభపడును. అగ్గలించి = అతిశయించి. చిట్టుముట్టాడుచుండన్ = పెనఁగొనుచుండఁగా. అచ్చెలువయందున్ = ఆద్రౌపదియందు. చిత్తంబుపజ్జన్ = మనస్సువెనుకను. ఇట్లు సంక్షోభపడుచుఁ గోరిక అధికముగాఁ గలవాఁడై కీచకుఁడు ద్రౌపదిమీఁదిమోహమున మనస్సు పోయినదారిం బోవుచు నిట్లనియె నని తా.

సీ. లీల నాముందట ♦ నాలేమ పొలసినఁ, జూడ్కికిఁ జుబ్బన♦చూఱ గాదె
కను విచ్చి నన్ను నా♦తనుమధ్య సూచినఁ, దనువున కమృతసే♦చనము గాదె
చిఱునవ్వు బెరయ న♦చ్చెలువ నాతోడఁ బ, ల్కినఁ జెవులకు రసా♦యనముగాదె
యెలమి నమ్మెలఁత న♦న్నెలయింపఁ దివిరిన, నెడఁద కానందంబు♦నిక్కగాదె
యానితంబిని మక్కువ ♦ ననఁగి పెనఁగి, యింపు పొంపిరివోవ న♦న్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మ♦ఫలము గాదె, యనుచు వలరాజుబారికి ♦ నగ్గమయ్యె.

వ. మఱియు ననేకభంగుల ననంగవిభ్రమంబుల కనురూపంబు లగు విప్రలాపంబులం బ్రొద్దు గడపుచు నమ్మదిరాక్షిరాక కెదురుచూచు చుండె నక్కడఁ బాంచాలి రావించి సుధేష్ణ తృష్ణ భావించుచు ని ట్లనియె. 87

క. ఒదవెడుతృషపెల్లిదమున, వదనము వఱువట్లు వట్టె ♦ వాసితరాజ
న్మదిరారస మానఁగ నా, హృదయంబున వేడ్క యెసక ♦ మెసఁగెడుఁ దరుణీ.

క. కీచకునియింట నెప్పుడు, వాచవి యగుబహువిధంపు♦వారుణి గలుగున్

86. లీలన్ = విలాసమున. ఆలేమ = ఆ స్త్రీ, సైరంధ్రి. చుబ్బనచూఱ = మిక్కిలికొల్ల. సైరంధ్రి కనఁబడినయెడ నాకు నేత్రోత్సవం బగు నని తా. తనుమధ్య = సన్ననడుము గల ద్రౌపది. తనువునకున్ = దేహమునకు. అమృతసేచనము = అమృతముచేఁ దడుపుట. న న్నది కన్నుఁదెఱచి చూచినయెడ నాదేహము నమృతముతో నభిషేకించిన ట్లగు నని తా. బెరయన్ = కలుగునట్లు. రసాయనము = జరావ్యాధులఁ బోఁగొట్టెడు రుచ్యమయిన యౌషధము. ఆకాంత చిఱునవ్వుతో మాటలాడినయెడ నాకు శ్రవణానందం బగు నని తా. ఎలమిన్ = సంతోషమును. అమ్మెలఁత = ఆ స్త్రీ, సైరంధ్రి. ఎలయింపన్ = పొందునట్లు చేయుటకు. తివిరినన్ = కోరినయెడ. ఎడఁదకున్ = మనస్సునకు. ఆనందంబునిక్క = ఆనందమునకుఁ జోటు. నాకు సంతోషము గలిగించుటకుఁ గోరిన యెడ నాకుఁ బరమానందము గలుగు నని తా. ఆనితంబిని = ఆ స్త్రీ. మక్కువన్ = అనురాగముతో. పొంపిరిపోవన్ = అతిశయించునట్లు. జన్మఫలము = పుట్టువుయొక్క ప్రయోజనము. వలరాజుబారికిన్ = మన్మథునిబాధకు. అగ్గము = అధీనుఁడు.

87. అనేకభంగులన్ = పెక్కువిధములచేత. అనంగవిభ్రమంబులకున్ = మన్మథవిలాసములకు. అనురూపంబులు = తగినవి. విప్రలాపంబులన్ = విరుద్ధవాక్యములచేత. తృష్ణ = దప్పిని. భావించుచున్ = నటించుచు.

88. ఒదవెడుతృషపెల్లిదమునన్ = కలుగుచున్నట్టిదప్పియొక్క యతిశయముచేత. వదనము = నోరు. వఱువట్లువట్టెన్ = మిక్కిలియెండుటలనుపొందెను. వాసితరాజన్మదిరారసము = వాసనగల యొప్పుచున్న మద్యరసమును. ఆనఁగన్ = త్రాగుటకు. ఎసకము ఎసఁగెడున్ = మిక్కిలియతిశయించుచున్నది. దప్పిచే నోరెండిపోవుచున్నది. కావున మంచివాసనగల మద్యము త్రావఁ గోరుచున్నదాన నని తా.

89. వాచవి = నోటికి రుచి. బహువిధంపువారుణి = నానావిధములు గల మద్యము. వే = త్వరగా. నీగమనవేగంబున్ = నీయొక్కనడకయొక్కవడిని. కీచకుని యింట మంచిరుచిగల మద్య

వే చని యిచటికిఁ గొని ర, మ్మా చూతము గాని నీగ♦మనవేగంబున్. 89

వ. అనవుడు. 90

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను♦ పుద్గతఘర్మజలంబు డాల్పుచున్
డిల్లపడంగ నా కిది గ♦డిందివిచారము పుట్టె నందుఁ బో
నొల్ల ననంగ రా దచటి♦ కూరక పోవఁగ రాదు నేర్పు సం
ధిల్లఁగ దీనిఁ బాపికొను♦దీమస మెట్టిది యొకో దైవమా. 91

వ. అని తలంచుచు డోలాందోళితమానస యగుచు నమ్మానిని సుధేష్ణ కి ట్లనియె. 92

ఉ. ఉత్పలగంధి న న్నుడిగి ♦ యొడ్లను బంపుము కల్లు దేర నే
సత్పథవృత్తి నీకడన ♦ సంతతమున్ బహుమానపాత్రనై
తత్పరతం జరించి యుచి♦తంపుఁబనుల్ దగఁ జేయఁ గాక దు
ష్యత్పరివారయోగ్యపరి♦చారముపైఁ జనునట్టిదాన నే. 93

క. అతివ తగునమ్మ నీగృహ, మతినిర్మలచరితభరిత ♦ మని యీయెడ మ
త్పతులయసన్నిధి యైనను, మతి నూఱడి యున్నచోట ♦ మన్నన దప్పన్. 94

ముండును. నీవు వేగముగాఁ బోయి దానిం గొని ర మ్మని తా.

91. ఉల్లము = మనస్సు. తనువు = శరీరము. ఉద్గతఘర్మజలంబు = వెడలుచున్న చెమట నీటిని. డిల్లపడంగన్ = వెలవెలపోఁగా. కడింది = గొప్పది. అందున్—కీచకునియింటి కనుట. పాపికొనుదీమసము = తొలఁగించుకొను నుపాయము. ద్రౌపది చలించిన మనస్సును చెమటపట్టి వెలవెలఁబోయిన దేహమును గలదై మిక్కిలి చింత నొంది, కీచకుని యింటికిఁ బోనొల్ల ననుటయు పోవుటయు యుక్తము కాదని, దానిఁ దప్పించుకొనునుపాయ మాలోచించె నని తా.

92. డోలాఆందోళితమానస = తొట్లవలె నూఁగులాడుచున్న మనస్సుగలది.

93. ఉత్పలగంధి=కలువలవాసనవంటి వాసనగలదానా! సుధేష్ణసంబోధనము. ఉడిగి= విడిచి. ఒడ్లను=ఇతర స్త్రీలను. సత్పథవృత్తిన్=మంచిమార్గమునందలి యునికిచేత. సంతతమున్=ఎల్లప్పుడును. బహుమానపాత్రనుఐ=మన్ననకుఁదగినదాననై. తత్పరతన్=ఆసక్తిగలదాన నగుటచేత. దుష్యత్ పరివారయోగ్యపరిచారముపైన్=నీచమయినపరిజనమునకుఁ దగినకార్యము చేత. సుధేష్ణా! కల్లు తెచ్చుటకు నన్నువిడిచి మఱియెవ్వరినైనను బంపుము. నేను నీయొద్దనేయుండి సన్మార్గమునకును గౌరవమునకును దగిన పనులనుజేయుదానను గాని నీచ లగుపరిచారికలు చేయుకార్యము చేయుటకుఁ దగినదానను గా నని తా.

94. అతివ! సుధేష్ణసంబోధనము. అతినిర్మలచరితభరితము = మిక్కిలిపవిత్రమయిన నడవడిచే నిండినది. ఈఎడన్ = ఈచోటున. మత్ పతులఅసన్నిధి = నామగలు దగ్గఱ లేకుండుట. ఐనను = అయినప్పటికిని. మతిన్ = మనస్సునందు. ఉన్నచోటన్ = ఉన్నప్పుడు. మన్నన. తప్పన్. తగునమ్మ= తగునా యని యన్వయము. నీయింట సదాచారము గల దని నామగలు దగ్గఱ లేక పోయినను నేను నమ్మకముతో నుండునపుడు నీవు ఆగౌరవము తప్పుట యుక్తము కా దని తా.

ఉ. సాధులు చేరి నెమ్మిగ ని♦జస్థిరవృత్తము దుష్టకోటిచే
బాధలఁ బొందకుండఁ దమ♦పాల వసించినఁ బెద్దవారు ది
క్కై ధరియించి వారి కొక♦యాపద పుట్టక యుండఁ గాచుటొ
ప్పై ధరఁ గీర్తి కెక్కుదె య♦పాయము సేసిన నింద వుట్టదే. 95

గీ. ఎవ్వరింటికేని ♦ నెద్దియే నొకటికి, నన్నుఁ బంపఁ దగునె ♦ నాఁడ నిన్నుఁ
గొలుచునెడ ననుజ్ఞ ♦ గొనవె నీచము లగు, పనుల నేను జాల ♦ ననికి సెప్పి. 96

క. అనిన విని యనుచితంబున, కనయము శంకించియును ల♦తాంగి మదిం ద
మ్మునివలవంత దలఁచి యి, ట్లనియెం బాంచాలితోడ ♦ నాదరవృత్తిన్. 97

ఉ. అక్కట యేను వేడ్కపడి ♦ యానెడునాసవ మర్థిఁ దేర నొం
డొక్కనికృష్టలం బనుప ♦ నోపక చెప్పిన దీని నీవు గో
సెక్కఁగఁ జేసి నిన్ను నతి♦హీనవిధాననియుక్తఁ జేఁత గా
నిక్కమ యుమ్మలించి తిది ♦ నెయ్యముతియ్యముకల్మియే సఖీ. 98

95. సాధులు = సత్పురుషులు. నెమ్మిగన్ = నెమ్మదిగా. నిజస్థిరవృత్తము = తమయొక్క నిశ్చలమయిన సదాచారము. దుష్టకోటిచేన్ = దుర్మార్గులసమూహముచేత. తమపాలన్ = తమయొద్ద. ధరియించి = పోషించి. ఒప్పుని = తగినదై. ధరన్ = భూమియందు. అపాయము = కీడు. సజ్జనులు తమయాచారము కాపాడుకొనుటకై పెద్దవారి నాశ్రయించినయెడ వారు వారి నన్నివిధముల రక్షించి కీర్తి పొందవలయును. అట్లు చేయనిచో నిందపాలగుదు రని తా.

96. నాఁడుఅ — నీయొద్ద నేను చేరినదినమే యనుట. నన్ను ఎవ్వరింటికో యేమిటికో పంపుట యుక్తము కాదు. నేననీయొద్దఁజేరినప్పుడే నీచకార్యములు చేయఁజాల నని నీతోఁ జెప్పినందుకు నీవును సమ్మతించితి వని తా. ఎవ్వరేనియింటికిన్ అనువాక్యమునందు ఎవ్వరుశబ్దముయొక్క షష్ఠికిఁ బ్రథమవచ్చుటకుఁ గారణము లేదు, సమాసమయినచోఁ దన్మధ్యమున నేని శబ్దము ప్రయోగించుట యుచితముకాదు.

97. అనుచితంబునకున్ = తగనిపనికి. అనయమున్ = మిక్కిలి. శంకించియును = జంకియును. లతాంగి = సుధేష్ణ. వలవంత = మోహమును. ఆదరవృత్తిన్ = ఆదరము అనుచిత్తవృత్తితో, ఆదరముతో ననుట. ద్రౌపది మాట విని సుధేష్ణ తాను జేయుపని యుక్తము కాదని సంకోచించియుఁ గీచకుని మోహమును దలంచికొని ద్రౌపదితో నిట్లాదరమునఁ జెప్పె నని తా.

98. ఆనెడుఆసవము = త్రాగునట్టి మద్యమును. అర్థిన్ = అక్కఱతో. ఒండుఒక్కనికృష్టలన్ = ఇతరనీచస్త్రీలను. గోసు = దోషము. అతిహీనవిధాననియుక్తన్ = మిక్కిలి నీచమయిన కార్యమునందు నియోగింపఁబడినదానినిగా. చేఁతకాన్ = చేయుట యని. ఉమ్మలించితి = దుఃఖించితివి. నెయ్యము తియ్యము కల్మియే = స్నేహముయొక్కయుఁ బ్రీతియొక్కయుఁ గలుగుటయా? సఖీ! సైరంధ్రిసంబోధనము. అయ్యో! నేను ఆశతో త్రాగునట్టి మద్యమును తెచ్చుటకు నీచస్త్రీలను బంపఁగూడ దని నీకుఁ జెప్పఁగా నీవు ఇందుకు నీచకార్యము చెప్పితి నని దుఃఖించుచున్నావు, ఇది స్నేహమునకును బ్రీతికిని దగినది కా దని తా.

క. అది లాఁతియిల్లె నినుఁ దమ, హృదయంబుల నెవ్వరేని ♦ నెఱుఁగరె యేఁ జె
ప్పుదు నీదుపెంపు నినుఁ గ, న్నది మొదలుగ నెల్లవారి ♦ కయ్యైభంగిన్. 99

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బ్రార్థింపంగ ద్రుపద♦తనయకుఁ జిత్తం
బున నింకఁ బెద్ద పెనఁగం, జన దీయమతోడ ననువి♦చారము వుట్టెన్. 100

వ. ఇట్లు దోఁచినతలంపునం జేసి. 101

( ద్రౌపది కీచకునింటికిఁ గల్లు దేఁ బోవుట. )

చ. మన మురియాడుచుండ ననుమానముతోడ సుధేష్ణఁ జూచి నీ
వనయముఁ గోరినట్టిపని ♦ యర్థిమెయిం జని చేయుదానఁ గా
కనుతనుమాట కప్పొలఁతి ♦ హర్షముఁ బొందుచు నంది యిచ్చు కాం
చనచషకంబు పుచ్చుకొని ♦ చారువిలోచన యార్తమూర్తియై. 102

వ. చనుచుండి నీచహృదయుం డగుకీచకుంపు దనయెదుర నప్పు డాడినకర్ణశూలంబు
లగుమాటలమీఁదం బిడుగు పడినవానిఁ గొఱవి చూఁడినతెఱంగున సుధేష్ణ ద
న్ననుచితవ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదనంబుం బొంది. 103

చ. అలమటఁ బొందు మాలవిధి ♦ హా యని దైవము దూఱు నిత్తఱిం
గల రొకొ నాకు దిక్కను మొ♦గంబున నశ్రులు వెల్లిగొల్పఁ దొ

99. అది = ఆకీచకునిగృహము. లాఁతిఇల్లె = పరగృహమా ? నీదుపెంపు = నీయొక్కగొప్ప తనమును. అయ్యైభంగిన్ = ఆయావిధమున. కీచకుని యిల్లు పరగృహము కాదు, మఱియు నిన్నుఁ జూచినది మొదలు నీసద్గుణములను నేనందఱికిని చెప్పుదుం గావున నిన్ను అందఱు నెఱుంగుదు రని తా.

100. పెక్కుభంగులన్ = అనేకవిధములచేత. ఇట్లు అనేకవిధములుగాఁ బ్రార్థించుటచేత ద్రౌపది కిఁక నీసుధేష్ణమాటకు ఎక్కువగా నడ్డము చెప్పరా దని తోఁచె నని తా.

102. ఉరియాడుచుండన్ = చలించుచుండఁగా. అనయమున్ = మిక్కిలి. అర్థిమెయిన్ = ప్రీతితో. అను తనమాటకున్ = అని చెప్పునట్టి ద్రౌపదిపలుకునకు. అప్పొలఁతి = అసుధేష్ణ. హర్షమున్ = సంతోషమును. కాంచనచషకంబు= బంగారు కల్లుత్రాగుపాత్రమును. చారువిలోచన= చక్కనికన్నులుగల ద్రౌపది. ఆర్తమూర్తియై=దుఃఖించిన యాకారముగలదై. ఇట్లు కలఁగిన మనస్సు గలదై సందేహముతో సుధేష్ణను జూచి, నీకోరిన పనిని చేసెదను అని చెప్పి యాసుధేష్ణ సంతోషముతో తన చేతి కిచ్చిన బంగారుపాత్రమును పుచ్చుకొని దుఃఖితురాలై యని తా.

103. కర్ణశూలంబులు = చెవులకు శూలములవంటివి. చూఁడిన తెఱంగునన్ = కాల్చినవిధమున. అనుచితవ్యాపారంబునకున్ = తగని పనికి. నిర్వేదనంబున్ = సంతాపమును.

104. అలమటన్ = చింతను. హా = అయ్యో ! అశ్రులు=కన్నీళ్లను. వెల్లిగొల్పన్=కార్చుచు. జల్లుఅనన్ = జల్లు మనునట్లు. చెదరుడెందమున్ = చలించుమనస్సును. కూడఁగఁదెచ్చి = కుదురుపఱచుకొని. గావలమునన్ = గర్వముచేత, పాఠాం. కేవలమును = శుద్ధురాలను, కేవలశబ్దము శుద్ధా

త్రెళ్లఁబడు జల్లనం జెదరు ♦ డెందము గూడఁగఁ దెచ్చి నన్నుఁ గా
వలమున ముట్ట నెవ్వరికి ♦ వచ్చు ననుం గలఁగుఁ వెనుంబడుఁ. 104

వ. అట్టియెడ. 105

సీ. దైన్యంబు తలపోఁతఁ ♦ దలకొన్నఁ జెలువ కా, ననమున వెల్లఁద♦నంబు గదిరె
భయరస వేగంబు ♦ పైకొని ముట్టినఁ, గాంతకుఁ దనులత ♦ కంప మొందె
బెగ డంత కంతకు ♦ మిగిలిన నింతికిఁ, బదముల నటఁ దొట్రు♦పాటు బెరసెఁ
దల్లడం బొందినఁ ♦ దన్వికి నవయవం, బుల నెల్ల ఘర్మాంబు♦కళిక లెసఁగెఁ
దలఁకు పుట్టెఁ గొంకు ♦ గోలఁదికి మీఱె వె, న్నాటు దోఁచె ముట్టు♦పాటు దొడరె
వెఱఁగుపాటు దనికె ♦ నెఱ నాడె నొవ్వు నె, వ్వగలు వగల నీనె ♦ దిగులు వొదివె.

వ. ఇవ్విధంబున ద్రుపదపుత్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరిహారణంబు హరిచరణస్మరణంబ యని తనహృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని సుధేష్ణమందిరంబు వెడలి దినకరుం గనుంగొని వినయవినమితోత్తమాంగయై నిజాంతర్గతంబున. 107

ర్థముఁ నపుంసకలింగము. ముట్టఁ = తాఁకుటకు. వెనుంబడుఁ = దుఃఖించును. చింత నొందుచు దైవము నిందించుచుఁ దనకు దిక్కెవ్వరు లేదని కన్నీళ్లు గార్చుచుఁ గొంతవడి దనమనస్సును గుదురుపఱచుకొని తన్నెవ్వరును దాఁకఁజాల రని ధైర్యము తెచ్చుకొనుచు దుఃఖించుచుండె నని తా.

106. తలపోఁతఁ = తలంపునందు. దైన్యంబు = దీనత్వము. తలకొన్నఁ = కలుగఁగా. చెలువకుఁ = ద్రౌపదికి. ఆననమునఁ = మోమునందు. వెల్లఁదనంబు = తెల్లఁదనము. కదిరెఁ = కలిగెను. ద్రౌపదికి మనస్సున దైన్యము గలుగుటచే ముఖము తెల్లఁబోయె నని తా. కాంతకుఁ = ద్రౌపదికి. తనులత = తీఁగవంటి దేహము. భయము గలుగుటచే దేహము వడంకె నని తా. బెగడు = విహ్వలత. మిగిలినఁ = అతిశయింపఁగా. పదములఁ = అడుగులయందు. బెరసెఁ = కలిగెను. దేహము పరవశ మగుటచేత నడుగులు తొట్రుపడుచుండె నని తా. తల్లడంబు = చలనము. ఒందినఁ = కలుగుటచేత. తన్వికిఁ = ద్రౌపదికి. ఘర్మ అంబుకళికలు = చెమటనీటిబిందువులు. చలనము గలుగుటచేత దేహ మంతయుఁ జెమ్మటపట్టె నని తా. తలఁకు = భయము. కొంకు = సంకోచము. కోలఁదికిఁ మీఱెఁ = అతిశయించెను. వెన్నాటు = దుఃఖము. ముట్టుపాటు = సంకటము. వెఱఁగుపాటు = నిశ్చేష్టత. తనికెఁ = కలిగెను. నొవ్వు = బాధ. నెఱనాడెఁ = పూర్ణముగా నాటుకొనెను; లేక, నెఱను = జీవస్థానమునందు, ఆడెఁ = నాటుకొనెను. నెవ్వగలు = నిండుచింతలు. వగలఁ = దుఃఖములను. ఈనెఁ. పొదివెఁ = చుట్టుకొనెను.

107. పరిహారణంబు = పోఁగొట్టునది. హరిచరణస్మరణంబుఅ = విష్ణువుయొక్క పాదముల తలంచుటయే. హృదయపుండరీకంబునఁ = హృదయకమలమునందు. పుండరీకఅక్షుఁ = తెల్లదామరలవంటి కన్నులుగల విష్ణువును. నిక్షేపించుకొని = నిలుపుకొని. దినకరుఁ = సూర్యుని. వినయవినమితఉత్తమాంగవై = అడఁకువచే వంపఁబడిన శిరస్సుగలదై. నిజఅంతర్గతంబునఁ = తన మనస్సునందు.

గీ. పాండుపుత్రుల కేను ద♦ప్పనిమనంబు, గలుగుదాననయేని నో♦ కమలమిత్ర
కీచకునిదెస నన్నొక♦కీడు తెరువు, వొరయ కుండఁగ రక్షింపు ♦ కరుణతోడ.

వ. అనుచుం గేలు మొగిచిన. 109

క. తరణియు దుఃఖిత యగున, త్తరుణిం గాచుటకు నత్యు♦దగ్రభుజావి
స్ఫురణాఢ్యు నొక్కరక్కసుఁ, గరుణార్ద్రమనస్కుఁ డగుచు ♦ గ్రక్కునఁ బనిచెన్.

వ. వాఁడునుం బని పూని యంబరంబున నదృశ్యాకారుండై వచ్చి నిలిచె. 111

గీ. ఇట్లు ప్రార్థించి పాంచాలి ♦ యెట్టకేని, సింహబలుమందిరం బల్లఁ ♦ జేర నరిగి
యొల్లఁబోవుచు బెబ్బులి♦యున్నపొదరు, సొచ్చు లేడిచందంబునఁ ♦ జొచ్చుటయును.

ఉ. అంబురుహాక్షి వచ్చుతెరు ♦ వారఁగఁ గీచకముఖ్యుఁ డప్డు దె
ల్లంబుగఁ జూచి యుల్లముక♦లంకయు వారక మేనఁ గ్రమ్ముతా
పంబును డిగ్గఁద్రావి గరు♦పాఱుచు నుత్కటసంభ్రమంబు హ
ర్షంబుఁ బెనంగొనంగ నతి♦చంచలభావపరీతమూర్తియై. 113

108. తప్పని మనంబు గలుగుదాననయేనిన్ = తొలఁగని మనస్సు గలుగుదాననే యైనయెడ. కమల మిత్ర = సూర్యుఁడా! కీడుతెరువు = చెడుమార్గమును. పొరయక = పొందక. నేను పాండవుల యెడఁ బతిభక్తి తప్పక యుందునేని నాకుఁ గీచకునివలనఁ గీడేమియుఁ గలుగకుండునట్లు నన్ను రక్షింపు మని తా.

110. తరణియున్ = సూర్యుఁడును. అత్తరుణిన్ = అద్రౌపదిని. అతిఉదగ్రభుజావిస్ఫురణ ఆఢ్యున్ = మిక్కిలి యధికమయిన భుజపరాక్రమముచే నొప్పినవానిని. కరుణాఆర్ద్రమనస్కుఁడు = దయచేఁ దడిసిన మనస్సుగలవాఁడు. గ్రక్కునన్ = శీఘ్రముగా. పనిచెన్ = పంపెను. సూర్యుఁడు దయగలవాఁడై ద్రౌపదిని రక్షించుటకు బలవంతుఁ డగు నొకరాక్షసుని బంపె నని తా.

111. అంబరంబునన్ = ఆకాశమునందు. అదృశ్యఆకారుండువై = కనఁబడని రూపము గలవాఁడై.

112. ఎట్టకేనిన్ = అతిప్రయాసచేత. సింహబలుమందిరంబు = కీచకునియింటిని. ఒల్లఁబోవుచున్ = కలఁగుచు. ఇట్లు సూర్యునిఁ బ్రార్థించి ద్రౌపది మిక్కిలి కష్టముతో భయపడుచుఁ బెద్దపులియుండు పొదను లేడి చొచ్చునట్లు కీచకునియిల్లు ప్రవేశింపఁగా నని తా.

113. అంబురుహాక్షి = కమలములవంటి కన్నులు గల ద్రౌపది. ఆరఁగన్ = చక్కఁగా. తెల్లంబుగన్ = స్పష్టముగా. ఉల్లము కలంకయున్ = మనస్సునందలి కలఁతయును. వారక = ఎడతెగక. మేనన్ = దేహమునందు. డిగ్గఁద్రావి = అడంచుకొని. గరుపాఱుచున్ = గగుర్పొందుచు. ఉత్కటసంభ్రమంబు = అధిక మయిన వేగిరపాటును. హర్షంబున్ = సంతోషమును. అతిచంచలభావపరీతమూర్తియై = మిక్కిలి యగు చాంచల్యముచేఁ జుట్టఁబడిన మనస్సుగలవాఁడై. ద్రౌపది వచ్చుటను జూచి కీచకుఁడు తనమనస్సులోని చింతయును దేహమునందలి తాపమును నడంచుకొని వేగిరపాటును సంతోషమును గలవాఁడై మిక్కిలి చలించుచు నని తా.

క. చిడిముడిపడుచు నెదుపసనఁ, గడఁగుచు హారములు చక్కఁ ♦ గాఁ ద్రోచుచు మ
ల్లడిగొనుచు దుర్విలాసం, బొడలికి నెడఁగూర్చు చుండ ♦ నుగ్మలి యంతన్.

వ. తత్ప్రదేశంబునకుం జని. 115

గీ. దేవి తృష పుట్టి వారుణి ♦ దేరఁ బనుప, నరుగుదెంచితిఁ బోయింపుఁ ♦ డనిన నింతి
నెమ్మొగంబున దృష్టులు ♦ నిలిపి తమక, మడర ని ట్లను నాకీచ♦కాధముండు. 116

క. దేవితృష దీర్పఁ బూనితి, వావెలఁదిసహోదరుండ ♦ నగునాతృష లీ
లావతి నీదుసరసనం, భావనమెయిఁ దీర్ప కునికి ♦ పాడియె చెప్పుమా. 117

సీ. కాంతి దళ్కొత్తు నీ♦కడకంటిచూపుతోఁ, బొందఁ గానని మేని♦పొగులుటయును
దీపారునీపల్కు ♦ దెల్లంబుగా వినఁ, గాననిపీనుల♦కందుటయును

114. చిడిముడిపడుచున్=తొట్రుపడుచు. హారములు=ముత్యాలదండలను. మల్లడిగొనుచున్=ఆలోచించుచు. దుర్విలాసంబు = దుష్టమయిన విలాసమును. ఒడలికిన్ = దేహమునకు. ఒడఁగూర్చుచుండన్ = కలిగించుచుండఁగా. ఉగ్మలి = ద్రౌపది. అంతన్ = అప్పుడు. తొట్రుపాటు గలవాఁడై హారములను సవరించుకొనుచు విలాసచేష్టలు చేయుచుండఁగా ద్రౌపది యప్పు డని తా.

116. దేవి = సుధేష్ణ. తృష = దప్పి. వారుణి = మద్యమును. తేరన్ = తెచ్చుటకు. ఇంతినెమ్మొగంబునన్ = ద్రౌపదియొక్క చక్కనిముఖమునందు. దృష్టులు= చూపులను. తమకము= మోహము. అడరన్ = అతిశయింపఁగా. సుధేష్ణ దప్పిగొని కల్లుతెచ్చుటకై నన్నుఁ బంపినది. మద్యమిప్పింపుఁ డని ద్రౌపది చెప్పఁగాఁ గీచకుఁడు మోహమున నామెమోమునందే చూపులు నిలిపి యి ట్లనియె నని తా.

117. ఆవెలఁదిసహోదరుండన్ = ఆసుధేష్ణయొక్క తమ్ముఁడను. లీలావతి = వగలాఁడీ! ద్రౌపదిసంబోధనము. నీదుసరససంభావనమెయిన్ = నీయొక్క సరసమయినమన్ననచేత. పాడియె = న్యాయమా? సుధేష్ణదప్పిని తీర్పఁ బూనినట్లు నీవు ఆమె తమ్ముఁడగు నాదప్పిని గూడ ఆదరముచేతఁ దీర్పవలయు నని తా.

118. తళ్కొత్తు నీకడగంటిచూపుతోన్ = ప్రకాశించునట్టి నీ యొక్క కడగంటిచూపుతో. పొందన్ = కలయుటను. కానని మేనిపొగులుటయును = కాంచని శరీరముయొక్క తాపమును. తీపారు నీపల్కు = తియ్యని నీమాటను. పీనులకందుటయును = చెవులయొక్క తాపమును. ఇంపు = మనోహరములు. నీచెయ్వులు=నీవిలాసచేష్టలను. ఎలమిన్ = సంతోషముతో. కాననిచూడ్కులకనలుటయును = కాంచనిచూపులయొక్క మంటయును. సొగయించు నీకేళిన్ = చొక్కించునట్టి నీక్రీడయందు. కానని మదికుందుటయును = కాంచని మనస్సుయొక్క తాపమును. పాయన్= పోవునట్లును. భావజన్మునిపూనిక = మన్మథునియొక్క ప్రయత్నము. పారముపెట్టున్ = తుదముట్టునట్లును. నలినవదన = తామరలవంటి కన్నులు గలదానా! ఈసిగ్గుతెరఓలము = ఈసిగ్గు అను తెరయొక్క మఱుఁగు. నీకటాక్షము పొందకుండుటచేఁగలిగిన దేహతాపమును, నీపలుకు వినకుండుటచేఁగలిగిన శ్రవణతాపమును, నీవిలాసచేష్టలను చూడకుండుటచేఁ గలిగిన నేత్రతాపమును, నీతోఁ గ్రీడించు

నిం వగునీచెయ్వు ♦ లెలమిమైఁ గొనియాడఁ, గాననిచూడ్కు ♦ లకనలుటయును
సొగయించునీకేళిఁ ♦ దగిలి యానందంబుఁ, జెందఁ గాననిమది ♦ కుందుటయును
బాయ నా దగుజన్మంబు ♦ ఫలము నొంద, భావజన్మునిపూనిక ♦ పార మెద్దు
నన్ను నీబంటుగా నేలు ♦ నలినవదన, యింక నీసిగ్గు తెరయోల ♦ మేల నీకు.

వ. అనవుడు. 119

గీ. చెలువ యప్పలుకులు పెడ ♦ చెవులఁ బెట్టి
ధీర గావున విగతవి ♦ కార యగుచు
మదిర వోయింపు డద్దేవి ♦ యెదురు చూచు
నలుగుఁ దడ వైన మగిడి పో ♦ వలయు ననిన. 120

చ. మదిర సుధేష్ణపాలి కొక ♦ మాత్రన పుచ్చెద నొడ్లచేత నిం
పొదవెడునట్టిదీనిచవి ♦ యుల్లము సొక్కఁగ నాను మీవు నీ
వదనసరోజసౌరభ మ ♦ వారణఁ గ్రోలఁగ విమ్ము నన్ను బె
ట్టిద మగుకాముతూపులఁ దొ ♦ డింబడ కుండఁగఁ గావు మిత్తఱిన్. 121

క. కరితురగరథసమితిఁ బొం, పిరివోయెడునాదులక్ష్మి ♦ పెంపున కెల్లన్

నానందము పొందకుండుటచేఁ గలిగిన మనస్తాపమును బోఁగొట్టి నాజన్మము సఫలము గావించి నన్ను నీబంటుగాఁ గైకొనుము, సిగ్గు విడువు మని తా. సీసము తృతీయపాదమునందు "కానని కోర్కుల కనలుటయును" అని పాఠాంతరము, కోర్కులయందుఁ గనలుట యసంభవ మగుటచే నిది యుపేక్ష్యము. కలఁగుటయును అనుపాఠముగూడ మొదటినుండి పొగులుటయును ఇత్యాదిగాఁ బూర్వపద్యార్థానురూప మయిన తాత్పార్యకపదప్రయోగమునకు విరుద్ధ మగుటచే నదియు నుపేక్ష్యము.

120. చెలువ = ద్రౌపది. ధీర = ధైర్యము గలది. విగతవికార = వికారము లేనిది. మదిర = మద్యమును. తడవు = ఆలస్యము. ద్రౌపది యామాటలను లక్ష్యము చేయక ధైర్యముచేతఁ గోపవికారము నడంచుకొని శీఘ్రముగా మద్య మిప్పింపుఁడు ఆలస్య మయినయెడ సుధేష్ణ కోపించును గావున శీఘ్రముగా నామెయొద్దకుఁ బోవలయు నని చెప్పె నని తా.

121. మదిరన్ = మద్యమును. ఒకమాత్రన్ అ = ఒకక్షణములోనే. ఒడ్లచేతన్ = ఇతరులచేత. ఇంపు = ఆనందము. ఒదవెడు అట్టి దీనిచవి = కలుగునట్టి యీమద్యముయొక్క రుచిని. ఉల్లము = మనస్సు. చొక్కఁగన్ = పరవశ మగునట్లు. నీవదన సరోజసౌరభము = నీముఖకమలముయొక్క వాసనను. అవారణన్ = అడ్డులేక. బెట్టిదము = క్రూరములు. తొడింబడక = తొట్రుపాటునొందక. నేను మద్యమును సుధేష్ణకు ఇప్పుడే యితరులచేఁ బంపెదను, నీవీ మద్యమును త్రాగి నీముఖమునందలి మంచివాసనను నన్నుఁ ద్రాగనిచ్చి నా మన్మథబాధను తొలఁగించి రక్షింపుమని తా.

122. కరితురగరథసమితిన్ = ఏనుఁగులయు గుఱ్ఱములయు తేరులయు సమూహముచేత. పొంపిరిపోయెడు నాదులక్ష్మి పెంపునకున్ = అతిశయించునట్టి నా సంపదయొక్క కలిమికి. సరసిరుహ

సరసిరుహానన నీవ కు, దురుగా నొనరించెదం గు♦తూహల మెసఁగన్. 122

క. రుచిరమణిభూషణంబులు, నుచితవిహారప్రకార♦యోగ్యాగార
ప్రచయము సుందరగణికా, నిచయము నొప్పించువాఁడ ♦ నీకుం దరుణీ. 123

క. నాకులకాంతల నెల్లను, నీకుం బని సేయఁ బనిచి ♦ నెయ్యంబున నే
నీకనుసన్నన మెలఁగెద, నేకార్యం బైన నడపు♦ మీవ తగంగన్. 124

వ. అనుచు సింహబలుండు దనయంతరంగంబున నంత కంత కగ్గలించుతమకంబునఁ
దన్నుఁ దా నెఱుంగక పయిం బడి పట్టికొనిన. 125

క. తనుఁ గాచి వెనుక వచ్చిన, దనుజమహాబలము తనదు♦తను వొందిన నా
తనిచేయి దుల్చి రభసం, బునఁ దన్మందిరము ద్రుపద♦పుత్రిక వెడలెన్. 126

వ. ఇట్లు ద్రోచి పోయినం గీచకుండు వెనువెంటం దగిలిన నమ్మగువయు మరలి చూచి
భయభ్రాంత యై యెవ్వలనికిం బోదునో యని తలంచి దైవయోగంబున విరా
టుండు బయలికొలు వునికిం జేసి తత్సభాభాగంబుదెసకు వెసం బాఱినం గా
మాయత్తచిత్తుండును గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకు సేయక
రహస్యప్రకారవిభేదనవిచారంబు దక్కి. 127

ఆనన = తామరవంటి ముఖము గలదానా! కుదురు = ప్రాపు. సైరంధ్రీ! నాసంపద కంతయు నిన్నే యధికారిణిగా కావించెద నని తా.

123. రుచిరమణిభూషణంబులున్ = ప్రకాశించుచున్న రత్నాలసొమ్ములును. ఉచిత...ప్రచయమున్—ఉచిత = తగిన, విహార=క్రీడలయొక్క, ప్రకార=విధములకు, యోగ్య = తగిన, అగార = ఇండ్లయొక్క, ప్రచయమున్ = సమూహమును. సుందరగణికానిచయమున్ = చక్కనివేశ్యలయొక్క సమూహమును. తరుణీ! సైరంధ్రిసంబోధనము. నీ కుత్తమము లయిన భూషణంబులను గృహంబులను చక్కనివేశ్యలను నొసంగెద నని తా.

124. నాకులకాంతలన్=నాభార్యలను. నెయ్యంబునన్=ప్రీతితో. నాభార్యలందఱు నీకుఁ బని చేయునట్లుచేసి నీవు చెప్పినట్లు నేను నడచుకొనియెదను నీవే యన్నికార్యములను జరగింపు మని తా.

125. అంతరంగంబునన్ = మనస్సునందు. అగ్గలించు తమకంబునన్ = అతిశయించునట్టి మోహముచేత.

126. దనుజమహాబలము = రాక్షసునియొక్క గొప్పబలము. తనదుతనువు = ద్రౌపదిశరీరమును. ఒందినన్ = ప్రవేశించుటచేత. దుల్చి = విదిలించి. రభసంబునన్ = వేగమున. తత్ మందిరము = వానియింటినుండి. తన్ను రక్షించుచున్న రాక్షసునిబలము తనదేహమునందుఁ బ్రవేశించుటచే ద్రౌపది కీచకునిచేయి విదిలించి శీఘ్రముగాఁ గీచకుని యిల్లు విడిచిపోయె నని తా.

127. భయభ్రాంతయై= భయముచేఁ దిరుగుడు పడుచున్నదై. ఎవ్వలనికిన్ =ఏదిక్కునకు. కామ ఆయత్త చిత్తుండును = మన్మథుని కధీనమయిన మనస్సుగలవాఁడును. రహస్యప్రకారవిభేదన విచారంబు = రహస్యవిధముయొక్క బయలుపడుటవలనిచింతను. తక్కి = విడిచి. పాఠాం:—రహస్యప్రకాశవిభేదవిచారంబు= గుట్టు బయలు అను భేదముయొక్క యాలోచనము అని యర్థము.

( కీచకుఁడు ద్రౌపదిం బట్టుకొనుటకు వెంటఁ దగులుట. )

సీ. సమదవారణము జం♦గమలత వెనుకొని, సరభసంబునఁ బట్టఁ ♦ జనువిధమునఁ
క్రూరదానవుఁడు భూ♦చారినిర్జరకాంతఁ, బొదువ రయమ్మునఁ ♦ బోవుభంగి
ఘోరగృధ్రము సుకు♦మారనాగాంగనఁ, బటుగతి నొడియంగఁ ♦ బాఱుకరణిఁ
బ్రబలబిడాలంబు ♦ బాలశారికమీఁద, నడరి సత్వరముగ ♦ నరుగుమాడ్కి
సింహబలుఁ డత్యుదగ్రతఁ ♦ జిగురుఁబోఁడి, పజ్జఁ గదువడిఁ దగిలి కో♦పంబు గదుర
నొడిచితలపట్టిత్రిగిచిమ♦హోగ్రవృత్తిఁ,గొంకుకొసరించుకయులేక♦కూలఁదాఁచె.

వ. అట్టియెడఁ బాంచాలీరక్షకుం డైనరాక్షసుం డతని డొల్ల ద్రేసిన. 129

క. కీచకుఁడు ద్రేటువడి తన, నీచపుదెస యొరు లెఱుంగ ♦ నేరక యుండన్
లేచి వెను చనక విస్మయ, గోచరుఁడై యసురకతనఁ ♦ గుంఠితుఁ డగుచున్.

వ. ఒడుపు దప్పినమహానాగంబునుంబోలె నిట్టూర్పు నిగుడ నిట్టలం బగుకోపంబు
పెల్లున మల్లడిగొను చుండె నయ్యవసరంబున. 131

128. సమదవారణము = మదము గల యేనుఁగు. జంగమలతన్ = తిరుగుచున్న తీఁగను. సరభసంబునన్ = వేగముతోఁ గూడినట్లుగా. మదపుటేనుఁగు నడచుచున్న తీఁగను బట్టఁబోవుచున్నదో యనునట్లును అని తా. క్రూరదానవుఁడు = కఠినుఁ డయిన రాక్షసుఁడు. భూచారినిర్జరకాంతన్ = భూమియందుఁ దిరుగుచున్న దేవతాస్త్రీని. పొదువన్ = పట్టుటకు. రయమ్మునన్ = వేగముతో. రాక్షసుఁడు భూలోకమునకు వచ్చిన దేవకన్యకను బట్టఁబోవుచున్నాఁడో యనునట్లును అని తా. ఘోరగృధ్రము = భయంకరమయిన గద్ద. సుకుమారనాగఅంగనన్ = కోమలదేహము గల యాఁడుపామును. పటుగతిన్ = మిక్కిలివేగముచేత. ఒడియంగన్ = పట్టుటకు. గ్రద్ద యాఁడుపామును బట్టఁబోవుచున్నదియో యనునట్లును అని తా. ప్రబలబిడాలంబు = గొప్పబలము గల పిల్లి. బాలశారికమీఁదన్ = చిన్నదైన గోరువంకమీఁదికి. అడరి = అతిశయించి. పిల్లి గోరువంకపిల్లమీఁదికిఁ బోవుచున్నదో యనునట్లును అని తా. అతిఉదగ్రతన్ = మిక్కిలి గర్వముచేత. చిగురుఁబోఁడిపజ్జన్ = ద్రౌపదివెనుకను. మహత్ఉగ్రవృత్తిన్ = మిక్కిలి భయంకరమయిన వ్యాపారముచేత. తాఁచెన్ = తన్నెను. కీచకుఁడు మిక్కిలి కోపముతో ద్రౌపదివెంట నరిగి తలపట్టుకొని తన్ని పడఁద్రోసె నని తా. అలం. ఉత్ప్రేక్ష.

129. పాంచాలీరక్షకుండు = ద్రౌపదిని గాచుచున్నవాఁడు. డొల్లన్ = పడునట్లు.

130. నీచపుదెస = నీచమయిన యవస్థను. ఒరులు = ఇతరులు. విస్మయగోచరుఁడు ఐ = ఆశ్చర్యమునకు లోనయినవాఁడై. అసురకతనన్ = రాక్షసునిచేత. కుంఠితుఁడు = మొక్కపోయినవాఁడు. కీచకుఁడు రాక్షసునిచేఁ గొట్టఁబడి తనస్థితిని ఇతరు లెఱుంగకుండునట్లు వెంటనే లేచి రాక్షసునిభయంబున ద్రౌపది వెంటఁబోవక వెఱఁగుపడి యుండె నని తా.

131. ఒడుపు = పట్టు. మహానాగంబునుంబోలెన్ = గొప్పపామువలె. ఇట్టలంబు = అధికము. పెల్లునన్ = అధిక్యముచేత.

క. తానును నన్నయు నయ్యా, స్థానమ్మున నుండ్లి పవన♦తనయుఁ డసహ్యం
బైనమనోవల్లభయవ, మానము నాసింహబలుని♦మదజృంభణముల్. 132

చ. కనుఁగొని కోపవేగమునఁ ♦ గన్నుల నిప్పులు రాల నంగము
ల్దనరఁగ సాంద్రఘర్మసలి♦లంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవిక♦టభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ♦దస్ఫురణాపరిణాహమూర్తియై. 133

సీ. నేలయు నింగియుఁ ♦ దాళముల్ గావించి, యేపున నేఁగి వా♦యించి యాడఁ
గులపర్వతంబులు ♦ గూల్చి యొండొంటితోఁ, దాఁకంగ వీఁకమైఁ♦దన్ని యాడ
నేడుసాగరములు ♦ నిక్కడక్కడఁ బెట్టి, పలుచనిరొంపి మై ♦ నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు ♦ నొక్కచోటికిఁ దెచ్చి, పిసికి పిండలి సేసి ♦ పిడిచికొనఁగ
మిగిలి బ్రహ్మాండభాండంబు ♦ పగుల వ్రేయ, నప్పళించుచుఁ బ్రళయకా♦లానలమున
గండరించినరూపంబు♦కరణి భీముఁ, డతిభయంకరాకారత ♦ నతిశయిల్లె. 134

132. అయ్యాస్థానంబునన్ = ఆ సభయందు. పవనతనయుఁడు = భీముఁడు. అసహ్యంబు = ఓర్వరానిది. మనోవల్లభ = ద్రౌపదియొక్క. మదజృంభణముల్ = గర్వాతిశయమును. ఆ విరాటుని సభయందు భీముఁడు ధర్మరాజుతోఁగూడ నున్నవాఁడై ద్రౌపదియవమానమును గీచకునిగర్వమును అని తా.

133. కోపవేగమునన్ = కోపముయొక్క యతిశయముచేత. తనరఁగన్ = ఉప్పొంగఁగా. సాంద్రఘర్మసలిలంబులు = దట్టమయిన చెమటనీరు. నితాంత......మూర్తియై — నితాంత = మిక్కిలి, దంతపీడన = పండ్లు కొఱుకుటచేత, రటత్ = ధ్వనించుచున్న, ఆస్యరంగ = ముఖము అను రంగస్థలమునందు, వికట = భయంకరము అయిన, భ్రుకుటీ = బొమముడియొక్క, చటుల = చంచలము యిన, ప్రవృత్త = కలిగిన, నర్తన = ఆటయొక్క, ఘటనా = కలుగుటయొక్క, ప్రకార = విధముచేత, భయద = భయమును గలిగించునట్టి, స్ఫురణా = ప్రకాశముయొక్క, పరిణాహ = అతిశయము గల, మూర్తి ఐ = ఆకారము గలవాఁడై. పండ్లు గీఁటుట బొమముడిపాటుచే భయంకర మయిన యాకారము గలవాఁడై యని తా.

134. నింగియున్ = ఆకాశమును. ఏపునన్ = గర్వముచేత. భూమిని ఆకాశమును తాళములుగాఁ జేసి వాయించుటకును అని తా. వీఁకమైన్ = పరాక్రమముచేత. పర్వతములను బడఁగొట్టి యొకటిమీఁద నొకటి పడునట్లు తన్నుటకును అని తా. రొంపి = బురదను. మైన్ = దేహమునందు. ఏడుసముద్రముల నీరంతయుఁ బాఱఁజల్లి దేహమునకు బురదను పూసికొనుటకును అని తా. పిండలి = ముద్ద. దిక్కులెల్లను ఒకచోటికిఁ జేర్చి ముద్ద చేసి పిండుటకును అని తా. బ్రహ్మాండభాండంబు = బ్రహ్మాండము అను కుండను. అప్పళించుచున్ = యత్నించుచు. ప్రళయకాల అనలమున గండరించిన రూపంబు కరణిన్ = ప్రళయకాలాగ్నియొక్క యతిశయించిన రూపమువలె. అతిభయంకరఆకారతన్ = మిక్కిలి భయమును గలిగించునట్టి రూపము గలవాఁ డగుటచేత. బ్రహ్మాండమును బగులఁగొట్టుటకును ఉత్సాహము గలవాఁడై తీవ్రమైన ప్రళయకాలానలమో యనునట్లు భీముఁడు భయంకరుండై యొప్పె నని తా.

వ. ఇట్లు పేర్చిన కోపాటోపంబున నవిచారితసమయవర్తనుం డయి వృకోదరుండు కీచకుని గీ టడంగింపం జూచి తత్సంబంధబద్ధుండును నాజ్ఞాపరిపాలకుండును గావున మత్స్యపతియుఁ దనయలుకలోనివాఁడకాఁ దలంచుచు నచ్చేరువ నున్నయున్నతవృక్షంబు నిరీక్షించి యాననంబు పల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన నతం డతనియాకారంబు చూచి నయనంబుల వారించి యిట్లనియె. 135

మ. వలలుం డెక్కడఁ జూచె నొండెడ ననే♦వ్యక్ష్మాజముల్ పుట్టవే
ఫలితం బై వరశాఖలొప్పఁగ నన♦ల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ ♦ విశ్రాంతి గావింపఁగాఁ
గలయీభూజము వంటకట్టియలకై ♦ ఖండింపఁగా నేఁటికిన్. 136

గీ. అని నిగూఢభాషణముల ♦ నయ్యజాత, శత్రుఁ డనిలజుకోపర♦సంబు పేర్మి
చెఱిచె నయ్యన్నదమ్ముల♦చేష్టితములు, దెల్లముగ నప్డు సూచుచు ♦ నల్ల లేచి.

135. పేర్చిన = అతిశయించిన. అవిచారితసమయవర్తనుండు = ఆలోచింపఁబడని ప్రతిజ్ఞయొక్క వ్యాపారము గలవాఁడు. వృకోదరుండు = భీముఁడు. తత్ సంబంధబద్ధుండును = వానితోడి చుట్టఱికముచేఁ గట్టఁబడినవాఁడును. ఆజ్ఞాపరిపాలకుండును = ఆకీచకుని యాజ్ఞను గాపాడువాఁడును. మత్స్యపతియున్ = విరాటుఁడును. తన అలుకలోనివాఁడు అకాన్ = తనకోపమునకు లోఁబడినవాఁడే యని. నిరీక్షించి = చూచి. పల్లటిల్లన్ = ఎఱ్ఱవాఱఁగా. నయనంబులన్ = కన్నులచేత.

136. వలలుండు = భీముఁడు. ఒండుఎడన్ = మఱియొకచోట. అసేవ్యక్ష్మాజముల్ = సేవింపఁదగని వృక్షములు. ఫలితంబు ఐ = ఫలములు గలదై. వరశాఖలు = మేలి కొమ్మలు. అనల్పప్రీతి= ఎక్కువ సంతోషమును. సంధించుచున్ = కలిగించుచు. విలసత్ ఛాయన్ = ప్రకాశించుచున్న నీడచేత. ఉపాశ్రిత ప్రతతికిన్ = ఆశ్రయించినవారి సమూహమునకు. విశ్రాంతి = ఊఱటను. ఈభూజము=ఈ వృక్షమును. వలలుఁడు ఏ వృక్షమునో చూచినాఁడు. పనికిమాలిన వృక్షములు మఱియొకచోటఁ గలవు. ఫలములు గలదై పెద్దకొమ్మలతోఁ గూడి విశాలమయిన నీడచేత నాశ్రితులకు శ్రమపరిహారము సేయునట్టి యీవృక్షమును వంటకట్టెలకై నఱకుట యుచితము కా దని తా. ఒండెడ ననేవ్యక్ష్మాజముల్ అనుటచే కీచకుని మఱియొకచో శిక్షింపవచ్చుననియు, ఫలితంబై మొదలు కడవఱకు గలగ్రంథముచే విరాటరాజు బంధువర్గము గలవాఁడై కోరినవారికి ఆయాఫలంబులొసఁగి సంతోషము గలిగించుచు ఆశ్రితులగు తమకు సంరక్షకుఁడై యున్నవాఁడు గావున వానిని ఈకీచకునికై సంహరించుట యుచితము కా దనియు, వంటకట్టియలకై యనుశబ్దముచేఁ గీచకుని సూచించుటచేత వంటకట్టియ లెట్లు దహింపఁదగినవో యట్లు కీచకుఁడు వధ్యుఁ డనియు ధ్వని.

137. నిగూఢభాషణములన్ = రహస్యపు మాటలచేత. అయ్యజాతశత్రుఁడు = ఆధర్మరాజు. అనిలజు కోపరసంబు పేర్మి = భీమునియొక్క కోపాతిశయమును. చేష్టితములు = వ్యాపారములను. ఇట్లు గూఢవాక్యములచేత ధర్మరాజు భీమునికోపమును శమింపఁజేసెను. ఇట్లు ధర్మరాజ భీమసేనుల వ్యాపారమును జూచి ద్రౌపది లేచి యని తా.

సీ. ఎలదీఁగఁ గప్పిన♦లలితపరాగంబు, క్రియ మ్మేన మేదినీ♦రేణు వొప్పఁ
చంపకంబున నవ♦సౌరభం బెసఁగెడు, కరణి నాసిక వేఁడి♦గాడ్పు నిగుడఁ
దోయజదళముల♦తుది మంచు దొరఁగెడు, గతిఁ గన్నుఁగవ నశ్రు♦కణము లురుల
నిందుబింబముమీఁది♦కందుచందంబునఁ, గురులు నెమ్మొగమున ♦ నెరసి యుండ
సర్వజనవంద్య యైనపాం♦చాలి సింహ, బలునిచే నివ్విధంబున ♦ భంగపాటు
దనకు వచ్చిన నెంతయు ♦ దైన్య మొంది, యవ్విరాటునిసభఁ జేర ♦ నరిగి నిలిచి.

( ద్రౌపది తనభంగపాటు విరాటునితోఁ జెప్పుట. )

ఉ. పంబినకోపమున్ సమయ♦భంగభయంబును నగ్గలించి యు
ల్లంబు పెనంగొనంగఁ బతు♦లం దగ సభ్యులఁ జూచుమాడ్కి రూ
క్షం బగుచూడ్కి నాద్రుపద♦కన్యక సూచి సభాజనప్రతా
నంబును మత్స్యనాథుఁడు వి♦నంగ నెలుంగు చలింప నిట్లనున్. 139

133. ఎలతీఁగన్ = లేఁతతీఁగను. కప్పిన లలితపరాగంబుక్రియన్ = చుట్టుకొన్న చక్కని పుప్పొడివలె. మేనన్ = దేహమునందు. మేదినీరేణువు = నేలదుమ్ము. ఒప్పన్ = ప్రకాశింపఁగా. తీఁగను పుప్పొడి కప్పినట్లు నేలదుమ్ము ద్రౌపదిని కప్పియున్న దని తా. చంపకంబునన్ = సంపెఁగపువ్వునందు. నవసౌరభంబు = క్రొత్తపరిమళము. నాసికన్ = ముక్కునందు. సంపెఁగపువ్వునందు వాసన గలుగునట్లు ముక్కున వేఁడినిట్టూర్పు వెడలె నని తా. తోయజదళములతుదిన్ = తామరరేకు కొనయందు. అశ్రుకణములు = కన్నీటిబొట్లు. ఉరులన్ = కాఱఁగా. తామరరేకులనుండి మంచు కాఱునట్లు కన్నులనుండి కన్నీరు కాఱె నని తా. ఇందుబింబముమీఁది కందుచందంబునన్ = చంద్రబింబముమీఁద నున్న కళంకమువలె. కురులు = తలవెండ్రుకలు. నెరసి = నిండి. చంద్రబింబమునందుఁ గళంక ముండునట్లు ముఖమున ముంగురులు క్రమ్మి యుండె నని తా. సర్వజనవంద్య = ఎల్ల జనులచే మ్రొక్కఁదగినది. భంగపాటు = అవమానము. ఇట్లు ఉత్తమురా లగు ద్రౌపది కీచకునిచే నవమానము నొంది దీనురాలై విరాటునిసభయొద్ద నిలిచె నని తా. ద్రౌపదిశరీరము ఎలదీఁగవంటిదనియు, నాసిక చంపకమువంటి దనియు, కన్నుఁగవ తామరరేకులవంటి దనియు, ముఖము చంద్రబింబము వంటి దనియు భావము.

139. పంబిన కోపమున్ = అతిశయించిన కోపమును. సమయభంగభయంబునున్ = ప్రతిజ్ఞ యొక్క చెడుటవలని భయమును. అగ్గలించి = అతిశయించి. ఉల్లంబు = మనస్సును. పెనంగొనంగన్ = చుట్టుకొనఁగా. పతులన్ — యుధిష్ఠిరభీమసేనుల ననుట. సభ్యులన్ = సభయందలి పెద్దలను. రూక్షంబు = క్రూరము. సభాజనప్రతానంబును = సభయందలి జనుల సమూహమును. మత్స్యనాథుఁడున్ = విరాటరాజును. ఎలుంగు = కంఠధ్వని. ఒకవైపు కోపమును మఱియొకవైపు అజ్ఞాతవాసభయము తప్పునేమో యను భయమును గలదై సభ్యులను జూచినట్లు ధర్మరాజభీమసేనులను చుఱచుఱం జూచి ద్రౌపది యందఱును వినునట్లు దుఃఖముతో ని ట్లనియె నని తా. పతులను సభ్యులను జూచినట్లు చూచుటకుఁ గోపమును సమయభంగభయంబును గారణ మగుటచేఁ గావ్యలింగాలంకారము.

సీ. నిఖిలధర్మాధర్మ♦నిపుణంబు లైనశు, ద్ధాంతరంగంబుల♦ నతిశయిల్లి
శిష్టసంరక్షణ♦దుష్టనిగ్రహముల, నీతి వాటింపంగ♦ నేర్పు గలిగి
సకలశస్త్రాస్త్రసం♦చయములఁ బరమాద్భు, తంబు సేయుపరిశ్ర♦మంబు దాల్చి
దుర్దమప్రతిభట♦మర్దనక్రీడమైఁ, జతురులు నా నెందు♦ నుతికి నెక్కి
యున్నగంధర్వు లేవురు♦ నన్ను నిట్లు, లోకఁడు పఱుపంగ నూరక♦యునికి సూడ
నచ్చెరువు గాదె యెవ్వరి♦యాండ్రు రింకఁ, బరిభవంబునఁ బొందక♦బ్రతుకువారు.

క. ఈనరపతియాస్థానము, లో నొక్కరుఁ డైన ధర్మ♦లోపభయమునం
బూని తగ వైనవెడపలు, కైనను బలుకంగఁ జాలఁ♦డయ్యెను నకటా. 141

ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట♦ నిమ్మెయి నన్నుఁ బతివ్రతాగుణా
స్పందితవర్తనం బరమ♦సాధ్వి ననిందితశీలఁ గీచకుం
డెందును నెట్టియంగనల♦ నెవ్వరుఁ జేయనియట్లు సేయఁగాఁ
గొందఱ కైన నిప్డు కృప♦కుం దఱి గా దౌ యేమి సెప్పుదున్. 142

140. నిఖిలధర్మఅధర్మనిపుణంబులు = సమస్తములయిన ధర్మములయందును అధర్మములయందును పాండిత్యము గలవి. శుద్ధఅంతరంగంబులన్ = నిర్మలమయిన మనస్సులచేత. శిష్టసంరక్షణ దుష్టనిగ్రహములన్ = పెద్దలరక్షించుటయందును దుష్టులశిక్షించుటయందును. సకలశస్త్రాస్త్రసంచయములన్ = ఎల్లశస్త్రములయు అస్త్రములయు సమూహములందు. పరమఅద్భుతంబు = ఎక్కువ యాశ్చర్యమును. పరిశ్రమంబు = సామర్థ్యంబును. దుర్దమప్రతిభట మర్దన క్రీడమైన్ = అణఁపరాని శత్రుశూరుల చంపుటయను నాటచేత. చతురులు = సమర్థులు. నాన్ = అనఁగా. నుతికిన్ = స్తోత్రమునకు. పఱుపంగన్ = బాధింపఁగా. ఆండ్రుర = భార్యలు, ఇట బహువచనము మీఁద బహువచనము. పరిభవంబునన్ = అవమానమును, ద్వితీయార్థమునఁదృతీయ. ధర్మాధర్మముల నెఱింగినవారును, సాధువులఁ బ్రోచి దుష్టుల శిక్షించువారును, శస్త్రాస్త్రవిద్యలయందుఁ బండితులును, శత్రువుల వధించువారు నగు నామగలు గంధర్వులయిదుగురును నన్నుఁ గీచకుఁ డిట్లు అవమానపఱుపఁగాఁ జూచుచు నూరకున్నవారు. ఇఁక లోకమునం దితరులభార్యలు ఇట్లు అవమానముపొందఁగా రక్షించువా రెవ్వ రుందురని తా.

141. ఈనరపతి ఆస్థానములోన్ = ఈరాజుయొక్క సభయందు. ధర్మలోపభయమునన్ = ధర్మముచెడుటవలని భయముచేత. తగవు = న్యాయము. వెడపలుకుఐనను—ఒకమాటనైనను. చాలఁడు అయ్యెనున్ = సమర్థుఁడు కాఁడయ్యెను. ఈరాజుసభలో నున్నవాఁ డొకఁడైనను అధర్మమునకు భయపడి యిది తగదని యొకమాటయైనను బలుక లేదని తా.

142. పతివ్రతాగుణ అస్పందితవర్తనన్ = పతివ్రతాధర్మమునుండి చలింపని నడవడి గలదానిని. పరమసాధ్విన్ = మిక్కిలి సాధువైనదానిని. అనిందితశీలన్ = నిందింపఁబడని యాచారము గలదానిని. ఎట్టిఅంగనలన్ = ఎట్టిస్త్రీలను. కృపకున్ = దయకు. తఱి = సమయము. వీరందఱుఁ జూచుచుండఁగా నిదివఱ కెన్నఁడును స్త్రీల కెవ్వరును చేయని యవమానమును గీచకుఁడు పతివ్రత నగు నాకుఁ జేయుచుండుటను జూచియు నెవ్వరికిని గొంచెమైనను దయ కలుగకుండుట యాశ్చర్యమని తా.

ఉ. ఐనను మత్స్యదేశమున♦యాజ్ఞ కితం డొడయండు గాన నా
కీనరనాథు దూఱఁ దగు ♦ నెయ్యది యేని నధర్మ మెవ్వ రెం
దైన నొనర్చినం బ్రభువు ♦ లారసి దండన మాచరింతు రి
చ్చో నను దన్నుకీచకునిఁ ♦ జూచియు నూరక యున్కి పాడియే. 143

చ. అనుడు విరాటుఁ డుల్లమున ♦ నక్కటికం బొలయంగ నంగనం
గనుఁగొని కీచకుం గినియఁ ♦ గాఁ దగుసత్త్వము లేమిఁ జేసి సాం
త్వనములు పల్కి రోషభరి♦తస్థితిఁ గంపితమూర్తి యైనయా
తనిమదికందు వాపిన న♦తండును బోయె నివాసభూమికిన్. 144

వ. అట్టియవసరంబున. 145

సీ. శుభలక్షణాంగి యీ♦సుందరి సైరంధ్రి, యగు నెట్లొకో యని ♦ వగచువారు
నిమ్మేని కక్కట ♦ యిట్టిది సేసెనే, మాయదైవం బని ♦ మఱుఁగువారు
నింతకీ డొనరించె ♦ నే రాజు సూడ నీ, దుష్టాత్మకుం డని ♦ దూఱువారు
దేవియుపేక్షయ ♦ చూవె యీయమకు ని, ప్పాటు వచ్చుట యని♦ పలుకువారు

143\. మత్స్యదేశమునఆజ్ఞకున్ = మత్స్యదేశముయొక్క దొరతనమునకు. ఒడయండు = ప్రభువు. ఈనరనాథున్ = ఈ రాజును. అయినను మత్స్యదేశమునకు రాజయిన విరాటుఁడు మాత్రమే నాకు దూఱఁ దగినవాఁడు. ఏలయనఁగా దేశమునం దెవ్వరైన నధర్మ మాచరించినప్రుడు రాజు వారిని శిక్షింపవలెను, ఇప్పుడు నన్ను కీచకుఁడు తన్నుటను జూచియు నీతఁడు అతని దండింపక చూచుచుండుట యుక్తము కాదని తా.

144\. ఉల్లమునన్ = మనస్సునందు. అక్కటికంబు = దయ. ఒలయంగన్ = కలుగఁగా. అంగనన్ = ద్రౌపదిని. కీచకున్ = కీచకుని గూర్చి. కినియఁగాన్ = కోపించుటకు. తగుసత్త్వము= తగు బలము. లేమిఁజేసి = లేకపోవుటచేత. సాంత్వనములు= ఊఱటమాటలను. రోషభరితస్థితిన్ = కోపముచే నిండినవాని యునికిచేత. కంపితమూర్తి = వణఁకుచున్న దేహము కలవాఁడు. అతని మదికందు = కీచకుని మనస్సునందలి తాపమును. పాపినన్ = పోఁగొట్టఁగా. నివాసభూమికిన్ = ఉనికిపట్టునకు. ద్రౌపదిమాటను విని విరాటరాజు ఆమెమీఁద దయ గలవాఁ డయ్యును కీచకుని శిక్షించు నంత బలము లేనివాఁడై కోపించి యున్నయాకీచకుని ఊఱడింపఁగా నతఁడు తనయింటికిం బోయె నని తాత్పర్యము.

146\. శుభలక్షణఅంగి = మంచిలక్షణములు గలదేహము గలది. ఈసుందరి = ఈచక్కని స్త్రీ. వగచువారున్= దుఃఖించువారును. ఇమ్మేనికిన్ = ఈశరీరమునకు. మఱుఁగువారున్ = తపించువారును. ఈదుష్టఆత్మకుండు= చెడ్డబుద్ధిగల యీకీచకుఁడు. దేవిఉపేక్షఅచూవె = సుధేష్ణయొక్క ఊరకుండుటయే చుమా. ఇప్పాటు=ఇట్టికష్టము. పలుకువారున్=నిందించువారును. పాఠాం:—ప్రందువారున్= సంతాపించువారును, ప్రందువారున్— అర్థము సమానము, ప్రందు— వందుశబ్దము రూపాంతరము కావోపును, ప్రందు— దీనిస్వరూపము విచారణీయము. విన్నఁదనంబు= వైవర్ణ్యము. గుజగుజలాడుచుం

నగుచు సభవార లందఱు ♦ నంత నంత, నల్లనల్లన గుజగుజ♦లాడు చుండి
రుల్లముల నింక్షి ఖేదంబు ♦ వెల్లివిరిసె, నాఁగ మోముల విన్నఁద♦నంబు గదుర.

ఉ. అప్పుడు ధర్మసూతి హృద♦యంబు గలంగ లలాటభాగముం
గప్పఁగ ఘర్మవారి యధి♦కం బగురోషము నొంది యుండియుం
దప్పఁగఁ ద్రోచికొంచుఁ దన♦ధైర్యము పెంపున నిర్వికారుఁడై
యెప్పుడుఁ దాను బల్కునెలుఁ ♦ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. 147

సీ. జననాయకుఁడు నీ♦సభవారు నీ దగు, తెఱఁ గెల్ల నెఱిఁగిరి ♦ తెఱవ యింక
మానక యీపలు♦మాట లాడఁగ నేల, చనుము నీవు సుధేష్ణ♦సదనమునకు
నీపరాభవమునఁ ♦ గోపింప నేరరే, గంధర్వులకుఁ దఱి ♦ గాదు గాక
సమయ మెయ్యదియేనిఁ ♦ దమకును నీకును, గలిగినయట్లైనఁ ♦ గలఁగ రిచటఁ

గాన నాథుల దూఱంగఁ♦గాదు వినుము, సతికిఁ దా నెంత వడియును♦సభలలోనఁ
దడవుగా నిల్చి యిట్టు లు♦దగ్రవృత్తి, శంక సెడి ధిక్కరింపంగఁ♦జనునె చెపుమ.

వ. అని యిట్లు సెప్పినధర్మతనయునిపలుకులు విని వెండియు సైరంధ్రి యచ్చోటు గద
లక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినం జూచి యతండు మఱియు నిట్లనియె.

డిరి = త్రొక్కటపడుచుండిరి. మిక్కిలి చక్కనిది యగు నీ కాంత కట్టువా లెట్లయ్యె ననియు, దుష్ట దైవము ఈమె కింతకష్టము గలిగించెననియు, రాజు నెదుటనే యీదుష్టకీచకుఁడు ఇంతటియకార్యము చేసె ననియు, సుధేష్ణ యుపేక్షించుటవలననే యీమె కింత కష్టము వచ్చె ననియు సభవారందఱు మిక్కిలి దుఃఖితులై రహస్యముగాఁ జెప్పుకొనుచుండి రని తా. అలం. గీతమునం దుత్ప్రేక్ష.

147. ధర్మసూతి = ధర్మరాజు. హృదయంబు = మనస్సు. ఘర్మవారి = చెమ్మటనీరు. లలాటభాగమున్ = నెత్తిప్రదేశమును. కప్పఁగన్. ధైర్యము పెంపునన్ = ధైర్యముయొక్క యతిశయముచేత. తప్పఁగఁ ద్రోచికొంచున్ = తొలఁగఁ ద్రోసికొనుచు. నిర్వికారుఁడై = మాఱుపాటు లేనివాఁడై. ఎలుఁగు = కంఠధ్వని. అపుడు ధర్మరాజు కోపము నొందియును ధైర్యముచేతఁ గోపము నడంచుకొని కొంచెమైనను మాఱుపాటు నొందక యెప్పుడును మాట్లాడునట్లే ద్రౌపదితో నిట్లనియె నని తా.

148. నీది అగు తెఱఁగు = నీదైనవిధమును. తెఱవ! ద్రౌపది సంబోధనము. సదనమునకున్ = ఇంటికి. నీపరాభవమునన్ = నీయొక్క యవమానముచేత. తఱి = సమయము. సమయము = సంకేతము. కలఁగరు = కోపింపరు. నాథులన్ = మగలను. కాదు = కూడదు. సతికిన్ = స్త్రీకి. తడవుగాన్ = ఆలస్యముగా. ఉదగ్రవృత్తిన్ = గర్వముతో. శంక = భయము. ధిక్కరింపంగన్ = నిందించుటకు. సైరంధ్రీ! రాజునకును సభవారికిని నీసమాచారము తెలిసినది, ఇఁక మాటలాడక సుధేష్ణయింటికిఁ బొమ్ము. గంధర్వులు సమయము కా దని యూరకున్నారు, నీకును వారికిని సంకేతమున్న పక్షమున అందువలన వా రిపుడు కోపింపరు, కావున నీవు నీమగలను నిందింపవలదు, ఎంతకష్టము వచ్చినను పతివ్రతకు సభలో నిట్లు నిర్భయముగా మాటలాడుట తగ దని తా.

149. ధర్మతనయుని పలుకులు = ధర్మరాజు మాటలను. వెండియున్ = మరల.

క. పలుపోకలఁ బోవుచు వి, చ్చలవిడి నాట్యంబు సలుపు♦చాడ్పున నిచటం
గులసతులగఱువచందము, దొలఁగఁగ ని ట్లునికి దగునె ♦ తోయజవదనా. 150

వ. అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కి ట్లనియె. 151

గీ. నాదువల్లభుండు ♦ నటుఁ డింత నిక్కంబు, పెద్దవారియట్ల ♦ పిన్నవారుఁ
గానఁ బతులవిధమ ♦ కాక యే శైలూషిఁ, గా ననంగ రాదు ♦ కంకభట్ట. 152

వ. అ ట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కడిది యనుచు నచ్చోటు వాసి తనమనంబున. 153

ఉ. న న్నిటు లాదురాత్మసద♦నంబునకుం జను మన్న జంత కీ
బన్నము లన్నియుం దెలిపి ♦ పల్కెదఁ గా కని పోయె నార్తయై
కన్నుల బాష్పపూరములు ♦ గ్రమ్మఁగ మోమున దైన్య మొందఁగా
నన్నలినాక్షి తొట్రిలుచు ♦ నంగము దూల సుదేష్ణపాలికిన్. 154

గీ. చనిన నయ్యేలనాగయు ♦ సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱుంగని♦తెఱఁగు దాల్చి

150. చలుపుచాడ్పునన్ = చేయువిధమున. కులసతులగఱువచందము = కుల స్త్రీలయొక్క గొప్పతనముయొక్క విధము. తొలఁగఁగన్ = పోవునట్లు. తోయజవదనా = కమలమువంటి మోము గలదానా! ద్రౌపదిసంబోధనము. ఇట్లు యథేచ్ఛముగా నాట్యము చేయునట్లు సభలో నుండుట కుల స్త్రీలకుఁ దగ దని తా.

151. పాంచాలి = ద్రౌపది. సాభిప్రాయంబుగాన్ = అభిప్రాయముతోఁ గూడినట్లుగా.

152. నాదువల్లభుండు = నామగఁడు. నటుఁడు = నట్టువవాఁడు. నిక్కంబు = నిజము. పతుల విధము అ = మగలయొక్క విధమే. శైలూషిన్ = ఆటకత్తెను. కంకభట్ట! ధర్మరాజుసంబోధనము. నామగఁడు నటుఁడు కావున నేనును నటి నగుదును. పెద్దవారివలెఁ జిన్నవారు నుండుట లోకధర్మమని తా.

153. పరిచితంబు అ = అలవడినదియే. మత్పతి = నామగఁడు. శైలూషుండు అ = నటుఁడు మాత్రమే. కితవుండునున్ = జూదరియును. గఱువతనంబు = గొప్పతనము.

154. ఆదురాత్మసదనంబునకున్ = ఆచెడ్డమనస్సు గల కీచకునియింటికి. అన్నజంతకున్ = అని నట్టి ధూర్తురాలికి. ఈబన్నములు = ఈయవమానములను. పల్కెదన్ = నిందించెదను. ఆర్తయై = దుఃఖము గలదై. బాష్పపూరములు = కన్నీటి ప్రవాహములు. అన్నలినఅక్షి = తామరలవంటి కన్నులు గల యాద్రౌపది. అంగము = దేహము. తూలన్ = వణఁకఁగా. సుదేష్ణపాలికిన్. పోయెన్. అని యన్వయము. నన్ను ఆకీచకునియింటికిఁ బొమ్మన్న దుష్టురా లగు సుదేష్ణయొద్దకుఁ బోయి నాపాటులను దెలిపెద నని కన్నీరు గార్చుచు దీనురాలై వణఁకుచు సుదేష్ణ యొద్దకుఁ బోయె నని తా. పాఠాం:—ప్రయ్యెడనే = నిందింపనా? అని యర్థము. దీని స్వరూపము విచారణీయము.

155. ఆయ్యేలనాగయున్ = ఆసుదేష్ణయును. సంభ్రమంబు = తొట్రుపాటును. తెఱఁగు = విధమును. శాఠ్యమునన్ = కపటముచేత. ఉమ్మలించి = దుఃఖించి. ఎలుఁగు = కంఠస్వరము. సుదేష్ణ

శౌర్యమున నుమ్మలించి పాం♦చాలితోడ, నెలుఁగు వే ఱోకభంగిగా♦నిట్టు లనియె.

సీ. ధరణీపరాగంబు ♦ వొరసి ధూసరితమై, చేడియ నీమేను ♦ చెన్ను దఱిఁగెఁ
జిత్తంబుతలపోఁత♦చే వాడు వొదివినఁ, జెలువ నీనెమ్మోము ♦ చిన్నఁబోయెఁ
బ్రస్వేదమునఁ దోఁగి ♦ ఫాలంబుతో నంటి, యుగ్మలి నీకురు ♦ లొప్పు గుందెఁ
గన్నీరు వఱ్ఱోడ్డి ♦ కాంతి యంతయుఁ గొన్న, వెలఁది నీకనుఁగవ ♦ విన్ననయ్యె
నేది కారణమున ♦ నెవ్వ రెచ్చోట నీ, కేమి కీ డొనర్చి ♦ రెట్టిపాటి
సాహసికులో వారిఁ ♦ జంపుదు నొంపుదు, భంగపఱుతునిడుమ♦పఱుతుఁ జెఱుతు.

వ. ఇత్తెఱంగు నాకుం జెప్పు మనిన నీ వెఱింగియు నెఱుంగమి భావించిన నింక నే
మని పలుకం గలదాన నైనను విను మని సైరంధ్రి యి ట్లనియె. 157

మ. నను నీ వప్పుడు సూతమందిరమున♦ న్మద్యంబుఁ దె మ్మన్నఁ బో
యిన నాతం డవినీతి సేసినను జే♦ యీ కేను మత్స్యావనీ
శునియాస్థానముదిక్కు వే చనిన న♦చ్చోఁ దీవ్రకోపంబున
న్వెనుకం గూడఁగ ముట్టి పట్టికొని త♦న్నెం బల్కు లిం కేటికిన్. 158

ద్రౌపదినిచూచి లేనిదుఃఖమును దెచ్చికొని కపటముచే నేమియు నెఱుఁగని దానివలె దగ్గుత్తికతోని ట్లనియె నని తా.

156. ధరణీపరాగంబు = నేలదుమ్మును. పొరసి = పొంది. ధూసరితముఐ = బూడిదరంగు గలదై. చేడియ! ద్రౌపదిసంబోధనము. నీమేను = నీదేహము. చెన్నుతఱిగెన్ = కాంతి లేనిదయ్యెను. దుమ్ము కప్పుటచేత నీశరీరకాంతి దగ్గియున్న దని తా. చిత్తంబుతలపోఁతచేన్ = మనస్సుయొక్క చింతచేత. వాడు = వాడుట. పొదివినన్ = కలుగుటచే. చెలువ! ద్రౌపది సంబోధనము. నీనెమ్మోము = నీచక్కనిముఖము. మనస్సునందుఁ జింత కలుగుటచేత నీముఖము వాడి చిన్నపోయిన దని తా. ప్రస్వేదమునన్ = ఎక్కువ చెమ్మటయందు. తోఁగి = తడిసి. ఫాలంబుతోన్ = నొసటితో. ఉగ్మలి! ద్రౌపది సంబోధనము. ఒప్పుగుందెన్ = చక్కఁదనము చెడెను. చెమటచేఁ దడిసి నీముంగురులు నెత్తి కంటుకొని చక్కఁదనము లేక యున్న వని తా. వఱ్ఱోడ్డి = ప్రవహించి. కొన్నన్ = అపహరించుట చేత. విన్ననయ్యెన్ = వివర్ణత నొందెను. కన్నీరు కాఱుట చేత నీ కన్నులు విలాసము లేక యున్న వని తా. ఎట్టిపాటి సాహసికులు ఒ = ఎంతమాత్రపు తెగువగలవారో. ఏకారణముచేత నెవ్వ రెచ్చట నీకు నేమి యపకారము చేసిరో చెప్పుము. వారిం దండింతు నని తా.

157. భావించినన్ = అభినయించినయెడ.

158. సూతమందిరమునన్ = కీచకుని యింటినుండి. అవినీతి = అకార్యమును. చే = పట్టును. ఈక = ఇయ్యక. మత్స్యఅవనీఈశుని అస్థానము దిక్కు = విరాటరాజుయొక్క సభవైపునకు. వే = త్వరగా. నన్ను నీవు కీచకు నింటినుండి మద్యము తెమ్మనఁగా నేను అచ్చటికిఁ బోయితిని. అతఁడు నా కవమానము చేసినందున నేను దప్పించుకొని విరాటరాజుసభయొద్దకుఁ బరుగెత్తఁగా నతఁడు నన్ను వెంబడించి వచ్చి యచటఁ దన్నె నని తా.

వ. అని యేర్పడం బలికిన. 159

ఉ. ఖేదము దక్కు మీ క్షణమ ♦ కీచకు దండితుఁ జేసి నీకు నా
హ్లాద మొనర్తు నే నని భ♦యంబునఁ గేకయరాజపుత్త్రి య
త్యాదరవృత్తితో ననున♦యం బొనరించిన నయ్యసత్యసం
వాదినిపూన్కి పాండుసుత♦వల్లభ యాలము సేసి యి ట్లనున్. 160

క. నీ వింత యలుగ నేటికి, నావంతయుఁ బౌరజనమ♦నఃఖేదము నా
క్కావంత క్రిక్క కుండఁ గ, లావంతులు మత్పతులు గ♦లరు పగఁ దీర్పన్. 161

క. అనిన సుధేష్ణయుఁ దత్పరి, జనములు వెఱఁ బొంది యెన్ని♦సాంత్వనములు సె
ప్పినఁ దేఱదు మజ్జనభో, జనములకుం జొరదు ద్రుపద♦సంభవ యెట్లన్. 162

వ. అట్టియెడ సుధేష్ణ సేయునది లేక నివ్వెఱఁ గంది యుండెఁ దక్కటియంగనలును గీచకునినీచత్వంబు దలంచి వానిచేటున కొడంబడిరి పరిభవానలసంతప్తయైనపాంచాలి నిజశయనస్థానంబునకుం జని తల్పంబుపై మేను వైచి యపాంగంబులం దొరఁగుకన్నీరు చెవులకొలంకులు నిండ నెవ్వగలు నివ్వటిల్లం దల పోయు చుండె. 163

క. ప్రబలుం డారయ నాసిం, హబలుఁ డాతని జయింప ♦ ననిలతనయు డా

160. ఖేదము = దుఃఖమును. తక్కుము = విడువుము. అత్యాదరవృత్తితోన్ = మిక్కిలి యాదరము గల వ్యాపారముతో. అనునయంబు = ఊఱడించుటను. అయ్యసత్యసంవాదినిపూన్కి = ఆయసత్యము పలుకు సుధేష్ణయొక్క పూనికను. పాండుసుతవల్లభ = ద్రౌపది. ఆలముచేసి = ఉపేక్షించి. కీచకుని శిక్షించెదను. నీవు దుఃఖము విడువు మని సుధేష్ణ యూఱడింపఁగా ద్రౌపది యామె యసత్యము చెప్పుచున్నది యని యామెపలుకును నమ్మక యిట్లు చెప్పె నని తా.

161. నావంతయున్ = నాదుఃఖమును. పౌరజనమనఃఖేదమున్ = పట్టణమునందలి జనుల మనోదుఃఖమును. ఒక్కఆవంత = కొంచెమైనను. త్రిక్కకఉండన్ = విడువకుండ. కలావంతులు = నేర్పరులు. నీవు కోపము పూన వలదు. నాదుఃఖమును పట్టణమునందలి జనులదుఃఖమును దీఱునట్లు నామగలు పగదీర్పఁ గల రని తా. పాఠాం:—లావరులు = బలము గలవారు.

162. సాంత్వనములు = ఊఱడించుమాటలను. తేఱదు = ప్రసన్నురాలు కాదు. మజ్జనభోజనములకున్ = స్నానమునకును భోజనమునకును. ద్రుపదసంభవ = ద్రౌపది. ద్రౌపదిమాట విని సుధేష్ణలోనగువారు భయపడి యెంత యూఱడించినను ద్రౌపది కోపము విడిచి స్నానభోజనములకు లేవలే దని తాత్పర్యము.

163. నివ్వెఱఁగు = నిశ్చేష్టతను. అంగనలు = స్త్రీలు. పరిభవఅనలసంతప్త = అవమానము అను వగ్నిచేఁ దపింపఁజేయఁబడినది. తల్పంబుపైన్ = పాన్పుమీఁద. అపాంగంబులన్ = కనుకొలుకులనుండి.

164. ప్రబలుండు = ఎక్కువబలము గలవాఁడు. అసింహాబలుండు = ఆకీచకుఁడు. అనిలతనయు

హుబలంబ చూడఁ దగు దైవబలంబును నాతనికి స♦హాయ్యము గల్గుఁగా. 164

( ద్రౌపది భీమసేనుతోఁ దనభంగపాటు సెప్పి పరితపించుట. )

వ. ఇట్లూహించి రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులుఁ గ్రమంబున నిద్రిం పం దొడంగినం దానును శయ్యాతలంబు విడిచి మేనిధూళి గడిగి ధౌతపరిధాన పరీతయై మహానసగృహంబున సుప్తుం డైనవృకోదరుకడకుం జని. 165

ఉ. నన్నుఁ బరాభవించి సద♦నంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సు♦ఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్ను మొగుడ్చునాఱటకుఁ ♦ గారణ మెయ్యది భీమసేన మీ
యన్నపరాక్రమంబు వల♦ దన్న నొకో దయమాలి తక్కుటా. 166

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలిపాణిస్పర్శంబున మే లుకని యిది యెవ్వ రనవుడు నే ననునమ్మానిని యెలుం గెఱింగి భీమసేనుండు యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించు నదియై యరుగుదెంచెం గావలయు న త్తెఱం గిత్తెఱవ దాన చెప్ప విందు నని తలంచి. 167

గీ. ఇంత ప్రొద్దల యిచ్చోటి♦కేగుదేరఁ, గారణం బేమి యెవ్వరుఁ♦గాన కుండ

బాహుబలంబుల = భీమునిభుజబలము నే. కీచకుఁ డెక్కువబలము గలవాఁడు కావున నాతనిని భీముఁడే వధింపవలయును. భీమునకు దైవబలముకూడ సహాయపడు నని తా.

165. శయ్యాతలంబు = పాన్పుప్రదేశమును. మేనిధూళి = దేహముయొక్క దుమ్ము. ధౌత పరిధానపరీత = ఉదికినవస్త్రముచేఁ గప్పఁబడినది. మహానసగృహంబునన్ = వంటయింటియందు. సుప్తుండు = నిద్రించినవాఁడు. వృకోదరుకడకున్ = భీమునియొద్దకు.

166. పరాభవించి = అవమానపఱచి. సదనంబునకున్ = ఇంటికి. తెఱంగు = విధము; సుఖ ఉచితశయ్యను = సుఖమునకుఁ దగినపాన్పుమీఁద. నిద్రచేయన్ = నిద్రించుచుండఁగా. నీకన్ను మొగుడ్చునాఱటకున్—నీవు నిద్రపోవునంతటి నిశ్చింతకు. న న్నవమానించి కీచకుఁడు నెమ్మదిగా నిద్ర పోవుచుండఁగా నీ కిట్లు నిద్రవచ్చునట్టి నిశ్చింత యెట్లు కలిగినది? మీయన్నమాట విని నాయందు దయ విడిచితివా యేమి యని తా.

167. మందమందసంభాషణంబులన్ = మిక్కిలి తిన్ననిమాటలచేత. సంబోధించు పాంచాలి పాణిస్పర్శంబునన్ = మేలుకొలుపునట్టి ద్రౌపదియొక్క చేతితాఁకుడుచేత. అను అమ్మానిని ఎలుంగు = అనునట్టి యీద్రౌపదియొక్క కంఠధ్వనిని. యాజ్ఞసేని = ద్రౌపది. దురాచరణంబు = చెడునడతను. ప్రకటించి = తెలిపి. నిర్జింపన్ = జయించుటకు. నియోగించునదియై = పురికొల్పునదియై. ఇత్తెఱవ = ఈ స్త్రీ.

168. ఇంతప్రొద్దు = ఈవేళయందు. ఏగుదేరన్ = వచ్చుటకు. అంబుజఅక్షి = కమలములవంటి

నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి, యనిన నయ్యింతి యిట్లను నతనితోడ.

చ. ఎఱిఁగి యెఱింగి నన్నడుగ నేమిటి కిప్పు డెఱింగి యింతకు
న్మఱచుట గల్గెనే నది విసంబని లే దటుగాక యున్నరూ
పెఱిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స య
త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటనుండియున్. 169

చ. అధిపుమఱంది సింహబలుఁ డప్పకు మ్రొక్కఁగ వచ్చి నన్ను న
త్యధికమనోజరాగమతియై కనుఁగొంచుఁ గడంగి యెన్ని యేన్
విధములఁ బల్కి నాకుఁ దన విన్నను వొప్పఁగఁ జూపి చేరి మా
నధనవిహీనతన్ జెనకినం గడు నేవము పుట్టి యయ్యెడన్. 170

క. విడియం బలుకఁగ వెండియు, నుడుగక కీచకుఁడు మన్మథోన్మాదము ద
న్నడరిన నన్నడుగుటకుం, దొడరినఁ గోపించి వానితో నిట్లంటిన్. 171

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా. 172

కన్నులు గలదానా! ద్రౌపది సంబోధనము. ఇంతప్రొద్దు పోయినసమయమునందు నీ విచ్చటికి వచ్చుటకుఁ గారణమేమి? నిన్నెవ్వరు చూడ లేదు కదా యనియడుగఁగా ద్రౌపది యిట్లు చెప్పె నని తా.

169. ఇంతకున్ = ఈలోపల. కల్గెన్ ఏన్ = కలిగినయెడ. అది = ఆసంగతి. ఉన్నరూపు = కలిగినస్థితిని. నీవు చక్కఁగా నెఱిఁగియుండియు నన్నడిగెద వేమి? ఇపుడే నీవు చూచి యింతలో మఱచినయెడ నీకు నే నాసంగతిని చెప్పి ప్రయోజనము లేదు. అట్లు గాక నానోటనే వినవలయు నని నీయభిప్రాయ మైన మొదటనుండియుఁ జెప్పెదను విను మని తా.

170. అధిపుమఱంది = విరాటరాజు బావమఱఁది. సింహబలుఁడు = కీచకుఁడు. అతిఅధికమనోజరాగమతియై = మిక్కిలి యెక్కుడయిన మన్మథునిచేఁ గలిగినయనురాగము గల మనస్సు గలవాఁడై. కడంగి = పూని. విన్ననవు = నేర్పును. మానధనవిహీనతన్ = మానము అను ధనముచే విడువఁబడినవాఁ డగుటచేత. చెనకినన్ = తాఁకఁగా. ఏవము = రోఁత. కీచకుఁడు సుధేష్ణయొద్దకు వచ్చి యచ్చట నన్నుఁ జూచి మన్మథునకు లోనై నానావిధములుగా నాతోఁ బలికి మానము విడిచి నన్నుఁ దాఁకఁగా నేను రోసి యని తా.

171. విడియన్ = స్పష్టముగా. ఉడుగక = నిలువక. మన్మథఉన్మాదము = మన్మథవికారము. అడరినన్ = వ్యాపింపఁగా. తొడరినన్ = పూనఁగా. అట్లు స్పష్టముగాఁ జెప్పినను నిలువక నన్ను మఱల నడుగుటకుఁ బ్రారంభింపఁగా నేను గోపముతో నిట్లు చెప్పితి నని తా. పాఠాం:—పలుభాషలాడఁగన్ = పెక్కుమాటలాడఁగా నని యర్థము.

172. ఈపద్యము 55 వ పద్యముగా వ్యాఖ్యాత మయ్యెను.

వ. అనిన విని వాఁడు గొన్ని ప్రల్లదంబులు వలికిన నేనునుం దత్కాలోచితవచనంబులం ద్రోచి పుచ్చినం బోయెఁ బదంపడి పాపాత్మ యైనసుధేష్ణ దనకు మదిరారసంబు దేరం గీచకనివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద పెనంగ నోల్లక నామనంబున న న్నెవ్వరికి నేమి సేయ వచ్చు నని మీలావు నచ్చి సూతునింటికి సురకుం బోయిన. 173

క. కొన్ని వెడమాట లాడుచు, నన్నాతఁడు చెట్ట వట్టి♦నం ద్రోచి వెసం
జన్న వెనుకొనుటయును మీ, యున్నెడ కే నపుడు సంభ్ర♦మోపేతగతిన్. 174

గీ. పాఱుదెంచిన నక్కుల♦పాంసనుండు, కోప మడరంగ వెనుకన ♦ కూడ ముట్టె
నట నెఱుంగుదు నీవు మీ♦యన్న పెద్ద, తనముఁ జూచితి నే మందు ♦ ననిలతనయ.

ఉ. మీసుభటత్వముల్ బలము ♦ మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ
ట్లాసభలోన నన్ బతిచె ♦ నంతియ కాక జయద్రథుండు సం
త్రాసభరంబు లే కనుచి♦తం బొనరించినఁ జెల్లి పోయె నేఁ
డీసభికుల్ గనుంగొనఁగ ♦ ని ట్లయితిన్ వగ నాకు వింత యే. 176

173. ప్రల్లదంబులు = దుర్భాషణములను. తత్కాల ఉచితవచనంబులన్ = ఆసమయమునకుఁ దగినమాటలచేత. మదిరారసంబు = మద్యమును. పెద్ద = మిక్కిలి. మీలావు = మీబలమును. నచ్చి = నమ్మి. సూతుఇంటికిన్ = కీచకునియింటికి. సురకున్ = మద్యమునకు.

174. వెడమాటలు = తుచ్ఛపుపలుకులు. చెట్ట = చేతిని. సంభ్రమ ఉపేతగతిన్ = వేగముతోఁ గూడిన నడకచేత. తుచ్ఛవాక్యములు చెప్పి నన్నుఁ బట్టుటకు రాఁగా నేను తప్పించుకొని పోవు నపుడు అతఁడు వెంబడించుటచే భయపడి మీరుండుచోటికి శీఘ్రముగా నని తా.

175. అక్కులపాంసనుండు = కులమును చెడఁగొట్టునట్టి యాకీచకుఁడు. వెనుకన్ అ= వెంబడిగానే. అనిలతనయ! భీముని సంబోధనము. పరుగెత్తి రాఁగా నా దుర్మార్గుఁడు కోపముతో నా వెంబడి వచ్చెను, అటుపిమ్మట జరిగినది నీకుఁ దెలియును, ధర్మరాజుగొప్పతనము తెలియవచ్చె నని తా.

176. మీసుభటత్వముల్ = మీ మేలిబంటుతనమును. మిన్నక = ఊరక. దుస్ససేనుఁడు = దుశ్శాసనుఁడు. పతిచెన్ = అవమానించెను. జయద్రథుండు = సైంధవుఁడు. సంత్రాసభరంబు = భయాతిశయము. అనుచితంబు = తగవుమాలినపనిని. ఈసభికుల్ = ఈజూదరులు, ధర్మరాజును విరాటుఁడును ననుట. "సభికాః ద్యూతకారకాః" అని యమరసింహుఁడు, సభ్యుఁడు—సభయందు సాధువు అని భేదము. వగ = దుఃఖము. పూర్వము దుశ్శాసనుఁడు సభలో న న్నవమానించెను, అటుపిమ్మట వనవాసకాలమునందు సైంధవుఁడు నన్ను నిర్భయముగాఁ గొనిపోయెను, నేఁడు జూదమాడుచున్న విరాటధర్మరాజులు చూచుచుండఁగాఁ గీచకుఁ డిట్లు చేసినాఁడు, మీ బలపరాక్రమములు వ్యర్థమయ్యె నని తా.

గీ. అకట యాఁడుఁగూయి ♦ నాలకూయిని లాఁతి, వారికైన నరయ♦వలయు ననిన
నన్నుఁ గీచకుండు ♦ దన్నంగ నెట్టులు, సూడ నేర్చె ధర్మ♦సూనుఁ డపుడు. 177

వ. అనిన విని యతం డి ట్లనియె. 178

ఉ. కీచకుఁ డట్లు మీఁదు పరి♦కింపక నన్నుఁ బరాభవింపఁగాఁ
జూచి మహోగ్రకోపవివ♦శుం డగునన్నను జూచి ధైర్యహే
మాచలుఁ డైనధర్మసుతుఁ ♦ డమ్మెయి వారణ సేయ కున్న నే
నీచత వాని మత్స్యవిభు♦నిం బరివారము నుగ్గు చేసినన్. 179

వ. ఆసంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల నెఱింగి రేని. 180

క. ముందటిభంగిన కానల, యందు వసింపంగ వలదె ♦ యది నీవును నే
నుం దెచ్చినయాపద గా, నిందింపరె యెల్లవారు ♦ నీరజవదనా. 181

177. ఆఁడుఁగూయిన్ = ఆఁడుదానిమొఱను. ఆలకూయిని = గోవులకూఁతను. లాఁతివారికిన్ ఐనన్ = ఇతరుల కైనను. అరయవలయున్ = విచారింపవలయును. ఆఁడువారి మొఱయు గోవుల మొఱయు వినవచ్చినయెడ నితరులైనను విచారించి రక్షింపవలసి యుండఁగాఁ గీచకుఁడు నన్నుఁ దన్నుచుండఁగా ధర్మరాజు చూచుచు నూరకుండుట యాశ్చర్య మని తా.

179. మీఁదు = రాఁబోవుదానిని. పరికింపక = ఆలోచింపక. పరాభవింపఁగాన్ = అవమానము సేయఁగా. మహోగ్రకోపవివశుండు = మిక్కిలి భయంకర మయిన కోపముచేఁ బరవశుఁడు. ధైర్యహేమాచలుఁడు = ధైర్యమునందు మేరుపర్వతమువంటివాఁడు. అమ్మెయిన్ = ఆవిధమున. నీచతన్ = తక్కువతనముచేత, అజ్ఞాతవాస భంగ మవు నను తెలివిలేమిచేత ననుట. వానిన్ = ఆ కీచకుని. మత్స్యవిభునిన్ = విరాటుని. పరివారమున్ = పరిజనమును. కీచకుఁడు అట్లు నిర్భయముగా నిన్నవమానించుటయును అందుకు నేను కోపించుటయును జూచి ధర్మరా జప్పుడు నన్ను వారింపకున్నయెడ నేను అజ్ఞాతవాసభంగభయము లేక కీచకుఁడు మొదలగువారిని వధించినపక్షమున నని తా. పాఠాం:—నీచునివానిన్—నీచుఁడయిన యాకీచకుని అని యర్థము. ఈపాఠము పూర్వపాఠమునకన్నను మిన్నయయినను పూర్వపాఠము పెక్కుప్రతులయందుఁ గానఁబడుచున్నది, నీచుని అను పాఠము కొలఁదిప్రతులయందు మాత్రమే కానఁబడినను భీమునియందు నీచత నన్వయించి తాత్పర్యభేదము కల్పించుటకన్నను గీచకునియందు నీచత్వము స్వరససిద్ధ మగుటవలన నీపాఠమే యుక్తముగాఁ దోఁచుచున్నది.

180. ఆసంరంభంబునన్ = ఆవేగిరపాటునందు.

181. ముందటిభంగిన్ అ = మునుపటివలెనే. కానలయందున్ = అడవులయందు. నీరజవదనా = కమలమువంటి ముఖముగలదానా! ద్రౌపది సంబోధనము. మరలఁ బూర్వమువలె నరణ్యవాసము నజ్ఞాతవాసమును జేయవలయును, అది నీవలనను నావలనను వచ్చిన దని యందఱు మనల నిందింతు రని తా.

వ. కావున సత్యవ్రతనిష్ఠుం డగుయుధిష్ఠిరుండు పౌరుషకుం డగువాఁడు గాని దూఱు వడ నర్హుండు గాఁ డని వెండియు ని ట్లనియె. 182

క. పరిభవకరుఁ డగుకీచకుఁ, బరిమార్చుట కిప్పుడు గడవఁ♦బడియెనె యిమ్మై దురపిల్ల నేల వ్రేల్మిడిఁ, బొరిగొని నీమనముకలఁక ♦ పుత్తు లతాంగీ. 183

వ. మనల నెవ్వరు నెఱుంగకుండునట్టితెఱంగు దలపోయవలయుఁ గాక పగతుల భంజించుట యెంతపని యనిన విని యామానిని యి ట్లనియె. 184

క. కుంతికి నంత వెఱవ మీ, కంతె వెఱవ దైవమునకు ♦ నంత వెఱవ న త్యంతకలుషాత్మ విరటుని, కాంతకు నే వెఱతుఁ బనులు ♦ గావించునెడన్. 185

చ. కినుకకుఁ జాల కెంతయును ♦ గీడ్పడి నాపడుపాటు లెల్ల వ మ్మునఁ గలయంగ నిట్టు లొక♦మూర్ఖునిచేఁ దుదిఁ బోయి కోలుపో యనె యభిమాన మవ్వగపు♦నేర్తెఱ డెందము గొందలంబుఁ బొం దిన ధృతి మాలి యేఁ బలికి♦తిం దగ నెల్ల నెఱింగి యుండియున్. 186

182. సత్యవ్రతనిష్ఠుండు = సత్యవ్రతమునం దునికి గలవాఁడు. యుధిష్ఠిరుండు = ధర్మరాజు. అర్హుండు = తగినవాఁడు.

183. పరిభవకరుఁడు = అవమానము సేయువాఁడు. పరిమార్చుటకున్ = చంపుటకు. కడవఁబడియెన్ ఏ = దాఁటిపోయినదా! ఇమ్మెన్ = ఈప్రకారముగా. దురపిల్లన్ = దుఃఖించుట. వ్రేల్మిడిన్ = శీఘ్రముగా. పొరిగొని = చంపి. నీమనము కలఁక = నీ మనస్సుయొక్క కలఁతను. పుత్తున్ = పోఁగొట్టెదను. లతాంగీ = తీఁగవంటి దేహము గలదానా! నిన్నవమానించిన కీచకుని చంపుటకు ఇప్పు డేమియు మించిపోలేదు. నీ విట్లు దుఃఖింపవలదు, శీఘ్రముగా వధించి నీ దుఃఖము పోఁగొట్టెద నని తా.

184. తెఱంగు = విధము. పగతురన్ = శత్రువులను, కీచకుని తత్సంబంధుల ననుట, పాఠాం:—పగతునిన్ = శత్రువును, కీచకుని. బహువచనాంతపాఠమే పెక్కుప్రతులయందుఁ గానఁబడుచున్నది. భంజించుట = చంపుట. ఆమాని = ఆద్రౌపది.

185. వెఱవన్ = భయపడను. అత్యంతకలుష ఆత్మ = మిక్కిలి పాపపుమనస్సుగలదైన. విరటుని కాంతకున్ = సుదేష్ణకు. నేను పనులు సేయునపుడు పాపాత్మురా లగు సుదేష్ణకు భయపడినట్లు మీ కెవ్వరికిని భయపడినది లే దని తా.

186. కినుకకున్ = కోపమునకు. కీడ్పడి = తక్కువతనమునొంది. నాపడుపాటులు = నేను పడుకష్టములు. వమ్మునన్ కలయంగన్ = వ్యర్థమైపోవునట్లు. తుదిన్ = కడపట. అభిమానము = పరువు. కోలుపోయెను ఎ = చెడెనే. అవ్వగపు ఏర్తెఱన్ = అను దుఃఖముయొక్క యతిశయము చేత. డెందము = మనస్సు. గొందలంబున్ = కలఁతను. ధృతి = ధైర్యము. మాలి = చెడి. తగవు = న్యాయమును. నేను ఎంతనీచస్థితి వచ్చినను కోపపడక యోర్చుచున్న కష్టములన్నియు నేటఁ గలసి తుదకు కీచకునివలన నిట్లు మానము చెడవలసివచ్చెనే యను దుఃఖముచేత మనస్సు కలఁగి యిట్లు చెప్పితిని, కాని ధర్మరాజుగౌరవము తెలియనిదానఁ గా నని తా.

( ద్రౌపది భీమునితో ధర్మరాజుమహిమ చెప్పుట. )

వ. ఇట్టిద కాని సమస్తజనస్తవనీయుం డగుపాండవాగ్రజు నిక్కంబ నిందించినవాడం
గా నని పలికి మఱియును. 187

క. ధర్మతనూభవుసంతత, ధర్మనిరతి మనము బ్రతుకఁ ♦ దలఁచుట యరుదే
నిర్మలుఁ డగునాతనిస, త్కర్మంబునఁ గాదె బ్రతుకు ♦ ధాత్రికి నెల్లన్. 188

సీ. చనునె వేఱొకని క♦జాతశత్రుం డను, పేర దిగ్విజయంబు♦పెంపు దాల్ప
రాజసూయమహాధ్వ♦రము గోరి చేయంగఁ, దీరునే పెఱధరి♦త్రీపతులకు
ధర్మైకనిరతుఁ డా♦తం డొక్కరుఁడ చూవె, యనఁ జన నొరులకు ♦ నలవి యగునె
నిత్యవ్రతంబుగా ♦ సత్యంబు పాలింప, వచ్చునె యొడ్డు లె♦వ్వరికి నైన
నయ్యుధిష్ఠిరుగాంభీర్య♦మతనిధైర్య, మరయ నొండెడఁ గలుగునె ♦ యతఁడు కీర్తి
పరుఁడు సుగుణోత్తరుఁడు మహీ♦సురసమృద్ధికరుఁడు నిజవంశవరుఁడు ప♦కారపరుఁడు.

క. కలిమికి నొప్పగు నీగియు, బలిమికిఁ దొడ వైనయట్టి♦బలఁగము నై లో

187. సమస్తజనస్తవనీయుండు = ఎల్లజనులచేఁ బొగడఁదగినవాఁడు. పాండవఅగ్రజున్ = ధర్మరాజును. నిక్కంబు అ = నిజముగానే.

188. ధర్మతనూభవు సంతతధర్మనిరతిన్=ధర్మరాజుయొక్క యెడతెగని ధర్మమునందలి యాసక్తిచేత. నిర్మలుఁడు = పరిశుద్ధుఁడు. సత్కర్మంబునన్ = సత్కార్యముచేత. ధాత్రికిన్ = భూమికి. ధర్మరాజుయొక్క ధర్మప్రభావముచేత సమస్తలోకంబును రక్షింపఁబడును, కావున మనము దానిచే బ్రదుకఁదలఁచుట యాశ్చర్యము గాదని తా.

189. అజాతశత్రుండు = పుట్టనిశత్రువులు గలవాఁడను. పెంపు = గొప్పతనమును. దిగ్విజయము చేసి యజాతశత్రు వను పేరు వహించుటకు ధర్మరాజునకుం దక్క మఱియెవ్వరికిని శక్యము కాదని తా. రాజసూయమహాధ్వరము = రాజసూయ మను గొప్పయజ్ఞమును. పెఱధరిత్రీపతులకున్ = ఇతరరాజులకు. తీరును ఎ = శక్య మగునా! రాజసూయయాగము చేసినవాఁడు ధర్మరా జొక్కఁడే యని తా. ధర్మఏకనిరతుఁడు = ధర్మమునం దొక్కదానియందే యాసక్తుఁడు. ధర్మరాజువలె పరమధార్మికుఁ డను పేరు పొందుటకు మఱియెవరికిని నలవికాదని తా. పాలింపన్ = పాటించుటకు. ఒడ్డులు = ఇతరులకు. ధర్మరాజువలె సత్యవ్రతము పాటించుటకు మఱియెవ్వరికి శక్యము కాదని తా. పాఠాం:—వచ్చునే యెందు నెవ్వారికైన. ఒండుఎడన్ = మఱియొకనియందు. కీర్తిపరుఁడు= కీర్తిప్రధానముగాఁ గలవాఁడు. సుగుణఉత్తరుఁడు= మేలిగుణములచే శ్రేష్ఠుఁడు. పాఠాం:—కరుణోత్తరుఁడు=దయచే శ్రేష్ఠుఁడు. మహీసురసమృద్ధికరుఁడు = బ్రాహ్మణులకు సంపదను చేయువాఁడు. నిజవంశవరుఁడు = తనవంశమునందు శ్రేష్ఠుఁడు.

190. కలిమికిన్ = సంపదకు. ఒప్పు = తగినది. ఈగియున్ = దానమును. బలిమికిన్ = బలమునకు. తొడవు = అలంకారము. బలఁగమున్ = పరిజనమును. ఐ=కలవాఁడై. లోకులచిత్తములకున్ = జనులమనస్సులకు. వ్రేఁగు=భారము. అగుకొలఁదిన్= అయినపరిమితిచేత. మనన్=వర్తించుటకు. సంప

కలచిత్తములకు బ్రేఁ గగు, కొలఁది మన న్గొంతిపెద్ద♦కొడుకున కమరున్. 190

సీ. ఎవ్వనివాకిట ♦ నిభమదపంకంబు, రాజభూషణరజో♦రాజి నడఁగు
నెవ్వనిచారిత్ర ♦ మెల్లలోకములకు, నొజ్జయై వినయంబు♦నొఱపుఁ గఱపు
నెవ్వనికడకంట ♦ నివ్వటిల్లెడుచూడ్కి, మానితసంపద ♦ లీనుచుండు
నెవ్వనిగుణలత ♦ లేడువారాసుల, కడపటికొండపైఁ ♦ గలయఁ బ్రాఁకు
నతఁడు భూరిప్రతాపమ♦హాప్రదీప, దూరవిఘటితగర్వాంధ♦కారవైరి
వీరకోటీరమణిఘృణి♦వేష్టితాంఘ్రి, తలుఁడు కేవలమర్త్యుఁడె ♦ ధర్మసుతుఁడు.

ఉ. అట్టిమహాత్ముఁ డొక్కనికి ♦ నాశ్రితుఁడై వెడకూడుఁ జీరయుం
బెట్టఁగ నిల్చి వాని మది♦ప్రీతికి నీడగువృత్తిఁ బేరునుం
బుట్టును మాలి యిప్పు డిటు ♦ బ్రుంగుడువాటునఁ బొందఁ జూచి నా
కెట్టు మనంబు వట్టు ధృతి ♦ యెమ్మెయిఁ దూలక నిల్చుఁ జెప్పుమా. 192

డకుఁ దగినట్లు దానము చేయుచుఁ బరాక్రమమునకుఁ దగినట్లు పరిజనము గలిగి లోకు లాశ్చర్యపడు నట్లు వర్తించుట ధర్మరాజున కొక్కనికే తగు నని తా. పాఠా :—కొలఁదిమనసు = పరిమితి గల మనస్సు అని యర్థము, ఇతరుల కెవ్వరికిని లేనట్టి గొప్పమనస్సు అని భావము.

191. ఇభమదపంకంబు = ఏనుఁగుమదజలముయొక్క బురద. రాజభూషణరజోరాజిన్ = రాజులసొమ్ములయొక్క చూర్ణములసమూహముచేత. ధర్మరాజువాకిట మదపుటేనుఁగు లుండు ననియు, వాని మదజలముచేఁ గలిగిన బురద ధర్మరాజుదర్శనార్థము కాచియుండు రాజులయాభరణములయొరయికచే రాలిన చూర్ణముచే నడఁగు ననియు తా. అలం. ఉదాత్తము. చారిత్రము = నడవడి. ఒజ్జయి = గురువై. వినయంబుజొఱపున్ = శిక్షయొక్కయతిశయమును. కఱపున్ = నేర్పును. ధర్మరాజు నడవడిని చూచి లోకులందఱును ధర్మమును నేర్చుకొనవలయు నని తా. నివ్వటిల్లెడుచూడ్కి = ప్రసరించునట్టిచూపు. మానితసంపదలు = గొప్పసంపదలను. ధర్మరాజుకటాక్షము ప్రసరించుమాత్రముచేతనే యాచకులు ధనికు లగుదు రని తా. గుణలతలు = గుణము లను తీఁగలు. వారాసుల = సముద్రములయొక్క. ధర్మరాజుకీర్తి సప్తసముద్రములు దాఁటి వ్యాపించియుండు నని తా. భూరి...తలుఁడు—భూరి=ఎక్కుడైన, ప్రతాప=పరాక్రమము అను, మహాప్రదీప = గొప్పదీపముచేత, దూర = దూరముగా, విఘటిత = పాఱఁదోలఁబడిన, గర్వఅంధకార = గర్వము అను చీఁకటిగల, వైరివీర = శత్రుశూరులయొక్క, కోటీర = కిరీటములయందలి, మణి = రత్నాలయొక్క, ఘృణి = కాంతులచేత, వేష్టిత = చుట్టఁబడిన, అంఘ్రితలుఁడు = అడుగులప్రదేశములు గలవాఁడు. ధర్మరాజు తనపరాక్రమముచే జయింపఁబడిన శత్రుశూరులచే నమస్కరింపఁబడినవాఁ డని తా. కేవలమర్త్యుఁడుఎ = సామాన్యమనుష్యుఁడా ?

192. మహాత్ముఁడు = గొప్పప్రభావము గలవాఁడు. వెడ = తుచ్ఛమైన. వాని మదిప్రీతికిన్ = వానియొక్క మనస్సంతోషమునకు. ఈడు=తగినది. అగువృత్తిన్ = అయిన యునికిచేత. పేరునుం బుట్టును మాలి = నామగోత్రములను విడిచి. బ్రుంగుడువాటునన్ = మణుఁగుపడుటను. పట్టున్ = నిలుచును.

ఉ. నీవలమూఁపులావు మును ♦ నేల వహించిననాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల ♦ కారయ నూఱటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ ♦ బండువు గాదె మహోగ్రకోపశే
ఖావిభవంబు వైరులకుఁ ♦ గాలముచేరువ గాదె పావనీ. 193

గీ. బకహిడింబకిమ్మీరుల♦బాహుబలము, నాజరాసంధునుగ్రద♦ర్పాతిశయము
లోకభీకరములు విజ♦యాకరములు, నైన నీకరములకు లో♦ నయ్యెఁ గాదె. 194

గీ. అట్టినీవు వంట♦కట్టియలకు లావు, సూపుచుండ నెప్డుఁ ♦ జూచి చూచి
వగతు నదియుఁ గాక ♦ తగ వేది యమ్మత్స్య, మేదినీశ్వరుఁడు వి♦నోదములకు.

మ. మహిషవ్యాఘ్రగజాదిసత్త్వచయముల్ ♦ మల్లవ్రజంబుం గృపా
రహితుండై యెదురొడ్డుచుల్ వరుసఁ బో♦రం జూచు నిన్నెప్పుడున్

ధృతి = ధైర్యము. ఎమ్మెయిన్=ఏప్రకారము. తూలక=చలింపక. అట్టి ధర్మరాజు ఒకసాధారణరాజు నన్నవస్త్రములకై యాశ్రయించి వానిమనస్సున కెక్కునట్లు చరించుచుఁ దన కులగోత్రములను విడిచి మఱుఁగుపడియుండుటచే నాకు మిక్కిలి దుఃఖముగా నున్న దని తా.

193. పావనీ! భీముని సంబోధనము. నీవలమూఁపులావు = నీకుడిభుజముయొక్క బలము. మును = పూర్వము. నేల = భూమిని. వహించిన నాగకూర్మగోత్రఅవనిభృత్ దిశాకరులకున్ = మోచిన యాదిశేషునకును తాఁబేటికిని కులపర్వతములకును దిగ్గజములకును. అరయన్ = ఆలోచింపఁగా, ఊఱటపట్టు కాదె= విశ్రాంతిస్థానము కదా. సంభావన= గౌరవించుట; భూజనంబులకున్ = భూమియందలి జనులకు. పండువు = ఉత్సవము. మహత్ ఉగ్రకోపశేఖావిభవంబు = మిక్కిలి భయంకరమయిన కోపముయొక్క విధముయొక్క యతిశయము. వైరులకున్ = శత్రువులకు. కాలముచేరువ= మరణసమయము. భీమసేనా! నీభుజబలముచేత భూమిని మోయునట్టి యాదిశేషుఁడు మొదలగువారు అలసటఁ దీర్చుకొందు రనియు, నీకు అనుగ్రహము కలిగిననో లోకమంతయు సంతోషించు ననియు, నీకుఁ గోపము గలిగినయెడ శత్రువులు మృతినొందుదు రనియుఁ దా.

194. అజరాసంధుఉగ్రదర్పఅతిశయమున్ = ప్రసిద్ధుఁడగు జరాసంధునియొక్క భయంకరమయిన గర్వముయొక్క యతిశయమును. లోకభీకరములున్ = లోకమునకు భయము గలిగించునవియును. విజయఆకరములున్=గెలుపునకుఁ జోటైనవియును. నీకరములకున్ = నీచేతులకు. లోను= లోఁకువ. నీవు బలవంతు లగు బకుఁడు మొదలగువారిని వధించినవాఁడ వని తా.

195. లావు=బలమును. వగతున్=దుఃఖింతును. తగవు ఏది = యుక్తత చెడి. వినోదములకున్= వేడుకకు. అట్టి నీవు వంటకట్టియలను విఱుచుటను జూచి మిక్కిలి దుఃఖించుచుందును. అంతియె కాక యావిరాటుఁడు వివేకము లేక వినోదములకై యని తా.

196. మహిషవ్యాఘ్రగజ ఆదిసత్త్వచయమున్ = దున్నలు పులులు ఏనుఁగులు మొదలుగాఁ గల జంతువుల సమూహమును. మల్లవ్రజంబున్ = జెట్లయొక్క సమూహమును. కృపారహితుండు ఐ = దయచే విడువఁబడినవాఁడై. ఎదురుఒడ్డుచున్ = మాఱొడ్డుచు. వరుసన్ = క్రమ

మహనీయం బగునీశరీరము జగన్మాన్యంబు నీచక్రియా
విహితం బైనకుజీవనంబు విధి గావించెం గటా దీనికిన్. 196

వ. అని మఱియు ని ట్లనియె వివేకహీనుం డగువిరాటుండు నిన్నుం బోరించునప్పుడు నిజాంతఃపురకాంతలకు వినోదంబు సేయ వారల రావించిన నేనును సుధేష్ణతో నరుగుదెంచి చూచుచుండుదు నయ్యవసరంబున. 197

క. భరమున నీపోరెడునెడఁ, బరమవిషాదంబు నీవు బలిమి మెఱసి యు
ద్ధురవృత్తి జయము గొనినం, బరితోషముఁ బొందు నన్ను భావించి మదిన్.

వ. ఊహించి సుధేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన. 199

క. వలలునిదెస మాలినిచూ, డ్కులతెఱఁ గెదపొందుఁ దెలిపెడుం గంటిరె వీ
రలు వచ్చినసమయంబును, దలఁపఁగ నొక్కటియ యివ్విధం బెట్లొక్కో. 200

ము గా. పోరఁగ = పోరుచుండఁగా. ఎపుడుఁగ. నిన్నుఁగ. చూచుఁగ అని యన్వయము. మహనీయంబు = పూజింపఁదగినది. జగత్ మాన్యంబు = లోకులచేఁ గొనియాడఁ దగినది. నీచక్రియావిహితంబు = నీచకార్యములచే విధింపఁబడినది. ఐన కుజీవనంబు = అయినట్టి కుత్సితజీవనమును. విధి = దైవము. దీనికిఁగ = ఈశరీరమునకు. కటా = అయ్యో. దున్నపోతులు మొదలగు జంతువులతోను మల్లులతోను పోరించుచు దయ లేనివాఁడై నిన్నుఁ జూచుచుండును. నీశరీరము లోకులు కొనియాడఁ దగినది. అట్టి యీశరీరమునకు దైవము నీచకార్యము చేయునట్టి జీవనము కలిగించెను గదా యని దుఃఖించుచుందు నని తా.

197. వివేకహీనుండు = తెలివిమాలినవాఁడు.

198. భరమునఁగ = కష్టముతో. నీపోరెడు ఎడఁగ = నీవు పోరునప్పుడు. పరమవిషాదంబుఁగ = ఎక్కుడు దుఃఖమును. బలిమి = పరాక్రమము. మెఱసి = ప్రకాశించి. ఉద్ధురవృత్తిఁగ = అధిక మగు వ్యాపారముచేత. పరితోషముఁగ = సంతోషమును. మదిఁగ = మనస్సునందు. భావించి = తెలిసి. నీవు కష్టపడి పోరునపుడు దుఃఖమును నీవు జయము గలిగినపుడు సంతోషమును పొందునట్టి నన్నుఁ జూచి మనస్సునందు అని తా.

199. తత్ పరిజనంబులుఁగ = ఆ సుధేష్ణపరివారములును.

200. వలలునిదెసఁగ = వలలునియందు. మాలిని చూడ్కులతెఱఁగు = మాలినియొక్క చూపులవిధము. ఎదపొందుఁగ = మనస్స్నేహమును. వీరలు—వలలుఁడును మాలినియును. వలలుని మాలిని చూచువిధము చూడఁగా వీరల కిద్దఱకును మనస్సులో ననురాగ మున్నట్లు తోఁచుచున్నది. వీరిద్దఱును నిచటికి ఏకకాలముననే వచ్చినవారు, దీని వాస్తవ మేమో తెలియవలయు నని తా. ఇందుఁ బ్రథమాశ్వాసమునందు విరాటగృహముఁ బాండవులందఱును చేరినపిదప ద్రౌపది చేరినట్లు చెప్పఁబడినది. సంస్కృతమునందు భీమునియనంతరము ద్రౌపది చేరినట్లు వర్ణింపఁబడినది. కావున నీపద్యమునందు వీరలు వచ్చినసమయంబు నొక్కటియ యనుట సంస్కృతగ్రంథమునకుమాత్రమే యనురూప మని తెలియవలయు. "అస్మి న్రాజకులే చోభౌ తుల్యకాలనివాసినౌ" అని సంస్కృతము.

వ. అనుచుం గలదు లే దని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలు వోవుచుండుదు రట్టియెడ. 201

గీ. మరగి నీమూర్తిపైఁ గన్ను ♦ మనముఁ దగిలి, యుండ నేమఱియుండి యే ♦ నొక్కమాటు
తలఁచికొని వారిదెసమది ♦ నిలుపునప్పు, డెఱుఁగ నగువారు నాతెఱఁ ♦ గెఱుఁగు టెల్ల.

వ. కావున మదీయపరిభవాతిరేకంబునకు నీ వుద్రేకించిన జనంబులు మనల భేదింతురు
నీకుం బోలినభంగి రహస్యభంగంబు గాకుండ నరిభంగంబు సేయు మని వెండియు.

సీ. తొడరినహరు నైన ♦ దోర్బలంబునఁ దన్ను, మిగులంగ నీఁ డను ♦ మేటిమాట
యమరేంద్రునర్ధాస ♦ నమునకు నైన న, ర్హుం డెంతయును నను ♦ రూఢిమాట
జమునిల్లు సొచ్చిన ♦ జంతువు నైనను, గాచు నెమ్మెయి నను ♦ రాచమాట
తనుఁ గోరి యూర్వశి ♦ దాన వచ్చిన నైన, లోలుండు గాఁ డను ♦ మేలిమాట
శౌర్యవైభవప్రాభవ ♦ శౌచములకు, నొరుల కైనఁ గైవార మై ♦ యుల్లసిల్లు
నొక్కరుని కివి యెల్లను ♦ నిక్క మట్టె, యెందుఁ గలుగునె యర్జును ♦ నీడువాఁడు.

201. గుజగుజలుపోవుచుండుదురు = సంశయపడుచుందురు.

202. మరగి = ఆశపడి. నీమూర్తిపైన్ = నీదేహముమీఁద. వారిదెసన్ = ఆసుదేష్ణ మొదలగు వారివైపున. నిన్ననురాగముతోఁ జూచుచుఁ గొంతసేపు మఱచియుండి యంత జ్ఞప్తి తెచ్చుకొని యా సుదేష్ణ మొదలగువారిని నేను జూచునప్పుడు వారు నావిధమునే చూచుచుండినట్లు నాకుఁ దెలియ వచ్చె నని తా.

203. మదీయపరిభవ అతిరేకంబునకున్ = నాయొక్క యవమానముయొక్క యతిశయమునకు. ఉద్రేకించినన్ = విజృంభించినయెడ. అరిభంగంబు = శత్రువధమును.

204. తొడరిన హరున్ ఐనన్ = ఎదిరించిన శివునిఁగూడ. దోర్బలంబునన్ = చేతులలావు చేత. మిగులంగన్ ఈఁడు = మీఱనియ్యఁడు. అను మేటిమాట = అను గొప్పపలుకు. అమర ఇంద్రు అర్ధఆసనమునకున్ ఐనన్ = దేవేంద్రుని యర్ధసింహాసనమున కైనను. ఎంతయును = మిక్కిలి. అర్హుండు = తగినవాఁడు. అనురూఢిమాట = అనునట్టి నిశ్చయ మయిన పలుకు. జము ఇల్లుచొచ్చిన జంతువున్ ఐనను = యమునియింటికిఁ బోయిన ప్రాణి నైనను. ఎమ్మెయిన్ = ఏవిధ ముచేత నైనను. అనురాచమాట = అనునట్టి మంచిపలుకు. లోలుండు = చపలుఁడు. శౌర్యవైభవ ప్రాభవశౌచములకున్ = పరాక్రమమునకును నైశ్వర్యమునకును ప్రభుత్వమునకును నాచారమునకును, నాలుగు సీసపాదములకును శౌర్యాదులు నాలిగింటితోఁ గ్రమాన్వయము. ఒరులకున్ ఐనన్ = ఇతరుల కైనను. కైవారమై = స్తోత్రమై. ఉల్లసిల్లున్ = ప్రకాశించును. ఒక్కరునికిన్ = ఒకనికి. నిక్కము = నిజము. అట్టె = ఆశ్చర్యము. అర్జును ఈడువాఁడు = అర్జునునికి సమానుఁడు. హరుని నెదిరించి జయించిన శౌర్యమును, దేవేంద్రుని యర్ధాసనంబు నధిష్ఠించిన యైశ్వర్యమును, యమలోకము నొందిన జంతువును గాపాడిన ప్రభుత్వమును, తనయంత వలచివచ్చిన యూర్వశికి లోఁబడక యుండు శౌచ మును, ఇవి యన్నియుఁ గల యర్జునునకు సమానుఁడు ఎవ్వఁడును లేఁ డని తా.

క. ఆపార్థుఁడు భరతాన్వయ, దీపకుఁ డమరేంద్రసుతుఁడు ♦ తేజోనిధి వి
ద్యాపారగుండు వినుత, వ్యాపారుం డాపదలకు ♦ నగ్గం బయ్యెన్. 205

చ. అరయ నతండు మానధనుఁ ♦ డక్కట రంగమునందు నిల్చి సుం
దరులకు నాట సూపెడువి♦ధం బతిదీనము దానిఁ జూచి యేఁ
బురపురఁ బొక్కుదుం గడుపుఁ ♦ బ్రోచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం
జొర నగువాఁడె దేవపతి♦సూనుఁడు దైవము చేతఁ జూచితే. 206

చ. మగలకు మేటి యైనబల♦మర్దననందనుఁ బేడిఁ జేయఁగాఁ
దగునె విధాత నీకు నని ♦ దైవము దూఱుదు నోర్వ రాని నె
వ్వగ దలకొన్న నెంతయును ♦ వందుదు నిద్దురవస్థ యెన్నఁడో
తెగు నని సంతతంబును మ♦దిం దలపోయుదు నేమి సేయుదున్. 2.7

సీ. తనయొప్పెదురఁ గన్నఁ ♦ దగిలి యెవ్వరికైన, మలఁగి క్రమ్మఱఁ జూడ♦వలయువాఁడు
తనవర్తనము విన్న♦ మునిజనంబుల కైన, నలవరించికొనంగ ♦ వలయువాఁడు

205. ఆపార్థుఁడు = ఆయర్జునుఁడు. భరత అన్వయ దీపకుఁడు = భరతవంశమును వెలిఁగించువాఁడు. అమర ఇంద్రసుతుఁడు = ఇంద్రుని కొడుకు. తేజః నిధి = పరాక్రమమునకు గని. విద్యాపారగుండు = ఎల్లవిద్యల తుద ముట్టినవాఁడు. వినుతవ్యాపారుండు = పొగడఁబడిన నడవడి కలవాఁడు. అగ్గంబు = అధీనుఁడు. అట్టి యర్జునుఁడుగూడ నాపదలం జిక్కినాఁ డని తా.

206. మానధనుఁడు = మానమే ధనముగాఁ గలవాఁడు. రంగమునందున్ = నాట్యశాలయందు. సుందరులకున్ = స్త్రీలకు. అతిదీనము = మిక్కిలి నీచము. లఘువృత్తికిన్ = నీచవృత్తికి. చొరనగువాఁడుఎ = ప్రవేశించువాఁడా? దేవపతిసూనుఁడు = దేవేంద్రునికొడుకు. దైవము చేతన్ = దైవకార్యమును. అట్టి యర్జునుఁడు కన్నియలకు రంగమునందుండి యాట నేర్పుటను జూచి నేను మిక్కిలి దుఃఖము పొందుదును. దేవేంద్రునికొడుకువంటివానిని ఇట్టి నీచవృత్తి నవలంబించునట్లు దైవము చేసె నని తా.

207. మగలకున్ = మగవారిలో. బలమర్దననందనున్ = ఇంద్రుని కుమారుఁ డైన యర్జునుని. విధాత = దైవమా! నెవ్వగ = నిండుదుఃఖము. వందుదున్ = పరితపింతును. ఇద్దురవస్థ = ఈకష్టము. పురుషశ్రేష్ఠుఁ డయిన యర్జునుని నపుంసకునిఁగాఁ జేయుట నీకుఁ దగ దని దైవమును నిందింతును, దుఃఖము అతిశయించినప్పుడు మిక్కిలి దుఃఖింతును, ఈకష్ట మెన్నఁడు తీఱునో యని యెల్లపుడు చింతించుచుందు నని తా.

208. ఒప్పు = చక్కఁదనమును. తగిలి = ఆసక్తినొంది. మలఁగి = మరలి. క్రమ్మఱన్ = మఱియొకతడవ. నకులుని చక్కఁదనము చూచినవారు మాటిమాటికి నతనిని చూడఁ గోరుచుందు రని తా. తనవర్తనమున్ = తన నడవడిని. అలవరించికొనంగన్ = అలవాటు పఱచుకొనుటకు. నకులుని నడవడిని చూచి ఋషులుకూడ మంచినడవడి నేర్చుకొందు రని తా. బంటుతనము = శౌర్యమును. ఆజిన్ = యుద్ధమునందు. మార్తురకున్ = శత్రువులకు. అగ్గింపన్ = పొగడుటకు.

తనబంటుతన మాజిఁ ♦ గనిన మాత్సర కైనఁ, బలుమాఱు నగ్గింప ♦ వలయువాఁడు
తనవితరణకేలి ♦ వినినఁ గల్పకతరు, వుల కైనఁ దలయూఁప ♦ వలయువాఁడు
నకులుఁ డొరులకు నశ్వశి♦క్షకుఁడు గాఁగ, నగునె యాతనిదుస్థితి♦ యనుదినంబుఁ
గాంచి కన్నీరడంచుచుఁ ♦ గడవరాని, దైవఘటనకు నొత్తుఁ జి♦త్తంబులోన. 208

శా. ఆరూపం బవికార మాభుజబలం ♦ బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబు దయానుసాగరత మా♦శుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం ♦ బాయీగి సన్మానవి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడు కే♦తన్మాత్రుఁడే చూడఁ గన్. 209

క. సుకుమారుఁ డతఁడు గోపా, లకవృత్తి వహించి యడవు♦లం గ్రుమ్మరు చు
న్కికి నాక కాదు పగవా, రికి నైనను నకట మన మెఱియదే వగలన్. 210

ఉ. ఏనును మీరుఁ గానలకు ♦ నేగునెడ న్ననుఁ జేరి యెంతయున్
దీనత దోఁపఁ గుంతి సహ♦దేవుని నిల్లడ పెట్టి నాకు న

నకులుని శౌర్యమును మాచి శత్రువులుకూడ మెచ్చుకొందు రని తా. వితరణకేళి = దానవిలాసమును. నకులుని దానమును కల్పవృక్షములు కూడఁ బొగడఁ దగు నని తా. అశ్వశిక్షకుఁడు = గుఱ్ఱముల శిక్షించువాఁడు. అనుదినంబున్ = ప్రతిదినమును. కడవన్ = అతిక్రమించుటకు. రాని దైవఘటనకున్ = రానట్టి దైవము చేతకు. నొత్తున్ = దుఃఖింతును. అట్టి నకులుఁడు ఇతరులయొద్ద అశ్వశిక్ష సేయుచుఁ గష్టపడుచున్నట్లు చేసిన దైవమునుగుఱించి కన్నీ రడంచుకొని మిక్కిలి దుఃఖింతు నని తా.

209. అవికారము = మాఱుపాటులేనిది. అత్యంతనిర్గర్వము = మిక్కిలి గర్వము లేనిది. దయానుసారగతము = దయయొక్క యనుసరించి యుండుటను పొందినది. ఆశుంభత్క్రియాజ్ఞానము = ఆయొప్పుచున్న కార్యముయొక్క తెలివి. ఆర్యఆరంభప్రతికూలవాదరహితంబు = పెద్దలయొక్క ప్రవృత్తికిఁ బ్రతికూలవాదము లేనిది. ఈగి = దానము. సమ్మానవిస్తారఉదాత్తము = గౌరవించుటయొక్క యతిశయించుటచే గొప్పది. ఏతన్మాత్రుఁడుఏ = ఇంతమాత్రపువాఁడా? గొప్పవాఁ డనుట. గంభీర మయిన రూపమును, గర్వములేని పరాక్రమమును, దయతోఁ గూడిన శౌర్యమును, పూజ్యులతోఁ బ్రతికూలవాదము లేని విద్యయును, సమ్మానపూర్వక మయినదానమును గల సహదేవుని మహిమ యింత యని చెప్ప నలవిగా దని తా. పాఠాం:—దయారసానుగతము = దయారసము నను సరించినది. వ్రాఁతప్రతుల పెక్కింటియందుఁ బూర్వపాఠమే యున్నను ఈపాఠ మంతకంటె మిన్న యయినది.

210. సుకుమారుఁడు = కోమలుఁడు. గోపాలకవృత్తిన్ = గొల్లవానిపనిని. ఎరియదుఏ = పరితాపము నొందదా? పాఠాం:—ఉరియదే—అర్థము సమానము. సుకుమారుఁ డయిన యీసహదేవుఁడు అవుల మేపుచు నడవులందుఁ దిరుగుట శత్రువులకుఁ గూడ సంతాపము కలిగించు నని తా.

211. కానలకున్ = అడవులకు. దీనత = దైన్యము. విషమంబు = కష్టము. అశ్రులు = కన్నీళ్లు. మనము అడవికిఁ బోవునపుడు కుంతి సహదేవుని చక్కఁగా రక్షింపు మని నాకొప్పగించి

మ్మా నిను నమ్మి చాల విష♦మం బగునివ్వనవాస మీతఁడుం
బూనఁగ నియ్యకొంటి నని ♦ బోరన నశ్రులు గ్రమ్ము చుండఁగన్. 211

వ. మఱియును. 212

చ. కడుఁ బసిబిడ్డ వీఁ డొకటి ♦ కా దవు నా నెఱుఁగండు ముందఱె
న్నెడ నొకపా టెఱుంగఁ డెద ♦ యెంతయుఁ గోమల మెప్పు డైన నేఁ
గుడువఁగఁ బిల్తుఁ గాని తన♦కుం గలయాఁకటిప్రొ ద్దెఱుంగఁ డీ
కొడు కిటు పోకకు న్మనము ♦ గుందెడు ని న్గని యూఱడిల్లెడున్. 213

సీ. ఎప్పు డెయ్యెడ నేమిట ♦ నెట్టు లరయు, వలయు నెమ్మెయి నారయు ♦ మలసి డస్సి
నొచ్చి నైనను నేమఱ ♦ కిచ్చఁ దలఁచి, తడవి నాచేత దీవన ♦ వడయు మమ్మ.

వ. అని యుప్పగించె నేనును వనవాస కాలంబున నానేర్చువిధంబున మీకు నెల్లను గారా మైనతమ్ముని నమ్మెయిం బరికించికొని వచ్చితి నిపు డజ్ఞాతవాసాయాసితుం డగునతని నాకు ననుసరింప వెరవు గామిం జేసి చేయునది లేక చింతిల్లుచున్న దాన నా తెఱంగు వినుము. 215

సీ. ప్రమదభూవిభుఁడు పు♦త్రులకంటె నెంతయుఁ, బెంపు సేయుచు గార♦వింపఁ బెరిఁగి
కుంతీమహాదేవి ♦ కోడండ్రలోపల, నగ్గలంబుగఁ గొని♦యాడఁ బరఁగి

నాతో నిట్లనియె. ఈకష్ట మయినవనవాసమును ఈసహదేవుఁడు చేయుటకు నేను నిన్ను నమ్మి యంగీకరించితిని. అని కన్నీరుగార్చుచు నని తా.

213. నాన్ = అనుటకు. ఒకపాటు = ఒకకష్టమును. ఎద = హృదయము. ఇటుపోకకున్ = ఇట్లు అరణ్యమునకుఁ బోవుటకు. మనము = మనస్సు. కుందెడున్ = తపించుచున్నది. సహదేవుఁడు మిక్కిలి చిన్నవాఁడు, తనకుఁ గావలసిన దిది యని చెప్పుటకుఁ దెలియనివాఁడు, ఇతఁ డెప్పుడు నేకష్టమును పడినవాఁడు కాఁడు, మిక్కిలి మెత్తనిమనస్సు గలవాఁడు, తన యాకలికూడఁ దెలియనివాఁడు, ఇతఁ డిట్లు వనమునకుఁ బోవుటకు దుఃఖ మగుచున్నది. అయినను నిన్నుఁ జూచి నెమ్మది నొందుచున్నా నని తా.

214. ఏమిటన్ = ఏవిషయమునందు. అరయును = విచారింపును. అలసి = విసిగి. డస్సి = శ్రమపడి. ఇచ్చన్ = మనస్సునందు. తడవి = రక్షించి. నీ కెంతకష్ట మయిన నుపేక్షింపక యేకాలమునం దేవిషయమున నెట్లు విచారింపవలయునో యట్లు విచారించి సహదేవుని రక్షించి నాయాశీర్వాదమును పొందు మని తా.

215. నానేర్చువిధంబునన్ = నేను నేర్చినట్లు. గారాము = ప్రియము. అమ్మెయిన్ = ఆవిధమున. పరికించికొని = చూచికొని. అజ్ఞాతవాస ఆయాసితుండు = అజ్ఞాతవాసముచేఁ గష్టపెట్టఁబడినవాఁడు. వెరవు = యుక్తము.

216. పెంపు = గొప్పతనము. అగ్గలంబుగన్ = అధికముగా. పరఁగి = ఒప్పి. నెయ్యంబు = స్నేహము. తియ్యంబు = ప్రీతి. నెఱపన్ = నిండింపఁగా. అనిశంబు = ఎల్లప్పుడును.

ప్రాణంబులకు నెల్లఁ ♦ బ్రాణంబుగా మీకు, నెయ్యంబు తియ్యంబు ♦ నెఱప నడచి
మదిఁ దల్లిదండ్రుల♦మాఱుగాఁ గొని జను, లనిశంబు భక్తి సే♦యంగ నెగడి
రూపగుణవిక్రమంబులఁ ♦ రూఢి కెక్కు, నట్టికొడుకులఁ గని భర♦తాన్వయంబు
నందు నాయిల్ల యిల్లుగా ♦ నతిశయిల్లి, తగవుమైఁ బాంధవులచేతఁ♦బొగడు వడసి.

మ. వినుతింపం దగు రాజసూయమునఁ బృ♦థ్వీదేవతాకోటి కె
ల్లను సంతృప్తి యొనర్చి వారిదయఁ గ♦ల్యాణాత్మనై పుణ్యవ
ర్తన పాండుక్షితిపాలుకోడ లనఁగా ♦ రాజన్యమాన్యప్రియాం
గనలం దెల్లఁ బొగడ్త గంటి నతిలో♦కం బైనమీమన్ననన్. 217

ఉ. ఏను మనంబు పెంపు సెడి ♦ యిప్పుడు నీచతరప్రకారముం
బూని నికృష్టనై యుదర♦పోషణకై తగ వేది యెంతయున్
దీనతఁ బొంది యిమ్మెయి సు♦దేష్ణపనుల్ గనుసన్నఁ జేయుచున్
హీనత నున్కి మీకు వగ ♦ పేమియుఁ జేయద యేమి సేయుదున్. 218

రూపగుణవిక్రమంబులన్ = చక్కఁదనముచేతను గుణముచేతను బరాక్రమముచేతను. రూఢికిన్ = ప్రసిద్ధికి. భరతఅన్వయంబునందున్ = భరతవంశమునందు. తగవుమైన్ = న్యాయముచేత. నేను మా తండ్రి యగుద్రుపదరాజుచేతఁ గొడుకులకన్న నెక్కుడుగా లాలింపఁబడుచుండి నాయత్తగారిచేఁ గోడండ్రలో నెక్కువగా నెన్నఁబడుచుండి మీచేత మిక్కిలి ప్రేమతో నాదరింపఁబడుచుండి ప్రజలచేఁ దల్లిదండ్రులవలెఁ జూడఁబడుచుండి యుత్తము లగు కొడుకులను గని భరతవంశమునందు నావంటిభాగ్యవతి లేదని పేరుఁబొంది బంధువులపొగడ్తను గాంచి యని తా.

217. వినుతింపన్ = పొగడుటకు. పృథ్వీదేవతాకోటికిన్ = బ్రాహ్మణుల సమూహమునకు. కల్యాణఆత్మను ఐ = మంగళరూపము గలదాననై. పాండుక్షితిపాలుకోడలు = పాండురాజుకోడలు, ద్రౌపది. పుణ్యవర్తన = పరిశుద్ధ మయిన యాచారము గలది. రాజన్యమాన్యప్రియఅంగనలందున్ = రాజులయొక్క గౌరవింపఁదగిన కూరిమిభార్యలయందు. అతిలోకంబు = లోకము నతిక్రమించినది. మీమన్ననన్ = మీయాదరముచేత. పొగడ్త. కంటిన్. అని యన్వయము. రాజసూయయాగము చేసి బ్రాహ్మణులకు దానమానములచేఁ దృప్తి కావించి వారి దీవన పొందినదాననై పాండురాజుకోడలు ద్రౌపది రాజస్త్రీలయం దెల్లను నుత్తము రా లని గౌరవము పొందినదాన నని తా.

218. మనంబుపెంపు = మానము. నీచతరప్రకారమున్ = మిక్కిలి నీచమయిన విధమును. నికృష్టను ఐ = నీచురాలనై. ఉదరపోషణకై = పొట్టఁబోసికొనుటకై. తగవు = న్యాయము. ఏది = చెడి. హీనతన్ = తక్కువతనముచేత. వగపు = దుఃఖమును. చేయదుఅ = చేయనేచేయదు. ఇట్టి నేను ఇపుడు మానము విడిచి పొట్టఁబోసికొనుటకై నీచ మగుపరిచారికావృత్తి నవలంబించి దీనురాలనై సుధేష్ణపం బనులు సేయుచు నిట్లు హీనముగానున్నను మీరు చూచుచు దుఃఖము లేక యున్నారు, ఏమి చేయుదు నని తా. ప్రథమపాదమునందు "నీచరతప్రచారమున్, నీచతనమ్ము నిమ్ములన్" అని పాఠాంతరములు.

క. పని వంపఁ గాని యొకతకుఁ, బని సేయ నెఱుంగ నన్నుఁ ♦ బనిగొను నెడఁ బాం
డునియగ్రమహిషి గొంకుచుఁ, బని గఱపెడుచందమునన ♦ పనుచు టెఱుఁగవే.

ఉ. ఒల్లరు రాజు దేవులును ♦ నొడ్డులు రాచినచందనంబు మే
నెల్లఁ జెమర్పఁగా నలయ ♦ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య
ల్లల్లన మార్దవం బొనరు♦నట్లుగ నెట్టకునేని రాచి మీ
తల్లికి భక్తిఁ బెట్టెడువి♦ధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుచున్. 220

ఉ. సన్నఁదనంబుగా నలుఁగు ♦ నూఱుటయుం జందన మ్మొగిన్ రాచియుం
బన్నుగఁ గ్రొత్తలైన కల♦పంబులు గూర్చియు నాసుదేష్ణకుం
గన్నులసన్నలం బనులు ♦ కైకొని వారక చేయుచుండుటన్
ము న్నటు లున్న పాణితల♦ముల్ బలుకాయలు గాచెఁ జూచితే. 221

క. అనుచుం దొరఁగెడునశ్రుల, మునిఁగినమో మాతనివక్ష♦మునఁ జేర్చిన న
వ్వనితయవస్థయ తాల్చుచు, ననిలసుతుం డడలె డెంద ♦ మలమటఁ బొందన్.

219. పంపన్=ఆజ్ఞాపించుటకు. పనిగొను నెడన్=పనులు చేయ నియోగించునప్పుడు. పాండుని అగ్రమహిషి = పాండురాజు పట్టపుదేవి. గొంకుచున్= సంకోచించుచు. కఱపెడు చందమునన్=నేర్పువిధముననే. పనుచుట = ఆజ్ఞాపించుటను. నే నొకరిచేతఁ బని చేయించుకొన్నదాననే గాని యొకరికిఁ బని చేసినదానను గాను. కుంతియు నాకుఁ బని చెప్పునపుడు సంకోచించి నాకుఁ బని నేర్పునట్లు చెప్పుటను నీవెఱుఁగుదు వని తా.

220. ఒడ్డులు= ఇతరులు. రాచినచందనంబు= నూఱినగంధమును. రాజున్ = విరాటుఁడును. దేవులునున్ = రాణియును. ఒల్లరు అని యన్వయము. మేను = దేహము. అలయక = విసువక. అల్లల్లనన్ = మెల్లమెల్లగా. మార్దవంబు = మెత్తఁదనము. ఒనరునట్లుగన్ = కలుగునట్లుగా. ఎట్టకునేనిన్ = అతిప్రయాసముచేత. రాచి= నూఱి. విరాటుఁడును నతనిభార్యలును నితరులు నూఱిన గంధమును పూసికొనరు. నేను దేహమంతయు చెమటపట్టునట్లు మిక్కిలి కష్టముతో నడుమ నిల్చినిల్చి మెత్తగా గంధము నూఱి మీతల్లి కిచ్చునట్లు వారి కిచ్చి దైవమును దూఱుచు నని తా.

221. సన్నగన్ = చక్కఁగా. కలపంబులు = వాసనలను. వారక = విడువక. అటులు= ఆప్రకారము. మిక్కిలి మృదువుగా ననుట. పాణితలముల్ = అఱచేతులు. బలుకాయలు = పెద్దకాయలు. సన్నగా నలుఁగు నూఱుట మొదలగు పనుల నెల్లప్పుడు చేయుచుండుటచేత మిక్కిలి మెత్తనివి యగు నాయఱచేతులు ఎట్లు కాయలు కాచియున్నవో చూడు మని తా.

222. తొరఁగెడు అశ్రులన్ = కాఱునట్టి కన్నీళ్లచేత. అతనివక్షమునన్ = ఆభీముని ఱొమ్మునందు. అవ్వనితఅవస్థ = ఆద్రౌపదియొక్క యవస్థనే. అనిలసుతుండు = భీముఁడు. డెందము= మనస్సు. అలమటన్ = చింతను. పొందన్. అడలెన్ = ఏడ్చెను. ఇట్లు చెప్పుచు కన్నీటిచేఁ దడిసిన ముఖమును భీముని ఱొమ్మునం జేర్పఁగా నాతఁడు నామెవలెఁ గన్నీరు గార్చుచు మనంబునఁ జింత నొంది యేడ్చె నని తా.

గీ. అట్టియెడఁ దన్నుఁ దాన యూ♦రార్చికొనుచు
నంబుజాననమొగ♦ మల్లఁ దుడిచి
యనునయించి తత్కరములు♦ దనమొగంబుఁ
గదియఁ జేర్చుచు నిట్టూర్పు♦గాడ్పు నిగుడ. 223

వ. చింతాక్రాంతుం డైనకౌంతేయునకు నయ్యింతి యిట్లనియె. 224

గీ. ఇందఱకు నిన్నిభంగుల♦ నిడుమ గుడువ, నలసె ధర్మతనూజప్ర♦వలనఁ జేసి
దాయ లొడ్డినమాయజూ♦దంపుటురులఁ, బడి కులంబున కాతఁ డి♦ప్పాటు దెచ్చెఁ.

ఉ. అక్కట మోసపోయి యడి♦యాసలఁ జావక యున్నదాన ము
న్నొక్కరి నే దురంతదురి♦తోత్కటబాధలఁ బెట్టి యున్న నా
కెక్కడిదుఃఖశాంతి గడ♦ యీఁదుట యెమ్మెయిఁ గల్గ నేర్చు మీ
ముక్కున నూర్పు గల్గ నొక♦దుష్టునిచేఁ బడితిన్ సభాస్థలిన్. 226

క. మీ రేమి సేయుదురు దై, వారంభము గాక శుభము♦ నశుభంబులు సం
సారులకుం దమతఱి నని, వారణఁ బొందంగ రావు♦ వచ్చునె వానిన్. 227

223. అంబుజఆననమొగము = ద్రౌపదియొక్క చక్కనిముఖమును. అల్లన్ = మెల్లగా. అనునయించి = ఊరడించి. తత్కరములు = ఆమె చేతులను. కదియన్ = దాఁపున్. నిగుడన్ = వ్యాపింపఁగా. అప్పుడు భీముఁడు తనకుఁ గలిగిన దుఃఖమును దానే యడంచికొని ద్రౌపదిముఖమును మెల్లగాఁ దుడిచి యామెచేతులను దనముఖంబునం జేర్చి నిట్టూర్చు నని తా.

224. చింతాఆక్రాంతుండు = చింతచేఁ జుట్టఁబడినవాఁడు. కౌంతేయునకున్ = భీమునితో.

225. ఇన్నిభంగులన్ = ఇన్నివిధములచేత. ఇడుము = కష్టమును. గుడువవలసెన్ = అనుభవింపవలసివచ్చెను. ధర్మతనూజప్రవలనఁజేసి = ధర్మరాజువలన. దాయలు = శత్రువులు. జూదంపు ఉరులన్ = జూదము అను వలలయందు. ఇప్పాటు = ఈకష్టమును. ధర్మరాజుచేత మనమందఱము నిన్నివిధముల కష్టపడవలసివచ్చెను. శత్రువులు చేసిన కపటప్రజూదమునకు మోసపోయి యీధర్మరాజు ఇట్టిస్థితి మనకుఁ దెచ్చె నని తా.

226. మున్న = పూర్వజన్మమునందు. దురంతదురిత ఉత్కటబాధలన్ = కడలేని పాపము గల యెక్కువకష్టములను. పెట్టి = పఱచి. ఉన్నన్ = ఉండఁగా. కడ = అంతమును. ఈఁదుట = దాఁటుట. ఊర్పు = ఊపిరి. నేను ఎన్నఁటికైనను నీకష్టములు తీఱు ననెడి యాసలచేఁ జావక యున్నదానను, తొల్లి నేనెవ్వరికో నానాకష్టములను గలిగించి గొప్పపాపము చేసియుండఁగా నిప్పుడు నా కెట్లు దుఃఖము పోవును. ఇది యిట్లుండఁగా మీరు బ్రదికియున్నప్పుడే యొకదుష్టుఁడు సభాస్థలమునందు నన్ను అవమానించె నని తా.

227. దైవఆరంభము = దైవముయొక్క ప్రయత్నము. తమతఱిన్ = తమకాలమునందు, శుభకాలమునందును అశుభకాలమునందును ననుట. అనివారణన్ = అడ్డు లేక. ఇది దైవసంకల్పమే గాని మీరు చేసినది కాదు, సంసారులకు శుభాశుభములు తమతమసమయములందుఁ బూర్వకర్మానురూపముగా వచ్చును. వానిని వారింప శక్యము కా దని తా.

ఉ. కావున మీర లభ్యుదయ◆గౌరవ మొందుట యాత్మఁ గోరి యే
నేవిధి నైన నాపదల◆ కెల్లను నోర్చెద దాని కేమి యీ
కావర మైనకీచకుఁడు◆ కామనిపీడితుఁ డై యలంతులం
బోవక వేఁచి పట్టుకొనఁ◆ బోయినఁ దూలెదఁ గాక యిమ్మెయిన్. 228

గీ. వానిఁ దెగఁజూడ వైతేని◆ వాయుపుత్త్ర, నీవు గనుఁగొన నురినైన◆ నీరనైన
నగ్ని నైన విషంబున◆ నైన నేను, మేను దొఱఁగుదు నెట్టు నీ◆యాన సుమ్ము.

వ. అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు ని ట్లనియె. 230

చ. జలజదళాక్షి కీచకునిఁ◆ జంపుట కిమ్మెయి ముట్టఁ బల్కఁగా
వలయునె యేను జూడ ననివారణ నిన్నుఁ బరాభవించి వాఁ
డిల మన నింక నాండ్రకును◆ నెవ్వరు భంగము నీఁగఁ జాలువా
రలఘుమదీయబాహుబల◆ మప్పుడ చూపనితప్పు చాలదే. 231

గీ. ఎల్లి యెల్లవిధంబుల◆ నెందుఁ జొచ్చె, నేని నాధర్మతనయుండు◆ దాన వచ్చి
యడ్డపడెనేని నీవ పెం◆పారుకరుణఁ, గాచితేని నాచేఁ జచ్చుఁ◆ గీచకుండు. 232

228. అభ్యుదయ గౌరవము = శుభముయొక్క యతిశయమును. ఆత్మన్ = మనస్సునందు. ఏవిధిన్ ఐనన్ = ఏవిధముచేత నైనను. ఐనకీచకుఁడు = కలిగిన కీచకుఁడు. కామనిపీడితుఁడు ఐ = మన్మథునిచేఁ బీడింపఁబడినవాఁడై. అలంతులన్ = అల్పములచేత. వేఁచి = బాధించి. తూలెదన్ = చలించెదను. కాఁబట్టి మీ రెల్లైనను శుభము పొందుటకై నే నెన్నికష్టములనైనను సహించుచున్నదానను, కాని యీదుష్టకీచకుఁడు న న్నిట్లు బాధించుట కోర్వఁజాల కున్నదాన నని తా.

229. వాయుపుత్త్ర! భీముని సంబోధనము. మేను = దేహమును. తొఱఁగుదున్ = విడుతును. నీవు ఆకీచకుని వధింపనియెడ నీయెదుటనే తప్పక ప్రాణములు విడుతు నని తా.

230. వృకోదరుండు = భీముఁడు.

231. జలజదళఅక్షి = కమలములవంటి కన్నులు గల ద్రౌపదీ! ముట్టన్ = తాఁకునట్లు. అనివారణన్ = అడ్డులేక. పరాభవించి = అవమానించి. వాఁడు = ఆకీచకుఁడు. ఇలన్ = భూమియందు. మనన్ = బ్రదికినయెడ. ఆండ్రకున్ = భార్యలకు. భంగమున్ = అవమానమును. ఈఁగన్ = తొలఁగించుటకు. అలఘు మదీయబాహుబలము = గొప్పదైన నాయొక్క భుజబలమును. కీచకుని చంపుట కిట్లు నీవు తాఁకనాడవలసినది లేదు, నేను జూచుచుండునపుడు వాఁడు ని న్నవమానించియు మరల భూమియందు బ్రదికియుండెనేని భార్యల నవమానించినవానిని శిక్షించువా రిఁక నెవ్వరున్నారు? అప్పుడే నేను వానిని శిక్షింపకుండుట పెద్ద తప్పని తా.

232. ఎల్లి = రేపు. అధర్మతనయుండు = ఆధర్మరాజు. పెంపుఆరుకరుణన్ = అతిశయించినదయచేత. కాచితివేనిన్ = రక్షించినను. రేపు కీచకుఁ డెచ్చటికిఁ బోయినను ధర్మరాజు అడ్డపడినను నీవే దయ గలిగి కాపాడుమన్నను నేను తప్పక కీచకుని వధింతు నని తా.

వ. వానిదెసం జింత యావంత వలవ దస్మాటలు వినుము అని యాజ్ఞసేనిం బలికి దుర్దశల నలందురునవ్వాలంది డెందంబుకుందు పాపం దలంచి యిట్లనియె. 233

సీ. చ్యవనునివాంఛకు ♦ సంయాతికన్యక, యిడుమలఁ గుడువదె ♦ యడవిలోన
రాఘవుతోడ న♦రణ్యవాసము చేసి, సంతాప మందదె ♦ జనకతనయ
కుంభసంభవునకై ♦ ఘోరదుర్గములలో, పాముద్ర యలజడి♦పాలు గాదె
నలునిపిఱుందఁ గా♦నల కేగి దమయంతి, మనుజులు పడని యు♦మ్మలిక పడదె
వారు సైరణ సేసి దు♦ర్వార మైన, నిరతిశయదుఃఖభారంబు ♦ నిస్తరించి
సౌఖ్య మొందరె నీవు నా♦చందమునన, యాపదల నోర్చి సంపద ♦ లనుభవింపు.

వ. దుర్యోధనదుశ్శాసన కర్ణశకుని సైంధవప్రముఖంబగుదుష్టలోకంబు నధోలోకంబున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాభరభుగ్నంబును నవమానపంక నిమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్న యది ధార్తరాష్ట్రులకుం గాలావసానం బైనయట్లు మనకు సమయకాలావసానం బయ్యె నజ్ఞాతవాసంబు నకుం జొచ్చి పదునొకొండు నెలలు సని పండ్రెండవనెల వర్తిల్లుచున్నది దీని

233. ఆవంత = కొంచెమైనను. దుర్దశలన్ = కష్టములచేత. అలందురు అవ్వాలంది డెందంబు కుందు = దుఃఖించునట్టి యాద్రౌపదియొక్క మనస్సునందలి దుఃఖమును. పాపన్ = పోఁగొట్టుటకు.

234. వాంఛకున్ = కోరికకు. సంయాతికన్యక = సంయాతికూఁతురు, సుకన్య యనుట. ఇడుమలన్ = కష్టములను. సంయాతికూఁతురు సుకన్య చ్యవనునికిఁ బరిచర్య చేయుచు నడవిలోఁ గష్ట పడుచుండె నని తా. రాఘవుతోడన్ = రామునితోఁ. జనకతనయ = సీత. సీతాదేవి రామునితోఁ గూడ నరణ్యవాసము చేసి కష్టపడె నని తా. కుంభసంభవునకై = అగస్త్యునికై. ఘోరదుర్గములన్ = భయంకరము లయిన చొరరాని ప్రదేశములయందు. అలజడిపాలు = కష్టములపాలు. లోపాముద్ర యగస్త్యునితోఁ గూడ నరణ్యములయందు మిక్కిలి కష్టపడె నని తా. పడని ఉమ్మలిక = అనుభవింపని దుఃఖమును. పడదుప = అనుభవింపదా? దమయంతి నలునితోఁగూడ వనంబునకుఁ బోయి యధికకష్టముల ననుభవించె నని తా. సైరణచేసి = సహించి. దుర్వారము = వారింపరానిది. నిరతిశయదుఃఖ భారంబు = అధికమయిన దుఃఖముయొక్క బరువును. నిస్తరించి = దాఁటి. ఆచందమునన్ అ = అవిధముగానే. ఓర్చి = సహించి. సుకన్య మొదలగువారెట్లు దుఃఖములను సహించి పదంపడి సుఖము నొందిరో యట్లే నీవును కష్టముల నోర్చి సంపదల నందు మని తా.

235. ప్రముఖంబు = మొదలుగాఁ గలది. దుష్టలోకంబున్ = దుష్టులసమూహమును. అధోలోకంబునకున్ = అధోగతికి. అనుచు అంతకున్ = పంపువఱకు. మదీయఅంతరంగంబు = నాదైన మనస్సు. చింతాభరభుగ్నంబును = దుఃఖముయొక్క భారముచే వంగినదియు. అవమానపంకనిమగ్నంబును = అవమానము అను బురదయందు దిగఁబడినదియు. కోపఉద్విగ్నంబునున్ ఐ = కోపముచే కలఁత నొందినదియునై. ధార్తరాష్ట్రులకున్ = ధృతరాష్ట్రునికొడుకులకు. కాల అవసానంబు = జీవితకాలముయొక్క తుద. సమయకాల అవసానంబు = అజ్ఞాతవాసప్రతిజ్ఞాకాలముయొక్క ము

కొఱంత దీఱిన నీదువంతయుం దీఱు నూఱడిల్లి యుండుము సింహబలుండు నిన్నుం బరిభవించి మై మైత్రోస యునికిం జేసి యెల్లియుం జెనక వచ్చు నీవునుం గ్రమంబున నొడంబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేత ప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమెయిం జనుదేర నియమింపుము వాఁడు వచ్చిన నాసాబగునిం దెగఁజూచి నీకుం జూపి నీచిత్తంబు వడసెద నిత్తెఱంగు దప్ప నొండువిధంబు గర్జంబు గా దిదియ నిర్ణయం బిట్లు చేయువార మిప్పాటలనలసం దలంపనుగాని వేగుచున్నయది జనులు మేలుకాంచి నుసలం గాంచిరేని వంచన బయలువడినం గార్యంబు దప్పుఁ గీచకవధంబునకుం బూనిన నామనోరథంబు దుదిముట్టవలయు నిజశయనస్థానంబునకుం బొమ్మని తనశయ్యాతలంబు విడిచి యత్తన్విం దఱిమి కొన్ని యడుగు లనిచి మరలి మారుతాత్మజుండు కలుషితాత్ముం డగుచు సెజ్జకు వచ్చె నచ్చెలువయుం దననిద్రించు నెడకుం బోయి పర్యంకభాగంబునం దనువు వైచి యంకిలి దేఱని డెందంబునం గొందలంబుతోడి నిశ్చయంబున నిద్రం బొరయనికనుదోయి మోడ్చి యుండె నంత. 235

( ప్రభాతకాలవర్ణనము. )

గీ. ద్రుపదనందన పరిభవ♦దుఃఖమునకు, నుల్లమునఁ దురపిల్లుచు ♦ నున్న సరసి
వేఁడినిట్టూర్పుపో యన ♦ వెడలెఁ గ్రొత్త, తావి మూఁతులు విచ్చు నె♦త్తమ్మివిరుల.

గింపు. నీదువంతయున్ = నీదుఃఖమును. పరిభవించి = అవమానపఱచి. మైమైత్రోన్ అ = ఉపద్రవము లేనియట్లుగానే. ఎల్లియున్ = రేపున్నూ. చెనకన్ = తాఁకుటకు. భావించికొని = నటించి. ఒంటిమెయిన్ = ఒంటరిగా. ఆసాబగుని = ఆవిటుని. అత్తన్విన్ = ఆద్రౌపదిని. మారుతఆత్మజుండు = భీముఁడు. కలుషితఆత్ముండు = కలఁగిన మనస్సు గలవాఁడు. పర్యంకభాగంబునన్ = పాన్పుమీఁద. తనువు = దేహమును. అంకిలిదేఱనిడెందంబునన్ = కలఁకదేఱని మనస్సుతో. కొందలంబుతోడి నిశ్చయంబునన్ = సంశయముతోఁ గూడిన నిశ్చయముచేత. పొరయని = పొందని. మనస్సు కలఁగియుండుటచేతను, భీముఁడు కీచకుని చంపు నను నిశ్చయము నిస్సంశయము కాకపోవుటచేతను నిద్ర పట్టకుండె నని తా.

236. ద్రుపదనందన పరిభవదుఃఖమునకున్ = ద్రౌపదియొక్క యవమానము అను దుఃఖమునకు. ఉల్లమునన్ = మనస్సునందు. దురపిల్లుచున్ = దుఃఖించుచు. ఉన్న సరసి = ఉన్నకొలనియొక్క. తావి = వాసన. నెత్తమ్మివిరులన్ = చక్కని తామరపువ్వులనుండి. వెడలెన్ అని యన్వయము. ద్రౌపదియొక్క యవమానదుఃఖమునకు దుఃఖించుచు కొలను అను సఖి విడిచిన వేఁడినిట్టూరుపో యనునట్లు వికసించుచున్న కమలములనుండి మంచివాసన వెడలె నని తా. అలం. ఉత్ప్రేక్ష.

పాఠాం:—వేడినిట్టూర్పులో. ఈపాఠమునందుఁ దావి యేకవచనాంత మగుటచే నూర్పులు బహువచనాంతముగాఁ బ్రయోగించుట యనుచితము.

క. విచ్చెం దిమిరము కాఁపులు, వచ్చె మధుపకులము లబ్జ♦వనముల కురలం
జొచ్చె విరులు తరులతికల, నిచ్చె రథాంగములు వంత ♦ యెల్లఁ దొగలకున్.

సీ. పెనఁకువఁ దనిసిన♦తనువు లొండొంటితోఁ, గీలించి నిద్రించి ♦ మేలుకాంచి
తరుణులుఁ బతులు వా♦తాయనంబుల నల్ల, మలయు వేఁబోకటి♦మలయపవను
నింపారు సోఁకున♦నిగురొత్తుచిత్తంబు, లెలసి యొండొరులపైఁ ♦ బొలయఁ జూడ్కు
లాదట నుపకర♦ణావలి వెడవెడ, యాదరించుచు రాగ ♦ మడరఁ దొడరి
కేళి సలిపిరి భవనదీ♦ర్ఘికలతమ్మి, విరుల నెత్తావి నెనయంగ ♦ బెరసి చెమట
పొడము మేనులతఱికంపు♦ప్రోచి తఱచు, టూర్పుగాడ్పులపరిమళ♦ముల్లసిల్ల. 238

గీ. రాలి యున్నపుష్పప్రక ♦ రము విదిర్చి, చెన్నుగా నున్న సేసిన♦సెజ్జ యనఁగ

237. తిమిరము = చీఁకటి. విచ్చెన్ = వీడెను. మధుపకులములు = తుమ్మెదగుంపులు. అబ్జవనములకున్ = తామరసమూహములకు. కాఁపులు = కాఁపురములు. వచ్చెన్. విరులు = పువ్వులు. తరులతికలన్ = వృక్షములనుండియుఁ దీఁగలనుండియు. ఉరలన్ = రాలుటకు. చొచ్చెన్. రథాంగములు = చక్రవాకములు. వంతయెల్లన్ = దుఃఖము నంతయును. తొగలకున్ = కలువలకు. ఇచ్చెన్. చీఁకటి విరిసె ననియుఁ దుమ్మెదలు తామరపువ్వుల ప్రాలె ననియు, వృక్షములనుండియుఁ దీఁగలనుండియు పువ్వులు రాలె ననియు చక్రవాకములకు సంతోషము గలిగె ననియుఁ గలువలు ముకుళించె ననియుఁ దా.

238. పెనఁకువన్ = కలయికచేత. తనిసినతనువులు = తృప్తిపొందినదేహములను. కీలించి = చేర్చి. తరుణులున్ = స్త్రీలును. పతులున్ = మగలును. వాతాయనంబులన్ = కిటికీలనుండి. అల్లన్ = తిన్నగా. మలయు వేఁబోకటి మలయపవను ఇంపారు సోఁకునన్ = వీచునట్టి వేకువజాము నందలి మలయమారుతముయొక్క సుఖమయిన తాఁకుడుచేత. ఇగురొత్తుచిత్తంబులు = వికసించుచున్న మనస్సులను. ఎలసి = పొంది. ఒండొరులపైన్. చూడ్కులు. పొలయన్ = వ్యాపింపఁగా. ఆదటన్ = ప్రేమముతో. ఉపకరణఆవళిన్ = చందనాదిసాధనసమూహమును. వెడవెడ = మిక్కిలి కొంచెముగా. అడరన్ = అతిశయించుటచేత. తొడరి = పూని. భవనదీర్ఘికలతమ్మినెత్తావిన్ = ఇంటియందలి నడబావులయం దున్న తామరపూవుల నిండువాసనతో. ఎనయంగన్ = సరిపోలునట్లు. బెరసి = వ్యాపించి. చెమటపొడము మేనుల తఱిగంపు = చెమటగలిగిన దేహముల యొత్తుడుచేఁ గలిగిన వాసనను. ప్రోచి = వృద్ధిచేసి. తఱుచు ఊర్పుగాడ్పులపరిమళము = అధికములయిన నిట్టూర్పు వాయువుల మంచివాసన. ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా. కేళి = క్రీడను. చలిపిరి అని యన్వయము. దంపతులు కలసి తృప్తి నొందినవారై యొండొరుల మేనులఁ గౌఁగిలించికొని నిద్రపోయి ప్రభాతమారుతస్పర్శముచే మేలుకొన్నవారలై మరలఁ బరస్పరానురాగము అతిశయించుటవలన భోగసాధనము లయినవస్తువులను గొంచెముగా నాదరించి గృహదీర్ఘికల తామరపూవులపరిమళమువలె మనోహరములయిన నిశ్వాసవాయువులపరిమళము తమమేనులచెమటయొక్క సుగంధమును వృద్ధిచేసి వ్యాపించుచుండఁగాఁ గేళి సలిపి రని తా.

239. వేగుటయున్ = తెల్లవాఱఁగా. చుక్కలు = నక్షత్రములు. విరిసి = తొలఁగి. విశదభాతిన్ = స్వచ్ఛమయిన కాంతిచేత. అంబరతలంబు = కాశప్రదేశము. రాలి, ఉన్నపుష్పప్ర

వేగుటయుఁ జుక్క లన్నియు విదిర్చి విశద, భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు.

వ. తదవసరంబున నల్లనల్లనఁ దెఱపి యిచ్చి విచ్చి యవ్వు లవ్వులం జనునంధకారంబు దూరంబులయందును లేకునికివలనం గడ ళ్లప్పళించి నెరసి విరసినం బొలుచు కలుకట్టులంబోని దిక్తటంబులును దమము వాసినం దమవాసినకందువలు రోసి యొత్తినమెడలుం బరిచరించినచూడ్కులు వేడ్కలం గ్రందైనడెందంబులుం గలిగి మెలంగుచు నొండొంటి బిట్టుగాంచి యొదవుసమ్మదంబునం బొదలుమేనులు బెరయించి పరమానందంబునం జొక్కి జక్కవకవలు గలసి పొలసి నలిరేఁగి చెలంగుచు రేయింటియాఁకటిపెల్లున గొదకొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు నిక్కడక్కడఁ బఱచినం జిక్కువడి యున్న మృణాళశకలంబులవలన బాలచంద్రశతాభిరామంబు లగుశంభుజలమూర్తివిశేషంబులంబోని సరోవరంబులును జీఁకటి

కరముల్ = ఉన్నట్టి పువ్వుల సమూహమును. విదిర్చి = విదిలించి. చెన్నుగాన్ = అందముగా. నున్న = నునుపుగా. చేసినసెజ్జ యనఁగన్ = ఏర్పఱచిన పానుపో యనునట్లు. చూడన్. చెలువొందెన్ = ప్రకాశించెను. తెల్లవాఱఁగానే నక్షత్రములన్నియుఁ బోయి నిర్మలమయిన యాకాశము రాలియున్న పువ్వులన్నియు విదిలించి స్వచ్ఛముగాఁ జేసినపానుపో యనున ట్లొప్పె నని తా. అలం. ఉత్ప్రేక్ష.

240. తత్ అవసరంబునన్ = ఆసమయమునందు. తెఱపి = విడుచురను. కడళ్లు = సముద్రములు. అప్పళించి = తాఁకి. నెరసి = నిండి. విరిసినన్ = విచ్చిపోఁగా. పొలుచుకలుకట్టులంబోని = స్పష్టముగాఁ గనఁబడుచున్న పర్వతములో యను నట్లున్న. దిక్తటంబులును = దిక్కులప్రదేశములును. సముద్రములు పొంగి పొరలినపుడు నీట మునిఁగియుండి విరిసినపిమ్మటఁ దెల్లముగాఁ దెలియవచ్చు పర్వతములో యనునట్లు అంధకార మంతయు విరిసినపిమ్మట దిక్కులు చూపట్టె నని తా. తమవాసినకందువలు = రాత్రి తాము ఒండొంటిని నెడఁబాసిన చోటులను. రోసి = వెదకి. పచరించిన = ప్రసరింపఁజేసిన. గ్రందు = నిండినవి. డెందంబులున్ = మనస్సులును. బిట్టు = శీఘ్రముగా. ఒదవుసమ్మదంబునన్ = కలుగునట్టి సంతోషముచేత. పొదలుమేనులు = పొంగుచున్న దేహములను. బెరయించి = చేర్చి. జక్కవకవలు = చక్రవాకమిథునములు. పొలసి = వ్యాపించి. నలిరేఁగి = విజృంభించి. రేయింటి యాఁకటిపెల్లునన్ = రాత్రియందలి యాఁకలియొక్క యతిశయముచేత. గొదకొని = విజృంభించి. కమిచి = గ్రహించి. చంచువులన్ = ముక్కులచేత. ఆనుచున్ = తినుచు. పఱచినన్ = పడవేయుటచేత. మృణాళశకలంబుల వలనన్ = తామరతూండ్ల ముక్కలచేత. బాలచంద్రశత అభిరామంబులు = బాలచంద్రుల నూఱులచే నొప్పినవి. శంభుజలమూర్తి విశేషంబులం బోని సరోవరంబులును = శివుని జలమయ మయిన మూర్తులో యనున ట్లున్న మేలికొలంకులును. చక్రవాకపక్షులదంపతులు రాత్రి తాము ఎడఁబాసినస్థలంబులను వెదకి యొండొరులం గలసికొని పరమానందంబుం బొంది రాత్రియాఁకటిచేఁ దామరతూండ్లను యథేచ్ఛముగా భక్షించి యక్కడక్కడ నాతామరతూండ్లముక్కలను బడవేయుటచే నాకొలంకులు బాలచంద్రరేఖలు ధరించిన శివుని జలమూర్తులో యన్న ట్లొప్పె నని తా. శివునకు పృథివి, సలిలము, తేజస్సు, వాయువు, ఆకాశము, సూర్య

వాసినం బ్రభాతం బనువింతమానిసి మెలంగి ముసుంగు పుచ్చినట్లు మేలు కని యెఱకలు నొదల విదిర్చి కూర్చికొని కలగొని పలుకుఁబులుఁగుల యెలుంగుల వలన నొండొంటిం దెలుపుకరణి నొప్పుఁ ధరణీరుహంబులును బరఁగునరుణోదయ రాగపటలంబు నెనయు కెంజాయ రంజిల్ల వికసిల్లు రక్తారవిందంబుల నందంద దండడి నెరసి చరించు చంచరీకంబుల యెఱకల నెఱుల గిఱికొని క్రొత్త యగు కాంతి ప్రవాహంబులం గడలుకొల్పు పుప్పొళ్లు దెరల్చి రాల్చుచుం బొలయు మలయానిలంబునం గ్రాలుమవ్వంపుఁదీవలఁ గడిఁవ్రాయి తొరఁగిన విరులవలన మీనకేతన పురాతన బాణశాలలం బోని లతామండపంబులును మొగిడియు జనంబుల సంధ్యాంజలిపుటకరణంబుల ననుకరించు విధంబునం బెంపు గదుర దర్శనీయంబు లగు కుముదవనంబులును నేమేని నెపంబున నొండొరుల మేలుకొలుపు రమణరమణీజనంబులన్నా

చంద్రములు, సోమయాజి యని యెనిమిదిమూర్తులు. ప్రభాతంబు = ప్రాతఃకాలము. మెలంగి = తిన్నగా వచ్చి. ఎఱకలు = ఱెక్కలను. పొదలన్ = ఒప్పునట్లు. కూర్చికొని = చక్కఁజఱచికొని. కలగొని = కలఁతపడి. పలుకు పులుఁగుల ఎలుంగుల వలనన్ = కూయునట్టి పక్షుల ధ్వనులవలన. తెలుపుకరణిన్ = నిద్రలేపుకొనుచున్నవో యనునట్లు. ధరణీరుహంబులును = వృక్షములును. ప్రాతఃకాల మనుక్రొత్తమనుష్యుఁడు చీఁకటి పోఁగా ముసుఁగుతీసినాఁడో యనునట్లు పక్షులు మేలుకొని కూయునట్టి ధ్వనుల చేత వృక్షములు ఒండొంటిని మేలుకొలుపుకొనుచున్నవో యనునట్లుండెనని తా. పరఁగుఅరుణోదయరాగపటలంబున్ = ప్రవర్తించునట్టి యరుణోదయమునందలి యెఱ్ఱఁదనముల సమూహమును. ఎనయుకెంజాయ = అనుకరించునట్టి యెఱ్ఱనికాంతి. రంజిల్లన్ = ప్రకాశింపఁగా. వికసిల్లురక్తఅరవిందంబులన్ = వికసించునట్టి యెఱ్ఱకమలములయందు. అందంద = మటిమటి. దండడిన్ = తఱచుగా. నెరసి = నిండి. చరించుచంచరీకంబులఎఱకలనెఱులన్ = తిరుగుచున్న తుమ్మెదలయొక్క ఱెక్కలయొక్క సందులయందు. గిఱికొని = చిక్కుకొని. కడలుకొల్పు పుప్పొళ్లు = అతిశయింపఁజేయు పరాగములను. తెరల్చి = తొలఁగించి. పొలయుమలయఅనిలంబునన్ = వీచునట్టి మలయమారుతము చేత. క్రాలుమవ్వంపుతీవలన్ = కదలునట్టికోమలము లయిన తీఁగలనుండి. కడిపోయి = వాసనచెడి. తొరఁగినవిరులవలనన్ = రాలిన పువ్వులవలన. మీనకేతనపురాతనబాణశాలలంబోని = మన్మథుని ప్రాఁతబాణశాలలో యనునట్లున్న. లతామండపంబులును = పొదరిండ్లును. అరుణోదయకాంతివంటి యెఱ్ఱనికాంతి గల వికసించిన యెఱ్ఱదామరలయందు సంచరించుచున్న తుమ్మెదల ఱెక్కలలోఁ జేరి వింతకాంతిని గలిగించుచుండు పరాగములను రాల్చుచు వీచుచున్న మలయానిలముచేఁ గదలు తీఁగల నుండి రాలిన పువ్వులు గలిగిన వగుటవలనఁ బొదరిండ్లు మన్మథుని ప్రాఁతబాణములగృహములో యనునట్లున్న వని తా. మొగిడియున్ = ముకుళించియు. జనంబులసంధ్యాఅంజలిపుటకరణంబులన్ = జనములయొక్క సంధ్యాకాలమునందలి దొప్పవంటి చేతులమోడ్పులయొక్క చేయుటలను. అనుకరించు విధంబునన్ = అనుకరించుచున్నవో యనునట్లు. పెంపు = అతిశయము. కదురన్ = కలుగుటచేత. దర్శనీయంబులు = చక్కనివి. అగు కుముదవనంబులునున్ = అయిన తెల్లకలువలసమూహములును. ప్రాతస్సంధ్యాకాలమునందు జనులు చేయు చేమోడ్పులను అనుసరించినవో యనునట్లుండుటచే ముకుళించినను కలువలు సుందరములై యుండిన వని తా. ఏమేనినెపంబునన్ = ఏదో సాకుచేత. మేలు

లాపంబులం బెరయుదరహాసంబులకాంతిఁ దెలుపెక్కినట్లు వెలరారుదీపంబులును మునుకడవచ్చి యెఱుకసేయమికి వాతాయనపవనునిపయిం బుట్టినయలుకవిధంబున వేగుఁబోకట నంకురించుమదంబునఁ గెంపు గదురుట నిద్రలేమి నని శంకింపక యింపునం గదియువిదగ్ధవిటజనంబులమనంబులం దిగుచులలనాలోచనంబులును రేపకడ వనలక్ష్మి పురశ్రీ నలంకరించువడువున నెడపడక యెల్లెడల నిగుడువిభాత కుసుమకదంబపరిమళంబును నై యున్నంత. 240

సీ. నీరజాకరములు • నిష్ఠమైఁ జేసిన, భవ్యతపంబున•ఫల మనంగ
దివసముఖాభినం•దితచక్రయుగ్మకం, బులయనురాగంపుఁ•బ్రో వనంగ
హరిహరబ్రహ్మమ•హానుభావంబు లొ, క్కటి గాఁగఁ గరఁగిన•గుటి యనంగ
నతులవేదత్రయ•లతికాచయము పెను, పొందఁ బుట్టెడుమూల•కంద మనఁగ

కొలుపు రమణరమణీజనంబుల నర్మఆలాపంబులన్ = మేలుకొలుపునట్టి నాయకనాయికాజనంబుల యొక్క పరిహాసపుమాటలచేత. బెరయు దరహాసంబులకాంతిన్ = కలుగు చిఱునవ్వులకాంతిచేత. తెలుపుఎక్కినట్లు = తెల్లఁదనము కలిగినదియో యనునట్లు. వెలరారుదీపంబులును = తెల్లనగు దీపములును. ఒకరినొకరు పరిహాసవాక్యములచే మేలుకొలిపికొనునట్టి నాయికానాయకుల చిఱునవ్వులకాంతిచేతఁ దెల్లనయ్యెనో యనునట్లు దీపములు తెల్లవాఱె నని తా. మునుకడ = ముందుగానే. ఎఱుకచేయమికిన్ = తెలుపక పోవుటకు. వాతాయనపవనునిపైన్ = గవాక్షపుగాలిమీఁద. పుట్టిన అలుకవిధంబునన్ = కలిగిన కోపముచేతనో యనునట్లు. వేగుఁబోకటన్ = వేకువను. అంకురించు మదంబునన్ = కలిగినమదముచేత. కెంపు = ఎఱ్ఱఁదనము. నిద్రలేమిన్ = నిద్ర లేకుండుటచేత. శంకింపక = సందేహింపక. ఇంపునన్ = సంతోషముతో. కదియు విదగ్ధవిటజనంబులమనంబులన్ = కూడునట్టి నేర్పరులగు విటకాండ్రమనస్సులను. తిగుచులలనాలోచనంబులును = ఆకర్షించునట్టి స్త్రీలచూపులును. ముందుగా వచ్చి తెలుపలే దని కిటికీలగాలిమీఁదఁ గలిగినకోపముచేతనో యనునట్లు ప్రాతఃకాలమునఁ గలుగుమదముచే నెఱ్ఱవాఱినవై స్త్రీలచూపులు అట్లెఱ్ఱవాఱుట నిద్రలేకుండుటచేత నని తలఁచి నిస్సంశయముగాఁ దమయొద్దకు వచ్చు విటుల నాకర్షించిన వని తా. రేపకడన్ = ప్రాతఃకాలమునందు. పురశ్రీన్ = నగరలక్ష్మిని. అలంకరించువడువునన్ = అలంకరించెనో యనునట్లు. ఎడపడక = ఎడతెగక. నిగుడు విభాతకుసుమకదంబపరిమళంబున్ = వ్యాపించునట్టి ప్రాతఃకాలమునందలి పువ్వుల సమూహముయొక్క మంచివాసనయును. ప్రాతఃకాలమునందు వనలక్ష్మి పురలక్ష్మి నలంకరించెనో యనునట్లు అంతటను వికసించిన పువ్వులవాసన నిండియుండె నని తా. ఐ = కలదై.

241. నీరజఆకరములు = తామరకొలంకులు. నిష్ఠపైన్ = నియమముతో. చేసినభవ్యతపంబునఫలము = చేసినట్టి మంగళకరమయిన తపస్సుయొక్క ఫలము. దివసముఖ అభినందిత చక్రయుగ్మకంబులఅనురాగంపుప్రోవు = ప్రాతఃకాలములందు సంతోషపెట్టఁబడిన చక్రవాకదంపతుల యనురాగముల రాశి. హరిహరబ్రహ్మమహత్ అనుభావంబులు = విష్ణువుయొక్కయు శివునియొక్కయు బ్రహ్మయొక్కయు గొప్పప్రభావములు. గుటి = ఉండ. అతులవేదత్రయలతికాచయము = సాటిలేని వేదములమూఁడు అను తీఁగలయొక్క సమూహము. పెనుపుపొందన్ = వృద్ధి యగునట్లు. పుట్టెడు

నఖిలజగములకం దెఱ ♦ యగుచు జనస, మాజకరపుటహృదయస♦రోజములకు
ముకుళనంబును జృంభణం♦బును నొనర్చి, భానుబింబంబుపూర్వాద్రి♦పై వెలిఁగె.

వ. ఇట్లు సూర్యోదయ మగుటయు సమయసముచితకరణీయంబులు వేగిరంబ నడపి
చిడిముడిపాటుతో సింగారంబు సేసికొని సింహబలుండు. 242

క. తనమదిఁ గదిరినతమకం, బునఁ జిడిముడిపడుచు ద్రుపద♦పుత్రికపై నూ
నినవేడ్క దిగువ నెద్దియుఁ, గనుఁగొన విన లేక మదన♦కంపితుఁ డగుచున్.

వ. అతిత్వరితంబ సుధేష్ణమందిరంబున కరుగుచు నంతరంగంబున. 244

ఉ. చయ్యన నేగి యంబుజవి♦శాలవిలోచనఁ గాంచి ప్రీతిమై
నయ్యెడ నేకతంబ హృద♦యం బలరం దగఁ బల్కి యొక్కమై
నియ్యకొనంగఁ జేసి యెల♦యించెద నిక్కకుఁ దార్చి నేర్పునన్
శయ్యకుఁ దెచ్చెదం గుసుమ♦సాయకుపూనికి నేఁడ తీర్చెదన్. 245

మూలకందము = పుట్టునట్టి మొదటిదుంప, అఖిలజనములకం దెఱ = ఎల్లలోకములకును గన్ను తెఱచు నది. జనసమాజకరపుటహృదయసరోజములకున్ = జనసమూహములయొక్క చేతులు అను దొప్పలకును హృదయములు అను కమలములకును. ముకుళనంబును = మొగుడుటయును. జృంభణంబునున్ = వికాసమును. భానుబింబంబు = సూర్యబింబము. పూర్వఅద్రిపైన్ = తూర్పుకొండమీఁద. తామరకొలంకులు చేసిన తపస్సుయొక్క ఫలమో యనునట్లును, చక్రవాకముల యనురాగరాశియో యనునట్లును, త్రిమూర్తులమహిమలను గరఁగించి చేసిన సిద్ధగుటికయో యనునట్లును, వేదములు అను తీఁగెలు మొలచునట్టి దుంపయో యనునట్లును, సూర్యుఁడు ఎల్లలోకములకును గన్ను తెఱచి యుదయించె ననియు నపుడు జనులచేతులు నమస్కారము చేయుటకై మొగిడె ననియు వారిహృదయములు వికాసము నొందె ననియుఁ దా.

242. సమయసముచిత కరణీయంబులు = సమయమునకుఁ దగిన కార్యములను. చిడిముడిపాటుతోన్ = తొట్రుపాటుతో.

243. తనమదిన్ = తన మనస్సునందు. కదిరిన తమకంబునన్ = అతిశయించిన మోహముచేత. చిడిముడిపడుచున్ = తొట్రుపడుచు. ఊనినవేడ్క = కలిగిన యుత్కంఠ. దిగువన్ = ఆకర్షింపఁగా. మదనకంపితుఁడు = మన్మథునిచేఁ గదల్పఁబడినవాఁడు. అధికమయిన మోహముచేతఁ దొట్రుపడుచు ద్రౌపదిని దక్క నన్యమును గనను వినను జాలనివాఁడై మన్మథపరవశుండై యని తా.

244. మందిరంబునకున్ = ఇంటికి.

245. చయ్యనన్ = శీఘ్రముగా. అంబుజవిశాలవిలోచనన్ = కమలములవలె నిడుదలయిన కన్నులు గల ద్రౌపదిని. ఏకతంబ = ఏకాంతముగానే. అలరన్ = సంతోషించునట్లు. ఒక్కమైన్ = ఒకవిధముచేత. ఎలయించెదన్ = ఆసక్తిపడునట్లు చేసెదను. ఇక్కకున్ = ఇంటికి. తార్చి = చేర్చి. కుసుమసాయకుపూనికి = మన్మథునియొక్క యత్నమును. త్వరగాఁ బోయి ద్రౌపదిని ఏకాంతమున మంచిమాటలచే సంతోషపెట్టి యొప్పించి యింటికిఁ దెచ్చి నేఁడే మన్మథవేదనను దీర్చికొందు నని తా.

క. అని యువ్విళ్లూరుచు వెసఁ, జని కేకయరాజపుత్త్రి♦సదనంబున న
య్యనిమిషచారువిలోచన, యనురూపవిధాననిరత♦ యై యుండంగన్. 246

చ. కనుఁగొని యప్డు గ్రొత్త యగు♦కౌతుకవృత్తి మునింగి పల్లటి
ల్లినధృతితోఁ గ్రమం బరయ♦ లేనిమనంబు చలింప నచ్చటన్
జనులెడ యౌట గాంచునెఱి♦ సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ
జనియె విధాతృలుబ్ధకవ♦శంబున ముగ్ధమృగంబుచాడ్పునన్. 247

క. చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గాననివిధంబు♦ గైకొని చిత్తం
బున బెదరక తనముందటి, పనివెరవున నుండె భీము♦పలుకులయూఁతన్. 248

వ. అట్టియెడ. 249

సీ. ఎవ్వరితో నైన♦ నెలుఁగెత్తి యొక్కింత, పని లేనివెంగలి♦పలుకు వలుకు
మట్టియ లొండొంటి♦ బెట్టు దాఁకఁగ నేల, నందంద మునికాళ్ల♦ నప్పళించుఁ
గడు వికారంబుగా♦ నొడ లెల్ల విఱుచుచు, మలఁగ రిత్తకు రిత్త♦ చెలఁగి నవ్వుఁ
దాళంబుగాఁ గర♦తలమునఁ బెలుచఁ గం, బంబు వ్రేయుచు వెడ♦పాట పాడు

246. ఉవ్విళ్లూరుచున్ = ఆశపడుచు. కేకయరాజపుత్త్రీసదనంబునన్ = సుధేష్ణయింటియందు. అనిమిషచారువిలోచన = చేఁపలవలెఁ జక్కనికన్నులు గల యాద్రౌపది. అనురూపవిధాననిరతయై = తగినపనియం దాసక్తయై. అట్లాసతోఁ బోయి సుధేష్ణయింట ద్రౌపది తగినపనిలో నుండఁగా నని తా.

247. కౌతుకవృత్తిన్ = వేడుకయందు. పల్లటిల్లినధృతితోన్ = చలించిన ధైర్యముతో. క్రమంబు = న్యాయమును. అరయన్ = తెలిసికొనుటకు. ఎడ = దూరము. కాంచునెఱి = చూచునట్టి బుద్ధి. ఇంతిన్ = ద్రౌపదిని. విధాతృలుబ్ధకవశంబునన్ = విధియను వేఁటకానియొక్క యధీనతచేత. ముగ్ధమృగంబుచాడ్పునన్ = తెలివిమాలిన జింకవలె. ద్రౌపదిని చూచి కీచకుఁడు మోహమతిశయించి ధైర్యముచెడి జనులు సమీపమున నున్నారనియుం జూడక వేఁటకానియొద్దకుఁ బోవు మృగమువలె విధివశుండై ద్రౌపదియొద్దకుఁ బోయె నని తా. పాఠాం:—పోవుమృగంబుచాడ్పునన్. విధాతృలుబ్ధకవశంబున మృగంబు పోవుట యసంభవము కావున నీపాఠం బప్రశస్తము. ప్రకృతపాఠమునందు విధాతృలుబ్ధకవశగమనము ఉభయసాధారణధర్మ మగుటచే నాదోషము లేదు.

248. అతనిన్ = ఆకీచకుని. కనియున్ = చూచియును. కాననివిధంబు కైకొని — చూడని యట్లుండి యనుట. పనివెరవునన్ = పనియొక్క యధీనమున. ద్రౌపది కీచకునిఁ జూచియుం జూడని యట్లు భీముని మాటలబలముచే భయము నొందక తనపనిమీఁదనే యుండె నని తా.

250. ఎలుఁగుఎత్తి = బిగ్గరగా. పనిలేనివెంగలిపలుకు = పనికిమాలిన తెలివిలేని మాటను. బెట్టు = గట్టిగా. అప్పళించున్ = తట్టును. ఒడలు = దేహమును. మలఁగి = మరలి. రిత్తకున్ రిత్త = వ్యర్థముగా. చెలఁగి = చెలరేఁగి. కరతలమునన్ = అఱచేతితో. పెలుచన్ = ధ్వనియగునట్లు. వెడపాట = వ్యర్థమయిన పాటను. మలయున్ = తిరుగును. చేరువన్ = సమీపమునందు. పొలయున్ =

మలయు నంతంతఁ జేరువఁ ♦ బొలయు నింతి, నన్నుఁ జూడమి కెంతయుఁ ♦ దల్లడిల్లు
నిక్కడక్కడఁ బడుఁ దగు♦లినుమడింపఁ, జూచు నత్తన్విఁ బోరిఁ బోరిఁ ♦ గీచకుండు.

వ. ఇట్లు బహుప్రకారంబు లగుదుర్వ్యాకారంబులు సేయుచు నద్దురాత్ముండు ద్రుపద
నందన డాయం బోయి. 251

ఉ. భాగ్యము గాదె నీచరణ♦పద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా
యోగ్యత గల్గెనేని నను ♦ నొక్కని నొల్లవొ కామసౌఖ్యవై
రాగ్యము నీమనంబునఁ ది♦రంబొ నిజం బెఱుఁగంగఁ జెప్పు సౌ
భాగ్యము గుందునే మగల♦పై నొకయించుక చూడ్కి నిల్పినన్. 252

ఉ. ఆలము సేసి నాతగుల ♦ మాఱడిపుచ్చఁగ నేల బేల న
న్నేలి యనంతభోగముల ♦ నిచ్చమెయిన్ విహరింపు నిత్యల
క్ష్మీలతికాలవాల మగు♦జీవన మంతయు నీమొగంబ కాఁ
బాలన సేయు మిప్పురము♦భామినుల ల్లను నిన్నుఁ గొల్వఁగన్. 253

సంచరించును. తగులు=మోహము. ఇనుమడింపన్=రెట్టింపుకాఁగా. పొరిఁబొరిన్=మాటిమాటికి. అత్త
న్విన్=ఆద్రౌపదిని. కీచకుఁడు కనఁబడినవారితో వ్యర్థపుమాటలు చెప్పుచు కాలియుట్టెలు ధ్వనించునట్లు
మునికాళ్లను నేలమీఁదఁ దట్టుచు దేహము విఱిచికొనుచు కారణము లేక నవ్వుచు అఱచేతితో స్తంభము
నంటుఁ దాళములు వేయుచుఁ బాటపాడుచు ద్రౌపది సమీపమునకుఁ బోయినను ఆయమ తన్నుఁ జూడ
కుండుటచేత మిక్కిలి తల్లడిల్లుచు నధిక మగుమోహముతో నామెను చూచుచుండె నని తా.

251. బహుప్రకారంబులు = పెక్కువిధములు గలవి. అగుదుర్వ్యాకారంబులు = అయిన దు
శ్చేష్టలను.

252. నీచరణపద్మములు = నీయొక్క యడుగుఁదామరలను. యోగ్యత. కల్గెన్ ఏనిన్ భాగ్యము కాదె యని యన్వయము. ఒల్లవో = ఇష్టపడవో. కామసౌఖ్య వైరాగ్యము = మన్మథ సుఖమునం దాశ లేకుండుట. తిరంబో = స్థిరమా! మగలపైన్ = పురుషులమీఁద. సౌభాగ్యము= చక్కఁదనము. కుందునవే = తగ్గునా? నీకు సేవచేయుట కలిగినయెడ నది నాభాగ్యముగాఁ దలంతును. నీకు నామీఁదమాత్రమే మోహము లేదా లేక మన్మథసుఖములమీఁదనే యిచ్ఛ లేదా యది యైనను జెప్పుము. కొంచెము పురుషులమీఁద నీకటాక్షము ప్రసరించినయెడ నీకేమినష్ట మని తా.

253. ఆలముచేసి = ఉపేక్షించి. నాతగులము = నాయాశను. అఱడిపుచ్చఁగన్ = వ్యర్థము చేయుట. బేల = తెలియనిదానా! అనంతభోగములన్ = కడలేని సుఖములచేత. ఇచ్చమెయిన్ = ఇష్టముచొప్పున. నిత్యలక్ష్మీలతికా ఆలవాలము = నాశములేని సంపద యనుతీఁగకుఁ బాఁదు. జీవనము = నా బ్రదుకు. ఇప్పురము భామినులు = ఈపట్టణమునందలి స్త్రీలు. ఇట్లు నన్నుపేక్షచేసి నాయాశను వ్యర్థము చేయకుము. మూఢురాలా! నన్ను అనుగ్రహించి కడలేని సౌఖ్యముల ననుభవింపుము, నాశములేని నాసంపద నంతయు నీవే రాణివై పాలింపుము, ఈపట్టణమునందలి స్త్రీలందఱిచేతను గొలువు చేయించికొను మని తా.

ఉ. రాజుల నెల్ల నుగ్రసమ♦రంబుల వ్రేల్మిడి నోర్చి పేర్చి యీ
భూజనకోటి నా దగువి♦భుత్వసమగ్రత నాదరించి వి
భ్రాజితరాజ్యతంత్రములు ♦ పాలనసేయుదు నేన వీటికిన్
రా జనఁగా నెపం బిడి వి♦రాటునకుం దగఁ గూడు వెట్టుదున్. 254

వ. కావున. 255

క. నీ వ్రకత వేల యిలఁ బది, వేవుర నే వలచి పట్ట ♦ వెదకిన నడ్డం
బై వచ్చి వలదు నా నిం, దేవాఁడు మగండు దీని ♦ నెఱుఁగవు కంటే. 256

చ. విరటుఁడు సూచు చుండ నిను ♦ వేవురముందట నట్లు తన్న నొ
క్కరుఁడును గాదు గూడ దనఁ ♦ గల్గెనె పోటరు లైనభర్త లే
వుర గల రంటి వారియల♦వుం జలముం గడగంటి నింక నె
వ్వరు గల రెట్లు దప్పె దని♦వారణఁ బట్టెద నెందుఁ జొచ్చినన్. 257

వ. అనిన నవ్వేలంది వీఁడు దమకించి యున్నవాఁడు నాయంత్రించుమాటలకు మున్న
కదియంబడినఁ గర్జంబు దప్పు నని విచారించి. 258

254. ఉగ్రసమరంబులన్ = భయంకరము లయిన యుద్ధములయందు. వ్రేల్మిడిన్ = నిమిషములోపల. ఓర్చి= జయించి. ఈభూజనకోటిన్= ఈభూమియందలి జనులసమూహమును. విభుత్వసమగ్రతన్ = ప్రభుత్వముయొక్క సమృద్ధిచేత. విభ్రాజిత రాజ్యతంత్రములు = ప్రకాశించుచున్న దొరతనముయొక్క కార్యములను. వీటికిన్ = పట్టణమునకు. నెపంబు = పేరును. నేను రాజుల నందఱను యుద్ధమున జయించి యీదేశమునందలి జనుల కందఱకు నేనే ప్రభువనై రాజ్యతంత్రములు నడపుచుందును, విరాటునకు రాజు అను పేరుపెట్టి నేనే యన్నము పెట్టుచున్నాఁడ నని తా.

256. ఇలన్= భూమియందు. పదివేవురన్= పదివేలమందిని. నాన్=అనుటకు. ఇందున్= ఇచ్చట. మగండు = శూరుఁడు. పాఠాం:—ఏవాఁడు గలండు ? కంటే= చూచితివా. నిన్నుమాత్రమే కాదు, నేను లోకమునం దెందఱు స్త్రీలను వలచి పట్టినను కూడదని యడ్డపడు శూరుఁ డొక్కఁడును లేఁ డని తా.

257. పోటరులు = శూరులు. భర్తలు = మగలు. వారిఅలవున్ = వారియొక్క బలమును. చలమున్ = పట్టుదలను. అనివారణన్ = అడ్డులేమిచేత. విరాటరాజు చూచుచుండఁగా సభవారి యందఱియెదుట నిన్నట్లు నేను తన్నినపుడు ఎవఁడును నన్నాక్షేపింపలేదు కదా ! నీకు శూరులగు భర్తలు అయిదుగు రున్నారని చెప్పితివి. వారి బలశౌర్యములును తెలిసినవి. ఇఁక నీవెచ్చటికిఁ బోయినను నేను పట్టుకొందును, నిన్నుఁ దప్పించువారు లే రని తా.

258. తమకించి = త్వరపడి. నాయంత్రించు మాటలకున్ = నాయొక్క పన్నినట్టి మాటలకు. కదియంబడినన్ — మీఁదఁబడినయెడ. కర్జంబు = కార్యము. తప్పున్ = చెడును.

గీ. బహువిధంబుల నమ్మెయిఁ ♦ బలుకునతని
పలుకు లేర్పడ విని మెత్తఁ♦బడినయట్లు
సుభగ మైవడిచూపుగాఁ ♦ జూచి తనదు
హృదయ మెఱిఁగించుతెఱఁగున ♦ నిట్టు లనియె. 259

చ. వల దని యెంత చెప్పినను ♦ వావిరి నై కడు వేగపాటుమైఁ
బలుమఱు నెల్లెడం దొడరఁ ♦ బాడియె నీహృదయంబునట్లకాఁ
దలఁపు మనోజతూపులకుఁ ♦ దక్కటిచిత్తములుం గడంగి వి
చ్చలవిడి చేఁత గర్జమె వి♦చారము గోర్కికిఁ గానివావియే. 260

క. మగ లడఁకువ నుండక తమ, తగులము పాటింతు రెట్టి♦తగులం బైనం
మగువలయెడలన యడఁగుం, దగవు విడిచి యడిచిపడరు ♦ ధైర్యముపేర్మిన్.

గీ. ఇట్టు లగుట యెఱిఁగి ♦ యెల్లభంగుల రహస్యంబు గోలుపోని♦యట్లు గాఁగ
నడరునీదుకోర్కి ♦ కనురూప మెట్టిది, యట్టిభోగభంగి ♦ ననుభవింపు. 262

259. అమ్మెయిన్ = ఆవిధముగా. ఏర్పడన్ = స్పష్టముగా. సుభగ = మంచిభాగ్యము గల ద్రౌపది. మైవడిచూపుగాన్ = సమ్మత మయిన చూపుగా. కీచకుని పలుకులన్నియు విని ద్రౌపది యంగీకరించినట్లు నటించుచు ఇట్లని చెప్పె నని తా.

260. వావిరివి = వెంబడించినవాఁడవై. వేగపాటుమైన్ = వేగిరపాటుచేత. తొడరన్ = తాఁకుటకు. పాడియె = వత్తువు. నీహృదయంబునట్లకాన్ = నీమనస్సువలెనే. మనోజతూపులకున్ = మన్మథబాణములకు. తక్కటిచిత్తములున్ = తక్కినవారి మనస్సులను. విచ్చలవిడిచేఁత = స్వతంత్రముగాఁ జేయుట. కర్జమే = యుక్తమా? తలఁపు = ఆలోచింపుము అని యన్వయము. విచారము = ఆలోచన. కోర్కికిన్ = ఆశకు. కానివావియే = కాని వరుసయా? నేను వల దని యెంతచెప్పినను వినక వెంబడించి మాటిమాటికి నామీఁదికి వచ్చుచున్నాఁడవు, నీమనస్సు మన్మథవశమైనట్లు తక్కినవారి మనస్సులను గూడ మన్మథవశముగాఁ జేయుట యుక్తమా? ఆలోచింపుము. ఆశ కలిగినను ఆలోచింపఁగూడదా యని తా.

261. మగలు = మగవారు. తమతగులము అ = తమమోహమునే. పాటింతురు = ఆదరింతురు. మగువలయెడలన్ అ = స్త్రీలయొక్క మనస్సులయందే. ధైర్యముపేర్మిన్ = ధైర్యముయొక్క యతిశయముచేత. తగవు = న్యాయమును. అడిచిపడరు = త్వరపడరు. మగవారు అడఁకువ లేనివారై తమమోహమును వెల్లడిచేసికొందురు. స్త్రీలు ధైర్యముచేత తమమోహమును వెలిపుచ్చక మనస్సులోనే యడంచుకొందు రని తా.

262. ఎల్లభంగులన్ = అన్నివిధములచేతను. కోలుపోని యట్లు గాఁగన్ = చెడనియట్లుగా. అడరునీదుకోర్కికిన్ = అతిశయించు నీయాశకు. అనురూపము = తగినది. అట్టిభోగభంగిన్ = అట్టి సౌఖ్యముయొక్క విధమును. కావున నీవు దీనిం దెలిసి రహస్యము చెడనియట్లు నీకోరిక దీర్చుకొమ్మని తా.

చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ ని
ట్లను ధృతిఁ గోలుపుచ్చెఁ గుసు♦మాయుధుఁ డేటివిచార మింక నేఁ
ప నగునె యైన నీ దయిన♦పం పెదఁ గైకొని చేయువాఁడ నే
యనువున నెప్పు డెయ్యెడ ని♦జాభిమతం బొడఁగూర్తుఁ జెప్పుమా. 263

క. అని పలికినఁ బాంచాలియుఁ, దనయెడలం గీచకుండు ♦ దగులుట భావం
బున నిశ్చయించి యి ట్లను, ననురాగాయత్తచిత్త ♦ యైనది వోలెన్. 264

ఉ. ఉత్తర లోనుగాఁ గలప♦యోజముఖుల్ పగ లెల్లఁ బ్రీతితో
నృత్తముఁ జేసి పోవ మహ♦నీయరహస్యవిధిన్ నిశీథినీ
వృత్తము గోనువారలకు ♦ వేడ్కకుఁ బట్టగుచుండు నాగృహం
బుత్తమ మిత్తెఱంగునకు ♦ నొంటిమెయిం దగ నీవు వచ్చినన్. 265

క. అనిన నతఁడు వికసిల్లుచు, నను నమ్మెయి నేలుకొనిన ♦ నలినానన నీ
యనుమతి సేయనె యొక్కఁడఁ, జనుదెంచెద నేఁటిరాత్రి ♦ సమ్మదలీలన్. 266

263. హృదయంబునన్ = మనస్సునందు. పొంగి = సంతోషించి. లతాంగితోడన్ = తీఁగవంటి దేహము గల ద్రౌపదితో. కుసుమాయుధుఁడు = మన్మథుఁడు. ధృతిన్ = ధైర్యమును. కోలుపుచ్చెన్=పోఁగొట్టెను. ఏటివిచారము=ఎక్కడియాలోచనము? ఏఁపన్=బాధించుట. పంపు= ఆజ్ఞను. ఎదన్ = మనస్సునందు. ఏ అనువునన్ = ఏయుపాయముచేత. నిజాభిమతంబు = నాకోరికను. ఒడఁగూర్తున్=నెఱవేర్చుకొందును? ద్రౌపదిమాట విని కీచకుఁడు మిక్కిలి సంతోషించి ద్రౌపదితో నిట్లు చెప్పెను. మన్మథుఁడు ధైర్యమును బోఁగొట్టినాఁడు. ఇఁక విచార మెట్లు చేయఁగలను? ఇంక నన్ను బాధింపకుము. నీయాజ్ఞచొప్పున చేసెదను, ఎప్పు డెచ్చట నేయుపాయమున నాకోరిక తీర్చుకొవచ్చునో చెప్పుమని తా.

264. తనయెడలన్ = తనవలలయందు. భావంబునన్ = మనస్సునందు. అనురాగ ఆయత్త చిత్త = అనురాగమున కధీనమయిన మనస్సు గలది. కీచకుని మాట విని ద్రౌపది తనయెడఁ గీచకుఁడు వశుఁ డయ్యె నని నిశ్చయించి యనురాగము కలదానివలె నిట్లు చెప్పె నని తా.

265. ఉత్తరలోనుగాఁ గల పయోజముఖుల్ = ఉత్తర మొదలుగాఁగల పడుచులు. నృత్తమున్ = ఆటను. మహనీయ రహస్యవిధిన్ = గొప్పదయిన రహస్యవిధముచేత. నిశీథినీవృత్తమున్ = చీఁకటితప్పును. పట్టు = చోటు. ఇత్తెఱంగునకున్ = ఈకార్యమునకు. ఉత్తర మొదలగువారు పగలంతయు నాట్యము చేసిపోఁగా రాత్రి యచ్చట నెవ్వరును లేకపోవుటచేత రహస్యకార్యమున కనువై యుండును, కాఁబట్టి నీవచటికి నొంటరిగా వచ్చినయెడ నీకార్యము నెఱవేఱు నని తా. పాఠాం:—కమనీయరహస్యవిధిన్ = మనోహరములయిన రహస్యపువిధమున నని యర్థము.

266. వికసిల్లుచున్ = వికాసము నొందుచు. నలినఆనన = కమలమువంటి మోము గలదానా! సమ్మదలీలన్ = సంతోషముతోఁ గూడిన విలాసమున. ద్రౌపదీ మాట విని కీచకుఁడు సంతోషించి యి ట్లనియె... ఇంతమాత్రము నీ వనుగ్రహించుటయే చాలును, నీయిష్టము చొప్పున నే నచటికి నేఁటిరాత్రి యొంటరిగా వత్తు నని తా.

గీ. ఇదియె నిశ్చయార్థ ♦ మిమ్మాట వదలక, యుండు మనిన నీవు ♦ నొక్కరుండ
వరుగు దేరవలయు ♦ నటు గాక యున్న నే, నిలుచుదానఁ గాను ♦ నిక్కువంబు.

క. మన మియ్యెడఁ బెద్దయుఁ బ్రొ, ద్దనుమానము లేక మాట ♦ లాడుట దగ దీ
వును బొ మ్మేనును నా దగు, పని సేసెద ననియెఁ గమల♦పత్త్రేక్షణయున్.

చ. సమయము నిర్ణయింప విని ♦ చంద్రనిభాననపల్కు లప్డు చి
త్తమునకు నింపు వెంపఁగ ము♦దంబునఁ గీచకముఖ్యుఁ డాత్మగే
హమునకుఁ బోయె నమ్ముదిత ♦ యచ్చట వెండియుఁ బ్రస్తుతక్రియా
సముచితవర్తనంబుఁ దగఁ ♦ జల్పి మహానసశాలలోనికిన్. 269

—(*) ద్రౌపది భీమునితోఁ గీచకుఁడు నర్తనశాలకు రాఁబోవుటం జెప్పుట. (*)—

క. చని వెడ వికసిల్లెడు నా, ననపద్మముతోడ ననిల♦నందనునకు ని
ట్లనియెఁ జతురోక్తిరీతి న, తనిగూఢక్రోధవహ్ని ♦ దరికొల్పంగన్. 270

267. నిశ్చయఅర్థము = నిశ్చయించిన విషయము. అనినన్ = అని కీచకుఁడు చెప్పఁగా. నిక్కువంబు = నిజము. ఇదియే నిశ్చయము. ఈప్రకారము నీవు నడచుకొనవలయు నని కీచకుఁడు చెప్పఁగా ద్రౌపది నీవును ఒంటరిగా రావలయును, అటుగానిచో నే నచ్చట నిలువ నని చెప్పె నని తా. పాఠాం:—ఇదియ నిశ్చయ మిమ్మాట♦వదలకుండు, మనిన నీవొక్కరుండవ♦యరుగుదేర, వలయు లేకున్న నయ్యెడ♦నిలుచుదానఁ, గాను జూ నిక్కువం బని పూని పలికె. అర్థతాత్పర్యములు సమానములు.

268. పెద్దయుఁ బ్రొద్దు = చాలసేపు. కమలపత్త్రేక్షణయున్ = తామరరేకులవంటి కన్నులు గల ద్రౌపదియు. పాఠాం:—అనయము నైవలేక = మిక్కిలి వ్యవధానము లేక యని యర్థము. మన మిచ్చటఁ జాలసేపు ట్లొకటిగాఁ జేరి మాటలాడుచుండరాదు, ఇఁక నీవు పొమ్ము, నేనును నాపనికిఁ బోయెద నని ద్రౌపది చెప్పె నని తా.

269. సమయము = సంకేతమును. నిర్ణయింపన్ = నిశ్చయింపఁగా. చంద్రనిభఆననపల్కులు = చంద్రునివంటి మోముగల ద్రౌపదిమాటలు. ఇంపు = ప్రీతిని. ముదంబునన్ = సంతోషముతో. ఆత్మగేహమునకున్ = తనయింటికి. అమ్ముదిత = ఆద్రౌపది. వెండియున్ = మరల. ప్రస్తుతక్రియాసముచిత వర్తనంబున్ = అప్పటికార్యమునకుఁ దగిన నడతను. మహానసశాలలోనికిన్ = వంటయింటికి. సంకేత మేర్పఱచుటను విని యామెపలుకులకు మిక్కిలి సంతోషించి కీచకుఁడు తనయింటికిఁ బోయెను, ద్రౌపదియు నచ్చటఁ దాఁ జేయుచున్న కార్యమును ముగించి వంటయింటికి నని తా.

270. వెడ = కొంచెముగా. వికసిల్లెడు ఆననపద్మముతోడన్ = వికసించుచున్న కమలము వంటి మోముతో. అనిలనందనునకున్ = భీమునితో. చతురఉక్తిరీతిన్ = నేర్పుగల మాటలవిధము చేత. అతని గూఢక్రోధవహ్ని = ఆభీమునియొక్క దాఁగియున్న కోపము అను నిప్పును. దరికొల్పంగన్ = మండించుటకు. ఇట్లు అనియెన్ అని యన్వయము. పోయి కొంచెము చిఱునగవుతో భీముని క్రోధ మతిశయించునట్లు నేర్పుగా నతనితో ని ట్లనియె నని తా.

క. నాకొఱఁతఁ దీర్చి వచ్చితి, నీకొఱఁతయు యింక సూతు♦నిం దెగఁ జూడన్
లోకము వంచింపను దగు, చీఁకటిరే యొదవె నేమి ♦ సేసెదొ చెపుమా. 271

వ. అనిన విని దరహసితవదనుం డగుచు వృకోదరుం డి ట్లనియె. 272

క. న న్నడుగ నేల నీవును, నన్నీచుఁడు నేమి మాట ♦ లాడితి రది నా
కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము, ని న్నే మెచ్చించువాఁడ ♦ నీరజవదనా. 273

వ. అనినఁ బాంచాలి సుధేష్ణమందిరంబునం దా నుచితాచరణంబున నునికియు సింహబలుండు సింగారించుకొని వచ్చుటయు రేయింటిమాటలవలనం దాను బెదరమియు వాఁడు సామదానభేదదండంబులు సూపి పలుకుటయు దానికి మెయికోలు భావించికొని క్రమంబునం దగినసంభాషణంబు సేసి నాట్యమండపంబు సంకేతస్థలంబుగాఁ జెప్పి యొక్కరుండ వచ్చువాఁడ వని నియమించుటయు నద్దురాత్ముండు ప్రముదితాత్ముం డగుచు రాత్రిసమయంబున నయ్యెడకు నొంటిమ్మెయిం జనుదెంచువాఁడై చనుటయుఁ దెలియం జెప్పిన నతండు పరమాహ్లాదంబునం బొంది. 274

శా. క్రోధం బప్రతికార మై హృదయముం ♦ గుందింప నత్యంతచిం
తాధూతాత్ముఁడ నై ననాకుఁ బరమో♦త్సాహంబు సంధిల్ల దు

271. సూతునిన్ = కీచకుని. తెగఁజూడన్ = చంపుటకును. వంచింపను = మోసపుచ్చుటకును. చీఁకటిరే = చీఁకటిగల రాత్రి. ఒదవెన్ = కలిగెను. నేను జేయవలసినకార్యమును జేసితిని. ఇఁక నీవు చేయవలసినదే మిగిలియున్నది. లోకమునకుఁ దెలియకుండఁ గీచకుని వధించుటకుఁ జీఁకటిరాత్రియును ననుకూలముగా నున్న దని తా.

272. దరహసితవదనుండు = చిఱునగవుగల మోము గలవాఁడు.

273. నీరజవదనా = తామరవంటి మోముగలదానా! నన్నడుగవలసినది లేదు. నీవును గీచకుఁడును నేమి మాటలాడితిరో దాని నంతయు నాకుం జెప్పు మని తా.

274. ఉచితఆచరణంబునన్ = తగినపని చేయుటయందు. రేయింటిమాటలవలనన్ = రాత్రి భీముఁడును దాను నాడుకొన్నమాటలచేత. మెయికోలు = సమ్మతి. భావించికొని = నటించి. ప్రముదిత ఆత్ముండు = సంతోషించిన మనస్సు గలవాఁడు. పరమ ఆహ్లాదంబునన్ = ఎక్కువసంతోషమును.

275. క్రోధంబు = కోపము. అప్రతికారము ఐ = మాఱుసేఁత లేనిదై. హృదయమున్ = మనస్సును. కుందింపన్ = దుఃఖింపఁజేయఁగా. అత్యంత చింతాధూతఆత్ముఁడను = మిక్కిలి చింతచేతఁ గదలింపఁబడిన మనస్సు గలవాఁడను. పరమఉత్సాహంబు = గొప్పసంతోషము. సంధిల్లన్ = కలుగునట్లు. దుస్సాధంబు = సాధింప నశక్యము. ఐనవిరుద్ధకార్యము = అయిన కష్ట మయినపనిని. ఆసన్నంబుగాన్ = సమీపించినదానినిగా. సంఘటింతు ఏ = సమకూర్తువా! ధర్మఆత్మజుఁడు =

స్సాధం బైనవిరుద్ధకార్య మిటు లా♦సన్నంబుగా సంఘటిం
తే ధర్మాత్మజుఁ డిచ్చ మెచ్చఁ బగ సా♦ధింపంగఁ గా స్వల్పమే. 275

వ. అని పలికి కొండొక విచారించి. 276

క. వెఱవక సంకేతించిన, తెఱఁగున నయ్యెడకు నరుగు♦దెంచునొకో కొం
దఱఁ దెచ్చునొకో వెడఁగై, యఱిముఱి వెలిపుచ్చు నొకొ ర♦హస్యం బెల్లన్.

ఉ. అట్టిది యేల చేయు నన♦యంబు నయం బొడఁగూడఁ బల్కి నీ
విట్టి తెఱంగు సేయు మని ♦ యేర్పడఁ జెప్పిన వాని కత్తఱిం
బుట్టినసంతసంబునను♦వుం బరికించితి కాదె యింక ని
ట్టట్టనఁ డెట్టు లైన హృద♦యంబున నెక్కుడిశంక వానికిన్. 278

ఉ. వచ్చు మదాంధవృత్తి నని♦వారణ నొక్కఁడ నాట్యశాలకుం
జొచ్చు నవశ్యముం వెదకి ♦ చూచి ననుం గని యప్డు సంగరం
బిచ్చు మదీయబాహుబల♦హీనబలుం డయి నీకుఁ బ్రీతిగాఁ
జచ్చు నసంశయం బిది వి♦చారము లిన్నియు నింక నేటికిన్. 279

ధర్మరాజు. ఇచ్చన్ = మనస్సునందు. పగ = శత్రువును. అల్పమే = స్వల్పమా? తీర్పరాని క్రోధము గలవాఁడనై మిక్కిలి చింతిల్లుచున్న నాకుఁ బరమసంతోషము గలుగునట్లు ఈకష్టకార్యమును ఇట్లు శీఘ్రముగా సమకూర్చితివి, ఇట్లు ధర్మరాజు మెచ్చునట్లు శత్రువును చంపునుపాయము పన్నుట మిక్కిలి కష్టమని తా.

276. కొండొక = కొంచెము.

277. సంకేతించిన తెఱఁగునన్ = సంకేతము చేసినవిధమున. వెడఁగువై = వెఱ్ఱియై. అఱిముఱిన్ = వేగిరపాటుచేత. భయపడక సంకేతము చేసినచొప్పున నచటికి వచ్చునో లేక యెవరినైనను తోడుకొనివచ్చునో యీరహస్యమును వెల్లడిచేయునో యని తా.

278. అనయంబున్ = మిక్కిలి. నయంబు = ప్రీతి. ఒడఁగూడన్ = కలుగునట్లు. ఇట్టి తెఱఁగు = ఇట్టివిధమును. పుట్టిన సంతసంబు అనువున్ = కలిగిన సంతోషముయొక్క విధమును. పరికించితి కావె = చూచితివి కదా! శంక = సంశయము. వాఁ డిట్టిపని చేయఁడు, నీవు ప్రీతితో సంకేతస్థలమునకు వచ్చువిధమును జెప్పినపుడు వాఁడు సంతోషించుటను జూచితివి కదా! ఇఁక వాఁడు వేఱువిధ మేల చేయును? వానికి సంశయము గలుగుట కవకాశము లే దని తా.

279. మదాంధవృత్తిన్ = గర్వముచేఁ గన్నుగానని యునికిచేత. ఒక్కఁడు ఆ. నాట్యశాలకున్. అనివారణన్ = అడ్డులేమిచేత. వచ్చున్ అని యన్వయము. ననున్ = భీముని. సంగరంబు = యుద్ధమును. మదీయబాహుబలహీనబలుండు అయి = నాదైన బాహుబలముచే నశించిన బలము గలవాఁడై. అసంశయము = సందేహము లేనిది. కీచకుఁడు ఒంటరియై నాట్యశాలకు వచ్చును, లోపలఁ బ్రవేశించి నిన్నుఁ గానక నన్నుఁ జూచి నాతో యుద్ధము చేయును, అంత నాబాహుబలము నోర్వఁజాలక నీకుఁ బ్రీతిగాఁ జచ్చును, ఇది నిశ్చయము, ఇఁక సంశయింపవలసినది లే దని తా.

వ. అని నిశ్చయించి వృకోదరుం డెండియు ని ట్లనియె. 280

మ. బలియుం డాసాబగుండు భావభవద♦ర్పభ్రాంతుఁ డై వచ్చి ని
శ్చలసర్వాంగత నున్న న న్నరసి నీ♦చందంబు గా కున్న నా
కులతం బొందెడు నప్డు మండపము సం♦క్షోభింపఁగా నేతుఁ గ
ట్టలుకన్ బెబ్బులి గోల నేచినటు లు♦గ్రాకార మేపారఁగన్. 281

క. ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై, కుఱుకుదు సాళువము గాకి ♦ నొడిసినభంగిన్
వెఱచఱవం బొదువుదుఁ బఱి, పఱిసేయుదు నీదుపూన్కి ♦ పారం బెయిదన్.

సీ. నాదుబాహుబలము♦నను మాఱుకొనఁ జాలు, భుజబలంబు గలిగి ♦ పోక చిక్కి
పెనఁగి నన్నుఁ గొంత ♦ కినియింప నోపెడు, చంద మైనవినుము ♦ సరసిజాక్షి.

మ. అవనీచక్రము సంచలింపఁగ దివం♦ బల్లాడ నాశాచయం
బవధూతంబు గ గోత్రశైలనికరం♦ బాకంపముం బొంద న

281. బలియుండు = ఎక్కువబలము గలవాఁడు. ఆసాబగుండు = ఆకీచకుఁడు. భావభవదర్పభ్రాంతుఁడవై = మన్మథగర్వముచే మోహముగలవాఁడై. నిశ్చలసర్వఅంగతన్ = కదలని యెల్లయవయవములు గలవాఁ డగుటచేత. ఆకులతన్ = కలఁతను. మండపము = నాట్యశాల. సంక్షోభింపఁగాన్ = కలఁగునట్లు. కట్టలుకన్ = మిక్కిలి కోపముచేత. ఉగ్రఆకారము = భయంకరమయినరూపము. ఏపారఁగాన్ = అతిశయింపఁగా. ఏతున్ = విజృంభింతును. ఆకీచకుఁడు మన్మథపరవశుండై వచ్చి కదలక మెదలక యుండు నన్నుఁ దడవి చూచి నీవు కాకపోవుట నెఱింగి కలఁత నొందును, అపుడు నేను గఱ్ఱతోఁ గొట్టినపెద్దపులివలె మహాకోపముతో నామండపమంతయు క్షోభించునట్లు విజృంభింతు నని తా.

282. పిఱుచనినన్ = వెనుదీసినయెడ. వెసన్ = శీఘ్రముగా. సాళువము = డేగ. ఒడిసిన భంగిన్ = పట్టినవిధమున. వెఱచఱవన్ = భయపడునట్లు. పొదువుదున్ = పట్టుదును. నీదుపూన్కి = నీయత్నము. పారంబుఎయిదన్ = తుద ముట్టునట్లు. పఱిపఱి = పీడింపఁబడినవానినిగా. చేయుదున్ అని యన్వయము. వాఁడు న న్నెఱిఁగి వెనుదీసినయెడ వానిమీఁదఁబడి డేగ కాకిం బట్టినట్లు పట్టి కొట్టుదు నని తా.

283. మాఱుకొనన్ = ఎదుర్కొనుటకు. చాలుభుజబలంబు = చాలిన బాహుబలము. పోక = పోవక. చిక్కి = నిలిచి. కొంత = కొంచెము. కినియింపన్ = కోపింపఁజేయుటకు. ఓపెడు చందము = చాలినవిధము. సరసిజాక్షీ = కమలమువంటి కన్నులు గలదానా! నాతోఁ బోరుటకుఁ దగినబలము గలిగి పోరి నాకుఁ గోపము వచ్చునట్లు చేసినపక్షమున నని తా.

284. అవనీచక్రము = భూమండలము. సంచలింపఁగన్ = కదలునట్లు. దివంబు = ఆకాశము. ఆశాచయంబు = దిక్కులసమూహము. అవధూతంబుగన్ = చలించినది యగునట్లుగా. గోత్రశైలనికరంబు = కులపర్వతములసమూహము. ఆకంపమున్ = వణఁకును. అర్ణవముల్ = సముద్రములు. ఘూర్ణనము = కలఁగుటను. క్రోధము = కోపమును. కృతఅర్థత్వంబున్ = కృతార్థ మగు

ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము కృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపుదున్. 284

వ. అనినం బాంచాలి సంచలితస్వాంత యై నిజాంతర్గతంబున నితనితీవ్రక్రోధంబు గుప్తసాధనంబునకు బాధకం బగు నని బోధింపం దలంచి యి ట్లనియె. 285

ఉ. ఒన్నానివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీనికిన్
నెవ్వగఁ బొంద భూజనులు నింద యొనర్పఁగ నే నొనర్చునీ
చివ్వకు నీవు నల్కమెయిఁ జేసినయాపని గూఢవృత్తికిన్
ద వ్వగునేని నాయభిమతం బొడఁగూడియు నిష్ఫలం బగున్. 286

క. కావున వంచన బాహిర, పోవక యుండంగ మనరిపుం బరిమార్పం
గా వచ్చునేని నట్టిద, నావలపు గాక తక్కినను వలదు సుమీ. 287

వ. అనిన విని ద్రుపదనందనకుం బాండునందనుం డి ట్లనియె. 288

చ. మదమునఁ గీచకాధముఁడు మార్కొని నిల్చిన వీఁకమై వడిన్
గదిసితినేని నప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి నా

టను. చిత్రవధప్రౌఢిన్ = చిత్రముగాఁ జంపుటయందలి యతిశయమును. సూతునకున్ = కీచకునకు. రౌద్రంబు = రౌద్రరసమును. ఏర్పడన్ = స్పష్ట మగునట్లు. చూపుదున్. భూమి మొదలగునవి చలించునట్లు క్రోధము హెచ్చినవాఁడనై చిత్రవధము చేసి కీచకునకు నారౌద్రరసముం జూపుదు నని తాత్పర్యము.

285. సంచలితస్వాంత = కదలిన మనస్సు గలది. ఇతనితీవ్రక్రోధంబు = ఈభీముని తీక్ష్ణమయిన కోపము. గుప్తసాధనంబునకున్ = రహస్యముగా సాధించుటకు. బోధింపన్ = తెలుపుటకు.

286. ఒన్నానివారు = శత్రువులు. మహిమఉదధి = గొప్పతనమునకు సముద్రమువంటివాఁడు. ధర్మసుతుండు = ధర్మరాజు. ఒనర్చు ఈచివ్వకున్ = చేయునట్టి యీకలహమునకు. అల్కమెయిన్ = కోపముచేత. గూఢనీతికిన్ = రహస్యమయిన నీతికి. దవ్వు = దూరము. నాఅభిమతంబు = నాకోరిక. ఒడఁగూడియున్ = నెఱవేఱియు. నిష్ఫలంబు = ప్రయోజనము లేనిది. శత్రువులు పరిహాసము చేయునట్లును, ధర్మరాజునకు గొప్పదుఃఖము కలుగునట్లును, జనులు నిందించునట్లును ఈకలహమునందు నీవు కోపవశంబున రహస్యము చెఱచినయెడ నీవు నాకోర్కె సాధించియుఁ బ్రయోజనము లేకపోవు నని తా.

287. వంచన = మోసము. బాహిరపోవక = బయలుపడక. రిపునిన్ = శత్రువును. పరిమార్పన్ కాన్ = చంపుటకు. నావలపు = నాకోరికి. కాఁబట్టి మనప్రయత్నము బయలుపడకుండునట్లు శత్రువును వధించుట శక్య మగునేని నట్లు చేయుము. లేనియెడ వల దని తా.

289. కీచకఅధముఁడు = నీచుఁ డయిన కీచకుఁడు. మార్కొని = ఎదుర్కొని. వీఁకమైన్ = పరాక్రమముచేత. కదిసితిఏనిన్ = కలిసినయెడ. ప్రకాశరహస్య విభేదబుద్ధి = బయలు రహస్యము అనునట్టి భేదబుద్ధి. ఒదవును ఎ = కలుగునా? ఓపినభంగిన్ = సాధ్యమైనయట్లు.

కొదవున నైన నేఁ దలఁచి ♦ మోహితభంగి నిగూఢవృత్తిమైఁ
బదిలము గల్గి తిన్ననియు♦పాయమునం దెగఁ జూతు నాతనిన్. 289

క. అనవుడు జయలక్ష్మిం జే, కొను మని దీవించి యింత♦కుం గేకయనం
దన నన్నుఁ దడవుఁ దడయం, జన దియ్యెడ నని లతాంగి ♦ చనియెం బ్రీతిన్.

వ. మారుతసుతుండును గృతనిశ్చయుండై యుండె నటఁ గీచకుండు కందర్ప
గోచరుండై పరిజనంబుల వంచించి యేకాంతస్థలంబున. 291

—(*) కీచకుఁడు ద్రౌపదియందలిమోహంబునఁ బరితాపంబు నొందుట. (*)—

సీ. వామాక్షిరుచిరలా♦వణ్యంబు భావించుఁ, దన్వంగిరూపు చి♦త్తమున నిలుపుఁ
గంబుకంధరచెన్ను♦కైవడి దలపోయు, నంగనసౌకుమా♦ర్యము దలంచు
భామినిసహజవి♦భ్రమ మెదఁ గీలించుఁ, బడఁతిచెయ్వులు మదిఁ ♦ బట్టుకొలుపు
మానినిగరువంపు♦మాటపొం దూహించు, దళితాబ్జముఖితిన్నఁ♦దనము మెచ్చు

నిగూఢవృత్తిమైన్ = రహస్యవ్యాపారముతో. బదిలము = జాగ్రత్త. కీచకుఁడు గర్వముతో నన్నెదుర్కొనఁగా నేను వానితోఁ బోరునపుడు బయలు రహస్యము అని యాలోచించుటకు నా కవకాశ ముండదు. ఐనను సాధ్యమయినంతవఱకు నెచ్చరికతో రహస్యముగానే వాని వధింతు నని తా.]

290. ఇంతకున్ = ఇంతసేపటికి. కేకయనందన = సుధేష్ణ. తడవున్ = విచారించును. ఇయ్యెడన్ = ఇచ్చట. తడయన్ = జాగుచేయుట. తగను అని యన్వయము. లతాంగి = తీఁగవంటి దేహము గల ద్రౌపది. ప్రీతిన్ = సంతోషముతో. భీమునిమాట విని ద్రౌపది జయము పొందు మని యాతనిం దీవించి యింతసేపటికి సుధేష్ణ నన్నుఁ బిలుచును, నే నిట నెక్కువసే పుండరా దని చెప్పి పోయె నని తా.

291. మారుతసుతుండును = భీముఁడును. కృతనిశ్చయుండు = చేయఁబడిన నిశ్చయము గలవాఁడు. కందర్పగోచరుండువై = మన్మథునకు లోనైనవాఁడై. ఏకాంతస్థలంబునన్ = రహస్యస్థలమునందు.

292. వామాక్షిరుచిరలావణ్యంబు = ద్రౌపదియొక్క మనోహరమయిన మెఱుఁగు. భావించున్ = తలపోయును. తన్వంగిరూపు = ద్రౌపదియొక్క యాకారమును. చిత్తమునన్ = మనస్సునందు. కంబుకంధర చెన్నుకైవడి = శంఖమువంటి కంఠము గల ద్రౌపది యందముయొక్క విధమును. అంగనసౌకుమార్యము = ద్రౌపదియొక్క కోమలత్వమును. భామిని సహజవిభ్రమము = ద్రౌపదియొక్క సహజమయిన విలాసమును. ఎదన్ = మనస్సునందు. కీలించున్ = తగిలించును. పడఁతి చెయ్వులు = ద్రౌపదిచేష్టలను. మదిన్ = మనస్సునందు. పట్టుకొలుపున్ = ఉండునట్లు చేయును. మానినిగరువంపుమాటపొందు = ద్రౌపదియొక్క గౌరవముగల మాటలపొందికను. దళితాబ్జముఖితిన్నఁదనము = పూచిన కమలమువంటి మోముగల ద్రౌపదియొక్క సౌమ్యతను. చిట్టుముట్టాడన్ = పెనఁగొనఁగా. వెడఁగుపడినయుల్లంబు = కలఁతనొందిన మనస్సును. పట్టునన్ పఱుపన్ =

సడలి కోర్కులు చిగుర్చు♦జాడ వెడఁగు, పక్షినయ్యిల్లంబు పట్టునఁ ♦ బఱుపఁదనకు
వశము గాకున్న నెంతయుఁ♦వంతఁబొందుఁ, జింతయెసకంబువడిఁగొని♦చిక్కువఱుప.

చ. తలరు నలందురున్ సొగయుఁ ♦ దాపభరంబున నెచ్చనూర్చు మే
నలయఁగ నొల్లఁబోవు వెఱఁ♦గందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం
దలపడుఁ దల్లడం బడరి ♦ ధైర్యము దూలిన బెగ్గడిల్లు వి
చ్చలవిడిఁ జేష్టు నెవ్వగల♦సందడి డెందము గుంది చేష్పడున్. 293

వ. ఇవ్విధంబున మదనవేదనాదూయమానమానసుం డగుచు ని ట్లని వితర్కించు.

సీ. పడఁతి నన్నాలఁడ ♦ బలికినభంగిన, నిచ్చమై నిక్కడ ♦ వచ్చునొక్కొ
వచ్చి తొల్లిటియట్ల ♦ వఱఁదొలఁచిపోవక, పొలఁతి యింపెసలారఁ♦బొందు నొక్కొ
తలపోఁత గలిగి య♦మ్మెలఁత వచ్చుటకు నొం, డొకవింతపుట్టక♦యుండునొక్కొ
గంధర్వు లేవురు ♦ గల రని చెప్పిన, నెలఁతుకమాటలు ♦ నిక్క మొక్కొ
తెఱవచిడిముడిపాటును♦ధేష్ణ యెఱిఁగి, వేడ్కఁబనివంచుటుడిగిరా♦విడుచునొక్కొ
మదనుఁ డింతికినొజ్జయై♦మతకములును, నదను నెఱిఁగించి నాకడ♦కనుచునొక్కొ.

కుదురుపఱచుటకు. చింతఎసకంబు = చింతయొక్క యతిశయము. కీచకుఁడు ద్రౌపదివిరహమునఁ జింతాతిశయము నొందినవాఁడై ద్రౌపది లావణ్యాదులు తలంచుకొనుచు మనస్సును నిలుపుకొనలేక మిక్కిలితాపము నొందుచుండె నని తా.

293. తలరున్ = చలించును. అలందురున్ = దుఃఖించును. సొగయున్ = చొక్కును. తాపభరంబునన్ = తాపముయొక్క యతిశయముచేత. ఒల్లఁబోవున్ = మూర్ఛపోవును. వెఱఁగు = నిశ్చేష్టతను. పరిభ్రమించున్ = తిరుగుడుపడును. కొందలపడున్ = పరితాపపడును. తల్లడంబు = తొట్రుపాటు. అడరి = అతిశయించి. తూలినన్ = పోఁగా. బెగ్గడిల్లున్ = భయపడును. నెవ్వగలసందడిన్ = నిండుదుఃఖముల యతిశయముచేత. చేష్పడున్ = శ్రమపడును. కీచకుఁడు పలువిధములుగా మన్మథబాధలు పడుచుండె నని తా.

294. మదనవేదనాదూయమానమానసుండు = మన్మథవేదనచేఁ బీడింపఁబడుచున్న మనస్సు గలవాఁడు. వితర్కించున్ = ఆలోచించును. పాఠాం:—మదన కదనదోదూయమానమానసుండు = మన్మథబాధచే మిక్కిలి పీడింపఁబడుచున్న మనస్సు గలవాఁడు.

295. పడఁతి = ద్రౌపది. ఇచ్చమైన్ = ఇష్టముచేత. ఇక్కడన్ = సంకేతస్థలమునకు. పొలఁతి = ద్రౌపది. ఇంపు = ప్రీతి. ఎసలారన్ = అతిశయించునట్లు. తలపోఁత = తలంపు. ఆమ్మెలఁత = ఆద్రౌపది. ఒండుఒకవింత = మఱియొకవిశేషము. నెలఁతుకమాటలు = ద్రౌపదిపలుకులు. తెఱవచిడిముడిపాటున్ = ద్రౌపదియొక్క వేగిరపాటును. పనివంచుట = పనిచెప్పుటను. ఉడిగి = విడిచి. మదనుఁడు = మన్మథుఁడు. ఇంతికిన్ = ద్రౌపదికి. ఒజ్జవి = గురువై. మతకములున్ = యుక్తులను. అదనున్ = సమయమును. అనుచునొక్కొ = పంపునా?

ఉ. నిక్కము పోలె నప్డు దొక ♦ నేరిమిమై ననుఁ ద్రోచి పుచ్చఁగా
నక్కమలాక్షి పొందు దగ ♦ నాడి తుదిన్ నిజ మేది నేఁటిరే
యిక్కకు రాక తక్కిన స♦హించునె మన్మథుఁ డట్టు లైన నా
కెక్కడి ప్రాణ మేటితను ♦ వెయ్యది నిల్కడ యేమి సేయుదున్. 296

క. అట్టుల రాక తక్కుం, గట్టిఁడియే యాలతాంగి ♦ కామాతురు నన్
బెట్టి యచటఁ దానికి మన, సెట్టు నిలుచుఁ దగవు విడువ ♦ నెట్టులు నేర్చున్.

ఉ. దానికి నేటినిక్కము వృ♦థా పరితాపము దక్కి బాసమై
పూనికి డిగ్గఁద్రావి వెసఁ ♦ బోయెద నిప్పుడ పోయి ముట్టి య
జ్ఞానసఁ బట్టి తెచ్చి హృద♦యం బలరంగ ననంగతంత్రవి
ద్యానిపుణత్వ మేర్పఱిచె♦దం బ్రమదాంబుధి నోలలార్చెదన్. 298

గీ. అనుచు సంచలించు ♦ నడియాసఁ గ్రమ్మఱ, బాసఁ దలఁచి ధృతికిఁ ♦ బట్టువెట్టు
మరుని కోహటించి ♦ యురియాడుఁ దుదిముట్టఁ, గాన నిశ్చయించుఁ ♦ గలఁగుఁ దేఁలు.

296. నిక్కమపోలెన్ = నిజమువలెనే. నేరిమిమైన్ = నేర్పుచేత. ద్రోచిపుచ్చఁగాన్ = పంపివేయుటకు. పొందు = మంచితనము. ఆడి = చెప్పి. ఏది = చెడి. నేఁటిరే = నేఁటిరాత్రి. ఇక్కకున్ = సంకేతస్థలమునకు. తనువు = దేహము. అప్పుడు నన్ను సాగనంపుటకై మంచితనముగా మాటలాడి యిప్పుడు సంకేతస్థలమునకు నేఁటిరాత్రి రానిపక్షమున నేను మన్మథబాధను తాళఁ జాల నని తా.

297. రాకతక్కున్ = రాకతప్పును. ఆలతాంగి = ఆద్రౌపది. కట్టిఁడి ఏ = కఠినురాలా ? కామఆతురున్ = మన్మథునిచేఁ బీడింపఁబడినవానిని. పెట్టి = ఉంచి. తగవు = న్యాయమును. అట్లు రాకపోవుటకు నది యంతకఠినురాలు కాదు, మన్మథబాధితుఁ డయిన నన్ను విడిచి యన్యాయము చేయ దని తా.

293. ఏటినిక్కము = ఎక్కడి నిజము ? వృథాపరితాపము = వ్యర్థముగాఁ బరితపించుటను. తక్కి = విడిచి. బాసమై పూనికిన్ = ప్రతిజ్ఞచేతఁ గలుగు పట్టుదలను. డిగ్గఁద్రావి = విడిచి. అజ్ఞసేనన్ = ద్రౌపదిని. అనంగతంత్రవిద్యా నిపుణత్వము = మన్మథతంత్ర మనువిద్యయందలి సామర్థ్యమును. ప్రమద అంబుధిన్ = సంతోష సముద్రమునందు. ఓలలార్చెదన్ = తేలునట్లు చేసెదను. అది నిజమున గాపాడఁజాలదు, కావున నిట్లు పరితపింపక ప్రతిజ్ఞాకాలమువఱకు ఎదురుచూడక యిప్పుడే పోయి దానిం బట్టి తెచ్చి మన్మథతంత్రములయందు నా నేర్పు చూపి సంతోషపఱిచెద నని తాత్పర్యము.

299. అడియాసన్ = అత్యాశచేత. ధృతికిన్ = ధైర్యమునకు. పట్టుపెట్టున్ = స్థైర్యము కలిగించును. మరునికిన్ = మన్మథునికి. ఓహటించి = వెనుదీసి. ఉరియాడున్ = చలించును. తుదిముట్టన్ = కడనఱకును. కానన్ = చూచుటకు. ఇట్లు వేగిరపడుచు మరలఁ బ్రతిజ్ఞాకాలము వఱకు చూతు నని ధైర్యము వహించుచు నానావిధములయిన యవస్థలఁ బొందుచుండె నని తా.

వ. మఱియు నక్కోమలివలని ప్రేముడిం దగిలి. 300

సీ. పొడచూపిన ట్లైన ♦ వడిఁ బట్ట సమకట్టుఁ, బరికించి కానక ♦ బమ్మరించు
మెలఁగినయ ట్లైనఁ ♦ బలికింపఁ దలఁచు ని, రూపించి లేమి న♦శ్రులు వహించుఁ
గదిసినయ ట్లైనఁ ♦ గౌఁగిలింపఁ గడంగు, నారసి పొం దైన ♦ నలఁత నొందు
నొడఁబడ్డయ ట్లైన ♦ నడరి పైకొనఁ జూచుఁ, జెన్నఁటి యగుట ని♦శ్చేష్టఁ బొరయు
లలితవివిధవిహా♦రంబులకు లతాంగి, యెలసి పొలసినయ ట్లైన ♦ నెలమిఁ గలసి
యభిమతక్రీడ సలుపంగ ♦ నప్పళించి, వెదకి రిత్తబయల్ గని ♦ విహ్వలించు. 301

( కీచకుఁ డుద్యానవనంబున విహరించుట. )

వ. ఇట్లు బహుప్రకారంబు లగుమన్మథవికారంబుల కగపడి వెగ డంది యమంద సంతాపభరితాంతఃకరణుం డగుచు సింహబలుండు పరిచారికాప్రార్థనం జేసి మజ్జన

300. ప్రేముడిన్ = మోహమునందు.

301. పొడచూపినట్లు = కనఁబడినట్లు. ఐనన్ = కాఁగా. సమకట్టున్ = పూనును. పరికించి = చూచి. బమ్మరించున్ = భ్రమించును. ద్రౌపది తనకుఁ గనఁబడినట్లు తోఁపఁగా దానిం బట్టుకొనఁ బోయి యది యబద్ధము కాఁగా భ్రమించు నని తా. మెలఁగిన అట్లు = సంచరించినట్లు. పలికింపన్ = మాటాడించుటకు. నిరూపించి = చూచి. లేమిన్ = ద్రౌపది లేకపోవుటచేత. అశ్రులు = కన్నీళ్లను. వహించున్ = తాల్చును. ద్రౌపది తిరిగినట్లు తోఁపఁగా దానితో మాటలాడఁ దలఁచి యామె లేకపోవుటచేఁ గన్నీరు విడుచు నని తా. కదిసినఅట్లు= సమీపించినట్లు. కడంగి = పూని. ఆరసి = చూచి. అలఁతన్ = శ్రమమును. ద్రౌపది చేరినట్లు తోఁపఁగా నామెను కౌఁగిలింపఁబోయి చక్కఁగాఁ జూచి యామె లేమిచే శ్రమపడు నని తా. ఒడఁబడ్డఅట్లు = అంగీకరించినట్లు. అడరి = అతిశయించి. పైకొనన్ = కవియుటకు. చెన్నఁటి = శూన్యము. నిశ్చేష్టన్ = చేష్టలు లేనితనమును. పొరయున్ = పొందును. ద్రౌపది సమ్మతించినట్లు తోఁపఁగా నామెను బొందుటకుఁ బ్రయత్నించి యామె లేమిచే నిశ్చేష్టత నొందు నని తా. లలితవివిధవిహారంబులకున్ = మనోహరము అయిన పలువిధము లయిన క్రీడలకు. లతాంగి = ద్రౌపది. ఎలసిపొలసినఅట్లు = చేరి తిరిగినట్లు. ఎలమిన్ = సంతోషముతో. అభిమతక్రీడ = ఇష్ట మయినక్రీడను. అప్పళించి = యత్నించి. రిత్తబయల్ = వట్టిబయలిప్రదేశమును, ద్రౌపది లేనిచోటు ననుట. విహ్వలించున్ = వెలవెలఁ బోవును. నానావిధక్రీడలకుఁ దనయొద్దఁ జేరి మెలంగినట్లు తోఁపఁగా నతఁడు క్రీడింపఁ దలఁచి వెదకి వట్టిచోటును జూచి వెలవెలఁబోవు నని తా.

302. బహుప్రకారంబులు = పలువిధములు గలవి. మదనవికారంబులకున్ = మన్మథవికారములకు. వెగడు = తడఁబాటును. అమందసంతాపభరితఅంతఃకరణుండు= తక్కువ కాని తాపముచే నిండినమనస్సు గలవాఁడు. పరిచారికాప్రార్థనంజేసి= పనికత్తెల ప్రార్థనముచేత. మజ్జనభోజనంబులు= స్నానభోజనములను. ఒకభంగిన్ = ఒకవిధమున. మనోజవేదనాఅపనోదనార్థంబు = మన్మథ

భోజనంబు లోకభంగి నడపినవాఁడై తదనంతరంబ మనోజవేదనాపనోదనార్థంబు మందిరారామభూమికిం జని తత్ప్రదేశంబున. 302

చ. కమలవనంబుపొంత నను♦గాడ్పొకయించుక యాదరించుఁ జి
త్తమునకు దానఁ దల్లడము ♦ దన్కుటయుం జని గారవంపుఁజూ
తముకడ నిల్చి నిల్చి యది ♦ తాపముఁ బెంచిన లేఁతతీవజొం
పముఁ జొరఁబాఱు నం దలఁత ♦ పైకొనినన్ వెడలున్ వెనుంబడున్. 303

గీ. సుడియుగాలిఁ బువ్వుఁ♦బోడి దన్నుఁ గప్పిన, నలఁగు బెగ్గలించు ♦ నగ్గలముగఁ
గుఱియు తేనియలకుఁ ♦ గొంకు లతాగుల్మ, తరుసమీపములకు ♦ నరిగి యరిగి. 304

వ. ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గాలూఁదక లీలోద్యానంబు గలయం గ్రుమ్మరుచు. 305

సీ. ఇంపైనప్రియ కాన ♦ నిచ్చి నిల్చినమధు, వాదట నానుమ♦త్తాలివిభునిఁ
జెట్టుపల్ పచరించి ♦ చుట్టుఁ గ్రుమ్మరి మనో, రమ నియ్యకొలుపుమ♦రాళవిభుని
ఫలరసమొండొంటి♦కెలమిఁ జంచులనిచ్చు, మెయిన చొక్కెడుశుక♦మిథునములను
గమిఁ బాసి తలిరుజొం♦పమునకు మెయిమెయిఁ, దాఁకంగఁజనుపిక♦దంపతులను

యొక్క పోఁగొట్టుకొనుటకు. మందిరఆరామభూమికిన్ = ఇంటితోఁటప్రదేశమునకు. తత్ప్రదేశంబునన్ = ఆచోటియందు.

303. కమలవనంబుపొంతన్ = తామరలగుంపుదగ్గఱ. ననుగాడ్పు = తిన్ననిగాలిని. దానన్ = ఆగాలిచేత. చిత్తమునకున్ = మనస్సునకు. తల్లడము = కలఁత. తన్కుటయున్ = కలుగఁగా. గారవంపుచూతముకడన్ = ప్రియమయిన మామిడిచెట్టుదగ్గఱ. చొరఁబాఱున్ = చొచ్చును. అలఁత = బాధ. పైకొనినన్ = అతిశయింపఁగా. వెనుంబడున్ = దుఃఖించును. కొంతసేపు తామరలమీఁదిగాలిని సేవించి దానిసహింపఁజాలక తియ్యమామిడిచెట్టునొద్దకుఁ బోయి నిల్చి యచ్చటను నిలువఁజాలక పొదరిండ్లఁ దూఱి యందును నిలువఁజాలక వెడలివచ్చి తపించు నని తా.

304. సుడియుగాలిన్ = వీచునట్టి గాలిచేత. అలఁగున్ = శ్రమపడును. అగ్గలముగన్ = అధికముగా. బెగ్గలించున్ = భయపడును. లతాగుల్మతరుసమీపములకున్ = తీఁగలయొక్కయుఁ బొదలయొక్కయు వృక్షములయొక్కయు సమీపములకు. కొంకున్ = సంకోచించును అని యన్వయము. తీఁగలు మొదలగువానియొద్దకుఁ బోయి గాలికి మీఁదఁబడు పుప్పొడికి బెదరుచుఁ గురియుచున్న పూఁదేనెలకు భయపడుచు నుండె నని తా.

305. లీలాఉద్యానంబు = విలాసముకొఱకైన తోఁటను. కలయన్ = అంతట.

306. ఇంపు = ఇష్టురాలు. ఐనప్రియకున్ = అయినప్రియురాలికి. ఆనన్ = త్రాగుటకు. నిల్చినమధువు = మిగిలిన తేనెను. ఆనుమత్తఅళివిభునిన్ = త్రాగునట్టి మదపుతుమ్మెద మేటిని. చెట్టుపల్ = అక్కలను. పచరించి = సవరించి. మనోరమన్ = ప్రియురాలిని. ఇయ్యకొలుపుమరాళవిభునిన్ = అంగీకరింపఁజేయు రాజహంసను. ఫలరసము = పండ్లరసమును. ఎలమిన్ = సంతో

జూచి చూచి యుల్లంబున ♦ నేచి కోర్కు, లడరఁ జిడిముడిపడుఁ బ్రామాను♦పడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడ♦పడు దురంత, చిత్తజునిబారి కగపడు ♦ సింహబలుఁడు.

వ. ఇట్టివలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. 307

క. వగ ముట్టికొనినఁ జిత్తము, వెగ డొందఁగ మేను గలయ ♦ వెమ్మఁగ ధృతిపాఁ
తగల నొకతీవయింటికిఁ, దగి యుండెడుచంద్రకాంత♦తల్పము సేరెన్. 308

క. అం దొఱగి కీచకుం డా, యిందీవరనయన నాత్మ ♦ నిడి వేక్కమెయిన్
డెందము చన విచ్చలవిడిఁ, గందర్పుఁడు వెఱ్ఱిఁ జేయఁ ♦ గా ని ట్లనియెన్. 309

సీ. కెంగేలు గేలితోఁ ♦ గీలించి నెయ్యంపు, మాటలఁ దగుమఱు♦మాట లార్తుఁ
గుచము లురంబునఁ ♦ గుదియించి క్రమమున, నిఱిసినకౌఁగిట ♦ నిం పొనర్తు
నంగుళంబుల నల్ల ♦ నలకలు కబళించి, కెమ్మోవి యాని చొ♦క్కింతుఁ గళల
మనము మనంబునఁ ♦ బెనఁచి కేళికిఁ జొచ్చి, సతిఁ దేల్తు సౌఖ్యర♦సంపునిట్టఁ

పముచేత. చంచులన్ = ముక్కులచేత. ఇచ్చుమెయిన్ అ = ఇచ్చువిధముననే. చొక్కెడుశుకమిథునములను = ఆనందించునట్టి చిలుకలదంపతులను. గమిన్ = గుంపును. పాసి = విడిచి. తలిరుజొంపమునకున్ = చిగుళ్లగుబురునకు. మెయి = దేహము. మెయిన్ = దేహమును. చను పికదంపతులను= పోవునట్టి కోయిలలదంపతులను. ఉల్లంబునన్ = మనస్సునందు. ఏచి = విజృంభించి. అడరన్ = అతిశయింపఁగా. చిడిముడిపడున్ = తొట్రుపడును. ప్రామానుపడున్ = నిశ్చేష్టుఁ డగును. వెడంగుపడున్ = కలఁతపడును. వెనుంబడున్ = తపించును. తల్లడపడున్ = చలించును. దురంతచిత్తజునిబారికిన్ = కడలేని మన్మథునివశమునకు. అచ్చట ప్రియురాలికి తేనియ నిచ్చి మిగిలిన పూఁదేనెను త్రాగుతున్నదను, ఱెక్కలచేఁ గప్పి ప్రియురాలి ననుసరించి స్వాధీనపఱచుకొను రాజహంసమును, పండ్లరసమును ఒండొంటి కిచ్చుచు మురియుచుండు చిలుకజంటలను, ఏకాంతమున కొండొంటిమేనులు తాఁకునట్లు పోవు కోయిలలదంపతులను జూచి కీచకుఁడు మఱియు నతిశయించిన మన్మథబాధ కలవాఁడయ్యె నని తా.

307. వలవంతన్ = మన్మథబాధచేత.

308. వగ = బాధ. వెగడు = తడఁబాటును. కలయన్ = అంతటను. వెమ్మఁగన్ = తాపము నొందఁగా. ధృతిపాఁతు = ధైర్యముయొక్క మూలము. అగలన్ = పగులఁగా. చంద్రకాంతతల్పమున్ = చలువరాతితిన్నెయందలి పాన్పును. ఇట్లు తాపము నొంది నిలువఁజాలక యొక్క పొదరింటిలో నుండు చంద్రకాంతమణుల తిన్నెయం దమర్పఁబడిన పాన్పునం జేరె నని తా.

309. ఒఱగి = వ్రాలి. ఆఇందీవరనయనన్ = నల్లకలువలవంటి కన్నులు గల యాద్రౌపదిని. డెందము = మనస్సు. కందర్పుఁడు = మన్మథుఁడు. అందుఁ బరుండి కీచకుఁడు ద్రౌపదిం దలఁచికొని మన్మథభ్రాంతుఁడై మనఃస్వాస్థ్యము తప్పి యిట్లు చెప్పె నని తా.

310. కెంగేలు = ఎఱ్ఱనిచేతిని. కేలితోన్ = నాచేతితో. కీలించి = పట్టి. నెయ్యంపుమాటలన్ = ప్రియవచనములచేత, మఱుమాటలు ఆర్తున్ = బదులుమాటలు చెప్పింతు నని తా. ఉరంబునన్ = ఱొమ్మునందు. కుదియించి = మోపి. ఇఱిసిన కౌఁగిటన్ = గాఢాలింగనముచేత.

దనివు మొదలైనఁ జిగురొత్తు♦తమకమునకుఁ
బ్రాఁకు వెట్టుచు మగుడఁ బైఁ ♦ బడుచు నింతి
వింతభంగుల నెలయించి ♦ వెకలిఁ జేసి
యభిమతక్రీడనములకు ♦ నలవరింతు. 310

వ. అనుచు వెండియు నిగుడుమనోరథంబులను భావరతంబుల శిశిరోపచారంబులఁ
బ్రొద్దు గడపి కడపి కడ గానక. 311

క. మాయరవి యేల క్రుంకఁడొ, కో యను ని ట్టేల తడసె♦నో యనుఁ గ్రుంకం
బోయెడుఁ జూ యిప్పుడ యను, దాయ వఱిచె నను మనోజ♦తాపముపేర్మిన్.

గీ. దివమ కాని యింక ♦ భువనంబులం దిటఁ, బట్టి రాత్రి లేని♦యట్లు గాఁగఁ
జేసెనొక్కొ విధి వి♦శేషించి నాకకా, నేఁడ దివము సాఁగి ♦ నిలిచెనొక్కొ. 313

గీ. అనుచుఁ గ్రుంకింప రానిప్రొ ♦ ద్దరసి యరసి, శిశిరపర్యంకమున మేను♦సేర్చి చేర్చి
వంతఁ దలపోసి తలపోసి ♦ వనరి వనరి, మిగుల వందురి వందురి ♦ పొగిలి పొగిలి 314

ఇంపు = సంతోషమును. ఒనర్తుఁ = చేయుదును. అంగుళంబులఁ = వ్రేళ్లచేత. అలకలు = ముంగురులను. కబళించి = పట్టి. ఆని = త్రాగి. పెనఁచి = పెనఁగఁజేసి. సతిఁ = స్త్రీని. మొదలు = మొదట. ఐనఁ = అయినయెడ. చిగురొత్తు తమకమునకుఁ = కలుగునట్టి మోహము నకు. ప్రాఁకు = ఆశ్రయమును. మగుడఁ = మరల. ఇంతిఁ = ఆ స్త్రీని. వింతభంగులకుఁ = నానావిధములకు. ఎలయించి = ప్రవర్తింపఁజేసి. వెకలిఁ = ఆసక్తురాలిని. అభిమతక్రీడనములకుఁ = ఇష్టములయిన విహారములకు. అలవరింతుఁ = అలవాటు నొందింతును. ద్రౌపదిని స్వాధీనము చేసికొని చొక్కించి మన్మథతంత్రములయందుఁ బ్రవీణనుగాఁ జేసెద నని తా. పాఠాం:—సీసము తృతీయ పాదమునందు "ఎక్కింతుఁ గాయ్వు" అనురాగము నెక్కింతు నని యర్థము.

311. నిగుడుమనోరథంబులను = కలుగునట్టి కోరికలచేతను. భావరతంబులఁ = సంకల్పరతులచేతను. శిశిరఉపచారంబులఁ = శైత్యోపచారములచేతను. కడ = తుదను.

312. మాయరవి = మోసగాఁడైనసూర్యుఁడు. క్రుంకఁడు ఒకో = అస్తమింపఁడో. తడసెను ఓ = నిలిచెనో. ఇప్పుడు అ. క్రుంకఁ బోయెడుఁ చూ = అస్తమింపఁబోవును చుమా. దాయ = పగవాఁడై. వఱిచెఁ = బాధించెను. మనోజతాపముపేర్మిఁ = మన్మథతాపము యొక్క యతిశయముచేత. సూర్యుఁ డింక నస్తమింప లే దనియు నిదిగో నస్తమించు ననియు నతఁడు శత్రువై నన్ను బాధించుచున్నాఁ డనియు నిట్లు మన్మథవశుండై పలుకుచుండె నని తా.

313. దివము అ కాని = పగలేగాని. భువనంబులందుఁ = లోకములయందు. ఇటఁబట్టి = ఇది మొదలుకొని. విధి = దైవము. నాకుఁ అకాఁ = నా కని. సాఁగి = వృద్ధియై. నేఁడు మొదలుకొని పగలే కాని రాత్రి లేనియట్లు దైవము చేసినాఁడా యేమి? లేక నాకొఱకై నేఁడుమాత్రము పగ లిట్లు వృద్ధిపొందుచున్నదా యేమి యని తా.

314. క్రుంకింపరాని ప్రొద్దు = అస్తమింపఁ జేయరాని సూర్యుని. అరసిఅరసి = చూచిచూచి. శిశిరపర్యంకమునఁ = చల్లని పాన్పునందు. వంతఁ = బాధచేత. వనరివనరి = మిక్కిలిశోకించి. వందురి = దుఃఖపడి. ఇట్లు ప్రొద్దు పలుమాఱు చూచుచుఁ బాన్పుమీఁదఁ బొర్లాడుచు మిక్కిలి తపించుచుండి యని తా.

సీ. తనికెడునారటం♦బున నంత కంతకు, వెమ్మచు నునికికి ♦ విడుమరయును
గోలుమసంగెడు♦కోర్కులఁ వెనువెంటఁ, బాఱుచు నునికికి ♦ నాఱటయును
వావిరిఁ బొదలెడు♦వగలసందడిఁ బడి, యురియుచు నునికికి ♦ నుడుకువయును
నందంద కదిరెడు♦కొందలపాటుచేఁ, దలఁకుచు నునికికి ♦ నిలుకడయును
లేమిఁ దాల్మి గొనఁగ♦లేక యలందురి, తనువు నింద్రియములు♦మనము ధృతియుఁ
దనవశంబు గాక ♦ తల్లడపడి సింహ, బలుఁడు విషమబాణు♦బారిఁ బడియె 315

క. ఇమ్మెయి నధికపరీతా, పమ్మునఁ బడునూతుహృదయ♦పద్మం బలరం
దమ్మి కొలంకుల మొగుడ వ, నమ్ములు సాలంగ దివస♦నాథుఁడు గ్రుంకెన్. 316

వ. తదనంతరంబ. 317

—( సూర్యాస్తమయ వర్ణనము. )—

క. ఇనుఁడు దనకడకు నేతెం, చినరాగముఁ బొందు టిది యు♦చిత మసఁగాఁ గెం

315. తనికెడు ఆరటంబునన్ = కలుగునట్టి యారాటముచేత. వెమ్మచున్ = తాపము నొందుచు. ఉనికికిన్ = ఉండుటకు. విడుమరయును = విశ్రాంతియు. గోలుమసంగెడు కోర్కుల వెనువెంటన్ = మిక్కిలి యతిశయించునట్టి కోరికలయొక్క వెంబడినే. ఆఱటయును = ఆశ్వాసమును. వావిరిన్ = వరుసగా. పొదలెడు వగలసందడిన్ = వృద్ధి పొందునట్టి చింతల సందడియందు. ఉరియుచున్ = తపించుచు. ఉడుకువయును = విరతియును. అందంద = మఱిమఱి. కదిరెడు కొందలపాటుచేన్ = అతిశయించుచున్న కలఁతచేత. తలఁకుచున్ = చలించుచు. లేమిన్ = లేకపోవుటచేత. తాల్మి = సహనమును. కొనఁగన్ = పొందుటకు. అలందురి = శ్రమపడి. తనువున్ = దేహమును. మనమున్ = మనస్సును. ధృతియున్ = స్థైర్యమును. తనవశంబు = తనకధీనములు. తల్లడపడి = చలించి. విషమబాణుబారిన్ = మన్మథునికి విషయ మగుటను. పడియెన్ = పొందెను. ఇందు సీసము నాలుగుపాదముల యర్థములు క్రమముగాఁ దనువు మొదలగునవి తనవశములు గాకుండుటకు హేతువులు. ఆరాట మతిశయించుటచేత దేహము తాపము పొందుటవలనను, ఇంద్రియములు నానావిధము లయినకోరికల కధీనము లగుటవలనను, మనస్సు చింతాక్రాంత మగుటవలనను, స్థైర్యము కలఁతచేఁ జెడుటవలనను కీచకుఁడు మన్మథబాధను సహింప లేకపోయె నని తా.

316. ఇమ్మెయిన్ = ఈప్రకారముగా. అధికపరీతాపమ్మునన్ = ఎక్కుడు సంతాపముచేత. పడునూతుహృదయపద్మంబు = బాధపడుచున్న కీచకుని మనస్సు అను కమలము. అలరన్ = వికసించునట్లును. కొలంకులన్. తమ్మి = కమలము. మొగుడన్ = ముకుళించునట్లును. వనమ్ములు. చాలంగన్ = సమృద్ధ మగునట్లును. దివసనాథుఁడు = సూర్యుఁడు. గ్రుంకెన్ = అస్తమించెను. ఇట్లు సంతాపము నొందు కీచకునిమనస్సు సంతోషించునట్లును, కమలములు మొగుడునట్లును, వనములు విరివి యగునట్లును సూర్యుఁడు అస్తమించె నని తా.

318. ఇనుఁడు=సూర్యుఁడు, ప్రియుఁడు. తనకడకున్ = పశ్చిమాశాంగనయొద్దకు. ఏతెంచినన్ = రాఁగా. రాగమున్ = అనురాగమును, ఎఱ్ఱఁదనమును. కెంపునన్ = ఎఱ్ఱఁదనముచేత. పశ్చిమ

పున మెఱసి పశ్చిమాశాం, గన జనసంభావనముల ♦ గౌరవ మందెన్. 318

ఉ. చుక్కలు తోడుతోడఁ దల♦చూపఁ దొడంగె మనోభవుండు వి
ల్లెక్కిడి చక్రవాకముల♦యిక్కలు రోయఁగఁ జొచ్చె నేల కెం
పెక్కుచు వచ్చె దీవియల♦యేర్పెఱ సోయగ మందె సందడుల్
దక్కెఁ బురంబువీథుల ము♦దం బొలసెన్ విటచిత్తవృత్తులన్. 319

వ. పదంపడి జారచోరజనంబులమనంబు లలరం జంద్రాస్తమయం బగుటయు. 320

క. పెనుమిట్టది పల్లం బిది, యన కుండఁగ నోలమును బ♦యలు నొక్కటిగాఁ
గను విచ్చుటయును మోడ్పుట, యును సరిగాఁ దమము పర్వె ♦ నుర్విం దోడ్తోన్.

వ. అప్పు డాకృశోదరి వృకోదరుకడకుం జని సమయం బయ్యె ననవుడు. 322

గీ. అతఁడు పెండ్లికిఁ బిలిచిన♦యట్లు వికచ, హృదయుఁడై తలచీర యా♦యితము సేసి
ద్రుపదనందనఁ జూచి నా♦తోన వెనుక, నల్ల నంతంత నరుగుదె ♦ మ్మని కడంగి.

ఆశాఅంగన = పడమటిదిక్కు అను స్త్రీ. జనసంభావనములన్ = జనుల మన్ననలచేత. గౌరవము. అందెన్ అని యన్వయము. సూర్యాస్తమయసమయమువంటఁ బడమటిది క్కెఱ్ఱవాఱెననియు నప్పుడు జనులు సంధ్యావందనాదులు చేయుట ఇనుఁడు వచ్చినపుడు రాగము పొందుట యుత్తమ మని కొని యాడినట్లుండె ననియుఁ దా. అలం. శ్లేష. ఉత్ప్రేక్ష.

319. తోడుతోడన్ = క్రమక్రమముగా. తలచూపన్ = కనఁబడుటకు. మనోభవుండు = మన్మథుఁడు. ఇక్కలు = స్థానములను. రోయఁగఁజొచ్చెన్ = వెదకసాగెను. కెంపు = ఎఱ్ఱఁదనమును. దీవియలఏర్పెఱ = దీపములప్రకాశము. సోయగము = అందమును. పురంబువీథులన్ = పట్టణపువీథులయందు. సందడి = ధ్వని. తక్కెన్ = తగ్గెను. ముదంబు = సంతోషము. విటచిత్తవృత్తులన్ = విటుల మనోవ్యాపారములయందు. ఒలసెన్ = వ్యాపించెను. నక్షత్రము లుదయించె ననియుఁ, జక్రవాకములు విరహము నొందె ననియు, భూమి యెఱ్ఱవాఱె ననియు, దీపములకుఁ బ్రకాశము హెచ్చె ననియుఁ, బట్టణవీథులు నిశ్శబ్దములుగా నుండె ననియు, విటులు సంతోషించి రనియుఁ దాత్పర్యము.

321. పెనుమిట్టు = పెద్దమిట్ట. ఓలమును = మఱుఁగుస్థలమును. విచ్చుటయును = తెఱచుటయును. మోడ్పుటయును = మూయుటయును. సరిగాన్ = సమాన మగునట్లు. తమము = చీఁకటి. ఉర్విన్ = భూమియందు. పర్వెన్ = వ్యాపించెను. అంత మిట్టపల్లములును, మఱుఁగును బయలును, కన్ను తెఱచుట మూయుటలును ఒకటేవిధముగా నుండునట్లు లోకమంతయుఁ జీఁకటి వ్యాపించె నని తా.

322. అకృశఉదరి = చిక్కినకడుపు గల యాద్రౌపది.

323. వికచహృదయుఁడై = వికసించిన మనస్సు గలవాఁడై. తలచీర = పాగాను. అయితము చేసి = సవరించుకొని. ద్రుపదనందనన్ = ద్రౌపదిని. అల్లన్ = మెల్లగా. కడంగి = పూని. భీముఁడు పెండ్లికిఁ బిలిచినట్లు సంతోషించి తలచుట్టుచుట్టుకొని ద్రౌపదిని కొంచెము దూరముగాఁ దనవెంట రమ్మని యని తా.

చ. గమనమునీఁక వేఱొకవికారము పుట్టక సంగరోత్సవో
ద్యమరభసాతిరేకము బయల్పడు టించుక లేక రోషసం
భ్రమ మొకయింత యైనఁ బరభావనిరూప్యము గాక ద్రౌపదీ
రమణుఁడు వోయె విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్. 324

వ. చని వివేకరహితహృదయంబునుంబోలెఁ దమోదూషితంబును విదగ్ధవనితాప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మనుష్యంబును గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును ననభ్యస్తశాస్త్రంబునుంబోలె దుర్గమంబును స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబును విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును బాలిశరాజ్యంబునుంబోలె జారచోరహృద్యంబును నైనయానర్తనాగారంబుముఖభాగస్థలంబు సేరి. 325

క. కెలఁకులుఁ బిఱిందిదెసయుం, గలయం బరికించి తనయఖండితబాహా

324. గమనమునీఁకన్ = పోవుటయందలి యుత్సాహముచేత. వేఱొక వికారము = క్రొత్త విధము. సంగర ఉత్సవ ఉద్యమ రభస అతిరేకము = యుద్ధము అను పండువుకొఱకైన యత్నము నందలి వేగాతిశయము. బయల్పడుట = వెల్లడియగుట. రోషసంభ్రమము = కోపముచేఁ గలుగు తొట్రుపాటు. పరభావనిరూప్యము = ఇతరులమనస్సుచేఁ దెలియఁదగినది. ద్రౌపదీరమణుఁడు = భీముఁడు. విక్రమధురంధరతన్ = పరాక్రమముయొక్క భారము వహించినవాఁ డగుటచేత. నాట్యశాలకున్. పోయెన్ అని యన్వయము. భీముఁడు తననడకయందు భేద మేమియు లేనట్లును, యుద్ధమునకుఁ బోవు నుత్సాహము కొంచెమైనను బయలుపడ కుండునట్లును, దనకోపము ఇతరు లెఱుఁగకుం డునట్లును గంభీరముగాఁ బరాక్రమము వహించి నాట్యశాలకుం బోయె నని తా.

325. వివేకరహిత హృదయంబునుంబోలెన్ = తెలివిమాలినవాని మనస్సువలె. తమోదూషితంబును = చీఁకటిచేఁ జెడఁగొట్టఁబడినదియు, అజ్ఞానముచేఁ జెడఁగొట్టఁబడినదియు. విదగ్ధ వనితాప్రేమంబునున్ పోలెన్ = ప్రౌఢనాయికయొక్క యనురాగమువలె. దుర్నిరూపంబును = తెలియరానిదియును. ఘోరఅటవీభాగంబునున్ పోలెన్ = భయంకర మయిన యడవిప్రదేశమువలె. నిర్మనుష్యంబును = మనుష్యులు లేనిదియును. కాపురుషలక్ష్మీవిలాసంబునున్ పోలెన్ = నీచపురుషుని సంపదయొక్క యతిశయమువలె. అనుపయోగ్యంబును = ఉపయోగింపరానిదియు. అనభ్యస్తశాస్త్రంబునున్ పోలెన్ = చదువఁబడని శాస్త్రమువలె. దుర్గమంబును = చొరరానిదియును, తెలియరానిదియును. స్వప్నలబ్ధపదార్థంబునున్ పోలెన్ = కలయందుఁ బొందఁబడిన వస్తువువలె. అదృష్టిగోచరంబును = కనఁబడనిదియును. విషమకావ్యంబునున్ పోలెన్ = క్లిష్టకావ్యమువలె. అస్పష్ట అలంకారంబును = స్పష్టము కాని యలంకారములు గలదియును. బాలిశరాజ్యంబునున్ పోలెన్ = మూఢునిరాజ్యమువలె. జారచోరహృద్యంబునున్ = విటులకును దొంగలకును ఇంపైనదియును. ఐన ఆ నర్తన ఆగారంబు ముఖభాగస్థలంబు = అయినట్టి యానాట్యశాలయొక్క ముందటి ప్రదేశమును.

326. కెలఁకులున్ = పార్శ్వప్రదేశములను. పిఱిందిదెసయున్ = వెనుకదిక్కును. కలయన్ = చక్కఁగా. పరికించి = చూచి. తన అఖండితబాహాబలగర్వము అ = తనయొక్క తక్కువకాని భుజబల

బలగర్వమ యచ్చట ముం, గలిగా మదమత్తభద్ర♦గజసదృశగతిన్. 326

శా. ధ్వాంతాకారితకుడ్యకుట్టిమఘన♦స్తంభావళీరూపముం
భ్రాంతాదిప్రవిభాగబోధరహిత♦ప్రాగ్భాగముం గాతర
స్వాంతత్రాసకరంబునై దురభివే♦శంబైనయాలోను ని
శ్చింతుండై సతికేలు వట్టికొని చొ♦చ్చెన్ భీముఁ డత్యుగ్రతన్. 327

వ. ఇట్లు సొచ్చి తఱియం జని మధ్యప్రదేశంబున విరాటనందనలీలాపర్యంకం బరసి కని దాని కనతిదూరంబునం బాంచాలి నొసరిల నునిచి తా నాతల్పంబున నుండె నంతం గీచకుండు. 328

క. కైసేసి మదవికారో, ల్లాసంబున మేను వొంగ ♦ లఘుగతి నుత్కం

గర్వమే. ముంగలికాన్ = ముందరకాఁగా. మదమత్తభద్రగజ సదృశగతిన్ = మదముచే నొడలెఱుంగని భద్రజాతియేనుఁగుయొక్క నడకవంటి నడకచేత. భీముఁడు నాలుగుప్రక్కలను జూచి తనబాహుబలమే సహాయముగాఁ గలవాఁడై మదపుటేనుఁగువలె నడచుచు నని తా.

327. ధ్వాంత...రూపమున్—ధ్వాంత ఆకారిత = చీఁకటియొక్క యాకారమువంటి యాకారము గలదిగాఁ జేయఁబడినటువంటి, కుడ్య = గోడలయు, కుట్టిమ = కట్టినపునేలయొక్కయు, ఘన స్తంభఆవళీ=గొప్పకంబములసమూహములయొక్కయు, రూపమున్ = రూపము గలదానిని. ప్రాంత... ప్రాగ్భాగమున్—ప్రాంత ఆది=కొనమొదలు అను, ప్రవిభాగ=భేదముయొక్క, బోధ=జ్ఞానముచేత, రహిత = విడువఁబడిన, ప్రాక్ భాగమున్= ముందరిప్రదేశము గలదియును, పాఠాం:—ప్రాగ్ద్వారమున్ = తలవాకిలి గలదియును. కాతరస్వాంతత్రాసకరంబున్ ఐ = భయపడుమనస్సు గలవారికి భయము కలిగించునదియునై. దురభివేశంబు = చొరరానిది. ఐనఆలోను = అయినట్టి యానాట్యశాలయొక్క లోపలిభాగమును. నిశ్చింతుండు ఐ = చింత లేనివాఁడై. సతికేలు = భార్యచేతిని. పట్టికొని. భీముఁడు. అతిఉగ్రతన్ = మిక్కిలి కోపము గలవాఁ డగుటచేత. చొచ్చెన్ అని యన్వయము. చీఁకటిలోఁ జీఁకటిగా నుండునట్టి గోడలు మొదలగునవి కలదియును, తుద మొదలు తెలియరాని తలవాకిలి గలదియును, పిఱికివాండ్రకు భయంకరంబును నగునానాట్యశాలను భీముఁడు జంకులేక ద్రౌపది చేయిపట్టుకొని భయంకరాకారుండై ప్రవేశించె నని తా.

328. తఱియన్ = లోపలికి. విరాటనందన లీలాపర్యంకంబు = ఉత్తరయొక్క విలాసపు పాన్పును. అరసి = వెదకి. అనతిదూరంబునన్ = కొంచెము సమీపమునందు. పాంచాలిన్ = ద్రౌపదిని. ఓసరిలన్ = తొలఁగునట్లు. తల్పంబునన్ = పాన్పునందు.

329. కైసేసి = అలంకరించుకొని. మదవికారఉల్లాసంబునన్ = మదముచేతఁ గలిగిన వికారముయొక్క యతిశయముచేత. లఘుగతిన్ = శీఘ్రగమనముచేత. ఉత్కంఠా...అంతరంగుండు—ఉత్కంఠా = తహతహయును, ఆసవ = మద్యముయొక్క, పాన = త్రాగుటయొక్క, విధాన = చేయుటయందలి, వ్యాసంగ = ఆసక్తిచేత, తరంగిత = అలలుగలది యయిన, అంతరంగుండు = మనస్సుగలవాఁడు. అలంకారము చేసికొని యొడలెఱుంగనివాఁడై యెప్పుడెప్పుడు పోవుదును అను తహతహ యునుమద్యము త్రాగుటచే వేగిరపడుచున్నమనస్సు గలవాఁడై శీఘ్రముగా నని

తాసవపానవిధాన, వ్యాసంగతరంగితాంత♦రంగుం డగుచున్. 329

శా. సింగం బున్న గుహానికేతమునకుఁ ♦ శీఘ్రంబునన్ వచ్చుమా
తంగంబుం బురుడించుచుం బవనపు♦త్రస్వీకృతం బైనయా
రంగాగారము సేర వచ్చి మదిలో ♦ రాగంబు ఘూర్ణిల్ల నిం
తిం గాముం డిటఁ దేఁడె యింత కని యు♦ద్రిక్తాంగజోన్మాదుఁ డై. 330

ఉ. స్వాంతము బాహుగర్వఘన♦సంతమసాంధము గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డ♦హంకృతి ముంగలి గాఁగ మండపా
భ్యంతరభూమిఁ జొచ్చి తడ♦యం జని యారసి సెజ్జ గాంచి య
త్యంతముదావహం బగుచు ♦ నందు రయంబునఁ గేలు సాఁచినన్. 331

చ. ఘనతరకోపవేగమునఁ ♦ గంపము నొందునిజాంగకంబులం
దనధృతిపెంపుసొం పచలి♦తంబులఁ జేయు సమీరుకూర్మినం

తా. పాఠాం:—ఉత్కంఠాసవవిశేషపాన = ఉత్కంఠ యను నుత్తమమద్యముయొక్క త్రాగుట యందు అని యర్థము.

330. ఉన్నగుహానికేతమునకున్ = ఉన్నట్టి గుహయను గృహమునకు, పాఠాం:—గుహాంతరాళమునకున్ — గుహాలోపలి కని యర్థము. మాతంగంబున్ = ఏనుఁగును. పురుడించుచున్ = పోలుచు. పవనపుత్రస్వీకృతంబు=భీమునిచే గ్రహింపఁబడినది. అరంగఅగారము= ఆనాట్యశాలను. మదిలోన్ = మనస్సునందు. రాగంబు = అనురాగము. ఘూర్ణిల్లన్ = అతిశయింపఁగా. ఇంతిన్ = ద్రౌపదిని. కాముండు = మన్మథుఁడు. ఇంతకున్ = ఇంతసేపటికి. ఇటన్ తేఁడు ఎ = ఇచ్చటికిఁ దీసికొనిరాఁడా? ఉద్రిక్తఅంగజఉన్మాదుఁడుఐ = అతిశయించిన మన్మథమదము గలవాఁడై. సింహ మున్నగుహకుఁ బోవు నేనుఁగువలెఁ గీచకుఁడు భీముఁ డున్న నాట్యశాలకుఁ బోయి మాలిని యింత సేపటికి వచ్చి యుండు నని తలఁచి మన్మథవికారము హెచ్చినవాఁడై యని తా.

331. స్వాంతము = మనస్సు. బాహుగర్వఘనసంతమసఅంధము = భుజగర్వము అను చిమ్మ చీఁకటిచేత గ్రుడ్డిది. శంక = భయము. అహంకృతి = అహంకారము. ముంగలి = ముందఱ పోవునది. మండపఅభ్యంతరభూమిన్ = నాట్యశాలయొక్క లోపలిప్రదేశమును. అత్యంతముదావహంబు= మిక్కిలి సంతోషము గలిగించునది. అగుచున్ అనుటను సెజ్జకాంచుట కర్తృపదము. అందున్ = ఆసెజ్జయందు. రయంబునన్ = వేగముచేత. కేలు = చేతిని. బాహుగర్వముచేతఁ గొంచెమైనను భయము లేక యహంకారముతో మండపము లోనికిఁ బోయి యచట వెదకి శయనముం గని మిక్కిలి సంతోషించి దానిమీఁదఁ జేయి యుంపఁగా నని తా.

332. ఘనతరకోపవేగమునన్=మిక్కిలి గొప్పదైన కోపముయొక్క వేగముచేత. కంపమున్= వణంకును. ఒందు నిజఅంగకంబులన్ = పొందునట్టి తనయవయవములను. తనధృతిపెంపుసొంపు = తనయొక్క ధైర్యాతిశయముయొక్క సమృద్ధి. అచలితంబులన్ = కదలనివానినిగా. సమీరుకూర్మినందనుఁడు = వాయువు ముద్దుకొడుకయిన భీముఁడు. తదీయచేష్టలును = ఆకీచకుని పైనకార్యము

దనుఁడు తదీయచేష్టలును ♦ దద్వచనంబులచొప్పు నేర్పడం
గనుమతి నూరకుండె నవి♦కారనిగూఢనిజప్రకారుఁడై. 332

గీ. కీచకాధముండు ♦ కిమ్మీరవైరిపైఁ, గేలు సాఁచి యావి♦శాలనయన
గాఁ దలంచి మేను♦ గరుపాఱ నిట్లను, మదనఘూర్ణమాన♦హృదయుఁడగుచు.

చ. వనిత మనోహరంబు లగు♦వస్తువు లెల్లను వేడ్క నేఱి నీ
కని నియమించి తెచ్చితిఁ బ్రి♦యంబునఁ గైకొను మొప్ప నంగనా
జనములు నన్నుఁ జూచి మరు♦సాయకముల్ దమచిత్తవృత్తు లేఁ
చినఁ గొని వచ్చి యిత్తురు వి♦శిష్టధనంబులు నాకు లంచముల్. 334

సీ. నాదురూపంబు మ♦నంబునఁ జిక్కిన, తరుణి దక్కొరు నేల ♦ సరకు సేయు
నాదులావణ్యంబు♦నకు నిచ్చ మెచ్చిన, యెలనాగ పైఁ బడ ♦ కేల నిలుచు
నావిలాసంబులు ♦ భావింపఁ బడసిన, యింతి పుష్పాస్త్రుచే ♦ నెట్లు బ్రదుకు
నావివేకమున కా♦నందింపఁ గనినయం, గన యెట్లు విరహాగ్నిఁ ♦ గ్రాఁగకుండు

లను. తత్ వచనంబులచొప్పున్ = వానిమాటలవిధమును. ఏర్పడన్ = స్పష్ట మగునట్లు. కనుమతిన్ = చూచుతలంపుతో. అవికారనిగూఢనిజప్రకారుఁడు ఐ = వికారము లేకుండుటచేతఁ గప్పఁబడిన తన విధము గలవాఁడై. ఊరక; ఉండెన్ అని యన్వయము. భీముఁడు కోపముచేత నదరుచున్న యవయవములను ధైర్యముచేఁ జిక్కఁ బట్టికొన్నవాఁడై యాకీచకుని చేష్టలను వానిమాటలను చూచి వినఁ దలఁచి దనసంగతి వెలిపుచ్చక నిర్వికారుండై యూరకుండె నని తా.

333. కిమ్మీరవైరిపైన్ = కిమ్మీరుని శత్రువైన భీమునిమీఁద. ఆవిశాలనయనకాన్ = వెడల్పు కన్నులు గల ఆమాలిని యని. గరుపాఱన్ = గగుర్పు గలుగఁగా. మదనఘూర్ణమానహృదయుఁడు = మన్మథునిచేఁ జలించుచున్న మనస్సు గలవాఁడు. అగుచున్. ఇట్లు. అనున్ అని యన్వయము. కీచకుఁడు భీమునిఁ దాఁకి మాలిని యని తలఁచి మన్మథవశుండై యిట్లనియె నని తా.

334. వనిత = ఓ స్త్రీ! ఏఱి = ఏర్పఱచి. నియమించి = నిశ్చయించి. అంగనాజనములు = స్త్రీలు. మరుసాయకముల్ = మన్మథబాణములు. తమచిత్తవృత్తులు = తమమనోధర్మములను. ఏఁచినన్ = బాధింపఁగా. విశిష్టధనంబులు = ఉత్తమధనములను. మాలినీ! నీకుఁ గా మేలివస్తువుల నేర్పఱచి తెచ్చితిని. తీసికొనుము. ఇదివఱ కెప్పుడును స్త్రీలు నన్ను వలచినవారలై నాకు ఉత్తమపదార్థములను లంచముగాఁ దెచ్చి యిత్తు రని తా.

335. చిక్కినతరుణి = తగిలిన స్త్రీ. తక్కొరున్ = ఇంకొకనిని. నారూపమును జూచిన స్త్రీ మఱియొకని నొల్లదని తా. లావణ్యంబునకున్ = సౌందర్యమునకు. ఎలనాగ = స్త్రీ. నా సౌందర్యము చూచినయాఁడుది నాపైఁ బడు నని తా. భావింపన్ = తెలియుటకు. పుష్పాస్త్రుచేన్ = మన్మథునిచేత. నావిలాసములను నెఱింగిన యాఁడుది మన్మథునకు లోనగు నని తా. విరహాగ్నిన్ = ఎడఁబాటు అను నిప్పుచేత. క్రాఁగక = తపింపక. నావివేకము నెఱింగిన స్త్రీ నాయెడఁబాటును సహింప లేదని తా. నాఆడుమాటలు = నేను పలుకుమాటలు. తెఱవపిండు ఉల్లములకున్ = స్త్రీసమూహముల మనస్సులకు. ఇంపు ఆరెడు ఉక్తులు = మనోహరము లయిన

మెఱయు నాయాఁడుమాటలు ♦ దెఱవ వింతు, నుల్లములకు నిం పారెడు♦నురులుగా వె
యిట్లు నీ వొక్కతవె నన్ను ♦ నేలుకొంటి, గాక మాట లిం కేటికిఁ ♦ గమలవదన.

క. అనవుడు మనమున నిస్సీ, యని యుచితనిగూఢభంగు ♦ లగుభాషణముల్
దనప్రియ వినిపించుట కి, ట్లనియెన్ మృదురీతి భీముఁ ♦ డాతనితోడన్. 336

గీ. ఇట్టివాఁడవు గావున ♦ నీవు నిన్నుఁ, బొగడికొనఁ దగు సకట నా♦పోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడ♦నైన నీకుఁ, బడయ వచ్చునె యెఱుఁగక ♦ పలికి తిట్లు.

క. నాయొడలు సేర్చినప్పుడ, నీయొడ లెట్లగునో దాని ♦ నీ వెఱిఁగెదు న
న్నే యబలలతోడిదిగాఁ, జేయఁ దలంచితివి తప్పు ♦ సేసితి గంటే. 338

క. నను ముట్టి నీవు వెండియు, వనితలసంగతికిఁ బోవు♦వాఁడవె నైనం
దను వేఁ బడసినఫలమే, కనియెద విదె చిత్తభవవి♦కారము లెల్లన్. 339

మ. అనుచున్ గ్రక్కున లేచి రోషకఠినం ♦ బౌహాస మాసూతునె
మ్మన ముద్వేగముఁ బొందఁ జేయ బలసా♦మగ్రీసముజ్జృంభణం

వలలు. కమలవదన = కమలమువంటి మోము గలదానా! నామాటల కెట్టి స్త్రీలును లోఁబడుదురు, ఈవిధముగా నాచేఁ బ్రార్థింపఁబడి నన్నేలినదానవు నీవొక్కతవే యని తా.

336. ఇస్సీ! నిందార్థకము. ఉచితనిగూఢభంగులు = తగినదియు రహస్యము గలదియు నగువిధములు. భాషణముల్ = మాటలను. తనప్రియన్ = ద్రౌపదిని. మృదురీతిన్ = మృదు వగు విధమున. కీచకుని మాటలు విని భీముఁడు వానిమాటలకు రోసి ద్రౌపది వినవలయు నని రహస్యాభిప్రాయముగా నీమాటలు కీచకునితో చెప్పె నని తా.

337. నాపోల్కి ఆఁడుదానిన్ = నావంటి స్త్రీని. ఎయ్యెడన్ ఐనన్ = ఏచోటనైనను. ఇంత గొప్పవాఁడవు కావున నీవే నిన్నుఁ బొగడుకొనుచున్నాఁడవు, అయినప్పటికిని నావంటి స్త్రీ నీ కెచ్చటను దొరకదు, ఇది తెలియక యిట్లు పలికితి వని తా. ఆత్మస్తుతి చేసికొన్నవాఁడ వగుటచే నీచుఁడ వనియు నేను పురుషుఁడ నైనది తెలియ కున్నాఁడ వనియు రహస్యము.

338. నాఒడలు = నాదేహమును. అబలలతోడిదిగాన్ = స్త్రీలవంటి దానినిగా. నాదేహము తగులఁగానే నీకుఁ గలుగుసుఖ మెట్టిదో యెఱుఁగుదువు, నీవు నన్ను సాధారణ స్త్రీలతో సమానముగాఁ జూచుట తప్పని తా. నాదేహము తాఁకఁగానే నీవు మృతి నొందుదు వనియు నన్ను స్త్రీగాఁ దలంపవల దనియు రహస్యము.

339. ముట్టి = తాఁకి. వనితలసంగతికిన్ = స్త్రీలతోఁ గూడుటకు. తనువు = దేహమును. ఏన్ = నేను. పడసినఫలము ఏ = పొందినఫలమే. చిత్తభవవికారములు = మన్మథవికారములను. ఎల్లన్. ఇదె. కనియెదవు అని యన్వయము. నన్నుఁ దాఁకి నీవు మరల మఱియొక స్త్రీని పొందువాఁడవు కావు. నీవు మన్మథవికారముల నన్నిటిని చూడఁగలవు, ఇది నా జన్మఫల మని తా. నన్నుఁ దాఁకిన పిమ్మట నీవు చత్తువు అని రహస్యము.

340. గ్రక్కునన్ = తటాలున. రోషకఠినంబు = కోపముచే భయంకరము. ఔహాసము = అయిన నవ్వు. ఆసూతునెమ్మనము = ఆకీచకుని నిండుమనస్సును. ఉద్వేగమున్ = కలఁతను. బలసా

బున వానిం దల వట్టి వంచుటయు నే♦పుం జేవయుం దోఁప వాఁ
డనుమానింపక బె ట్టదల్చికొని కో♦పాటోపదీప్తాంగుఁడై. 340

( భీమసేనుఁడు కీచకుని సంహరించుట. )

వ. గంధర్వుం డనుతలంపున. 341

చ. పవనతనూజుబాహువులు ♦ పాణియుగంబునఁ బట్టి వీఁకమై
నవనిపయిం బడం దిగిచి ♦ యంగము జానుల నూఁదినం గడున్
జవమున దండతాడితభు♦జంగముభంగి సముత్థితాంగుఁ డై
యవయవముల్ ప్రకోపరభ♦సాతిశయంబునఁ బొంగ నుద్ధతిన్. 342

మ. మగుడం గీచకుఁ బట్ట వాఁడును బలో♦న్మాదంబునన్ బాహుగ
ర్వగరిష్ఠుం డగునాహిడింబరిపుఁ దీ♦వ్రక్రోధుఁ డై పట్టి బె
ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్ భుజబలా♦టోపంబుమై నొండొరున్
మిగులం జాలక కొంతసేపు వడి మే♦మే పోరి రుగ్రాకృతిన్. 343

మగ్రీ సముజ్జృంభణంబునన్ = బలముయొక్క సమృద్ధియొక్క యతిశయముచేత. వానిన్ = ఆకీచకుని. ఏపున్ = గర్వమును. చేవయున్ = బలమును. బెట్టు = మిక్కిలి. కోపఆటోపదీప్త ఆత్ముఁడుఐ = కోపముయొక్క యతిశయముచే జ్వలించుచున్న మనస్సు గలవాఁడై. ఇట్లు చెప్పుచు తటాలున లేచి భీముఁడు వానిమనం బదరునట్లు అట్టహాసము చేసి బాహుబలముచే కీచకునితలపట్టి వంపఁగా వాఁడు పరాక్రమము వహించి మిక్కిలి కోపించినవాఁడై యని తా.

342. పవనతనూజు బాహువులు = భీముని భుజములను. పాణియుగంబునన్ = చేతులజంటచేత. వీఁకమైన్ = పరాక్రమముచేత. అవనిపయిన్ = భూమిమీఁద. తిగిచి = లాగి. అంగము = భీముని దేహమును. జానులన్ = మోఁకాళ్లచేత. ఊఁదినన్ = అదుమఁగా. కడున్ జవమునన్ = మిక్కిలి వేగముచేత. దండతాడితభుజంగముభంగిన్ = కఱ్ఱచేఁ గొట్టఁబడిన పామువలె. సముత్థితఅంగుఁడు ఐ = ఎగిరిన దేహము గలవాఁడై. ప్రకోపరభసఅతిశయంబునన్ = ఎక్కుడు కోపముయొక్క వేగముయొక్క అతిశయముచేత. ఉద్ధతిన్ = గర్వముతో. భీముని చేతులను దనచేతులతోఁ బట్టి నేలం బడవైచి వానిదేహమును తనమోఁకాళ్లతో నదుమఁగా భీముఁడు కఱ్ఱతోఁ గొట్టినపామువలె లేచి మిక్కిలి కోపముచే నుప్పొంగినమేను గలవాఁడై యని తా.

343. మగుడన్ = మరల. బలఉన్మాదంబునన్ = బలగర్వముచేత. బాహుగర్వగరిష్ఠుండు = భుజగర్వముచే గొప్పవాఁడు. అగుఆహిడింబరిపున్ = అయినట్టి యాభీముని. తీవ్రక్రోధుఁడుఐ = తీక్ష్ణమయిన కోపము గలవాఁడై. బెట్టుగన్ = మిక్కిలి. త్రోపాడఁగన్ = త్రోయఁగా. భుజబలఆటోపంబుమైన్ = చేతులలావుయొక్క యతిశయముచేత. వడిన్ = వేగముగా. ఉగ్రఆకృతిన్ = భయంకర మయిన యాకారముచేత. మేమే = అనాయాసముగా. పోరిరి అని యన్వయము. మరలఁ గీచకునిఁ బట్టఁగాఁ గీచకుఁడును భీముని కోపంబునం బట్టి త్రోయఁగా నిద్దఱును బాహుబలంబున నొకరినొకరు మీఱఁజాలక కొంతసేపు భయంకరముగాఁ బోరి రని తా.

వ. అట్టియెడ. 344

క. తనయగపాటొరు లెఱుఁగుదు, రని సూతుఁడు సమయభంగ ♦ మగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే, యనిగూఢవిమర్దనప్ర♦హారములఁ దగన్. 345

వ. మల్లయుద్ధనైపుణంబు మెఱయం గడంగి. 346

సీ. తిగిచిన నడుగులు ♦ దెరలక యొండొరుఁ, గ్రమ్మఱఁ దిగుచుచుఁ♦ గడిమిమెఱయఁ
బొడిచిన వెస బీఱు♦వోవక యొండొరు, నందంద పొడుచుచు ♦ నవనిఁ బెట్టి
యొత్తిన బెగ్గలం ♦ బొందక యొండొరు, బలువిడి నొత్తుచు ♦ నలవు మిగిలి
యడఁగంగఁ బొదివిన ♦ నడిచిపా టించుక, యును లేక వీఁక నొం♦డొరుల నడరి
యడఁగఁబొదువుచునలుకయం♦తంతకగ్గ, లించియాయముల్ నొంచిదో♦ర్లీలనెఱపి
యుల్లసిల్లినస్రుక్క కొం♦డొరులరౌద్ర, వృత్తినొంచుచొండొరులకు♦వెక్కసముగ.

క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు, నదలుచుచుం బడుచు లేచు♦చడఁగుచు వడి గొం

345. తనయగపాటు = తా నగపడుటను. సూతుఁడుఁ = కీచకుఁడును. సమయభంగము = అజ్ఞాతవాసప్రతిజ్ఞచెడుట. కొంకుచుఁ = సంకోచపడుచు. గూఢవిమర్దనప్రహారములఁ = రహస్యముగా మర్దించుటలచేతను గొట్టుటలచేతను. తా నట్టిచోట నాకమయమున నుండుట నితరు లెఱుంగుదు రని కీచకుఁడును, అజ్ఞాతవాసప్రతిజ్ఞకు భంగము వచ్చు నని భీముఁడును సంకోచించి నిశ్శబ్దముగా నొకరినొకరు నొప్పించుచు నని తా.

346. మల్లయుద్ధనైపుణంబు = జెట్టిపోరునందలి నేర్పు.

347. తిగిచినఁ = లాగఁగా. తెరలక = కదలక. కడిమి = పరాక్రమము. వెసఁ = శీఘ్రముగా. బీఱువోవక = బలహీనత నొందక. అందంద = మఱిమఱి. అవనిఁ = భూమియందు. ఒత్తినఁ = అదుమఁగా. బెగ్గలంబు = బలహీనతను. బలువిడిఁ = పరాక్రమముచేత. అలవు = బలము. మిగిలి = అతిశయించి. పొదివినఁ = పట్టఁగా. అడిచిపాటు = సంభ్రమము. అడరి = మీఱి. అగ్గలించి = అధికమై. ఆయముల్ = మర్మస్థానములను. నొంచి= నొప్పించి. దోర్లీలఁ = భుజవిలాసమును. నెఱపి = నిండించి. ఉల్లసిల్లినఁ = ప్రకాశింపఁగా. స్రుక్క = తగ్గక. రౌద్రవృత్తిఁ= భయంకర మయినవ్యాపారముచేత. వెక్కసముగఁ=దుస్సహ మగునట్లు. ఒకఁడు పట్టియీడ్చినపుడు కదలకమఱియొకఁడు వానిం బట్టియీడ్చె ననియు, ఒకఁడు గ్రుద్దినపుడు వెనుదీయక మఱియొకఁడు వానిం గ్రుద్దెననియు, ఒకఁడు నేలఁబడఁ ద్రోసి యదుమఁగా నింకొకఁడు వానిం బడఁ ద్రోసి యదిమె ననియు, ఒకఁడు అడఁచిపట్టుకొనఁగా మఱియొకఁడు వాని నట్లుపట్టుకొనె ననియు ని ట్లింతకంతకు హెచ్చుచున్నకోపము కలవారై యొండొరులయాయపుపట్టులను నొప్పించి యొకరి కొకరు తగ్గక సమముగాఁ బోరుచు నని తా.

348. కదియుచుఁ = సమీపించుచు. పాయుచుఁ = తొలఁగుచు. వడి = వేగమును. కొంచుఁ = కొనుచు. ఒదవెడుకినుకఁ = అతిశయించునట్టి కోపముచేత. బెట్టిదముగఁ= భయంకరముగా. చలంబు = పట్టుదలను. డింపక = విడువక. కడిమిఁ=బలముచేత. పెనఁగిరి=పోరిరి అని

చోద వెనుకనుకం గదుబె, ట్టిదముగఁ బెనఁగిరి చలంబు ♦ డిందక కడిమిన్. 348

గీ. ఇవ్విధమున నేచి ♦ యిరువురుఁ బెద్దయుఁ, బ్రొద్దు పోర వాయు♦పుత్త్రుబలము
దోడుతోడఁ బెరుఁగఁ ♦ దొడఁగె నాకీచకా, ధమునిలావు పిదపఁ దఱుఁ♦గఁ జొచ్చె.

ఉ. దాని నెఱింగి యెంతయు ను♦దగ్రత నాబకవైరి గ్రక్కునన్
వాని నడంగఁ బట్టి పడ ♦ నైచి మహోగ్రత నాక్రమించెఁ బం
చానన మేణముం బొదువు♦ నట్లతఁ డూర్జితశక్తి నుద్ధతుం
డై నెగసెన్ సమీరసుతు♦నల్కకుఁ బ్రాఁకిడినట్లు వీఁకతోన్. 350

క. నెగయు నెడ నగ్గమైనను, బిగి యారుచుఁ బిఱుఁదుసనినఁ ♦ భీకరుఁడై బె
ట్టుగఁ బొడిచె నపుడు భీముఁడు, పగతుఁడు గను మిడిసి నేలఁ ♦ బడి తన్నికొనన్.

యన్వయము. నానావిధములుగాఁ బట్టుదల విడువక వారిద్దఱును సమానముగాఁ బోరి రని తా.

349. ఏచి = విజృంభించి. పెద్దయుఁబ్రొద్దు = చాలసేపు. తోడుతోడన్ = క్రమక్రమముగా. లావు = బలము. తఱుఁగన్ = తగ్గుటకు. ఇట్లా భీమకీచకులు చాలసేపు పోరుచుండఁగా భీమునిబలము క్రమక్రమముగా నధిక మయ్యెను, కీచకునిబలము తగ్గె నని తా.

350. ఎంతయున్ = మిక్కిలి. ఉదగ్రతన్ = గొప్పతనముచేత. ఆబకవైరి = ఆభీముఁడు. మహత్ ఉగ్రతన్ = మిక్కిలి కోపము గలవాఁ డగుటచేత. పంచాననము = సింహము. ఏణమున్ = జింకను. పొదువునట్లు = పట్టునట్లు. ఆక్రమించెన్ = పట్టెను అని యన్వయము. అతఁడు = ఆకీచకుఁడు. ఊర్జితశక్తిన్ = ఎక్కుడుబలముచేత. ఉద్ధతుండు ఐ = గర్వించినవాఁడై. సమీరసుతుఅల్కకున్ = భీముని కోపమునకు. ప్రాఁకు = అల్లికకొయ్యను. ఇడినట్లు = పెట్టినట్లు. వీఁకతోన్ = పరాక్రమముతో. నెగసెన్ అని యన్వయము. కీచకుఁడు బలహీనుఁ డగుట నెఱింగి భీముఁడు సింహము జింకను బట్టునట్లు కీచకుం బట్టఁగా నతఁడు పరాక్రమించి యెగసెను, అందుచే భీమునకుఁ గోప మెక్కు డయ్యె నని తా.

351. నెగయుఎడన్ = ఎగురునప్పుడు. అగ్గము = అధీనుఁడు. ఐనను = అయినప్పటికిని. బిగి యారుచున్ = బిగువుకలవాఁ డగుచు. పిఱుఁదుచనినన్ = కీచకుఁడు వెనుకకుఁ బోఁగా. అపుడు. భీముఁడు. భీకరుఁడు ఐ = భయమును గలిగించువాఁడై, మిక్కిలి కోపము గలవాఁడై యనుట. పగతుఁడు = పగవాఁడైన కీచకుఁడు. కనుమిడిసి = కనుగ్రుడ్లు బైటికి వచ్చి. నేలన్. పడి. తన్నికొనన్. బెట్టుగన్ = దృఢముగా. పొడిచెన్. కీచకుఁడు ఎగసినప్పుడు భీమునిచేఁ జిక్కువాఁ డైనను అలోపల బిగువు గలవాఁడై వెనుకకుఁ బోయి తప్పించుకొనఁగా భీముఁడు మిక్కిలి కోపముతో నతని దృఢముగా గుద్దెను, అందు కతఁడు కనుగ్రుడ్లు బైటికి వచ్చి నేలఁబడి తన్నుకొనె నని తా. పాఠాం:— పిఱుఁదుసనినఁ బిడికిటఁ గొఱసంది గదుబెడిదముగఁ బొడిచెన్ = వెనుకకుఁ బోఁగా మర్మస్థానమును మిక్కిలి భయంకరముగాఁ బొడిచె నని యర్థము. ఈపాఠము శబ్దరత్నాకరమునందు నుదాహరింపఁబడినది. అయినను వ్రాఁతప్రతులయందుఁ బెక్కింటియందు భీకరుఁడై యనుపాఠమే కనఁబడుటవలనను ఈపాఠమునందుఁ గర్తృపదము లేమివలనను బూర్వపాఠమే ప్రధానముగాఁ గ్రహింపఁదగును.

గీ. పల్లవప్రసూన♦ఫలభరితం బగు, ద్రుమాను గూలఁ ద్రోచు♦మత్తగజము
పోలె వివిధరత్న♦భూషణభూషితుం, డైనసూతుఁ గూల్చె ♦ ననిలసుతుఁడు.

చ. వికృతపుఁజావు సంప మది ♦ వేడుక పుట్టినఁ గిట్టి పట్టి మ
స్తకమును పీనదీర్ఘభుజ♦శాఖలుఁ బాదయుగంబు మేనిలో
నికిఁ జొర నుగ్గుగాఁ దుఱిమి ♦ నించినక్రంతలతిత్రిమైచకీ
చకు ధరణీస్థలిం జదిపి ♦ చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టుఁడై. 353

క. తనకడిమికలిమి నచ్చియు, మనమునఁ దలఁ కడర సూతు♦మరణంబు గనుం
గొనుటకుఁ దల్లడపడుప్రియ, వనిత కతనిచావు సెప్పి ♦ వడిఁ దన్మాత్రన్. 354

చ. అనలము గూఢయత్నమున ♦ నయ్యెడకుం గొని వచ్చి దానిఁ జ
య్యన వెలుఁగొందఁ జేయుటయు ♦ నచ్చెరువుం భయముం బ్రియంబునుం
బెనఁగొనఁగాఁ గనుంగొనియె ♦ భీతమృగేక్షణ భీము డాయఁ గాఁ
జని కడు నక్కజం బయిన♦చందమునం బడి యున్నపీనుఁగున్. 355

352. పల్లవప్రసూనఫలభరితంబు = చిగుళ్లచేతను పువ్వులచేతను బండ్లచేతను నిండినది. మత్తగజముపోలెన్ = మదపుటేనుఁగువలె. వివిధరత్నభూషణభూషితుండు = నానావిధములయిన రత్నాలసొమ్ములచే నలంకరింపఁబడినవాఁడు. ఐనసూతున్ = అయినకీచకుని. అనిలసుతుఁడు = భీముఁడు. కూల్చెన్ అని యన్వయము. చిగుళ్లు మొదలగువానితోఁ గూడిన వృక్షము నేనుఁగు గూల్చునట్లు భీముఁడు నానావిధములయిన యాభరణములతోఁ గూడిన కీచకునిఁ జంపె నని తా.

353. కిట్టి = సమీపించి. మస్తకమును = తలను. పీనదీర్ఘభుజశాఖలున్ = బలిసినవియు నిడుదలు నగు కొమ్మలవంటి చేతులను. పాదయుగంబున్ = పాదముల జంటను. మేనిలోనికిన్ = శరీరములోపలికి. చొరన్ = చొచ్చునట్లు. నుగ్గుగాన్ = చూర్ణముగా. నించినక్రంతలతి త్రి = నిండించిన రంధ్రములసంచి. చదిపి = నలిపి. తుష్టుఁడుఐ = సంతోషించినవాఁడై. చేసెన్ అని యన్వయము. కీచకుని వికారముగాఁ జంపవలఁయు నని వానితలను జేతులను పాదములను విఱిచి కడుపులోనికిఁ దూర్చి పిసికి ముద్దచేసె నని తా. పాఠాం:—రుష్టుఁడై = కోపము గలవాఁడై యని యర్థము. ఈపాఠము మూలానురూప మగుటంజేసియు నౌచిత్యము గల దగుటం జేసియు యుక్తతరము.

354. తనకడిమికలిమి = తనబలాతిశయమును. నచ్చియున్ = నమ్మియును. తలఁకు = సంశయము. అడరన్ = కలుగఁగా. సూతుమరణంబు = కీచకుని చావును. తల్లడపడుప్రియవనితకున్ = వేగిరపడుచున్న కూరిమిభార్యకు. తన్మాత్రన్ = ఆనిమిషముననే. భీమునిబలమునందు నమ్మకము గలిగియుఁ గీచకునిఁ జంపఁ గలఁడో లేఁడో యని సంశయము గలదై కీచకునిచావుఁ జూచుట యెప్పు డని వేగిరపడుచున్న ద్రౌపదికిఁ గీచకుఁడు చచ్చెనని చెప్పి వెంటనే యని తా.

355. అనలమున్ = నిప్పును. గూఢయత్నమునన్ = రహస్య మయిన ప్రయత్నముచేత. దానిన్ = ఆనిప్పును. ప్రియంబునున్ = సంతోషమును. భీతమృగఈక్షణ = బెదరిన జింకకన్నుల వంటి కన్నులు గల ద్రౌపది. డాయఁగాన్ = సమీపించునట్లు. అక్కజంబు = వింత. రహస్యముగా నచ్చోటికి నిప్పు తెచ్చి దాని వెలిఁగింపఁగా ద్రౌపది యాశ్చర్యమును భయమును సంతోషమును గలదై వింతగాఁ బడి యున్న యాపీనుఁగును గని తా.

ఉ. చూచుచుఁ జేరి వ్రేల్మిడుచు • చుం దల యూఁచి విదగ్ధచిత్తయై
యాచపలాక్షి ముక్కుపయి • నంగుళముం గదియించి దీసికై
కీచక యింత సేసితి సు•ఖిత్వముఁ బొందుదు గాక యింక వ
ల్లేచిన నిట్లు గా కుడుగు•నే యనుచున్ వెఱఁ గందుచుండఁగన్. 356

క. పూనిక నెఱపితి సతియవ, మానముఁ బరితాపభరము • మాన్చితి నిప్పు డి
ట్లే నని మదిఁ బొంగెడుపవ, మానసుతుం డిట్టు లనియె • మానినితోడన్. 357

శా. చింతాశల్యము వాసెనే భుజబలో•ద్రేకంబు నీ కెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దు•శ్చారిత్రునిం జూచితే
సంతోషించితె యిట్లు గాక బ్రదుకన్ • శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరినయట్టివీరులకు నా•చేతం బయోజాననా. 358

క. అనిన విని సింహబలమ, ర్దను నవలోకించి ద్రుపద• రాజతనయ యి

356. మిడుచుచున్ = విఱుచుచు. విదగ్ధచిత్తవై = నేర్పుగల మనస్సు గలదై. ఆచపలాక్షి = చలించుచున్న కన్నులు గల యాద్రౌపది. అంగుళమున్ = వ్రేలిని. కదియించి = చేర్చి. సుఖిత్వమున్ = సుఖము గలవాఁ డగుటను. ఏచినన్ = చెలరేఁగినయెడ. ఉడుగునే = తప్పునా? వెఱఁగు = ఆశ్చర్యమును. చూచి దగ్గఱకుఁ బోయి నెటికవిఱిచి ముక్కుపై వ్రేలుంచుకొని యాద్రౌపది యిట్టిఫలము నొందుటకు నీ వింత చేసితివి, ఇఁక సుఖము పొందుదువు, ఇట్లు చెలరేఁగినచో నీఫలము కలుగక తప్ప దని తా. పాఠాం:—విషణ్ణచిత్తయై = దుఃఖించిన మనస్సుగలదై యని యర్థము. ఈపాఠము ప్రకృతానుచితము. విలక్షచిత్తయై = ఆశ్చర్యము గల మనస్సు గలదై యని యర్థము. ఈపాఠము వెఱఁగందుచున్ అనుటచేఁ బునరుక్తము.

357. నెఱపితిన్ = సాధించితిని. సతిఅవమానమున్ = ద్రౌపదియొక్క యవమానమును. పరితాపభరమున్ = సంతాపముయొక్క యతిశయమును. మాన్చితిన్ = పోఁగొట్టితిని. పొంగెడుపవమానసుతుండు = సంతోషించునట్టి భీముఁడు. మానినితోడన్ = ద్రౌపదితో. ఇట్టులు. అనియెన్ అని యన్వయము. భీముఁడు ప్రతిజ్ఞ సాధించి భార్యయొక్క యవమానమును సంతాపమును బోఁగొట్టితి నని సంతోషించి ద్రౌపదితో నిట్లు చెప్పె నని తా.

358. చింతాశల్యము = దుఃఖము అను చీల. పాసెనుఏ = తొలఁగెనా? భుజబలఉద్రేకంబు = బాహుబలముయొక్క యతిశయము. ఎక్కెనుఏ = తెలియవచ్చెనా? రోషపావకుఁడు = కోపము అను నిప్పు. శాంతిన్ పొందెనె = ఆఱెనా? దుశ్చారిత్రునిన్ = చెడ్డనడవడి గలవానిని. దుర్వృత్తిన్ = చెడుబుద్ధిచేత. నీచెంతన్ = నీదగ్గఱకు. నాచేతన్. ఇట్లు. కాక. బ్రదుకన్. శక్యంబె యని యన్వయము. పయోజఆననా = కమలమువంటి మోము గలదానా? ద్రౌపది సంబోధనము. ద్రౌపదీ! నీదుఃఖము తీఱెనా? నాబలము నీకుఁ దెలియవచ్చినదా? నీకోపము శాంతించెనా? దుష్టుఁ డయిన కీచకునిపాటుఁ జూచితివా? సంతోషించితివా? దుర్బుద్ధితో నీయొద్దకు వచ్చినవారు నాచే నిట్లు చత్తురు గాని బ్రదుకఁ జాల రని తా.

359. సింహబలమర్దనున్ = కీచకునిఁ జంపినభీముని. అవలోకించి = చూచి. నిండారినసమ్మోదంబు = నిండినసంతోషము. వెలివిరిసి = వెలుపలికుబ్బి. తొరయంగన్ = వ్యాపింపఁగా.

ట్లనుఁ దనమనమున నిండా, రినసమ్మోదంబు వెలివిరిసి బెరయంగన్. 359

సీ. కొలువులోపల నిన్న ♦ కోప మగ్గలమైనఁ, దలఁకక నిలిచిన♦ధైర్యమహిమ
నేఁ డిందుఁ జనుదెంచి ♦ నిర్వికారతఁ బ్రజ, కన్నులు గప్పిన♦గౌరవంబు
మనవారిలోన నొ♦క్కని నైనఁ బిల్వక, యుత్సాహంబు సేసిన♦సాహసంబు
లోకదుర్జయుఁ డగు♦కీచకుని ని వ్రే, ల్మిడి రూపు మాపిన♦కడిమిసొంపు
సూడఁ దలపోయ మెచ్చ సం♦స్తుతి యొనర్ప, నాతలంబె నీయు త్తమ♦నాయకత్వ
మెఱిఁగి నినుఁ గొనియాడ నే ♦ నెంతదాన, మహితవిస్మయానందని♦ర్మగ్న నైతి.

క. అనుపలుకులు కర్ణరసా, యనము లగుడు నయ్యుధిష్ఠి♦రానుజుఁడు ముదం
బునఁ దేలి యింకఁ దడయం, జన దని ద్రౌపదికిఁ జెప్పి ♦ చయ్యన నేగెన్. 361

క. అనిన విని కీచకుఁడు స, చ్చినపిమ్మటఁ బుట్టినవి♦శేషము లెల్లన్
విను వేడుక మన మలరెడు, ననఘా యేర్పడఁగఁ జెప్పు ♦ మనుటయుఁ బ్రీతిన్.

ఇట్లు. అనున్ అని యన్వయము. భీమునిమాట విని ద్రౌపది మిక్కిలి సంతోషము గలదై యతనితో నిట్లనియె నని తా.

360. ఎత్తినన్ = కలుగఁగా. తలఁకక = చలింపక. ధైర్యమహిమ = ధైర్యముయొక్క యతిశయమును. నిర్వికారతన్ = వికారము లేనివాఁ డగుటచేత. ప్రజ = జనులయొక్క. ఉత్సాహంబు = పరాక్రమమును. సాహసంబు = తెగువను. లోకదుర్జయుఁడు = జనులకు జయింప నలవి గానివాఁడు. వ్రేల్మిడిన్ = నిమిషములో. కడిమిసొంపు = బలముయొక్క యతిశయమును. చూడన్, తలపోయన్, మెచ్చన్, సంస్తుతిఒనర్పన్—ఈనాలిగింటికిని సీసము నాలుగుపాదములతో నన్వయము. సంస్తుతి = స్తోత్రమును. నీయుత్తమనాయకత్వము = నీయొక్క యుత్తమనాయకుఁ డగుటను. మహితవిస్మయానందనిర్మగ్న = గొప్పయాశ్చర్యమునందును సంతోషమునందును మునిఁగినదానను. నిన్న సభలోఁ గోపమువచ్చినపుడు చలింపక యడఁచికొన్నధైర్యమును చూచుటకును, నేఁడిచటికి నెవ్వరికిని దెలియనట్లు వచ్చిన గౌరవమును దలంచుటకును, మనవారిలో నెవ్వరిని సహాయము పిలువక చేసినసాహసమును మెచ్చుటకును, ఎవ్వరికిని జయింప శక్యముగానికీచకుని క్షణములోఁ జంపినబలమును బొగడుటకును నా కలవి కాదు. నీగుణమును నేను గొనియాడ శక్తురాలను గాను. పరమాశ్చర్యమును బరమసంతోషమును బొంది పరవశ నైతి నని తా.

361. కర్ణరసాయనములు = చెవులపండువులు. అగుడున్ = కాఁగా. అయ్యుధిష్ఠిరానుజుఁడు = ధర్మరాజుతమ్ముఁ డయిన యాభీముఁడు. ద్రౌపది మాటలకు మిక్కిలి సంతోషము నొంది భీముఁ డచ్చట నిఁక నుండరా దని ద్రౌపదికిం జెప్పి త్వరగాఁ బోయె నని తా.

362. అనినన్ = అని వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పఁగా. అనఘా = పాపము లేనివాఁడా! వైశంపాయనుని సంబోధనము. అట్లు కీచకవధమును వైశంపాయనుఁడు చెప్పఁగా జనమేజయుఁడు విని కీచకుఁడు చచ్చిన పిమ్మట జరిగినవిశేషములను వినఁ గోరుచున్నాఁడను దెలియఁ జెప్పు మని యడుగఁగా వైశంపాయనుఁడు సంతోషముతో నని తా.

చ. పరమకృపావిధేయ నిరు♦పాధికచిన్మయకాయ గాఢవి
స్తరనిగమైకవేద్య గుణ♦తత్త్వవికారనియత్యభేద్య సం
స్మరణనిరస్తతాప ఘన♦సంసృతిసంతమసప్రదీప ని
ష్ఠురభుజసారదానవని♦షూదన భక్తజనప్రమోదనా. 363

క. చతురానందమయా దు, ర్గతిరోగోద్గమచికిత్సకా భువనభవ
స్థితిసంహారకరా ని, ర్వృతిపణ్యాపణపదార♦విందవికాసా. 364

మాలిని. సురపతిధృతచూడా♦శోభిరత్నాంశువీచి
స్ఫురణసుభగపాదాం♦భోజసంచారకేళీ
పరిచయకలనాల♦బ్ధవ్యయాతీతసౌఖ్యో
త్తరమునిజనహృన్మా♦ద్యన్మరాళప్రధానా. 365

363. పరమకృపావిధేయ = గొప్పదయకు లోనైనవాఁడా! నిరుపాధికచిన్మయకాయ = ఉపాధిరహితమైనజ్ఞానరూప మయిన స్వరూపము గలవాఁడా! గాఢవిస్తరనిగమైకవేద్య = అధిక మయిన విరివిగల వేదములచేతనే ముఖ్యముగాఁ దెలియఁదగినవాఁడా! గుణతత్త్వవికారనియతిఅభేద్య = సత్త్వరజస్తమోగుణాత్మక మయిన మాయయొక్క వికారముయొక్క నియమముచే భేదింపరాని వాఁడా! మాయకు నియమముగాఁ గలుగునట్టి వికారములు లేనివాఁడా యని తా. సంస్మరణనిరస్తతాప = తలంచుటచేఁ బోఁగొట్టఁబడిన పాపము గలవాఁడా! ఘనసంసృతిసంతమసప్రదీప = గొప్ప సంసారము అను చిమ్మచీఁకటికి దీప మయినవాఁడా! నిష్ఠురభుజసారదానవనిషూదన = కఠిన మయిన బాహుబలము గల రాక్షసుల వధించినవాఁడా! భక్తజనప్రమోదనా = భక్తజనుల సంతోషపెట్టు వాఁడా! కృతిపతి యగు హరిహరనాథున్ని సంబోధనములు.

364. చతురఆనందమయా = పరమానందస్వరూపుఁడా! దుర్గతిరోగఉద్గమచికిత్సకా = దుర్గతియను రోగముయొక్క పుట్టుకకు వైద్యుఁడయినవాఁడా! భువనభవస్థితిసంహారకరా = లోకముల పుట్టువును రక్షణమును నాశమును చేయువాఁడా! నిర్వృతిపణ్యఆపణపదారవిందవికాసా = మోక్షము అను అమ్మఁదగినవస్తువునకు అంగడియైనపాదపద్మములవికాసము గలవాఁడా! మోక్షము గలిగించు పాదపద్మములు గలవాఁడా యనుట. హరిహరనాథుని సంబోధనములు.

365. సురపతి...ప్రధానా—సురపతి = దేవేంద్రునిచేత, ధృత = ధరింపఁబడిన, చూడా = కిరీటమునందు, శోభి = ప్రకాశించుచున్న, రత్న = మణులయొక్క, అంశు=కాంతులు అను, వీచి = అలలయొక్క, స్ఫురణ = ప్రకాశముచేత, సుభగ = మనోహరము లయిన, పాదాంభోజ = పాదములు అను కమలములయందు, సంచారకేళీ = తిరుగుట యను క్రీడయొక్క, పరిచయ = అభ్యాసము యొక్క, కలనా=చేయుటచేత, లబ్ధ= పొందఁబడిన, వ్యయఅతీత= నాశము నతిక్రమించిన, సౌఖ్య= సుఖముచేత, ఉత్తర = అధికము లగు, మునిజనహృత్= ఋషులహృదయములు అను, మాద్యత్ = మదించుచున్న, మరాళప్రధానా = హంసశ్రేష్ఠములు గలవాఁడా! హరిహరనాథుని సంబోధనము. దేవేంద్రుఁడు నమస్కరించుటచే వానికిరీటములయందలి రత్నములకాంతులు అను తరంగములతో నొప్పు

## గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయినవిరాటపర్వంబునందుఁ

## ద్వితీయాశ్వాసము.



చున్న నీపాదకమలములయందుఁ జేరినవై పరమసుఖము నొందిన మహర్షిహృదయములు అను రాజహంసలు గలవాఁడా యని తా. పాఠాం:—సురపతివృథచూడా = దేవేంద్రునియొక్క కిరీటమునందు అని యర్థము. మరాళప్రతానా = మరాళములసమూహము గలవాఁడా యని యర్థము.

శ్రీమహాత్......ప్రణీతంబు—శ్రీమత్ = గొప్పతనముగల, ఉభయకవి = సంస్కృతాంధ్రకవులకు, మిత్త్రి = స్నేహితుఁడును, కొమ్మనఅమాత్యపుత్త్రి = కొమ్మనమంత్రి కుమారుఁడును, బుధఆరాధనవిరాజి = పండితుల సేవించుటచేఁ బ్రకాశించువాఁడు నగు, తిక్కనసోమయాజిప్రణీతంబు = తిక్కనసోమయాజిచేఁ జేయఁబడినది. ఇది—ముగిసెను.



శ్రీరస్తు.

శ్రీహరిహరనాథాయ నమః.

# సవ్యాఖ్యానాంధ్రమహాభారతము

## విరాటపర్వము, తృతీయాశ్వాసము.

క. శ్రీత్వశివాత్వాలంబన, తత్త్వాశ్లేషాత్తశబలతాసంగతక
ర్తృత్వాదివిలాసమయమ, హత్త్వాహంకారభావ హరిహరనాథా. 1

—* ఉపకీచకులు ద్రౌపదిం దమయన్నశవంబుతోఁ గట్టి దహింపఁ గొని పోవుట. *—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె బవనతనయుం డట్లు సని మహానసమందిరంబుపరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసి యనులేపనంబున నస్రగంధం బుడిపికొని కృతకృత్యుండై శయ్యాతలంబునం గూర్చుండె నిట యాజ్ఞసేని యు భీమసేనుం డింతకు వంటకంబునింటికిం బోయి నిశ్చింతంబున నుండు నని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2

క. నాపతు లగుగంధర్వుల, చే పడి మృతిఁ బొందె వీఁడు సింహబలుం డీ

---

శ్రీత్వ......భావ—శ్రీత్వ = శ్రీత్వమును, శివాత్వ = గౌరీత్వమును, ఆలంబన = ఆశ్రయముగాఁ గల, తత్త్వ = మాయయొక్క, ఆశ్లేష = సంబంధముచేత, ఆత్త = పొందఁబడిన, శబలతా = కలయికచేత, సంగత = పొందఁబడిన, కర్తృత్వఆది = కర్తృత్వము మొదలుగాఁ గల, విలాసమయ= విలాసరూపము లయిన, మహత్త్వఅహంకారభావ = మహత్త్వమును అహంకారత్వమును గలవాఁడా! తా.—మాయాసంబంధము చేత మహదహంకారాదిప్రపంచమును గలిగించు కర్తృత్వాదివిలాసములను బొందినవాఁడా! హరిహరనాథా! పాఠాం:—మహత్త్వాలంకార — అను పాఠ మనన్వితము, కర్తృత్వాదికలీలాప్త = కర్తృత్వము మొదలుగాఁగల విలాసములచేఁ బొందఁబడిన అని యర్థము. కర్తృత్వాదికలీలాత్త—అర్థము సమానము, ఈపాఠమునందు ఆత్తశబ్దము రెండుమాఱులు ప్రయోగింపఁబడినది. విలాసమయ యనుపాఠము పెక్కువ్రాఁతప్రతులయందుఁ గానఁబడుటచే నది ప్రధానముగాఁ గ్రహింపఁబడినది.

2. పవనతనయుండు = భీముఁడు. మహానసమందిరంబుపరిసరంబునన్ = వంటయింటిసమీపంబునందు. శరీరప్రక్షాళనంబు = దేహముయొక్క కడుగుటను. అనులేపనంబునన్ = మైపూఁతచేత. అస్రగంధంబు = నెత్తురువాసనను. ఉడిపికొని = పోఁగొట్టుకొని. కృతకృత్యుండువై = కృతార్థుఁడై. యాజ్ఞసేనియున్ = ద్రౌపదియును.

3. నాపతులు = నామగలు. గంధర్వులచే = గంధర్వులబారిని. పడి = పొంది. దుర్వ్యా

పాపాత్మునిఁ జూడుఁడు దు, ర్వ్యాపారఫలంబు గాంచె ♦ నని పలుకుటయున్. 3

గీ. వారు సంభ్రమించి ♦ పడిఁ గాలుదివియలు, గొనుచు నులివు పింగులఁ ♦ గూడఁబాఱి
నృత్తశాలఁ జొచ్చి ♦ రత్తఱి నాకల, కల మెఱింగి కీచ♦కవ్రజంబు. 4

చ. కడువెస వచ్చి రూపఱిన♦కాయము నున్న తెఱంగుఁ జూచి బి
ట్టడలు మనంబులం గదిరి ♦ హా యనువారును జోద్య మంది భ్రా
న్పడియెడువారు నగ్రజుని♦పైఁ బడి మూర్ఛలఁ బొందువారు న
య్యెడ కరుగంగ నోర్వక మ♦హిం బెఱచోఁ బలవించువారు నై. 5

వ. ఉన్నంత బంధుజనంబులు గూడంబాఱి కీచకశవంబు గనుంగొని. 6

ఉ. మానవకోటి నిట్టివిసు♦మానపుఁబీనుఁగు లైనవారి నెం
దైనను గంటిమే యకట ♦ యాఱడి వమ్మై పోయె దుర్జయం
బైనబలంబు గాని తెరు♦వై తన కిత్తఱిఁ దోడు గాద యు
క్కినిమనంబు గీడు పరి♦కించునె క్రొవ్వునఁ జేటు దప్పునే. 7

---

పారఫలంబు = దుశ్చేష్టయొక్క ఫలమును. తా.—నామక లగుగంధర్వులచేఁ జిక్కి పాపాత్ముఁడయినకీచకుఁడు చచ్చెను, వీనిం జూడుఁ డని పలుకఁగా.

4. వారు = ఆకావలివారు. సంభ్రమించి = తొట్రుపడి. కాలుదివియలు = కాగడాలను. ఉలివు = శబ్దము. కూడఁబాఱి = గుంపుకూడి. ఆకలకలము = ఆధ్వనిని. కీచకవ్రజంబు = ఉపకీచకులగుంపు. తా.—కావలివారు తొట్రుపాటుతో వేగిరముగాఁ గాగడాలు చేతం బట్టుకొని యఱచుచు నర్తనశాలకుం బోయిరి, అపుడు ఆయల్లరి విని కీచకుని తమ్ము లయిన యుపకీచకులు.

5. వెసన్ = శీఘ్రముగా. రూపఱినకాయము ఉన్న తెఱంగున్ = రూపుమాసిన దేహము ఉన్నవిధమును. బిట్టు = శీఘ్రముగా. అడలు = దుఃఖము. మనంబులన్ = మనస్సులయందు. కదిరి = కలిగి. హా = అయ్యో! చోద్యము = ఆశ్చర్యమును. భ్రాన్పడియెడువారున్ = నిశ్చేష్టు లగువారును. అగ్రజునిపైన్ = అన్నమీఁద. మహిన్ = భూమియందు. పెఱచోన్ = మఱియొకచోట. పలవించువారున్ ఐ = ఏడ్చువారునై. తా.—శీఘ్రముగా వచ్చి కీచకుని దేహము రూపు చెడి యుండుటను జూచి మిక్కిలి దుఃఖము నొంది కొందఱు హాహాకారములు చేయుచుఁ గొందఱు నిశ్చేష్టు లగుచు మఱికొంద అన్నమీఁదఁ బడి మూర్ఛనొందుచు నింకఁ గొంద అచ్చటికిఁ బోఁజాలక నేలమీఁదఁబడి దూరముననుండి యేడ్చుచు.

6. కూడంబాఱి = గుంపుగూడి.

7. మానవకోటిన్ = మనుష్యులసమూహమునందు. విసుమానపు పీనుఁగులు = వింతపీనుఁగులు. ఆఱడి = వ్యర్థముగా. వమ్ముఅయి = నాశమయి. దుర్జయంబు = జయింపరానిది. కానితెరువు ఐ = దుర్మార్గ మగుటచేత. ఇత్తఱిన్ = ఈసమయమునందు. తోడుకాదుఅ = సహాయము కాకయే పోయెను. ఉక్కినిమనంబు = మూర్ఖునిమనస్సు. పరికించునుఎ = తెలియునా? తా.—మనుష్యులయం దిట్టి యాశ్చర్యపుచావు చచ్చినవారిని నెందును జూడ లేము. ఇట్లు వ్యర్థముగా నితఁడు నాశమై పోయెను, దుర్మార్గ మగుటచేత వీనిబల మిప్పు డితనికిఁ బనికి రాక పోయెను, వీఁడు మూర్ఖుఁ డగుటచేతఁ దన కీడు తెలియక గర్వించి యిట్లు చేటు తెచ్చుకొనెను.

వ. అనుచు డాయం జని. 8

గీ. కరము లెయ్యవి శిర మేది ♦ గాళు లెచటఁ, జొచ్చె గంధర్వవరులచేఁ ♦ జచ్చువార
లెల్ల నిట్టుల యగుదురో ♦ యితనితోడి, యలుకఁ జేసిరొ యిది గడు ♦ నక్కజంబు.

వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయపరీతచేతస్కు లయి
యున్నంత నొక్కయుపకీచకుండు నిజసహోదరులం జూచి. 10

క. మన మెంత పనవి పిలిచిన, విన నేర్చునె సింహబలుఁడు ♦ వేగమ యితనిం
గొనిపోవఁగ వలయుం గా, కని యందఱఁ దేర్చె ననున♦యాలాపములన్. 11

ఉ. సూతులు దాని కియ్యకొను♦చుం దమయన్నకు నగ్ని యిచ్చువా
రై తగ వాచరించు నెడ ♦ నల్కక ద్రౌపదివీరిచందముల్
సూతును గాక యంచు నొక♦చోఁ దమ చేరువ నున్నఁ గాంచి సం
జాతమహోగ్రకోపు లయి ♦ చారువిలోచనఁ బట్టె క్రూరతన్. 12

క. పెడకేలు గట్టి పాపపుఁ, బొడ వగునిది గాదె యితనిఁ ♦ బొడ వడఁగించెన్
గెడ గూడ దీని నీతని, నొడలిపయిం బెట్టి కాల్చు ♦ టుచితం బనుచున్. 13

9. కరములు = చేతులు. శిరము = తల. ఇతనితోడిఅలుకన్ = ఇతనిమీఁదికోపముచేత. అక్కజంబు = వింత. తా.—ఇతని చేతులు తల కాళ్లు కానరావు, గంధర్వవరులచేఁ జచ్చువార లందఱు నిట్లే చత్తురో లేక వీనిమీఁదికోపముచేత వీని నిట్లు చంపిరో యిది మిక్కిలి వింతగా నున్నది.

10. బహుప్రకారంబులన్ = పెక్కువిధములచేత. శోకవిస్మయపరీతచేతస్కులు = దుఃఖముచేతను ఆశ్చర్యముచేతను జుట్టఁబడిన మనస్సు గలవారు. నిజసహోదరులన్ = తనతోడఁబుట్టువులను.

11. పనవి = దుఃఖించి. అనునయఆలాపములన్ = ఊఱటగలిగించు మాటలచేత. తేర్చెన్ = ఊఱడించెను అని యన్వయము. తా.—మన మెంతయేడ్చినను నుపయోగము లేదు, శీఘ్రముగా వీనికి సంస్కారము సేయవలయు నని యందఱ నూఱడించెను.

12. సూతులు = ఉపకీచకులు. ఇయ్యకొనుచున్ = అంగీకరించుచు. తగవు = తగినపనిని. అల్కక = భయపడక. సంజాతమహత్ఉగ్రకోపులు = కలిగిన మిక్కిలి భయంకరమయిన కోపము గలవారు. చారువిలోచనన్ = చక్కని కన్నులు గల ద్రౌపదిని. క్రూరతన్ = కఠిను లగుటచేత. తా.—ఉపకీచకులు దాని కంగీకరించి తమయన్న కగ్ని సంస్కారము చేయుటకై కర్మము ప్రారంభించునపుడు ద్రౌపది భయములేక వారివిధము చూచుటకై యచటనుండఁగా వారు చూచి కోపము గలవారై యామెను బట్టుకొని.

13. పెడకేలు = పెడ ఱెక్కలు. పాపపుపొడవు = పాపముయొక్కయాకారము. పొడవడఁగించెన్ = చంపెను. గెడ = జత. కూడన్ = కలయునట్లు. తా.—పెడ ఱెక్కలు కట్టి యీ పాపాత్మురాలిచేతనే కీచకుఁడు చచ్చినాఁడు కావున దీని వీనితోఁ జేర్చి దహించుట యుక్త మని చెప్పుచు.

వ. విరాటునకు కెఱఁగించి చేయువారై యంతకు మున్న యావృత్తాంతం బంతయు విని సంక్షుభితహృదయుం డై యున్న యతనిపాలికిం బోయి. 14

గీ. ఎల్లభంగుల సైరంధ్రి ♦ నేము సింహ, బలునితోఁ జంపువార మై ♦ తలఁచి నీకు
నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి ♦ మీవు నింత, పట్టుమన్నన మాకు నీ♦వలయు ననిన.

వ. అతండును దనమనంబున నియ్యుపకీచకులచందంబు సూడ నేను వారించితి నేనియు నుడుగం గలవారు గా రనియు గంధర్వులు బలవంతులు కావునఁ దద్రక్షిత యైన సైరంధ్రి కపాయంబు వొందదనియు నూహించి వారలం గలయం గనుంగొని యట్లకాక మీకుం బోలిన తెఱంగు సేయుం డనిన నదియ యనుమతిగాఁ గైకొని సరభసంబునం జనుదెంచి. 16

ఉ. అంగజరాగమత్తుఁ డగు♦నన్నకు నిమ్మెయి నైనఁ బ్రీతిసే
యం గలవార మీజఱభి ♦ యాతనితోడన తీఱుఁ గాక యం
చుం గొనిపోయి ధైర్యమున ♦ నాతనిపీనుఁగుమీఁదఁ బాండుపు
త్రాంగనఁ బెట్టి కట్టిరి ద♦యాపరివర్జితచిత్తవృత్తులై. 17

చ. అశుచియుఁ గష్టుఁడున్ లఘువు ♦ నైననిజాగ్రజుమేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు ను♦దాత్తయు నాఁ జనుసింతిఁ గొంచుఁ గ

---

14. సంక్షుభితహృదయుండు ఐ = కలఁగిన మనస్సు గలవాఁడై.

15. ఎల్లభంగులన్ = అన్నివిధముల చేతను. ఇంతవట్టుమన్నన = ఇంతమాత్రమైన యధికారమును. తా.—మే మెల్లను సైరంధ్రిని కీచకుతోఁ జేర్చి దహింపఁ దలఁచియున్నారము, నీవు దాని కంగీకరింపవలయు ననఁగా.

16. ఉడుగంగలవారు = విడుచువారు. తద్రక్షిత = గంధర్వులచే రక్షింపఁబడినది. అనుమతి = అంగీకారము. సరభసంబునన్ = వేగిరపాటుతోఁ గూడినట్లుగా.

17. అంగజ రాగమత్తుఁడు = మన్మథరాగముచే మదించినవాఁడు. ఇమ్మెయిన్ ఐనన్ = ఈవిధముచేత నైనను. ప్రీతి = సంతోషమును. ఈజఱభి = ఈఱంకులాఁడి. తీఱున్ కాక = చచ్చునుగాక. ధైర్యమున్ = దిట్టతనముచేత. పాండుపుత్త్రి అంగనన్ = పాండవుల భార్యను. దయాపరివర్జితచిత్తవృత్తులు ఐ = దయచే విడువఁబడిన మనోవ్యాపారముగలవారై. పెట్టి, కట్టిరి యని యన్వయము. తా.—మన్మథవశుం డగు కీచకునకు నీవిధముగా సంతోషము చేయవచ్చును, ఈదుష్టురాలును ఈతనితోడనే చచ్చుఁ గాక యని దయ లేనివారై ద్రౌపదిని కీచకుని పీనుఁగుమీఁదఁ బట్టి కట్టిరి. పాఠాం:—దైన్యమునన్ = దీనతచేత, ఈపాఠము దయాపరివర్జితచిత్తవృత్తులై అనుటచేఁ బ్రకృతోచితము కాదు.

18. అశుచియున్ = అపవిత్రుఁడును. కష్టుఁడున్ = పాపియును. లఘువున్ = నీచుఁడును. ఐన నిజఅగ్రజుమేనితోడన్ = అయిన తమయన్నయొక్క దేహముతో. నిత్య శుచియున్ = ఎల్లప్పుడు శుద్ధురాలును. పుణ్యశీలయున్ = పవిత్రమైన యాచారము గలదియును. ఉదాత్తయున్ = ఉత్తమురాలును. నాన్ = అనుటకు. చనుఇంతిన్ = తగిన స్త్రీని. కర్కశమతిన్ = క్రూరబుద్ధిచేత.

ర్కుశమతిఁ గీచకుల్ బహుముఖంబుల బాంధవవిప్రలాపముల్
దిశ లద్రువం జెలంగఁ గర♦దీపనికాయము ప్రజ్వరిల్లఁగన్. 18

క. పితృవనము దెసకుఁ జన న, య్యతివ భయభ్రాంతచిత్త♦యై బాష్పజలో
ద్గతి మొగముఁ గప్పి యిట్లని, యతిరావముగా నొనర్చె ♦ నాక్రందనమున్. 19

గీ. అనద నైతి నిచట ♦ నాలికుయ్యాలింపుఁ, డకట మీరు గలుగ ♦ నాక్రమించి
నన్నుఁ గట్టి సూత♦నందను లిమ్మెయి, వెఱపు లేక భంగ♦పఱుచువారె. 20

ఉ. ఆనతవైరి యోజయ మ♦హాద్భుతవిక్రమ యోజయంత దు
ర్మానవిఘూర్ణమానరిపు♦మర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకట♦శూరగుణప్రతిభాస యోజయ
త్సేన విరోధిబాహుబల♦జృంభణభంజన యోజయద్బలా. 21

---

బహుముఖంబులన్ = పెక్కునోళ్లనుండి. బాంధవవిప్రలాపముల్ = చుట్టాలయొక్క విశేషించిన యేడ్పులు. దిశలు = దిక్కులు. అద్రువన్ = అదరునట్లు. చెలంగన్ = ధ్వనింపఁగా. కరదీపనికాయము = దివిటీలసమూహము. ప్రజ్వరిల్లఁగన్ = వెలుఁగుచుండఁగా. తా.—నీచుఁ డయిన కీచకుని దేహముతో నుత్తమురాలగు ద్రౌపదిని చేర్చికట్టి యుపకీచకులు చుట్టాలు రోదనము చేయుచు వెంటరాఁగా దివిటీలతో. బాంధవవిప్రలాపముల్—ఇట విప్రలాపశబ్దము విరుద్ధవాక్యమునందు రూఢము. «విప్రలాపో విరోధోక్తిః» అని యమరసింహుఁడు. ఈపక్షమున బంధువులు ద్రౌపది నిట్లు చేయవల దని చెప్పుచుండఁగా నని యర్థము చెప్పవలెను. దిశలు అదరునట్లు బంధువులు నిషేధించుట ప్రకృతోచితము కాదు. కావున బంధుజనప్రలాపముల్ అనుపాఠము యుక్తమని తోఁచుచున్నది.

19. పితృవనముదెసకున్ = శ్మశానము వైపునకు. అయ్యతివ = ఆద్రౌపది. భయభ్రాంతచిత్తయై = భయముచేఁ గలఁగిన మనస్సుగలదై. బాష్పజలఉద్గతి = కన్నీళ్లుపుట్టుక. ఆక్రందనమున్ = ఏడ్పును. అతిరావముగాన్ = గొప్పధ్వని గలుగునట్లుగా. ఒనర్చెన్ అని యన్వయము. తా.—శ్మశానమునొద్దకుఁ బోవుచుండఁగా నాద్రౌపది భయము నొందినదై కన్నీరుగార్చుచు గట్టిగా రోదనము గావించెను.

20. అనదను = దిక్కుమాలినదానను. ఆలికుయ్యి = భార్యయొక్క మొఱను. ఆలింపుఁడు = వినుఁడు, కుయ్యిశబ్దము ఏమ్యాదులలోఁ జేరినది. ఆక్రమించి = పట్టి. సూతనందనులు = ఉపకీచకులు. భంగపఱచువారు ఎ = అవమానపఱచువారా? తా.—నాకు దిక్కు లేదు, మీభార్య మొఱవిని రక్షింపుఁడు, మీ రుండునపుడు కీచకులు నన్నిట్లు భంగపఱుపఁగా నుపేక్షింపవచ్చునా?

21. ఆనతవైరి = వంగినశత్రువులు కలవాఁడా! మహత్ అద్భుతవిక్రమ = మిక్కిలి యాశ్చర్యకర మయిన పరాక్రమము గలవాఁడా! దుర్మానవిఘూర్ణమానరిపుమర్దన = చెడుగర్వముచేఁ దిరుగుడుపడుచున్న శత్రువుల చంపువాఁడా! తేజః నిహత అహిత ప్రకటశూరగుణప్రతిభాస = పరాక్రమముచేఁ జంపఁబడిన శత్రువులచేఁ బ్రసిద్ధమయిన శూరధర్మముయొక్క ప్రకాశము గలవాఁడా! విరోధిబాహుబలజృంభణభంజన = శత్రువుల భుజబలగర్వమును పోఁగొట్టువాఁడా! జయుఁడు జయంతుఁడు విజయుఁడు జయత్సేనుఁడు జయద్బలుఁ డని పాండవులకుఁ గ్రమముగా సంకేతనామములు.

సీ. తొడఁగినపని చలం♦బెడపక యతిదుష్క, రం బైనఁ గడతేర్చు♦ప్రభువులార
పెనఁగిన వైవస్వ♦తుని నైనఁ గడిమిమై, వ్రేల్మిడిఁ బరిమార్చు♦వీరులార
శరణార్థి యగుదుష్ట♦శాత్రవు నైనను, గరుణ రక్షించుస♦త్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు♦లైనను దాఁపక, తమకించి యిచ్చును♦దారులార
నాథులార గంధర్వర♦త్నంబులార, నన్ను నుపకీచకులు దమ♦యన్నశవము
నందు బంధించికొని వెస♦నరుగుచున్న, వారు రక్షింప వేగ రా♦వలయు మీరు.

( భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట. )

చ. అని పలవించునయ్యెలుఁగు♦లాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు♦వీంద్రును గ్రమ్మఱ నింత సేసిరే
యనుచు సరోషసంభ్రమత♦నాయితమై వెసఁ బ్రాఁకి వప్రలం
ఘన మొనరించె గుప్తముగ♦గ్రక్కున ముట్టెడుదానికిం దగన్. 23

గీ. ఇట్లు లంఘించి పోయి ప♦రేతభూమి, యొద్ద నలుదిక్కులును జూచి♦యొక్కయున్న

22. తొడఁగినపని = ఆరంభించినకార్యమును. చలంబు = పూనికను. ఎడపక = విడువక. అతిదుష్కరంబు = మిక్కిలి యసాధ్యము. కడతేర్చుప్రభువులార = నెఱవేర్చునట్టి సమర్థులారా! తా.—మీ రారంభించినకార్య మెంత గొప్పదైనను సాధించువారు. పెనఁగినన్ = పోరినయెడ. వైవస్వతునిన్ ఐనన్ = యమునినైనను. కడిమిమైన్ = పరాక్రమముచేత. వ్రేల్మిడిన్ = నిమిషముసేపులోపల. పరిమార్చువీరులార = చంపునట్టి శూరులారా! తా.—ఎదిరించి పోరవచ్చిన యమునిఁగూడ జయించువారు. శరణఅర్థి = శరణుచొచ్చినవాఁడు. అగు దుష్టశాత్రవున్ = అయినట్టి చెడ్డశత్రువును. తా.—శరణుచొచ్చినయెడ నెంతటి శత్రువునైనను రక్షించువారు. అర్థికిన్ = యాచకునకు. తమకించి = వేగిరపడి. ఉదారులార = దాతలారా! తా.—అడిగినవానికిఁ బ్రాణమునైన నిచ్చువారు. నాథులార = మగలారా! తా.—నన్ను పకీచకులు తమయన్న పీనుఁగుతో నంటఁ గట్టికొని పోవుచున్నారు, మీరు వచ్చి నన్ను శీఘ్రముగా రక్షింపుఁడు.

23. పలవించు అయ్యెలుఁగులు = ఏడ్చునట్టి యాధ్వనులను. అపవమానతనూజుఁడు = అభీముఁడు. నాదువల్లభకున్ = నాప్రియురాలికి. సరోషసంభ్రమతన్ = కోపముతోను వేగిరపాటుతోను గూడినవాఁ డగుటచేత. ఆయితము ఐ = సిద్ధమై. వప్రలంఘనము = కోటదాఁటుటను. గుప్తముగన్ = రహస్యముగా. గ్రక్కునన్ = శీఘ్రముగా. ముట్టెడు దానికిన్ = తాఁకుటకు. తగన్. ఒనరించెన్ అని యన్వయము. తా.—ఆయేడ్పుధ్వనిని భీముఁడు విని యుపకీచకులు గూడ నిట్లు చేసినారా యని మిక్కిలి కోపము నొందినవాఁడై రహస్యముగాను శీఘ్రముగాను జేరుటకై కోటగోడను దాఁటెను.

24. లంఘించి = దాఁటి. పరేతభూమిఒద్దన్ = శ్మశానముదగ్గఱ. ఉన్నతఅవనీజంబు = పొడువైనచెట్టును. రౌద్రఅతిరేకము = రౌద్రరసముయొక్క యతిశయము. అదరన్ = అతిశయిం

తావనీజంబు వెఱికి రౌద్రాతిరేక, మడర నిజభుజశిఖరంబునం దమర్చి. 24

మ. వికటభ్రూకుటిఘోరఫాలకలితస్వేదోద్గముండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రవర్ధనదశావిర్భావసంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసనుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోన్. 25

వ. తదనంతరంబ. 26

గీ. సూతుశవముతోడ నేతెంచువారలు, దవ్వుదవ్వులన యుదగ్రరూప
కలితుఁ డైనభీముఁ గనుఁగొని నడవక, నిలిచి రంత నంతఁ గలఁగఁబాఱి. 27

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొనిరిం కేల్లోక్కొ యంచున్ భయం
బొదవం బల్లములందు డాఁగియు సమీపోర్వీజముల్ ప్రాఁకియుం

---

పఁగా. నిజభుజశిఖరంబునందున్ = తనమూఁపుమీఁద. తా.—ఊళ్లు దాఁటి శ్మశానము నొద్దకుఁ బోయి యచ్చట నొక పెద్దచెట్టును బెఱికి భయంకరముగాఁ దనమూఁపున ధరించి.

25. వికట.....ఉద్గముండున్—వికట = భయంకర మయిన, భ్రూకుటి = బొమముడిచేత, ఘోర = భయంకర మయిన, ఫాల = నెత్తియందు, కలిత = కలిగిన, స్వేద = చెమటయొక్క, ఉద్గమ ముండున్ = పుట్టుక కలవాఁడును. చలత్ వికృత ఓష్ఠద్వయుఁడున్ = కదలుచున్న వికారము లయిన పెదవులజంట గలవాఁడును. ప్రవర్ధన...అంగకుఁడున్—ప్రవర్ధనదశా = పొంగుట యను నవస్థయొక్క, ఆవిర్భావ = కలుగుటచేత, సంభావిత = గౌరవింపఁబడిన, అంగకుండున్ = దేహము గలవాఁడును. చిత్త...వేగుండున్—చిత్త = మనస్సుయొక్క, విదాహ = దహించుటయందు, దోహల = సమర్థ మయిన, సమగ్ర = సంపూర్ణ మగు, క్రోధవేగుండున్ = కోపముయొక్క వేగము గలవాఁడును. ఐ. బకవిధ్వంసనుఁడు = బకాసురుని చంపిన భీముఁడు. శుంభత్ మూర్తివిస్ఫూర్తితోన్ = ప్రకాశించుచున్న యాకారముయొక్క యతిశయముతో. అయ్యెడన్. నిలిచెన్ అని యన్వయము. తా.—భీముఁడు మోమున బొమముడియును జెమటయును గలవాఁడై పెదవులు చలింప దేహము పొంగ మిక్కిలి కోపముతో భయంకరాకారుండై యచ్చట నిలిచెను.

27. ఏతెంచువారలు = వచ్చునట్టి బంధువులు మొదలగువారు. దవ్వు దవ్వులన్ అ = మిక్కిలి దూరమునందే. ఉదగ్రరూపకలితుఁడు = భయంకర మయిన రూపముతోఁ గూడినవాఁడు. కలఁగఁబాఱి = కలఁతనొంది. అంతన్ అంతన్ = దూరదూరమున. నిలిచిరి అని యన్వయము. తా.—కీచకునిశవముతోఁ గూడఁ బోవుచున్న బంధువులు లోనగువారలు భయంకరాకారుండై వచ్చిన భీమునిం గని నడవఁజాలక దూరదూరమున భయంబున నిలిచిరి.

28. ముట్టికొనిరి = ఆక్రమించిరి. ఒదవన్ = కలుగఁగా. సమీపఉర్వీజముల్ = దగ్గఱ నున్నచెట్లను. ప్రాఁకియున్ = ఎక్కియు. నిశ్చేష్టన్ = చేష్టలు లేమిచేత. పదద్వంద్వముల్ = అడుగులజంటలు. గుదిపడన్ = కట్టుపడఁగా. బెగడు = భయమును. భరితసంక్షోభితచిత్తులు = నిండిన కలఁతగల మనస్సు గలవారలు. ఐరి అని యన్వయము. తా.—బంధువులు మొదలగువారు గంధర్వులు వచ్చి ముట్టడించి రింకేమిచేయుదు మని భయపడి కొందఱు పల్లములలో దాఁగిరి,

బెదరం బాఱియు నీరు సొచ్చియును ని♦శ్చేష్టం బడద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియుం భరితసం♦క్షోభాత్ములై రత్తఱిన్. 28

ఉ. సూతులు భీతులై ద్రుపద♦సూతిసమేతము గాఁగ నగ్రజ
ప్రేతము నైచి వీటిదెసఁ ♦ బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ వడిన్
వాతసుతుండు ముట్టికొని ♦ వారి బడల్పడ ద్రేసి యందఱం
జేతులతీఁట వో నుఱుము♦సేసె విశృంఖలవిక్రమంబునన్. 29

వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుం డై వచ్చి పాంచాలీబంధమోక్షంబు గావించి యింక నిశ్చింతంబున సుదేష్ణమందిరంబునకుం జను మని యవ్వేలంది వీడుకొలిపి తానును వేఱొక్కమార్గంబున మహానసగృహంబున కరుగుదెంచెం దత్సమయంబున విరాటుండు కీచకానుజులు గంధర్వపతులచే నిరవశేషంబుగా మృతిఁ బొందిరని విని చకితచేతస్కుం డగుచు సహోదరమరణశోకాయత్తచిత్త యయినజీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యి ట్లనియె. 30

గీ. చంద్రవదన యింక ♦ సైరంధ్రి నిచ్చోటు, వాప వలయు నేమి♦భంగి నైనఁ
గాన నాదుపలుకు ♦ గాఁ జెప్పు వెడలుట, కనుగుణముగ నమ్మృ♦గాక్షితోడ. 31

---

మఱికొందఱు చెట్లెక్కిరి, ఇంకఁ గొందఱు నీటఁ జొచ్చి రనియు, మఱికొందఱు నిశ్చేష్టులై కాళ్లు తడఁబడఁగా భయపడి కలఁత నొందిరి.

29. సూతులు = ఉపకీచకులు. భీతులు ఐ = భయపడినవారై. అగ్రజప్రేతమున్ = అన్న యొక్క పీనుఁగును. ద్రుపదసూతిసమేతము గాఁగన్ = ద్రౌపదితోఁ గూడినట్లుగా. నైచి. వీటి దెసన్ = పట్టణము దిక్కునకు. పెల్లుగన్ = మిక్కిలి. వాతసుతుండు = భీముఁడు. బడల్పడన్ = కష్టపడునట్లు. విశృంఖలవిక్రమంబునన్ = అడ్డులేని పరాక్రమముచేత. నుఱుముచేసెన్ అని యన్వయము. తా.—ఉపకీచకులు భయపడి ద్రౌపదితోఁగూడ నన్న పీనుఁగు నచ్చటఁ బాఱవైచి పట్టణమునకుఁ బరువెత్త నారంభింపఁగా భీముఁడు వారి కడ్డపడి వారినందఱిని కసితీఱఁ జంపెను.

30. సమయించి = చంపి. శమితక్రోధుండు ఐ = చల్లాఱిన కోపము గలవాఁడై. పాంచాలీబంధమోక్షంబు = ద్రౌపదియొక్క కట్టుయొక్క విచ్చుటను. మహానసగృహంబునకున్ = వంటయింటికి. కీచకఅనుజులు = కీచకుని తమ్ములు. నిరవశేషంబుగాన్ = మిగత లేనియట్లుగా. చకితచేతస్కుండు = భయపడిన మనస్సు గలవాఁడు. సహోదరమరణశోకఆయత్తచిత్త = తమ్ములచావుచేఁ గలిగిన దుఃఖమున కధీనమయిన మనస్సుగలది. జీవితేశ్వరిన్ = సుదేష్ణను. ఉచితఆలాపంబులన్ = తగినమాటలచేత. అనునయించి = ఊఱడించి.

31. చంద్రవదన = చంద్రునివంటి మోముగలదానా! సుదేష్ణసంబోధనము. పాపవలయున్ = తొలఁగింపవలయును. అనుగుణమ్ముగన్ = అనుకూలముగా. అమ్మృగాక్షితోడన్ = ఆద్రౌపదితో. తా.—సుదేష్ణా! యింక నెట్లైనను సైరంధ్రి నిచ్చటనుండి పంపివేయవలయును, కావున నామాటగా దానితోఁ బొమ్మని చెప్పుము.

గీ. పురుషు లాలతాంగి♦పొరువునఁ బోయినఁ, జేటు వచ్చుఁ గానఁ ♦ జెప్ప నేను
వెఱతు నాఁడువారు♦ నెరవుతో మృదువచో, రచనఁ జెప్పు టరయ♦ నుచితవృత్తి.

ఉ. ఆకమలాక్షిరూపమహి♦మాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణుల్ పురుషు♦ లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ ♦ జేటు పురంబునవారి కెప్పుడుం
గా కెటు లుండు నిట్టియవ♦గాఢపుఁబొత్తు మనంగ వచ్చునే. 33

క. అని నిశ్చయించి పలికిన, విని కేకయరాజపుత్రి ♦ విభుతలఁపు మనం
బునకుఁ బ్రియం బగుటయుఁ గై, కొని యాపని యట్లచేఁత♦కుం బూనెఁ దగన్.

క. అంతం గుంతీనందన, కాంతాచింతామహాంధ♦కారముతో న
త్యంతంబు మచ్చరించెనో, సంతమసం బనఁ బ్రభాత♦సమయం బయ్యెన్. 35

వ. పదంపడి పద్మినీప్రమోదసంపత్కారణుం డగునరుణకిరణుం డుదయించె నట మున్న

---

32. అలతాంగిపొరువునన్ = ఆసైరంధ్రిపొరుగున. నెరవుతోన్ = ఉపాయముతో. మృదువచః రచనన్ = మెత్తనిమాటల కూర్పుచేత. ఉచితవృత్తి = తగినపని. తా.—ఆమెదగ్గఱకుఁ బురుషులు పోయినయెడ నపాయము గలుగుటవలన నేను జెప్పఁజాలను, స్త్రీలే మంచిమాటలతో నామెకుఁ జెప్పవలయును.

33. ఆకమలాక్షిరూపమహిమ అతిశయంబు = ఆద్రౌపదియొక్క చక్కఁదనముయొక్క గొప్పతనముయొక్క యతిశయము. భోగ ఏక పరాయణుల్ = భోగమునందే యాసక్తులు. అంగజుఁడు = మన్మథుఁడు. అప్రతికారచేష్టితస్వీకృతలోకుఁడు = మాఱులేని వ్యాపారముచే స్వాధీనము చేసికొనఁబడిన లోకము గలవాఁడు. పురంబునవారికిన్ = పట్టణములో నున్నవారికి. ఇట్టి అవగాఢపుపొత్తు = ఇట్టి యుపద్రవకరమయిన పొత్తుతో, ఇటఁ దృతీయార్థమునఁ బ్రథమ. మనంగన్ = బ్రదుకుట. తా.—సైరంధ్రి చక్కఁదనము మనోహర మగుటవలనను, బురుషులు భోగాసక్తు లగుటవలనను, మన్మథుఁడు దుర్జయుఁ డగుటవలనను మనపట్టణములోనివారి కామెవలనఁ దప్పక ముప్పు కలుగును, గావున నామెపొత్తు మనకుఁ బనికి రాదు.

34. కేకయరాజపుత్రి = కేకయరాజుకూఁతు రయిన సుధేష్ణ. విభుతలఁపు = మగని యభిప్రాయము. అట్లు అ చేఁతకున్ = అట్లే చేయుటకు. తా.—విరాటుని మాట విని సుధేష్ణ మగని యభిప్రాయము తనకును ఇష్ట మగుటవలన నట్లే చేయఁ బూనెను.

35. కుంతీనందన.....అంధకారముతోన్—కుంతీనందనకాంతా=ద్రౌపదియొక్క, చింతా= దుఃఖము అను, మహాంధకారముతోన్ = గొప్ప చీఁకటితో. అత్యంతంబున్ = మిక్కిలి. సంతమసంబు = గాఢాంధకారము. మచ్చరించెను ఒ = పోటి పెట్టుకొనెనో. అనన్. ప్రభాతసమయంబు = ప్రాతఃకాలము. తా.—అంత ద్రౌపదియొక్క చింత యను చీఁకటితో రాత్రి పోటి పడి యది తొలఁగఁగానే తానును దొలఁగినదో యనునట్లు తెల్లవారెను.

36. పదంపడి= పిమ్మట. పద్మినీప్రమోదసంపత్కారణుండు= తామరతీఁగకు సంతోషాతిశయము చేయువాఁడు. పద్మినీజాతి స్త్రీ యైన ద్రౌపదికి సంతోషాతిశయము చేయువాఁ డని ధ్వని. అరుణకిర

పాంచాలి సచేలస్నానంబు సేసి రాగాదివికారనిరాసంబునం బ్రసన్న యయిన బుద్ధియుంబోలె సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునం దెలి వొంది మందమంద యానంబునం బురంబు సొచ్చి రాజవీథి నరుగుదెంచునప్పుడు. 36

సీ. మనకీచకుల కెల్ల ♦ మారి యై పుట్టిన, సుదతి వో యిది యని ♦ చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొ ♦ వ్వాఱుగదేఁ జూతు గా, కని తల సూపక ♦ యడఁగువారు
నలవోకఁ గనుఁగొని ♦ యంతరంగము బిట్టు, బెదర మాఱుమొగంబు ♦ వెట్టువారు
నెదురుగా వచ్చిన ♦ నెంత యేనియు దవ్వు, గలుగ వేఱొకత్రోవఁ ♦ దొలఁగువారు
ముట్టఁబడి మేనఁ గంపంబు ♦ వుట్ట నొదిఁగి, యుండువారుఁ గరంబున ♦ నుదర మప్ప
ళించి యమ్మరొ రక్కెస ♦ యంచు నుల్ల, ములుకువారునై పురజనం ♦ బులు దలంకి.

చ. పులిఁ గనుఁగొన్న లేడులును ♦ బోలె విభీతిఁ గలంగి పాఱ న
న్నెలఁతుక యంతరంగమున ♦ నిండినహాస్యరసంబు మోముపై
వెలి విరియంగ నీక చని ♦ వేచి మహానసశాలవాకిటన్
నిలిచినభీమసేనుఁ గని ♦ నెయ్య మెదం జిగురొత్తుచుండఁగన్. 38

---

ణుండు = సూర్యుఁడు. సచేలస్నానంబు = వస్త్రముతోఁ గూడుకొనునట్లు స్నానము. రాగఆదివికారనిరాసంబునన్ = రాగము మొదలగు వికారములయొక్క తొలఁగించుటచేత, ఇట ఆదిశబ్దముచే ద్వేషమదలోభమోహమాత్సర్యములు గ్రహింపఁబడుచున్నవి. ప్రసన్న=నిర్మలము. సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునన్ = సింహబలుఁడు మొదలుగాఁ గల కీచకుల చంపుటచేత. మందమందయానంబునన్ = మిక్కిలి తిన్నని నడకచేత.

37. సుదతి = స్త్రీ. అద్దిరా = ఆశ్చర్యము. ఆఱుగదేన్ = తగ్గకపోయినయెడ. చూతుగాక = చూతుము. అడఁగువారు = అణఁగువారును. అలవోకన్ = అకస్మికముగా. అంతరంగము = మనస్సు. బిట్టు = శీఘ్రముగా. దవ్వు = దూరము. ముట్టఁబడి = సమీపించి. మేనన్= దేహమునందు. కంపంబు = వణఁకు. కరంబునన్ = చేతితో. ఉదరము= కడుపును. అప్పళించి= కొట్టుకొని. రక్కెస = రాక్షసస్త్రీ. ఉల్లము = మనస్సు. ఉలుకువారున్ ఐ = భయపడువారునై. పురజనంబులు = పట్టణమునందలి జనులు. తలంకి= చలించి. తా.—కొందఱు మనకీచకుల నందఱను జంపిన మృత్యుదేవత పోవుచున్న దని చూచువారును, కొందఱు చూచినయెడఁ జేటుకలుగు నని చూచువారిని గూడ వల దని చెప్పి తొలఁగువారును, మఱికొందఱు అకస్మికముగాఁ జూచి మిక్కిలి భయపడినవారై వెడమొగము పెట్టువారును, కొందఱు నెదురురాఁగా దూరముగాఁ బెడదారిం దొలఁగి పోవువారును, కొందఱు సమీపమునకు రాఁగా వణఁకుచు నొదిఁగి పోవువారును, కొందఱు జేతితోఁ గడుపు కొట్టుకొని రాక్షసియని భయపడువారునై పట్టణమునందలి జనులు వెఱచి.

38. విభీతిన్ = మిక్కిలి భయముచేత. కలంగి = కలఁతపడి. పాఱన్ = పరుగెత్తఁగా. అన్నెలఁతుక = ఆద్రౌపది. వెలివిరియంగన్ ఈక = బయటికిఁ గనఁబడనీయక. వేచి = కనుపెట్టి. నెయ్యము = ప్రీతి. ఎదన్ = మనస్సునందు. చిగురొత్తుచుండఁగన్ = అతిశయించుచుండఁగా.

క. తనయంతన యటు వలుకుచుఁ, జనువిధమున నతనిదిక్కు ♦ చక్కనిచూడ్కిం
గనుఁగొనక ద్రుపదనృపసుత, దన యిట్లను నిజకృతార్థ♦తం దెలుపుటకున్. 39

గీ. కీచకులచేసఁ బుట్టిన♦కిల్బిషంబు, పాచి నన్ను రక్షించిన♦పరమధర్మ
రతికి గంధర్వపతికి ని♦రంతరంబు, భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి ♦ బ్రదుకుదాన.40

వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచనచాతుర్యధుర్యుండై యిట్లనియె. 41

చ. అతివ యపాయముం బొరయు♦నప్పుడు గావక తక్కనేని నా
పతి పతియే తలంప మగ♦పాడియె లోకముపాడియే భవ
త్పతు లిటు లాచరించుట గ♦దా భవదీయమనోనువర్తన
స్థితి కుచితంబు వారికి ను♦తింపఁగ నేల నిసర్గవృత్తముల్. 42

—( ద్రౌపది యర్జునునితో సల్లాపంబు సేయుట. )—

గీ. ఇట్లు తమ్ము నిరూపింప ♦ నితరజనము, లకు నశక్యంబు గాఁగ స♦ల్లాపరసము

---

తా.—పులిని చూచిన లేళ్లవలె భయంబునం బరువెత్తుచుండఁగా ద్రౌపది వారిభయమునకుఁ దన మనస్సులోఁ గలిగిన హాస్యరసమును బయటికిఁ దెలియనీయక పోయి తనకొఱకు వంటయింటివాకిటఁ గాచియున్న భీమునిం జూచి మిక్కిలి ప్రేమ గలదై.

39. తనయంతన్ = అ = తనకుఁ దానే. చనువిధమునన్ = పోవునట్లు. నిజకృతార్థతన్ = తాను కృతార్థురాలగుటను. తా.—తనలోఁ దాను జెప్పుకొనునట్లు భీమునిఁ జక్కఁగాఁ జూడకయే ద్రౌపది కృతకృత్యతను దెలుపుటకై యిట్లు చెప్పెను.

40. పుట్టినకిల్బిషంబున్ = కలిగిన కీడును. పాచి = తొలఁగించి. పరమధర్మరతికిన్ = ఉత్తమమయినధర్మమునం దాసక్తి గలవానికి. నిరంతరంబు = ఎడతెగనియట్లుగా. భక్తియుక్తిమైన్ = భక్తితోడి కూడికచేత. ప్రణమిల్లి = నమస్కరించి. తా.—కీచకులవలనఁ గలిగిన యపాయమును దొలఁగించి నన్ను రక్షించినట్టి పరమధార్మికుఁ డగు గంధర్వపతికి భక్తితో నమస్కరించెదను.

41. అనిలనందనుండు = భీముఁడు. నిగూఢవచనచాతుర్యధుర్యుండు ఐ = రహస్యముగాఁ జెప్పుటయందలి నేర్పుయొక్క భారమును వహించినవాఁడై.

42. అతివ = స్త్రీ. పొరయునప్పుడు = పొందునప్పుడు. తక్కన్ ఏనిన్ = తప్పినయెడ. మగపాడియే = పురుషధర్మమా ? లోకము పాడి ఏ = లోకధర్మమా ? భవదీయమనః అనువర్తన స్థితికిన్ = నీదైన మనస్సుయొక్క యనుసరించుటయొక్క యునికికి. వారికిన్ = ఆ పతులయొక్క, ఇట శేషషష్ఠికి కివర్ణకము. నిసర్గవృత్తముల్ = స్వభావకార్యములను. నుతింపఁగన్ ఏల అని యన్వయము. తా.—భార్యకు అపాయము గలిగినపుడు రక్షించుటయే పురుషధర్మమును లోకధర్మమును గావున వారు నిన్నురక్షించుట నీకుఁ బ్రియ మగుటకుఁ దగిన కార్యమే గావున స్వభావముగాఁ జేయవలసినకార్యమును జేయుటకై వారిని బొగడవలసినది లేదు.

43. నిరూపింపన్ = తెలిసికొనుటకు. సల్లాపరసమున్ = సంభాషణసుఖమును. లతాఅంగి = తీఁగవంటి మేనుగల యాద్రౌపది. నర్తనమంటపప్రాంతమునకున్ = నాట్యశాలదగ్గఱకు. అరిగెన్ =

ననుభవించుచు నల్లన♦ల్లన లతాంగి, యరిగె నర్తనమండపో♦పాంతమునకు. 43

వ. చని విరాటకన్యకలయాటఁ జూచుచుండంబున నందుఁ బురందరనందనుం గనుం గొనునప్పాంచాలి నాలోకించి యతండునుం దారును దదభిముఖంబుగా వచ్చి యక్కన్నియ లి ట్లనిరి. 44

ఉ. కీచకకోటిచేత నొక♦కీడును బొందక వచ్చితమ్మ ని
న్వేఁచినదుర్మదుండు జము♦నిం గొలువం జనె నమ్మ యంతఁ బో
కేచినసూతు లీయొడలి ♦ కింతయపాయ మొనర్తు రమ్మ వే
కాచి విరోధులం దునుమఁ ♦ గా నిటు ముట్టుదు రమ్మ నీపతుల్. 45

వ. అని తారు మున్ను విన్నకీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు వలుకు చుండ నాబృహన్నల సైరంధ్రి కి ట్లనియె. 46

క. ఆపాపాత్ముల నీచ, వ్యాపారక్రమము వార ♦ లందఱు మృత్యు
ప్రాపితు లైన తెఱంగును, నీపలుకుల నెఱుఁగ వలయు ♦ నెలఁతుక మాకున్. 47

---

అని యన్వయము. తా.—ఈప్రకారముగా నితరులు తప్పుఁ దెలిసికొనని యట్లు మాటలాడుచు ద్రౌపది తిన్నగా నాట్యశాలయొద్దకుఁ బోయెను.

44. పురందరనందనున్ = ఇంద్రుని కుమారుఁ డయిన యర్జునుని. ఆలోకించి= చూచి. అతండునున్ = ఆయర్జునుఁడును. తారునున్ = ఆకన్యకలును. తత్ అభిముఖంబుగాన్ = అద్రౌపదికి ఎదురుగా.

45. కీచకకోటిచేతన్ = కీచకుల సమూహముచేత. వచ్చితమ్మ = వచ్చితివా? వేఁచినదుర్మదుండు = బాధించిన దుష్టుఁడు. జమునిన్ = యముని. అంతన్ = అంతటితో. ఏచినసూతులు = చెలరేఁగిన యుపకీచకులు. ఈయొడలికిన్ = ఈదేహమునకు. వే = శీఘ్రముగా. విరోధులన్ = శత్రువులను. తునుమఁగాన్ = చంపుటకై. నీపతుల్ = నీమగలు. ముట్టుదు రమ్మ = వత్తురా? తా.—కీచకులవలన అపాయ మేమియు లేక వచ్చితివి గదా! నిన్ను బాధించిన కీచకుఁడు హతుఁ డయ్యెఁ గదా! అంతటితో నిలువక యుపకీచకులు నీ కపాయము చేయఁ దలఁచిరా! సమయము వచ్చినపుడు నీమగలు వచ్చి యిట్లు శత్రువులను వధింతురా యనిరి. ఈపద్యము ద్వితీయపాదమున “వేఁచినదుర్మదుండు” ఇచట వేఁగుధాతువు ప్రేరణరూప మయిన వేఁచుశబ్దమే బాధనార్థక మగుటం జేసి సందర్భోచితము, నిర్బిందుక మయిన వేచుశబ్దమును గ్రహించినయెడ అది నిరీక్షణార్థక మగుట వలన సందర్భమునకును మూలమునకును నననుకూలము “యేత్వాం క్లిశ్యన్త్యనాగసమ్” అని మూలము.

46. కీచకవృత్తాంతంబునకున్ = కీచకుల సమాచారమునకు. అనుగుణంబుగాన్ = తగినట్లుగా. ఉపచారంబులు = ఊఱటమాటలను.

47. ఆపాపాత్ములనీచవ్యాపారక్రమము = పాపాత్ము లయిన ఆ కీచకులయొక్క నీచపుపని యొక్క విధమును. మృత్యుప్రాపితులు = మృత్యువును పొందింపఁబడినవారు. నెలఁతుక = ఓసైరంధ్రీ! తా.—ఆకీచకులు చేసిన నీచకార్యమును వారు చంపఁబడిన విధమును నీమాటలవలననే వినఁ గోరుచున్నారము.

వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కిట్లనియె. 48

గీ. కన్నియల కాటఁ గఱపుచు ♦ నున్ననీకు, సకట సైరంధ్రి యిప్పు డే♦మయ్యెనేని
ఖేద మెద నించుకయు లేమిఁ ♦ గాదె సస్మి, తాననంబుతో నన్నిటు♦లడుగు టెల్ల.

వ. అనిన బృహన్నల యిట్లనియె. 50

క. నీవు వగలఁ బడుటకు దుః, ఖావేశము వొందనే ని♦రర్థక మగుని
య్యేవపుఁబుట్టువు పుట్టిన, నావగ పెవ్వరికినెక్కు ♦ నలినదళాక్షీ. 51

క. నీతోడిపరిచయము లే, దే తలపోయఁగ ననింద్య ♦ యెందును నీవి
ట్లాతుర వగుటకు నామది, నేతాపము లేదు నైజ ♦ మెఱుఁగవు గంటే. 52

వ. అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరంబు దాల్చినయంతియ కాక యూర్వశి యిచ్చినశాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు సేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవు గా కునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదన సూనుపలుకులు విని పాంచాలి యంతఃస్మితకమనీయకపోల యగుచు నిట్లనియె.

---

48. సాభిప్రాయంబుగాన్ = అభిప్రాయముతోఁ గూడినట్లు.

49. కఱపుచున్ = నేర్పుచు. ఖేదము = దుఃఖము. ఎదన్ = మనస్సునందు. లేమిన్ = లేకపోవుటచేత. సస్మితఆననంబుతోన్ = చిఱునగవుతోఁ గూడిన మోముతో. తా.—నీవు పడుచుల కాటనేర్పుచు సైరంధ్రి యేమి కష్ట మందినను నా కేమని కొంచెమైనను దుఃఖము లేనివాఁడ వగుటచే నిట్లు చిఱునవ్వుతో సమాచార మడుగుచున్నాఁడవు.

51. వగలఁబడుటకున్ = దుఃఖముల నొందుటకు. దుఃఖఆవేశము = దుఃఖము పొందుటను. నిరర్థకము = కొఱమాలినది. ఇయ్యేవపుపుట్టువు = ఈ నీచమయిన జన్మము. నావగపు = నాచింత. నలినదళఅక్షీ = తామరరేకులవంటి కన్నులు గలదానా! తా.—సైరంధ్రీ! నీవు దుఃఖపడుటకు నాకు దుఃఖము లేక పో లేదు. నే నిట్లు నీచ మయిన నపుంసకజన్మము పొందుటచే దుఃఖపడి ప్రయోజనము లేదు. పాఠాం:—నీవలుగులపడుటకు = అర్థము సమానము.

52. నీతోడిపరిచయము = నీతోడి సహవాసము. లేదే = లేదా? తలపోయఁగన్ = ఆలోచింపఁగా. ఎందునున్ = ఏవిషయమందును. అనింద్యవు = నిందింపఁ దగనిదానవు. ఆతురవు = బాధ నొందినదానవు. ఏతాపమున్ = ఏదుఃఖమును. లేదు = లేదా యేమి. నైజము = స్వభావమును. ఎఱుఁగవు = తెలియవు. కంటే. తా.—నీతో సహవాసము చేసి యున్నాను కావున నీయం దెప్పుడును దోషములు గలుగ వని నే నెఱుఁగుదును. నాస్వభావము తెలియనిదానవు కావున నీకష్టములు చూచి నేను దుఃఖము నొంద నే దని చెప్పుచున్నదానవు.

53. నిజసహోదరుల యట్ల = తన తోఁబుట్టువులవలె. వేషాంతరంబు = మాఱువేషమును. శరీరాంతరపరిగ్రహంబు = మఱియొకశరీరముయొక్క గ్రహించుటను. రిపుమర్దనంబు = శత్రువుల వధించుట. వెరవు = శక్యము. గుప్తసాభిజ్ఞానంబుగాన్ = రహస్యముగాను గుఱుతుతోఁగూడినట్లుగాను. బలసూదనసూనుపలుకులు = ఇంద్రుని కుమారుఁ డయిన యర్జునునిమాటలను. అంతఃస్మితకమనీయ కపోల = లోపల చిఱునగవు గల మనోహర మయిన చెక్కిళ్లు గలది.

గీ. అట్ల కాక యింత ♦ యన నేల నీమది, తెఱఁగు గొంత యేను ♦ నెఱుఁగ కున్న
దానఁ గాను నగరఁ ♦ దగవుమై నీవు వ, ర్తించుటయ కరంబు ♦ ప్రియము నాకు.

వ. అనుచుం గన్యకాజనపరివృతయై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదరమరణ
శోకాతుర యగు కైకేయికడకుం జనునప్పుడు. 55

సీ. ముదమున నెలమిసొం ♦ పొదవి నెమ్మోమునఁ, దోఁపంగ వచ్చినఁ ♦ ద్రోచి ద్రోచి
లలి నుల్లసిల్లుచు ♦ లలితలోచనదీప్తు, లడర నుంకించిన ♦ నాఁగి యాఁగి
సంతసంబున బాలి♦శము లగుచెయ్వులు, దొడరఁ జూచినఁ జేయ ♦ కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై ♦ మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక ♦ కడపి కడపి
ధీర యై యిట్లు సమ్మద♦పూరమునకు, గఱువతన మను బలితంపుఁ♦గట్ట వెట్టి
వెలఁది యెఱుఁగనియదివోలె♦వికృతి లేక, యల్ల నెప్పటియట్టుల♦యరుగుటయును.

క. భయశోకంబులు దనదుహృ, దయమునఁ బిరిగొన విరాట♦ధరణీనాథ

---

54. నీమది తెఱఁగు = నీమనస్సుయొక్క విధమును. కొంత = కొంచెము. నగరఁ = నగరియందు. తగవుమైఁ = తగినవిధమున. తా.—దీని కింతదూరము నీవు చెప్పవలసినది లేదు, నీమనస్సు నాకుఁ దెలియును. నీ వెల్లెడను నగరియందు నీకుఁ దోఁచినట్లుండుటయే నా కిష్టము.

55. కన్యకాజనపరివృత ఐ = పడుచులచేఁ జుట్టఁబడినదై. సహోదరమరణశోకాతుర = తోఁబుట్టువుల చావుచేఁ గలిగినదుఃఖముచేఁ బీడింపఁబడినది. కైకేయికడకుఁ = సుదేష్ణయొద్దకు.

56. ముదమునఁ = సంతోషముచేత. ఎలమిసొంపుఁ = వికాసముయొక్క యతిశయము. ఒదవి = కలిగి. నెమ్మోమునఁ = చక్కని ముఖమునందు. తోఁపంగ = కనఁబడునట్లు. తా.—సంతోషముచేత ముఖమునందుఁ దెలియవచ్చు వికాసము నడఁచుకొని. లలిఁ = ఉత్సాహముచేత. ఉల్లసిల్లుచుఁ = వికసించుచు. లలితలోచనదీప్తులు = చక్కని కన్నులకాంతులు. అడరఁ = అతిశయించుటకు. ఉంకించినఁ = పూనఁగా. తా.—వికాసము నొందుచున్న చూపులను అడఁచుకొని. బాలిశములు అగు చెయ్వులు = బాలచేష్టలు. తొడరఁ = కలుగుటకు. తా.—సంతోషాతిశయముచేతఁ గలుగునట్టి చేష్టలను చేయక యడంచికొని. ఉబ్బుమైఁ = సంతోషముచేత. కడపికడపి = వదలివదలి. తా.—మనస్సునందలి సంతోషముచే చెప్పవచ్చునట్టి మాటల నడంచుకొని. ధీర ఐ = ధైర్యము కలదై. సమ్మదపూరమునకుఁ = సంతోషము అను ప్రవాహమునకు. గఱువతనము = గాంభీర్యము. అనుబలితంపుకట్ట = అనునట్టి గొప్పకట్టను. వెలఁది = ద్రౌపది. వికృతి = వికారము. తా.—ధైర్యము గలదై సైరంధ్రి సంతోషమును గాంభీర్యముచే వెలికిఁ దెలియ రానీయక యెప్పటియట్లు నిర్వికారయై యేమియు నెఱుఁగనిదానివలెఁ బోఁగా.

57. భయశోకంబులు = భయమును దుఃఖమును. తనదుహృదయమునఁ = తనమనస్సునందు. పిరిగొనఁ = చుట్టుకొనఁగా. విరాటధరణీనాథప్రియ = విరాటరాజుభార్యయైనసుదేష్ణ. వినయపూర్వము = వినయముముందుగాఁగలది. ద్రుపదనందనకుఁ = ద్రౌపదికి. తగఁ. సంభావన = గౌరవ

ప్రియ సంభావన సేసె వి, నయపూర్వము గాఁగ ద్రుపద♦నందనకుఁ దగన్. 57

వ. ఇట్లు సంభావించి యత్తరుణిం దనపరిసరంబున నునిచికొని తదీయవదనం బవలోకించి.

గీ. నీవు చక్కనిదానవు ♦ నెలఁత ధైర్య, రహితచిత్తులు మగవారు ♦ రాజు దీనిఁ
దలఁచిభయమందె నిన్ను నీ♦వలచు నెడకు, నరుగునట్లుగఁ బ్రార్థించి♦యనుపుమనియె.

వ. అని తనమనంబునం గదిరినయనుజవియోగతాపం బుత్కటం బగుటయు వెండియు
నిట్లనియె. 60

క. బిరుదు లగుమగలు గల రని, తరమిడి చంపింపఁ జూచె♦దవు జనములు నీ
పోరువునఁ బో వెఱతురు మా, పురమును రాష్ట్రంబు వెడలి♦పొమ్మం డైనన్. 61

వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యి ట్లనియె. 62

ఉ. ముందటియట్ల యింకఁ బను♦మూఁడుదినంబులమాత్రకుఁ భవ
న్మందిరవాస మియ్యకొని♦నం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్పతు లు♦దాత్తమతిఁ భవదీయవాంఛితం
బుం దలకొల్పఁ జాలుదు ర♦పూర్వమనఃప్రమదంబు సేకుఱున్. 63

---

ముసు. చేసెఁ. అనియన్వయము. తా.—గంధర్వు లింకేమి చేయుదురో యను భయమును గీచకులు చచ్చుటకు దుఃఖమును గలదై సుధేష్ణ వినయముతో ద్రౌపదిని గౌరవించెను.

58. సంభావించి = గౌరవించి. అత్తరుణిఁ = ఆద్రౌపదిని. పరిసరంబునఁ = సమీపము నందు. తదీయవదనంబు = ఆద్రౌపదిదైనమోమును. అవలోకించి = చూచి.

59. నెలఁత = ఓ స్త్రీ! ద్రౌపదిసంబోధనము. ధైర్యరహితచిత్తులు = ధైర్యముచే విడువఁబడిన మనస్సుగలవారు. నీవలచునెడకుఁ = నీకోరిన చోటికి. అనుపుము = పంపుము. తా.—సైరంధ్రీ! నీ చక్కఁదనమునఁ దగిలి మగవారు ధైర్యము వదలి యుందురు. కావున దీని నాలోచించి మా రాజు నిన్నెచ్చటికైనను నీ యిచ్చవచ్చినచోటికిఁ బ్రార్థించి పంపు మనియెను.

60. కదిరిన అనుజవియోగతాపంబు = కలిగిన తమ్ముల యెడఁబాటుచేఁ గలిగిన దుఃఖము. ఉత్కటంబు = అధికము.

61. బిరుదులు = శూరులు. తరమిడి = వరుసపెట్టి. రాష్ట్రంబుఁ = దేశమును. తా.—పరాక్రమవంతు లగు మగ లున్నా రని యందఱిని వరుసపెట్టి చంపించుచున్నావు. జనులు నీపోరు గునఁ బోవుటకును భయపడుచున్నారు. కావున నీవు మాపట్టణమును మాదేశమును విడిచి యెచ్చటికైనను బొమ్ము.

62. విరాటవల్లభకుఁ = విరాటుని భార్య యగు సుధేష్ణతో.

63. భవన్మందిరవాసము = నీయింట నునికిని. ఇయ్యకొనినఁ = అంగీకరించినయెడ. మదీయవాంఛ = నాదైన కోరిక. కడతేఱుఁ = ఈడేఱును. అంతఁ = అటుపిమ్మట. మత్పతులు = నామగలు. తోఁచి = బయలుపడి. ఉదాత్తమతిఁ = గొప్పబుద్ధితో. భవదీయవాంఛితంబుఁ =

క. కృతఁ మెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెప్డు ♦ వరగుణకరుణా
న్వితు లీనరపతికి శుభ, ప్రతిపాదకు లగుదు రేమి♦భంగుల నైనన్. 64

వ. కావున. 65

క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ, గారణము దలంప నేమి ♦ గా నోపునో యం
చారసి బహుప్రకారవి, చారములకుఁ జొచ్చు టుడుగు ♦ సరసిజవదనా. 66

క. ఇది యేమిదైన నే మగు, మది నా కింతేలయనుచు ♦ మన్నన యెల్లం
దుదిఁ జెఱుపక ప్రార్థన సే, యుదుఁ గా కని నిశ్చయించు ♦ టుచితము నీకున్. 67

చ. అనిన సుధేష్ణ యిట్లనియె ♦ నంతవునంతకు మన్నృహంబునం
దునికికి సమ్మతించితి ని♦జోచితవృత్తిఁ జరింపు నాదునం

---

మీఁదైన కోరికను. తలకొల్పక = కలిగించుటకు. అప్రాప్యమనః ప్రమదంబు = క్రొత్తదైన మన
స్సంతోషము. చేకుఱుక = కలుగును. తా.—మునుపటివలె ట్లింకఁ బదుమూఁడుదినములు నీయింట
నుండుటకు నీ వంగీకరించినపక్షమున నాకోరిక నెఱవేఱును. అట్టిపట్టు నామగలు కనఁబడి మీకోరి
కలను నెఱవేర్తురు. మీ కానందము కలుగును.

64. కృతము = ఉపకారమును. ఉపకారవ్రతమునక = ఉపకారము చేయు నియమ
ముతో. వర్తిల్లుదురు = ఉందురు. వరగుణ కరుణా అన్వితులు = మేలిగుణములతోను దయతోను
గూడినవారు. ఈనరపతికిక = ఈ విరాటరాజునకు. ఏమిభంగులక ఐనక = ఏ విధములచేత నైనను.
శుభప్రతిపాదకులు = మేలు గలిగించువారు. అగుదురు అని యన్వయము. తా.—నామగలు కృత
జ్ఞతగలిగి యుపకారము చేయుతలంపుతో నుందురు. ఉత్తమ గుణసంపన్నులు. దయగలవారు. ఈ
రాజున కేవిధముచేత నైనను మేలు గలిగింతురు.

66. ఏమిగాక ఓపునొ = ఏమై యుండునో. ఆరసి = ఆలోచించి. బహుప్రకార విచార
ములకుక = పలువిధము లయిన చింతలకు. చొచ్చుట = ప్రవేశించుటను. ఉడుగు = విడువుము.
సరసిజవదనా = కమలమువంటి మోము గలదానా! సుధేష్ణ సంబోధనము. తా.—సైరంధ్రి యిట్లు
చెప్పుచున్న దనియు దీనికిఁ గారణ మేమిగా నుండునో యనియు సంశయింపకుము.

67. మన్నన = ఆదరము. చెఱుపక = చెడఁగొట్టక. ఉచితము = తగును. తా.—
ఈ సైరంధ్రి యెటుపోయిన నా కేమి యని తలఁచి యిదివఱకు నీవు చేసిన యాదరమునంతయు నిప్పుడు
ఫలకాలమునందు వ్యర్థపుచ్చరా దని నేను ప్రార్థించుచున్నా నని నిశ్చయింపుము. పాఠాం:—మది
నా కీచింత యేల మన్నన......టుచితమె నీకుక—మనస్సునందు నా కీచింత వలదు, నేనుచేసిన
యాదరమంతయుఁ గడపటఁ జెడఁగొట్టక పోవలయు నని ప్రార్థించెదను అని నిశ్చయించుట యుచి
తము కాదు అని యర్థము.

68. అంత అవ్వనంతకుక = ఆపదుమూఁడు దినములు నిండువఱకు. నిజఉచితవృత్తిక =
నీకుఁ దగిన నడవడిచేత. నాదునందనులక = నా కొడుకులను. మదీయవల్లభుక = నా మగనిని.
ఈదాత్తమతిక = గొప్పమనస్సుతో. పరికించి కొమ్ము = చూచికొనుము. ఊఱట = ఇష్టము. తా.—

దనుల మదీయవల్లభు ను♦దాత్తమతిం బరికించికొమ్ము నీ
మనమున నెట్టు లూఱట స♦మస్తము నట్టుల చేసెదం దగన్. 68

క. అని యూఱడిల్లఁ బలికిన, విని తొల్లిటియట్ల యుచిత♦వృత్తి ద్రుపదనం
దన యుండె నట్టియెడ ని, ట్లని ఘోసిరి జనులు పురము♦నందును భూమిన్. 69

చ. విరటుమఱంది కీచకుఁడు ♦ విక్రమదుర్దముఁ డన్యసైన్యభీ
కరమహనీయమూర్తి బల♦గర్వసముద్ధతచిత్తుఁ డెందు నె
వ్వరు సరి లేరు వీని కన ♦ వాలినదండిమగండు చూడ న
చ్చెరు వగుచావు సచ్చె నటు ♦ సేసినవా రఁట యెట్టివీరులో. 70

గీ. సింహబలుఁడు గంధర్వుల♦చేత నొక్క, సతికిఁ గా నిట్లు ఘోరంపుఁ♦జావు సచ్చె
నకట రిత్తకురిత్త మ♦త్స్యావనీశు, లావు గోల్పోయె సూతకు♦లంబు వ్రలిసె. 71

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లుజనవాదంబు క్రమక్రమంబున సమస్తదేశంబుల నెరసి
చెల్లుచుండె నట్టియెడ. 72

## ( దుర్యోధనుని వేగులవారు పాండవుల వెదకి కానక వచ్చుట. )

---

ద్రౌపది మాట విని సుధేష్ణ యి ట్లనియె. ఆ పదుమూఁడు దినములవఱకు మాయింట నుండవచ్చును, నీకుఁ దగినట్లు వర్తించుచు నాకొడుకులను నామగనిని రక్షింపుము. నీమనస్సునకు వచ్చినట్లు నే నన్నియు నడపెదను.

69. తొల్లిటిఅట్ల = మునుపటి వలెనే. ఉచితవృత్తిన్ = తగిన వ్యాపారముతో. ఘోసిరి= ఘోషించిరి. భూమిన్ = దేశమునందును. తా.—ఇట్లు ద్రౌపదికి ననుకూలముగాఁ జెప్పఁగా ద్రౌపది యెప్పటి యట్ల యామెయొద్ద నుండెను. అప్పు డాపట్టణమునను ఆదేశమునను ఇట్లు జన ఘోషము పుట్టెను.

70. విక్రమదుర్దముఁడు = పరాక్రమముచే నణఁపరానివాఁడు. అన్యసైన్య భీకరమహనీయ మూర్తి = శత్రుసేనలకు భయమును గలిగించునట్టి గొప్పయాకారము గలవాఁడు. బలగర్వసముద్ధత చిత్తుఁడు = బలముచేతఁ గలిగిన గర్వముచేఁ విఱ్ఱ వీఁగిన మనస్సు గలవాఁడు. వాలినదండిమగండు= విజృంభించిన గొప్పశూరుఁడు. తా.—విరాటరాజు మఱఁది యగు కీచకుఁడు గొప్పబలపరాక్రమములు గలవాఁడు, శత్రుసైన్యములను జయించినవాఁడు, తన కెవ్వరును సాటి లే రని కీర్తి పొందినవాఁడు, ఆశ్చర్యకర మయిన మరణము నొందెను. వాని నట్లు చంపినవా రెట్టి గొప్పశూరులో.

71. ఒక్కసతికిన్ కాన్ = ఒక్కస్త్రీకిఁ గాను. రిత్తకురిత్త = మిక్కిలి వ్యర్థముగా. మత్స్యఅవనీశులావు = విరాటరాజుబలము. కోల్పోయెన్ = చెడెను. సూతకులంబు = కీచకుల వంశము. పొలిసెన్ = నశించెను. తా.—కీచకుఁడు ఒక యాఁడుదానికిఁ గా నిట్టి భయంకర మయిన మరణము నొందెను, వ్యర్థముగా వాని వంశమంతయు నశించి విరాటునిబలము పోయెను.

72. ప్రవర్తిల్లు జనవాదంబు = కలిగినట్టి జనులవాక్యము. నెరసి = నిండి.

ఉ. పాతకి యై సుయోధనుఁడు ♦ పాండుతనూజులు సల్పుచున్న య
జ్ఞాతవిధివ్రతంబు కలు♦షంబుగఁ జేయఁ దలంచి పంచినన్
భూతల మెల్లఁ జూచి మును ♦ వోయినవారలు సెప్పుకొన్న సం
కేతపుఁజోటఁ గూడఁబడి ♦ ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్. 73

వ. మగిడి వచ్చి హస్తిపురంబు సొత్తెంచి. 74

సీ. వరుస నేనుంగులు ♦ గురిసినదానధా, రావలి దగుకల♦యంపి గాఁగ
రాజులసందడి ♦ రాసినతొడవులు, మురిసి రాలినపొడి ♦ ముగ్గు గాఁగఁ
గాంతలసంకుల♦గతిఁ ద్రెస్సి తొరఁగిన, హారముల్ పుష్పోప♦హారములుగ
నేమేమ యని యోలి ♦ నెత్తినపరదేశి, దొరలపావడములు ♦ తోరణముగ
సహజ మైనయలంకార♦మహిమ నతిశ, యిల్లి మహనీయవైభవ ♦ మెసక మెసఁగ
వఱలునరపతిమందిర♦ద్వారభూమి, సేర నరిగి యావేగుల♦వారు ప్రీతి. 75

వ. సముచితంబుగాఁ బ్రవేశించి. 76

---

73. సుయోధనుఁడు = దుర్యోధనుఁడు. పాతకి ఐ = పాపము గలవాఁడై. చల్పుచున్ = చేయుచు. అజ్ఞాతవిధివ్రతంబు = అజ్ఞాతవాసవ్రతమును. కలుషంబుగన్ = చెడినదానినిగా. పంచినన్ = పంపఁగా. కూడఁబడి = చేరి. ఖేదమున్ = దుఃఖమును. చారులు = వేగులవారు. తా.—దుర్యోధనుఁడు పాపబుద్ధి గలవాఁడై పాండవుల యజ్ఞాతవాసమును జెడఁగొట్టుటకు వేగులవారిం బంపఁగా వారు దేశము లన్నియుఁ దిరిగి తాము మున్నేర్పఱచుకొన్న సంకేతస్థలముం జేరి పాండవు లగపడక పోవుటకు దుఃఖించినవారై.

74. హస్తిపురంబు = హస్తినాపురమును. చొత్తెంచి = చొచ్చి.

75. కురిసినదానధారా ఆవలి = కురిసినట్టి మదజలధారలయొక్క పంక్తి. తగుకలయంపి = తగిన నీరు చల్లుట. సందడిన్ = ఒత్తడిచేత. రాసినతొడవులు = ఒరసికొనిన సొమ్ములు. మురిసి = విఱిగి. కాంతలసంకులగతిన్ = స్త్రీలయొక్క సమ్మర్దగమనముచేత. త్రెస్సి = తెగి. తొరఁగినహారముల్ = పడిన ముత్యాలదండలు. పుష్ప ఉపహారములుగన్ = పూలుచల్లుటలు కాఁగా. ఏము ఏము అ అని = మేము మేము అని చెప్పుచు. ఓలిన్ = వరుసగా. ఎత్తినపరదేశిదొరల పావడములు = ఎత్తినట్టి యితరదేశరాజుల కానుకలు. అలంకారమహిమన్ = అలంకారముయొక్క యతిశయముచేత. మహనీయవైభవము = గొప్పసంపద. ఎసకము ఎసఁగన్ = అతిశయింపఁగా. వఱలునరపతిమందిరద్వారభూమి = ఒప్పుచున్న రాచనగరుయొక్క వాకిలిప్రదేశమును. తా.—ఏనుఁగుల మదజలము కాఱుటచేఁ దడియుట నీరుచల్లుటగాను, రాజుల సమ్మర్దముచే నొరసికొని రాలిన వారియాభరణముల చూర్ణములు ముగ్గులుగాను, స్త్రీలు నడచునపు డొరసికొనుటచేఁ దెగిపడిన ముత్యాలదండలే పూలుచల్లుటగాను, ఇతరదేశరాజులు తమపేరులు చెప్పికొనుచు వరుసగా నెత్తిపట్టిన కానుకలు తోరణములుగాను గలిగి యిట్లు సహజమైన యలంకారముచే నొప్పుచు గొప్పసంపదతోఁ గూడి యున్న నగరివాకిలి కావేగులవారు పోయి.

76. సముచితంబుగాన్ = తగినయట్లుగా.

గీ. ద్రోణగాంగేయభానుమ◆త్సూనుకృపను, శల్యదుశ్శాసనులు సర్వ◆సైన్యపతులు
నార్యజనములుఁ గొలువ మ◆హార్హకాంచ,నోన్నతాసనమునఁ గొలు◆వున్నవాని.

స్రగ్ధర. మౌళిస్రక్సంగరంగ◆న్మధుకరపటలీ◆మానసాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాం◆జలిపుటఘటనా◆చారుఫాలస్థలక్ష్మా
పాలశ్రేణీవిశాలాం◆బకకుముదవనీ◆బాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతి◆స్మితవదనరుచి◆స్ఫీతు నాగేంద్రకేతున్. 78

వ. కని జయశబ్దపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబు సేసి. 79

---

77. గాంగేయ = భీష్ముఁడు. భానుమత్ సూను = కర్ణుఁడు. సర్వసైన్యపతులున్ = ఎల్ల సేనానాయకులును. ఆర్యజనములున్ = పూజ్యులగు జనులును. మహార్హకాంచన ఉన్నత ఆసనమునన్ = మిక్కిలి యుత్తమమయిన బంగారుపెద్దపీఁటయందు. తా.—ద్రోణుఁడు మొదలగువారును సేనాధిపతులును పెద్దలును పరివేష్టించి యుండఁగా సింహాసనంబునఁ గూర్చున్నవానిని.

78. మౌళి.....స్ఫీతున్—మౌళి = శిరస్సులయందలి, స్రక్ = పుష్పమాలికలయందు, సంగ = ఆసక్తిచేత, రంగత్ = తిరుగుచున్న, మధుకర = తుమ్మెదలయొక్క, పటలీ = సమూహము యొక్క, మానస = మనస్సులయొక్క, ఆకృష్టి = ఆకర్షించుట యను, విద్యా = విద్యచేత, శాలి= ఒప్పుచున్న, స్ఫార = ప్రకాశించుచున్న, అబ్జరేఖ= కమలముయొక్క కాంతివంటి కాంతిగల, అంజలిపుట = దొప్పలవంటి చేమోడ్పులయొక్క, ఘటనా = కూర్చుటలచేత, చారు = చక్కని, ఫాలస్థల = నొసటిప్రదేశములు గల, క్ష్మాపాల = రాజులయొక్క, శ్రేణీ = వరుసలయొక్క, విశాల = వెడలుపు లయిన, అంబక = కన్నులు అను, కుముదవనీ = తెల్లకలువలసమూహముతోడి, బాంధవ = చుట్టరికమునకు, ఆయత్త = అధీన మయిన, చంద్ర = చంద్రునివలె, శ్రీలీలా= సంపద్యుక్తమైన విలాసముచేత, గాఢ = అతిశయించిన, కాంతి= కాంతి గల, స్మిత= చిఱునగవు గల, వదనరుచి= ముఖకాంతిచేత, స్ఫీతున్ = ప్రకాశించువానిని. నాగేంద్రకేతున్ = సర్పశ్రేష్ఠము టెక్కెమునందుఁ గల దుర్యోధనుని. తా.—శిరస్సులయందు ధరించిన పుష్పమాలికలయందలి తుమ్మెదలను కమలములవంటివగుటచే నాకర్షించుచున్న చేమోడ్పులను ఫాలములయందుఁ గదియించి సేవించుచుండు సామంతరాజుల నేత్రములు అను కలువలయందలి చుట్టరికముచేత వచ్చిన చంద్రుఁడో యనం దగియున్న చిఱునగవుతోఁ గూడిన ముఖము గల దుర్యోధనుని. అంజలిపుటములు తుమ్మెదల నాకర్షించినట్లు వర్ణించుటచేఁ దుమ్మెదలు వానిం జూచి కమలము లని భ్రమించినట్లు ధ్వనించుటవలన భ్రాంతిమదలంకారధ్వని. అంబకకుముదవనీ యనుచోట రూపకము. స్మితమునందుఁ జంద్రత్వసంభావనముచే నుత్ప్రేక్ష గమ్యము. రూపకోత్ప్రేక్షల కంగాంగిభావముచే సంకరము. భ్రాంతిమంతమునకును వీనికిని సంసృష్టి. లలాటములందుఁ జేమోడ్పులు గీలించి భయభక్తులతో సేవించుచుఁ బ్రసాదమును నిరీక్షించుచున్న సామంతరాజులను చిఱునగవుచే నాదరించుచున్నవానిని అని భావము.

79. జయశబ్దపూర్వకంబుగాన్ = జయ యను శబ్దము ముందు గలుగునట్లుగా.

క. మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాంతవినయ♦నిరతిం జారుల్
దగ విన్నవించి రిట్లని, జగతీశ్వరునకు నిజప్ర♦చారం బెల్లన్. 80

క. దేవరయానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు నున్న♦యెడ యే మరయం
గా వెడలి వారు సనినమ, హావిపినంబులకుఁ దొలుత ♦ నరిగితిమి వెసన్. 81

వ. అందు. 82

గీ. పరఁగఁ బొదరు పొదరు ♦ పల్లంబు పల్లంబు, మ్రాను మ్రాను దుర్గ♦మంపుఁజోటు
దుర్గమంపుఁజోటు ♦ దోన దోన గుహా గుహా, యూడి గాఁగ నెందు ♦ నరసి యరసి.

వ. ఒక్కయెడ నరదంబు లరిగినచొప్పు గాంచి దానివెంబడిం జని చని. 84

క. కేవలసూతులతోడన, పోవుట గని వానిఁ జేరఁ ♦ బోవక యవి యిం
కేవంకఁ బోవునో కో యను, భావనఁ బోయితిమి వాని♦పజ్జన మేమున్. 85

వ. అవియును ద్వారకానగరంబున కరిగిన. 86

---

80. మొగిచినచేతులు = మోడ్చినచేతులను. ముందలన్ = నెత్తియందు. నిగిడించి= మోపి. నితాంతవినయనిరతిన్ = ఎడతెగని యడఁకువయందలి యాసక్తిచేత. చారుల్ = వేగులవాండ్రు. జగతీఈశ్వరునకున్ = రాజయిన దుర్యోధనునితో. నిజప్రచారంబు = తమసంచారమును. ఎల్లన్, తగన్, ఇట్లు, అని, విన్నవించిరి. అని యన్వయము. తా.—వేగులవాండ్రు తమ చేమోడ్పులను లలాటంబునం గీలించి మిక్కిలి వినయముతోఁ దమవృత్తాంతము నిట్లు దుర్యోధనునకు విన్నవించిరి.

81. దేవరఆనతిన్ = ఏలినవారి యాజ్ఞచేత. ఎడ = చోటును. అరయంగాన్ = తెలిసికొనుటకై. చనినమహత్ విపినంబులకున్ = పోయిన గొప్ప యడవులకు. తొలుతన్ = మొదట. వెసన్. అరిగితిమి = పోయితిమి అని యన్వయము. తా.—దేవరయాజ్ఞ చొప్పునఁ బాండవులను ద్రౌపదిని వెదకఁ గోరి మేము మొదట వారున్న యడవులకుఁ బోయితిమి.

83. పరఁగన్= ఒప్పునట్లు. దుర్గమంపుచోటు = చొరరానిచోటును. దోన= కొండమీఁది గుంటను. అరసిఅరసి = వెదకివెదకి. తా.—మేము మందుఁ బొదలు మొదలగువాని నన్నింటిని వెదకి.

84. అరదంబులు = తేరులు. చొప్పు = జాడను.

85. కేవలసూతులతోడన్ అ = పట్టిసారథులతో మాత్రమే. వానిన్ = అరథములను. అవి = ఆరథములు. అనుభావనన్ = అనుతలంపుతో. వానిపజ్జన్ అ = వానివెంటనే. తా.—ఆరథములు సారథులతో మాత్రమే పోవుటం జూచి వానియొద్దకుఁ బోవక యవి యెచ్చటికిఁ బోవునో యని వానివెంటనే పోయితిమి. పాఠాం :—వారి జేరఁబోవక = ఆసారథుల సమీపమునకుఁ బోవక యని యర్థము. అది ఇంకేవంక, వానిపజ్జన—ఇందలి తచ్ఛబ్దము రథములను బరామర్శించుటచే రథములు బహువచనము అగుటంజేసి యేకవచన మసంగతము. రథములను జూచిరి కావున వీతచ్ఛబ్దములు చొప్పును పరామర్శించు ననుట యుచితము కాదు.

క. అందుల నుండుదు రనునా, సం దెల్లము గాఁగఁ బెక్కు ♦ చందంబుల ము
ట్టం దిరిగి తడవి కుంతీ, నందనులం గాన లేక ♦ నానాభంగిన్. 87

వ. విచ్చి పోయి సమస్తదేశంబులుం గలయం గ్రుమ్మరి కొండొకయు నుపేక్ష లేక పరువుత్రోడిద కాఁ బరికించుచు బయలను నాలస్యంబు దక్కి యోలంబునట్ల శోధించుచుఁ గీ డయిన నుదాసీనత యుడిగి మేలుచందంబున భావించుచు వివిధప్రకారంబు లయినబహుప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేతస్థలంబునం గూడికొని మావర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట దివ్యచిత్తంబున నవధరించినభంగి సేయువార మై చనుదెంచితిమి మాకుఁ జూడఁ బాండవులు పొడవడంగి పోయిరి గాని యీలోకంబున నునికి గలిగిన నగపడకుండ నేర రిది యిక్కార్యం బున్నరూపు మఱియొక్కవిశేషంబునం బ్రియం బంది వచ్చితిమి చిత్తగింపుము. 88

సీ. మత్స్యదేశాధీశు♦మఱఁదిఁ గీచకునిఁ బు, ణ్యోజ్జ్వలాకృతి యగు♦నొక్కవనిత
కతమున నడురేయి ♦ గంధర్వు లతిరహ, స్యప్రకారంబునఁ ♦ జంపి రదియు

---

87. అను ఆసన్ = అను నాశచేత. తెల్లముకాఁగన్ = స్పష్టమగునట్లు. పెక్కుచందంబులన్ = పలువిధములచేత. ముట్టన్ = అంతటను. తడవి = వెదకి. నానాభంగిన్ = నానావిధమున. తా.—ద్వారకానగరమునందుఁ బాండవులుందు రనునాసచే నచ్చట నంతటను గలయ వెదకి యందు వారు లేకుండుటచే నానావిధములుగా.

88. విచ్చి=విరిసి. కొండొకయున్=కొంచెమైనను. పరువుత్రోడిది అకాన్ = కోసుదూరము మాత్రమే అని, హెచ్చు దూర మయినను దూర మని తలంపక యనుట. పాఠాం:—వెరవుత్రోడిది అకాన్= ఉపాయముతోఁ గూడినట్లుగానే. పరికించుచున్= వెదకుచు. బయలనున్ = బయలి ప్రదేశమునుగూడ. ఆలస్యంబు= సోమరితనమును. తక్కి = విడిచి. ఓలంబునట్లు అ = మఱుఁగు ప్రదేశమువలెనే. శోధించుచున్ = వెదకుచు. కీడు = ఆపద. ఐనను = కలిగినను. ఉదాసీనత= ఉపేక్షను. మేలుచందంబునన్ = సుఖమువలె. భావించుచున్ = తలంచుచు. వివిధప్రకారంబులు = నానావిధములు. రోసి = వెదకి. మావర్తించిన తెఱంగు = మేము నడచిన విధమును. అటన్= పిమ్మట. దివ్యచిత్తంబునన్= మేలిమనస్సునందు, మీమనస్సునం దనుట. అవధరించినభంగి= నిశ్చయించినవిధమును. పొడవడంగి = రూపుమాసి. ఉనికి= ఉండుట. ఉన్నరూపు= ఉన్నవిధము. ప్రియంబు = సంతోషమును.

89. మత్స్యదేశాధీశుమఱఁదిన్ = విరాటరాజు మఱఁదిని. పుణ్యోజ్జ్వలాకృతి = పుణ్యమయినదియుఁ బ్రకాశించునదియు నగు నాకారము కలది. అగు ఒక్కవనితకతమునన్ = అయిన యొక్క స్త్రీ నిమిత్తమున. అక్కజంబు = ఆశ్చర్యము. ఆయుధవ్యాపారము = ఆయుధములపని. శిరంబు = తలను. కేలు = చేతులను. దుష్టచిత్తులు = చెడ్డమనస్సు గలవారలు. పొడివి = పట్టి. చిత్రనిహతిన్ = చిత్రవధచేత. తెగఁజూచి = చంపి. అనిరూపణీయమూర్తి వారన్ప్రత్తిమైన్ = తెలియ

నక్కజం బాయుధ♦వ్యవహార మేమియు, లేదు శిరంబు గా ♦ ళ్లేలు డొక్క
లోనికిఁ జొరఁ ద్రోచి ♦ పీనుంగు ముద్దగాఁ, జేసి వైచిరి దుష్ట♦చిత్తు లైన
యతనితమ్ముల నెక్కరి ♦ నైనఁ దప్పి, పోవ నీక యారాత్రియ ♦ పొడిపి చిత్ర
నిహతిఁ దెగఁ జూచి యనిరూప♦ణీయమూర్తి, వా రవ్యక్తిమై నరిగిరి ♦ క్షారవేంద్ర.

వ. విరాటుండు పగతుండు గావునఁ దదీయవ్యసనం బెఱింగింప వలయు నని విన్నవించితి మది యట్లుండెఁ బాండవుల నన్వేషించుపని యిట మీఁదం జిత్తగించు తెఱంగు గాన తిచ్చునది యనిన విని యట్లు చేయుదము గాక యని వారలఁ బోవం బనిచి కొండొకసేపు చింతాక్రాంతుండై యమ్మహీకాంతుండు మంత్రులం జూచి యి ట్లనియె. 90

గీ. సమయసముచితకృత్యంబు ♦ చక్కఁ జేసి
పాండవులు రాజ్యమున కాస♦పడక యున్న
యరసి యెఱిఁగి యరణ్యంబు♦నందుఁ దొంటి
యట్ల యిడుమలఁ గుడువఁ బో ♦ నడువ వలయు. 91

క. ఎఱుఁగుట దుర్ఘట మెవ్విధి, నెఱుఁగంగా వచ్చు మీర ♦ లెల్లను మీమీ
యెఱిఁగినచందంబున నా, కెఱిఁగింపుఁడు వార వెదకి ♦ యెఱుఁగు తెఱంగుల్. 92

వ. అనిన రాధేయుం డి ట్లనియె. 93

---

రానిదియు నడ్డగింపరానిదియు నగు వ్యాపారముచేత. తా.—రాజా! కీచకుని నొక స్త్రీనిమిత్తమై గంధర్వులు అర్ధరాత్రమునఁ జంపిరి. ఆయుధములతోఁ గొట్టకయే యాశ్చర్యముగాఁ జంపి తలను కాలు చేతులను కడుపులోఁ జొనిపి పీనుఁగును ముద్ద చేసిరి. ఆరాత్రియే వానితమ్ములను గూడ నొకనినైనను విడువక చిత్రవధముగాఁ జంపి యెవ్వరికిని దెలియరాక పోయిరి.

90. పగతుండు = పగవాఁడు. తదీయవ్యసనంబు = అతనిపైన దుఃఖమును. అన్వేషించుపని = వెదకుకార్యమును. చిత్తగించిన తెఱంగు = తలఁచినవిధమును. ఆనతిచ్చునది = ఆజ్ఞాపింపవలయును. చింతాఆక్రాంతుండు ఐ = చింతచేఁ జుట్టఁబడినవాఁడై. అమ్మహీకాంతుండు = ఆరాజు, దుర్యోధనుఁడు.

91. సమయసముచితకృత్యంబు = ప్రతిజ్ఞకుఁ దగిన కార్యమును. అరసి = వెదకి. తొంటియట్లు అ = మునుపటివలెనే. ఇడుమలన్ = కష్టములను. కుడువన్ = అనుభవించుటకు. పోన్ అడువవలయున్ = పోవునట్లు గొట్టవలయును. తా.—పాండవులు ప్రతిజ్ఞను నెఱవేర్చి వచ్చి రాజ్యభాగమును గోరుటకు ముందే వారిని వెదకి కనిపట్టి యెప్పటివలె నడవికిఁ బోయి కష్టపడునట్లు చేయవలయును.

92. దుర్ఘటము = అశక్యము. ఎవ్విధిన్ = ఏవిధమున. తా.—వారిని కనిపట్టుట కష్టము, ఎట్లు కనిపట్టవచ్చునో ఆవిధమును మీకుఁ దోఁచినట్లు నాకుం జెప్పుఁడు.

93. రాధేయుండు = కర్ణుఁడు.

గీ. వివిధమన్నిరూప • వేషముల్ వైకొని, నిఖిలదిశలయందు • నిపుణవృత్తి
నెఱుఁగునట్లుగా న•నేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన • నెఱుఁగఁబడరె. 94

క. అనుపలుకులు విని దుశ్శా, సనుఁ డేమియు సరకుగొనక • సమదవిలాసా
ననుఁ డై నిజాగ్రజన్మునిఁ, గనుఁగొని యి ట్లనియె గాఢ•గర్వస్ఫూర్తిన్. 95

చ. వలదు రోయఁ బాండవుల • వా రొకయుక్కువ లేని త్రిమ్మటన్
బల మఱి వన్యసత్త్వముల•పాల్పడి చచ్చినచోటఁ బూరియు
న్మొలవదె యింత కింకిట మ•నోముద మస్ఖలితంబుగాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగ•నందుము నం గొనియాడు మున్నతిన్. 96

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డి ట్లనియె. 97

ఉ. క్షాత్త్రసమగ్రు లార్యనుత•గౌరవదీప్తులు వర్ణనీయసౌ
భ్రాత్రు లుదాత్తదైవబల•భవ్యులు దివ్యసమాను లాపృథా

---

94. వివిధమన్నిరూప వేషముల్ = నానావిధము లయిన తెలియరాని వేషములను. నిఖిలదిశలయందున్ = ఎల్లదిక్కులయందును. నిపుణవృత్తిన్ = నేర్పరితనముతో. పుచ్చినన్ = పంపినయెడ. ఎల్లి నేఁటిలోనన్ = రేపో నేఁడో. తా.—ఎవ్వరికిని తెలియరాని నానావిధవేషములు వేసికొని దేశము లందంతటను జక్కఁగా వెదకుం డని వేగులవారిం బంపినయెడఁ బాండవులను శీఘ్రముగా వారు కనుఁగొందురు.

95. సరకుగొనక = లక్ష్యము చేయక. సమదవిలాసఆననుఁడు ఐ = మదవిలాసముతోఁ గూడిన ముఖము గలవాఁడై. నిజఅగ్రజన్మునిన్ = తన యన్నను, దుర్యోధనుని. గాఢగర్వస్ఫూర్తిన్ = ఎక్కుడయిన గర్వముయొక్క యతిశయముచేత. తా.—కర్ణునిమాటలు విని దుశ్శాసనుఁడు మిక్కిలి గర్వముతో దుర్యోధనునిఁ జూచి యిట్లు చెప్పెను.

96. రోయఁగన్ = వెదకుట. వలదు. ఉక్కువలేనిత్రిమ్మటన్ = ఊఱట లేని కష్టముచేత. అఱి = చెడి. వన్యసత్త్వములపాల్ = అడవిజంతువుల బారిని. పూరియున్ = కసవుకూడ. ఇంతకున్ = ఇప్పటికి. మనోముదము = మనస్సునందలి సంతోషము. అస్ఖలితంబుకాఁగన్ = తగ్గనియట్లుగా. ఉన్నతిన్ = గొప్పతనముచేత. తా.—పాండవులను వెదకవలసినది లేదు. వారు కొంచెమైనను నూఱట లేక కష్టములఁ బడుటచే బలహీనులై యడవిమృగములపాలై యుందురు. వారు చచ్చి యిప్పటికిఁ జాలకాలమై యచ్చట నిప్పటికిఁ గసవుకూడ మొలచియుండును. కావున వట్టిచింతలచే సంతోషము తగ్గించుకొనక నీయిష్టప్రకారము రాజ్యలక్ష్మి ననుభవింపుము.

97. దరహాసితవదనుండు=చిఱునగవు గల మోము గలవాఁడు. కుంభసంభవుండు=ద్రోణుఁడు.

98. క్షాత్త్రసమగ్రులు = క్షత్త్రియతేజస్సుచే నిండినవారు. ఆర్యనుత గౌరవదీప్తులు = పెద్దలచేఁ బొగడఁబడిన గొప్పతనమును ప్రతాపమును గలవారు. వర్ణనీయసౌభ్రాత్రులు = పొగడఁదగిన మంచితోఁబుట్టువుల తనము గలవారు. ఉదాత్తదైవబలభవ్యులు = ఉత్తమ మయిన దైవబలముచేతఁ

పుత్త్రులు వారి నాపదలు ♦ పొందునె యోపిన నింక నైన నీ
ధాత్రిఁ గడంగి యారయువి♦ధంబులు సెప్పఁడు నేర్పు లేర్పడన్. 98

( భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజుసుగుణంబులఁ జెప్పుట. )

వ. అనిన నాతనిమాట లాదరించి భీష్ముం డిట్లనియె. 99

ఉ. నల్లవొ నిక్క మాడె నృప♦నందనుముందట ద్రోణుఁ డొక్కఁడుం
దెల్లము వారు బాహుబల♦ధీబలదైవబలంబు గొప్ప వ
ర్తిల్లుదు రమ్మహాత్ముల క♦రిష్టము లేమిట నెందు నేల పా
టిల్లెడు వారిఁ గాన్పను గ♦డింది తదీయమహానుభావతన్. 100

క. వారలును వీరలును నా, కారయఁగా నొక్కరూప ♦ నైనను గార్యం
బీ కెఱిఁగింప వలయు నని, కౌరవపతి నన్ను నడిగెఁ ♦ గాన నితనికిన్. 101

క. కలరూపెఱిఁగింపంగా, వలయుం జెప్పెద మదీయ♦వచనములు హితం
బులు గాఁగ నిశ్చయస్థితిఁ, దలఁచి యనుష్ఠింప బుద్ధి ♦ దలకొనునేనిన్. 102

---

గలిగిన మంగళము గలవారు. దివ్యసమానులు = దేవతలతో సరి యయినవారు. ఆపృథాపుత్త్రులు = ఆకుంతికొడుకులు. ఓపినన్ = చాలినయెడ. ఈధాత్రిన్ = ఈభూమియందు. కడంగి = పూని. ఆరయువిధంబులు = వెదకువిధములను. తా.—పాండవులు క్షత్త్రబలమును గౌరవప్రతాపములును భ్రాతృస్నేహమును దైవబలమును గలిగి దేవసమానులైనవారు కావున వారి కాపదలు గలుగవు. కాఁబట్టి యెట్లైనను జక్కఁగా వెదకునట్టి విధములనే చెప్పఁడు.

100. నల్లవో = ఔరా! నిక్కము = నిజమును. తెల్లము = స్పష్టము. బాహుబలధీబలదైవబలంబులు = భుజబలమును బుద్ధిబలమును దైవబలమును. వర్తిల్లుదురు = ఉందురు. అరిష్టములు = ఆపదలు. ఏమిటన్ = దేనిచేత. పాటిల్లెడున్ = కలుగును. తదీయమహానుభావతన్ = వారిదైన గొప్పప్రభావము గలుగుటచేత. వారిన్ = ఆపాండవులను. కాన్పను = కనుఁగొనుట. కడింది = కష్టము. తా.—దుర్యోధను నెదుట నొకద్రోణుఁడు మాత్రమే నిజము చెప్పినాఁడు. పాండవులు బాహుబలమును బుద్ధిబలమును దైవబలమును గలిగినవారు కావున వారి కెప్పుడును నాపదలు కలుగవు, వారి మహిమచే వారిం గనిపట్టుటయుఁ గష్టము.

101. ఒక్కరూప = ఒకవిధమే. కార్యంబు = చేయఁ దగినదానిని. నన్నున్ = నన్నుఁ గూడ. తా.—నాకుఁ బాండవులును గౌరవులును ఒకటే యైనను దుర్యోధనుఁడు నన్నుఁ గూడ నడిగినాఁడు కావున నితనికి.

102. కలరూపు = ఉన్నవిధమును. మదీయవచనములు = నావైనమాటలను. నిశ్చయస్థితిన్ = నిశ్చయముతోడి యునికిచేత. అనుష్ఠింపన్ = చేయుటకు. తలకొనునేనిన్ = కలిగినయెడ. తా.—నేను యథార్థము చెప్పవలయును. నా మాటలను హితములుగాఁ దలఁచి యట్లు చేయుట కిష్టమున్న యెడఁ జెప్పెదను.

సీ. బ్రాహ్మణభక్తియుఁ ♦ బరహితయుక్తియు, నిర్మలమతియును ♦ నీతిరతియు
సత్యభాషణమును ♦ సాధుపోషణమును, జిరవితరణమును ♦ సేవ్యగుణము
సన్మార్గరక్షయు ♦ నున్మత్తశిక్షయు, నంచితోదయముఁ గృ♦పాతిశయము
బంధుసంప్రీతియు ♦ భవ్యవిభూతియు, శాస్త్రాధిగమము న♦స్ఖలితదమము
సజ్జనస్తవనీయసౌ♦జన్యములును, ధర్మసంచితబహుధన♦ధాన్యములును
గలుగు నక్షీణపుణ్యదో♦హలుఁడు ధర్మ, సూనుఁ డున్నదేశంబున♦మానవులకు.

క. మఱియును నొక్కవిశేషం, బెఱిఁగించెద నతనియున్న♦యెడ గోధనముల్
మెఱుఁ గెక్కి పాఁడి నేమిటఁ, గొఱఁతపడక యుండఁ జేఁపి ♦ కురియుచు నుండున్.

వ. కావున నిట్టిదేశం బెప్పు డెయ్యది యగు నందుఁ గుంతీతనయుల నరయం బనుప వలయు ననినఁ గృపాచార్యుం డిట్లనియె. 105

క. అరయఁగ నయ్యేడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి ♦ నాలస్యము లే
కరయునది పెక్కుభంగుల, నరసినఁ దోఁచెదరు గాక ♦ యది య ట్లుండెన్. 106

---

103. అక్షీణపుణ్యదోహలుఁడు = తక్కువకాని పుణ్యమునందు ఆసక్తి గలవాఁడు. ధర్మసూనుఁడు = ధర్మరాజు. ఉన్నదేశంబునన్. మానవులకున్ = మనుష్యులకు. పరహితయుక్తియున్ = ఇతరుల మేలునందు ఆసక్తియును. నిర్మలమతియును = స్వచ్ఛమయిన మనస్సును. నీతిరతియున్ = న్యాయమునందు ఆసక్తియును. సాధుపోషణమును = సాధువుల పోషించుటయును. చిరవితరణమును = ఎక్కువగా నిచ్చుటయును. సేవ్యగుణమున్ = సేవింపఁదగిన గుణమును, ఉత్తమగుణము ననుట. సన్మార్గరక్షయున్ = మంచిమార్గము గలవారిని రక్షించుటయును. ఉన్మత్తశిక్షయున్ = దుర్మార్గుల శిక్షించుటయును. అంచిత ఉదయమున్ = ప్రకాశించుచున్న యభివృద్ధియును. కృపా అతిశయమున్ = దయయొక్క యాధిక్యమును. భవ్యవిభూతియున్ = మంగళకరమయిన సంపదయును. శాస్త్ర అధిగమమున్ = శాస్త్రముల తెలియుటయును. అస్ఖలితదమమున్ = తొలఁగని యింద్రియనిగ్రహమును. సజ్జనస్తవనీయ సౌజన్యములును = సత్పురుషులచేఁ బొగడఁదగిన మంచితనములును. ధర్మసంచిత బహుధనధాన్యములును = ధర్మముచే సంపాదింపఁబడిన యధికమయిన ధనమును ధాన్యమును. కలుగున్ అని యన్వయము. తా.—ధర్మరాజున్నదేశము నందలిజనులకు బ్రాహ్మణభక్తి మొదలయినవి యెక్కువగాఁ గలిగి యుండును.

104. ఒక్కవిశేషంబు = ఒక్క యతిశయము. అతనిఉన్నయెడ = ఆధర్మరాజున్నచోట. గోధనముల్ = గోవులు అను ధనములు. తా.—ఇదిగాక మఱియొకవిశేషముఁ జెప్పెదను. ధర్మరాజున్నదేశమునం దావులు వృద్ధి పొంది యెక్కువగాఁ బా లిచ్చుచుండును.

105. కుంతీతనయులన్ = పాండవులను.

106. అరయఁగన్ = వెదకుటకు. అయ్యేడుతెఱఁగులన్ = తగినవిధములచేత. అరయుట = వెదకుట. కార్యంబు = చేయఁదగినది. పెక్కుభంగులన్ = పలువిధములచేత. అరసినన్ = వెదకిన యెడ. తోఁచెదరు = అగపడియెదరు. తా.—ఎన్నివిధముల వెదక వచ్చునో యన్నివిధములను బాండవుల వెదకవలయును. ఇట్లు ఆలస్యము లేక చక్కఁగా వెదకినయెడ వా రగపడియెదరు. ఇదిగాక.

ఉ. వారలు పూనినట్లు వన♦వాసము సల్పిరి వీరు వేచి త
మ్మారయఁగా బయల్పడని♦యట్లుగ నుండెడువత్సరంబునుం
జేరువచేరువన్ గడచెఁ ♦ జిత్తములుం గలుషంబు లమ్మహా
వీరుల కీనృపాలునెడ ♦ వీరికి నూరక యున్కి గర్జమే. 107

క. అలు డైనను బగతుని దెసఁ, దలఁపు గలుగ వలయు ననిన ♦ దర్పోజ్జ్వలదో
ర్బలు లగు కౌంతేయుల మన, మెలమికలిమి నచ్చి యిట్టు ♦ లేమఱ నగునే. 108

చ. మనబల మెంత యంతయు స♦మగ్రసముద్యమదుర్గమంబుగా
మునుమును గూర్చి తోడుపడు♦మూఁకలకుం దగుమైఁ గ్రమక్రమం
బున నెఱిఁగించి రాఁ బనిచి ♦ భూరిసముజ్జ్వలసైన్యజృంభణం
బున నెఱి వ్రెంది యున్కి కురు♦భూపతి కిప్పటికార్య మారయన్. 109

గీ. పాండురాజసుతులు ♦ బాసమై నడవడి, గడచి కయ్యమునకుఁ ♦ గాలుద్రవ్వ

---

107. వీరు = దుర్యోధనుఁడు మొదలగువారు. వేచి = వెదకి. బయల్పడని యట్లుగనుండెడు వత్సరంబునన్ — అజ్ఞాతవాసవత్సరము ననుట. చేరువచేరువన్ = దాపుదాపుగా. కడచెన్ = దాఁటెను. అమ్మహావీరులకున్ = గొప్పశూరు లయిన యీపాండవులకు. ఈ నృపాలునెడన్ = ఈదుర్యోధనుని యందు. చిత్తములున్ = మనస్సులును. కలుషంబులు = కోపము గలవి. ఉన్కి = ఉండుట. కర్జము ఏ= యుక్తమా? తా.—పాండవులు తమ ప్రతిజ్ఞచొప్పున వనవాసము చేసిరి, అజ్ఞాతవాసము చేయవలసిన సంవత్సరము కూడ ఇంచుమించుగా ముగియ వచ్చెను. వారలకు దుర్యోధనునిమీఁద మిక్కిలి కోపము గలదు. కావున వీ రూరకుండుట యుక్తము కాదు.

108. అలుడు = అల్పుఁడు. పగతుని దెసన్ = శత్రువునందు. తలఁపు= జాగ్రత్త. దర్ప ఉత్ జ్వలదోర్బలులు = గర్వముచేఁ బ్రకాశించుచున్న బాహుబలము గలవారు. ఎలమికలిమిన్= సంతోషము కలిగి యుండుటచేత. నచ్చి = నమ్మి. తా.—శత్రువు అల్పుఁడైనను వాని నుపేక్షింపరా దని చెప్పుదురు. అట్లుండఁగా మహాబలశాలు లగు పాండవుల నుపేక్షించి మన మిట్లు సంతోషముగా నేమఱి యూరక యుండ రాదు.

109. సమగ్రసముద్యమదుర్గమంబుగాన్ = సంపూర్ణ మయిన ప్రయత్నముచేత నెదిరింపరాని యట్లుగా. మునుమును = మిక్కిలిముందుగా. కూర్చి = చేర్చి. తోడుపడుమూఁకలకున్ = సహాయు లగు సేనలకు. తగుమైన్ = తగినవిధమున. రాన్ పనిచి = వచ్చునట్లుచేసి. భూరిసముజ్జ్వలసైన్యజృంభణంబునన్ = అధికమయి ప్రకాశించుచున్న సైన్యములయొక్క విజృంభణముచేత. నెఱి = పూర్తిని. కురుభూపతికిన్ = దుర్యోధనునకు. తా.—మన సైన్య మెంత కలదో యంతయును శత్రువుల కభేద్య మగునట్లు ముందే కూర్చికొని మనకు సహాయముగా వచ్చువందఱిని క్రమక్రమముగా రప్పించి యొక్కువసైన్యములు గలిగినవాఁడై దుర్యోధనుఁ డిపుడు సన్నద్ధుఁడై యుండవలయును.

110. బాసమైన్ = ప్రతిజ్ఞచొప్పున. నడవడి = నడతను. కడచి = నెఱవేర్చి. కయ్యమునకున్ = యుద్ధమునకు. అన్నరనాథుతోన్ = ఆధర్మరాజుతో. సముచితముగన్ = తగినట్లుగా.

కున్నయట్టు లైన ♦ నన్నరనాథుతో, సంధి సేయు టొప్పు ♦ సముచితముగ. 110

క. ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ ♦ జూడం గార్యం
బేచందంబునఁ దెలియఁ గగు, నాచాలుట కోర్వ వలయు ♦ నది యట్లుండెన్. 111

క. వారలు లే రఁట పోవెఱ, వారలఁ దగుభంగి మనకు ♦ వశ్యులఁ జేయన్
భూరిబలయుతుల మగుటయు, కారణ మను టనుమతంబు ♦ గాదే మనకున్.

గీ. ఇవ్విధంబునఁ దమతమ ♦ యెఱుఁగు తెఱఁగు, లందఱును జెప్ప విని కురు ♦ నందనుండు
దగవిచారించి కార్యంబు ♦ తెగువఁ గాంచి, యెలమి వారలఁ గనుఁగొని ♦ యిట్టు లనియె.

గీ. సింహబలుఁడు భీమ ♦ సేనుండు శల్యుండు, హలధరుఁడు సమాన ♦ బలము వార
లొండొరులను గెలుచు ♦ నుత్సాహమును గల, రుద్ధతులును బాహు ♦ యుద్ధపరులు.

---

సంధి. చేయుట. ఒప్పున్ అని యన్వయము. తా.—పాండవులు తమప్రతిజ్ఞను నెఱవేర్చి యుద్ధము కోరనియెడ ధర్మరాజుతో మనకనుకూలముగా సంధి చేయవచ్చును. “యథా కాలోదయే ప్రాప్తే సమ్యక్తై స్సంధధామహే” అను మూలమువలన “అన్నరనాథుతోన్” అను వ్రాఁతప్రతులయందలి పాఠమే యుచితము.

111. ఏచి = విజృంభించి. చలంబునన్ = పట్టుదలచేత. ఒంటికిన్ = ఇతరమునకు, యుద్ధమున కనుట. చూచినన్ = ఆలోచింపఁగా. కార్యంబు = పని. ఏచందంబునన్ = ఏవిధమున. తెలియఁగు = చక్కన. ఆచాలుటకున్ = అందుకుఁ జాలి యుండుటకు. తా.—వారు ఒకవేళ సంధికి రాక యుద్ధమునకే వచ్చినప్పటికిని మన మప్పు డేది యుక్తమో యట్లు చేయుటకు సిద్ధమై యుండ వలయును. అదియునుం గాక.

112. లేరుఱఁటపో = లేక పోదురు గాక. పెఱవారలన్ = ఇతర రాజులను. తగుభంగిన్ = తగినవిధమున. వశ్యులన్ = అధీనులను. చేయన్ = చేసికొనుటకు. భూరిబలయుతులము = గొప్ప సేనతోఁ గూడినవారలము. అనుమతంబు = ఇష్టము. తా.—ఒకవేళ పాండవులు లేక పోయినప్పటికిని మన కితరరాజులను వశ్యులుగాఁ జేసికొనుటకుఁ గూడ గొప్పసైన్యములే సాధనములు కావున సైన్యము లన్నియుఁ గూర్చుకొనుట మన కెంతయు యుక్తము.

113. తమతమ ఎఱుఁగు తెఱఁగులు = తమకు తమకు తెలిసినవిధములను. కురునందనుండు = దుర్యోధనుఁడు. కార్యంబు తెగువ = కార్యముయొక్క నిశ్చయమును. ఎలమిన్ = సంతోషముతో. తా.—ఇట్లు వారు వారు తమతమయభిప్రాయములను జెప్పఁగా దుర్యోధనుఁడు విని చక్కఁగా నాలోచించి చేయవలసినవిధమును నిశ్చయించి వారితో నిట్లు చెప్పెను.

114. సింహబలుఁడు = కీచకుఁడు. హలధరుఁడు = బలరాముఁడు. కలరు = కలవారు. ఉద్ధతులును = గర్వము గలవారును. బాహుయుద్ధపరులు = మల్లయుద్ధమునం దాసక్తి గలవారును. తా.—కీచకుఁడును భీముఁడును శల్యుఁడును బలరాముఁడును సమానమయిన బలము గలవారు. వీరు మల్లయుద్ధమునందు నేర్పు గలవారై యొకరి నొకరు జయింప నుత్సాహము గలిగి గర్వించి యుందురు.

క. ఈనలువుర భుజశక్తుల, తో నెనయఁగఁ జాలునట్టి ♦ దోర్బల మెందుం
గానము గావున వీరల, లోనన యొండొరుల కని గె♦లుపు సమకూరున్. 115

ఉ. తక్కినవార లాతనికి ♦ దవ్వులచోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలు♦నుద్ధతి మాన్చిన మాన్చువాఁ డతం
డక్కడ నిల్చెఁ గావలయు ♦ నాసతి ద్రౌపది గాఁగ నోపు వే
ఱొక్కరుఁ డాజిఁ గీచకుల ♦ నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే. 116

క. గంధర్వు లను నెపంబున, నంధతమసగూఢవృత్తి ♦ ననిలసుతుఁడు గ
ర్వాంధమతి యైనసూతు న, బాంధవముగఁ జంపెఁ గాక ♦ పరులకు వశమే. 117

వ. పితామహుం డుపదేశించినలక్షణంబు లద్దేశంబునం గలిగి యుండు నని వింటిమి పాండవులు ప్రచ్ఛన్నవేషులై విరటుప్రోల వసియించినవారు గావలయు నతం డును బ్రతిభటుండయి భంగించుచుండుం గావున నతనిపయి నెత్తిపోయి తదీయ గోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు

---

115. భుజశక్తులతోన్ = భుజబలములతో. ఎనయఁగన్ = సరిపోలుటకు. దోర్బలము = చేతులలావు. అనిన్ = యుద్ధమునందు. సమకూరున్ = కలుగును. తా.—ఈనలువురిబాహుబలముతో సమాన మయిన బాహుబల మెవ్వరికిని లేదు, కావున నీనలువురిలోనే యొకరినొకరు యుద్ధమున జయింపవలయును.

116. తక్కినవారలు — శల్యుఁడును బలరాముఁడును ననుట. ఆతనికిన్ = ఆ కీచకునికి. దవ్వులచోటులవారు = దూరదేశముల నుండువారు. వాయుజుండు = భీముఁడు. సింహబలుఉద్ధతిన్ = కీచకునిగర్వమును. ఆసతి = ఆ స్త్రీ. ఆజిన్ = యుద్ధమునందు. తా.—శల్యుఁడును బలరాముఁడును దూరమున నున్నవారు కావున భీముఁ డొక్కఁడే కీచకుని జయించినవాఁడై యుండవలయును. అందువలన భీముఁడు విరాటనగరంబున నున్నాఁడు, ఆ స్త్రీ ద్రౌపదియై యుండును. మఱియొకఁడు కీచకుల జంపఁ జాలఁ డని మీకుఁ దెలియును గదా!

117. అంధతమసగూఢవృత్తిన్ = చిమ్మచీఁకటియందు రహస్య మయినవిధమున. అనిలసుతుఁడు = భీముఁడు. గర్వఅంధమతి = గర్వముచే గ్రుడ్డియైన బుద్ధి గలవాఁడు. ఐనసూతున్ = అయిన కీచకుని. సబాంధవముగన్ = తమ్ములతోఁ గూడినట్లుగా. పరులకున్ = ఇతరులకు. తా.—గంధర్వు లను పేరుపెట్టుకొని చీఁకటిలో నెవరికిని దెలియనియట్లు భీముఁడు కీచకుని వానితమ్ములను జంపి యుండవలయును. కాని యితరులకు శక్యము కాదు.

118. పితామహుండు = భీష్ముఁడు. ఉపదేశించిన లక్షణంబులున్ = చెప్పిన గుఱుతులును. ప్రచ్ఛన్నవేషులుఐ = మాఱువేషము గలవారై. విరటుప్రోలన్ = విరాటునిపట్టణమునందు. అతండును = అవిరాటుఁడును. ప్రతిభటుండుఐ = విరోధియై. భంగించుచున్ = అవమానపఱచుచు. ఎత్తి = దండెత్తి. తదీయగోధనంబులన్ = వానివైన గోవులు అను ధనములను. గ్రహించినన్ = పట్టినయెడ. పఱతెంతురు = వత్తురు. సమయభంగంబు = అజ్ఞాతవాసము చెఱుటను. పుత్తెము =

రయ్యవసరంబున మనము సమయభంగంబు సెప్పి వారలం గ్రమ్మఱం బండ్రెండు వత్సరంబులు వనవాసంబు సలుపం బుత్తెమ ట్లైన నప్రతిహతంబుగాఁ జతురంతభూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదుము కుంతీనందను లందు లేక తక్కిన మత్స్యపతిసమస్తవస్తువులును జూఱగొంద మదియును లాభంబ యెల్లభంగుల నిప్పటి కిది యె కార్యంబు మీకు నందఱకుం జూడఁ బోలునేని దీని కనురూపం బగునుద్యోగంబు సేయుం డనినఁ ద్రిగర్తాధీశ్వరుం డగుసుశర్మ, దొలుతఁ గర్ణదుశ్శాసనులతోఁ గొంచొక ప్రసంగించి వారలయనుమతి నవనిపతితో ని ట్లనియె.

క. కేకయసాల్వులు దోడుగ, నాకీచకుఁ డాజి నన్ను ♦ నపజితుఁ జేసెం
జా కుండ మున్న యొకపరి, నా కాతనితోడ భండ♦నము లే దయ్యెన్. 119

ఉ. భంగముతోడ నున్ననను ♦ బంపు విరాటునిమీఁద భూమికిం
జెంగట నుండు నా దయిన♦జీతపుటాళ్లు సంతతంబు వా
నిం గడు గాసిసేయు నత♦నిం జెఱుపం దఱి యయ్యె ముట్టి స
ప్తాంగముఁ జూఱవెచ్చెద న♦హంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. 120

---

పంపుము. అప్రతిహతంబుగాన్ = అడ్డు లేనియట్లుగా. చతురంతభూచక్రంబు = నాలుగుమూలలు గల భూమండలమును. కీర్తనీయులమై = పొగడఁదగినవారమై. లేకతక్కినన్ = లేనియెడల. మత్స్యపతిసమస్తవస్తువులును = విరాటునియెల్లపదార్థములను. చూఱగొందము = కొల్లగా గ్రహింతము. ఎల్లభంగులన్ = అన్నివిధములచేత. చూడన్ = ఆలోచించుటకు. పోలున్ ఏనిన్ = తగిన యెడ. అనురూపంబు = తగినది. ఉద్యోగంబు = ప్రయత్నమును. త్రిగర్తఅధీశ్వరుండు = త్రిగర్తదేశమునకు రాజు. తొలుతన్ = మొదట. కొంచొక = కొంచెము. ప్రసంగించి = మాటాడి. అనుమతిన్ = అంగీకారముచేత. అవనిపతితోన్ = రాజయిన దుర్యోధనునితో.

119. కేకయసాల్వులు = కేకయరాజును సాల్వరాజును. తోడుకన్ = సహాయులు కాఁగా. ఆజిన్ = యుద్ధమునందు. అపజితున్ = ఓడఁగొట్టఁబడినవానినిగా. చాకఉండన్ మున్నఅ = ఆకీచకుఁడు చావకమునుపే. భండనము = యుద్ధము. తా.—కీచకుఁడు కేకయసాల్వరాజులతోఁ గూడి నన్నోడించెను, అతఁడు బ్రదికియుండునపుడు మరల నొకమారు వానితో యుద్ధము నాకుఁ గలుగ లేదు.

120. భంగముతోడన్ = అవమానముతో. విరాటునిమీఁదన్. పంపుము అని యన్వయము. భూమికిన్ = విరాటరాజుభూమికి. చెంగటన్ = సమీపమునందు. ఉండున్. సంతతంబున్ = ఎల్లప్పుడును. వానిన్ = ఆయూళ్లను. కడున్ = మిక్కిలి. గాసిచేయున్ = కష్టపెట్టును. అతనిన్ = ఆవిరాటుని. తఱి = సమయము. ముట్టి = ముట్టడించి. వానిసప్తాంగమున్ = ఆవిరాటుని యేడంగములను, స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము, ఇవి యేడురాజ్యాంగములు. చూఱ = కొల్ల. అహంకృతి = అహంకారము. తా.—అవమానము నొంది

గీ. ఉద్దవిడిన పసుల ♦ నూఁచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి ♦ యడ్డపడిన
చోటఁ బాండురాజ♦సూనుల నరయుదు, నెల్లభంగి దీని ♦ కేన తగుదు. 121

వ. అనవుడుఁ గర్ణుం డిట్లనియె. 122

క. బరవసమునఁ ద్రిగర్తే, శ్వరుఁ డిట్లను టుచిత మింక ♦ జననాయకుఁ డె
వ్వరుసున నానతి యిచ్చెను, దొర లే మని రట్ల చేయఁ ♦ దుదిఁ గార్య మగున్.

చ. అనునినసూనుమాట విని ♦ యందఱఁ గన్గొని పెద్ద లెల్ల ని
న్ననుమతి సేయ సైన్యముల ♦ నన్నిటిఁ బన్నఁగఁ బంపు రెండుమై
ల నడత మిత్రిగర్తులబ♦లంబుల ముందటఁ బంచి వానిపో
యినమఱునాఁడు పోద మని♦యెం గురునాథుఁడు దుస్ససేనుతోన్. 124

చ. అనుటయు ఫాలభాగకలి♦తాంజలి యై యతఁ డట్ల చేయువాఁ
డ ననిన మేదినీశుఁడు దృ♦ఢం బగునిశ్చయ మెల్లవారుఁ గై

యున్న నన్ను విరాటునిమీఁదికిఁ బంపుము, వానిదేశమునకు సమీపమున నేను నౌకరులకు జీతముగా నిచ్చినగ్రామములు గలవు, అతఁ డెప్పుడును అచటివారిని శ్రమపఱచుచుండును. ఇది సమయము కావున నేను పోయి విరాటుని పొగ రడంచి వానిరాజ్యమును గొల్లపెట్టెదను.

121. ఉద్దవిడిన్ = మిక్కిలి పరాక్రమముచేతనే. ఊఁచముట్టుగన్ = నిశ్శేషముగా. అడ్డపడినచోటన్ = అడ్డపడినపక్షమున. అరయుదున్ = తెలిసికొందును. తా.—పరాక్రమముచే విరాటుని పశువుల నంతయుఁ దెచ్చెదను. అతఁడు వెంట వచ్చి యడ్డపడినపుడు పాండవులం గనిపట్టెదను, అన్నివిధముల నీపనికి నేనే తగుదును.

123. బరవసమునన్ = ధైర్యముచేత. త్రిగర్తేశ్వరుఁడు = సుశర్మ. జననాయకుఁడు = దుర్యోధనుఁడు. ఎవ్వరుసునన్ = ఏవిధమున. ఆనతియిచ్చెను = ఆజ్ఞాపించెనో. దొరలు = తక్కిన రాజులు. చేయన్ = చేయుట. తుదిన్ = కడపట. తా.—సుశర్మ ధైర్యముతోఁ జెప్పినమాట యుక్తముగా నున్నది. ఇఁక దుర్యోధనుఁ డెట్లాజ్ఞాపించునో భీష్మాదు లెట్లు చెప్పుదురో యట్లే కార్యము జరుపవలయును.

124. అను ఇనసూనుమాట = అనునట్టి కర్ణునిపలుకును. అనుమతిచేయన్ = అనుజ్ఞ చేయఁగా. పన్నఁగన్ = సిద్ధము చేయుటకు. రెండుమైలన్ = రెండుతెగలుగా. వాని = ఆసుశర్మసేనలయొక్క. కురునాథుఁడు = దుర్యోధనుఁడు. దుస్ససేనుతోన్ = దుశ్శాసనునితో. తా.—కర్ణునిమాట విని దుర్యోధనుఁడు దుశ్శాసనునిం జూచి నీవు పెద్దల యనుమతిచొప్పున సైన్యమును సిద్ధము చేయుము. రెండుతెగలుగాఁ బోవుదము. మొదట సుశర్మసేనలను బోనిచ్చి మఱునాఁడు మనము పోవుదము.

125. ఫాలభాగకలితఅంజలియై = నొసటిప్రదేశమునందుఁ జేర్పఁబడిన చేమోడ్పు గలవాఁడై. అతఁడు = ఆదుశ్శాసనుఁడు. మేదినీఈశుఁడు = రాజయిన దుర్యోధనుఁడు. కైకొనుటకున్ = అంగీకరించుటకును. కార్యబోధమునకున్ = కార్యము తెలియుటకును. చుట్టలన్ = బంధువులను. ఉన్నవారలన్ = తక్కినవారిని. ఆదరఅధికసగౌరవభావనతోడన్ = ఆదరముచే నధిక మయినదియు

కొనుటకుఁ గార్యబోధమునకుం దగఁ జుట్టల నున్నవారలం
గనుఁగొని యాదరాధికసగౌరవ భావనతోడ నిట్లనున్. 125

ఉ. మున్ను సుశర్మ దాను బలముం గొని గోవులఁ బట్టఁ బట్టినన్
వెన్నడిఁ వచ్చు మత్స్యపృథివీపతి సేనల నెల్లఁ గొంచు శౌ
ర్యోన్నతి చూపువాఁడయి సముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
గొన్నిటిఁ బట్టఁ గయ్యమునకుం జఱతెంతురు పాండునందనుల్. 126

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారు మీ
రందఱు వేఱ యొక్కయెడ నాజికి సేనల గూర్పఁ డెల్లవాఁ
డుం దనవారిఁ దోకొని కడున్ రభసంబునఁ గూడి వార్తకున్
ముందుగఁ బోయి గోధనము ముట్టికొనన్ వలయున్ మహోగ్రతన్. 127

వ. అని చెప్పి వెండియు సుశర్మం జూచి. 128

క. బహుళాష్టమి నీతఁడు స, న్నాహనముతోఁ బసులఁ బట్టు నవమిని మనగో
గ్రహణ మని నిశ్చయించిన, నహితకేతను పలుకులకు మహాహ్లాదమునన్. 129

---

గౌరవముతోఁ గూడినదియు నగు మన్ననతో. తా.—అందుకు దుశ్శాసనుఁడు చేమోడ్చి గీలించి యట్లే చేయుదు నని చెప్పఁగా దుర్యోధనుఁడు తననిశ్చయమును అందఱు నంగీకరించుటకును అందఱికిని కార్యము బోధపడుటకును బంధువులను తక్కినవారలం జూచి యాదరగౌరవములతో నిట్లనెను.

126. పట్టినన్ = పట్టఁగా. మత్స్యపృథివీపతి = విరాటరాజు. శౌర్యోన్నతి = పరాక్రమముయొక్క యతిశయమును. సముద్ధతిమైన్ = గర్వముతో. వెన్నడిన్ = వెంటనే. ఇటన్ = ఈవైపున. వేఱఁగ = వేఱుగానే. కయ్యమునకున్ = యుద్ధమునకు. పాండునందనుల్. పఱతెంతురు = వత్తురు. తా.—ముందుగా సుశర్మ సేనలతోఁ బోయి గోవులను బట్టఁగా విరాటుఁడు తన సేనలం దీసికొని శౌర్యముం జూపుటకై వానిమీఁదికి వచ్చును. మఱియొక వైపునఁ గౌరవులు గోవుల మఱికొన్నిటిని బట్టఁగాఁ బాండవులు యుద్ధమునకు వత్తురు.

127. కందువ = సంకేతస్థలమును. ఒక్కఎడన్ = ఒకచోట. త్రిగర్తులు = సుశర్మ మొదలగువారు. దాడికిన్ = యుద్ధయాత్రకు. కూడువారు = చేరవలయును. ఆజికిన్ = యుద్ధమునకు. ఎల్లవాఁడున్ = ఒక్కొక్కఁడును. తోకొని = వెంటఁబెట్టుకొని. రభసంబునన్ = వేగముతో. వార్తకున్ ముందుగన్ = మాటకు ముందఱనే. మహత్ ఉగ్రతన్ = మిక్కిలి భయంకరత్వముచేత. తా.—సుశర్మ సేనలు ఒకచోట చేరవలయును, మీరందఱు మఱియొకచోట సేనలఁ జేర్పుఁడు. ఒక్కొక్కఁడును దనసేనలం దీసికొని శీఘ్రముగాఁ బోయి గోవులఁ బట్టవలయును.

129. సన్నాహనముతోన్ = ప్రయత్నముతో. మనగోగ్రహణము = మనము గోవులపట్టుట. అహితకేతను పలుకులకున్ = దుర్యోధనుని మాటలకు. మహత్ ఆహ్లాదమునన్ = గొప్పసంతోషముతో. తా.—సుశర్మ కృష్ణపక్షమునందలి యష్టమినాఁడు పోయి గోవులఁ బట్టును, మనము నవమినాఁడు గోవులఁ బట్టవలయు నని దుర్యోధనుఁడు నిశ్చయింపఁగా వానిమాటలకు మిక్కిలి సంతోషించి.

వ. సమస్తపరిజనంబులును సముద్యుక్తులై రట్టిసమయంబున. 130

గీ. పాండురాజసుతులుఁ బాంచాలియును దమ్ము, నొరు లెఱుంగకుండఁ దిరుగవలయు
దుష్కరంపు టేఁడు దుది సేరఁ బాఱె నె, వ్వరును దీనిఁ దలఁచు వారు లేర. 131

(సుశర్మ దక్షిణగోగ్రహణంబు సేయుట.)

వ. సుశర్మయు నేలినవానిపనిఁ బూని జోడు పక్కెర కైదువు బిరుదు రవణంబు మొదలైనసవరణంబులం జూడ సక్కఁజంబుగాఁ గూడి పరదేశం బాపోశనంబు గొనం దమకించుతనబలంబులగజిబిజి యుడిపికొని గోగణంబులయగపా టూహించి జతనంబున నడచుచుండియు వెస గుందక వేగిరంపుఁబయనంబు లయ్యును బ్రజల నోలాకుపడ నీక యెత్తెడుచోట్లను విడిదలలయందును లోనుగా నిస్సాణాదు లైన యుద్భటచిహ్నంబులు ప్రకటింపక దాడిమెయిం జని వేగులవారివలన విరటు తొట్టు లున్నయెడ యెఱింగి గ్రద్దనం గదుపులఁ గార్చిచ్చుచందంబునం బొదివి వెలిచిన. 132

శా. కూడంబాఱి సముద్ధతిం గడఁగి త, ద్గోపాలకుల్ మూఁక ల
ల్లాడం దాఁకి నిశాతసాయకపటు, వ్యాపారఘోరంబుగా

130. సముద్యుక్తులు = ప్రయత్నము గలవారు.

131. పాంచాలియును = ద్రౌపదియు. దుష్కరంపు ఏఁడు తుది = కష్టమయిన సంవత్సరము యొక్క ముగింపు. చేరఁబాఱెన్ = చేరెను. పాఠాం:—తలఁపవలను లేర = తలఁచుటకు నేర్పు లేనివారలే అయిరి యని యర్థము. తా.—పాండవులును, ద్రౌపదియును అజ్ఞాతవాసము చేయవలసిన సంవత్సరము నిండెను, అప్పుడు దుర్యోధనునిసభయందు దీని నాలోచించువారు ఎవ్వరును లేకపోయిరి.

132. జోడు = కవచము. పక్కెర = గుఱ్ఱములయంగీ. కైదువు = ఆయుధము. రవణంబు = అలంకారము. సవరణంబులన్ = పరికరములను. ఆపోశనంబు = నీరు త్రాగుటగా. తమకించు తనబలంబుల గజిబిజి = ప్రయత్నించునట్టి తన సేనలయొక్క సందడిని. ఉడిపికొని = అడంచికొని. గోగణంబుల అగపాటు = గోవులమందలు స్వాధీనమగుటను. జతనంబునన్ = ఉపాయముతో. వెస = వేగము. గుందక = తగ్గక. ఓలాకుపడన్ ఈక = శ్రమపడనీయక. ఎత్తెడుచోట్లను = బయలు దేఱుచోట్లయందును. విడిదలలయందును = విడియుచోట్లయందు. నిస్సాణఆదులు = నగారాలు మొదలుగాఁగలవి. ఉద్భటచిహ్నంబులు = గొప్పగుఱుతులను. ప్రకటింపక = వెల్లడి చేయక. దాడిమెయిన్ = యాత్రయుద్ధవిధమున. తొట్టులు = పశువులు. గ్రద్దనన్ = తటాలున. కదుపులన్ = ఆవులను. పొదివి = ముట్టడించి.

133. కూడంబాఱి = చేరి. సముద్ధతిన్ = గర్వముచేత. తత్ గోపాలకుల్ = ఆయావుల కావలివారు. మూఁకలు = సేనలు. నిశాతసాయకపటువ్యాపారఘోరంబుగాన్ = వాఁడియయిన బాణముయొక్క సమగ్రమయిన వ్యాపారముచే భయంకర మయినట్లుగా. ఈడంబోక = వెనుదియ్యక.

నీడంబోక పెనంగినం గని త్రిగ♦ర్తేశుండు చేపెచ్చుఁడుం
గ్రీడాఘాతనిరూఢి నాశ్వికులు వా♦రిం దున్మి తూఁటాడినన్. 133

వ. వారలలోన. 134

చ. అసదుగఁ గాఁకి మేనఁ దఱ♦చై పొరి నెత్తురు గ్రమ్ముపోటులన్
వస మఱి తూలు చుండియును ♦ వారనిభీతిఁ బదంబులం గడున్
వెస కలిమిం బురంబునకు ♦ వేగమె కొండఱు వాఱి మత్స్యనా
థుసభకు నేగి దీనదశ♦తోఁ బ్రణమిల్లుచు నార్తమూర్తులై. 135

క. కారణ మెయ్యది యగునొకొ, వీరలదురవస్థ కనుచు ♦ వెఱఁ గందెడునా
భూరమణుఁడు సభయును విన, నీరెలుఁగు దలంకఁ బల్కి ♦ రిట్లని గోపుల్. 136

చ. హయరథదంతిసంతతిని♦రంతరదుర్దమలీలఁ జేర్చి నే
ల యవిసి మ్రోఁగినట్లగుబ♦లంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్

---

పెనఁగినన్ = పోరఁగా. త్రిగర్తేశుండు = సుశర్మ. క్రీడాఘాతనిరూఢిన్ = విలాసరూపమయిన కొట్టుటయొక్క నిశ్చయముచేత. అశ్వికులు = గుఱ్ఱపురౌతులు. వారిన్ = ఆగొల్లలను. తున్మి తూఁటాడినన్ = మిక్కిలి ఖండింపఁగా. తా.—అంత నాయావులకాపరివారు అందఱుం గూడి సుశర్మసైన్యములు భయపడునట్లు బాణములు ప్రయోగించి యుద్ధము చేయఁగా సుశర్మ చూచి పురికొల్పఁగా నాతనిగుఱ్ఱపురౌతులు గోపాలకులమీఁదఁ బడి యనాయాసముగా వారిం దునిమిరి.

135. అసదుగన్ = తక్కువగా. మేనన్ = దేహమునందు. తఱచువై = అధికమై. పొరిన్ = క్రమముగా. క్రమ్ముపోటులన్ = కొలునట్టి గాయములచేత. వసముఅఱి = వశము తప్పి. తూలుచున్ = చలించుచు. వారనిభీతిన్ = విడువని భయముచేత. పదంబులన్ = పాదములయందు. కడున్ = మిక్కిలి. వెస = వేగము. దీనదశతోన్ = దుఃఖము గల యవస్థతో. ప్రణమిల్లుచున్ = మ్రొక్కుచు. ఆర్తమూర్తులువై = దుఃఖముగల యాకారము గలవారై. తా.—చేతఁ గాని యుద్ధము చేసి దేహమంతయు నెత్తురు గ్రమ్మఁగా దెబ్బలు తిని భయముచేఁ దిక్కుబలము గలవారై కొందఱు గొల్లలు పట్టణమునకుఁ బోయి విరాటుని సభం జేరి దుఃఖము గలవారై నమస్కరించి.

136. వీరలదురవస్థకున్ = ఈగొల్లల కష్టదశకు. వెఱఁగు = ఆశ్చర్యమును. అందెడు ఆభూరమణుఁడున్ = పొందుచున్న యావిరాటరాజును. సభయును = సభయం దున్నవారును. ఈరెలుఁగు = హీనస్వరము. తలంకన్ = చలింపఁగా. గోపుల్ = గొల్లలు. ఇట్లు. అని. పల్కిరి అని యన్వయము. తా.—గొల్ల లిట్లు దుఃఖము నొందుటకుఁ గారణము తెలియక విరాటుఁడును సభవారును ఆశ్చర్యపడుచుండఁగా ఆగొల్ల లిట్లు చెప్పిరి.

137. హయ.....లీలన్—హయ = గుఱ్ఱములయొక్కయు, రథ = తేరులయొక్కయు, దంతి = ఏనుఁగులయొక్కయు, సంతతి = సమూహముచేతఁ గలిగిన, నిరంతర = ఎడతెగని, దుర్దమ = అణఁపరాని, లీలన్ = విలాసముచేత. పేర్చి = అతిశయించి. నేల = భూమి. అవిసి = పగిలి. మ్రోఁగినట్లు = చేసినట్లు. అగుబలంబులతోడన్ = అయిన సేనలతో. త్రిగర్తులు = సుశర్మ మొదలగువారు. రథు

రయమున గోవులం బొదివి ♦ రక్షకు లొక్కట నార్చి తాఁకినన్
భయదమహాస్త్రశస్త్రపటు♦పాతపరంపరఁ దున్మి యుద్ధతిన్. 137

క. గోవులకు వెనుక నై యే వెనఁ, బోవుచు నున్నారు గడవఁ ♦ బోవక యుండం
బో వలయు నడ్డపడియెడు, దీవస మెడఁ గలిగెనేని ♦ దేవర కడఁకన్. 138

వ. అనిన విని విరాటుం డదరిపడి. 139

శా. ఏమీ నిక్కమె మున్ను ఱంగఁడె త్రిగ♦ర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు ను♦ద్యోగించెనే మేలు మే
లామైతోడనె పోవుఁ గాక యని వీ♦రాలాపముల్ వల్కి యు
ద్దామక్రోధశిఖాకలాపవికటో♦ద్యద్భ్రూకుటీస్ఫూర్తియై. 140

( విరటుఁడు సుశర్మమీఁదికిఁ యుద్ధము సేయఁ బోవుట. )

---

మునన్ = వేగముచేత. పొదివి = ముట్టడించి. రక్షకులు = కావలివారు. ఒక్కటన్ = ఒకటిగా. భయద.....పరంపరన్—భయద = భయమును గలిగించునట్టి, మహత్ = గొప్పదైన, అస్త్రశస్త్ర = అస్త్రములయొక్కయు ఆయుధములయొక్కయు, పటు = దృఢము లయిన, పాత = వేయుటలయొక్క, పరంపరన్ = వరుసచేత. తున్మి = ఖండించి. ఉద్ధతిన్ = గర్వముచేత. తా.—త్రిగర్తదేశపురాజులు నేలఁబడ్డలై యచటినుండి లేచెనో యనునట్లు లెక్కకు మిక్కిలియగు చతురంగ సైన్యముతో వచ్చి యావు లను బట్టుకొని కావలివా రడ్డపడఁగా వారిని అస్త్రశస్త్రములచే నొప్పించి గర్వము గలవారై.

138. కడవన్ పోవక ఉండన్ = దాఁటిపోవక మునుపే. అడ్డపడియెడుదీవసము = అడ్డగించునట్టి ధైర్యము. ఎడన్ = మనస్సునందు. దేవర = ఏలినవాఁడు, విరాటుఁ డనుట. కడఁకన్ = పూని కతో. పోవలయున్ అని యన్వయము. తా.—ఆవులను దోలుకొని పోవుచున్నారు, వారి నడ్డగించు ధైర్య మున్నయెడ వారు దూరము పోవక మునుపే మీరు పోయి యడ్డపడవలయును.

140. ఏమీ — ఆశ్చర్యార్థకము. నిక్కముఎ = నిజమా ? త్రిగర్తఈశుండు = సుశర్మ. మత్ గోధనస్తోమంబున్ = నాగోధనముయొక్క సమూహమును. కొనిపోవు తెంపునకున్ = అపహరించు సాహసమునకు. ఉద్యోగించెనుఎ = పూనినాఁడా ! ఆమైతోడన్ఎ = అవిధముతోడనే. వీరాలాప ముల్ = బింకపుమాటలను. ఉద్దామ......స్ఫూర్తియై—ఉద్దామ = గొప్పదైన, క్రోధ = కోప మను నగ్నియొక్క, శిఖా = మంటలయొక్క, కలాప = సమూహమువలె, వికట = భయంకర మయిన, ఉద్యత్ = పుట్టుచున్న, భ్రూకుటి = బొమముడియొక్క, స్ఫూర్తియై = ప్రకాశము గలవాఁడై. తా.—నిజముగా సుశర్మ యిట్లు చేసినాఁడా ? మున్ను వచ్చి పరాజయము నొంది పోవు టను మఱచి యిపుడు మరల మాగోవుల నపహరించుటకుఁ దెగించినాఁడా ? మంచిది మునుపటివలెనే యోటుపడి పోవును గాక యని బిరుదుమాటలు చెప్పి మిక్కిలి కోపము గలవాఁడై. చతుర్థపాదము నందుఁ గ్రోధమునం దగ్నిత్వారోపము గమ్యము, ఈరూపకమునకును భ్రూకుటియందు శిఖాకలాప త్వోత్ప్రేక్షకును అంగాంగిభావంబునం జేసి సంకరము.

చ. సచివులఁ జూచి యిప్పుడ వె♦సన్ మన మేఁగక తక్కినం బశు
ప్రచయము దప్పి పోవుఁ దుది ♦ భంగము సేఁగియు వచ్చుఁ గాన మీ
రుచితవిధానసత్వరత ♦ నుద్ధతయోధసమగ్రవాహినీ
ప్రచలితభూమిభాగము గఁ ♦ బన్నుగఁ బంపుఁడు దండనాథులన్. 141

వ. అని నియోగించి. 142

శా. యానప్రక్రమసూచకంబు లగుతూ♦ర్యంబుల్ దిశాపాటన
ధ్వానస్వైరవిహారకల్పితసము♦ద్రక్షోభముల్ గా ధరి
త్రీనాథుండు రణోచితోద్యమము సం♦ధిల్లంగ శస్త్రాస్త్రవ
ర్మానీతిక్రమదక్షులం బనిచె న♦య్యైవారికిం గ్రక్కునన్. 143

ఉ. సారథిఁ జూచి నీవు రథ♦సంబునఁ బూన్పుము ఘోటకంబులం
దేరఁ దదీయవర్మము ల♦తిస్ఫుట బంధముగాఁగఁ బెట్టు నీ

---

141. సచివులన్ = మంత్రులను. తక్కినన్ = తప్పినయెడ. పశుప్రచయము = ఆవుల సమూహము. తుదిన్ = కడపట. భంగమున్ = అవమానమును. సేగియున్ = నష్టమును. ఉచితవిధానసత్వరతన్ = తగినదాని చేయుటయందు త్వర గలిగినవారగుటచేత. ఉద్ధత......భాగముగన్—ఉద్ధత = గర్వించిన, యోధ = భటులచేత, సమగ్ర = నిండిన, వాహినీ = సేనచేత, ప్రచలిత = అదరిన, భూమిభాగముగన్ = భూప్రదేశము కలుగునట్లుగా. దండనాథులన్ = సేనానాయకులను. పన్నుగన్ = యుద్ధమునకు సిద్ధపఱచుటకు. పంపుఁడు = ఆజ్ఞాపింపుఁడు. తా.—మంత్రులను జూచి యిప్పుడే మనము పోకపోయినయెడ పశువులు తప్పిపోయి యవమానమును నష్టమును వచ్చును గావున మీరు శీఘ్రముగా సేనానాయకులను సర్వసేనలతో యుద్ధమునకు సిద్ధపడునట్లాజ్ఞాపింపుఁడు.

143. యానప్రక్రమసూచకంబులు=ప్రయాణముయొక్క యారంభమును దెలుపునవి. తూర్యంబుల్ = వాద్యములు. దిశా......క్షోభముల్—దిశా = దిక్కులయొక్క, పాటన = పగల్చునట్టి, ధ్వాన = ధ్వనియొక్క, స్వైర = నిరంకుశ మయిన, విహార = వ్యాప్తిచేత, కల్పిత = కలిగింపఁబడిన, సముద్ర = సముద్రములయొక్క, క్షోభముల్ = కలఁతలు గలవి. కాన్ = కాఁగా. ధరిత్రీనాథుండు = విరాటరాజు. రణఉచితఉద్యమము= యుద్ధమునకుఁ దగినప్రయత్నము. సంధిల్లంగన్ = కలుగునట్లు. శస్త్రఅస్త్రవర్మఆనీతిక్రమదక్షులన్ = ఆయుధములయు అస్త్రములయుఁ గవచములయుఁ దెచ్చుటయొక్క విధమునందు సమర్థులయినవారిని. అయ్యైవారికిన్ = వారివారికి. గ్రక్కునన్ = శీఘ్రముగా. పనిచెన్ = ఆజ్ఞాపించెను. తా.—అంతఁ బ్రయాణారంభము తెలుపు వాద్యధ్వనులు దిక్కులన్నియు వ్యాపించి సముద్రములనుగూడఁ గలఁగింపఁగా విరాటుఁడు యుద్ధోత్సాహముతో వీరు లగువారివారికి శస్త్రములు అస్త్రములు కవచములు తెచ్చి యిచ్చుటకు ఆయాపనివాండ్ర కాజ్ఞాపించెను. శస్త్రము లనఁగాఁ జేతఁబట్టుకొని కొట్టునట్టి ఖడ్గము మొదలగునవి. అస్త్రము లనఁగా దూరమునకుఁ బ్రయోగించునట్టి బాణములు మొదలగునవి.

144. సారథిన్ = తేరు తోలువానిని. రభసంబునన్ = వేగముగా. తేరన్ = రథమునందు. ఘోటకంబులన్ = గుఱ్ఱములను. పూన్పుము = కట్టుము. తదీయవర్మములు = ఆగుఱ్ఱ

వీరవచోవిలాసములు ♦ విందుము మున్నిదె వచ్చెఁ గయ్య మే
పారఁగఁ జూపు నీ దగున♦హంకృతికిం దగుధైర్య మియ్యెడన్. 144

వ. అని పనిచి తానును యోధవీరోచితప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసి కొని ఖచితకాంచనబిందుసందోహం బగుసన్నాహంబు దొట్టికొని విరచితాలంకార చక్రంబును బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును బ్రకల్పితతురంగం బును సన్నివేశితవివిధాయుధంబును సన్నద్ధసారథికంబును నైనరథం బెక్కి గోగ్రహణప్రదేశంబు పశుపాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మత్స్యపతి యనుజన్ముండు. 145

శా. లోకస్తుత్యవిభూతి నన్యపృతనా♦లుంటాకబాహాబల
శ్రీ కల్మిన్ రథదంతిఘోటకభట♦శ్రేణీసముద్దాంతసే

---

ములవైన కవచములను. అతిస్ఫుటబంధముకాఁగన్ = మిక్కిలి స్పష్ట మయినకట్లు కలుగునట్లుగా. నీవీరవచోవిలాసములు= నీయొక్క వీరవాక్యముల యతిశయములను. మున్ను. విందుము. కయ్యము= యుద్ధము. నీది అగు అహంకృతికిన్ = నీదైన యహంకారమునకు. తగుధైర్యము. ఇయ్యెడన్ = ఈసమయమునందు. ఏపుఆరఁగన్ = అతిశయించునట్లు. చూపు అని యన్వయము. తా.—సారథిని చూచి నీవు శీఘ్రముగాఁ దేరునకు గుఱ్ఱములం గట్టి వానికిఁ గవచములు చక్కఁగాఁ దొడుగుము. నీవు మున్ను వీరాలాపము లాడుచుండువాఁడవు, ఇపుడు యుద్ధము వచ్చినది కావున నీగర్వమునకుఁ దగినట్లు ధైర్యము చూపుము.

145. పనిచి = ఆజ్ఞాపించి. వీరయోధఉచితప్రకారంబునన్ = వీరభటులకుఁ దగిన విధమున. ఖచితకాంచనబిందుసందోహంబు = చెక్కఁబడిన బంగారుబొట్లసమూహము గలది. అగు సన్నాహంబు = అయిన కవచమును. విరచితఅలంకారచక్రంబును = చేయఁబడిన యలంకారములు గల చక్రములు గలదియును. బద్ధపరికరకూబరఅక్షయుగఆదిఅవయవంబును = కట్టఁబడిన కొలముట్లును నొగయును బండికన్ను కాఁడి మొదలుగాఁగల యవయవములు గలదియును. ప్రకల్పితతురంగంబును= కట్టఁబడిన గుఱ్ఱములు గలదియును. సన్నివేశితవివిధఆయుధంబును= ఉంపఁబడిన నానావిధము లయిన యాయుధములు గలదియును. సన్నద్ధసారథికంబును = ఆయిత్తమైన సారథి గలదియును. గోగ్రహణప్రదేశంబు = ఆవులమందల గొనిపోయిన చోటును. అనుజన్ముండు = తమ్ముఁడు.

146. లోకస్తుత్యవిభూతిన్ = జనులచేఁ బొగడఁదగిన సంపదచేతను. అన్య......శ్రీ— అన్య = శత్రువులయొక్క, పృతనా = సేనలయొక్క, లుంటాక = అపహరించునట్టి, బాహాబల= భుజబలముయొక్క, శ్రీ = సంపద. కల్మిన్ = కలుగుటచేతను. రథ......విభ్రమంబునన్— రథ = తేరులయొక్కయు, దంతి = ఏనుఁగులయొక్కయు, ఘోటక =గుఱ్ఱములయొక్కయు, భట= కాల్బలములయొక్కయు, శ్రేణీ = సమూహముల చేత, సముద్దాంత = మిక్కిలి గొప్పదైన, సేనా= సేనలకు, ఆకల్ప = అలంకారము లయిన, ధ్వజ = టెక్కెములయొక్క, విభ్రమంబునన్ = విలాసముచేతను. సుహృద్యప్రోద్యమండువై = మిక్కిలి మనోహర మయిన ప్రోత్సాహము గలవాఁడై.

నాకల్పధ్వజవిభ్రమంబున సుహృ♦ద్వ్యగ్రోద్యముండై శతా
నీకుం డుద్ధతి నేఁగుదెంచె నఖిలా♦నీకంబు లుప్పొంగఁగన్. 146

ఉ. ఆతనితమ్ముఁ డైనమది♦రాక్షుఁడు కర్ణఝుళంఝుళాసము
ద్ధూతబలోత్థరేణుపరి♦ధూసరితాంబర మైనవారణ
వ్రాతము గొల్చి రాఁ గడఁగి ♦ వచ్చె సముజ్జ్వలహేమవర్మని
ర్యాతరుచిచ్ఛటాపటల♦రంజితహేతిమహోగ్రసైన్యుఁడై. 147

గీ. అతనియనుజుండు సూర్యద♦త్తాహ్వయుండు, సమదసైనికనానాస్త్ర♦శస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహత♦దినకరాంశు, రాజియై చనుదెంచె సం♦రంభ మెసఁగ. 148

ఉ. తెల్లనిజోడు వెట్టుకొని ♦ తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు ♦ వైరిమదాపహవిక్రమప్రకా

---

శతానీకుండు. అఖిలఅనీకంబులు = ఎల్లసేనలు. ఉప్పొంగఁగన్. ఉద్ధతిన్ = గర్వముతో. ఏగుదెంచెన్ = వచ్చెను. తా.—శతానీకుఁడు గొప్పసంపదతోను పరాక్రమముతోను అలంకారమునకై టెక్కెములు గట్టిన చతురంగబలంబులతోను ఎక్కుడు ప్రోత్సాహము గలవాఁడై యెల్లసైన్యంబులు సంతోషించునట్లు బయలు వెడలెను.

147. కర్ణ.....అంబరము—కర్ణ = చెవులయొక్క, ఝుళంఝుళా = కొట్టుకొనుటచేత, సముద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, బల = సేననుండి, ఉత్థ = లేచిన, రేణు = దుమ్ముచేత, పరిధూసరిత = బూడిదవర్ణము గలదిగాఁ జేయఁబడిన, అంబరము = ఆకాశము గలది. వారణవ్రాతము = ఏనుఁగులసమూహము. సముజ్జ్వల.....సైన్యుఁడువై—సముజ్జ్వల = ప్రకాశించుచున్న, హేమవర్మ = బంగారుకవచమునుండి, నిర్యాత = వెడలిన, రుచి = కాంతులయొక్క, ఛటా = పరంపరయనెడు, పటల = కప్పుచేత, రంజిత = ప్రకాశింపఁజేయఁబడినవియు, హేతి = ఆయుధములచే, మహాత్ = మిక్కిలి, ఉగ్ర = భయంకరములు నగు, సైన్యుఁడై = సేనలు గలవాఁడై. కడఁగి. వచ్చెన్ అని యన్వయము. తా.—శతానీకునితమ్ముఁ డైనమదిరాక్షుఁడు తమచెవులఁ గదలించుగాలికి లేచినదుమ్ముచే నాకాశముఁ గప్పుచున్న యేనుఁగుదండుతోఁ గూడినవాఁడై బంగారుకవచము ధరించి దానికాంతులచే గొప్పయాయుధములు ధరించిన సైనికులు వెలుంగుచుండఁ బరాక్రమంబున వెడలెను.

148. అనుజుండు = తమ్ముఁడు. సూర్యదత్తఆహ్వయుండు = సూర్యదత్తుఁ డను పేరు గలవాఁడు. సమద.....రాజియై—సమద = గర్వముతోఁ గూడిన, సైనిక = సైనికులయొక్క, నానా అస్త్రశస్త్ర = నానావిధము లగు అస్త్రములయొక్కయు శస్త్రములయొక్కయు, దీప్తి = కాంతులయొక్క, జాలక = సమూహములచేత, ప్రతిహత = కొట్టఁబడిన, దినకర = సూర్యునియొక్క, అంశురాజియై = కిరణములసమూహము గలవాఁడై. సంరంభము = వేగము. ఎసఁగన్ చనుదెంచెన్ అని యన్వయము. తా.—అతనితమ్ముఁ డైనసూర్యదత్తుఁడు సూర్యకిరణసమూహమును గప్పునట్టి కాంతులు గల నానావిధాయుధములు ధరించిన గొప్పవీరులతోఁ గూడినవాఁడై వేగమున వెడలెను.

149. జోడు = కవచమును. మత్స్యభూవల్లభుఅగ్రనందనుఁడు = విరాటరాజు పెద్దకొడుకు. వైరిమదాపహవిక్రమప్రకారఉల్లసితుండు = శత్రువులమదమును పోఁగొట్టునట్టి పరాక్రమముయొక్క—

రోల్లసితుండు వన్యబల • ముద్ధతిఁ గొల్వ మృగేంద్రరేఖ శో
భిల్లుచు నుండ శంఖుఁడు వి•భీషణశంఖనినాద మొప్పఁగన్. 149

వ. మఱియు ననేకయోధవీరులు వివిధవాహనారూఢులై గాఢసన్నాహంబు లను నిజవ్యూహంబులతో నేతెంచు చుండిరి విరాటుండు బలంబులం గూర్చికొను తలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె నట్టిసమయంబున ధర్మతనయుండు పవనతనయమాద్రీతనయుల నంతంతం బొడచూపి నిలువుం డని నిపుణంబుగా నియోగించి తానును మత్స్యమహీవల్లభు నల్లనఁ జేరి యి ట్లనియె. 150

చ. ఒకఋషిచేత నాయుధస•ముత్కర మెల్లను సప్రయోగమం
త్రకముగ నభ్యసించి సమ•రంబునకుం గొఱ యైనవాఁడ గో
ప్రకరములన్ మరల్చుటకు • బంధులు నీవును బోవ నాకు నిం
టికడన యున్కి పాడియె ఘ•టింపఁగఁ బంపు రథంబు చయ్యనన్. 151

---

విధముచేఁ బ్రకాశించువాఁడు. శంఖుఁడు. వన్యబలము = ఆటవికసైన్యము. పాఠాం:—మత్స్యబలము=మత్స్యదేశపుదండు. ఉద్ధతిన్ = గర్వముచేత. మృగేంద్రరేఖ = సింహముయొక్క విధము. శోభిల్లుచున్ = ప్రకాశించుచు. విభీషణశంఖనినాదము = భయంకర మయినశంఖముయొక్క ధ్వని. తీవ్రగతిన్. చనుదెంచెన్ అని యన్వయము. తా.—శత్రువులగర్వమును బోఁగొట్టునట్టి గొప్ప పరాక్రమము గల విరాటునిపెద్దకొడు కయిన శంఖుఁడు తెల్లనికవచమును ధరించినవాఁడై అరణ్యకసేనలతోఁ గూడి సింహమువలె భయంకరముగా శంఖధ్వనిని సేయుచు యుద్ధమునకు వెడలెను.

150. అనేకయోధవీరులు = పెక్కండ్రువీరభటులు. వివిధవాహనఆరూఢులై = నానావిధము లయిన వాహనముల నెక్కినవారై. గాఢసన్నాహంబులు = గట్టిప్రయత్నములు గలవి. నిజవ్యూహంబులతోన్ = తమసేనలతో. పురబహిరంగణంబునన్ = పట్టణపు వెలుపలిబయలునందు. పవనతనయమాద్రీతనయులన్ = భీమనకులసహదేవులను. అంతంతన్ = అచ్చటచ్చట. పొడచూపి = కనఁబడి. నిపుణంబుగాన్ = నేర్పుగా.

151. ఆయుధసముత్కరము = ఆయుధములసమూహమును. సప్రయోగమంత్రకముగన్ = ప్రయోగముతోను మంత్రములతోను గూడునట్లుగా. అభ్యసించి = నేర్చి. సమరంబునకున్ = యుద్ధమునకు. కొఱ = సమర్థుఁడను. గోప్రకరములన్ = ఆవులమందలను. పాడిఎ = యుక్తమా? చయ్యనన్ = శీఘ్రముగా. రథంబు. ఘటింపఁగన్ = పూన్చుటకు. పంపు= ఆజ్ఞాపింపుము. తా.—నేను తొల్లి యొకఋషియొద్ద సమంత్రకముగా నాయుధవిద్య నంతయు నేర్చి యున్నాఁడను. యుద్ధము సేయఁ జాలుదును, నీవును నీబంధువులును గోవుల మరలించుటకుఁ బోఁగా నేనుమాత్ర మింటియొద్ద నూరకుండుట యుక్తము కాదు కావున నాకును ఒకరథమును గట్టున ట్లాజ్ఞాపింపుము.

వ్యా.— ఒకఋషిచేతన్......అభ్యసించి "చేతవర్ణకంబు హేతుకరణంబులకును గ్రహ్యాదియోగజం బగు పంచమికి నగు" ఇటఁ బంచమికిఁ జేతవర్ణకము వచ్చినది, ఒకఋషివలనన్ అని యర్థము చెప్పవచ్చును.

క. అనిన విని యియ్యకొనిన, మ్మనుజాధీశ్వరునితోడ ♦ మఱియు నతం డి
ట్లనుఁ బవనతనయుఁ గవలం, గొని సమరంబునకుఁ బోవఁ ♦ గోరెడుమదితోన్.

సీ. మనవలలుండు లా ♦ వున బంటుతనమున, జను లెఱుంగఁగ నడి ♦ చన్న వాఁడు
మంచిమగండు దా ♦ మగ్రంథి యసమసం, గ్రామకేళీగాఢ ♦ కౌతుకుండు
వినుము తంత్రీపాలుఁ ♦ డును దుర్దమారాతి, మర్దనచాతుర్య ♦ మహితభుజుఁడు
మున్నును వీరలు ♦ మువ్వురకడఁకల, కొలఁదు లే నెఱుఁగుదుఁ ♦ గొంతకొంత
యొక్కఁ దగునట్టియరదంబు ♦ లిచ్చి వీరి, ననికిఁ దోకొని పోవఁ గా ♦ ర్యంబు నాకుఁ
జూడ ననవుడు మేదినీ ♦ శుండు హర్ష, నిర్భరాత్మకుఁ డై శతా ♦ నీకుఁ జూచి. 153

వ. కంకవలలదామగ్రంథితంత్రీపాలురం జూపి యి ట్లనియె. 154

మ. రథముల్ మంచివి గాఁగ నాలు గతిశీ ♦ ఘ్రవ్యాప్తిసత్త్వంబులం
బ్రథితం బైనతురంగమోత్కరము సం ♦ గ్రామార్హచాపంబు ల

---

152. ఇయ్యకొను అమ్మనుజఅధీశ్వరునితోడన్=అంగీకరించునట్టి యావిరాటరాజుతో. అతండు=ధర్మరాజు. కవలన్ = నకులసహదేవులను. కొని = తోడ్కొని. తా.—అమాటను విరాటరాజు అంగీకరించుటను జూచి ధర్మరాజు భీమనకులసహదేవులను గూడ యుద్ధమునకుఁ దోడ్కొనిపోవఁ దలంచినవాఁడై విరాటునితో మరల ని ట్లనియెను.

153. లావునన్ = బలమునందును. బంటుతనమునన్ = శౌర్యమునందును. నడిచన్నవాఁడు=మీఁద లేనివాఁడు, కీర్తి పొందినవాఁ డనుట. మగండు=శూరుఁడు. అసమసంగ్రామకేళీగాఢకౌతుకుండు=పాటిలేని యుద్ధక్రీడయం దధిక మయిన యుత్సాహము గలవాఁడు. దుర్దమఅరాతిమర్దనచాతుర్యమహితభుజుఁడు = బలవంతు లగుశత్రువుల చంపుటయందలి నేర్పుచే గొప్ప దయిన చేతులు గలవాఁడు. వీరలుమువ్వురకడఁకలకొలఁదులు = ఈమువ్వురియొక్క పరాక్రమములయొక్క పరిమాణములను. అరదంబులు = రథములను. అనికిన్ = యుద్ధమునకు. పోవన్ = పోవుట. నాకున్. చూడన్. కార్యంబు = చేయఁదగినది యని యన్వయము. మేదినీఈశుండు = విరాటరాజు. హర్షనిర్భరఆత్మకుఁడువి = సంతోషముచే నిండినమనస్సు గలవాఁడై. తా.—వలలుఁడును దామగ్రంథియును తంత్రీపాలుఁడును యుద్ధమునందు గొప్పబలపరాక్రమములు గలవారు. వీరిపరాక్రమము నేను జూచియున్నాను, కావున వీరికి రథము లిచ్చి యుద్ధమునకుఁ దీసికొనిపోవుట యుక్త మని నాకుఁ దోఁచుచున్నది యని ధర్మరాజు చెప్పఁగా విరాటుఁడు సంతోషించి తనతమ్ముఁ డయిన శతానీకునిం జూచి.

వ్యా.—వీరలు మువ్వురకడఁకలః—సర్వనామమై పూర్వప్రయుక్త మగుటంజేసి వీరలు అనుదాని షష్ఠికిఁ బ్రథమావిభక్తి వైకల్పికము, సంఖ్యావాచక మయిన మువ్వుర అనుదానియొక్క సామర్థ్యముచేతఁ గూడఁ బూర్వప్రయుక్త వీరలుశబ్దమునకుఁ బ్రథమ వైకల్పికముగా రావచ్చును, వీరల మువ్వురికడఁకల అనియుం బ్రయోగింపనగు. ఇందుకు బాలవ్యాకరణసూత్రము “సర్వనామసంఖ్యాభిధాయితద్విశేష్యంబులం దెయ్యది ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు”

155. అతిశీఘ్రవ్యాప్తిసత్త్వంబులన్ = మిక్కిలి శీఘ్రమయిన నడకచేతను బలముచేతను. [illegible] = ప్రసిద్ధము. వినతురంగమఉత్కరము = అయినట్టి గుఱ్ఱములసమూహమును, సంగ్రామ

శ్లథవర్మంబులు వీరి కిమ్ము రణలీలాదక్షతన్ మత్మనో
రథముం దీర్పఁగ వీర లోపుదురు దోర్దర్పం బఖర్వంబుగన్. 155

వ. అనిన నతం డట్ల చేయుదు నని నాకలం దోడ్కొని చని సమస్తంబును సన్నద్ధంబు గావించి యంగరాగమాల్యాంబరాభరణంబుల నలంకృతులం జేసినం గైకొని తమయంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార చాలి రథంబులు దోలికొని చనుదెంచిరి తదనంతరంబ. 156

సీ. గంధదంతావళీకర్ణమారుతహతిఁ, గాంతారములు చాఁపకట్టు పడఁగ
రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చునద్రులు, భయమున వాపోవుభంగి నఱపఁ
దురగఖురోద్ధూతధూళి దన్నొరసిన, వననిధి పిండలివంటు గాఁగ
బహుళపదాతిదుర్భరభార మడరిన, నురగకూర్మంబు లొండొంటిఁ బొంద

---

అర్హచాపంబులు = యుద్ధమునకుఁ దగిన ధనుస్సులను. అశ్లథవర్మంబులు = దృఢము లయినకవచములను. రణలీలాదక్షతన్ = యుద్ధము అను విలాసమునందు నేర్పు గలవా రగుటచేత. దోర్దర్పంబు = చేతులకావరము. అఖర్వంబుగన్ = గొప్పది యగునట్లుగా. మత్మనోరథమున్ = నాకోరికను. తీర్పఁగన్. వీరలు. ఓపుదురు అని యన్వయము. తా.—వీరికి మంచిరథములను నాలిగింటిని, బల వేగంబులు గల గుఱ్ఱములను, ఉత్తమము లయిన ధనుస్సులను, దృఢము లగు కవచములను ఇమ్ము. వీరు యుద్ధమునందు సమర్థు లగుటచే బాహుబలంబున నాకు జయము కలిగింతురు.

156. సన్నద్ధంబు = సిద్ధము. అంగరాగమాల్యఅంబరఆభరణంబులన్ = మైపూఁతచేతను పూలదండలచేతను వస్త్రములచేతను సొమ్ములచేతను. అలంకృతులన్ = అలంకరింపఁబడినవారినిగా. తమయంతవట్టును = తాము అందఱును. సూతకృత్యంబులకున్ = సారథియొక్క పనులకు. తారు అ = తామే. తత్ అనంతరంబు అ = ఆటుపిమ్మటనే. పాఠాం.—211 వచనమునందు "తమయంతవట్టునుం గూడికొని" యనియు, 220 వచనమునందు "తమయంతవట్టును నొక్కట విరాటునకుం బొడచూపిన" అనియును బ్రయోగింపఁబడి యున్నది. ఈస్థలములయందంతటను తా మందఱు నను నర్థమే యుచితముగా నున్నది. కావున "తమతమయంతవట్టును అను పాఠాంతరము దాము తా మందఱము నను నర్థము అస్వరస మగుటచేఁ బ్రామాదికముగా గ్రహింపవలయు.

వ్యా.—తమయంతవట్టును—ఇట ఆత్మార్థకమునకు షష్ఠీ ప్రయోగవైచిత్ర్య మని యెఱుంగునది.

157. గంధదంతావళీకర్ణమారుతహతిన్ = మదపుటేనుంగుల చెవులగాలి దెబ్బచేత. కాంతారములు = అరణ్యములు. చాఁపకట్టుపడఁగన్ = చాఁపపఱచినట్లు కాఁగా. రథఘోషమునన్ = రథములమ్రోఁతచేత. ప్రతిరవము = ప్రతిధ్వనిని. ఇచ్చుఅద్రులు = చేయునట్టి కొండలు. వాపోవుభంగిన్ = ఏడ్చువిధమున. తురగఖురఉద్ధూతధూళి = గుఱ్ఱముల డెక్కలచే నెగిరిన దుమ్ము. ఒరసినన్ = పొందఁగా. వననిధి = సముద్రము. పిండలివంటు = ముద్ద యయిన బురద. బహుళపదాతిదుర్భరభారము = ఎక్కుడయిన కాల్బలములయొక్క భరింపరాని బరువు. అడరినన్ = అతిశయింపఁగా. ఉరగకూర్మంబులు = ఆదిశేషుఁడును, తాఁబేలును. ఉత్సాహలీలన్ = ఉత్సాహముయొక్క

సైన్యముల నడపించె ను♦త్సాహలీల, యతిశయిల్లంగ సంరంభ ♦ మగ్గలింప
బరవసము మిక్కుటంబుగఁ ♦ బసులు సన్న,జాడపైకొని యమ్మత్స్య♦జనవిభుండు.

వ. ఇట్లు చని కూడ ముట్టిన. 158

క. విరటుబలంబుఁ ద్రిగర్తే, శ్వరుబలముం జెలఁగ నార్చి ♦ వడిఁ దాఁకె భయం
కరనాదమేదురము లగు, శరనిధు లొండొంటిఁ దాఁకు♦చందం బమరన్. 159

మ. గుణరావంబుఁ గృపాణఘట్టనరవ♦క్షోభంబునుం గింకిణీ
క్వణనవ్యాపృతహేషితస్వనములుం ♦ ఘంటానినాదాత్తపో
షణనానాపటుబృంహితధ్వనియు శ♦శ్వద్గాఢమై పేర్చినన్
రణనం బించుక దోఁపదయ్యె బహుతూ♦ర్యశ్రేణి నాసేనలన్. 160

---

విలాసము. అతిశయిల్లంగన్ = అధికము కాఁగా. సంరంభము = వేగిరపాటు. అగ్గలింపన్ = అతిశయింపఁగా. బరవసము = ధైర్యము. ఆమత్స్యజనవిభుండు = ఆ విరాటరాజు. సైన్యములన్ నడపించెన్ అని యన్వయము. తా.—ఏనుఁగుల చెవులగాలికి అడవియందలి వృక్షములు పడుచుండఁగా, రథధ్వనిచేతఁ బర్వతములు ప్రతిధ్వని చేయుట భయపడి యేడ్చినట్లుగాఁగా, గుఱ్ఱముల గిట్టల త్రొక్కుడుచే నెగసిన దుమ్ము నిండి సముద్రము బురద కాఁగా, కాల్బలముల భారమునకు శేషకూర్మము లొకరిపై నొకరు పడఁగా, విరాటుఁడు మిక్కిలి యుత్సాహముతోఁ బశువుల పోయినజాడను బట్టి సైన్యముల నడిపించెను.

158. కూడముట్టినన్ = తఱుముకొని పోఁగా.

159. విరటుబలంబున్ = విరాటరాజుసైన్యమును. త్రిగర్తేశ్వరుబలమున్ = సుశర్మయొక్క సేనయును. చెలఁగన్ = ఉత్సాహముతో. ఆర్చి = సింహనాదములు చేసి. భయంకరనాదమేదురములు = భయమును గలిగించునట్టి మ్రోఁతచే నిండినవి. అగు శరనిధులు = అయినసముద్రములు. తాఁకు చందంబు = ఎదిరించువిధము. అమరన్. వడిన్. తాఁకెన్ అని యన్వయము. తా. సముద్రములు ఘోషించుచు నొండొంటిం దాఁకునట్లు విరాటసుశర్మల సైన్యములు సింహనాదములు చేయుచు నొండొంటి నెదిరించెను.

160. గుణరావంబు = అల్లెత్రాటిమ్రోఁతయును. కృపాణఘట్టన రవక్షోభంబునున్ = ఖడ్గములయొరయికచేఁ గలిగిన ధ్వనిచేతఁ గలుగు కలఁతయును. కింకిణీక్వణనవ్యాపృతహేషిత స్వనములున్ = చిఱుగంటలధ్వనిచే విరివి చేయఁబడిన సకిలింతలధ్వనులును. ఘంటానినాదాత్తపోషణనానాపటు బృంహితధ్వనియున్ = గంటలమ్రోఁతచేఁ బొందఁబడిన వృద్ధిగల నానావిధములై గొప్పదైన గజగర్జితముల ధ్వనియును. శశ్వద్గాఢమై = మాటిమాటికి నతిశయించినదై. పేర్చినన్ = విజృంభింపఁగా. ఆసేనలన్. బహుతూర్యశ్రేణిన్ = అనేకము లయిన వాద్యముల సమూహముచేత. రణనంబు = ధ్వని. ఇంచుక = కొంచెమైనను. తోఁపదు ఆయ్యెన్. తా.—ధనుస్సుల యల్లెత్రాటి మ్రోఁతయును, ఖడ్గముల తాఁకుళ్లచేఁ గలుగు గొప్పధ్వనియును, రథముల చిఱుగంటలధ్వనితోఁ గూడిన గుఱ్ఱముల యఱపులును, గంటలధ్వనులతోఁ గూడిన యేనుఁగుల గర్జితములును, మాటిమాటికి హెచ్చి వ్యాపించుటవలన నా సేనలయందు వాద్యములధ్వని కొంచెమైనను దెలియ కుండెను.

(విరాటసుశర్మలసైన్యంబులు సంకులంబుగాఁ బోరుట.)

వ. అట్టిసమయంబున. 161

సీ. ఒండొంటితోఁ దాఁకి ♦ మండెడునవియును, జిందముల్ పొడిపొడి ♦ సేయునవియు
గట్టిమైముఱువులు ♦ దట్టముల్ గావించు, నవియును నెఱఁకు నోఁ ♦ నాడునవియు
నేటుపైఁ బడి మేని ♦ నెగయించునవియును, దల నేల డొల్లంగఁ ♦ దాఁకునవియు
నిరుమెయిఁ దొలిచి బి♦ట్టిలఁ దూఱునవియును, నలువుర నేవుర ♦ నాటునవియు
నైనశరములుగనుఁగొని ♦ యాడియాడి, నారదుండు పిచ్చలింపంగ ♦ వీరకేళి
సలిపె నుద్ధతిమై ధను♦ర్బలము లడరి, లావు వెరవును నెఱయఁ జ♦లంబు మెఱయ.

వ. అప్పుడు సుభటులు గడంగి. 163

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని ♦ యించుక కొంకక యర్మపెంపునం
బోటులవాతఁ బోవుభట♦పుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్
వ్రేటులఁ గ్రీడ సల్పి పృథి♦విం బడువీరులఁ ద్రొక్కికొంచు నె
చ్చోటుల నైన నగ్గలికఁ ♦ జొత్తురు నెత్తురువఱ్ఱు సేయుచున్. 164

---

162. చిందముల్ = శంఖములను. మైముఱువులు = కవచములను. దట్టముల్ = విరళములుగా. నెఱఁకు = మర్మస్థానమును. నోఁక్ = నొచ్చునట్లు. ఆడునవియున్ = గ్రుచ్చునవియును. ఏటు = దెబ్బ. మేనిన్ = శరీరమును. ఎగయించునవియును = ఎగురఁగొట్టునవియును. డొల్లంగన్ = పడునట్లు. ఇరుమెయిన్ = రెండు శరీరములను. తొలిచి = రంధ్రము చేసి. బిట్టు = శీఘ్రముగా. ఇలన్ = భూమియందు. నాటునవియున్ = గ్రుచ్చుకొనునవియును. ఐనశరములు = అయిన బాణములను. ఆడిఆడి = మిక్కిలి నాట్యము చేసి. పిచ్చలింపంగన్ = కొనియాడఁగా. ధనుర్బలములు = విండ్లవారు. అడరి = విజృంభించి. లావు = బలమును. వెరవును = ఉపాయమును. నెఱయన్ = నిండఁగా. చలంబు = పూనిక. మెఱయన్ = ప్రకాశింపఁగా. ఉద్ధతిమైన్ = గర్వముచేత. వీరకేళి = శూరవిలాసమును. చలిపెన్ అని యన్వయము. తా.—విండ్లవారు ప్రయోగించినబాణములు కొన్ని యొకటొకటికిఁ దాఁకి మండినవి, కొన్ని శంఖములను పొడి చేసినవి, కొన్ని కవచములను భేదించినవి, మఱికొన్ని మర్మస్థానములయందు నాటినవి, కొన్ని వేగమునఁ బడుటంజేసి దేహము నెగురఁ గొట్టినవి, కొన్ని శిరముల ఖండించినవి. కొన్ని యిద్దఱిదేహములను దూఱినవి, మఱికొన్ని నలువురియయిదుగురిదేహములఁ దూఱినవి, ఈయద్భుతముచూచి నారదమునిగంతులువేసి కొనియాడెను.

163. సుభటులు = మేలిబంటులు. కడంగి = పూని.

164. ఏటులన్ = దెబ్బలచేత. మ్రొగ్గువారిన్ = పడునట్టివారిని. కొంకక = వెనుదీయక. అర్మపెంపునన్ = ఆక్రమణముయొక్క యతిశయముచేత. పోటులవాతన్ = దెబ్బలబారిని. భటపుంగవులన్ = శూరశ్రేష్ఠులను. వ్రేటులన్ = బాణప్రయోగములచేత. పృథివిన్ = భూమియందు. అగ్గలికన్ = ఉత్సాహముచేత. నెత్తురువఱ్ఱు = రక్తప్రవాహమును. చేయుచున్. చొత్తురు అని యన్వయము. తా.—బాణములు తగిలి పడునట్టివారిని చూచియు వెనుదీయక పరాక్ర

సీ. ఒక్కఁడు పెక్కండ్ర ♦ కెక్కిన విచ్చియుఁ, బొదివి వేఱొకపోటు ♦ వొడుచు నెడలుఁ
బలువు రొక్కనిమీఁదఁ ♦ బఱపిన సైరించి, యలమి పైఁబెట్టక ♦ నిలుచు నెడలు
దళము దళంబుతోఁ ♦ దాఁకి యగ్గలికమై, నీడఁబోవక ప్రేటు♦లాడు నెడలు
నోహరిసాహరి ♦ నుయ్యాలచేరుగా, వెనుకొంచుఁ దెరలుచుఁ ♦ బెనఁగు నెడలు
నై యనేకభంగి ♦ నాశ్వికసేనలు, బొమ్మ లాడినట్లు ♦ పోరు చుండె
నమరగణము సిద్ధ♦సమితియు వేడుకఁ, జదల నిలిచి చూచి ♦ సంస్తుతింప. 165

వ. ఒక్కయెడ. 166

ఉ. ఒండొరు మీఱుకోర్కి మెయి ♦ నొక్కట బాసలవారు సొచ్చినన్
రెండయి పాయ యిచ్చిన య♦రిప్రకరంబుల వేఱువేఱ యు

---

మముతోఁ బైఁబడుబాణముల కెదురు నడచు శూరులను మెచ్చుకొనుచుఁ దాము శత్రువులమీఁద బాణప్రయోగము చేసి హతులై పడువారిని త్రొక్కి మీఁదికిఁ బోవుచు శత్రుసేనలం జొచ్చి యంతటను రక్తప్రవాహము సేయుచుండిరి.

165. పెక్కండ్రకున్ = అనేకులమీఁదికి. ఎక్కినన్ = పోఁగా. విచ్చియున్ = విరిసియు. పొదివి = పైఁబడి. వేఱొకపోటు = వేఱువేఱు దెబ్బలను. పొడుచుఎడలున్ = కొట్టుచోటులును. తా.—ఒక్కఁడు అనేకులమీఁదికిఁ బోఁగా వారు వెనుదీసియు మరల వానిమీఁదికిఁ బోయి వేఱువేఱుగాఁ గొట్టుచోట్లును. పలువురు= అనేకులు. పఱపినన్ = తోలఁగా. సైరించి= సహించి. పైఁబెట్టక = పైకిఁ బోవక. నిలుచుఎడలున్ = నిలుచునట్టి చోటుల్లను. తా.—అనేకు లొక్కని మీఁదికిఁ బోఁగా నతఁడు సహించి వారిమీఁదికిఁ బోక నిలుచునట్టిచోట్లును. దళము = సేన. దళంబుతోన్= సేనతో. అగ్గలికమైన్ = ఉత్సాహముతో. ఈడఁబోవక = వెనుదీయక. ప్రేటులాడు ఎడలున్= పోట్లాడుచోటులును. తా.—ఒక సేన మఱియొక సేనతో నెదిరించి వెనుదీయక యుద్ధము చేయుచోట్లును. ఓహరిసాహరిన్ = గుంపులు గుంపులుగా. ఉయ్యాలచేరుగాన్ = ఉయ్యాలగొలుసువలె. వెనుకొంచున్ = వెంబడించుచు. తెరలుచున్ = వెనుకకుఁ బోవుచు. పెనఁగుఎడలున్ = పోరునట్టి చోటులును. తా.—గుంపుగుంపులుగా ఉయ్యాలవలె ముందు వెనుకలకుఁ బోవుచుఁ బోరాడునట్టి చోటులును. ఐ = కలిగి. ఆశ్వికసేనలు = గుఱ్ఱపుదళములు. అమరగణమున్ = దేవతల సమూహమును. సిద్ధసమితియున్ = సిద్ధులసమూహమును. చదలన్ = ఆకాశమునందు. సంస్తుతింపన్ = పొగడుచుండఁగా. పోరుచుండెన్ అని యన్వయము. తా.—ఇట్లు అనేకవిధములుగా గుఱ్ఱపుసేనలు బొమ్మలాడునట్లు పోరుచుండిరి. దేవతలు మొదలగువారు ఆకాశముననుండి దానిం బొగడుచుండిరి.

167. ఒండొరున్ = ఒకరొకరిని. మీఱుకోర్కిమెయిన్ = అతిశయింపవలె నను కోరికతో. ఒక్కటన్ = ఏకకాలమునందు. బాసలవారు = పంతము లాడినశూరులు. చొచ్చినన్ = ప్రవేశింపఁగా. పాయ = దారిని. ఇచ్చిన అరిప్రకరంబులన్ = ఇచ్చినట్టి శత్రుసేనలను. వేఱువేఱు అ. ఉద్దండ భుజాబలంబు= అతిశయించిన చేతులబలము. అలరన్= ప్రకాశించునట్లు. తాఁకినన్= ఎదిరింపఁగా. సంగడిన్ = సమీపమునందు. పాఱుచుండఁగాన్ = శత్రుసేనలు పరుగెత్తుచుండఁగా.

ద్దండభుజాబలం బలరఁ ♦ దాఁకిన సంగడిఁ బాఱు చుండఁగా
గం డమరంగ నిల్చి చెలి♦కాం డ్రయి క్రమ్మఱ వత్తు రిద్దఱున్. 167

సీ. కరశీకరంబులుఁ ♦ గరటగళద్దాన, తోయంబులును ధరా♦ధూళి ద్రింగఁ
బొడవుల నడి సన్న♦యొడళులుఁ టెక్కియ, మ్ముల పెంపు గగనంబు ♦ గొలఁదిపెట్ట
బృంహితధ్వనులును ♦ బృథులఘంటావళీ, రవములు దిక్కుల ♦ నవులఁ ద్రోవ
రోషారుణాక్షుల♦రుచులును సిందూర, కాంతులు రవిదీప్తిఁ ♦ గ్రమ్మఱింప
జోదు లొక్కట వాలంప♦సోనఁ గురియ, రౌద్రరసమాకృతులఁ దాల్చి♦రణ మొనర్చు
కరణి నత్యుగ్రముగఁ గరి♦ఘటలు గడఁగి, కలను పీనుఁగుపెంటగాఁ ♦ గలయ బెరసె.

---

ఇద్దఱున్ = ఆపంతము పట్టిన శూరు లిద్దఱును. గండు = శౌర్యము. అమరంగన్ = ఒప్పునట్లు. నిల్చి. చెలికాండ్రు అయి = స్నేహితులై. క్రమ్మఱి = మరలి. వత్తురు. తా.—పంతము పట్టిన యిద్దఱుశూరులు ఒకరినొకరు మీఱవలయు నని యుద్ధమునకుఁ జొచ్చి తాము చొచ్చినంతనే రెండుపాయలుగా విచ్చిన శత్రుసేనలతోఁ బోరి ఆశత్రుసేనలు తమసమీపమునఁ బరువెత్తుచుండఁగా నీ మహాశూరు లిద్దఱు మాత్రము శౌర్యముతో వెనుదీయక నిల్చి ఒకరినొకరు శ్లాఘించుకొనుచు మరలి వారివారి నెలవులకుఁ బోవుదురు.

168. కరశీకరంబులున్ = తొండముల తుంపురులును. కరటగళత్ దానతోయంబులును = చెక్కిళ్ళనుండి కాఱుచున్న మదజలములును. ధరాధూళిన్ = నేలదుమ్మును. తా.—తొండముల తుంపురులచేతను చెక్కిళ్లనుండి కాఱునట్టి మదజలముచేతను నేలదుమ్ము అణఁగినది. పొడవులన్ = ఔన్నత్యములచేత. నడిసన్న ఒడళులున్=అనింద్య మయిన దేహములును. టెక్కియమ్ముల పెంపున్= టెక్కియముల యతిశయమును. గగనంబున్ = ఆకాశమును. కొలఁదిపెట్టన్ = కొలువఁగా. తా.—మిక్కిలి పొడువైన శరీరములును ధ్వజములును ఆకాశమును దాఁకుచున్నవి. బృంహితధ్వనులును = గర్జనములయొక్క ధ్వనులును. పృథులఘంటా ఆవలీరవములున్ = గొప్పలగు గంటలసమూహములయొక్క ధ్వనులును. తా.—గర్జితములును గంటలమ్రోఁతలును దిక్కులు నిండి యున్నవి. రోష.అరుణఅక్షులరుచులును = కోపముచే నెఱ్ఱనికన్నుల కాంతులును. సిందూరకాంతులున్= ఏనుఁగులకుఁ బూసియున్న సిందూరముయొక్క కాంతులును. రవిదీప్తిన్ = సూర్యునికాంతిని. క్రమ్మఱింపన్ = మరలింపఁగా. తా.—ఏనుఁగుల కన్నులకాంతియు సిందూరముకాంతియు సూర్యకాంతిని మీఱి యున్నవి. జోదులు = శూరులు. ఒక్కటన్ = ఏకకాలమునందు. వాలంపసోన = వాఁడి యయిన బాణవర్షమును. ఆకృతులన్= రూపములను. రణము=యుద్ధము. ఒనర్చుకరణిన్ = చేయునట్లు. అతిఉగ్రముగన్ = మిక్కిలి భయంకరముగా. కరిఘటలు = ఏనుఁగులగుంపులు. కడఁగి = పూని. కలను = యుద్ధరంగము. కలయన్= అంతట. బెరసెన్=వ్యాపించెను. తా.—ఇట్లు శూరులు బాణవర్షము కురియుచుండఁగా నాకారము దాల్చి పోరుచున్న రౌద్ర రసములో యనునట్లు యేనుఁగులు యుద్ధరంగ మంతయు వ్యాపించెను.

ఉ. అక్కజ మైనశౌర్యమును ♦ నద్భుతసంపద నొందుశక్తులుం
జిక్కనిమేనులుం ◌ మొనకుఁ ♦ జెల్వగుకైదువులుం జెలంగ ను
క్కెక్కినయట్టిమేటిమగ ♦ లించుక వారణ లేక ఖేచరు
ల్వెక్కస మంద నొచ్చియుఁ జ♦లింపక పోరిరి పెక్కుభంగులన్. 169

సీ. నొగనొగతోఁ దాఁకి ♦ పగులంగ బెట్టుగాఁ, బఱపి యాతేరిపై ♦ దుముకువారు
రథ్యముల్ వడ్డ వి♦రథు లయ్యు నసిముద్గ, రాదుల నడరి పో♦రాడువారు
సారథి నొచ్చినఁ ♦ దేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు ♦ సేయువారు
నరదంబుపై వ్రాలి ♦ యాలోనఁ దెలిసి త, న్నేసినాతనిఁ బడ ♦ నేయువారు
నగుచు రథికనికాయంబు ♦ లప్రమత్త, మహితనిజచిత్తవృత్తులై ♦ మగతనంబు
ఘోరమూర్తులు గైకొని ♦ పోసునట్లు, సలిపె సంగ్రామకేళి సం♦కులము గాఁగ.

---

169. అక్కజము = గొప్పది. అద్భుతసంపదన్ = ఆశ్చర్యకర మయిన యతిశయమును. శక్తులున్ = సామర్థ్యములును. చిక్కనిమేనులున్ = బలిసిన దేహములును. మొనకున్ = వ్యూహమునకు. చెల్వు = తగినవి. అగు కైదువులున్ = అయినట్టి యాయుధములును. చెలంగన్ = ఒప్పఁగా. ఉక్కు = బలము. ఎక్కిన అట్టిమేటిమగలు = అతిశయించినట్టి గొప్పశూరులు. ఇంచుక = కొంచెమైనను. వారణలేక = అడ్డులేక. ఖేచరుల్ = దేవతలు. వెక్కసము అందన్ = వెఱఁగుపడు నట్లు. తా.—ఎక్కువబలపరాక్రమములు గలిగి గొప్పశూరులు మేలియాయుధములతో దేవతలు ఆశ్చర్యపడునట్లు నొచ్చియు వెనుదీయక పోరిరి.

170. బెట్టుగాన్ = వేగముగా. పఱపి = తోలి. ఆతేరిపైకిన్ = ఎదిరితేరిమీఁదికి. రథ్యముల్ = గుఱ్ఱములు. విరథులు = రథము లేనివారు. అసి ముద్గరఆదులన్ = కత్తులు గుదియలు మొదలగువానిచేత. కడపుచున్ = నడపుచు. ఏయుచున్ = బాణప్రయోగము సేయుచు. కయ్యంబు = యుద్ధమును. వ్రాలి = మూర్ఛిల్లి. ఆలోనన్ = అంతలోపల. ఏసిన ఆతనిన్ = కొట్టినవానిని. రథికనికాయంబులు = రథమునందుండి యుద్ధము చేయు శూరులసమూహములు. అప్రమత్త మహితనిజచిత్తవృత్తులు ఐ = ఏమఱుపాటు లేనివియు నుత్సాహము గలవియు నగు తమ మనోధర్మములు గలవియై. మగతనంబు = శౌర్యము. ఘోరమూర్తులు = భయంకరము లయిన యాకారములను. సంగ్రామకేళి = యుద్ధక్రీడను. సంకులముగాఁగన్ = అధిక మగునట్లు. చలిపెన్ = చేసెను. తా.—రథికులు కొందఱు తమరథముల నెదిరి తేరిమీఁదికి నొగనొగతాఁకి పగులునట్లు వేగముగాఁ దోలి యెదిరి తేరిమీఁదికి దుమికిరి. కొందఱు తమ తేరిగుఱ్ఱములు చంపఁబడఁగా విరథులయ్యును కత్తులు మొదలగునాయుధములం గొని పోరిరి. మఱికొందఱు తమ సారథి మృతినొందఁగాఁ దామే రథములను తోలుకొనుచు బాణప్రయోగములు చేయుచుఁ బోరిరి. ఇంకఁ గొందఱు శత్రువుల దెబ్బలకు మూర్ఛ నొంది అంతలోనే మూర్ఛ దేఱి తమ్ముఁ గొట్టినశత్రువును బడఁగొట్టిరి. ఇట్లు ఆశూరులందఱు కొంచెమైనను నేమఱుపాటు లేనివారై యుత్సాహముతో శౌర్యమే యాకారములు ధరించి యుద్ధము చేయుచున్నదో యనునట్లు భయంకరముగాఁ దొమ్మి యుద్ధము చేసిరి. పాఠాం:—సీసము ప్రథమపాదమునందు "అరదంబు పఱపి = తేరును తోలి యని యర్థము. గీత

వ. ఇట్లిరువాఁగును నరవాయిగొనక పెనంగుచుండ. 171

ఉ. భీకరబాణవర్షముల♦పెల్లున వైరులు పెల్లగిల్ల వా
ర్వీకృతగర్జితంబు పృథి♦వీవియదంతర మెల్ల నిండ ను
గ్రాకృతిఁ గల్పసంక్షయమ♦హాభ్రముచందము నొందుచుం శతా
నీకుఁడు దాఁకెఁ గంకటమ♦ణిద్యుతివిద్యుదదాంతకాంతి యై. 172

గీ. అతఁడు నానాప్రకారశ♦స్త్రాస్త్రనిహతి, నతులవిక్రమవిభవ మ♦నర్గళముగ
యోధసారథియుగ్యసం♦యుతముగాఁగ, నూఱురథములు వ్రేల్మిడి ♦ నుగ్గుచేసె.

మునందు "అడరి యప్రమత్త నిజచిత్తవృత్తులై = విజృంభించి యేమఱుపాటు లేని తమచిత్తవృత్తి గలవారై యని యర్థము. ఈపాఠములు, సీసము చతుర్థపాదమునందును అరదము శబ్దము ప్రయోగింపఁ బడుటవలనను ద్వితీయపాదమునందును అడరి యని ప్రయోగింపఁ బడుటవలనను "నైకం పదం ద్విః ప్రయోజ్యం ప్రాయేణ" అను న్యాయమునకుఁ విరుద్ధ మగుటచే కవిసమ్మతములు గా వని తోఁచెడిని.

171. ఇరువాఁగును = రెండుసేనలును. అరవాయిగొనక = అధైర్యపడక. పెనంగుచుండఁగా = యుద్ధము చేయుచుండఁగా.

172. భీకరబాణవర్షములపెల్లునన్ = భయంకరము లయిన బాణవర్షముల యతిశయముచేత. వైరులు = శత్రువులు. పెల్లగిల్లన్ = పడఁగా. వార్వీకృతగర్జితంబు = అల్లెత్రాటిచేఁ జేయఁబడిన యులుము. పృథివీవియత్ అంతరము = భూమ్యాకాశముల మధ్యము. కల్పసంక్షయమహాభ్రము చందముగన్ = ప్రళయకాలమునందలి గొప్పమేఘముయొక్క విధమును. కంకటమణిద్యుతివిద్యుత్ అదాంతకాంతివి = కవచములయందలి రత్నాలకాంతి యను మెఱుపుయొక్క తక్కువకానికాంతి కలవాఁడై. శతానీకుఁడు. ఉగ్రఆకృతి = భయంకర మయిన యాకారముతో. తాఁకెన్. తా.—విరాటుని తమ్ముఁ డయిన శతానీకుఁడు శత్రువులు పడునట్లు బాణవర్షము గురియుచు నల్లెత్రాటిధ్వని యను నులుము భూమ్యాకాశమధ్య మంతయు నిండునట్లు చేయుచుఁ గవచరత్నకాంతి యను మెఱుపు కాంతి గలవాఁడై ప్రళయకాలమేఘమువలె భయంకరుండై యుద్ధమున శత్రువుల నెదిరించెను. పాఠాం:—విద్యు దుపాంతకాంతియై = మెఱుపుయొక్క సమీపకాంతి గలవాఁడై అని యర్థము. మెఱుపుయొక్క సమీప మనఁగా మెఱుపువంటిది యని యర్థము చెప్పవలయును, మణిద్యుతి యని కాంతి వాచక మయినద్యుతిశబ్దము వేఱుగా నుపాత్త మగుటచే నట్టియర్థము అనన్వితము. విద్యు దుదాత్తకాంతియై = మెఱుపుయొక్క గొప్పకాంతి కలవాఁడై అని యర్థము. ఈపాఠమునం దనుప్రాసభంగము.

173. నానాప్రకారశస్త్ర అస్త్రనిహతిన్ = పలువిధ మయిన శస్త్రములయొక్కయు అస్త్రములయొక్కయు దెబ్బచేత. అతులవిక్రమవిభవము = సాటిలేని పరాక్రమముయొక్క యతిశయము. అనర్గళముగన్ = అడ్డులేనిది కాఁగా. యోధసారథియుగ్యసంయుతము కాఁగన్ = రథికులతోను సారథులతోను గుఱ్ఱములతోను గూడినట్లుగా. వ్రేల్మిడిన్ = క్షణములో. నుగ్గుచేసెన్ = చూర్ణము చేసెను. తా.—శతానీకుఁడు యడ్డులేక పరాక్రమించి శస్త్రాస్త్రప్రయోగములచే రథికులతోను సారథులతోను గుఱ్ఱములతోను గూడ నూఱురథములను బూడి చేసెను.

మ. మదిరాక్షుండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప స
ప్రదరజ్యాలతికాక్రియాసమభిహారక్రీడనం బప్పు డొ
ప్పిద మై యోగవియోగసంధులు నిరూపింపంగ రా కుండఁ గ
ర్ణదళోపాంతము వింత సేయ నడరెన్ రౌద్రం బుదగ్రంబుగన్. 174

క. అడరి వడి రథచతుశ్శతిఁ, బొడిసేసి పరాక్రమం బపూర్వంబై యే
ర్పడఁ గరిహయనరనికరము, బడలువడం దఱిమె నలి నభశ్చరు లార్వన్. 175

ఉ. మండలచారి యై రథ మమానుషవిక్రమలీల నొప్ప ను
ద్దండభుజాబలంబు ప్రథితంబుగ నత్తఱిఁ దాఁకి సూర్యద

---

174. కడంగి = పూని. అన్నకున్ = శతానీకునకు. బలఉన్మాదంబు = బలగర్వము. సప్రదర......క్రీడనంబు—సప్రదర = బాణములతోఁ గూడిన. జ్యాలతికా = తీఁగవంటి యల్లెత్రాటి యొక్క, క్రియా = కార్యముయొక్క, సమభిహార = మాటిమాటికి చేయుట యనెడు, క్రీడనంబు = విలాసము. ఒప్పిదము ఐ = అందమై. యోగవియోగసంధులు = కూర్చుటయొక్కయుఁ బ్రయోగించుటయొక్కయు అవకాశములు. నిరూపింపంగన్ = తెలిసికొనుటకు. కర్ణదళఉపాంతము = ఆకువంటి చెవియొక్క సమీపప్రదేశము. వింతచేయన్ = ఆశ్చర్యము కలిగింపఁగా. రౌద్రంబు = రౌద్రరసము. ఉదగ్రంబుగన్ = అధికము కాఁగా. అడరెన్ = విజృంభించెను. తా.—విరాటుని తమ్ముఁ డయిన మదిరాక్షుఁడు అన్న కుత్సాహము కలుగునట్లు బాణముయొక్కయు నల్లెత్రాటియొక్కయుఁ గార్యములవేగము ఆశ్చర్యకరమయి బాణము సంధించుటయు ప్రయోగించుటయుఁ దెలియరాక చెవియందు మాత్రమే యుండునట్లు కనఁబడుచుండఁగా యుద్ధమున విజృంభించెను. అతఁ డతివేగముగా ఆకర్ణాంతము లాగి బాణసంధానమోక్షములు సేయుటచే ధనుస్సు మండలాకారమై బాణముతోఁ గూడిన యల్లెత్రాడు చెవియొద్ద నుండుట మాత్రమే కనఁబడుచు నాశ్చర్యముగా నుండె నని భావము.

175. అడరి = విజృంభించి. రథచతుఃశతి = రథముల నన్నూటిని. అపూర్వంబు ఐ = క్రొత్తదియై. ఏర్పడన్ = కనఁబడఁగా. కరిహయనరనికరము = ఏనుఁగులయు గుఱ్ఱములయు మనుష్యులయు సమూహమును. బడలుపడన్ = కష్టపడునట్లు. నభశ్చరులు = దేవతలు. ఆర్వన్ = అఱవఁగా. నలిన్ = మిక్కిలి. తఱిమెన్. తా.—మదిరాక్షుఁ డట్లు విజృంభించి నాలుగునూఱుల రథములను బొడి చేసి గొప్పపరాక్రమముతో గజహయపదాతివర్గమును నొప్పించి దేవతల నాశ్చర్యపడునట్లు చేసెను.

176. మండలచారి ఐ = మండలగతిచేఁ దిరుగునదియై. అమానుషవిక్రమలీలన్ = మనుష్యుల సంబంధి కాని గమనముయొక్క విలాసముచేత. ఒప్పన్ = ప్రకాశింపఁగా. ఉద్దండభుజాబలంబు = గొప్పదైన చేతులబలము. ప్రథితంబుగన్ = ప్రసిద్ధము కాఁగా. అనివార్యశౌర్యగుణధుర్యుఁడు = అడ్డగింపరాని శౌర్యగుణముయొక్క భారమును వహించినవాఁడు. వీఁడు అ = ఈసూర్యదత్తుఁడే. పేర్చి = విజృంభించి. వేదండఘటావిపాటన విదగ్ధతన్ = ఏనుఁగుల గుంపుల ఖండించుటయందు నేర్పు గలవాఁ డగుటచేత. రణఅంగణంబునన్ = యుద్ధరంగమునందు. పొల్చెన్ = ప్రకాశించెను.

త్తుం డనివార్యశౌర్యగుణ♦ధుర్యుఁడు వీఁడ యనంగఁ బేర్చి వే
దండఘటావిపాటనవి♦దగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్. 176

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రి♦యంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో
మొప్పఁగ నస్త్రశస్త్రముల♦యుల్లసనంబున శత్రునేత్రముల్
గప్పఁగఁ జీఁకటుల్ రణము♦ఖంబు సమస్తముఁ దానయై రథం
బుప్పరవీదిఁ దోలికొని ♦ యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 177

సీ. మందరాచలచటులవి♦మర్దనమున, ఘూర్ణమానమై గాఢసం♦క్షోభ మెసఁగఁ
దలఁకుజలనిధి నాఁ ద్రిగ♦ర్తక్షితీశు, బలము దిరుగుడువడియె సం♦కులము గాఁగ.

వ. అయ్యవసరంబునం దక్కినదొరలును దలపడి యతిభీమంబుగా సంగ్రామంబు సేయం దొడంగిన. 179

చ. అనుజతనూజమంత్రిసుభ♦టాప్తజనంబులపోరు సూచి నె
మ్మనమునఁ బొంగి మై పెనిచి ♦ మత్స్యమహీరమణుండు సారథిం

---

తా.—విరాటుని తమ్ముఁ డయిన సూర్యదత్తుఁడు రథమును మండలగతులం ద్రిప్పుచు తనబలము వెల్లడి యగునట్లు తాఁకి యితఁడే మహాశూరుఁ డని యందఱు కొనియాడునట్లు విజృంభించి యేనుఁగు సమూహములను నఱకెను.

177. ప్రియంబునన్ = సంతోషముతో. ఉల్లసనంబునన్ = కాంతిచేత. శత్రునేత్రముల్ = శత్రువులకన్నులను. చీఁకటుల్. కప్పఁగన్. రణముఖంబు = యుద్ధము ముందరిభాగము. ఉప్పరవీదిన్ = ఆకాశమార్గమున. ఉగ్రగతిన్ = భయంకర మయినవిధమున. పఱతెంచి = వచ్చి. తాఁకినన్ = ఎదిరింపఁగా. తా.—శంఖుఁ డప్పుడు పెండ్లికిఁ బోవునట్లు ముఖమున సంతోషము గలవాఁడై శత్రువులకన్నులు కానరానియట్లు శస్త్రాస్త్రములు ప్రయోగించుచు యుద్ధముముందరికి వేగమున రథమును దోలికొని వచ్చి భయంకరుండై యెదిరించెను. చతుర్థపాదమునం దతిశయోక్త్యలంకారము.

178. మందరఅచలచటుల విమర్దనమునన్ = మందరపర్వతముయొక్క యధిక మయిన రాపిడిచేత. ఘూర్ణమానము ఐ = తిరుగుచున్నదై. గాఢసంక్షోభము = అధిక మయిన కలఁగుట. ఎసఁగన్ = అతిశయింపఁగా. తలఁకు జలనిధి నాన్ = చలించునట్టి సముద్రమో యనునట్లు. త్రిగర్తక్షితి ఈశుబలము = సుశర్మయొక్క సైన్యము. సంకులము కాఁగన్. తిరుగుడుపడియెన్. తా.—మందరపర్వతముతో మథించునపుడు తిరుగుడు పడుచున్న సముద్రమో యనునట్లు సుశర్మసైన్యము కలఁత నొందెను. అలం:—ఉత్ప్రేక్ష.

179. అతిభీమంబుగాన్ = మిక్కిలి భయంకరముగా. సంగ్రామంబు = యుద్ధమును.

180. అనుజ తనూజ మంత్రి సుభట ఆప్తజనంబుల పోరు = తమ్ములయొక్కయుఁ గొడుకులయొక్కయు మంత్రులయొక్కయు మేలిబంటులయొక్కయు బంధుజనులయొక్కయు యుద్ధమును. నెమ్మనమునన్ = నిండుమనస్సునందు. మై = దేహమును. పెనిచి = వృద్ధిపొందించి. మత్స్యమహీరమణుండు = విరా

గనుఁగొని యల్ల గట్టిమొనన్ ♦ గ్రాలుచు నున్నత్రిగర్తనాథుకే
తనమునచక్కటిన్ మనర♦థంబు వెసం జన నిమ్ము నావుడున్. 180

క. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు సడల విడిచి ♦ పటురయమున నా
మొగ్గరము దఱియఁ బఱపిన, మ్రగ్గెను రథపంచశతము ♦ మత్స్యాధిపుచేన్.

మ. అవనీనాయకుఁ జూచి యేచి ఘనవీ♦రావేశదుర్దాంతమై
కవిసెన్ కుంతముసుండితోమరగదా♦ఖడ్గాదిశస్త్రాస్త్రతీ
వ్రవిహారంబు విరోధిదుర్విషహసం♦రంభంబుగా నొక్కపె
ట్ట వడిం దద్బల మెల్ల నారదుఁడు వే♦డ్కం గుంచె సారింపఁగన్. 182

వ. ఇవ్విధంబున విరాటుండు దానును సేనయుం జేయం గలవారును బరవసంబు
సేసి యొక్కుమ్మడి నడరుటయుం దెరలి మరలిననిజసైన్యంబు దైన్యంబు గలయం

---

టరాజు. అల్లగట్టి మొనన్ = ఆ గొప్ప సేనయందు. క్రాలుచున్ = కదలుచు. ఉన్నత్రిగర్తనాథు కేతనమున చక్కటిన్ = ఉన్నట్టి సుశర్మయొక్క టెక్కెముయొక్క సమీపమును గూర్చి. నావుడున్—అని విరాటుఁడు చెప్పఁగా. తా.—తమ్ములు మొదలగువారు చేయుయుద్ధమును జూచి సంతోషించినవాఁడై విరాటరాజు సారథితోఁ దనరథమును సుశర్మధ్వజము కనఁబడుచోటికిఁ దోలు మనఁగా.

181. అగ్గలికన్ = ఉత్సాహముతో. హయముల= గుఱ్ఱములయొక్క. పటురయమునన్ = మిక్కిలి వేగముచేత. ఆమొగ్గరము = ఆవ్యూహము. తఱియన్ = చేరునట్లు. పఱపినన్ = తోలఁగా. మత్స్యఅధిపుచేన్ = విరాటరాజుచేత. రథపంచశతము = తేరుల యేనూఱు. మ్రగ్గెను= పడెను. తా.—సారథి విరాటునిరథము న్నా సేనయొద్దకుఁ దోలఁగానే విరాటుఁ డేనూఱురథములను నుఱుమాడెను.

182. అవనీనాయకున్ = విరాటరాజును. ఏచి = విజృంభించి. ఘనవీరావేశ దుర్దాంతమై= గొప్పదైన వీరరసముయొక్క యావేశముచే నణఁపరానిదై. తత్ బలము = ఆవిరాటుని సైన్యము. కుంత...విహారంబు—కుంత = ఈఁటెలును, ముసుండి = కొయ్యగుదియలును, తోమర = చిల్లకోలలును, గదా = గదలును, ఖడ్గ = కత్తులును, ఆది = మొదలుగాఁ గల, శస్త్రఅస్త్ర = శస్త్రములయొక్కయు అస్త్రములయొక్కయు, తీవ్ర = భయంకర మయిన, విహారంబు = క్రీడ. విరోధిదుర్విషహసంరంభంబుగాన్ = శత్రువులకు సహింపరాని వేగము గలది కాఁగా. ఒక్కపెట్ట = ఒకటేసారిగా. నారదుఁడు. వేడ్కన్ = వినోదముచేత. కుంచె = నెమిలిపురిని. సారింపఁగన్ = ఆడింపఁగా. వడిన్. కవిసెన్. తా.—విరాటుఁడు యుద్ధమునకు వచ్చుటను జూచి వానిసేన యంతయు మిక్కిలి వీరావేశము నొందినదై శత్రువు లోర్వరాని యట్లు నానావిధశస్త్రాస్త్రములు ప్రయోగించుచు నారదుఁడు సంతోషముతో నెమిలికుంచె నాడించునట్లు శత్రుసేనలం దాఁకెను.

183. చేయంగలవారును = శూరులును. బరవసంబు = ధైర్యమును. ఒక్కఉమ్మడిన్ = ఏక కాలమునందు. తెరలి = చలించి. దైన్యంబు = దీనత్వమును. కెంపు = ఎఱుపు. కదురులోచన్నం

గనుంగొని కోపాటోపంబునం గెంపు గదురులోచనంబులుం బెంపొలయుభుజ శిఖరంబులుం గలిగి సుశర్మ తానుం దమ్ముండును సంగడంబుగాఁ గోల్తల సేసి రథ సమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని. 183

క. బలవిక్రమములు మెఱయఁగఁ, దలపడి రథదంతిహయపదాతిచయంబుల్
గలను సుడివడఁగఁ దామర, కొల నేనుఁగు సొచ్చినట్లు గూల్పఁగఁ జొచ్చెన్.

ఉ. ఏలినవానిఁ గాంచి మొన లెల్లను నెంతయు దర్ప మెక్కి యా
భీలనిశాతహేతిరుచిభీకరలీల నెదిర్చి మత్స్యభూ
పాలకసైన్యరాజిఁ దలపడ్డ మహోగ్రతఁ బేర్చి యాసమి
త్కేళి వియచ్చరప్రతతికిన్ వెఱఁ గందఁగఁ జేసె నెంతయున్. 185

గీ. కడిమి మెఱయంగఁ బోరుత్రిగర్తనాథు, రథముఁ గనుఁగొని కడఁగి విరాటవిభుఁడు
వరవునకు నల్గినట్టుల నరకుగొనక, యతులరభసాతిరేకత నతనిఁ దాఁకె. 186

( విరాటుఁడు సుశర్మమీఁదఁ దనరథంబు తోలించి పోరుట. )

వ. ఇట్లు దలపడి. 187

---

బులున్ = కలుగునట్టి కన్నులును. పెంపు = ఔన్నత్యమును. ఒలయుభుజశిఖరంబులున్ = పొందునట్టి మూఁపులును. సంగడంబుగాన్ = జతగా. కోల్తల = యుద్ధప్రయత్నమును.

184. బలవిక్రమములు = బలమును పరాక్రమమును. రథదంతిహయపదాతిచయంబుల్ = తేరులయొక్కయు నేనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయుఁ గాల్బలముయొక్కయు సమూహములు. కూల్పఁగన్ = పడఁగొట్టుటకు. చొచ్చెన్ = ప్రవేశించెను. తా.—బలపరాక్రమములతో సైన్యములను వధియించుటకై ఏనుఁగు తామరకొలను జొచ్చువిధంబున విరాటుని వ్యూహముఁ జొచ్చెను.

185. ఏలినవానిన్ = రాజయిన సుశర్మను. మొనలు = సేనలు. ఎంతయున్ = మిక్కిలి. దర్పము ఎక్కి = గర్వము గలవై. అభీలనిశాతహేతిరుచిభీకరలీలన్ = భయంకర మయిన వాఁడి యయిన యాయుధములకాంతులచే వెఱపుగొలుపు విలాసముచేత. మత్స్యభూపాలకసైన్యరాజిన్ = విరాటరాజుసేనల సమూహమును. మహత్ ఉగ్రతన్ = మిక్కిలి కోపముతో. పేర్చి = చెలరేఁగి. తలపడ్డన్ = ఎదిరింపగా. ఆసమిత్ కేళి = ఆయుద్ధక్రీడ. వియచ్చరప్రతతికిన్ = దేవతల సమూహమునకు. వెఱఁగు = ఆశ్చర్యమును. తా.—సుశర్మసేనలు తమరాజుం జూచి గర్వము నొందినవై భయంకర మయిన యాయుధములతో విరాటరాజుసేనల నెదిరింపఁగా వారలయుద్ధము దేవతల కాశ్చర్యము గలిగించెను.

186. కడిమి = పరాక్రమము. వరవునకున్ = సేవకునిమీఁద. అతులరభసఅతిరేకతన్ = సాటిలేని వేగముయొక్క యతిశయము కలవాఁ డగుటచేత. అతనిన్—సుశర్మను. తా.—పరాక్రమముతో యుద్ధము చేయుచున్న సుశర్మను జూచి విరాటుఁడు సేవకునిమీఁదఁ గోపించినట్లు వానిమీఁద నలక్ష్యముగాఁ గోపము గలవాఁడై యెదిరించెను.

మ. పటువేగం బగుశాతభల్లచయసం♦పాతంబునన్ మింట ని
క్కటమై మంట ధగద్ధగద్ధగ యనం ♦ గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించున ట్లిరువురున్ ♦ శౌర్యోన్నతిం బోరి రు
త్కటదర్పోద్ధతు లై పరస్పరజయా♦కాంక్షం బ్రచండంబుగన్. 188

క. తదవసరంబున నొక్కటఁ, బదియమ్ములు దొడి త్రిగర్త♦పతివక్షంబున్
వదనంబు నేసి విరటుఁడు, పదమునఁ దురగముల నేసె ♦ మఱియుఁ బదింటన్.

క. ఇంచుకయు నీడఁబోవక, కాంచనపుంఖప్రకాండ♦కాంతిస్ఫాయ
త్పంచాశద్బాణంబును, నించె నతఁడు మత్స్యమేది♦నీపతిమేనన్. 190

గీ. వారలు దలపడ్డ నాహవ♦దోహలమున, నుభయబలములుఁ దమకించి♦యోటలేక

---

188. పటువేగంబు = ఎక్కుడు వేగము గలది. శాతభల్లచయసంపాతంబునన్ = కఱకుబాణములసమూహముయొక్క ప్రయోగముచేత. మింటన్ = ఆకాశమునందు. రూపంబులు ఐ = రూపములు గలవియై. చటులక్రీడన్ = అధిక మయినవిలాసముతో. ఇరువురున్ = విరాటసుశర్మలు. శౌర్యఉన్నతిన్ = పరాక్రమముయొక్క యతిశయముచేత. ఉత్కటదర్పఉద్ధతులు ఐ = అధిక మయిన గర్వముచేఁ గ్రొవ్వినవారై. పరస్పరజయ ఆకాంక్షన్ = ఒండొరుల జయమునందలి కోరికచేత. ప్రచండంబుగన్ = భయంకరముగా. పోరిరి అని యన్వయము. తా.—ఆవిరాటసుశర్మ లిద్దఱును ఒండొరులమీఁదఁ బ్రయోగించు బాణములు తాఁకి యాకాశంబున మంటలు పుట్టఁగా ఒకరినొకరు జయింపఁ గోరినవారై కోపమే రెండురూపములు దాల్చి పోరుచున్నదో యనునట్లు శౌర్యాతిశయముచే యుద్ధము చేసిరి.

189. తత్ అవసరంబునన్ = ఆ సమయమునందు. ఒక్కటన్ = ఏకకాలమునందు. తొడి = తొడిగి. త్రిగర్తపతివక్షంబున్ = సుశర్మ ఱొమ్మును. వదనంబున్ = ముఖమును. తురగములన్ = గుఱ్ఱములను. మఱియుఁ బదింటన్. ఏసెన్ అని యన్వయము. అప్పుడు విరాటుఁడు పదిబాణములచే సుశర్మ ఱొమ్మునను ముఖమునను గొట్టి మఱిపది బాణములచే గుఱ్ఱముల నొంచెను.

190. ఈడఁబోవక = వెనుదీయక. కాంచన.....బాణంబును—కాంచనపుంఖప్రకాండ = శ్రేష్ఠ మయిన బంగారుపింజలయొక్క, కాంతి = కాంతులచేత, స్ఫాయత్ = ఒప్పుచున్న, పంచాశత్ బాణంబును = ఏఁబదిబాణములను. అతఁడు = ఆసుశర్మ. మత్స్యమేదినీ పతిమేనన్ = విరాటునిదేహమునందు. నించెన్. తా.—సుశర్మ కొంచెమైనను వెనుదీయక విరాటునిదేహమునం దుత్తమము లయిన యేఁబదిబాణములు నాటెను. పంచాశత్ బాణంబును—సంఖ్యాపూర్వక మయిన కర్మధారయము "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" అని నిషిద్ధ మగుటవలన నిట సమాహారద్విగు వని యెఱుంగునది. స్ఫాయత్—అనుపాఠాంతరముపక్షమున స్ఫాయిధాతువు ఆత్మనేపద మగుటచే స్ఫాయత్ అని శత్రంతరూప ముపపన్నము కాదు.

191. తలపడ్డన్ = ఎదిరింపఁగా. ఆహవదోహలమునన్ = యుద్ధమునందలి యాశచేత. ఉభయబలములున్ = ఇద్దఱి సేనలును. తమకించి = ఉత్సహించి. ఓట = సంకోచము. బెఱసి =

కలయ బెరసి భూరేణుప్ర♦కతన రాత్రి, గాక మున్న యొండొరువులఁ ♦ గానరైరి.

క. క్షతములఁ బెల్లు తొరఁగుశో, ణితము రజఃపటల మడఁచి ♦ నెఱసిన నరుణ
ద్యుతిఁ దమము వాపువేకువ, గతిఁ దత్సమయం బతిప్ర♦కాశత నొప్పెన్. 192

ఉ. దానికిఁ జిత్తవృత్తులు ము♦దంబునఁ బొందఁగ మేను లుబ్బఁగా
సేనలు రెండు నుద్భటవి♦జృంభణతన్ వివిధాస్త్రఘట్టన
ధ్వానము దిక్కులం బరఁగఁ ♦ దాఁకి రణం బొనరించె నత్తఱిన్
భానుఁడు పశ్చిమాద్రి గను♦పట్టెఁ దలిర్చినమావిమోకనన్. 193

క. సమరంబున భటులు గడు, న్శ్రమ మొందిరి తమము గవిసి♦నం గాని సము
ద్యమసంరంభ ముడుగ రిది, సమయం బని తొలఁగినట్లు ♦ సవితృఁడు గ్రుంకెన్.

వ. తదనంతరంబు. 195

క. ముఱిముఱిచీఁకటియప్పుడు, నఱిముఱి భటు లుడుగ కడరి ♦ యని సేయంగా

---

వ్యాపించి. భూరేణుప్రకతనన్ = నేలదుమ్ముచేత. తా.—విరాటసుశర్మలు యుద్ధమునఁ బూనుటచే వారిసేనలు రెండును ఒండొరుల నెదిరించుటచే రేఁగినదుమ్మువలన రాత్రి కాకమునుపే కన్నులు కానరైరి.

192. క్షతములన్ = గాయములనుండి. పెల్లు = అధికముగా. తొరఁగు శోణితము = కాఱునట్టి నెత్తురు. రజఃపటలము = దుమ్ముసమూహమును. నెఱసినన్ = నిండఁగా. అరుణద్యుతిన్ = ఎఱ్ఱనికాంతిచేత. తమము = చీఁకటిని. పాపువేకువగతిన్ = పోఁగొట్టునట్టి ప్రాతఃకాలమువలె. తత్సమయంబు = ఆకాలము. తా.—గాయములనుండి కాఱు నెత్తురు దుమ్ము నడఁచి యంతటను బ్రవహింపఁగా దాని యెఱ్ఱనికాంతిచే నాసమయము ప్రాతఃకాలమువలెఁ బ్రకాశించెను.

193. దానికిన్ = అట్లు ప్రకాశము కలుగుటకు, ముదంబునన్ = సంతోషమును. ఉద్భట విజృంభణతన్ = అధిక మయిన విజృంభణము గల వగుటచేత. వివిధఅస్త్రఘట్టనధ్వానము = పలువిధము లగు నాయుధములయొక్క యొరయికయొక్క ధ్వని. పరఁగన్ = వ్యాపించునట్లు. రణంబు = యుద్ధమును. భానుఁడు = సూర్యుఁడు. పశ్చిమఅద్రిన్ = పడమటికొండయందు. తలిర్చినమావిమోక అనన్ = చిగిరించిన మామిడిమొలకయో యనునట్లు. కనుపట్టెన్. తా.—అట్లు వెలుతురు కలుగుటకు రెండు సేనలును సంతోషించినవై విజృంభించి శస్త్రాస్త్రములయొరయికచేఁ గలుగు ధ్వని యధిక మగునట్లు ఒండొరులం దాఁకి యుద్ధము చేసెను. అపుడు సూర్యుఁడు చిగిరించినమామిడి మొలకవలెఁ బడమటికొండఁ జేరెను. అలం. ఉత్ప్రేక్ష.

194. సమరంబునన్ = యుద్ధమునందు. తమము = చీఁకటి. కవిసినం గాని = కలిగినవేతప్ప. సముద్యమసంరంభము = ప్రయత్నముయొక్క వేగమును. ఉడుగరు = విడువరు. సవితృఁడు = సూర్యుఁడు. గ్రుంకెన్ = అస్తమించెను. తా.—అలసట నొందియున్నభటులు చీఁకటి పడినం గాని యుద్ధమును విడువ రని తొలఁగినాఁడో యనునట్లు సూర్యుఁ డస్తమించెను. అలం. ఉత్ప్రేక్ష.

196. ముఱిముఱిచీఁకటి యప్పుడున్ = కొంచెము చీఁకటి కలిగినప్పుడు కూడ. అఱిముఱిన్ = ఉత్సాహముతో. అని = యుద్ధమును. నెఱసి = వ్యాపించి. తమము = చీఁకటి. పాసి = తొలఁగి.

నెఱసి తమ మెల్లయెడఁ గ్రి, క్కిఱిసిన మఱి పాసి నిలిచి ♦ రింతను నంతన్. 196

వ. ఇట్లుభయసైనికులు సాంద్రసంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు దక్కి
తమకం బెక్క నెక్కింతసే పూర కున్నంత. 197

క. తనమనుమలు పాండుతనయు, లని సేఁతకు వేడ్కసేయు ♦ టాత్మఁ గని తమం
బున వారు మెఱయ రని వ, చ్చినక్రియ శశి పూర్వశైల♦శిఖరం బెక్కెన్. 198

క. వెలుఁగు గని కడఁగి యిరువాఁ, గులుఁ బోరికి జొచ్చె మాత్స్య♦కుంజరుఁడును న
గ్గల మగుమగఁటిమిసొంపున, దలపడియె సుశర్ముతోడఁ ♦ దదనుజుతోడన్. 199

ఛ. తలపడి పోర వారియర♦దంబు లనేకము లొక్క పెట్ట యి
ట్టలపురయంబునం బొదివి ♦ డాసి గడంగి వడిం ద్రిగర్తనా
థులు నిరు తేరుఁ దద్రథము♦తోఁ గదియించి తదీయసారథిన్
బలువిడిఁ గూల్చి రథ్యముల♦ప్రాణములం గొని రుగ్రమూర్తులై. 200

---

తా.—కొంచెముగాఁ జీఁకటి వ్యాపించినపుడుకూడ సైనికులు విడువక యుద్ధము చేయుచుండి చీఁకటి యధికము కాఁగానే చేయునది లేక యుద్ధము మాని యచ్చటచ్చట నిలిచిరి.

197. సాంద్రసంతమసంబునన్ = గాఢాంధకారమునందు. సంగ్రామంబు = యుద్ధమును. తమకంబు = ఉత్సాహము.

వ్యా.—సంతమసంబు—వ్యు. సమ్+తమస్. తమశ్శబ్దము అవ సమ్ అన్ధపూర్వకమై యకారాంత మగును. ఇట్లు అవతమసము, అంధతమసము.

198. అని=యుద్ధమును. చేఁతకున్ = చేయుటకు. వేడ్క చేయుట= కోరుటను. ఆత్మన్= మనస్సునందు. తమంబునన్ = చీఁకటియందు. శశి = చంద్రుఁడు. పూర్వశైలశిఖరంబు = తూర్పుకొండకొమ్మును. తా.—తనవంశమునందుఁ బుట్టిన పాండుపుత్త్రులు యుద్ధము సేయఁ గోరుచున్నారని తెలిసి చంద్రుఁడు వారికిఁ జీఁకటి లేక పోవలయు నని తా నుదయించినాఁడో యనునట్లు చంద్రుఁడుదయించెను. అలం. ఉత్ప్రేక్ష.

199. ఇరువాఁగులున్ = రెండుసైన్యములును. మాత్స్యకుంజరుఁడునున్ = మత్స్యదేశరాజులలో శ్రేష్ఠుఁ డయిన విరాటుఁడును. అగ్గలము = అధికము. మగఁటిమి = శౌర్యముయొక్క. తత్ అనుజుతోడన్ = వాని తమ్మునితోను. తలపడియెన్ అని యన్వయము. తా.—వెలుతురు చూచి రెండుసేనలును బోర నారంభించెను. విరాటుఁడును శౌర్యము చేత సుశర్మను వాని తమ్ముని నెదిరించెను.

200. పోరన్ = యుద్ధమునందు. ఇట్టలపురయంబునన్ = అధిక మయిన వేగముచేత. పొదివి = ముట్టడించి. త్రిగర్తనాథులున్ = సుశర్మయు వాని తమ్ముఁడును. ఇరు తేరున్ = రెండు తేరులను. తత్ రథముతోన్ = ఆవిరాటునిరథముతో. రథ్యముల = గుఱ్ఱములయొక్క. ఉగ్రమూర్తులు ఐ = భయంకర మయిన యాకారము గలవారై. తా.—ఎదిరించి వారి రథములను బెక్కింటిని ముట్టడించి తాఁకెను. అంత సుశర్మయు వాని తమ్ముండును గోపించి తమ రెండురథములను విరాటుని రథముమీఁదికిఁ దోలి వాని సారథిని వధించి గుఱ్ఱములఁ జంపిరి.

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. 201

చ. అతిరభసంబుమై నడరి ♦ యాతనిఁ బట్టి సుశర్మ పెల్చ నా
ర్చి తనరథంబుపై నిడి య♦శేషబలంబులు బల్దెసక్ భయ
ద్రుతగతిఁ బాఱెనక్ విజయ♦దుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతివిభవంబునక్ మది ము♦దం బొలయక్ మరలెక్ మహోద్ధతిన్. 202

వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరం బగుచిత్తంబుతో
మత్స్యవిభునివలను సూపుచు నిట్లనియె. 203

గీ. ఇతనియాశ్రయమున మన ♦ మెల్ల బ్రదికి, యున్నవారము గావున ♦ నుగ్రరిపుల
పాలువడకుండవిడిపింపఁ♦బాడియితని, నెయిదుమెయిదుమురథరయ♦మెసక మెసఁగ.

చ. అనవుడు మేను వెంచుచు మ♦హాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను నిదె సాలవృక్షము ర♦యంబున దీన నరాతిసేన డొ
ల్ల నడిచి యీసుశర్మునిబ♦లంబుఁ జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదక్ రణప♦టుత్వము వైరులు పిచ్చలింపఁగన్. 205

201. విరథుండు = పోయిన రథముగలవాఁడు.

202. అతిరభసంబు మైక్ = మిక్కిలి వేగిరపాటుచేత. అడరి = విజృంభించి. పెల్చక్ = కోపముతో. అశేషబలంబులు = ఎల్లసేనలు. బల్దెసక్ = గొప్ప దురవస్థచేత. భయద్రుతగతిక్ = భయముచే శీఘ్రమయిన గమనముచేత. విజయ దుందుభులు = గెలుపుఁ దెలుపునట్టి వాద్యములు. విక్రమోద్ధతి విభవంబునక్ = పరాక్రమముచేఁ గలిగిన గర్వముయొక్క యతిశయముచేత. మదిక్ = మనస్సునందు. ముదంబు = సంతోషము. మహాత్ ఉద్ధతిక్ = గొప్పగర్వముచేత. మరలెక్. తా.—మిక్కిలి వేగముగా విజృంభించి సుశర్మ విరాటునిఁ బట్టికొని సింహనాదము చేసి విరాటుని సేనలు మిక్కిలి కష్టపడి భయముచేఁ బాఱఁగా జయదుందుభులు మ్రోయఁగా పరాక్రమగర్వముచే సుశర్మ మరలి పోయెను.

203. సత్వరంబు = వేగముతోఁ గూడినది. మత్స్యవిభునివలను = విరాటరాజుదిక్కు.

204. ఇతని ఆశ్రయమునక్ = ఈ విరాటరాజుయొక్క ఆశ్రయముచేత. ఉగ్రరిపులపాలు = భయంకరు లగు శత్రువుల యధీనతను. పాడి = ధర్మము. రథరయము = తేరుయొక్క వేగము. ఎసకముఎసఁగక్ = అతిశయింపఁగా. ఎయిదుము ఎయిదుము = వెంబడింపుము వెంబడింపుము. తా.—ఈవిరాటునియాశ్రయమున మన మింతకాలము బ్రదికితిమి కావున నావిరాటుని శత్రువులచేతిలోఁ బడనియ్యక రక్షించుట మనకు ధర్మము నీవు శీఘ్రముగా రథము తోలుకొని వాని వెంబడింపుము.

205. మహాబలనందనుఁడు = వాయువు కుమారుఁ డయిన భీముఁడు. సాలవృక్షము = మద్దిచెట్టు. రయంబునక్ = వేగముచేత. అరాతిసేనక్ = శత్రుసేనను. డొల్లక్ = చచ్చునట్లు. అడిచి = కొట్టి. చలంబును = పూనికను. రణపటుత్వము = యుద్ధమునందలి సామర్థ్యమును. వైరులు = శత్రువులు. పిచ్చలింపఁగక్ = కొనియాడఁగా. విడిపించెదక్. అని యన్వయము. తా.—

గీ. నీవుఁ దమ్ములు నొక్కెడ ♦ నిలిచి చూచు
చుండుఁ డని పల్కుటయుఁ బుయి♦లోటతోడఁ
గీచకారాతిఁ దప్పక ♦ చూచి నగుచు
నతని కిట్లని చెప్పె ధ♦ర్మాత్మజుండు. 206

క. తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని ♦ నుభయబలము న
చ్చెరు వందుచుఁ జూచి వృకో, దరుఁడ వగుట యెఱుఁగకున్నె ♦ తద్విధ మేలా. 207

వ. కవలు నీకుఁ జక్రరక్షకులుగా లోకసామాన్యంబు లైనచాపకృపాణగదాదు లగు నాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము. 208

చ. అనుపలు కంకుశంబునక్రి♦యం గుదియించిన నిల్చి భూరుహం
బునదెస వోక మత్తగజ♦పుంగవుచందమునన్ సమీరనం
దనుఁడు శరీరదోళనవి♦ధాపరిశోభితవిక్రమోద్యమం
బున విలసిల్లి యిట్టు లను ♦ భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 209

---

ధర్మరాజుమాట విని భీముఁడు తన యన్నతో నిట్లనియెను. ఈసాలవృక్షమును బెల్లగించి దీనిచే శత్రుసేనల వధించి సుశర్మ నోడించి శత్రువులు కొనియాడునట్లు విరాటుని విడిపించెదను.

206. పుయిలోటతోడన్ = సంకోచముతో. కీచక అరాతిన్ = కీచకునకు శత్రు వయిన భీముని. తా.—నీవును నకుల సహదేవులును వేడుకచూచుచుండుఁ డని భీముఁడు చెప్పఁగా ధర్మరాజు దాని కంగీకరింపక భీమునితో నవ్వుచు నిట్లు చెప్పెను.

207. తరువున్ = చెట్టును. ఉరవడిమైన్ = మిక్కిలి వేగముతో. కవిసితివేనిన్ = ఎదిరించినయెడ. వృకోదరుఁడవు = భీముఁడవు. తా.—నీవు చెట్టు పెఱికికొని యుద్ధమునకుఁ బోయిన పక్షమున రెండుసేనలును ఆశ్చర్యపడి చూచి నిన్ను భీమునిఁగా నెఱుంగుదురు. కావున నావిధము వలదు.

208. కవలు = నకుల సహదేవులు. చాపకృపాణ గదా ఆదులు = ధనుస్సు కత్తి గద మొదలగునవి. ఆపాదించి = చేసి.

209. అంకుశంబునక్రియన్ = అంకుశమువలె. కుదియించినన్ = నిలుపఁగా. భూరుహంబునదెస = చెట్టువైపు. మత్తగజపుంగవు చందమునన్ = మదపుటేనుఁగు శ్రేష్ఠమువలె. సమీరనందనుఁడు = భీముఁడు. శరీరదోళన విధాపరిశోభిత విక్రమ ఉద్యమంబునన్ = దేహముయొక్క కదలించుటయొక్క చేయుటచేఁ బ్రకాశించుచున్న పరాక్రమముకొఱకు ప్రయత్నముచేత. భ్రూకుటి = బొమముడి. ఫాలము = నుదుటి ప్రదేశమును. అలంకరింపఁగన్. ఇట్టులు. అనున్ అని యన్వయము. తా.—ధర్మరాజు మాట యంకుశమువలెఁ దన్ను నిలుపఁగా నాభీముఁడు వృక్షమువైపు పోవక మదపుటేనుఁగువలె దేహము నాడించుచుఁ బరాక్రమమును వహించి బొమముడిపాటు గలవాఁడై యిట్లనియెను.

వ్యా.—అంకుశంబున క్రియన్, భూరుహంబున దెస—ఇట షష్ఠీసమాసము నందు నగాగమము.

క. మీపనిచినట్లు చేసెద, నేపారినవైరిబలము ♦ నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్యమ, హీపతి విడిపించి తెచ్చి ♦ యిచ్చెద మీకున్.210

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతవట్టునుం గూడుకొని. 211

( పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట. )

గీ. తాను మున్నుగ శాత్రవ♦సేనమీఁద
రథము లొక్కటఁ బఱపెను ♦ బృథివి యద్రువ
నుఱక యేచి త్రిగర్తులు ♦ నుద్ధతముగఁ
జెలఁగి మార్కొని పొదివి సం♦కులము గాఁగ. 212

క. ఏయుచుఁబొడుచుచు వ్రేయుచు, డాయుచు నుద్వృత్తిఁ దఱుము♦టయుఁ బొడి సేసెన్
వాయుసుతుఁడు రథముల నిరు, వేయిటి రథిరథ్యసూత♦వితతంబులు గాన్. 213

గీ. ఏడునూఱురథంబుల ♦ నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నూటి♦నాను మడఁచె

210. మీపనిచినట్లు అ = మీ రాజ్ఞాపించినట్లే. ఏపారినవైరిబలమున్ = అతిశయించిన శత్రుసేనను. బాహాటోపమునన్= భుజగర్వముచేత. ఓర్చి = ఓడించి. తా.—మీ రాజ్ఞాపించినట్లే శత్రుసేన నంతయు నోడించి విరాటుని విడిపించి మీ కొప్పగించెదను.

211. కౌంతేయఅగ్రజుండు = కుంతికొడుకులయందుఁ బెద్దవాఁడయిన ధర్మరాజు. తమయంత వట్టునున్ = తామందఱును.

212. శాత్రవసేనమీఁదన్ = శత్రువులదండుమీఁద. పృథివి= భూమి. అద్రువన్. ఒక్కటన్ పఱపెను. ఉఱక = లక్ష్యము చేయక. ఏచి = విజృంభించి. ఉద్ధతముగన్ = గర్వించినట్లుగా. మార్కొని = ఎదుర్కొని. సంకులము గాఁగన్ = దొమ్మి యగునట్లు. పొదివి = ఆక్రమించి. తా.—ధర్మరాజును భీమ నకుల సహదేవులును దమరథములను సుశర్మసేనమీఁదికిఁ దోలిరి. వారును వెనుదీయక యెదుర్కొనిపోరిరి. పఱపెను—211 వ వచనమునందుఁ గౌంతేయాగ్రజుఁడు కర్తగా నను వర్తించుటవలనను, ఇట నాత్మార్థక మగు తానుశబ్దము ప్రయుక్త మగుటవలనను క్రియ కేకవచనము. "ఆత్మార్థం బభిహితం బగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయివచనంబు ధాతువిశేషణంబుల కగు" అని బాలవ్యాకరణసూత్రము. కావునఁ బఱపిరి అను బహువచనాంతపాఠము బహువచనాంతకర్తృపదము లేకుండుటవలనను పూర్వవచనమునందలి "తమయంతవట్టును" అనునది తానుశబ్దమున మరలఁ గౌంతేయాగ్రజుఁడు పరామృష్టుఁ డగుటచే నప్రధానం బగుటవలనను భ్రామాదికము.

213. డాయుచున్ = సమీపించుచు. ఉద్వృత్తిన్ = గర్వముచేత. ఇరువేయిటిన్ = రెండువేలను. రథిరథ్యసూతవితతంబులుగాన్ = రథికులును గుఱ్ఱములును సారథులును వ్యర్థులుగాఁ గలవి యగునట్లుగా. పొడి చేసెన్ అని యన్వయము. తా.—సుశర్మసేనలు ఎదిరించి పోరఁగా భీముఁ డప్పుడు రెండువేలరథములను రథికులు మొదలగువారిని వధించి చూర్ణము చేసెను.

214. ఏపుమాపెన్ = కూల్చెను. అతనిఅనుజుండు = సహదేవుఁడు. కుంతీసుతఅగ్రజుండు=

నతనియనుజుండు కుంతీసు♦తాగ్రజుండు, రథికముఖ్యుల వేవురఁ ♦ బృథివిఁ గూల్చె.

వ. అతండు మఱియును. 215

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతి♦దారుణ భంగి రణంబు సేయ వాఁ
డుఱక నిశాతసాయకము ♦ లొక్కమొగిం బది మేనియందుఁ గ్రి
క్కిఱియఁగఁ జేసి నాలుగిట ♦ నేసెఁ దురంగముల న్యుధిష్ఠిరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ ద♦దశ్వములం బటుబాణపాణి యై. 216

వ. అయ్యవసరంబున మత్స్యమహీనాథుండు జనితోత్సాహుండై. 217

గీ. ఆసుశర్మ తేరి♦యందున్న ఘనగదా, దండ మెత్తికొని యు♦దగ్రవృత్తి
జరఠదేహుఁ డయ్యుఁ ♦ దరుణవయస్కున, ట్లవని కెరఁగి పోయి ♦ యతని వ్రేసె.

క. అట్టిసమయమునఁ గరువలి, పట్టి త్రిగర్తేశురథము♦పై కుఱికి వెసం
బట్టికొని యతనిఁ బెడకేల్, గట్టి పెలుచ నార్చెఁ దద్బ♦లము పెల్లగిలన్. 219

వ. ఇట్లు సుశర్మం బరాజితుం జేసినఁ జక్రరక్షకుం డైనశోణాశ్వుండు మొదలుగా

---

ధర్మరాజు. రథికముఖ్యులన్ = రథికులయందు శ్రేష్ఠులను. వేవురన్ = వేయిమందిని. తా.—నకులుఁడు ఏడునూఱులరథములను సహదేవుఁడు మున్నూఱుతేరులను ధర్మరాజు వేయిరథికులను గూల్చిరి.

215. అతండు = ఆధర్మరాజు.

216. కిట్టి = సమీపించి. అతిదారుణభంగిన్ = మిక్కిలి భయంకర మయిన విధమున. వాఁడు = ఆసుశర్మ. ఉఱక = లక్ష్యముసేయక. నిశాతసాయకములు = వాఁడిబాణములను. ఒక్కమొగిన్ = ఒకమాటుగా. యుధిష్ఠిరుండు = ధర్మరాజు. అఱిముఱిన్ = వేగముచేత. పటుబాణపాణియై = దృఢము లయిన బాణములు చేతియందుఁ గలవాఁడై. సారథిన్. తత్ అశ్వములన్ = వాని గుఱ్ఱములను. చంపెన్. తా.—సుశర్మను దాఁకి యుద్ధము చేయఁగా నాసుశర్మ పదిబాణములచే ధర్మరాజు నొప్పించి నాలుగుబాణములచే నతనిగుఱ్ఱములను గొట్టెను. అంత ధర్మరాజు వాఁడిబాణములచే సుశర్మసారథిని గుఱ్ఱములను జంపెను.

217. జనితఉత్సాహుండు ఐ = కలిగిన యుత్సాహము గలవాఁడై.

218. ఘనగదాదండము = గొప్పదండమువంటి గదను. ఉదగ్రవృత్తిన్ = గర్వముతోడియునికిచేత. జరఠదేహుఁడు = ముదిసినదేహము గలవాఁడు. తరుణవయస్కునట్లు అ = చిన్నవయస్సు గలవానివలెనే. అవనికిన్ = నేలకు. ఎరఁగి = దిగి. తా.—సుశర్మరథమునం దున్నవిరాటుఁడు అచ్చటనున్న యొక్కగదను తీసికొని ముసలివాఁడైనను పిన్నవానివలె నేలకు దిగి యాసుశర్మను గొట్టెను.

219. కరువలిపట్టి = భీముఁడు. పెలుచన్ = గట్టిగా. తత్ బలము = ఆసుశర్మయొక్క సైన్యము. తా.—అప్పుడు భీముఁడు సుశర్మరథముమీఁదికిఁ బోయి వానిం బట్టి పెడకెక్కలు గట్టి వానిసేనలు భయపడునట్లు సింహనాదము చేసెను.

220. పరాజితున్ = ఓడఁగొట్టఁబడినవానినిగా. ఆప్తభృత్యవర్గంబున్ = ప్రియు లయిన భృత్యులసమూహమును. అనుజుండు = తమ్ముఁడు. లోను = మొదలు. పలాయనపరాయణంబు =

నాప్తభృత్యవర్గంబు ననుజుం డైనసుశర్మలోనైన బంధుజనంబులు నాదిగాఁ గలపరివారంబు పలాయనపరాయణం బగుటయు వెనుకొని యెయిది గోధనవర్గంబు మరల్చి కరితురగరథంబులం దలమీఁటి పొదివి తెచ్చి యన్నపాలికి వచ్చి తాను మున్ను త్రిగర్తేశురథంబుకడ నిలువ నియోగించి యున్నతమ్ములం గూర్చుకొని తమయంతవట్టును నొక్కట విరాటునకుం బొడచూపిన. 220

క. ఆదరము సంభ్రమంబును, మోదంబును దనమనమున ♦ ముప్పిరిగొన నా
భూదయితుఁడు వివిధప్రియ, వాదంబుల గారవించె ♦ వారల నెల్లన్. 221

వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 222

క. మానముఁ బ్రాణముఁ గాచితి, దీనికి సరి గాఁగ నీమ♦దికిఁ బ్రియ మెసఁగం
గా నాకుఁ జేయ నయ్యెడు, దాని నెఱుఁగఁ గాన మత్ప♦దము గైకొనవే. 223

గీ. ఒడలు సిరియును నాకు నీ♦యొసఁగినవియ, కానఁ దగ సమర్పించెదఁ ♦ గరుణ నీవు
సమ్మతించి యిష్మత్స్వదే♦శంబుఁ గావు, పంచి పనిగొని నన్ను ర♦క్షించికొనుము.

వ. అనిన విని యజాతశత్రుం డతని కిట్లనియె. 225

చ. మనుజవరేణ్య నావలని♦మన్నన యట్టిద కాదె శత్రుమ
ర్దన మొనరించి మత్స్యనగ♦రంబున కుత్సవ ముల్లసిల్ల నీ

---

పరుగునందు ఆసక్తి కలది. ఎయిది = పోయి. తలమీఁటి = కడచి. కడన్ = సమీపమునందు. నియోగించి = నియమించి. పొడచూపినన్ = కనఁబడఁగా.

221. సంభ్రమంబును = వేగిరపాటును. మోదంబును = సంతోషమును. ముప్పిరిగొనన్ = అతిశయింపఁగా. ఆభూదయితుఁడు = ఆవిరాటరాజు. వివిధప్రియవాదంబులన్ = పలువిధములయిన ప్రియవాక్యములచేత. తా.—విరాటరాజు వారి నందఱిని మంచిమాటలచేత గౌరవించెను.

223. ప్రియము = సంతోషము. ఎసఁగన్ కాన్ = అతిశయించునట్లుగా. కానన్ = కావున. మత్పదము = నాస్థానమును, నారాజ్యము ననుట. కైకొనవే = గ్రహింపుమా. తా.—నాపరువును బ్రాణమును గాపాడితివి. ఇందుకుఁ బ్రత్యుపకారము చేయుటకు నాకు శక్తి లేదు. కావున నా రాజ్యమును దీసికొనుము.

వ్యా.—కైకొనవే–వ్యు. కైకొనుము + ఏ, సంప్రార్థనంబున మువర్ణకమునకు వువర్ణాదేశము "ఏదాదు లనుప్రయుక్తం బగునపుడు ముజ్ఞనకు వుజీ రుజీ యగు" అని బాలవ్యాకరణము.

224. ఒడలున్ = దేహమును. సిరియును = సంపదయును. నీఒసఁగినవి అ = నీ విచ్చినవే. కావు = రక్షింపుము. పంచి = ఆజ్ఞాపించి. తా.—నాదేహమును సంపదయును నాకు నీవే యిచ్చితివి కావున నీకే వీని నిచ్చెదను, నీవు అంగీకరించి యిష్మత్స్వదేశమును బాలించుచు నన్ను సేవకునిఁగా గ్రహించి రక్షింపుము.

225. అజాతశత్రుండు = ధర్మరాజు.

226. మనుజవరేణ్య = మనుష్యశ్రేష్ఠుఁడా! విరాటుని సంబోధనము. నావలనిమన్నన = నాయందలి గౌరవము. అట్టిదిఅ కాదె = అటువంటిదే కదా! శత్రుమర్దనము = శత్రువులచంపు

చనుటయు నాకుఁ దేజమును ♦ సంపదయుం గరిమంబుఁ గాక యి
ట్లనఁ దగునయ్య యే నిచట ♦ నైనది యేటిది యింత యేటికిన్. 226

క. అనుపలుకులకును విస్మయ, మును సంతోషంబుఁ జిత్త♦మునఁ బెనఁగొన నా
జనపతి ధర్మతనూభవుఁ, గనుఁగొని యి ట్లనియె మఱియు ♦ గౌరవ మెసఁగన్.

క. ఉపకారమొ బంటుతనమొ, కృపయో పెంపో సమగ్ర♦కీర్తిప్రియమో
రిపుదుస్సహ మగునీరణ, నిపుణతకుం గారణంబు ♦ నెయ్యమొ యెఱుఁగన్. 228

ఉ. మంటయుఁ బోని శాత్రవస♦మాజము నించుక యేని శంక లే
కంటఁగఁ దాఁకి చెండి తెగ♦టార్చె మహాద్భుతశక్తిశాలి యీ
వంటలవాఁడు చేసినయ♦వార్యపరాక్రమ మొండుచోటులం
గంటిమె వింటిమే యితఁడ ♦ కాఁడె వెసన్ గెలిపించె నన్ననిన్. 229

క. కంధరములు దెగి తలలు వ, సుంధర నతిపక్వతాల♦సుభగఫలాళీ

---

టను. ఉత్సవము = సంతోషము. తేజమును = ప్రకాశమును. గరిమంబున్ = గొప్పతనమును. ఐనది = చేసినది. ఏటిది = ఎంతమాత్రము ? తా.—రాజా! నీవు నాయందు అంతగౌరవ ముంచి యున్నాఁడవు, నీవు శత్రువుల వధించి సంతోషముతో రాజధానికిఁ బోవుటయే నాకు సమస్తసంపదలును. కావున నీ విట్లు చెప్పవలదు. నే నిటఁ జేసిన దేదియు లేదు. నన్నింత పొగడ వలదు.

227. విస్మయమును = ఆశ్చర్యమును. తా.—ధర్మరాజు మాటలకు ఆశ్చర్యమును సంతోషమును బొంది విరాటరాజు ధర్మరాజుం జూచి మఱియు నెక్కుడు గౌరవము గలవాఁడై యిట్లు చెప్పెను.

228. బంటుతనము ఒ = శౌర్యమో. పెంపుఓ = గొప్పతనమో. సమగ్రకీర్తి ప్రియమో = పూర్ణ మయిన కీర్తియందుఁ బ్రీతియో. రిపుదుస్సహము = శత్రువులకు సహింపరానిది. నీరణనిపుణతకున్ = నీయొక్క యుద్ధమునందలి నేర్పునకు. నెయ్యముఒ = స్నేహమో. తా.—నీ విట్లు శత్రువులకు భయంకరముగా యుద్ధము చేయుటకుఁ గారణము నా కుపకారము చేయఁ గోరుట మొదలగు నవిగా నుండవలయుఁ గాని వేఱు కారణము తెలియ లేదు.

229. పోనిశాత్రవసమాజమున్ = పోలిన శత్రువుల సమూహమును. ఇంచుక యేనిన్ = కొంచె మైనను. శంక = భయము. అంటఁగన్ = కదియునట్లు. తెగటార్చెన్ = చంపెను. మహాత్ అద్భుతశక్తిశాలి = మిక్కిలి యాశ్చర్యకర మయినబలముచే నొప్పినవాఁడు. అవార్యపరాక్రమము= అడ్డగింపరాని పరాక్రమమును. అనిన్ = యుద్ధమునందు. తా.—నిప్పువంటి శత్రుసేనను నిర్భయముగాఁ జొచ్చి నఱికి చంపెను. మహాపరాక్రమశాలి యైనయీవలలుఁడు చేసినపరాక్రమము నిది వఱ కెన్నఁడును నెచ్చటను జూడ లేము. ఇతఁడే నాకు యుద్ధమునందు జయము నొసంగినవాఁడు.

230. కంధరములు = మెడలు. వసుంధరన్ = భూమియందు. అతిపక్వ......బంధురతన్— అతిపక్వ = చక్కఁగాఁ బండిన, తాల = తాటిచెట్లయొక్క, సుభగ = చక్కని, ఫలఆళీ= పండ్ల సమూహమువలె, బంధురతన్ = ఒప్పిన వగుటచేత. పగఱమీఁదన్ = శత్రువులమీఁద. కినిసి =

బంధురత రాలు దామ, గ్రంథి పగఱమీఁదఁ గినిసి ♦ కవిసినయెడలన్. 230

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజ మగుకడిమికలిమి ♦ నరిసేనఁ గరం
బుక్కఱఁ దంత్రీపాలుం, డొక్కఁడ పొదలించె నీర♦ణోత్సాహంబుల్. 231

క. ఈనలువురు దక్కఁగ మన, సేనల నొక్కరుని నైనఁ ♦ జేడ్పడనిభటుం
గానం జెలి కెడ నైనం, బూని తలఁగునతఁడ చూవె ♦ పురుషుం డెందున్. 232

ఉ. కావున మీకు దంతిహయ♦కాంచనరత్నవిభూషణంబులున్
దేవనితంబినీజనస♦దృక్షమృగాక్షులు నాది గాఁగ నా
నావిధవైభవంబులు మ♦నంబులవాంఛలకుం దగంగ నీ
కేవిధి నీఁగువాఁడ ఋణ ♦ మెయ్యది యేనియు వేఁడుఁ డిచ్చెదన్. 233

క. అనవుడుఁ బాండుతనూభవు, లనఘా యి ట్లింతయుం బ్రి♦యంబున సంభా
వన సేసితి మా కిది యా, ధనము వడయుదానికంటెఁ ♦ దక్కువె చెప్పుమా. 234

---

కోపించి. కవిసినయెడలన్. రాలున్ అని యన్వయము. తా.—దామగ్రంథి కోపముతో శత్రువులు నెదిరించినయెడల వారితలలు పండినతాటిపండ్లవలె నేలమీఁదఁ బడును.

వ్యా.—"కంధరాదులు క్లీబతుల్యంబులు విభాష నగు" సూ. కంధరలు.

231. అక్కజము = గొప్పది. కడిమికలిమిన్ = పరాక్రమముయొక్క యతిశయము చేత. అరిసేనన్ = శత్రుసేనయందు. కరంబు = మిక్కిలి. ఉక్కఱన్ = బలము చెడునట్లు. తంత్రీపాలుండు. ఈరణఉత్సాహంబుల్ = ఈయుద్ధమునందలి యుత్సాహమును. పొదలించెన్ = వృద్ధిచేసెను. తా.—తంత్రీపాలుఁడు శత్రుసేనలం దంతటను దిరుగుచుఁ బరాక్రమించి శత్రువుల వధించి మనను యుద్ధోత్సాహమును వృద్ధిచేసెను.

232. చేడ్పడనిభటున్ = బాధనొందని బంటును. చెలికిన్ = స్నేహితునకు. ఎడరు = ఆపద. తలఁగు అతఁడుఅ = తొలఁగించువాఁడే. తా.—ఈ కంకుఁడు మొదలగువారు నలువురు దక్క మనసేనలోఁ దక్కినవా రందఱు నోడిరి, స్నేహితుని కాపద గలిగినపుడు దానిం బోఁగొట్టి రక్షించువాఁడే పురుషుఁడు.

233. దంతిహయకాంచనరత్నవిభూషణంబులున్ = ఏనుఁగులును గుఱ్ఱములును బంగారమును రత్నాలసొమ్ములును. దేవనితంబినీ జనసదృక్షమృగాక్షులున్ = దేవతాస్త్రీలతో సాటి యయిన స్త్రీలును. వాంఛలకున్ = కోరికలకు. ఈఁక = ఇయ్యక. ఋణము = అప్పును. ఏవిధిన్ = ఏయుపాయముచేత. ఈఁగువాఁడన్ = తీర్చుకొనువాఁడను. తా.—అందువలన మీకు ఏనుఁగులు మొదలగు ధనములను ఉత్తమస్త్రీలను మఱియు నితరము లగు నానావిధసంపదలను మీకు మఱి యేది కోరినను ఇచ్చి మీఋణము తీర్చుకొనవలయును.

234. పాండుతనూభవులు = పాండురాజుకొడుకులు. ఓ అనఘా = పాపము లేనివాఁడా! విరాటుని సంబోధనము. సంభావన = మన్ననను. ఇది = ఈమన్నన. ఆధనము పడయుదాని కంటెన్ = ఆధనము పొందుటకంటె. తా.—విరాటుని మాట విని పాండవు లిట్లనిరి. రాజా! మీ రిట్లు మిక్కిలి సంతోషముతో మమ్ము గౌరవించుటయే మాకుఁ జాలును, ఇది ధనముకంటె నెక్కుడు.

( ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట. )

వ. మ మ్మెరవుగాఁ దలంచి యియ్యెడ నిట్టట్టన వలవదు పురంబున కరిగి యయ్యెడ నీ కెల్లఁ బ్రియం బ్లు మన్నింపు మని రండుఁ గంకుండు మఱియు నిట్లనియె.

క. తగ నొక్కటి వేఁడెద నిను, జగతీశ్వర యిచ్చు టొప్పు • సరథగజాశ్వం
బుగ విడిచి పుచ్చు మిప్పుడ, త్రిగర్తపతి నిదియ నాకుఁ • బ్రియ మెల్భంగిన్. 236

వ. మననగరంబునకు జంఘాలురం బంపుము వారలు వోయి భవద్విజయఘోషం బాచరించి శోభనధ్వజోన్నయనంబును మంగళతూర్యనాదంబులును బరస్పర గంధసలిలసేచనంబును గీతవాద్యనృత్తంబులును నాదిగాఁ గలవివిధశుభాచారం బులం బ్రవర్తింప నియోగింప వలయు ననిన విరాటుండును బనిచినం గాలరు లగు చారులు వేగునంతకు వీటికిం జని గెలుపు ప్రకటించి పట్టనాలంకరణప్రముఖనిఖిల భద్రవిధానంబులు సేయించి రిటఁ బాండవులును మత్స్యమహీవల్లభుండును సమస్త సేనాసమేతులై విభవం బెసఁగ విలసిల్లుచు లజ్జావనతాననుం డగుసుశర్మ సపరిచ్ఛ దంబుగా విడిచి పుచ్చి గుత్తులకోలందికిఁ గృత్తంబులయి పడి యున్న పాదంబులవలనం గెందలిరుల సెజ్జలచందంబు లగుచోట్లను దునిసి చిక్కువడి యున్నయూరుకాండం బులవలన మదగజంబులు సొచ్చినకదళీవనంబులుం బోని యెడలును బ్రోవులు

---

235. ఎరవుగాన్ = అన్యులనుగా.

236. జగతీఈశ్వర = రాజా! విరాటరాజు సంబోధనము. సరథగజఅశ్వంబుగన్ = తేరుల తోను ఏనుఁగులతోను గుఱ్ఱములతోను గూడినట్లుగా. త్రిగర్తపతిన్ = సుశర్మను. ఎల్భంగిన్ = అన్ని విధములచేతను. నాకున్. ప్రియము = ఇష్టము. తా.—నే నొకటి కోరెదను,. ఈసుశర్మను వాని సేనలతో విడిచి పెట్టుము. ఇదియే నా కన్ని విధముల నిష్టము.

237. జంఘాలురన్ = వేగముగా నడచువారిని. భవత్ విజయఘోషంబు = నీ గెలుపు చాటు టను. ఆచరించి = చేసి. శోభనధ్వజఉన్నయనంబును = మంగళకరము లయిన టెక్కెముల నెత్తు టను. పరస్పరగంధసలిల సేచనంబును = ఒండొరులమీఁద గంధజలముల చల్లుకొనుటయును. వివిధ శుభఆచారంబులన్ = పలువిధము లగు మంగళకరము లయిన కార్యములయందు. పనిచినన్ = పంపఁగా. కాలరు లగుచారులు = వేగముగా నడచునట్టి వేగులవారు. వేగునంతకున్ = తెల్లవాఱు నప్పటికి. వీటికిన్=పట్టనమునకు. పట్టనఅలంకరణప్రముఖనిఖిలభద్రవిధానంబులు= పట్టనము నలంకరిం చుట మొదలగు సమస్తమంగళకార్యములను. విభవంబు=గొప్పతనము. లజ్జాఅవనత ఆననుండు=సిగ్గుచే వంగినమోము గలవాఁడు. సపరిచ్ఛదంబుగాన్ = పరివారముతోఁ గూడినట్లుగా. గుత్తులకోలం దికిన్ = మడములవఱకు. కృత్తంబులు ఐ = నఱకఁబడినవై. కెందలిరుల సెజ్జలచందంబులు = ఎఱ్ఱని చిగురాకుల పాన్పులవిధములు. తునిసి = తెగి. ఊరుకాండంబులవలనన్ = తొడల సమూహ ములవలన. కదళీవనంబులుం బోని యెడలును = అరఁటితోఁటలవంటి చోట్లును. ప్రోవులు= రాసులు,

గొని యున్న ప్రేవులవలన లావు గలయంచపిండు పేరఁ్కలి నతిముఖిం బెఱికినఁ గుఱుకులు గట్టినమృణాళనాళంబుల నొప్పుకమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును నంగుళీయకరుచు లడర నెఱిం జాఁగి పడియున్న బాహుదండం బులవలన నురగనివాసంబుల ననుకరించుతలంబులును గీలాలంబులపయిం దేలుచు నవ్విన ట్లున్నశిరంబులవలన వికచారవిందదీర్ఘికల విడంబించుతావులును నవయవ భేదంబు లడంగునట్లుగాఁ దుత్తునియలై పడియున్నగాత్రంబులవలనం గృతాంత మహానసశాలలపగిది నొప్పుపట్లును గలపాలికలను గలయం గనుంగొనుచు వెడలి చంద్రికాసుందరం బగునొక్కసైకతస్థలంబున నారాత్రి వుచ్చి రని చెప్పిన విని మఱునాఁటివృత్తాంతం బెట్లయ్యెనో యని సాదరంబుగా నవలోకించిన. 237

చ. అపరిమితప్రకార వినిరస్తసమస్తవికార షట్ప్రమా

ణపరమదూర గాఢభజనక్రమగత్యనుభావ్యసార దే

---

లావు = బలము. అంచపిండు = హంసలసమూహము. అతిముఖిన్ = వేగిరపాటుచేత. కుఱుకులు = రాసులు. మృణాళనాళంబులన్ = తామరతూండ్లచేత. ఒప్పు కమలాకరఉద్దేశంబులన్ = ప్రకాశించునట్టి తామరకొలంకుల ప్రదేశములను. క్రేణిసేయు ప్రదేశంబులునున్ = తిరస్కరించునట్టి చోట్లును. అంగుళీయకరుచులు = ఉంగరములకాంతులు. నెఱిన్ = అందముచేత. బాహుదండం బులవలనన్ = కఱ్ఱలవంటి చేతులచేత. ఉరగనివాసంబులన్ = సర్పగృహములను. అనుకరించుతలం బులును = పోలునట్టిచోట్లును. ఉంగరములతోఁ గూడిన బాహువులు మణులతోఁ గూడిన సర్పము లతోఁ బోల్పఁబడినవి. కీలాలంబుల పయిన్ = నెత్తురులమీఁద. వికచ అరవిందదీర్ఘికలన్ = వికసించిన కమలములు గల నడబావులను. విడంబించు తావులును = పోలునట్టి చోట్లును. రక్తమునకును దీర్ఘికాజలమునకును శిరస్సులకును కమలములకును నుపమేయోపమానభావము. పాఠాం:—కీలాల జలంబులపయిన్ = నెత్తురనెడు నీళ్లమీఁద. ఇటఁ గీలాలమునందు జలత్వ మారోపించినచో దీనికిని దీర్ఘికాజలమునకు నుపమానోపమేయభావము విరోధించును. అవయవభేదంబులు = అవయవముల వేఱుపాటు. ఇది కాలు, ఇది చేయి మొదలయిన భేదజ్ఞాన మనుట. తుత్తునియలై = మిక్కిలి తునుకలై. గాత్రంబులవలనన్ = దేహములవలన. కృతాంతమహానసశాలలపగిదిన్ = యముని వంటయిండ్లవలె. ఒప్పుపట్లును = ఒప్పునట్టి చోట్లును. పాలికలను = యుద్ధరంగమును. కలయన్ = అంతట. చంద్రికాసుందరంబు = వెన్నెలవలెఁ జక్కనిది. సైకతస్థలంబునన్ = ఇసుకదిబ్బమీఁద. సాదరంబుగాన్ = ఆదరముతోఁ గూడినట్లుగా.

238. అపరిమితప్రకార = అపరిచ్ఛిన్న మయిన స్వరూపము గలవాఁడా! వినిరస్తసమస్తవికార = పోఁగొట్టఁబడిన యెల్లభావవికారములు గలవాఁడా! జన్మము, అస్తిత, వృద్ధి, పరిణామము, అపక్షయము, నాశము, ఇవి యాఱుభావవికారములు, అవి లేనివాఁ డనుట. షట్ప్రమాణపరమదూర = ఆఱుప్రమాణములకును మిక్కిలి దూర మయినవాఁడా! ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి, ఇవి యాఱుప్రమాణములు. తానే ప్రమాత యగుటచేఁ బ్రమాణప్రవృత్తికంటె మున్నే సిద్ధుఁడై యుండుటవలనఁ బ్రమాణములకు విషయము కానివాఁ డని

వపితృపథప్రవర్తనవి♦వర్జననిర్మలచిత్తబోధశాం
తిపరమహాత్మసంసరణ♦తీర నిరంజన భక్తరంజనా. 238

క. విజ్ఞానానందరసా, భిజ్ఞహృదయకమలహంస ♦ భీమదురితమ
ర్మజ్ఞవివిధాభిధానా, యజ్ఞాత్మకరూప నిశ్చ♦లావ్యయదీపా. 239

మాలిని. త్రిజగదవననిత్య♦క్రీడనోద్యత్ప్రమోదా
రజనిచరవిఘాతా♦రంభలీలావినోదా
భజననిరతసౌఖ్య♦ప్రాప్తిజాగ్రత్ప్రసాదా
నిజతనువిభవత్వో♦న్మీలనాచ్ఛిన్ననాదా. 240

---

భావము. గాథ...సార—గాఢ = గట్టిదైన, భజన = భక్తియొక్క, క్రమ = విధముయొక్క, గతి = పొందికచేత, అనుభావ్య = తెలియఁదగిన, సార = మహిమగలవాఁడా! దేవ...తీర—దేవపితృపథ = దేవయానమునందును పితృయాణమునందును, ప్రవర్తన = ప్రవర్తించుటయొక్క, వివర్జన = విడుచుటచేత, నిర్మల = పరిశుద్ధమయిన, చిత్త = మనస్సునందలి, బోధ = జ్ఞానముచేత, శాంతి = శమమునందు, పర = ఆసక్తి గల, మహాత్మ = జ్ఞానులయొక్క, సంసరణ = సంసారమునకు, తీర = గట్టయినవాఁడా! శాస్త్రప్రసిద్ధము లగు దేవలోకపితృలోకాది సమస్త విషయములయందును విరక్తి గలిగి శుద్ధమయిన మనస్సునందు బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలవా రగుటచే సహజసమాధినిష్ఠు లగు జ్ఞానులకుఁ బ్రాప్యస్థానమైనవాఁడని భావము. నిరంజన = నిర్లేపుఁడా! భక్తరంజనా = భక్తులను సంతోషపెట్టువాఁడా! పాఠాం.—నిర్మలచిత్తవోర—ఇటఁ జోరశబ్దార్థము ఉచితము కామిపలనను చిత్తబోధ అనుపాఠము పెక్కుప్రతులయందుఁ గానంబడుటవలనను బోధశబ్దార్థము శాంతికి హేతువై సముచితం బగుటవలనను చోరపాఠము ఉచితము కాదని తెలియునది.

239. విజ్ఞాన......హంస—విజ్ఞానఆనందరస = బ్రహ్మమును, అభిజ్ఞ = ఎఱిఁగినట్టివారియొక్క, హృదయకమల = మనస్సు అను కమలమునకు, హంస = హంస యైనవాఁడా! లేక, విజ్ఞానఆనందరస = జ్ఞానముచేఁ గలుగు నానందముయొక్క రుచిని, అభిజ్ఞ = ఎఱింగినవారియొక్క. తక్కినది సమానము. జ్ఞానులచే నెల్లప్పుడును=ఆత్మాऽభేదమునఁ దలంపఁబడువాఁ డనుట. భీమదురితమర్మజ్ఞవివిధఅభిధానా = భయంకరము లయిన పాపముల మర్మముల నెఱింగినట్టి నానావిధము లయిన నామములు గలవాఁడా! మహాపాపములను బోఁగొట్టునట్టి నామములు గలవాఁ డనుట. యజ్ఞాత్మకరూప = యజ్ఞమే స్వరూపముగాఁ గల యాకారము గలవాఁడా! జ్ఞానయజ్ఞమే స్వరూపముగాఁ గలవాఁ డనుట. నిశ్చల అవ్యయదీపా = చలనము లేనిదియు నాశము లేనిదియు నగు ప్రకాశ మయినవాఁడా! స్వయం ప్రకాశుఁ డనుట.

240. త్రిజగత్ ఆవననిత్యక్రీడన ఉద్యత్ప్రమోదా = ముల్లోకముల రక్షించుట యను నెడతెగనిక్రీడయందుఁ గలుగుచున్న సంతోషము గలవాఁడా! రజనిచరవిఘాత ఆరంభలీలావినోదా = రాక్షసుల వధించుట యను కార్యముయొక్క విలాసమునందు వేడుక కలవాఁడా! భజననిరతసౌఖ్యప్రాప్తి జాగ్రత్ప్రసాదా = భక్తియం దాసక్తు లయినవారికి సౌఖ్యముయొక్క పొందుటయందు జాగరూక మయిన యనుగ్రహము గలవాఁడా! నిజతనువిభవత్వ ఉన్మీలనఅచ్ఛిన్ననాదా = తనదైన సూక్ష్మ

మయిన మహిమ గలవాఁడగుటయొక్క వికాసింపఁజేయుటయం దప్రతిహత మయిన యోంకారనాదము గలవాఁడా! తనయొక్క సూక్ష్మరూపమును దెలియుటకు సాధన మయిన ప్రణవము గలవాఁడనుట. సూక్ష్మ మనఁగాఁ దెలియుట కశక్య మయినది. కృతిపతి యగు హరిహరనాథుని సంబోధనములు.

### గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయినవిరాటపర్వంబునందుఁ

### తృతీయాశ్వాసము.



శ్రీమత్......ప్రణీతంబు—శ్రీమత్ = గొప్పతనముగల, ఉభయకవి = సంస్కృతాంధ్రకవులకు, మిత్త్రి = స్నేహితుఁడును, కొమ్మనఅమాత్యపుత్త్రి = కొమ్మనమంత్రి కుమారుఁడును, బుధ ఆరాధన విరాజి = పండితుల సేవించుటచేఁ బ్రకాశించువాఁడు నగు, తిక్కనసోమయాజిప్రణీతంబు = తిక్కనసోమయాజిచేఁ జేయఁబడినది. ఇది—ముగిసెను.



శ్రీ ర స్తు.

శ్రీహరిహరనాథాయ నమః.

# సవ్యాఖ్యానాంధ్రమహాభారతము

## విరాటపర్వము, చతుర్థాశ్వాసము.

శ్రీమదరేఖవిషాదవి, రామాహితగాఢశమధురానిర్భరని
ష్ఠామర్దితవివిధవికా, రామలచేతోనివాస హరిహరనాథా. 1

—(*) భూమింజయుఁడు గోవుల విడిపింపఁ గౌరవులతోఁ బోరుటకుఁ బోనెన్నుట. (*)—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. సూర్యోదయావసరమున, దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా, చార్యరవిసుతాదియోధసంఘోద్భటమై. 3

వ. నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటుపశుగణంబులం బొదివి నట్టి
యెడ ముక్కడిమూఁకలు నని యెక్కడెక్కడ యని తలపడినం గృపాశ్వత్థామ

---

శ్రీమత్......నివాస—శ్రీమత్ = అతిశయము గలవారును, అరేఖ = అధిక మయిన, విషాద = దుఃఖముయొక్క, విరామ = నాశముచేత, ఆహిత = కలిగింపఁబడిన, గాఢ = అధికమయిన, శమ = శాంతియొక్క, ధురా = అతిశయముచేత, నిర్భర = నిండిన, నిష్ఠా = ఉనికిచేత, మర్దిత = పోఁగొట్టఁబడిన, వివిధ = నానావిధము లయిన, వికార = మనోవికారములు గలవారియొక్క, అమల = పరిశుద్ధ మయిన, చేతః = మనస్సులందు, నివాస = ఉనికి గలవాఁడా! తా.—విషాదములను నిగ్రహించి యధిక మయిన శాంతిని వహించి నిరంతరసమాధిచే మనోవృత్తులను నశింపఁ జేసికొన్న శ్రీమంతు లగు యోగులహృదయమునం దుండువాఁడా! అట్టి యోగులచేఁ బ్రత్యగాత్మాభేదమున నెఱుంగఁబడినవాఁడని భావము. హరిహరనాథా! కృతిపతి సంబోధనములు. ఈపద్యమునందు విషాదము లేని వా రని వచించుటచేఁ బాండవులు తమ యజ్ఞాతవాసము నెఱవేర్చి సంతోషపడుట సూచింపఁబడినది. వ్యా.—శమధురా—వ్య. శమ+ధూర్—ధూర్ శబ్దము సమాసాంతమున అకారాంత మగును.

3. సూర్యఉదయ అవసరమునన్ = సూర్యోదయకాలమునందు. ప్రబలదోర్బల లీలాధుర్య గతిన్ = అధిక మయిన బాహుబల విలాసముయొక్క భారమును వహించిన నడకచేత. భీష్మ ఆచార్యరవిసుతఆదియోధసంఘ ఉద్భటము ఐ = భీష్ముఁడు ద్రోణుఁడు కర్ణుఁడు మొదలుగాఁ గల వీరులయొక్క సమూహముచే గొప్పదియై. నడచెన్. తా.—ఆదినము సూర్యోదయకాలమున భీష్మద్రోణకర్ణాదులతోఁ గూడినదై దుర్యోధనునిసేన పరాక్రమముతో మత్స్యనగరముసమీపమునకు వచ్చెను.

4. అనతిదూరంబునన్ = సమీపమునందు. ముక్కడిమూఁకలు = విరాటుని క్షుద్రసైన్యములు. తలపడినన్ = ఎదిరింపఁగా. ప్రముఖరథికజనంబులు = మొదలుగాఁగల శూరు

శకుని దుశ్శాసన కర్ణ వికర్ణ దుర్ముఖ ప్రముఖరథికజనంబులు గోపాలవర్గంబు ననర్గళ ప్రసారం బగుశరాసారంబునం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి బెగ్గలం బగ్గలింప గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగు దెంచి రాజమందిరద్వారంబున రథావతరణంబు సేసి యంతఃపురంబున నున్న భూమింజయుం గాంచి ససంభ్రమంబుగా ని ట్లనియె. 4

మ. ధరణీచక్రము సంచలింపఁగ సము♦ద్దాంతంబు లై క్రక్కునం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెన్ ♦ గోవర్గముల్ వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపు♦క్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజో♦త్సాహంబు శోభిల్లఁగన్. 5

గీ. తేరుఁ బూన్పఁ బంపు ♦ తెప్పింపు దృఢతను, త్రాణ ముగ్రచాప♦బాణపూర్ణ
తూణఘనగదాసి♦తోమరచక్రాదు, లనువుగా నొనర్పు ♦ మతిరయమున. 6

చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బది♦వేవురముందఱఁ జెప్పు బాహువి
స్ఫురితుఁడు శౌర్యశాలి కుల♦భూతివిశేషవిధాయకుండు భూ

---

లయిన జనులు. గోపాలవర్గంబున్ = గొల్లలసమూహమును. అనర్గళప్రసారంబు = అడ్డు లేని పరఁగుట కలది. శరఆసారంబునన్ = బాణవర్షముచేత. బెగ్గలంబు = భయము. అగ్గలింపన్ = అధికముకాఁగా. గవాధ్యక్షుండు = గోవుల నాయకుఁడు. ఆక్రోశించుచున్ = అఱచుచు. రాజమందిరద్వారంబునన్ = రాజునగరువాకిట. రథఅవతరణంబు = తేరునుండి దిగుటను. భూమింజయున్ = ఉత్తరుని. ససంభ్రమంబుగాన్ = వేగిరపాటుతోఁ గూడినట్లుగా. వ్యా.—గవాధ్యక్షుఁడు—వ్యు. గో + అధ్యక్షుఁడు—సమాసమునందు అచ్చుపరం బగునపుడు గోశబ్దము నోకారమునకు అవజాదేశము.

5. ధరణీచక్రము = భూమండలము. సంచలింపఁగన్ = అదరఁగా. సముద్దాంతంబులు ఐ = మిక్కిలి గర్వించినవియై. గోవర్గముల్ = ఆవులమందలను. ముట్టికొనియెన్ = ముట్టడించెను. వేగమైన్ = వేగముతో. కడంగుము = పూనుము. రిపుక్ష్మాపాలలోకంబున్ = శత్రురాజుల సమూహమును. భుజఉత్సాహంబు = బాహువులబలము. శోభిల్లఁగన్ = ప్రకాశించునట్లు. నీశరజాలంబులపాలు = నీ బాణముల సమూహమున కధీనము. చేయుము. తా.—కౌరవులదండు వచ్చి మన యావులమంద నాక్రమించెను, నీవు శత్రురాజులను బాణములచే వధించి పశువులను మరలించి తెమ్ము.

6. పూన్పన్ = అయితము సేయుటకు. పంపు = ఆజ్ఞాపింపుము. దృఢతను త్రాణము = గట్టిదైన కవచమును. ఉగ్ర......ఆదులు—ఉగ్ర = భయంకరము లయిన, చాప = ధనుస్సులును, బాణ = బాణములచేత, పూర్ణ = నిండిన, తూణ = అమ్ములపొదులును, ఘన = గొప్పవైన, గదా = గదియలును, అసి = కత్తులును, తోమర = చిల్లకోలలును, చక్ర = చక్రములును, ఆదులు = మొదలుగాఁ గలవానిని. అనువుగాన్ = చక్కఁగా. ఒనర్పుము = సిద్ధముచేసికొనుము. తా.—నీవు శీఘ్రముగా రథము మొదలగువానిని సిద్ధపఱచికొని యుద్ధమునకు సన్నద్ధుఁడవు కమ్ము.

7. పదివేవురముందఱన్ = పదివేలమంది యెదుట. బాహువిస్ఫురితుఁడు = భుజము

భరణవిశారదుండు జన♦భవ్యతపఃఫలసంభవుండు కా
తరపరిరక్షకుం డనుచు ♦ దానికి నీడుగఁ జేయు మిత్తఱిన్. 7

క. అని కాంతాజనములలోఁ, దను నగ్గించుటయుఁ బొంగి ♦ దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు దనమన, మున సంగరకౌతుకంబు ♦ ముడివడు చుండన్. 8

ఉ. ఎత్తెలఁ గొందుఁ గౌరవుల ♦ నెల్లను మాఱొక్కని లేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ ♦ దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ ♦ చెందెడు నెవ్వఁడు గల్గు నొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప ♦ నెంతయు నేర్తు రథంబు నీపురిన్. 9

క. తగుసారథి దొరకొనినం, బగతుర భంజించు టెంత♦పని కదుపుల ద
వ్వుగఁ గొని పోదురొకో యి, ట్లగునే కలఁడేని సూతు ♦ నరయుం డెందున్. 10

---

లచేఁ బ్రకాశించువాఁడు. శౌర్యశాలి = పరాక్రమముచే నొప్పువాఁడు. కులభూతి విశేషవిధాయకుండు = వంశమునకు సంపదయొక్క యతిశయమును జేయువాఁడు. భూభరణవిశారదుండు = భూమిని పాలించుటయందు సమర్థుఁడు. జనభవ్యతపః ఫలసంభవుండు = జనులయొక్క మంచితపస్సుయొక్క ఫలమువలనఁ బుట్టుక కలవాఁడు. కాతరపరిరక్షకుండు = భయపడినవారిని కాపాడువాఁడు. అనుచున్. చెప్పన్ అని యన్వయము. ఈడుగన్ = తగినట్లుగా. ఇత్తఱిన్ = ఈసమయమునందు. చేయుము. మీతండ్రి యందఱియెదుట నీ పరాక్రమము మొదలగు గుణములను నెల్లప్పుడు పొగడుచుండును, అందుకుఁ దగినట్లు నీ విపుడు పరాక్రమముఁ జూపుము.

8. కాంతాజనములలోన్ = స్త్రీజనములనడుమ. అగ్గించుటయున్ = పొగడఁగా. దర్ప ఉద్ధతిన్ = గర్వముయొక్క యతిశయముచేత. సంగరకౌతుకంబు = యుద్ధమునందలి యుత్సాహము. ముడివడుచుండన్ = అతిశయించుచుండఁగా. ఇట్లు. అనున్. తా.—ఇట్లు గవాధ్యక్షుఁడు స్త్రీలనడుమఁ దన్ను స్తుతిచేయుటకు నుత్తరుఁ డుప్పొంగినవాఁడై గర్వించి యిట్లు చెప్పెను.

9. ఎత్తెలన్ = వలయందు. కొందున్. మత్స్యములఁ బట్టినట్లు పట్టుదు ననుట. ముహూర్తమాత్రమునన్ = కొంచెముసేపులోపల. లేమిఁ జేసి = లేకుండుటచేత. విచారదశ = చింతతోడియవస్థ. చెందెడున్ = కలుగుచున్నది. ఈపురిన్ = ఈపట్టనమునందు. రథంబు. కడపన్ = తోలుటకు. ఎంతయున్. నేర్తున్ అని యన్వయము. తా.—కౌరవులనందఱ జయించి యావులను శీఘ్రముగాఁ దేఁగలను గాని నాకు సారథి లేఁడని చింతించుచున్నాను, ఈపట్టణమునందు నేనే సారథ్యమును నేర్చినవాఁడను.

10. దొరకొనినన్ = లభించినయెడ. పగతురన్ = శత్రువులను. భంజించుట = ఓడించుట. కదుపులన్ = ఆవులమందలను. దవ్వుగన్ = దూరముగా. సూతున్ = సారథిని. అరయుండు = వెదకుఁడు. తా.—తగినసారథి యున్నపక్షమున శత్రువుల జయించుట మిక్కిలి సులభము. శత్రువు లావులను దూరము కొనిపోవుదు రేమో యని భయపడుచున్నాను, ఎచ్చటనైనను సారథిని వెదకుఁడు.

చ. కురుపతిభీష్మకర్ణకృప♦కుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డను♦బుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ ♦ గ్రమ్మఱఁ దేరక యున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరి♦వారముఁ జిత్తములందు మెత్తురే. 11

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 12

క. విని ద్రుపదధరణిపతినం, దన సామర్షాపహాస♦తరళహృదయయై
చని తద్వృత్తాంతంబు న, తనిపలుకులఁ జెప్పె నింద్ర♦తనయునితోడన్. 13

వ. అతం డజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె నీవు పోయి వారలతో సిట్లనుము మనబృహన్నలకు సారథ్యంబు సేయుసామర్థ్యంబు గలదు తొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథియై యతని చిత్తంబు వడసె మఱియుఁ బెక్కెడలం దదీయం బగురథంబు గడపఁ దానయై యుండు నేను నెఱుంగుదుం దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింప వచ్చుటకు సంశయంబు వలవ దనుము వారే మనిరేని మఱియుం దగ నాడి

---

11. కురుపతి భీష్మకర్ణకృపకుంభజముఖ్యులు = దుర్యోధనుఁడును భీష్ముఁడును కర్ణుఁడును కృపుఁడును ద్రోణుఁడును మొదలుగాఁ గలవారలు. మత్సముద్యమస్ఫురణము = నాయుద్ధప్రయత్నము యొక్క యతిశయమును. పార్థుఁడు = అర్జునుఁడు. కలంగఁగన్ = భయపడునట్లు. బెట్టు = మిక్కిలి. కిట్టి = తాఁకి. సంగరమునన్ = యుద్ధమునందు. ఓర్చి = ఓడించి. తేరక = తీసికొనిరాక. భూవరుఁడున్ = విరాటరాజును. సుహృత్ జనంబున్ = స్నేహితులును. చిత్తములందున్ = మనస్సులయందు. తా.—దుర్యోధనాదులు నాపరాక్రమమును జూచి యర్జునుఁ డని భ్రమించి భయపడునట్లు నేను వారిని యుద్ధమున జయించి పశువులను దోలుకొని రానియెడ విరాటుఁడు మొదలగువారియొద్ద నాకు గౌరవము గలుగదు.

12. తత్ప్రదేశంబునన్ = ఆచోటియందు. ఉనికిం జేసి = ఉండుటచేత.

13. ద్రుపదధరణిపతినందన = ద్రుపదరాజుకూతుఁ రయిన ద్రౌపది. సామర్షాపహాస తరళహృదయయై = ఓర్వలేనితనముతోను పరిహాసముతోను గూడిన చలించుచున్న మనస్సుగలదై. అతని పలుకులన్ = ఆ యుత్తరుని మాటలను. ఇంద్రతనయునితోడన్ = అర్జునునితో. చెప్పెన్.
తా.—ద్రౌపది యాయుత్తరుని మాట విని యతఁడు తా నర్జునునివంటివాఁ డనుటకు నోర్వలేక కౌరవుల జయింపఁ గల ననుటకుఁ బరిహాసము గలదై యర్జునునియొద్దకుం బోయి యాసమాచారమునంతయుం జెప్పెను.

14. అతీతంబు = కడచినది. నిరూపించి = నిశ్చయించి. పాంచాలికిన్ = ద్రౌపదితో. ఖాండవదహనంబునన్ = ఖాండవవనము దహించుటయందు. పాండవమధ్యమునకున్ = పాండవుల నడిమివాఁడైన యర్జునునకు. పెక్కెడలన్ = అనేకసమయములయందు. తదీయంబు = అయ్యర్జు

నన్నుం బిలుచునట్టితెఱంగు గావింపు మన నట్ల చేయుదు నని సైరంధ్రి యుత్తర యున్నయెడకుం బోయి యిట్లనియె. 14

చ. జనపతినందనుండు దగు♦సారథి నారయు చున్నవాఁ డెఱిం
గినపని సెప్పఁగా వలయుఁ ♦ గ్రీడి మనంబున మెచ్చునట్టినే
ర్పును భుజశక్తియుం గలిగి ♦ రూఢికి నెక్కినసూతవృత్తిమై
నని నడి సన్నయేడ్తెఱ బృ♦హన్నలకుం గల దంబుజాననా. 15

గీ. అర్జునునకు ఖాండవదహ♦నాదు లైన, విక్రమముల బృహన్నల♦వెరవు లావు
గాదె జయ మొనరించె లో♦కంబు లెఱుఁగ, నువిద దీని నెఱింగింత ♦ ముత్తరునకు.

క. అని యమ్ముదితయుఁ దానును, జని యతనికి నత్తెఱంగు ♦ సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి, ట్లనియెం బాంచాలితోడ ♦ నల్లన నగుచున్. 17

గీ. అకట సైరంధ్రి నన్ను ని♦ట్లాలిగొనఁగ, నేల చక్కఁగఁ గను విచ్చి♦ యేను జేడిఁ

మనిది. కడపన్ = తోలుటకు. అనునది = అని చెప్పవలయును. తగన్ = ఒప్పునట్లు. అడి = చెప్పి. తెఱంగు = ఉపాయమును.

15. జనపతి నందనుండు = విరాటరాజు కుమారుఁ డయిన యుత్తరుఁడు. ఆరయుచున్ = విచారించుచు. క్రీడి = అర్జునుఁడు. భుజశక్తియున్ = భుజబలమును. రూఢికిన్ = ప్రసిద్ధికి. ఎక్కినసూతవృత్తిమైన్ = వచ్చిన సారథిపనియొక్క విధమునందు. అనిన్ = యుద్ధమునందు. నడిసన్న ఏడ్తెఱ = నిందింపఁదగని యతిశయము. అంబుజఆననా = కమలమువంటి మోము గలదానా! ఉత్తర సంబోధనము. తా.—ఉత్తరుఁడు తేరికిఁ దగిన సారథిని విచారించుచున్నాఁడు. నాకుఁ దెలిసిన విషయము చెప్పవలయును. ఉత్తరా! బృహన్నలకు అర్జునుఁడు మెచ్చుకొనునట్టి భుజబలమును సారథ్యమునందు నేర్పును గలదు.

16. ఖాండవదహనఆదులు = ఖాండవవనము దహించుట మొదలుగాఁ గలవి. ఐనవిక్రమములన్ = అయిన పరాక్రమములయందు. బృహన్నలవెరవులావుగాదె = బృహన్నలయొక్క యుపాయమును బలమును గదా. లోకంబులు. ఎఱుఁగన్. జయము. ఒనరించెన్ అని యన్వయము. ఉవిద = ఓ స్త్రీ! ఉత్తరసంబోధనము. తా.—అర్జునునకు ఈబృహన్నలసాహాయ్యమునసే ఖాండవవనదహనము మొదలుగాఁ గల పరాక్రమకార్యములయందు జయము కలిగినది. కావున నుత్తరా! దీని నుత్తరునకుం దెలుపుదము.

17. అమ్ముదితయున్ = ఆయుత్తరయును. అత్తెఱంగు = ఆవిధమును. సముచితముగన్ = మిక్కిలి తగినట్లుగా. అక్కుమారవరుఁడు = ఆయుత్తరుఁడు. తా.—అట్లనుకొని యుత్తరయు ద్రౌపదియు నుత్తరునిపాలికిం బోయి యాసమాచారము నంతయుఁ జెప్పఁగా నుత్తరుఁడు నవ్వుచు ద్రౌపదితో నిట్లు చెప్పెను.

18. ఆలిగొనఁగన్ = గేలిచేయుట. రోయుదున్ = అసహ్యపడుదును. రణమునన్ = యుద్ధమునందు. సూతకృత్యభరము = సారథిపనియొక్క భారమును. ఎమ్మెయిన్ = ఏవిధమున.

జూడ రోయుదు రణమున ♦ సూతకృత్య, భరము దాల్చుట కెవ్వెయిఁ ♦ బనుచువాఁడ.

వ. అదియునుం గాక. 19

చ. కురుబల మేఁగుదెంచె నఁట ♦ గోవుల బిట్టుఱిఁ బట్టి దానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు ♦ బాహుబలంబును జూపఁ బూని యే
నరిగెద నంట తేరికి బృ ♦ హన్నల సారథి యైన దీని న
వ్వరె పురిలోన నింత కఱ ♦ వా రథచోదకు లింత యేటికిన్. 20

వ అనిన విని సైరంధ్రి యతని కి ట్లనియె. 21

ఉ. కౌరవసేన గాదు త్రిజ ♦ గంబును నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావశగ ♦ తిం జరియించిన గెల్వ వచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథి ♦ వీవరనందన మున్నెఱుంగుదుం
గారణజన్మ మై తనువి ♦ కారము వొందినఁ బెంపు దప్పునే. 22

వ. అనవుడు. 23

క. మన మురియాడుచు నుండఁగఁ, దన కొరు లప్పటికి లేమి ♦ ధరణీశ్వరనం

---

పనుచువాఁడన్ = ఆజ్ఞాపించువాఁడను ? తా.—సైరంధ్రీ ! నేను నపుంసకునిఁ జూచుటకుఁగూడ నసహ్య పడుదును ? వానిని యుద్ధమునందు సారథిగా నెట్లు పెట్టుకోఁ గలను.

20. గోవులన్ = ఆవులను. బిట్టుఱన్ = బలముచెడునట్లు. పట్టన్. కురుబలము = కౌరవ సైన్యము. ఏఁగుదెంచెన్ అఁట. పరిగొని = సన్నద్ధుఁడనై. శౌర్యసంపదయున్ = పరాక్రమము యొక్క యతిశయమును. బాహుబలంబును = చేతులలావును. అరిగెదనంట = పోవుదు నఁట. రథచోదకులు = తేరు కడపువారు. తా.—కౌరవసేన వచ్చి గోవులఁ బట్టఁగా నేను వారిమీఁదికి యుద్ధమునకుఁ బోవునపుడు బృహన్నల సారథి యయినం జూచి జను లెల్లరు నవ్వుదురు. సారథి కింత కఱవు రా లేదు.

22. త్రిజగంబునున్ = మూఁడులోకములును, సమాహారద్విగుసమాసము. ఒక్కటన్ = ఒకటిగా. ఎత్తి = దండెత్తి. బృహన్నలావశగతిన్ = బృహన్నలయొక్క యధీనతయొక్క పొందికచేత. చరియించినన్ = తిరిగినయెడ. తత్ వీరగుణంబుసొంపు = ఆ బృహన్నలయొక్క శూరగుణముయొక్క యతిశయమును. పృథివీవరనందన = రాజపుత్త్రుఁడా ! ఉత్తరుని సంబోధనము. కారణజన్ముఁడై = కారణమువలని పుట్టుక కలదై. తనువికారమున్ = దేహముయొక్క వికారమును, మాఱుదేహము ననుట. పెంపు = అతిశయము. తా.—కౌరవులసేన యనఁగా నెంతమాత్రము? ముల్లోకములు నొక్కటిగా మీఁదికి వచ్చి నప్పటికిని బృహన్నలసారథి యయినచోఁ దప్పక జయము కలుగును. నాకు ఆతనిపరాక్రమము తెలియును. ఒకానొక కారణముచేత మాఱుపుట్టువు కలిగి శరీరమునకు వికార మయినంత మాత్రమునఁ బరాక్రమము చెడదు.

24. ఉరియాడుచున్ = చలించుచు. ఒరులు = ఇతరులు. లేమిన్ = లేకపోవుటచేత. ధరణీఈశ్వరనందనుఁడు = రాజకుమారుఁ డయిన యుత్తరుఁడు. పనుచటకున్ = ఆజ్ఞాపించు

దనుఁడు బృహన్నలఁ బిలువం, బనుచుట కొడఁబడినపలుకు♦ పలుకుటయుఁ దగన్.

వ. సైరంధ్రిదెసఁ గనుంగొని యేను బోయి తోడ్కొని వచ్చెద నని పూని యప్పుడు.

సీ. అడుగులనునుఁగాంతి ♦ నయ్యెడ పద్మరా, గంబులనెలకట్టుఁ♦గరణి నొప్పఁ
బాలిండ్లతను పెద ♦ గ్రాలింపఁ జెన్నొందు, నసదుఁగౌఁదీఁగ యు♦ల్లాడుచుండఁ
దటి వేచి వెనువెంటఁ♦దగులు కామాంధకా, రములీలఁ గ్రొవ్వెద♦గొమరుమిగులఁ
గర్ణభూషణమౌక్తి♦క ప్రభాడోలన, మీక్షణదీప్తుల ♦ నినుమడింప
నందియలమొరపంబున ♦ కరుగుదెంచి, ప్రోది రాయంచ రయమునఁ ♦ బోవునవ్వి
ధంబు దగ నభ్యసించుచం♦దమునఁ దోన, చనఁగ నుత్తర నర్తన♦శాల కరిగె. 26

గీ. మెఱుఁగు మొగిలు సొచ్చు♦ తెఱఁగున నాట్యమం, దిరము సొచ్చి తనదు♦గుఱువు కడకు

---

టను. ఒడఁబడిన పలుకు = అంగీకరించినమాటను. తా.—అంత నుత్తరుఁడు మనసునందు నిశ్చయము నొందఁజాలక మఱియొక సారథి దొరకకపోవుటచే నెట్టకేలకు బృహన్నలం బిలుచుట కంగీకరింపఁగా.

25. సైరంధ్రిదెస = సైరంధ్రిదిక్కును.

26. నునుఁగాంతిన్ = చక్కనికాంతిచేత. అయ్యెడ = ఆచోటు. పద్మరాగంబులనెలకట్టుకరణిన్ = పద్మరాగమణులయొక్క కట్టనపునేలవలె. పాలిండ్లతనువు = స్తనములవిరివి. ఎదన్ = ఱొమ్మును. గ్రాలింపన్ = నిక్కునట్లు చేయఁగా. చెన్నుఒందు అసదు కౌఁదీఁగ = చక్కని సన్నని తీఁగవంటినడుము. అల్లాడుచుండన్ = చలించుచుండఁగా. తటి = సమయమును. వేచి = కాచి. తగులుకామఅంధకారములీలన్ = అంటినట్టి కామము అను చీఁకటియో యనునట్లు. క్రొవ్వెద = కొప్పు. కొమరుమిగులన్ = ప్రకాశింపఁగా. కర్ణభూషణమౌక్తికప్రభాడోలనము = కర్ణాభరణములందలి ముత్తెముల కాంతులయొక్క చలనము. ఈక్షణదీప్తులన్ = చూపులకాంతులను. ఇనుమడింపన్ = వృద్ధి చేయఁగా. అందియల మొరపంబునకున్ = అందెలచప్పుడునకు. ప్రోదిరాయంచ = పెంపుడు రాజహంస. రయమునన్ = వేగముగా. అరుగుదెంచి = వచ్చి. పోవు అవ్విధంబు = నడచునట్టి యావిధమును. అభ్యసించుచందమునన్ = నేర్చుకొనుచున్నదో యనునట్లు. తోన్ = అవెంటనే. నర్తనశాలకున్ = నాట్యమండపమునకు. తా.—పాదముల యెఱ్ఱనికాంతి ప్రసరించుటచే నాప్రదేశము కెంపులతోఁ గట్టిననేలవలెఁ బ్రకాశింపఁగా, ఱొమ్మునందలి స్తనభారము వలన నడుము చలించుచుండఁగా, సమయము కనిపట్టి యాక్రమించుటకై వెంబడించు కామాంధకారమో యనునట్లు కొప్పు ప్రకాశింపఁగాఁ, గర్ణములందు ధరించిన ముత్యాలకాంతులు చూపులకాంతులను వృద్ధిచేయుచుండఁగా, అందెలధ్వని విని కూడవచ్చినట్టి పెంపుడురాజహంస నడచువిధమును నేర్చుకొనుచున్నదో యనునట్లుండఁగా, నుత్తర నాట్యశాలకుఁ బోయెను. సీసము ప్రథమ తృతీయపాదములయందును, గీతమునందును నుత్ప్రేక్షాలంకారము. సీసము ద్వితీయపాదమునందుఁ గౌఁదీఁగ యనుటచేఁ బాలిండ్లయందుఁ బుష్పగుచ్ఛసాదృశ్యము గమ్యము.

27. మొగిలు = మేఘమును. నెమ్మిన్ = ప్రీతితో. ఇంతి = స్త్రీ, ఉత్తర యనుట. ప్రార్థనావినయసంభ్రమములు = వేఁడుకోలును అడఁకువయును, వేగిరపాటును.—తా. ఉత్తర మెఱుపు

నరిగి నెమ్మి నిట్టు ♦ లను నింతి ప్రార్థనా,వినయసంభ్రమములు ♦ పెనఁగొనఁగ. 27

క. ఇచ్చట నొకకయ్యంబునఁ, జచ్చె మదీయాగ్రజన్ము ♦ సారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం, డచ్చుపడుపఁ డయ్యె నీక్రి♦యకు నొండొకనిన్. 28

వ. అది యట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన సమరసన్నద్ధుండై వెనుకం దగుల నమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన నీకంచువ సైరంధ్రి సెప్పినం బ్రియంబంది నిన్నుం దోడ్తెర నన్నుఁ బనిచిన నేనును నీపాల నాకుఁజనవు గలుగుటం జేసి యెల్లవిధంబులం దోడ్తెత్తునని పనిఁబూని వచ్చితి నీవును నాపలుకులు గుఱుచసేయక నీపెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారునకు రథంబు గడప నియ్యకొని యియ్యాపదఁ దలఁగవలయు నిట్లొడంబడక తక్కుట నావలనివాత్సల్యంబుఁ గొఱంతపఱచుట యనిన నమ్ముద్దియ పలుకులు ముద్దుసేసి. 29

క. నగుచు బృహన్నల యిట్లను, జగతీశ్వరపుత్త్రి నాకు ♦ సారథ్యము నే
ర్పు గలదె నీమాటకు నే, మిగులంగా వెఱతుఁ బోదు ♦ మీఁ దెట్లుండెన్. 30

క. భవదీయప్రార్థనచేఁ, దివిరి పరమదుష్కరములు ♦ దీర్పి యయిన ను

---

మేఘమును బ్రవేశించునట్లు నాట్యశాలయందుఁ బ్రవేశించి బృహన్నలయొద్దకుఁ బోయి వినయసంభ్రమములతో నిట్లు చెప్పెను.

28. కయ్యంబునన్ = యుద్ధమునందు. మదీయఅగ్రజన్ముసారథి = నాయన్న యైన యుత్తరుని సారథి. ఈక్రియకున్ = ఈ కార్యమునకు. ఒండుఒకనిన్ = మఱియొకనిని. అచ్చుపడుపఁడు అయ్యెన్ = ఏర్పడుప లేడు. తా.—నాయన్న యగు నుత్తరునిసారథి యొకయుద్ధమున హతుఁ డయ్యెను, తగినవాఁడు మఱియొకఁ డిదివఱకు దొరకమిచే నతఁడు సారథి లేక యున్నాఁడు.

29. కూయి = సమాచారము. సమరసన్నద్ధుండై = యుద్ధమున కాయత్తమైనవాఁడై. విషాదంబు = దుఃఖమును. నీకంచువ = నీసామర్థ్యమును. నీపాలన్ = నీయెడ. కుఱుచసేయక = తక్కువ చేయక. నీపెంపునన్ = నీగొప్పతనమును. ప్రకటంబుగాన్ = వెల్లడి యగునట్లుగా. నావలని వాత్సల్యంబు = నామీఁదిప్రేమను. అమ్ముద్దియపలుకులు = ఆయుత్తరమాటలను.

30. జగతీఈశ్వరపుత్త్రి = రాజుపుత్త్రి! ఉత్తరసంబోధనము. మిగులంగాన్ = మీఱుటకు. తా.—నవ్వుచు బృహన్నల యిట్లు చెప్పెను. సారథ్యము సేయు నేర్పు నాకు లేదు, అయినను నీమాటను మీఱఁ జాలను, పోయెదను, అటుపిమ్మట నెట్లైనను గానిమ్ము.

31. భవదీయప్రార్థనచేన్ = నీదైన వేఁడికోలుచేత. తివిరి = పూని. పరమదుష్కరములు = మిక్కిలి చేయుటకు రాని కార్యములను గూడ. తీర్చి అయినన్ = సాధించియైనను. ఉత్సవము = సంతోషమును. ఒకఁడు = ఒకటి. అంబుజవదనా = కమలమువంటి మోము గలదానా! తా.—

త్సవ మొనరించెద సార, థ్యవిధం బొకఁ డనఁగ నేల ♦ యంబుజవదనా. 31

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్తమెత్త నడతెంచుమత్త
శుండాలంబునుంబోలె. 32

( ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిఁగాఁ జేసికొనుట. )

గీ. అరుగుదెంచుబృహన్నల ♦ నంత నంతఁ, గని నృపాలసుతుం డను ♦ గారవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబు♦గలిగె నాకుఁ, గడఁగి నేఁడు రథమ్మీవు♦గడపవలయు.

క. వే రమ్ము మైమఱువుఁ దొడి, తే రెక్కుము దప్పఁ గ్రుంకఁ ♦ దీరదు నీకున్
సైరంధ్రి సెప్పె నీ దగు, బీరమ్మును బెంపు లావు ♦ వెరవును మాకున్. 34

చ. అనుటయు నాటపాట గల♦యప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁ బం
చినఁ దగుఁ గాక సంగరము♦సేఁతకు సారథి గమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల ♦ నారసి బాహుబలాఢ్యుఁ డైనయొ
క్కని రథ మేడ్తెఱం గడపఁ ♦ గా నియమింపుము రాజనందనా. 35

వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె. 36

---

ఉత్తరా! నీవు గోరుదువేని నొకసారథ్యమునే కాదు, ఎట్టి యసాధ్యకార్యము లయినను సాధించి నీకు సంతోషము కావింతును.

32. సంగీతనిలయంబు = సంగీతగృహమును. సలీలంబుగాన్ = విలాసముతోఁ గూడినట్లుగా. నడతెంచు మత్తశుండాలంబునుంబోలెన్ = నడచునట్టి మదపుటేనుఁగువలె.

33. నృపాలసుతుండు = రాజపుత్త్రుఁడు, ఉత్తరుఁడు. గారవమునన్. అనున్ = చెప్పును. తా.—అట్లు వచ్చునట్టి బృహన్నలను దూరమునందే చూచి యుత్తరుఁ డిట్లు చెప్పెను. నాకుఁ గౌరవులతో యుద్ధము సంభవించినది, నీవు నాకు సారథ్య మొనరింపవలయును.

34. మైమఱువు = కవచమును. తొడి = తొడిగి. నీకున్. తప్పన్ గ్రుంకన్ = వెనుదీయుటకు. తీరదు = సరిపడదు. బీరమ్మును = వీర్యమును. పెంపున్ = గొప్పతనమును. లావున్ = బలమును. వెరవును = నేర్పును. తా.—బృహన్నలా! నీవు త్వరగా వచ్చి కవచము ధరించి తేరెక్కుము, ఇది నీకుఁ దప్పదు, నీపరాక్రమము మొదలగువానిని సైరంధ్రి మాకుం జెప్పెను.

35. కలయప్పటికిన్ = కలిగినప్పుడు. సంగరముచేఁతకున్ = యుద్ధము చేయుటకు. ఆరసి = విచారించి. బాహుబలఆఢ్యుఁడు = భుజబలముచే నొప్పినవాఁడు. ఏడ్తెఱన్ = పరాక్రమముచేత. తా.—ఉత్తరుని మాట విని బృహన్నల యిట్లు చెప్పెను, ఆటపాటలు గలిగినప్పుడు నన్ను రప్పింపవలయును గాని యుద్ధమునకు నన్ను సారథిగా రమ్మనుట యుక్తము గాదు. చక్కఁగా విచారించి బలవంతుఁ డయినవానిని సారథినిగాఁ జేసికొమ్ము.

36. వైరాటి = విరాటునికొడుకయిన యుత్తరుఁడు. కిరీటికిన్ = అర్జునునితో.

ఉ. ఖాండవ మేర్చునప్పుడు ద♦గన్ రథచోదకవృత్తి నల్పి యా
ఖండలసూతికిన్ జయము ♦ గల్గ నొనర్చినయట్టిబుద్ధియున్
దండితనంబు నీయెడన ♦ తక్కెనె నాదెస మైత్త్రి పెంపు మిం
కొండొకమాట దక్కుము ర♦ణోత్సహనం బొనరింపు గ్రక్కునన్. 37

గీ. అసిన నాతనిమాటకు ♦ నడ్డ మాడ, వెఱచినట్టితెఱంగు భా♦వించి యల్ల
నియ్యకొనుటయు నమ్మను♦జేంద్రసుతుఁడు, దృఢతనుత్రాణ మతనికిఁ♦ దేరఁ బనిచె.

క. తెప్పించి తొడుగు మీ వని, యొప్పించిన నిట్టునట్టు ♦ నొఱపలుగా మైఁ
గప్పికొని యాబృహన్నల, యప్పుడు నగియించె నచటి♦యబలాజనమున్. 39

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ, దత్తనువున మఱువు దొడిగి ♦ తాను హృద్యో
దాత్తం బగుకంకట మిడి, చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ ♦ జిడిముడిపడఁగన్. 40

---

37. ఏర్చునప్పుడు = కాల్చునప్పుడు. రథచోదకవృత్తి = తేరుకడపువాని కార్యమును. ఆఖండలసూతికిన్ = అర్జునునకు. దండితనంబున్ = పరాక్రమమును. ఈయెడన్ అ = ఈ సమయము నందే. తక్కెనె = తగ్గెనా? నాదెసన్ = నాయందు. మైత్త్రి = స్నేహమును. పెంపుము = వృద్ధిపఱుపుము. ఒండుఒకమాట = వేఱుమాటను. తక్కుము = విడువుము. రణఉత్సహనంబు = యుద్ధమునం దుత్సాహమును. ఒనరింపు = చేయుము. తా.—ఖాండవవనము దహించునప్పుడు నీ వర్జునునకు సారథ్యము చేసి జయము గలిగించితివి, అట్టి నీబుద్ధిపరాక్రమము లిప్పుడుమాత్ర మెట్లు తగ్గిపోవును? కాఁబట్టి నీవు నాయందుఁ బ్రీతి యుంచి మాఱాడక యుద్ధమునకు సిద్ధపడుము.

38. వెఱచినట్టితెఱంగు = భయపడినట్లు. భావించి = నటించి. ఇయ్యకొనుటయున్ = అంగీకరింపఁగా. అమ్మనుజఇంద్రసుతుఁడు = ఆయుత్తరుఁడు. దృఢతనుత్రాణము = గట్టికవచమును. తేరన్ = తెచ్చుటకు. పనిచెన్ = ఆజ్ఞాపించెను. తా.—అట్లుత్తరుఁడు చెప్పఁగా నాతని యాజ్ఞకు బృహన్నల మాఱాడ వెఱచినట్లు నటించి యంగీకరించెను. అంత నుత్తరుఁడు బృహన్నలకుఁ గవచము తెచ్చుట కాజ్ఞాపించెను.

39. ఒఱపలుగాన్ = తాఱుమాఱుగా. మైన్ = దేహమునందు. అబలాజనమున్ = స్త్రీలను. నగియించెన్ = నవ్వించెను. తా.—కవచమును దెప్పించి ధరింపు మని బృహన్నల కియ్యఁగా నతఁడు చేతఁ గాని వానివలె నాకవచమును దాఱుమాఱుగా దేహమునందుఁ గప్పికొని యచటి స్త్రీలను నవ్వించెను.

40. సత్వరంబుగన్ = త్వరతోఁ గూడినట్లుగా. తత్తనువునన్ = బృహన్నల దేహమునందు. మఱువు = కవచమును. హృద్యఉదాత్తంబు = మనోహరమును నుత్తమమును. కంకటము = కవచమును. పసిన్ = ఆవులమందను. క్రమ్మఱింపన్ = మరల్చుటకు. చిడిముడిపడఁగన్ = తొట్రుపడఁగా. తా.—అంత నుత్తరుఁ డాబృహన్నలకుఁ గవచము తొడిగి తాను నుత్తమ మగు కవచమును ధరించి పశువుల మరల్చుటకు వేగిరపడుచున్న మనస్సు గలవాఁడై.

వ. బృహన్నల నాలోకించి. 41

క. హయములఁ బూన్పుము రథమున, రయమున సిడమెత్తు మిపుడ ♦ రావలయును గో
చయము గొని యస్మదీయవి, జయ మభినందింపఁ బురము ♦ జను లెదురుకొనన్.

గీ. అనిన నీవేమి పనిచిన ♦ నట్ల చేయ, వలయు నీ వున్నయెడ నుండ ♦ వలయు నీవు
చన్న దెసఁ జనవలయు నా ♦ శక్తియెఱిఁగి, పంచిపనిగొని కడిమిమైఁ ♦ బగఱ గెలుము.

వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నాధనంజయుండు. 44

క. కాంచనమాలాలంకృత, చంచత్తనులీల మెఱయు ♦ జవనాశ్వములం
బూంచి రథంబున మణిమయ, పంచాననకేతు వెత్తె ♦ బంధురభంగిన్. 45

వ. ఇట్లు సన్నాహంబు మెఱసినసారథిం జూచి యుత్తరయుం జెలులు నిట్లనిరి. 46

---

41. ఆలోకించి = చూచి.

42. హయములన్ = గుఱ్ఱములను. రయమునన్ = వేగముగా. సిడము = టెక్కెమును. గోచయమున్ = ఆవులసమూహమును. అస్మదీయవిజయము = మన దైనజయమును. అభినందింపన్ = కొనియాడుటకు. తా.—మనజయమును కొనియాడుటకై పట్టణముజను లెదురువచ్చునట్లు ఇప్పుడే మన మావులమందను మరలించికొని రావలయును, కాఁబట్టి శీఘ్రముగా తేరికి గుఱ్ఱములు గట్టి ధ్వజ మెత్తి యాయితము గావింపుము.

43. కడిమిమైన్ = పరాక్రమముచేత. పగఱన్ = శత్రువులను. తా.—ఉత్తరుని మాట విని బృహన్నల యిట్లనియె. నీవాజ్ఞాపించినట్లు చేయుచు నీ వున్నచోటనే యుండుచు నీవు పోయినచోటికే పోవు చుండెదను, నాశక్తిచొప్పున న్నాచేఁ బని చేయించుకొని శత్రువుల గెలువుము. వ్యా.—గెలుము—వ్య. గెలుచు + ము—చువర్ణలోపము వైకల్పికము. "పిలుచు లోనగు వానికి ముత్తుపరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు" అని బాలవ్యాకరణము.

44. అధనంజయుండు = ఆయర్జునుఁడు.

45. కాంచనమాలా అలంకృతచంచత్ తనులీలన్ = బంగారుదండలచే నలంకరింపఁబడిన యొప్పుచున్న దేహములయొక్క విలాసముచేత. మెఱయు జవనఅశ్వములన్ = ప్రకాశించునట్టి వేగము గల గుఱ్ఱములను. మణిమయపంచాననకేతువు = రత్నాలచేఁ జేయఁబడిన సింహధ్వజమును. బంధురభంగిన్ = చక్కని విధమున. ఎత్తెన్. తా.—రథమునకు బంగారుదండలతో నలంకరింపఁబడిన గుఱ్ఱములం గట్టి మణిమయం బగుసింహధ్వజమును నెత్తెను.

46. సన్నాహంబు = ప్రయత్నము. మెఱసినసారథిన్ = ప్రకాశించుచున్న సారథిని. వ్యా.—సన్నాహంబు మెఱసిన—ఇట నధికరణమునకుఁ బ్రాధాన్యవివక్షచే మెఱసిన అను ధాతుజన్య విశేషణము సారథితో సమసించెను, మెఱసినసన్నాహము గలసారథిన్ అనునది స్వాభావికప్రయోగము. "కర్త్రాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించును" అని బాలవ్యాకరణసూత్రము.

క. కురువీరుల గెలిచి తదం, బరములలోఁ జిత్రవర్ణ♦భాసురములుగాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ, కరములుగా బొమ్మపొత్తి♦కలకుం దెండీ. 47

క. అనుడు బృహన్నల యిట్లను, జనపాలకనందనుండు ♦ జయలక్ష్మిం జే
కొను నెడ చీరలు దెచ్చుట, పనియే యటు సూచుఁ డెల్ల♦భంగులఁ దెత్తున్. 48

వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాదివివిధసాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబులఁ బుక్కి సక్కంజేయ నుత్తరుండును బసులం బట్టినదెస గోపాలకుల నడిగిన వారు పితృవనంబువలనిం జెప్పిన వినుచు రథారోహణంబు సేసి వెడలి పౌరవృద్ధపుణ్యాంగనాభూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున నయినమాంగల్యం బిట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు మని దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముం డయినయాఫల్గుననైపుణంబున వల్గదశ్వం బగురథంబురయంబునకు మెచ్చుచుం బరేతనిలయప్రాంతప్రదేశంబు సేరం జని.

సీ. అభినవజలధర♦శ్యామంబు లగునెడ, లాకుజొంపంబుల ♦ ననుకరింప
సాంధ్యరాగోపమ♦చ్ఛాయంబు లగుపట్లు, కిసలయోత్కరములఁ ♦ గ్రేణిసేయ

---

47. కురువీరులన్ = శూరు లయినకౌరవులను. తత్ అంబరములలోన్ = వారివస్త్రములలో. చిత్రవర్ణభాసురములుగాన్ = వింత లగురంగులచేఁ బ్రకాశించునవి యగునట్లుగా. తరము = దినుసు. లోచనఉత్సవకరములుగాన్ = కనులపండువు చేయునవిగా. తా.—కౌరవులను గెలిచి వారివస్త్రములలో నానావిధవర్ణములు గలిగి చక్కనివానిని దినుసులుగా నేతి బొమ్మలకుఁ గట్టుటకై కొనిరండు.

48. జనపాలకనందనుండు = రాజకుమారుఁడు. చేకొనుట = పొందుట. పనియే = ఒకకార్యమా? ఎల్లభంగులన్ = అన్నివిధములచేతను. తా.—ఉత్తర మొదలగువారి మాట విని బృహన్నల యిట్లు చెప్పెను, ఉత్తరుఁడు కౌరవుల జయించునపుడు బొమ్మపొత్తిగుడ్డలు తెచ్చుట గొప్పకాదు, కావున నవశ్యము తెత్తును.

49. ధనుస్తూణీరకృపాణముద్గరఆదివివిధసాధనంబులు = విల్లును అమ్ములపొదులును గత్తియును గుదియయును మొదలుగాఁ గల నానావిధము లయిన యాయుధములను. పుక్కి = ముడుతను. పితృవనంబువలనిన్ = శ్మశానముదిక్కును. రథఆరోహణంబు = తే రెక్కుటను. పౌరవృద్ధపుణ్య అంగనా భూసుర సమూహంబులు = పట్టనము నందలి ముసలివారి యొక్కయు ముత్తైదువల యొక్కయు బ్రాహ్మణుల యొక్కయు సమూహములు. నీ కతంబునన్ = నీవలన. మాంగల్యము = శుభము. భవత్ సాహాయ్యంబునన్ = నీతోడ్పాటుచేత. భూమింజయునకున్ = ఉత్తరునకు. పురంబు = పట్టణమునుండి. నిర్గమించి = వెడలి. నిరర్గళపరాక్రముండు = అడ్డులేనిపరాక్రమము గలవాఁడు. ఫల్గుననైపుణంబునన్ = అర్జునుని సామర్థ్యముచేత. వల్గత్ అశ్వంబు = పరువిడుచున్న గుఱ్ఱములు గలది. రయంబునకున్ = వేగమునకు. పరేతనిలయప్రాంతప్రదేశంబు = శ్మశానముదగ్గఱి చోటును.

రాజమరాళగౌ♦రము లగుచోటులు, దఱచుఁబూఁబొదలచం♦దంబు నొందఁ
హారిద్రరుచిసమా♦నాకృతు లగుతావు, లడరెడు పుష్పొడు♦లట్లు మెఱయఁ
గలయ నెగసి ధరాధూళి ♦ లలితవనము, దివికి నలిఁ గాఁపుపోయెడు♦ తెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ నేల ♦ గోడివడఁగ, నడచుకౌరవరాజసై♦న్యంబుఁ గనియె.

——( ఉత్తరుఁడు కురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట. )——

క. కని యుత్తరుండు గరుపా, ఱినమేనును దలఁకుమనము ♦ ఱిచ్చవడినచూ
పునునై త్రొట్రుపడుచు ని, ట్లనియె దిగులు సొచ్చి యాబృ♦హన్నలతోడన్. 51

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరా♦భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరా♦కీర్ణంబు శస్త్రాస్త్రజా

---

50. అభినవజలధరశ్యామంబులు = క్రొత్తమేఘమువలె నల్లనివి. అగుఎడలు = అయినప్రదేశములు. అనుకరింపన్ = పోలఁగా. సాంధ్యరాగ ఉపమచ్ఛాయంబులు = సంధ్యారాగముతోఁ బోల్కిగల కాంతులు గలవి. అగుపట్లు = అయినచోట్లు. కిసలయ ఉత్కరములన్ = చిగుళ్ల సమూహములను. శ్రేణిసేయన్ = తిరస్కరింపఁగా. రాజమరాళగౌరములు = రాజహంసలవలెఁ దెల్లనివి. తఱచు పూఁబొదల చందంబు = దట్టము లయిన పూవుల పొదలయొక్క విధమువంటి విధమును. హారిద్రరుచిసమాన ఆకృతులు = పసపుకాంతితో సమాన మయిన యాకారము గలవి. అగు తావులు = అయినస్థానములు. అడరెడు పుష్పొడులట్లు = అతిశయించుచున్న పుప్పొళ్లవలె. కలయన్ = అంతటను. నెగసి = ఎగిరి. ధరాధూళి = నేలదుమ్ము. లలితవనము = మనోహర మయిన యుద్యానవనము. దివికిన్ = ఆకాశమునకు. నలిన్ = తగునట్లు. కాఁపుపోయెడు తెఱఁగు = కాఁపురము పోవు విధమును. గోగణము = ఆవులమంద. ముంగలిగన్ = ముందుపోవునది యగునట్లు. గోడివడఁగన్ = ఆణఁగునట్లు. తా.—ఉత్తరుఁడు ఆవులను ముందు తోలుకొనిపోవుచున్న కౌరవసేనను జూచెను, ఆ కౌరవసేన నడచునపుడు భూమినుండి ధూళి మిక్కుటముగా నెగయుచుండెను, అందు నల్లనిప్రదేశములయందలి ధూళి యాకుగుబురులవలెను, ఎఱ్ఱనిభూములయందలిధూళి చివుళ్లసమూహమువలెను, తెల్లని ప్రదేశములయందలి దుమ్ము పూఁబొదలవలెను, పసపురంగు గల స్థలములయందలి పరాగము పుప్పొళ్ళవలెను దోఁచుటవలనఁ జక్కని యుద్యానవనము ఆకాశమునకుఁ గాఁపురము పోవుచున్నదో యనునట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష. పాఠాం:—అరిగాఁపుపోయెడు తెఱఁగు = కప్పము కట్టు కాఁపురము పోవువిధము అని యర్థము.

51. గరుపాఱినమేనును = గగుర్పు గల దేహమును. తలఁకుమనమున్ = భయపడిన మనస్సును. ఱిచ్చవడినచూపునున్ = నిశ్చేష్టమయిన దృష్టియును. ఐ = కలవాఁడై. తా.—చూచి యుత్తరుఁడు భయపడి దేహము గగుర్పాటు నొందఁగా దృష్టి నిశ్చేష్టము కాఁగాఁ దత్తఱపడుచు బృహన్నలతో దిగులుపడి యిట్లు చెప్పెను.

52. భీష్మ...అభీలంబు—భీష్మ = భీష్ముఁడును, ద్రోణ = ద్రోణుఁడును, కృప = కృపుఁడును, ఆది = మొదలుగాఁ గల, ధన్వి = విలుకాండ్రు అను మండుచున్న వృక్షవిశేషములయొక్క, నికర = సమూహముచేత, అభీలంబు = భయంకర మయినదియు. దుర్యోధన......ఆకీర్ణంబు—దుర్యోధన = దుర్యో

లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా♦త్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ♦ జేరంగ శక్తుండనే. 52

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా, ర్ముకవిద్యాప్రౌఢిమై ని♦రూఢు లయినయా
శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాదియోధ♦వీరుల కెదు రే. 53

క. ఇట్లగు టెఱుఁగక వచ్చితి, మెట్టొకొ మనభంగి వీర ♦ లిందఱును గడుఁ
బెట్టిదులు మనకు మార్కొను, నట్టికొలఁది గాదు భీతి ♦ యడరెడుఁ దోడ్తోన్.

---

ధనుఁడు అను, గ్రీష్మ = గ్రీష్మర్తువునందలి, ఆదిత్య = సూర్యునియొక్క, ప్రతాప = పరాక్రమ మను యెండయొక్క, విసర = సమూహముచేత, ఆకీర్ణంబు = వ్యాపింపఁబడినదియును. శస్త్ర......ఉగ్రంబు—శస్త్రాస్త్ర = ఆయుధములయొక్కయు బాణములయొక్కయు, జాల = సమూహము అను, ఊష్మ = వేఁడిమిచేత, స్ఫార = అతిశయించిన, చతుర్విధ = నాలుగువిధము లయిన, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, బల = సేనలచేత, అత్యుగ్రంబు = మిక్కిలి భయంకర మయినదియు. ఉదగ్రధ్వజ అర్చిష్మత్త్వ ఆకలితంబు = ఉన్నతము లయిన టెక్కెములు అను జ్వాలలు గలది యగుటచేతఁ బొందఁబడినదియు. ఇది = ఈ. సైన్యము = సేనను, సేన యను నిప్పు ననుట, ఇట సైన్యమునందగ్నిత్వారోపము గమ్యము. ఏన్ = నేను, ఉత్తరుఁ డనుట. శక్తుండనే = సమర్థుఁడనా ? ధన్వినికరాభీలంబు—భీష్మద్రోణకృపాదులయందుఁ గేవల వృక్షత్వారోపము చేసినచో నసంగతము స్ఫురించును కావున మండుచున్న వృక్షవిశేషము లని వ్యాఖ్యానము చేయఁబడినది.

తా.—భీష్ముఁడు మొదలగు మహాశూరులు అను మండుచున్న యేఱుమద్దిచెట్లు గలదియును, దుర్యోధనుఁడు అను గ్రీష్మర్తు సూర్యునిప్రతాపముతోఁ గూడినదియును, శస్త్రాస్త్రములు అను వేఁడిమి గల చతురంగబలములతోఁ గూడినదియును, ఉన్నతధ్వజంబులు అను పెనుమంటలు గలదియు నగు కౌరవసైన్య మను నీకారుచిచ్చును నేను సమీపించుటకుఁ గూడ శక్తుఁడను కాను. అలం. రూపకము. వేసవియెండలోఁ బెనుమంటలతోఁ గూడిన కారుచిచ్చువలె నీసైన్యము నాకు భయమును గలిగించుచున్న దని భావము.

53. అకృతఅస్త్రుఁడన్ = నేర్పఁబడనియస్త్రవిద్య గలవాఁడను. కార్ముకవిద్యాప్రౌఢిమైన్ = విలువిద్యయందలి నేర్పుచేత. నిరూఢులు = ప్రసిద్ధులు.

తా.—నేను అస్త్రవిద్య నేర్చినవాఁడను కాను, చిన్నవాఁడను, ధనుర్విద్యయందు మిక్కిలి ప్రసిద్ధు లయిన యాశకుని మొదలగు మహావీరులతో నెట్లు యుద్ధము చేయఁగలను ?

54. మనభంగి = మనగతి. ఎట్టొకో ? బెట్టిదులు = క్రూరులు. మార్కొనునట్టికొలఁది = ఎదుర్కొనునట్టిశక్తి. భీతి = భయము. తోడ్తోన్ = అప్పటప్పటికి. అడరెడున్ = అతిశయించుచున్నది.

తా.—మనము మొదటఁ దెలియక వచ్చితిమి. మనగతి యేమగునో తెలియదు, ఈశకుని మొదలగువా రందఱు మిక్కిలి శూరులు, మనము వీరి నెదిరింపఁ జాలము, నాకప్పటప్పటికి భయము హెచ్చుచున్నది.

ఉ. కౌరవసేనఁ జూచి వడఁ♦కం దొడఁగెన్ మదితోన మేను నీ
వూరక పోవు చున్కి యిది ♦ యొప్పదె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి ♦ నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు ♦ దీపన ముల్ వినవే బృహన్నలా. 55

వ. అనిన దరహసితవదనుం డగుచు శతమఖతనయుం డతని కి ట్లనియె. 56

చ. అసదృశలీలఁ బొల్చురథి♦కావలిమీఁదఁ జనంగ వెఱ్ఱినే
మసలక యామిషంబు గొని ♦ మార్గము పట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము ♦ వేగ మరల్తము గాక యిమ్మెయిం
బసు లటు పోవఁగా మరలఁ ♦ బాడియె నీకు నరేంద్రనందనా. 57

ఉ. అంతిపురంబులోనఁ గల♦యంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ ♦ జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ

---

55. మదితోన్ ఆ = మనస్సుతోఁ గూడ. మేను = శరీరము. వడఁకన్ తొడఁగెన్ = వణఁకసాగెను. ఇప్పటిభంగిన్ = ఇప్పటివిధమును. మార్కొనమి = ఎదిరింపకుండుట. తీపు = తియ్యనివి. మిక్కిలి ప్రియము లనుట.

తా.—బృహన్నలా! కౌరవసేనఁ జూచినంతనే నామనస్సులో భయము గలిగి దేహము వణఁకు చున్నది, నీ విట్లూరక రథము తోలుచుఁ బోవుట యుక్తము కాదు, ఈస్థితిలో నేను వీరి జయింపఁ జాలను, కావున శీఘ్రముగా రథమును త్రిప్పుము, నీకు మాత్రము ప్రాణములమీఁది యాశ లేదా?

56. దరహసితవదనుండు = చిఱునవ్వు గల మోము గలవాఁడు. శతమఖతనయుండు = ఇంద్రునికొడు కయిన యర్జునుఁడు.

57. అసదృశలీలన్ = సాటిలేనివిలాసముచేత. పొల్చు రథికఆవలిమీఁదన్ = ప్రకాశించు నట్టి శూరులసమూహముమీఁదికి. చనంగన్ = పోవుటకు. మసలక = జాగు సేయక. ఆమిషంబు = గోధనమును. మార్గముపట్టినతుచ్ఛసైన్యమున్ = పోవుచున్న క్షుద్రసేనను. ముట్టి = తాఁకి. మరల్తము = మరలింతము. ఇమ్మెయిన్ = ఈవిధమున. మరలన్ = మరలిపోవుట. పాడియె = ధర్మమా? నరేంద్రనందనా = రాజపుత్త్రుఁడా!

తా.—రాజపుత్త్రుఁడా! గొప్పపరాక్రమముతోఁ గూడిన రథికులమీఁదికిఁ బోవుటకు నే నేమి పిచ్చివాఁడనా? మనగోవులను దోలుకొనిపోవుచున్న యల్పసైన్యము నెదిరించి మనగోవులను మరల్చు కొనవలసినదే గాని మనకు భీష్మాదులతోఁ బోరవలసినది లేదు, ఇట్లు పశువులను విడిచి మరలిపోవుట నీకు ధర్మము కాదు.

58. అంతిపురంబులోనన్ = అంతఃపురమునందు. కలఅంగనలు = ఉన్న స్త్రీలు. నెమ్మనంబులన్ = చక్కనిమనస్సులయందు. సంతసము = సంతోషమును. చయ్యనన్ = శీఘ్రముగా. మేటివి = శూరుఁడవు. దంతితురంగ సద్భటరథంబును = ఏనుఁగులను గుఱ్ఱములను మేలిబంటులను తేరులను, సేనాంగ మగుటచే సమాహారద్వంద్వము. కలంగుట = భయపడుట. పాఠాం:—దంతి

పంతము నేటికై యరద ♦ మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భటక♦దంబముఁ జూచి కలంగు టొప్పునే. 58

గీ. అనినపలుకులకు బృ♦హన్నలఁ గనుఁగొని, యెలుఁగు వడఁగ నాతఁ ♦ డిట్టు లనియెఁ
బసుల దయ్యె మెఱుఁగుఁ ♦ బడఁతులసంతోష, మేల నాకు ననికిఁ ♦ జాల నేను.

వ. అనవుడు. 60

చ. తనభుజశక్తియున్ రిపుల♦దర్పము నేర్పడఁ జూచి చూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది ♦ లోకముచక్కటి శూరు లైన ది
నిని మది మెచ్చ రీబలము ♦ నీదెసఁ దేటియుఁ జూడ దింతకున్
మును భయహేతు వైనవిధ♦ముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 61

సీ. దెసలు బీఁటలువాఱఁ ♦ దివురుచిందములకో, లాహలంబులకుఁ గ♦లంగఁబడక
యురవడి సేనలు ♦ దెరలఁ బైఁ దోఁతెంచు, ధూళి పెల్లడరినఁ ♦ దూలపోక

---

తురంగసద్భటకదంబము = ఏనుఁగులయు గుఱ్ఱములయు మేలిబంటులయు సమూహమును అని యర్థము, ఇందు రథికులు గ్రహింపఁబడమి చింతనీయము. రథంబులన్ అను బహువచనాంతపాఠము సేనాంగముల కేకవద్భావము నిత్య మగుటచే నుపేక్ష్యము.

తా.—అంతఃపురమున నున్న స్త్రీలు సంతోషించునట్లు పశువులను శీఘ్రముగాఁ దెచ్చెద నని ప్రతిజ్ఞ చేసి మహాశూరుఁడవై రథ మెక్కి వచ్చి యిచ్చటఁ జతురంగసైన్యమును జూచి భయపడుట తగదు.

59. ఎలుఁగు = కంఠధ్వని. వడఁగన్ = తగ్గఁగా. పడఁతుల = స్త్రీలయొక్క. అనికిన్ = యుద్ధమునకు.

తా.—ఆమాటలు విని యుత్తరుఁడు బృహన్నలం జూచి హీనస్వరముతో నిట్లనియె. పశువు లేమైన నగుఁ గాక స్త్రీలు సంతోషింపక పోయినను పోవుఁ గాక నేను యుద్ధము సేయఁజాలను.

61. తనభుజశక్తియున్ = తనచేతులలావును. రిపులదర్పమున్ = శత్రువులపరాక్రమమును. తెగకఉన్నన్ = సాధ్యము కానిపక్షమున. పోక = యుద్ధము విడిచి పోవుట. లోకముచక్కటి = లోకధర్మము. నీదెసన్ = నీదిక్కును. తేటియున్ = చక్కఁగా. భయహేతువు = భయమునకుఁ గారణము. ఇత్తఱిన్ = ఈసమయమునందు.

తా.—తనబలమును శత్రువులబలమును చక్కఁగాఁ జూచి సాధ్యము కా దని తోఁచినపక్షమున యుద్ధమును విడిచి మరలి పోవుట లోకధర్మము. శూరులు దీనిని కూడ నంగీకరింపరు. ఈకౌరవసైన్యము నీవైపు తిరిగి కూడ చూడలేదు, ఇంతలోపల నీ కిట్టిభయము కలుగుటకుఁ గారణ మేమో తెలియకున్నది.

62. దెసలు = దిక్కులు. బీఁటలువాఱన్ = పగులునట్లు. తివురుచిందముల కోలాహలంబులకున్ = మ్రోఁగుచున్న శంఖములధ్వనులకు. కలంగఁబడక = కలఁతనొందక. ఉరవడిన్ = మిక్కిలివేగముచేత. తెరలన్ = విజృంభింపఁగా. పైన్ = మీఁదికి. తోఁతెంచుధూళి = వ్యాపిం

చతురంగబల మతి♦సాంద్రతఁ గవిసిన, యగ్గలికమునకు ♦ బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్య♦సారథివర్మాంగ, తతి నాటుకొలుచునఁ ♦ దల్లడిలక
బహువిధంబులఁ బగతుర♦బరవసమున, నిత్తెఱంగునఁ గలుగుక్రం ♦ దెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి ♦ నెగడుఁ గాక, దవ్వుదవ్వుల విఱిగిన ♦ నవ్వ రెట్లు. 62

చ. అనుదివిజేంద్రనందనున ♦ కమ్మనుజేశ్వరసూనుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు ♦ విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతి యు♦దగ్రత సైన్యము లెన్ని యన్నియుం
గొని యటఁ బోయెఁ గాన మన♦కుం బురి బాసట లేర యెవ్వరున్. 63

గీ. ఒంటిఁ దలపడి కురుసేన ♦ నోర్చువాఁడ, నే యిదేటికి వెడమాట ♦ లిట్టి లాడ

చునట్టి దుమ్ము. పెల్లు = మిక్కిలి. అడరినన్ = అతిశయింపఁగా. తూలపోక = చిన్నపోక. చతురంగబలము = నాలు గంగములు గల సైన్యము. అతిసాంద్రతన్ = మిక్కిలి దట్టముగా. కవిసినఅగ్గలికమునకున్ = చుట్టుకొన్న యతిశయమునకు. బెగ్గడిలక = భయపడక. రథ్యసారథివర్మఅంగతతిన్ = గుఱ్ఱములయు సారథియొక్కయు కవచములయొక్కయు నవయవములయొక్కయు సమూహమునందు. నాటుకొలుచునన్ = గ్రుచ్చుకొనునట్టి యతిశయముచేత, దట్టముగా నాటుటచేత ననుట. పగతురబరవసమునన్ = శత్రువుల పరాక్రమముచేత. క్రందు = ఉపద్రవమును. నెగడున్ = కలుగును. దవ్వుదవ్వులన్ = మిక్కిలి దూరమునుండియే. విఱిగినన్ = పాఱిపోయినయెడ. ఎట్లు, నవ్వరు ?

తా.—దిక్కులు బ్రద్ద లగునట్లు మ్రోఁగునట్టి శంఖములధ్వనులకు భయపడక, సేనలత్రొక్కుళ్లకు లేచునట్టి దుమ్మునకు వెనుదీయక, చతురంగసేనలును గుంపులు గూడి పైఁబడినప్పుడు చలింపక, శస్త్రాస్త్రములు గుఱ్ఱములమీఁదను సారథి మీఁదను కవచముల భేదించి దేహమున నాటునప్పుడు కలఁత నొందక, యిట్లు నానావిధములుగా శత్రువులు చేయు పరాక్రమమును సహించి యుద్ధరంగమున వెనుకంజ వేయక నిల్చి గెల్చినయెడఁ గీర్తి కలుగును గాని యిట్లు దూరమునుండియే పరుగెత్తినయెడ జనులు నవ్వుదురు.

63. అనుదివిజఇంద్రనందనునకున్ = ఇట్లు చెప్పునట్టి దేవేంద్రునికుమారుఁ డయిన యర్జునునితో. అమ్మనుజఈశ్వరసూనుఁడు = ఆవిరాటరాజుకుమారుఁ డయిన యుత్తరుఁడు. త్రిగర్తవాహినులు = త్రిగర్తరాజుసేనలు. విక్రమసంపద = పరాక్రమముయొక్క యతిశయము. పతి = రాజు, విరాటుఁ డనుట. ఉదగ్రతన్ = గొప్పతనముచేత. బాసట = తోడు.

తా.—అర్జునుఁ డిట్లు చెప్పఁగా నుత్తరుఁ డిట్లనియె. సుశర్మసైన్యములు పరాక్రమముతో గోవుల నపహరింపఁగా; విరాటరాజు సైన్యము లన్నియును దీసికొని వారిమీఁదికిఁ బోయెఁ గావున మనకుఁ బట్టణమున సహాయు లెవ్వరును లేరు.

64. తలపడి = ఎదుర్కొని. ఓర్చువాఁడను ఏ = జయించువాఁడనా ? వెడమాటలు = వ్యర్థపుపలుకులను. రయంబునన్ = వేగముగా. నీటి = దగవు.

వారు గానక మున్న యీ ♦ తేరు దోలు, కొని రయంబునఁ బురి కరు♦గుటయ నీతి.

వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె. 65

క. వెగ డొంది యిట్లు వలుకఁగ, నగునే పగతురు ప్రమోద ♦ మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు, దెగడంగా మగిడి పోక ♦ దీనత గాదే. 66

వ. అట్లుం గాక. 67

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా♦నం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితి నీవు బంటుతన మ ♦ ట్లగ్గించి పౌరాలి దీ
వన లిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గో♦వర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త వోదునె భయో♦త్కంపంబు నీ కేటికిన్. 68

గీ. చిత్తవృత్తి యొక్కించుక ♦ చిక్కఁ బట్టు, మిపుడ కౌరవ సైనికు ♦ లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమున నాల్వు♦ వెరవుమెఱయఁ, గదుపుఁ బెట్టించి పోదము♦ గ్రమ్మఱంగ.

---

తా.—నే నొంటరిగా నీకౌరవసేనతోఁ బోరఁ జాలను, నీ వీపనికిమాలినమాటలు చెప్ప వలదు, కౌరవులు చూచుటకు మున్నే తేరు తోలుకొని శీఘ్రముగా నూరు చేరవలయును.

65. పార్థుండు = కుంతికొడు కయిన యర్జునుఁడు. పార్థివనందనునకున్ = రాజపుత్త్రుఁ డయిన యుత్తరునితో.

66. వెగడుపొంది = భయపడి. ప్రమోదము = సంతోషమును. తెగడంగాన్ = నిందించునట్లు. మగిడి = మరలి. పోక = పోవుట. దీనత = దైన్యము.

తా.—శత్రువులు సంతోషించునట్లు ఇట్లు భయపడి పలుక వలదు. పశువులను విడిచి పోయిన యెడ పట్టణమునందలి జనులు నిందింతురు, అవమానము కలుగును.

68. కడంగి = పూని. పేర్కొనియెన్ = చెప్పెను. దానన్ = అందుచేత. పెంపుమైన్ = గొప్పతనముచేత. బంటుతనము = శౌర్యమును. అగ్గించి = కొనియాడి. పౌరఆలి = పురజనులసమూహము. కని = చూచి. ఏన్ = నేను, బృహన్నల యనుట. క్రమ్మఱి = మరలి. రిత్త = వ్యర్థముగా. భయఉత్కంపంబు = భయముచే వణఁకుట.

తా.—సైరంధ్రి నాపేరు గొప్పగాఁ జెప్పెను, దానిచే నీవు నన్ను గొప్పచేసి తోడుగాఁ దోడ్కొని వచ్చితివి. పురజనులు నాశౌర్యమును గొనియాడి దీవించిరి, ఇట్లు వెడలి వచ్చి కౌరవులు గోవులఁ గొనిపోవుటం జూచి నేను వ్యర్థముగా మరలి రాను, నీవు భయపడవలదు.

69. చిత్తవృత్తి = మనోధర్మమును. చిక్కఁబట్టుము = నిలుపుకొనుము. వెఱఁగుపడన్ = ఆశ్చర్యపడునట్లు. కదుపున్ = అవులమందను. పెట్టించి = విడిపించుకొని. క్రమ్మఱంగన్ = మరల. పోదము అని యన్వయము.

తా.—నీవు మనస్సునఁ గొంచెము ధైర్యము తెచ్చికొనుము. ఇపుడే మన బలపరాక్రమము లను గౌరవు లాశ్చర్యపడునట్లు అవులను విడిపించుకొని మరలిపోదము.

వ. అనుచు వివ్వచ్చుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్లభకుమారుండు. 70

క. దవ్వుల విఱిగినఁ బౌరులు, నవ్వుదురని మేలుమేలు ♦ నను నాఁగకు నీ
క్రొవ్వఱుగ దేనిఁ దలపకు, మెవ్విధిఁ జని తేమి యనుచు ♦ నెత్తినభీతిన్. 71

క. శరములు శరాసనము న, య్యరదముపై డిగ్గ విడిచి ♦ యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం, బురిదెసకును లజ్జ వీటిఁ♦బోవం బాఱెన్. 72

వ. ఇట్లు పాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబులపగ్గంబులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళితరక్తాంబర యుగలాంచలుండును నగుచు నతనివెనుకం బఱచుసమయంబున నిలిచి కనుంగొను కౌరవబలంబునందు. 73

ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డప♦హాసము సేయుచు గూఢరూపరే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృత♦కాయము మీఁదను దృష్టి నిల్పఁగాఁ

---

70. వివ్వచ్చుండు = అర్జునుఁడు. ఆననంబు = ముఖము. పల్లటిల్లన్ = తెల్లవోవఁగా. ఆభూవల్లభకుమారుండు = ఆరాజపుత్త్రుఁడు, ఉత్తరుఁడు.

71. దవ్వులన్ = దూరమునందు. విఱిగినన్ = విచ్చినయెడ. ఆఁగకు = అడ్డకుము. అఱగదు ఏనిన్ = తగ్గనియెడ. తలపకుము = తాఁకుము. ఎవ్విధిన్ = ఏప్రకారమైనను. చనితి = పోయితివి. ఏమి—నాకేమి యనుట. ఎత్తినభీతిన్ = అధికమయిన భయముచేత.

తా.—దూరమునుండి మరలినయెడఁ బౌరులు నవ్వుదు రని నీవు చెప్పినమాట యాశ్చర్యముగా నున్నది. అట్లు వారు నవ్విన నవ్వుదురు గాక, నాను అడ్డు చెప్పకుము. నీవు క్రొవ్వి యున్నాఁడవు యుద్ధము చేయుము ఎట్లు పోయినను బొమ్ము అని చెప్పుచు మిక్కిలి భయముతో.

72. శరములు = బాణములను. శరాసనమున్ = ధనుస్సును. అతిరభసమునన్ = మిక్కిలి వేగముచేత. ధరణికిన్ = భూమికి. లంఘించి = దాఁటి. లజ్జ = సిగ్గు. వీటిఁబోవన్ = చెడునట్లు.

తా.—బాణములను ధనుస్సును ఆరథమునందే విడిచి తొందరగా నేలకు దుమికి సిగ్గు లేనివాఁడై పట్టణము వైపు పరువిడెను.

73. కుత్సించుచున్ = నిందించుచు. బీభత్సుండు = అర్జునుఁడు. యుగ్యంబులపగ్గంబులు = గుఱ్ఱములపగ్గములను. లంబకేశభారుండును = వ్రేలుచున్న వెంట్రుకలసమూహము గలవాఁడును. ఆందోళితరక్తఅంబరయుగల అంచలుండును = కదలుచున్న యెఱ్ఱనిచీరలయొక్క జంటయొక్క చివరలు గలవాఁడును.

74. అజ్ఞులు = తెలియనివారు. అపహాసము = పరిహాసమును. గూఢరూపరేఖాజ్ఞతన్ = కప్పఁబడిన రూపముయొక్క గుఱుతు తెలియుట. తత్ వికృతకాయముమీఁదను = అతనివికారమయిన శరీరమునందు. దృష్టి = చూపును. ప్రాజ్ఞులు = తెలిసినవారు. మూర్తిసౌమ్యతయున్ = శరీరముయొక్క చక్కఁదనమును. బాహుబలదీర్ఘతయున్ = భుజముల నిడుపును. పటుత్వత్వ

ప్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు ♦ బాహులదీర్ఘతయుం బటుత్వత
త్త్వజ్ఞతయుక్ గతిస్ఫురదు♦దాత్తతయుం గని సంశయంబుతోన్. 74

గీ. ఆఁడుచందంబుఁ బురుషస♦మాకృతియును, గలిగియున్నదియొప్పునూ♦ష్మలతసొంపు
వికృతవేషావృతంబులై ♦ వెలయు నితఁడు, నివుఱు గవిసిన మెఱయని♦నిప్పువోలె.

ఉ. బాహులచాయయుక్ గమన♦భంగియు నర్జునునట్ల దీన సం
దేహము లేదితండు దన♦తేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడి యనఁ ♦ గీడ్పడి యుండెను కాక యీకురు
వ్యూహముతోడికయ్యమున ♦ కొండొకరుం డిటు లొంటి వచ్చునే. 76

చ. విరటుఁడు దక్షిణంబునకు ♦ వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొని ♦ పోయిన నొండులు లేమిఁ జేసి యు

---

జ్ఞతయుక్=బలముయొక్క తత్త్వము నెఱింగినవాఁడగుటయును. బలము గలవాఁడగుటయు ననుట. గతిస్ఫురత్ ఉదాత్తతయుక్= నడకయందుఁ బ్రకాశించుచున్న యతిశయమును.

తా.—తెలియనివారు కొందఱు పేడివేషముచేఁ బ్రచ్ఛన్నమైన యర్జునుని రూపరేఖలు గుర్తింపఁ జాలక యతని వికృతాకారమును గేలి చేయుచుఁ జూచుచుండిరి కాని తెలిసినవారు అతని చక్కఁదనమును దీర్ఘబాహువులను శౌర్యమును నడచువిధమును జూచి సంశయించి.

75. పురుషసమాకృతియును = పురుషునివంటి యాకారమును. ఒప్పుక్ = చక్కఁదన మును. ఊష్మలతసొంపుక్ = శౌర్యముయొక్కవిధమును. వికృతవేషఆవృతంబులు = వికార మయిన వేషముచేఁ గప్పఁబడినవి. ఐ = అగుటచేత. నివుఱు = బూడిద. కవిసినక్= కప్పఁగా. మెఱయని నిప్పువోలెక్. వెలయుక్ = ప్రకాశించును.

తా.—స్త్రీవేషమును బురుషరూపమును గలిగి యీవికృతవేషముచేఁ గప్పఁబడినవియై యితని చక్కఁదనమును శౌర్యమును బ్రకాశింప కుండుటచేత నీతఁడు బూడిద కప్పుటచే వెలుఁగనినిప్పు వోలెఁ బ్రకాశింప కున్నాఁడు.

76. బాహులచాయయుక్ = చేతులకాంతియు. గమనభంగియుక్= నడకతీరును. తేజము= ప్రభావమును. మత్స్యభూమిభృత్ గేహమునందుక్ = విరాటరాజు నింటియందు. పేడి = నపుంస కుఁడు. కీడ్పడి = తక్కువపడి. ఈకురువ్యూహముతోడి కయ్యమునకుక్ = ఈ కౌరవసేనతోడి పోరాటమునకు.

తా.—బాహువులను నడకను చూడఁగా నితఁ డర్జునుఁ డనియే తోఁచుచున్నది. ఇందుకు సందేహము లేదు. అర్జునుఁ డజ్ఞాతవాసమునకై పేడితన మవలంబించి తనతేజస్సును దెలియనియ్యక నీచరూపముతో విరాటునిగృహమున వసించి యుండఁ బోలును, మఱియొకఁ డొంటరిగాఁ గురుసే నతోఁ బోరుటకు రాఁడు.

77. వీరులక్ = శూరులను. నిజఆజికిక్ ఐ = తనయుద్ధమునకై. ఒండులు = ఇతరులు లేమిక్ చేసి = లేకపోవుటచేత. దొరకొనక = చిక్కక.

త్తరుఁ డిట వచ్చు చుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితనిఁ ♦ దోడ్కొని వచ్చినవాఁడు చూడఁగన్. 77

చ. పరి చనుదెంచి గోగణముఁ ♦ బట్టె ననన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డ♦హంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దన♦బుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె ని
ప్పురుషునిశౌర్యసంపదయు ♦ భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. 78

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగుచుండ శుండాలరయలీలాసమరేఖం బగు గమనంబునం బురుహూతపుత్త్రుండు పదశతమాత్రప్రదేశపలాయితుం డైన భూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 79

సీ. వెలవెలఁ బాఱుచు ♦ వెగ డొందుఁ బెదవుల, తడి యాఱ నెంతయుఁ ♦ దల్లడిల్లు
జల్లన నంగంబు ♦ లెల్ల నిండఁ జెమర్చుఁ, బదములుఁ గరములుఁ ♦ గుదియ వడఁకు
హృదయంబు దటతట ♦ నదరంగఁ బెలుకుఱు, దీనదృష్టుల మోముఁ ♦ దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొ♦ట్రిల నేష్చు విడు మని, ప్రార్థించు మాటఁ గీ♦డ్పాటు దోఁప

---

తా.—విరాటరాజు పట్టణములో నుండువారి నందఱిని వెంటఁబెట్టుకొని దక్షిణగోగ్రహణ యుద్ధమునకుఁ బోవుటచే నుత్తరుఁ డిచటికి రాఁ దలఁచి తనరథము తోలుట కితరు లెవ్వరు లేనందున నితనిఁ దోడ్కొని వచ్చి యుండును.

78. పరి = సేన. చనుదెంచి = వచ్చి. అహంకృతిమైన్ = అహంకారముతో. పఱతెంచి = వచ్చి. సైన్యవిస్ఫురణమున్ = సేనలయొక్క విజృంభణమును. శౌర్యసంపదయున్ = పరాక్రమము యొక్క యతిశయమును. భూరిబలంబున్ = ఎక్కువబలమును. పాఠాం:—పరి చనుదెంచి గోగణముఁ బట్టెరి. ఈబహువచనాంతపాఠము కర్త యేకవచన మగుటచే నుపేక్ష్యము.

తా.—కురుసేన వచ్చి పశువులను బట్టె నని విని యుత్తరుఁడు చిన్నవాఁ డగుటచే దీర్ఘాలోచనము చేయక యహంకారముతో వచ్చి యీసైన్యమును జూచి భయపడి పరుగెత్తుచున్నాఁడు. కాని యీపురుషుని బలపరాక్రమముల నేమియు నెఱుంగఁడు.

79. నిశ్చయరహితహృదయులు = నిశ్చయముచే విడువఁబడిన మనస్సు గలవారు. శుండాలరయలీలాసమరేఖంబు = ఏనుఁగుయొక్క వేగముయొక్క విలాసముతో సమాన మయిన విధము గలది. గమనంబునన్ = నడకచేత. పురుహూతపుత్త్రుండు = ఇంద్రుని కుమారుఁ డయిన యర్జునుఁడు. పదశతమాత్రప్రదేశపలాయితుండు = అడుగులు నూఱు కొలఁది గలదూరము పరుగెత్తిన వాఁడు. ఎయిది = వెంబడించి.

80. వెగడు = భయమును. తల్లడిల్లున్ = చలించును. అంగంబులు = అవయవములు. పదములున్ = అడుగులును. కరములున్ = చేతులును. కుదియన్ = వంగునట్లు. పెలుకుఱున్ = విలవిల పోవును. దీనదృష్టులన్ = దుఃఖముతోడి చూపులచేత. తేఱి = చక్కఁగా. ఎలుఁగు = కంఠస్వరము. గద్గదికన్ = డగ్గుత్తికచేత. కీడ్పాటు = తక్కువతనము. నిష్కళంకశుద్ధహేమంబున్ = వరహాలనూఱు గల యపరంజిబంగారమును. నిర్మలఉజ్జ్వల అష్టవైడూర్యమును = పరిశుద్ధమై

నిష్కశతశుద్ధహేమంబు ♦ నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములుఁ దుర♦గాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూరుఁ ♦ బురము సొచ్చి
నప్పుడ యిచ్చెద నీ కను ♦ నార్తుఁ డగుచు. 80

క. నాతోడిప్రేముడిం గడు, నాతుర వై యెదురుచూచు♦నంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ, చూతుం బో నీఁగదే వి♦శుద్ధచరిత్రా. 81

( అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిఁగాఁ జేసికొనుట. )

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించుచుండం బార్థుండు నగుచు
నతనిం దేరు సేరం దెచ్చి. 82

చ. వెఱవకు మన్న పోటు కురు♦వీరులతోడ నశక్యమేని న
త్తెఱఁ గది యేల నీ వుడుగు ♦ తేరికి సారథి గమ్ము నాకుఁ జి

---

ప్రకాశించునట్టి యెనిమిదివైడూర్యరత్నములను, తురగఆఢ్యరథముఁ = గుఱ్ఱములచేఁ బ్రకాశించుచున్న తేరును. కరటిదశకంబుఁ = ఏనుఁగుల పదింటిని. ఆర్తుఁడు = దుఃఖము గలవాఁడు.

తా.—వెలవెలఁ బోవుచు భయపడి పెదవు లెండఁగాఁ బరితపించుచు, దేహమంతయుఁ జెమటఁ బట్టును. కాలుసేతులు ముడుచుకొనునట్లు వడఁకును. గుండె తటతటఁ గొట్టుకొనఁగా విలవిలపోవును. దుఃఖము గల చూపులతో నర్జునునిముఖమును చూచును. కంఠస్వరము తడఁబడఁగా విడువు మని వేఁడుకొనును. పలుమఱు నీచతతోఁ బ్రార్థించును. పట్టణమునకుఁ బోయినవెంటనే నూఱువరహాలయపరంజిబంగారమును నుత్తమము లయిన యెనిమిది వైడూర్యరత్నములను గుఱ్ఱములతోఁ గూడిన తేరును పదియేనుఁగులను నొకగ్రామంబును నీ కిచ్చెద నని దుఃఖముతోఁ జెప్పును.

81. నాతోడిప్రేముడిఁ = నాయందలి ప్రీతిచేత. ఆతురవై= దుఃఖము గలదై. అంబకుఁ = తల్లికి. చేతఃప్రీతిగఁ=మనస్సంతోష మగునట్లు. విశుద్ధచరిత్రా=నిర్మల మయిన నడవడి గలవాఁడా! అర్జునుని సంబోధనము.

తా.—నామీఁద మిక్కిలి ప్రేమ గలిగి దిగులుపడి నారాక కెదురుచూచుచుండెడి మాతల్లిని జూడవలయుఁ బోనిమ్ము.

82. నానావిధదీనఆలాపంబులఁ = పలువిధము లయిన యేడ్పుమాటలచేత. పార్థుండు = అర్జునుఁడు. అతనిఁ = ఆయుత్తరుని.

83. అన్న! ఇది యాదరార్థకము. పోటు = యుద్ధము. అశక్యము= అసాధ్యము. ఏనిఁ = అయినయెడ. అత్తెఱఁగు అది = ఆవిధము, యుద్ధ మనుట. చిచ్చుఱపిడుగు = అగ్నిమయ మయిన పిడుగు. అదరి = విజృంభించి. పఱపెదఁ = తోలెదను. రాజధృతిఁ = దుర్యోధనుని ధైర్యమును. పాపెదఁ = పోఁగొట్టెదను.

తా.—ఉత్తరా! నీవు భయపడ వలదు. కురువీరులతో యుద్ధము చేయుట నీకు శక్యము

చ్చుటపిడు గొట్టు ల ట్టడరి ♦ శూరుల మొత్తము నుగ్గు సేసెదం
బటుపెద సేన రాజుధృతిఁ ♦ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 83

క. అనుచు నొడఁబాటు లేకు, న్నను నయ్యుత్తరుని మొగల ♦ నడుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి, చనియె నరుఁడు జమ్మి సేర ♦ సమ్మదలీలన్. 84

వ. ఇట్లు సవ్యసాచి నిక్షిప్తాయుధం బైనశమీవృక్షంబుసమీపంబున కరుగునవసరం
బునం గ్లీబరూపచ్ఛన్నుం డయ్యును బ్రస్ఫురణవిశేషభీషణుం డగునతనిం గని
కౌరవసైనికులు గలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ వారలం గనుంగొని
తోఁచునుత్పాతంబుల నాలోకించి గురుం డిట్లనియె. 85

క. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసల♦కుం బలుచాయల్
సేసెం బటుమొగుళు లడరి, మ్రోసెం దమయంతఁ దూర్య♦ము లపధ్వను లై.

క. ఇగ్గజములు మిన్నకయును, గ్రొగ్గెడు నుత్తమతురంగ♦ములు బాష్పజలం

---

కానిరోజు నీవు యుద్ధము చేయవలదు. నాకు సారథ్యము చేయుము, నేను చిమ్ముటపిడుగువలె నీశూరు లనందఱను వధించి సేనను బాఱఁదోలి దుర్యోధనుని జయించి యావుల మరలించెదను.

84. ఒడఁబాటు = అంగీకారము. నడుకొనన్ = వణఁకుచుండఁగా. నరుఁడు = అర్జునుఁడు. సమ్మదలీలన్ = సంతోషముయొక్క విలాసముచేత. జమ్మి చేరన్. చనియెన్ అని యన్వయము.

తా.—అట్లు చెప్పి యర్జునుఁడు ఉత్తరుం డంగీకరింప కున్నను వడంకుచున్న యతని నొగల మీఁద నుంచి తాను రథ మెక్కి రథికుఁడై సంతోషముతో జమ్మిచెట్టునొద్దకుఁ బోయెను.

85. సవ్యసాచి = అర్జునుఁడు. నిక్షిప్తాయుధంబు = ఉంపఁబడిన యాయుధములు గలది. శమీవృక్షంబుసమీపంబునకున్ = జమ్మిచెట్టుదగ్గఱకు. అరుగుఅవసరంబునన్ = పోవునపుడు. క్లీబరూపచ్ఛన్నుండు = పేడిరూపముచేఁ గప్పఁబడినవాఁడు. ప్రస్ఫురణవిశేషభీషణుండు = తేజోవిశేషముచే భయంకర మయినవాఁడు. నివ్వెఱపడి = మిక్కిలి భయపడి. తోఁచుఉత్పాతంబులన్ = కనఁబడునవశకునములను. గురుండు = ద్రోణాచార్యుఁడు. పాఠాం :—నిక్షిప్తాయుధం బైనశమీవృక్షసమీపంబునకున్—ఈపాఠమునందు ఏకదేశాన్వయము.

86. నభోమణి = సూర్యుఁడు. మాసెన్ = కాంతిహీనుఁ డయ్యెను. పటుమొగుళులు = గొప్పమేఘములు. అడరి = అతిశయించి. దెసలకున్ = దిక్కులకు. పలుచాయల్ = పెక్కువన్నెలను. చేసెన్. తూర్యములు = వాద్యములు. అపధ్వనులు ఐ = తప్పుధ్వని గలవై. తమయంతన్. మ్రోసెన్.

తా.—సూర్యుఁడు మాసి యున్నాఁడు. నక్కలు కూయుచున్నవి. మేఘములు దిక్కుల నంతటను నానావర్ణములు గలిగి వ్యాపించుచున్నవి. వాద్యములు తమయంతనే వికారధ్వనిగా మ్రోఁగుచున్నవి.

87. ఇగ్గజములు = ఈ యేనుఁగులు. గ్రొగ్గెడున్ = వంగుచున్నవి. ఉత్తమతురంగములు = మేలిగుఱ్ఱములు. బాష్పజలంబు = కన్నీటిని. అగ్గలము = అధికముగా. పడగల్ = ధ్వజములు. తడఁబడి. తొగ్గెడున్ = వంగుచున్నవి.

బగ్గలము విడుచు చున్నవి, తగ్గెడుఁ గారణము లేక ♦ తడఁబడి పడగల్. 87

క. దగ్ధము లైనట్టులు స, మ్యగ్ధైర్యము లెడలె మండె ♦ నాయుధచయముల్
దిగ్ధూమం బెసఁగె నసం, దిగ్ధము మన కాజి యగుట ♦ దీనికిఁ దగఁగన్. 88

క. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు, తనతనవాహనము లాయు♦ధము లెల్లజనం
బును ననువుసేసికొనుఁ డో, పినయంతయుఁ గాచికొనుఁడు ♦ బెదరక పసులన్. 89

వ. అని చెప్పి తా నప్పు డర్జును నెఱింగినవాఁడు గావున నతనికి నజ్ఞాతవాససమయ భంగం బగునో యనుభయంబున సురనదీసూనువదనంబు వీక్షించి కనుసన్న వాఱ ని ట్లనియె. 90

చ. వెరవిఁడి గాక వీఁడు కురు♦వీరులకుం బొడచూపువాఁడె య
చ్చెరు వొకమ్రానిపేర నిటఁ ♦ జేరఁగ వచ్చుచు నున్నవాఁ డహం

---

తా.—కారణము లేకయే మనసేనలోని యేనుఁగులు ముందరికి వంగుచున్నవి, గుఱ్ఱములు కన్నీరు కార్చుచున్నవి, పడగలు వంగి యున్నవి.

88. దగ్ధములు = కాల్పఁబడినవి. సమ్యగ్ధైర్యములు = మేలిధైర్యములు. ఎడలెన్ = తొలఁగెను. చయముల్ = సమూహములు. దిగ్ధూమంబు = దిక్కులయందుపొగ. ఎసఁగెన్ = అతిశయించెను. ఆజి = యుద్ధము. అగుట. అసందిగ్ధము = నిశ్చయము.

తా.—మనకు ధైర్యములు కాలిపోయినట్లు లేక పోవుచున్నవి, ఆయుధములు మండుచున్నవి, దిక్కులయందుఁ బొగలు లేచుచున్నవి. ఈయపశకునములచే మనకు యుద్ధము కలుగుట నిశ్చయము. కావున దీనికిఁ దగినట్టుగా.

89. మొనలు = వ్యూహములను. ఒఱపుగన్ = చక్కఁగా. తీర్చికొనుఁడు = దిద్దికొనుఁడు. అనువు = ఆయితము.

తా.—అందఱును వ్యూహములఁ జక్కఁగాఁ దీర్చికొని తమతమవాహనములను ఆయుధములను సిద్ధము చేసికొని భయపడక యథాశక్తి పశువులను రక్షింపుఁడు.

90. అజ్ఞాతవాససమయభంగంబు = అజ్ఞాతవాసప్రతిజ్ఞకు భంగము. సురనదీసూనువదనంబు = భీష్మునిముఖమును. వీక్షించి = చూచి. పాఱన్ = ప్రసరింపఁగా.

91. వెరవిఁడి = ఉపాయము తెలియనివాఁడు. కాక = కాని. పొడచూపువాఁడే = కనఁబడువాఁడా! ఒకమ్రానిపేరన్ = ఒకచెట్టుపేరుచేత, అర్జుననామముచేత ననుట. ఒకచెట్టుదగ్గఱ దాఁ బోవు నెపముచేత నని యర్థాంతరము. అహంకరణము అ = గర్వమునే. ఒండుఒకటి = మఱి యొకదానిని. మూర్తివిశేషము = దేహముయొక్క యతిశయము. సురపతిఅట్ల = దేవేంద్రునివలెనే. మదిచొప్పు = మనస్సులోని యభిప్రాయము. ఎఱుంగన్ అయ్యెడున్ = తెలియవలెను. వ్యా.— వెరవిఁడి—వ్యు. వెరవు + ఇఁడి, ఇఁడివర్ణకము అభావద్యోతకము. అర్జునశబ్దమునకు ఏఱుమద్ది యను వృక్షముకూడ నర్థము, కావున నర్జునునిపేరు ఒకమ్రానిపేర నని గూఢముగాఁ జెప్పఁబడినది. "నగా

కరణము గాని యొం డొకటి ♦ గాఁడు మూర్తివిశేష మారయఁగ
సురపతియట్లు వీనిమది♦చొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్.

క. అనిన విని యెఱిఁగికొని యా, తనిమదిసందియము మాన్పఁ ♦ దలఁచి నరేంద్రుం
గనుఁగొనుచు నతనితోఁ జె, ప్పినభంగి నిగూఢవృత్తి ♦ భీష్ముఁడు వలికెన్. 92

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁది గడచి వచ్చితిమి యకుంఠితబాహా
బలము నెఱపఁ దఱి యయ్యెను, జలింప వల దింక మనకు ♦ శత్రులవలనన్. 93

వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు గనుంగొని పార్థునకు సమయభంగంబువలని
సంకటంబు లేకునికికి మనంబునం బ్రియం బంది మొగంబునం దోఁప నీక పుయి
లోట దక్కి యుల్లసిల్లెను. 94

---

హ్వాయః" అని సంస్కృతము. పాఠాం:—వెరవరి = ఉపాయముగలవాఁడు. అని యర్థము. కాక = కానివాఁడై యని యర్థము.

తా.—ఈవచ్చువాఁడు ఉపాయము తెలియనివాఁడుగా నున్నాఁడు. కానిచో కురువీరులకు గనఁబడునా? ఇతఁ డొక చెట్టునొద్దకుఁ బోవునెపమున మనమీఁదికి వచ్చుచున్నాఁడు, అహంకారము కలవాఁడే కాని యుక్తాయుక్తముల నెఱుంగఁడు, వీని యాకారము చూచినయెడ దేవేంద్రుని వలె నున్నాఁడు, వీని యభిప్రాయ మేమో మనకుఁ దెలియదు. అని ప్రకటమైన యభిప్రాయము. అర్జునుఁడా యితఁడు! తన యజ్ఞాతవాసము పూర్తికాకమునుపే కౌరవులమీఁదికి యుద్ధమునకు వచ్చుచున్నాఁడు, ఉపాయము తెలియనివాఁడుగా నున్నాఁడు. ఆకృతి చూడఁగా నర్జునునియట్లె యున్నది. వీని యభిప్రాయ మేమో తెలియ దని యాంతరంగికాభిప్రాయము.

92. అతనిమదిసందియముఁ = ద్రోణాచార్యుని మనస్సునందలి సందేహమును. నరేంద్రుఁ = రాజయిన దుర్యోధనుని. అతనితోఁ = ఆదుర్యోధనునితో. నిగూఢవృత్తిఁ = రహస్య మయిన విధమున.

తా.—ద్రోణుని యభిప్రాయ మెఱిఁగి భీష్ముఁ డాతనిసందేహము తీఱుటకై దుర్యోధనునితో మాటలాడినట్లు నటించి రహస్యాభిప్రాయముతో నిట్లనియెను.

93. రిపులకుఁ = శత్రువులకు. ఇమ్ము = అనుకూలము. అగుకొలఁది = అయినపరిమాణమును. అకుంఠితబాహాబలము = మొక్కవోనిచేతుల బలమును. నెఱపఁ = చూపుటకు. తఱి = సమయము.

తా.—ఆలోచించి చూడఁగా మనము శత్రువుల కనుకూల మయిన ప్రదేశము దాఁటి వచ్చితిమి, ఇపుడు మనకు యుద్ధము సిద్ధించినది, కావున మనకు శత్రువులవలన భయపడవలసినది లేదు. ఇది దుర్యోధనుని విషయ మయిన తాత్పర్యము. శత్రువులకు అవకాశ మిచ్చునట్టి యజ్ఞాతవాసకాలము కడచెను, ఇపుడు కౌరవులు వచ్చుటచే బాహుబలము చూప సమయము లభించెను, కావున నర్జునునకు అజ్ఞాతవాసభంగభయము లేదు. ఇది ద్రోణునివిషయమైన యభిప్రాయము.

94. అయ్యర్థంబు = ఆరహస్యాభిప్రాయమును. పార్థునకుఁ = అర్జునునకు. సమయభంగంబువలనిసంకటంబు = ప్రతిజ్ఞాభంగమువలని కష్టము. పుయిలోట = సంకోచమును. తక్కి = విడిచి.

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం ♦ జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసము♦ద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి న♦స్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమర♦స్థేమాభిరామాకృతిన్. 95

ఉ. ఈతనితోడికయ్యమున ♦ కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు ♦ టారయ సంశయ మెల్లభంగి గో
వ్రాతనివర్తనంబు సుక♦రంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా వినమె ♦ పెంపెసలారెడుబాహుసంపదన్. 96

వ. అనుపలుకు లాకర్ణించి కర్ణుండు కటకటంబడి కుంభసంభవున కిట్లనియె. 97

ఉ. పాండవపక్షపాతమునఁ ♦ బల్కెదు నోరికి వచ్చినట్లు ని
న్నొం డన రామిఁ జేసి యిది ♦ యెప్పును కౌరవసేన కెల్ల నొ

95. గుహాంతరమునన్ = గుహలోపల. చేడ్పాటుమైన్ = కష్టముచేత. మాతంగ...... క్రోధమై—మాతంగ = ఏనుఁగులయొక్క, స్ఫూర్జిత = ప్రకాశించుచున్న, యూథ = సమూహము యొక్క, దర్శన = చూచుటచేత, సముద్యత్ = అధికముగాఁ బుట్టుచున్న, క్రోధమై = కోపము గలదై. వచ్చు ఓజన్ = వచ్చువిధమున. కాంతారనివాసఖిన్నమతిన్ = అడవియందు దునికిచే దుఃఖము నొందిన మనస్సుచేత. అస్మత్సేనపైన్ = మనసేనమీఁదికి. కుంతీసుతమధ్యముండు = పాండవుల యందు నడిమివాఁడు, నకులసహదేవులు కూడఁ గుంతిచేతనే పెంపఁబడినవారు కావున నయినుగురును గుంతీసుతులు గాఁ జెప్పఁబడి రని గ్రహింపవలయు. సమరస్థేమ అభిరామఆకృతిన్ = యుద్ధమునందలి స్థైర్యముచే నొప్పుచున్న యాకారముచేత. వచ్చెన్. అనియన్వయము.

తా.—సింహము గుహలోపల నాఁకలితోఁ గష్టపడుచుండి యేనుఁగులను జూచి వానిమీఁదికి మిక్కిలి కోపముతో వచ్చునట్లు, అర్జునుఁడు కష్ట మయిన వనవాసమును అజ్ఞాతవాసమును చేసీ మిక్కిలి కష్టపడి మనసేనమీఁదికి యుద్ధమునందలి యుత్సాహముచే విలసిల్లు నాకారము గలవాఁడై వచ్చుచున్నాఁడు.

96. కయ్యమునకున్ = యుద్ధమునకు. ఇయ్యకొనం దగువారలు = ఇష్టపడఁ దగినవారలు. అస్మదీయఆతతసేనలోన్ = మనదైన గొప్పసేనలో. ఎల్లభంగిన్ = అన్నివిధములచేతను. కిరీటికిన్ = అర్జునునకు. గోవ్రాతనివర్తనంబు = గోవులసమూహముయొక్క మరల్చుట. సుకరంబుఅ = సులభమే. రుద్రునిన్ = శివుని. పెంపుఎసలారెడుబాహుసంపదన్ = అతిశయించుచున్న చేతులలావుచేత. ప్రీతునిన్ = సంతోషించినవానినిగా. నాన్ = అనఁగా. వినమే అని యన్వయము.

తా.—ఇప్పు డీయర్జునునితో యుద్ధము చేయఁ జాలినవారు మనసేనలో లేరు, వీఁడు సులభముగా నావుల మరలించికొని పోవును, ఇతఁడు బాహుబలముచే శివునిఁ గూడ మెప్పించినాఁ డని మనము విని యున్నారము కదా!

97. కటకటంబడి = కోపపడి. కుంభసంభవునకున్ = ద్రోణునితో.

98. పాండవపక్షపాతమునన్ = పాండుపుత్త్రులయందలి ప్రీతిచేత. ఒండు = ఒకమాటను.

క్కండవు మేటి వీవ బల♦గర్వము గుందఁగ నిట్లు శత్రుదో
శ్చండిమ కోహటించితి ని♦జంబునకున్ నరుఁ డింతయెక్కుడే. 98

సీ. అతఁడు వచ్చెనేని ♦ నస్మచ్ఛిలీముఖ, పాతచలితహృదయ♦పద్ముఁ జేసి
వెగడుపఱిచి యోధ♦వీరుల కెల్లను, త్సవ మొనర్తు బాహు♦దర్ప మొప్ప. 99

వ. అనిన విని సుయోధనుండు రాధేయున కిట్లనియె. 100

సీ. తప్పఁ బలికి తీవు ♦ చెప్పెద విను మితఁ, డర్జునుండ యేని ♦ నడవి కేగి
భ్రాతృయుతము గాఁగ♦ బండ్రెండువత్సర, ములును నంద నిలువ♦వలయు మగుడ.

క. ఒరుఁ డయ్యెనేని మామక, శరాసనక్షిప్తదీప్త♦సాయకపంక్తిం
బరిమార్చెద క్రేల్మిడి న, చ్చెరువుఁ బ్రమోదంబు నొంది ♦ సేనలు వొగడన్. 102

---

అనరామిన్ చేసి = చెప్పఁగూడక పోవుటచేత. పల్కెదు అని యన్వయము. మేటివి = శూరుఁడవు. బలగర్వము = సేనలయొక్క గర్వము. కుందఁగన్ = తగ్గునట్లు. శత్రుదోశ్చండిమకున్ = పగవాని యొక్క చేతులలావునకు. ఓహటించితి = వెనుదీసితివి. నరుఁడు = అర్జునుఁడు. వ్యా.—చండిమ—వ్యు. చండభావము. రూ. చండిమము, "ఆత్మేమని జంతంబులకు నాంతంబు లగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" అని బాలవ్యాకరణసూత్రము.

తా.—నీకు మాటాడఁ గూడక పోవుటచేత నీవు పాండవులమీఁది ప్రేమచేత నోరికి వచ్చినట్లు పల్కెదవు, నీ కిది తగదు. ఈకౌరవసేన కంతకును నీవే గొప్పవాఁడవు కాఁబోలు. ఈసేనలోనివారి కందఱకు నుత్సాహము తగ్గునట్లు నీ విట్లు శత్రుపరాక్రమమునకు వెనుదీయుచున్నాఁడవు. నిజమాలోచించినచో నర్జునుఁ డింత గొప్పవాఁడు కాఁడు.

99. అస్మచ్ఛిలీముఖపాతచలితహృదయపద్మున్ = మాయొక్క బాణములు అను తుమ్మెదల యొక్క పడుటచేఁ గదలినహృదయము అను కమలము గలవానినిగా. వెగడుపఱిచి = భయపఱిచి. బాహుదర్పము = చేతులలావు. యోధవీరులకున్ = శూరు లయినభటులకు. ఉత్సవము = సంతోషమును. ఒనర్తున్ = చేయుదును.

తా.—ఆయర్జునుఁడు వచ్చినయెడ నాబాణములచే నతని నొప్పించి యోడించి నాబాహుబలముం జూపి మనసేనలోనివారి కందఱకు సంతోషము గలిగించెదను.

100. సుయోధనుఁడు = దుర్యోధనుఁడు. రాధేయునకున్ = కర్ణునితో.

101. భ్రాతృయుతము గాఁగన్ = తోఁబుట్టువులతోఁ గూడినట్లుగా.

తా.—నీవు పొరపాటుగాఁ జెప్పితివి. ఇతఁడు అర్జునుఁడే యయినపక్షమున అతఁడు మరల సహోదరులతో నడవికిఁ బోయి యందుఁ బండ్రెండుసంవత్సరము లుండి తీరవలయును.

102. ఒరుఁడు = ఇతరుఁడు. మామకశరాసనక్షిప్తదీప్తసాయకపంక్తిన్ = నాదైన ధనుస్సునుండి ప్రయోగింపఁబడిన ప్రకాశించుచున్న బాణముల సమూహముచేత. ప్రమోదంబున్ = సంతోషమును. క్రేల్మిడిన్ = క్షణములో. పరిమార్చెదన్ = చంపెదను.

తా.—అర్జునుఁడు కాక మఱియొకఁ డయినయెడ నావాఁడిబాణములచే నీతనిం జంపి సేనలకు నాశ్చర్యమును సంతోషమును గలిగింతును.

క. అనుపలుకులు విని భీష్మం, డును ద్రోణుఁడు ద్రోణసూనుఁ♦డును గృపుఁడును మే
లని యియ్యకొనిరి హృదయా, ననురూపము లైన తెలువు ♦ లాస్యము లొందన్.

( అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తం బైనగాండీవంబు గొనుట. )

వ. అట్టియెడ శమీవృక్షసమీపంబున నరదంబు నిలుపం బంచి పార్థుం డుత్తరున
కి ట్లనియె. 104

క. ఇన్నగమునందు గాండివ, మున్నది యది గాని మద్భు♦జోద్రేకవిలా
సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నన లీవిండ్లు గుఱుచ ♦ లల్పబలంబుల్. 105

క. ఇవి నీ తెగకొలఁదివి వీ, రవినోదమునప్పు డధిక♦రభసము లగుమ
ద్వివిధాటోపములకుఁ జా, లవు విల్లది నూఱువేల♦లా వరయంగన్. 106

క. దానిఁ గొని గట్టిమైమఱు, వేనుంగును మఱియు నెట్టి ♦ వేనియుఁ దునియం

---

103. ద్రోణసూనుఁడును = అశ్వత్థామయును. హృదయ అనురూపములు = మనస్సునకు సమానము కానివి. తెలువులు = వికాసములను. ఆస్యములు = ముఖములు. మేలు. అని. ఇయ్యకొనిరి = అంగీకరించిరి. అని యన్వయము.

తా.—దుర్యోధనుని మాటలు విని భీష్ముఁడును ద్రోణుఁడును అశ్వత్థామయుఁ గృపుఁడును మనస్సున నిష్టము లేకున్నను ముఖమునకు లేని వికాసముఁ దెచ్చికొని యంగీకరించినట్లు నటించిరి.

105. ఇన్నగమునందున్ = ఈ చెట్టునందు. గాండివము = గాండివ మనువిల్లు. మత్ భుజ ఉద్రేకవిలాసఉన్నతికిన్ = నాచేతుల విజృంభణముయొక్క విలాసము నతిశయమునకు. ఈవిండ్లు= ఈధనుస్సులు. పెద్దయున్ = మిక్కిలి. అన్నవలు = అల్పములు. అల్పబలంబుల్ = తక్కువ బలము గలవి. ఓర్వవు. అని యన్వయము. పాఠాం:—అలఁతిబలంబుల్—అర్థము సమానము. తెనుఁగుపదమునకును సంస్కృతపదమునకును బహువ్రీహిసమాసము చేయఁబడి యుండుటచే నీపాఠం బుపేక్ష్యంబు.

తా.—ఈచెట్టుమీఁద గాండివ మను ధను స్సున్నది, అది తప్ప నాభుజవిలాసమునకు అల్పములై సారము లేని ఎగు నీధనుస్సులు పనికిరావు.

106. నీ తెగకొలఁదివి = నీవంటివారికిఁ దగినవి, వీరవినోదము అప్పుడు = శూరులవినోదమునందు, యుద్ధమునం దనుట. అధికరభసములు = ఎక్కువవేగము గలవి. అగు మత్ వివిధఆటోపములకున్ = అయినట్టి నాయొక్క నానావిధము లయినవిజృంభణములకు. అదివిల్లు = ఆగాండివము. నూఱువేలలావు = నూఱువేలవిండ్లబలము గలది.

తా. ఈధనుస్సులు నీవంటివారికిఁ దగినవి, గొప్పయుద్ధమునందు మహావేగ మగు నాపరాక్రమమునకు ఇవి నిలువఁ జాలవు, గాండివము లక్షవిండ్ల బలము గలది.

107. దానిన్ = ఆగాండివమును. గట్టిమైమఱువు = దృఢమయినకవచమును. ఎద్దియేనియున్ = దేనినైనను. తునియంగాన్ = తెగునట్లు. కైదువు = ఆయుధము. లేనిఅలవుకలిమి = లేనట్టిబలము యొక్క కలుగుట.

గా నేయ నగును గైదువు, లేనియలవుకలిమి పోర ♦ లె సైన్య యున్నే. 107

వ. కావున నిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయచాపంబు దెచ్చి యిమ్ము ధర్మజ భీమార్జుననకులసహదేవులు దమతమసమస్తాయుధంబులుం గూడం గట్టి యిందుఁ బెట్టినవా రాకట్ట విడిచి యందు గాండీవంబు పుచ్చికొని తక్కటియవి యెప్పటి యట్ల బంధింపు మని చెప్పి శవాకారంబుగా నున్నశస్త్రాస్త్రసంచయంబు చూపిన భూమింజయుం డతని కిట్లనియె. 108

క. పీనుఁగు నంటఁగ నగునే, భూనాథతనూజుఁ డనక ♦ పుయి లోఁకక న న్నీనీచపుఁబనిఁ బనుపం, గా నీకుం దగునె పాప♦కర్మము గాదే. 109

వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున 110

గీ. మనుజు లంట కుండ ♦ మఱుపడఁ జేసిన, యస్త్రశస్త్రసంచ♦యంబు గాని శవము గాదు మత్స్య♦జనపాలతనయ యే, నట్టి దైనఁ బనుతు♦నయ్య నిన్ను.

క. నమ్ముము కైదువుమో పగు, జమ్మి వెసం బ్రాఁకి విడిచి ♦ చాపము నా కం

తా. ఆగాండీవముచేత దృఢ మయినకవచము నైనను మఱి యెట్టిపెద్ద వానినైనను ఖండింప నచ్చును. తగినయాయుధము లేక బలము మాత్రము కలుగుట యుద్ధమునం దుపయోగింపదు.

108. ఇమ్మహీరుహంబు = ఈచెట్టును. అమ్మహనీయచాపంబు= ఆగొప్పధనుస్సును. తక్కటి యవి = తక్కినవానిని. బంధింపుము = కట్టుము. శవఆకారంబుగఁ = పీనుఁగుయొక్క యాకారమువంటియాకారము గలదిగా. సంచయంబు = సమూహమును.

109. భూనాథతనూజుఁడు=రాజకుమారుఁడు. పుయిలోఁకక= సంకోచపడక. పనుపంగాఁ= ఆజ్ఞాపించుట.

తా. నేను రాజపుత్త్రుఁడను, నీవు కొంచెమైననుసంకోచము లేక పీనుఁగుఁ దాఁకు మని చెప్పచున్నాఁడవు, ఇట్టి నీచమైన పాపకార్యమును నాకుఁ జెప్పుట యుక్తము కాదు.

110. ధర్మనందనఅనుజుండు = ధర్మరాజుతమ్ముఁడు, అర్జునుఁడు. అతిఆదరంబునఁ = మిక్కిలిప్రేమతో.

111. మఱుపడఁ = మఱుఁ గగునట్లు. అస్త్రశస్త్రసంచయంబు = అస్త్రశస్త్రముల సమూహము. మత్స్యజనపాలతనయ = విరాటరాజుకుమారుఁడా!

తా.—మనుష్యులు తాఁకక యుండవలయు నని మఱుఁగుపఱచి శవాకృతిగాఁ గట్టిన శస్త్రాస్త్రములకట్ట గాని యిది పీనుఁగు గాదు. పీనుఁ గైనయెడ రాజపుత్త్రుఁడ వగు నిన్నుఁ దాఁకు మని చెప్పను.

112. కైదువుమోపు=ఆయుధములకట్ట. అగుఁ. బ్రాఁకి=ఎక్కి. విడిచి=విచ్చి. అనుడుఁ= అని యర్జునుఁడు చెప్పఁగా. అమ్ముగ్ధుండు = ఆచిన్నవాఁడు. అమ్మహీజము=ఆచెట్టును. అలసతఁ = మెల్లనితనముచేత. వ్యా. అందిమ్ము—అందిచ్చు శబ్దపల్లవధాతువు ప్రార్థనార్థకము.

తా.—ఇవి యాయుధములకట్టయే యని నమ్ముము. నీవు శీఘ్రముగా జమ్మిచెట్టు నెక్కి యాక

దిమ్మనుఁడు జేయునది లే, కమ్ముగ్ధుం డమ్మహీజ ♦ మలసత నెక్కెన్. 112

వ. ఇట్లుత్తరుండు సమారూఢశమీవృక్షుం డగుటయు నరదంబుపయి నిలుచుండి పాండవమధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయబంధం బెడలించిన. 113

క. మెఱసి యుదయించుగ్రహముల, తఱచుప్రభలఁ గ్రేణిసేసి ♦ దశదిశలం గ్రి
క్కిఱిసి వెడలె నావిండ్లన్, మెఱుఁగులు నృపతనయుదృష్టి ♦ మిఱుమిట్లుగొనన్.

వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 115

క. పెనుఁబాములచందంబున, నునికికి భయ మంది వడఁకు ♦ నుర్వీశసుతుం
గని తగుమాటలఁ గుంతీ, తనయుఁడు వెఱ వాపుటయు న ♦ తం డచలుండై. 116

వ. పొదువు విరియం దట్టి కనుంగొని నిరూపించి సారథీ యని సవ్యసాచిం బిలిచి యి ట్లనియె 117

క. ఇది యొకచాపము విస్మయ, మొదవించుచుఁ గొండచిలువ ♦ యొకో నాఁ దగి యు

ట్టను విప్పి గాండీవమును నా కెత్తి యి మ్మని యర్జునుఁడు చెప్పఁగా నుత్తరుఁడు విధిలేక యావృక్షమును మెల్లగా నెక్కెను.

113. సమారూఢశమీవృక్షుండు = ఎక్కఁబడిన జమ్మిచెట్టు గలవాఁడు. పాండవమధ్యముండు = అర్జునుఁడు. ఆయుధసంచయబంధంబు = ఆయుధముల సమూహముయొక్క కట్టును. ఎడలించినన్ = వదలింపఁగా.

114. ఉదయించు గ్రహములతఱచు ప్రభలన్ = ఉదయించునట్టి సూర్యుఁడు మొదలగు గ్రహములయొక్క దట్ట మయినకాంతులను. క్రేణిసేసి = తిరస్కరించి. దశదిశలన్ = పదిదిక్కుల యందును. మెఱుఁగులు = కాంతులు. నృపతనయుదృష్టి = రాజకుమారుఁ డయిన యుత్తరుని చూపు. మిఱుమిట్లుగొనన్ = మిక్కిలి చెదరఁగా. వెడలెన్ అని యన్వయము.

తా.—సూర్యాదిగ్రహములు ప్రకాశించువిధంబున ఉత్తరునిచూడ్కులు చెదరునట్లు అధనుస్సులు మిక్కిలి ప్రకాశించెను.

116. చందంబునన్ = విధమున. ఉనికికిన్ = ఉండుటవలన. వడఁకుఉర్వీశసుతున్ = వణఁకునట్టి రాజపుత్త్రుని, ఉత్తరుని. కుంతీతనయుఁడు = అర్జునుఁడు. వెఱ = భయమును. పాపుటయును = తొలఁగింపఁగా. అచలుండు ఐ = భయము లేనివాఁడై.

తా.—ఆయాయుధములు పాములవలె నుండుటను జూచి యుత్తరుఁడు భయపడఁగా నర్జునుఁడు తగినమాట లాడి యతనిభయమును దీర్ప నతండు భయము లేనివాఁడై.

117. పొదువు = కట్టను. విరియన్ తట్టి = విచ్చి. నిరూపించి = చూపి. సవ్యసాచిన్ = అర్జునుని.

118. చాపము = విల్లు. విస్మయము = ఆశ్చర్యమును. ఒదవించుచున్ = కలిగించుచు. ఖచిత...ఉజ్జ్వలము—ఖచిత = పొదుగఁబడిన, కనకకమల = బంగారుకమలములయొక్క, ద్యుతి=

న్నది ఖచితకనకకమలస, ముదయద్ద్యుతిసముపగూహ♦నోజ్జ్వల మగుచున్. 118

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతు రని మఱియు బహువిధంబు లగు నాయుధంబు లుపలక్షించి వేఱువేఱ వానిచందంబు లుపన్యసించి యివి యెవ్వ రెవ్వరి వని యడిగిన నర్జునుం డిట్లనియె. 119

గీ. తొలుత నీవు న న్నడిగిన♦దొడ్డవిల్లు, గాండివము ఫల్గునున కేడు♦గడయు నదియు
సమరమున దేవదానవ♦సమితినైన, గెలుచు నశ్రమమున దాని♦వలన నతఁడు.

క. ఆద్యపురుషోపలాలిత, ముద్ద్యోతితరోచిరుద్గ♦మోగ్రం బవిని
ర్భేద్యము దివ్యజనన మన, వద్యం బది కార్ముకైక♦వరము కుమారా. 121

వ. అమ్మహనీయచాపంబు బ్రహ్మ శతసహస్రవర్షంబులు ప్రజాపతి చతుష్షష్టిసహస్ర వర్షంబులు నింద్రుండు పంచాశీతిహాయనంబు సోముండు పంచశతాబ్దంబులు

---

కాంతులతోడి, సముపగూహన = కూడిక చేత, ఉజ్జ్వలము = ప్రకాశించుచున్నది. కొండచిలువ, ఒకో, నాక్. తగి. ఉన్నది. అని యన్వయము.

తా.—ఇం దొకవిల్లు బంగారుకమలములు పొదిగి యుండుటచే మిక్కిలి ప్రకాశించుచుఁ గొండ చిలువయో యనునట్లాశ్చర్యము గలిగించుచున్నది.

119. ఉపలక్షించి = ఉద్దేశించి. వానిచందంబులు = వానివిధములను. ఉపన్యసించి=చెప్పి.

120. ఫల్గునునకున్ = అర్జునునకు. ఏడుగడయున్ = ఏడువిధము లయినరక్షకమును, తల్లి, తండ్రి, గురువు, విద్య, దైవము, దాత, పురుషుఁడు, ఇవి సప్తవిధరక్షకములు. సమరమునన్ = యుద్ధమునందు దేవదానవసమితిన్ ఐనన్ = దేవతలయు రాక్షసులయు సమూహమునైనను. అశ్రమమునన్ = అనాయాసముగా.

తా.—నీవు మొదట నన్నడిగినపెద్దధనుస్సు గాండీవము. అదియే యర్జునునకు ముఖ్యమయిన యాధారము. అతఁడు యుద్ధమునందు దానిచే దేవతలను రాక్షసులను గూడ ననాయాసముగా గెలుచును.

121. ఆద్యపురుషఉపలాలితము = పూర్వపురుషులచేఁ గొనియాడఁబడినది. ఉత్ ద్యోతితరోచిఃఉద్గమఉగ్రంబు = మిక్కిలి ప్రకాశించుచున్న కాంతులయొక్క పొడముటచేత భయంకరము. అవినిర్భేద్యము = మిక్కిలి భేదింపరానిది. దివ్యజననము = దేవతలవలనఁ బుట్టుకకలది. అనవద్యంబు = దోషము లేనిది. కార్ముకఏకవరము = ధనుస్సులయందు ముఖ్యముగా శ్రేష్ఠ మయినది. కుమారా! ఉత్తరునిసంబోధనము.

తా.—ఆగాండివము పురాణపురుషులచేఁ గొనియాడఁబడినదియు, భయంకర మయినకాంతులు గలదియు, శత్రువులకు భేదింపరానిదియు, దేవతలచే నిర్మింపఁబడినదియు, దోషరహితంబును, సర్వధనుస్సులలో నుత్తమ మైనదియు.

122. అమ్మహనీయచాపంబు = ఆగొప్పదైనధనుస్సును. శతసహస్రవర్షంబులు = నూఱువేల యేండ్లు. చతుష్షష్టిసహస్రవర్షంబులున్ = అఱువదినాలుగువే లేండ్లు. పంచఅశీతిహాయనంబున్ = ఎనుబదియైదుసంవత్సరములు. సోముండు = చంద్రుఁడు. పంచశతఅబ్దంబులున్ = ఏనూ ఱేండ్లును. శత

వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబున ధరియించిరి వరుణుచేత నగ్నిదేవుండు వేడుకపడి పుచ్చికొని పదంపడి యద్భుతకర్మంబునకు మెచ్చి విబ్బచ్చున కిచ్చె నతండును నలువదేనేండ్లు ధరియింపం గలవాఁ డిట్లిది త్రిలోకపూజ్యమహిమ నొప్పుచుండు. 122

సీ. నీలోత్పలచ్ఛాయ ♦ నెరసి సౌవర్ణవృ, షావలి నొప్పు బా♦ణాసనంబుఁ
దాళప్రమాణసుం♦దర మైన భర్మశా, ఖామృగాంచిత మగు♦కార్ముకంబుఁ
దీవ్రకృశానుసం♦దీప్తాకృతియుఁ గన, త్కనకమత్స్యంబులుఁ ♦ గలుగుధనువు
మెఱుఁగారిసారంబు♦మెఱయఁ గాంచనమయూ, రములశోభిల్లుచా♦పమును వరుసఁ

---

శరత్సమితియున్ = నూఱేండ్లసమూహమును. పదంపడి = పిమ్మట. అద్భుతకర్మంబునకున్ = ఆశ్చర్యకర మయినకార్యమునకు, ఖాండవదహనమున కనుట. విబ్బచ్చునకున్ = అర్జునునకు. త్రిలోకపూజ్యమహిమన్ = ముల్లోకములచేఁ బూజింపఁ దగినప్రభావముచేత. శతసహస్రవర్షంబులు—సహస్రము లగువర్షములసమాహారము సహస్రవర్షము, శతమయిన సహస్రవర్షములు శతసహస్రవర్షములు ఇట్లు చతుష్షష్టిసహస్రవర్షంబులు, పంచశతాబ్దంబులు అనుస్థలములయందును మొదట సహస్రవర్షంబు శతాబ్దంబు అని సమాహారద్విగువుగాఁ జేసికొని పిమ్మట చతుష్షష్టిశబ్దముతోను పంచశబ్దముతోను సమాసము చేసి బహువచనము నిర్వహింపవలెను. పంచాశీతిహాయనంబు అనుచో నెనుబదియైదుసంవత్సరము లను నర్థమునందు సమాహారద్విగువే రావలయును గాన బహువచనము సిద్ధింపదు. బహువచననిర్వాహార్థము పైవానియట్లు అశీతిహాయనం బని సమాహారద్విగువు చేసి వెనుక పంచశబ్దముతో సమాసము చేయుపక్షమున నన్నూఱేండ్లని యర్థ మగును.

123. నీలఉత్పలచ్ఛాయన్ = నల్లకలువలకాంతివంటి కాంతి. నెరసి = నిండి. సౌవర్ణవృషఆవలిన్ = బంగారపుటెద్దులసమూహముచేత. ఒప్పుబాణాసనంబున్ = ఒప్పునట్టిధనుస్సును. (సౌవర్ణపుష్పఆవలిన్ = బంగారుపువ్వులసమూహముచేత నని పాఠాంతరము). తాళప్రమాణసుందరము = తాటిచెట్టుకొలతచేఁ జక్కనిది. ఐనభర్మశాఖామృగఅంచితము = ఐనదియు బంగారుకోఁతులచే నొప్పినదియు. అగుకార్ముకంబున్=అయిన ధనుస్సును. (శాఖామృగఖచితము = కోఁతులచేఁ దాఁపఁబడినది యని పాఠాంతరము). తీవ్రకృశానుసందీప్తఆకృతియున్= దుస్సహ మయినయగ్నివలె వెలుఁగుచున్నరూపమును. కనత్కనకమత్స్యంబులున్=ప్రకాశించుచున్న బంగారుచేఁపలును. కలుగు ధనువున్. మెఱుఁగారి = ప్రకాశము గలిగి. సారంబు = చేవ. మెఱయన్. కాంచనమయూరములన్ = బంగారునెమిళ్లచేత. శోభిల్లుచాపమును=ప్రకాశించువిల్లును. (మెఱయుకాంచనమయూరములన్=ప్రకాశించునట్టి బంగారునెమిళ్లచేత ననియర్థము, ఈపాఠమున సారంబు మెఱయుట కాంచనమయూరములయం దన్వయించును గాని చాపమునం దన్వయింపదు కావున నిది యుపేక్ష్యము). పాండవఅగ్రజుండు = ధర్మరాజును. పవనపుత్త్రుఁడున్ = భీముఁడును. తత్అనుసంభవుండున్ = అతనితమ్ముఁ డయినసహదేవుఁడును. కుమార! ఉత్తరునిసంబోధనము. అగ్గవాజినకోశమహాశరంబు= గోచర్మము ఒర గల యాగొప్పబాణము. పార్థునదియ చూవె = అర్జునునిదే సుమా?

తా.—నల్లగలువలరంగు గలిగి బంగారువృషభములు దాఁపియుండు ధనుస్సు ధర్మరాజుది. తాటిచెట్టు పొడుపు గలిగి బంగారుకోఁతులచేనొప్పియుండు విల్లు భీమునిది. నిప్పువలె వెలుఁగుచు బంగారు

బాండవాగ్రజుండుఁ ♦ బవనపుత్త్రుఁడు నకు, లుండుఁ దదనుసంభ♦వుండుఁ బట్టు
నవి కుమార యగ్గ♦హాజినకోశము, హాశరంబు పార్థు♦నదియ చూవె. 123

క. ఎద్దెసలం దనరుచులు స, ముద్దీప్తము లగుచు నుండ ♦ నుజ్జ్వల మగున
య్యుద్దండగదాదండము, పెద్దయు నెద మెచ్చి పట్టు ♦ భీముఁడు పోరన్. 124

( అర్జునుఁ డుత్తరునకుఁ ద న్నెఱింగించుట. )

వ. అని చెప్పి మఱియు బాణకృపాణతనుత్రాణాదు లగువివిధసాధనంబులు వేఱువేఱ
నిరూపించి గ్రక్కున నెఱింగించె నప్పుడు మహాత్ముం డగునయ్యుత్తరుండు
పాండవోత్తము నెఱుంగమి ని ట్లనియె. 125

క. ఈయెడ ని ట్లిమ్మహనీ, యాయుధములు పెట్టి యెచటి ♦ కరిగిరి మనకౌం
తేయులు బృహన్నలా తగ, నీ యెఱిఁగినయంతవట్టు ♦ నిక్కము సెప్పుమా. 126

వ. అని సస్నేహంబును సగౌరవంబును సవిషాదంబునుంగా మఱియును. 127

---

చేఁపలు గల విల్లు నకులునిది. ఎక్కువసారము కలదై బంగారుసెమిల్లచే నొప్పుచున్న సహదేవునిది. గోచర్మముచేఁ జేయఁబడినయొరలో నుండు నట్టి యామహాబాణము అర్జునునిది.

124. ఎద్దెసలన్ = ఏదిక్కులయందును. తనరుచులు = తనకాంతులు. సముత్ దీప్తములు = మిక్కిలి వెలుంగుచున్నవి. అగుచున్. ఉండన్. ఉజ్జ్వలము = ప్రకాశించునది. అగు అయ్యుద్దండ గదాదండము = అయిన యాభయంకర మగు దండమువంటి గద. పెద్దయున్ = మిక్కిలి. ఎదన్ = మనస్సునందు. మెచ్చి. భీముఁడు. పోరన్ = యుద్ధమునందు. పట్టున్. (పాఠాం:—ఎడన్ అర్థము సమానము.)

తా.—అన్నిదిక్కులయందును గాంతులు ప్రసరించి ప్రకాశించుచుండు నాభయంకర మయినగద భీముఁడు యుద్ధమునందు ధరించునది.

125. బాణకృపాణతనుత్రాణాదులు = బాణములు ఖడ్గములు కవచములు మొదలగునవి. అగువివిధసాధనంబులు = అయిననానావిధము లయిన కొఱముట్లను. నిరూపించి = చూపి. పాండవోత్తమున్ = అర్జునుని. ఎఱుంగమిన్ = ఎఱుంగకపోవుటచేత.

126. ఇమ్మహనీయఆయుధములు = ఈగొప్పయాయుధములను. మనకౌంతేయులు = మనకుంతికొడుకులు. నీ ఎఱిఁగిన అంతవట్టున్ = నీవుఁ దెలిసినంతవఱకు. నిక్కముఅ = నిజముగానే.

తా.—పాండవులు ఈయాయుధముల నిచటఁ బెట్టి యెచటికిఁ బోయిరో యాసంగతి నీవుఁ దెలిసినంతవఱకు నిజముగాఁ జెప్పుము.

127. సస్నేహంబును = స్నేహముతోఁ గూడినట్లును. సగౌరవంబును = గొప్పతనముతోఁ గూడినట్లును. సవిషాదంబునుంగాన్ = దుఃఖముతోఁ గూడినట్లునుగా. బంధువు లగుటచే స్నేహంబును, గొప్పవా రగుటచే గౌరవంబును, వారికిఁ గలిగినకష్టములచే విషాదము నని తెలియునది.

క. ఏ నమ్మహానుభావుల, మేనల్లుఁడ వార లార్య♦మిత్త్రులు శత్రు
స్తోమనాయకగర్వతమో, భానులు బంధుహితకార్య♦పరతంత్రాత్ముల్. 128

గీ. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట♦నడఁగి యున్న,వాఁడొ భీముని పార్థుని♦వర్తనంబు
లెయ్యెడల నేమి చందంబు♦లయ్యె నక్కటా విధాత్రుండ కవ లెందు♦డాఁగిరొక్కొ.

క. భూపాలవల్లభాజన, దీపిక యనఁ జాలు ద్రౌప♦దికి నెయ్యెడలం
దేపాటులు వాటిల్లెనొ, కాపురుషులవలన నిట్టి♦కాఁతియ పుట్టెన్. 130

క. కపటద్యూత మొనర్చిన, నృపతియు దుర్యోధనాది♦నీచులచే బా

---

128. వారలు = ఆపాండవులు. ఆర్యమిత్త్రులు = పెద్దలకు స్నేహితులు. శత్రుస్తోమనాయకగర్వతమఃభానులు = శత్రురాజులగర్వ మనుచీఁకటికి సూర్యునివంటివారు. బంధుహితకార్యపరతంత్ర ఆత్ముల్ = చుట్టములకు మేలు చేయుటయందు ఆసక్త మయిన మనస్సు గలవారు.

తా.—నేను ఆపాండవుల మేనల్లుఁడను. ఆపాండవులు పెద్దల నాదరించువారును శత్రువుల జయించువారును బంధువుల నాదరించువారును.

129. అయ్యుధిష్ఠిరుఁడు = ఆధర్మరాజు. భీమునిపార్థునివర్తనంబులు = భీమునియొక్కయు నర్జునునియొక్కయు సమాచారములు. ఎయ్యెడలన్ = ఏచోట్లయందు. ఏమిచందంబులు = ఏవిధము గలవి. ఆయ్యెన్? విధాత్రుండ=దైవమా! అక్కటా=అయ్యో. (పాఠాం:—అయ్యెనో కో = అయ్యెనో. విధాత్రుఁడు = దైవము. అకట = అయ్యో. దైవమువలన నింతవచ్చె ననుట.) కవలు= నకులసహదేవులు. ఎందున్. డాఁగిరొక్కొ=అణఁగిరో. పాఠాంతరపక్షమునందు, దాఁగి రొక్కొ అని చదువునది. అర్థము సమానము.

తా.—ఆధర్మరాజు ఎచ్చట దాఁగి యున్నాఁడో భీమార్జునులవృత్తాంత మే మయ్యెనో నకుల సహదేవులు ఎందున్నారో అయ్యో దైవమా!

130 భూపాలవల్లభాజనదీపిక=రాజభార్యలయందు దీపము. అనన్=అని చెప్పుటకు. చాలు ద్రౌపదికిన్=దగినద్రౌపదికి. ఎయ్యెడలందున్=ఏచోట్లయందు. ఏపాటులు=ఏకష్టములు. వాటిల్లెనొ=కలిగెనో. కాపురుషులవలనన్= దుష్టులవలన. ఇట్టికాఁతియ= ఇట్టికష్టము. పుట్టెన్. వ్యా.—కాపురుషులు—రూ. కుపురుషులు.

తా.—రాజభార్యలలో నెల్ల నుత్తమురా లయిన ద్రౌపది యెచ్చట నెట్లు కష్టపడుచున్నదో! దుష్టు లగుదుర్యోధనాదులవలన నిట్టికష్టము వారికిఁ గలిగెను.

131. కపటద్యూతము = మోసపుజూదమును. ఒనర్చినన్ = చేయుటచేత. నృపతియున్= ధర్మరాజును. దుర్యోధనఆదినీచులచేన్ = దుర్యోధనుఁడు మొదలుగాఁ గల నీచులవలన. రిపుమర్దనవీర్యభుజగరిష్ఠుండు = శత్రువుల వధించునట్టి పరాక్రమము గల భుజములచేత మిక్కిలి గొప్పవాఁడు. అయ్యున్. పెక్కుఇడుమలన్=పలుకష్టములచేత, కడున్. బాధపడియెన్. పాఠాం:—నీచులచే భారపడియెఁ గడుఁ బెక్కిడుములన్. అర్థము సమానము. నీచులవలన్= నీచులయొక్కవలయందు. ఘాతి= చిక్కి. పెక్కిడుములన్ పడియెన్=పెక్కుకష్టములను పొందెను. నీచులచే నోటువడియెన్.

ధపడియెఁ గడుఁ బెక్కిడుముల, రిపుమర్దనవీర్యభుజగరిష్ఠుం డయ్యున్. 131

క. వినఁబడ రెచ్చోటను దమ, వినుతమహీరాజ్యమహిమ ♦ విడిచి చనుట నే
మని వినియెదనో నీచే, ననుచు నతం డిట్టు లనియె ♦ నాతనితోడన్. 132

వ. వారలకు వగవ వలవదు విధివశంబున వచ్చినయాపదకు నోర్చి బాస దప్పక తారును బాంచాలియు నొక్కటఁ బంద్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁడవయేఁ డజ్ఞాతవాసంబు సలుప వలయుట నిట వచ్చి మనవీట నత్యాసన్నులై యున్నవారు వినుము వారి నెఱింగించెద. 133

క. కంకుఁడు ధర్మసుతుఁడు వల, లాంకుఁడు భీముండు గవలు ♦ హయశిక్షకగో
కింకరులు సెప్పఁ దొడఁగితి, నింకఁ గొఱఁత వెట్ట నేల ♦ యే నర్జునుఁడన్. 134

గీ. అధిపనందన మాలిని ♦ యనఁగఁ బరఁగు, కాంత ద్రౌపది దానికై ♦ కాదె సింహ

---

నీచులచే మోసపోయెను, లేక ఓడెను అని యర్థము. ఈపాఠమునందుఁ బెక్కిడుములన్ అనుదానికి స్వరస మయిన యన్వయము లేమింజేసి యీపాఠ ముపేక్ష్యము.

తా.—కపటద్యూత మాడుటచేత ధర్మరాజు శత్రువుల వధింపఁజాలిన బలపరాక్రమములు గలవాఁడైనను దుర్యోధనాదినీచులకు లోఁబడి పెక్కుకష్టములు పొందెను.

132. తమవినుతమహీరాజ్యమహిమన్ = తమయొక్క పొగడఁబడిన భూమిదొరతనముయొక్క యతిశయమును. విడిచి. చనుటన్ = పోవుటచేత. ఎచ్చోటను. వినఁబడరు. అనుచున్ = అని యుత్తరుఁడు చెప్పఁగా.

తా.—తమగొప్పరాజ్యమును విడిచిపోయినవారగుటవలన వారిసమాచారము కొంచెమైనను వినఁబడదు, ఇప్పుడు వారివిషయము నీ వేమి చెప్పుదువో యని భయపడుచున్నాను. అని యుత్తరుఁ డడుగఁగా వానితో నర్జునుఁ డిట్లు చెప్పెను.

133. వగవన్ = దుఃఖించుట. విధివశంబునన్ = దైవాధీనతచేత. బాస = ప్రతిజ్ఞను. ఒక్కటన్ = ఒకటిగా. మనవీటన్ = మనపట్టణమునందు. అత్యాసన్నులు ఐ = మిక్కిలిసమీపించినవారై. (పాఠాం:—అవ్యాపన్నులై = ఆపద లేనివారై అత్యాపన్నులై = మిక్కిలి యాపద గలవారై. వారలకు వగవ వలదు అని చెప్పుటవలన అత్యాపన్నులై యనుట యనుచితము.

134. ధర్మసుతుఁడు = ధర్మరాజు. వలలఅంకుఁడు = వలలుఁడు అను పేరు గలవాఁడు. కవలు = నకులసహదేవులు. హయశిక్షకగోకింకరులు = అశ్వశిక్షకుఁడును అవుల మేపువాఁడును.

తా.—కంకుఁ డను పేరు గలవాఁడు ధర్మరాజు. వలలుఁ డనువాఁడు భీముఁడు, అశ్వశిక్షకుఁడైనవాఁడు నకులుఁడు, అవులకాపరి సహదేవుఁడు. చెప్ప నారంభించితిని కావున నిఁకఁ గొఱఁత పెట్టరాదు. నే నర్జునుఁడను.

135. అధిపనందన = రాజపుత్త్రికా! పరఁగుకాంత = ఒప్పునట్టి స్త్రీ. సింహబలునిన్ = కీచకుని. మహోగ్రతన్ = మిక్కిలి భయంకరుఁ డగుటచేత. అనిలసుతుఁడు = భీముఁడు. చంపెన్.

బలునిఁ దమ్ముల గంధర్వ♦పతులు చంపి, రనఁ గఁజంపె మహోగ్రత ♦ ననిలసుతుఁడు.

వ. అనిన విని భూమింజయుండు సంభ్రమాశ్చర్యసంశయంబులు మనంబున ముప్పిరి గొనం దప్పక చూచి సవ్యసాచికి వెండియు నిట్లనియె. 136

క. చిరకీర్తిప్రియుఁ డగున, న్నరునకుఁ బది గలవు భవ్య♦నామములు మనో
హరముగ నవి సెప్పుమా యొం, డరయక యే నమ్మెదను బృ♦హన్నల నిన్నున్.

వ. అనుడు నతండు సస్మితాననుం డగుచు నర్జునుండు ఫల్గునుండు పార్థుండు కిరీటి శ్వేతవాహనుండు బీభత్సుండు విజయుండు జిష్ణుండు సవ్యసాచి ధనంజయుండు నను నివి పదియును నాపే ళ్లనవుడు నుత్తరుండు పాండవమధ్యమున కిట్లనియె. 138

క ఏమేమికతంబున నీ, నామంబులు సంభవిల్లె ♦ నరునకు నవి చే
తోమోదంబు గఁ జెప్పుము, నీమదిఁ దత్తద్విధంబు ♦ నిశ్చిత మేనిన్. 139

వ. అనుటయు నట్ల చేయుదు నని యతం డిట్లనియె. 140

గీ. ధరణి యెల్ల గెలిచి ♦ తగ ధనంబులు గొని, యునికి నే ధనంజ♦యుండ నైతి

---

తా.—ఉత్తరా! మాలిని యను పేరు గలసైరంధ్రి ద్రౌపది. ఆద్రౌపదికొఱకే కీచకుని నతనితమ్ములను భీముఁడు గంధర్వులు చంపినా రనుపేరితోఁ జంపెను.

136. సంభ్రమఆశ్చర్యసంశయంబులు = వేగిరపాటును ఆశ్చర్యమును సందేహమును. సంతోషాతిశయముచేఁ దడఁబాటును, అచ్చటఁ బాండవులు తనకుఁ దెలియక యుండుట కాశ్చర్యంబును, పాండవు లగుదురో కారో యనుసంశయంబును. సవ్యసాచికిన్ = అర్జునునితో.

137. చిరకీర్తిప్రియుఁడు = శాశ్వత మయినకీర్తియే ప్రియముగాఁ గలవాఁడు. అన్నరునకున్ = ఆయర్జునునకు భవ్యనామములు = మంగళకరము లయినపేరులు. ఒండు = వేఱు. అరయక = విచారింపక.

తా.—కీర్తిప్రియుఁ డగు నర్జునునకు ఉత్తమము లయిన పదిపేళ్లు గలవు, వానిని నాకుం జెప్పుము. అపుడు బృహన్నలా! నిన్ను సంశయింపక యర్జునునిఁగా నమ్ముదును.

138. సస్మితఆననుండు = చిఱునవ్వుతోఁ గూడిన మోము గలవాఁడు. పాండవమధ్యమునకున్ = అర్జునునితో.

139. ఏమేమికతంబునన్ = ఏయేకారణముచేత. ఈనామంబులు = ఈపేరులు. నరునకున్ = అర్జునునకు. సంభవిల్లెన్ = కలిగెను. అవి = ఆకారణములను. చేతఃమోదంబుగన్ = మనస్సునకు సంతోషము గలుగునట్లు. నీమదిన్ = నీమనస్సునందు. తత్ తత్ విధంబు = ఆయావిధము. నిశ్చితముఏనిన్ = తెలిసినయెడ. చెప్పుము.

తా.—ఏయేకారణముచే నర్జునున కీపేరులు గలిగినవో యాయాకారణములను నీకుఁ దెలిసినయెడ నాకు సంతోషము గలుగునట్లు చెప్పుము.

141. ధరణి = భూమిని. ఉనికిన్ = ఉండుటచేత. ఏన్ = నేను. ధనంజయుండన్ = ధనమును జయించినవాఁడను, ధనంజయుఁ డను పేరు గలవాఁడను. ఎదిరినన్ = ఎదిరించినపక్షమున.

నెట్టివారి నైన ♦ నెదిరినఁ బోర జ, యంబు గొనుట విజయుఁ ♦ డం్రదు నన్ను. 141

గీ. తెలుపు లగువాహనములు నా♦తేరు సమర
భూములం దెప్డు నియతిమైఁ ♦ బూన్కిఁ జేసి
శ్వేతవాహననామవి♦ఖ్యాతి నాకు
సకలజనసమ్మతంబుగ ♦ సంభవించె. 142

చ. రవి యుదయించినట్లు సమ♦రంబున నాతలమీఁదఁ గాంతిమూ
ర్తి వెలుఁగు నింద్రుఁ డిచ్చినకి♦రీట మభేద్యమహోగ్రసుస్థిర
త్వవిభవరూఢిమై జనులు ♦ దానన నన్నుఁ గిరీటినామసం
స్తవనవిశేషపాత్రునిగ ♦ సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా. 143

గీ. వీరులకుఁ జూడ బీభత్స♦విధము గలుగు, నట్టి కార్యంబు సేఁతకు ♦ నెట్టిసమర

---

పోరన్ = యుద్ధమునందు. కొనుటన్ = పొందుటచేత. విజయుఁడు = ఎక్కువజయము గలవాఁడు, విజయుఁ డను పేరు గలవాఁడు. అం్రదు = చెప్పుదురు.

తా.—భూమినంతయు గెలిచిధనము నార్జించినవాఁడ నగుటచే ధనంజయుఁ డనియు, నెల్లవారినియుద్ధమున జయించువాఁడ నగుటచే విజయుఁ డనియు నన్ను జనులు పేర్కొందురు.

142. వాహనములు = గుఱ్ఱములు. నాతేరు = నారథమును. సమరభూములందున్ = యుద్ధభూములయందు. నియతిమైన్ = నియమముచేత. పూన్కిన్ చేసి = వహించుటవలన. శ్వేతవాహననామవిఖ్యాతి = శ్వేతవాహనుఁ డను పేరుయొక్క ప్రసిద్ధి. సకలజనసమ్మతంబుగన్ = సర్వజనులకును సమ్మతమగునట్లు. సంభవించెన్ = కలిగెను.

తా.—నారథమునకు యుద్ధమునం దెప్పుడును నియమముగాఁ దెల్లగుఱ్ఱములనే కట్టుటవలన నాకు సర్వజనసమ్మతముగా శ్వేతవాహనుఁ డనుపేరు గలిగెను.

143. రవి = సూర్యుఁడు. సమరంబునన్ = యుద్ధమునందు ఇంద్రుఁడు. ఇచ్చినకిరీటము. అభేద్యమహోగ్రసుస్థిరత్వవిభవరూఢిమైన్ = భేదింపరాని దగుటయొక్కయు మిక్కిలి భయంకరమగుటయొక్కయు మిక్కిలి స్థిర మగుటయొక్కయు నతిశయముయొక్క ప్రసిద్ధిచేత. కాంతిమూర్తి = కాంతియే రూపముగాఁ గలదై. వెలుఁగున్. దానన్ అ = అందుచేతనే. జనులు. కిరీటినామసంస్తవనవిశేషపాత్రముగన్ = కిరీటి యను పేరుచేత పొగడుటయొక్క యతిశయమునకుఁ దగినవానినిగా. సమ్మతిన్. చేసిరి. మాత్స్యనందనా! ఉత్తరునిసంబోధనము.

తా.—యుద్ధమునందు నా కింద్రుఁ డిచ్చినకిరీటము నాశిరస్సుమీఁద మిక్కిలి కాంతి గలదై యభేద్యమై భయంకరముగాఁ బ్రకాశించును గావున నన్ను జనులు కిరీటి అను పేరుగలవానినిగాఁ జేసిరి.

144. వీరులకున్ = శూరులకు. బీభత్సవిధము = రోఁతయొక్కవిధము. కలుగునట్టికార్యంబు చేఁతకున్ = కలుగునట్టి కార్యముయొక్క చేయుటకు. ఎట్టిసమరభంగులను = ఎట్టియుద్ధముయొక్కవిధ

భంగులను దడఁబడక బీభత్స సేయ, దాన బీభత్సుఁ డనునభిధాన మయ్యె.

క. భండనమున నిరుకేలను, గాండీవము దివియ నేర్పు గలిగిన నం దు
ద్దండ మగుసవ్యకరము ప్రచండత్వ బరఁగుదును సవ్యసాచి యనంగన్. 145

గీ. ధరణి మన్నభ మగునవదాతవర్ణ, మారఁ గలుగుట నర్జునుఁ డంద్రు నన్ను
ఫల్గునాహ్వాయ ముత్తరఫల్గునీవి, శిష్టకాలసంజననతఁ జేసి కలిగె. 146

క. అనిమొన మార్కొని వ్రణ మేఁ, గనుఁగొన ధర్మజునిమేనఁ గావింపఁగ న
య్యనిమిషులుఁ జాల రెవ్వరుఁ, జెనకినఁ బరిమార్తుఁ గాన జిష్ణుఁడ నైతిన్. 147

క. పృథ యనుపేరు మదంబకుఁ, బ్రథితంబై యునికిఁ జేసి పార్థుఁడ నైతిన్

ములయందును. తడఁబడక = తొట్రుపడక. బీభత్స = రోఁతను. బీభత్సుఁడు = రోఁత యయిన వాఁడు, స్వార్థికసన్నంతము. అభిధానము = పేరు.

తా.—నేను వీరులకుఁ గూడ యుద్ధమునందుఁ జూచుటకుఁ గష్టమగునట్లు నెత్తురువఱదలు మొదలగు రోఁతకార్యములను వెనుదీయక చేయుటచేత నాకు బీభత్సుఁ డనుపేరు గలిగెను.

145. భండనమునన్ = యుద్ధమునందు. ఇరుకేలను = రెండుచేతులచేత. తివియన్ = ఆకర్షించుటకు. అంచున్ = ఆనేర్పునందు. ఉద్దండము = భయంకరము. అగు సవ్యకరము ప్రచండతన్ = అయినట్టి యెడమచేతియొక్క యతిశయముచేత. సవ్యసాచి = ఎడమచేత బాణము సంధించువాఁడు. అనంగన్. పరఁగుదును.

తా.—యుద్ధమునందు రెండుచేతులతోను గాండీవముచే బాణములు ప్రయోగించుసామర్థ్యము గలిగి యం దెడమచేతితోఁగూడ బాణములను మిక్కిలి శీఘ్రముగాఁ బ్రయోగించుటవలన నాకు సవ్యసాచి యనుపేరు గలిగెను.

146. ధరణిన్ = భూమియందు. అవదాతవర్ణము = తెల్లనిరంగు. ఆరన్ = అధికముగా. అర్జునుఁడు = తెల్లనివాఁడు. ఉత్తరఫల్గునీవిశిష్టకాలసంజననతన్ చేసి = ఉత్తరఫల్గునీనక్షత్రముతోఁ గూడినకాలమునందుఁ జన్మము గలవాఁడ నగుటచేత. ఫల్గునఆహ్వయము = ఫల్గునుఁ డనుపేరు. కలిగెన్.

తా.—భూమిలో నెవ్వరికిని లేని తెల్లనిరంగు నాకుఁ గలుగుటవలన నాకు అర్జునుఁ డనుపేరు కలిగెను. ఉత్తరఫల్గునీనక్షత్రమునఁ బుట్టినవాఁడ నగుటచేత నాకు ఫల్గునుఁ డనుపేరు కలిగెను.

147. అనిమొనన్ = యుద్ధరంగమునందు. మార్కొని = ఎదిరించి. ధర్మజునిమేనన్ = ధర్మరాజుదేహమునందు. వ్రణము = గాయమును. ఏన్. కనుఁగొనన్ = చూడఁగా. కావింపఁగన్ = చేయుటకు. అయ్యనిమిషులున్ = ఆదేవతలును. చాలరు. ఎవ్వరున్. చెనకినన్ = తాఁకినయెడ. పరిమార్తున్ = చంపుదును. జిష్ణుఁడను = జయించువాఁడను.

తా.—యుద్ధమునందు నేను జూచుచుండఁగా దేవతలుకూడ ధర్మరాజుదేహమున గాయమును గావింపఁ జాలరు. ఎట్టివా రెదిరించినను జంపుదును, కావున నాకు జిష్ణుఁ డనుపేరు గలిగెను.

148. మత్అంబకున్ = నాతల్లికి. పృథ. అనుపేరు. ప్రథితంబుఐ = ప్రసిద్ధమై. ఉనికిన్ చేసి = ఉండుటచేత. పార్థుఁడను = పృథకు (కుంతికి) సంబంధించినవాఁడను, పార్థుఁ డనుపేరు

పృథయుఁగఁ బలుకుదునే యవి, తథవచనుం డైనధర్మతనయుననుజుఁడన్. 148

వ. ఈపదిపేళ్ళును నివి కారణంబులుగాఁ బ్రకాశంబు లయ్యె సకలసురనికరంబు లడ్డపడినం బుండరీకాక్షసహాయుండ నై ఖాండవం బేర్చినప్పుడు మెచ్చి భద్రమూర్తు లైనరుద్రవిరించులు సన్నిధిసేసినం బెన్నిధి గన్నపేదచందంబున సంభ్రమించునాకుం గరుణించి కృష్ణుం డను నేకాదశ నామంబును నప్రతిహతబాణంబులు నొసంగిరి వారలయనుమతి నింద్రాదు లయినవిబుధులును వివిధంబు లగుదివ్యాస్త్రంబు లిచ్చిరి పదంపడి గీర్వాణులకు నోర్వరానియట్టివారి వరదానగర్వితుల నివాతకవచు లనియెడుదైతేయుల మాతలిసారథికం బగునింద్రస్యందనం బెక్కి యొక్కఁడన మూఁడుకోట్ల నిర్జించితి దుర్జయు లగుహిరణ్యపురనివాసుల నఱువదివేవుర దేవారాతుల వారాశితీరంబునం బరిమార్చితి నప్పుడు ప్రీతుం డై కదా గిరిభేది కిరీటం బొసంగె దేవసంఘంబు శంఖం బిచ్చె నది కతంబుగా నచ్చిందంబు దేవదత్తం బనం బరఁగె మఱియు నెయ్యెడల నెవ్వరు దొడరినం బొలివోనిబలిమికలిమి మెఱయ మెలంగుదు గాంధారీనందనుండు గంధర్వరాజు చేతం బట్టువడినయప్పుడు పదునాలుగువేల గంధర్వుల జయించి యతని విడిపించితి నీ వొడకు మీకూడినకురుబలంబుల గెలిచి కర్ణగాంగేయకృపద్రోణద్రౌణి

గలవాఁడను. పృథయుఁగన్ = వ్యర్థముకాఁగూడ. అవితథవచనుండు = వ్యర్థముకాని పలుకులు గలవాఁడు. ఐనధర్మతనయు అనుజుఁడన్ = అయినట్టి ధర్మరాజుతమ్ముఁడను.

తా.—నాతల్లికిఁ బృథ యను పేరు గలుగుటచేత నాకుఁ బార్థుఁ డను పేరు గలిగినది. సత్యవాక్యము గల ధర్మరాజు తమ్ముఁడ నయిన నేను అబద్ధమాడను. అలం. పరికరము.

149. సకలసురనికరంబులు = ఎల్లదేవతలసమూహములు. పుండరీకాక్ష సహాయుండనుఐ = కృష్ణుఁడు తోడుగాఁ గలవాఁడనై. ఏర్చినప్పుడు = కాల్చినపుడు. భద్రమూర్తులు = మంగళకరమయిన యాకారము గలవారు. రుద్రవిరించులు = శివుఁడును బ్రహ్మయును. పెన్నిధిన్ = పెద్దనిధిని. సంభ్రమించునాకున్ = వేగిరపడుచున్ననాకు. ఏకాదశనామంబునున్ = పదునొకండవపేరును. అప్రతిహతబాణంబులున్ = అడ్డులేని బాణములను. విబుధులును = దేవతలును. పదంపడి = ఆటుపిమ్మట. గీర్వాణులకున్ = దేవతలకు. వరదానగర్వితులన్ = వరమిచ్చుటచే గర్వించినవారిని. దైతేయులన్ = రాక్షసులను. మాతలిసారథికంబు = మాతలి సారథిగాఁ గలది. అగు ఇంద్రస్యందనంబు = అయిన యింద్రుని తేరును. దుర్జయులు = జయింపరానివారు. హిరణ్యపురనివాసులన్ = హిరణ్యపురమునందుండువారలను. దేవఆరాతులన్ = రాక్షసులను. వారాశితీరంబునన్ = సముద్రతీరమునందు. గిరిభేది = పర్వతములభేదించిన యింద్రుఁడు. అదికతంబుగాన్ = ఆకారణమువలన. అచ్చిందంబు = ఆశంఖము. దేవదత్తంబు = దేవతలచే నియ్యఁబడినది. తొడరినన్ = ఎదిరించినను. పొలివోని బలిమికలిమిన్ = మొక్కపోని బలము గలుగుట. గాంధారీనందనుండు = దుర్యోధనుఁడు. గంధర్వరాజుచేతన్ = చిత్రరథునిచేత. ఓడకుము = భయపడకుము. గాంగేయ = భీష్ముఁడు. ద్రౌణి =

దుర్యోధనులు గనుంగొను చుండఁ గదుపులం గ్రమ్మఱించెద నని సత్వరంబుగాఁ జెప్పిన విని యుత్తరుండు చిత్తంబున నద్భుతహర్షంబులు పొదువ బ్రమాను డిగ్గ నుఱికి సర్వాంగసంగతోర్వీతలం బగుదండప్రణామం బాచరించి చేతులు మొగిచి నిలిచి యి ట్లనియె. 149

( ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱుంగుట. )

ఉ. బాహుసమగ్రశత్రుమద♦భంజనశౌర్య సమస్తలోకచే
తోహరమూర్తి నీ విటులు ♦ దోఁచుట నాకుఁ బ్రసన్నవిస్ఫుర
ద్దేహముతోడ భాగ్యమయ♦దేవత సన్నిధిసేఁత గాదె స
మ్మోహము వాసెఁ జిత్తము ప్ర♦మోదరసత్వముఁ బొంది పొంగెడున్. 150

క. ని న్నెఱుఁగలేక యమ్మెయి, నన్నపలుకు లెల్ల మఱచి ♦ యాశ్రితరక్షా
సన్నద్ధభావ మేర్పడ, నన్నుం గృపఁ జూడవే స♦నాథుఁడ నగుదున్. 151

---

అశ్వత్థామ. కదుపులన్ = ఆవులమందలను. సత్వరంబుగాన్ = వేగముతోఁ గూడినట్లుగా. చిత్తంబునన్ = మనస్సునందు. పొదువన్ = ఆక్రమింపఁగా. డిగ్గన్ ఉఱికి = దిగి. సర్వఅంగసంగతఉర్వీతలంబు = అన్ని యవయవములచేతను దాఁకఁబడిన భూమి గలది. దండప్రణామంబు = కఱ్ఱయొక్క యాకారముగల నమస్కారమును. మధ్యమపదలోపిసమాసము. మొగిచి = మోడ్చి.

150. బాహు......శౌర్య—బాహు = భుజములచేత, సమగ్ర = నిండినట్టి, శత్రు = శత్రువులయొక్క, మద = గర్వముయొక్క, భంజన = పోఁగొట్టునట్టి, శౌర్య = పరాక్రమము గలవాఁడా! సమస్తలోకచేతఃహరమూర్తి = ఎల్లజనులయొక్క మనస్సును హరించునట్టి యాకారము గలవాఁడా! తోఁచుట = అగపడుట. ప్రసన్నవిస్ఫురత్ దేహముతోడన్ = నిర్మలమయి ప్రకాశించుచున్న శరీరముతో. భాగ్యమయదేవత = భాగ్యరూప మయిన దేవత. సన్నిధిచేఁత = సాక్షాత్కరించుట. సమ్మోహము = కలఁత. పాసెన్ = పోయెను. ప్రమోదరసత్వమున్ = సంతోషమే రసముగాఁ గలిగి యుండుటను.

తా.—పరాక్రమవంతు లగుశత్రువులగర్వమును బోఁగొట్టునట్టి పరాక్రమము గలవాఁడా! సర్వజనులమనోహర మయిన రూపము గలవాఁడా! నీ విట్లు నాకుఁ గనఁబడుట నాభాగ్యదేవత శరీరము ధరించి నాయెదుట నిలిచిన ట్లున్నది. ఇపుడు నాభయముపోయి యధికముగా సంతోషము గలుగుచున్నది. అలం. నిదర్శన.

151. అమ్మెయిన్ = ఆవిధమున. ఆశ్రితరక్షాసన్నద్ధభావము = ఆశ్రితుల కాపాడుటయందుఁ బూనిక కలవాఁడ వగుట. సనాథుఁడను=దిక్కు గలవాఁడను. పాఠాం :—నిన్నెఱుఁగక యే నేమే నన్నపలుకులు = నిన్నుఁ దెలియక నే నేమైనను జెప్పినమాటలను అని యర్థము. నిన్నెఱుఁగక యే మే మన్నపలుకులు= నిన్నుఁ దెలియక యే మేమో చెప్పినమాటలను అని యర్థము.

తా.—నే నింతవఱకు ని న్నెఱుఁగక చెప్పినమాటలను మఱచి నన్ను ఆశ్రితునిఁగాఁ దలఁచి రక్షింపవలయును.

క. అన వినుచుఁ దేరు డిగి గ్ర, క్కునఁ గౌఁగిటఁ జేర్చి విరటు♦కొడుకును గుంతీ
తనయుఁడు సమ్మదమునఁ దన, కనుఁగవపై నశ్రువారి ♦ గడలుకొనంగన్. 152

వ. ఇట్లు సమాలింగితుండై. 153

చ. మనము కలంకదేఱె రిపు♦మర్దనవిక్రమ యొక్క తేరు నీ
ఘనభుజశక్తిప్రాపున న♦ఖండితశౌర్యమహోన్నతుండ నై
యనిమొన సారథిత్వముమ♦హత్త్వము వైరులు మెచ్చఁ జూపెదన్
నను బనిగొమ్ము లెమ్ము కురు♦నాథు నదల్చి మరల్చు గోవులన్. 154

క. మనమునఁ గోరుదు నేన, ర్జునునకు సమరమున రథ్య♦చోదకభావం
బునఁ బనిసేయ వలయు నని, యనిశము విధికరుణ నాకు ♦ నది సిద్ధించెన్. 155

వ. అని పలుకు నుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కిట్లనియె. 156

---

152. గ్రక్కునన్ = శీఘ్రముగా. కుంతీతనయుఁడు = అర్జునుఁడు. సమ్మదమునన్ = సంతోషముతో. తనకనుఁగవపైన్ = తన కన్నులజంటమీఁద. అశ్రువారి = కన్నీరు. కడలుకొనంగన్ = వ్యాపింపఁగా, కౌఁగిటన్ చేర్చెన్ అని యన్వయము.

తా.—ఉత్తరునిమాట విని అర్జునుఁడు తేరు దిగి సంతోషంబునఁ దనకన్నులబాష్పజలము కాఱఁగా నుత్తరునిఁ గౌఁగిలించుకొనెను.

153. సమాలింగితుండై = కౌఁగిలింపఁబడినవాఁడై.

154. రిపుమర్దనవిక్రమ = శత్రువులవధించునట్టి పరాక్రమము గలవాఁడా! అర్జునునిసంబోధనము. మనము = మనస్సు. కలంకదేఱెన్ = ప్రసన్న మయ్యెను. నీఘనభుజశక్తిప్రాపునన్ = నీ గొప్పబాహుబలముయొక్క యాశ్రయముచేత. అఖండితశౌర్యమహత్ ఉన్నతుండనై = తక్కువ కానిపరాక్రమముచేత మిక్కిలి గొప్పవాఁడనై. అనిమొనన్ = యుద్ధరంగమునందు. సారథిత్వము మహత్త్వము = సారథితనముయొక్క గొప్పతనమును. వైరులు = పగవారు. పనిగొమ్ము = ఆజ్ఞాపింపుము. కురునాథున్ = దుర్యోధనుని.

తా.—అర్జునా! ఇప్పుడు నామనస్సు ప్రసన్న మయ్యెను. నేను నీపరాక్రమముచే రక్షింపఁబడినవాఁడనై శౌర్యము వహించి యుద్ధమున శత్రువులు మెచ్చునట్లు నీకు సారథ్యము చేసెదను. నీవు నాచేత సారథ్యము చేయించుకొని దుర్యోధనుని జయించి గోవుల మరల్పుము.

155. సమరమునన్ = యుద్ధమునందు. రథ్యచోదకభావంబునన్ = గుఱ్ఱముల తోలువాఁడ నగుటచేత. అనిశమున్ = ఎల్లప్పుడును. కోరుదున్ అని యన్వయము. విధికరుణన్ = దైవము యొక్క దయచేత.

తా.—అర్జునా! యుద్ధమునం దర్జునునకు సారథ్యము చేయవలయు నని కోరుచుందును, నాకిప్పుడు దైవానుగ్రహమున నది సిద్ధించెను.

156. అత్యాదరంబునన్ = మిక్కిలి ప్రీతితో. సవ్యసాచి = అర్జునుఁడు.

మ. ప్రియ మక్షీణము నాకు నీదెస మదిన్ ♦ భీతిభ్రమోద్వేగసం
శయముల్ సేరఁగ నీను నీకు ఘనర♦క్షాకల్పనాబుద్ధిని
శ్చయసంపాదిని నాదుదృష్టి నిను న♦శ్వవ్రాతమున్ సోఁక గా
లియు రా నీను దృణీకరింపు రిపుదో♦ర్లీలాసముల్లాసమున్. 157

వ. అనిన విని భూమింజయుండు సవినయంబుగా నిట్లనియె. 158

క. నిను నర్జునుం డని యెఱిం, గినయంతనె పాసె నెల్ల♦కిల్బిషములు నీ
తను వేల షండభావం, బునఁ బొందెను యెఱుఁగ వలయుఁ ♦ బుంస్త్వాభరణా.

చ. అనవుడు నాతఁ డిట్లను మ♦దగ్రజుపంపున బ్రహ్మచర్యవ
ర్తనకయి పూర్వశాపవిహి♦తం బగురూపముఁ దాల్చి యేకహా
యనపరిపాలనీయ మగు♦నట్టివ్రతంబు సమాప్తిఁ బొందఁ జ
ల్పినజతనంబు లోకులకుఁ ♦ బేడితనం బయి తోఁచె నిక్కెయిన్. 160

---

157. నాకున్. నీదెసన్ = నీయందు. మదిన్ = మనస్సునందు. ప్రియము = సంతోషము. అక్షీణము = అధికము. భీతి భ్రమ ఉద్వేగసంశయముల్ = భయమును భ్రాంతియును కలఁతయును సందేహమును. చేరఁగనీను = కలుగనియ్యను. నాదుదృష్టి = నాచూపు. ఘన...సంపాదిని—ఘన = గొప్పదైన, రక్షా = కాపాడుటయొక్క, కల్పనా = చేయుటయొక్క, బుద్ధి = అతిశయముయొక్క, నిశ్చయ = నిశ్చయమును, సంపాదిని = కలిగించునది. అశ్వవ్రాతమున్ = గుఱ్ఱముల సమూహమును. రిపుదోర్లీలాసముల్లాసమున్ = శత్రువుల బాహువిలాసముయొక్క యతిశయమును. తృణీకరింపు = తృణముగాఁ జేయుము. పాఠాం:—ఘన...బుద్ధినిశ్చయసంపాదిని = గొప్పరక్షణము చేయుటయందు బుద్ధియొక్క నిశ్చయమును గలిగించునది. ఈపాఠమునందు బుద్ధిజన్య మయినదృష్టిని బుద్ధిజనకముగాఁ జెప్పుట యనుచితముగాఁ దోఁచుచున్నది.

తా.—నీయందు నాకు మిక్కిలి ప్రీతి గలదు. కావున నీకుఁ గొంచెమైనను భయము మొదలగునవి కలుగనీయను. నీకుఁ గాని గుఱ్ఱములకుఁ గాని బాధ లేని యట్లు జాగ్రత్తతోఁ జూచి రక్షించుచుందును, నీవు శత్రువుల పరాక్రమమును గుఱించి భయపడవలసినది లేదు.

159. ఎల్లకిల్బిషములు = ఎల్లదోషములును. పాసెన్ = తొలఁగెను. నీతనువు = నీదేహము. షండభావంబునన్ = నపుంసకత్వమును. పుంస్త్వఆభరణా = మగతనమున కలంకారమైనవాఁడా!

తా.—నీవు అర్జునుఁడ వని తెలిసినంతనే నాభయము లన్నియుఁ దీఱెను. నీవు పురుషశ్రేష్ఠుఁడవై యుండి యిట్లు నపుంసకుఁడ వగుటకుఁ గారణము తెలియఁ గోరుచున్నాఁడను.

160. మత్ అగ్రజుపంపునన్ = మాయన్నయాజ్ఞచేత. బ్రహ్మచర్యవర్తనకయి = బ్రహ్మచర్యవ్రతము చేయుటకై. పూర్వశాపవిహితంబు = తొల్లింటిశాపమునఁ జేయఁబడినది. ఏకహాయనపరిపాలనీయము = ఒకసంవత్సరము పరిపాలింపఁ దగినది, ఒకసంవత్సరము అనుభవింపఁ దగినదనుట. చల్పిన జతనంబు = చేసినప్రయత్నము.

తా.—ఉత్తరునిమాట విని యర్జునుఁ డిట్లనియె. నేను ధర్మరాజునాజ్ఞచే బ్రహ్మచర్యవ్రతముఁ బూని మున్ను నాకుఁ గలిగినశాపముచే సిద్ధించినరూపముతో నొకసంవత్సరము వ్రతము వహించి యుంటిని. అది లోకులకు నపుంసకత్వముగాఁ దోఁచెను.

వ. అదియును నిట మీఁద తే దనినఁ బ్రమోదమానమానసుం డయి మత్స్యపతి
సూనుండు పాండుసూనున కిట్లనియె. 161

గీ. ఇట్లు దెలియఁ జెప్పు ♦ టెల్ల నాదెస దయ, పెంపుతోడికూర్మి ♦ పేర్మిఁ గాదె
యింక సురల కైన ♦ శంకింతునే భవ, ద్బాహువప్రగుప్తి ♦ బలుపు గలుగ. 162

వ. నాకుం బని యెయ్యది పనుపు మనిన నతండును గాండీవంబును గాంచనపుంఖంబు
లగు బాణంబులు గల తూణీరయుగళంబును మదీయతనుత్రాణకృపాణంబులును
బుచ్చికొని తక్కినవాని నెప్పటిభంగిన కట్టి పెట్టి రమ్మని నియోగించిన నాతండు నట్ల
చేయుటయు సమ్మహాత్ముండు నియతాత్ముం డయి యధిదేవతలకుం బ్రణమిల్లి
భక్తితోడ దివ్యకోదండాదు లగుసాధనంబులు గైకొని సవిశేషస్ఫూర్తి యగుమూర్తి
నత్యంతదర్శనీయత్వంబు నొంది. 163

క. బలరిపుఁ డిచ్చినకుండల, ములు నుష్ణీషంబుఁ జిత్త ♦ మున భక్తి మెయిం
దలఁప నవి వచ్చె వెండ్రుక, లలవడఁగాఁ బాచి ముడిచె ♦ నమర దృఢముగన్. 164

---

161. ప్రమోదమానమానసుండు = సంతోషించుచున్న మనస్సు గలవాఁడు. మత్స్యపతిసూనుండు = విరాటరాజుకొడుకు, ఉత్తరుఁడు. పాండుసూనునకున్ = అర్జునితో.

162. నాదెసన్ = నాయందు. దయపెంపుతోడి కూర్మిపేర్మిన్ కాదె = దయయొక్క యతిశయముతోఁ గూడిన ప్రేమయొక్క యాధిక్యముచేతఁ గదా. భవత్ బాహువప్రగుప్తిబలుపు = నీబాహువులను ప్రాకారముచేఁ గలిగినరక్షణముయొక్క బలము. కలుగన్. సురలకున్ ఐనన్ = దేవతలకైనను. శంకింతునుఏ = భయపడుదునా ?

తా.—ఇట్లు నీస్వరూపమును నాకుఁ దెలియఁ జెప్పుటచే నీకు నామీఁదఁ గలుగుప్రేమ స్పష్టమయ్యెను. ఇఁక నీబాహుబలరక్షణము గలుగుటచే నేను దేవతలకుఁ గూడ భయపడను.

163. కాంచనపుంఖంబులు= బంగారుపింజలు గలవి. తూణీరయుగళంబును = అమ్ములపొదుల జంటను. మదీయతనుత్రాణకృపాణంబులును = నాదైన కవచమును ఖడ్గమును. నియోగించినన్ = ఆజ్ఞాపింపఁగా. నియతఆత్ముండు = నియమముతోఁ గూడిన మనస్సు గలవాఁడు. అధిదేవతలకున్ = ఆయుధముల యధిష్ఠానదేవతలకు. ప్రణమిల్లి = నమస్కరించి. దివ్యకోదండఆదులు = శ్రేష్ఠము లయిన ధనుస్సు మొదలగువానిని. సవిశేషస్ఫూర్తి = అతిశయముతోఁ గూడిన ప్రకాశముగలది. మూర్తిన్ = ఆకారముచేత. అత్యంతదర్శనీయత్వంబున్ = మిక్కిలి చూడఁ దగి యుండుటను.

164. బలరిపుఁడు = దేవేంద్రుఁడు. ఇచ్చినకుండలములున్ = ఇచ్చినపోఁగులను. ఉష్ణీషంబున్ = పాగాను. అలవడఁగాన్ = వాటముగా. పాచి = చిక్కుదీసి. దృఢముగన్ = గట్టిగా. అమరన్ = ఒప్పునట్లు. ముడిచెన్.

తా.—దేవేంద్రుఁ డిచ్చినపోఁగులను పాగాను ధ్యానింపఁగా నవి వచ్చెను. అంత నర్జునుఁడు వెండ్రుకల చిక్కుదీసి చక్కఁగా ముడివేసికొనెను.

క. తలచుట్టు చుట్టెఁ గుండల, ములు వెట్టెను దిండు గాఢ♦ముగఁ గట్టెఁ గరం
బుల వలయంబులు గనుఁగొని, యెలనవ్వొలయంగ నెక్కె ♦ నేడ్తెఱ రథమున్.

వ. అట్టియెడ వరదానమహానుభావంబునం జేసి. 166

క. పెట్టక కట్టక మౌళిం, బుట్టినక్రియ దీధితులు న♦భోభాగంబున్
ముట్టి వెలుంగఁగ నింద్రుని, పట్టికిరీటంబు పొలిచెఁ ♦ బ్రస్ఫురితం బై. 167

వ. ఇవ్విధంబున సన్నద్ధుండై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కి యం దాయుధంబులు పదిలంబుగా నిడి తనుత్రాణతలత్రాణంబులు దాల్చి కవదొనలం బూని గాండీవంబుఁ బుచ్చికొని యెక్కువెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన. 168

గీ. పక్షిమృగజాతు లెల్లను ♦ బ్రమసి యిట్టు, నట్టుఁ గలఁగొని చెదరె వృ♦క్షాళి యదరెఁ
గురుబలంబును బెదరె నం♦బరము దిశలు, బూరటిల్లంగఁ జెలఁగెఁ ద♦దారవమున.

---

165. దిండు = దట్టిని. గాఢముగన్ = గట్టిగా. కరంబులన్ = చేతులయందు. వలయంబులు = గాజులను. ఎలనవ్వు = చిఱునవ్వు. ఒలయంగన్ = కలుగఁగా. ఏడ్తెఱన్ = ఉత్సాహముతో.

తా.—పాగా చుట్టి పోఁగులు ధరించి దృఢముగా దట్టి కట్టి తనచేతులగాజులను జూచి చిఱునవ్వునవ్వుచుఁ దేరెక్కెను.

166. వరదానమహత్ అనుభావంబునన్ చేసి = వరదానముయొక్క మహాప్రభావముచేత.

167. మౌళిన్ = శిరస్సునందు. పుట్టినక్రియన్ = పుట్టినట్లు. దీధితులు = కాంతులు. నభోభాగంబున్ = ఆకాశప్రదేశమును. ముట్టి = తాఁకి. ఇంద్రునిపట్టికిరీటంబు = అర్జునునికిరీటము. ప్రస్ఫురితంబు ఐ = మిక్కిలి ప్రకాశించినదై. పొలిచెన్ = కనఁబడెను.

తా.—అర్జునుని కిరీటము శిరస్సునందే పుట్టినట్లు ఆకాశము నంతయుఁ బ్రకాశింపఁజేయుచు పొడచూపెను.

168. సన్నద్ధుఁడు ఐ = ఆయితమైనవాఁడై. అతిరథశ్రేష్ఠుండు = అతిరథులయం దుత్తముఁడు. లెక్కలేనిశూరులతోఁ బోరువాఁ డతిరథుఁడు, మహారథునికన్న నధికుఁడు, పదివేలవిలుకాండ్రతోఁ బోరువాఁడు మహారథుఁడు. తనుత్రాణతలత్రాణంబులు = కవచమును అరచేతికవచమును. కవదొనలన్ = జంటయమ్ములపొదులను. ముష్టిన్ = పిడికిలిచేత. అలవరించి = పట్టి. గుణధ్వని = అల్లెత్రాటిధ్వనిని.

169. తత్ ఆరవమునన్ = ఆయల్లెత్రాటిధ్వనిచేత. ఇట్టునట్టున్ = నానాదిక్కులకు. కలఁగొని = కలఁగి. వృక్షఆళి = వృక్షములసమూహము. అంబరము = ఆకాశమును. దిశలున్ = దిక్కులును. బూరటిల్లంగన్ = నిండి. చెలఁగెన్ = మ్రోసెను.

తా.—ఆధ్వనిచేత పక్షులును మృగములును నానాదిక్కులకుఁ బాఱెను, వృక్షములు కదలెను, కురుసైన్యము భయపడెను, ఆకాశమునందును దిక్కులయందును బ్రతిధ్వని కలిగెను.

వ. తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన నతండును దనవరంబున మున్న కలిగిన విశ్వకర్మనిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగుమహోగ్రకేతనంబును దదాశ్రితంబులైనవికృతాభీలనానాభూతంబులఁ బుత్తెంచిన నుదాత్తచిత్తుండయి యుత్తరుసింహపతాక శమీవృక్షంబునం బెట్టించి నిజధ్వజంబు రథంబునం గట్టించి దివ్యంబు గావున దేవదత్తంబు చిత్తజ్ఞత్వంబున సన్నిధిసేసిన సవినయంబుగాఁ గైకొనియె నక్కుమారుండును నాయితంబై నొగ లెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబులయంగంబులు దొడయుచు వానిజవసత్త్వంబులు వేఱువేఱ వర్ణించిన. 170

—( అర్జునుఁ డుత్తరసారథికంబైనరథం బెక్కి దేవదత్తంబు పూరించుట. )—

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ జేరు ద్రోవ ని
మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న నాతఁడున్
నడపఁ దొడంగుడున్ మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ
బిడుగులపిండు బిట్టులియు పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్. 171

---

170. తత్ అనంతరంబున = అటుపిమ్మట నే. విశ్వకర్మనిర్మితంబును = విశ్వకర్మచేఁ జేయఁబడినదియును. మాయామయంబును = మాయచేఁ జేయఁబడినదియును. వానరఆకారంబును = కోఁతిరూపువంటి రూపు గలదియు. అగు మహోగ్రకేతనంబును = అయిన మిక్కిలి భయంకర మయిన టెక్కెమును. తత్ ఆశ్రితంబులు = దాని నాశ్రయించినవి. వికృతఆభీలనానాభూతంబులన్ = వికారము గలవియు భయంకరము లగు నానావిధము లయినపిశాచములను. పుత్తెంచినన్ = పంపఁగా. ఉదాత్తచిత్తుండు ఐ = గొప్పమనస్సు గలవాఁడై. ఉత్తరుసింహపతాక = ఉత్తరునియొక్క సింహధ్వజమును. దివ్యంబు = దేవతలచే నిర్మింపఁబడినది. దేవదత్తంబు = దేవదత్త మనుశంఖము. చిత్తజ్ఞత్వంబునన్ = అభిప్రాయము నెఱింగిన దగుటచేత. సన్నిధిచేసినన్ = పొడచూపఁగా. అగ్గలికతోడన్ = ఉత్సాహముతో. తురంగంబులఅంగంబులు = గుఱ్ఱములయొక్క దేహములను. తొడయుచున్ = తుడుచుచు. జవసత్త్వంబులు = వేగమును బలమును.

171. తడవు = ఆలస్యము. అగుదెంచెన్ = అయ్యెను. ప్రదక్షిణవృత్తిగన్ = ప్రదక్షిణముగాఁ దిరుగునట్లు. ఎడ = దూరము. కూడుదము = చేరుదము. నడపన్ = తోలుటకు. తొడంగుడున్ = ఆరంభింపఁగా. రణకౌతుకము = యుద్ధమునందలి యుత్సాహము. పిడుగులపిండు = పిడుగులసమూహము. బిట్టు = మిక్కిలి. ఉలియు పెల్లునన్ = ధ్వనించు నతిశయమువంటి యతిశయముచేత. పార్థుఁడు = అర్జునుఁడు. ఒత్తినన్ = పూరింపఁగా.

తా.—ఆలస్య మాయెను. శమీవృక్షమునకుఁ బ్రదక్షిణముగాఁ జేరు తోలుము. పశువులు దూరము పోయెను, ఇప్పుడే మనము కలసికొనవలయును, అని యర్జునుఁడు చెప్పఁగా నుత్తరుఁడు అట్లు రథమును దోలుటయు నంత నర్జునుఁడు యుద్ధోత్సాహము గలవాఁడై పెక్కుపిడుగు లేకకాలమునఁ బడిన ధ్వనివంటిధ్వని గలుగునట్లు తనశంఖమును బూరింపఁగా.

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్. 172

గీ. అపుడు నిశ్చేష్టితంబులై హయము లవనిఁ, జాఁపకట్టుగఁ బడియె మత్స్యక్షితీశ
నందనుండును నొగలపై మ్రందినట్లు, మ్రొగ్గతిలఁ జాఁగబలితంపుమూర్ఛఁ బొందె.

చ. కనుఁగొని ఫల్గునుండు తురగంబులవాగెలు పట్టి యెత్తి త
త్తనువులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ
త్తనయుని నూఁది పట్టి వికృతం బగురూపము చక్కఁజేసి నె
మ్మన మొకభంగిఁ దేర్చి గరిమంబుగఁ గౌఁగిటఁ జేర్చి యి ట్లనున్. 174

---

172. తోయధిసప్తకంబు = సముద్రములయేడు. కలఁగెన్. గిరివర్గంబు = కులపర్వతముల సమూహము. ఎల్లన్. ఊటాడెన్ = చలించెను. వసుంధరావలయము = భూమండలము. సంచలతన్ = కదలిన దగుటను. పొందెన్. ఆశాచక్రము = దిక్కులసమూహము. అల్లాడెన్. త్రిదశ ఇంద్రుపట్టణము = దేవేంద్రునిపట్టణము. కొందలము = క్షోభమును. అందెన్. పాతాళంబు = పాతాళలోకము. ఘూర్ణిల్లెన్ = తిరుగుడుపడెను. గ్రహతారకాకులము = సూర్యుఁడు మొదలగు గ్రహములయొక్కయు నక్షత్రములయొక్కయు సమూహము. ఆకులము = కలఁతనొందినది. అయ్యెన్. అవ్వేధయున్ = ఆబ్రహ్మయు. సంక్షోభించెన్ = కలఁతపడెను.

తా.—సముద్రములు కలఁగెను. కులపర్వతములు కదలెను. భూమి యదరెను. దిక్కులు చలనము నొందెను. స్వర్గము కలఁత నొందెను. పాతాళము భ్రమించెను. గ్రహములు నక్షత్రములు చెదరెను. బ్రహ్మదేవుఁడు క్షోభము నొందెను.

173. హయములు = గుఱ్ఱములు. నిశ్చేష్టితంబులు ఐ = చేష్టలు లేనివై. అవనిన్ = భూమియందు. చాఁపకట్టుగన్ = చాఁపపఱచినట్లుగా. మత్స్యక్షితిఈశనందనుండును = విరాటరాజకుమారుఁడును, ఉత్తరుఁడును. మ్రందినట్లు = చచ్చినట్లు. మ్రొగ్గతిలన్ పడి = చదికిలఁబడి. బలితంపుమూర్ఛన్ = అధిక మయినమూర్ఛను.

తా.—అప్పుడు గుఱ్ఱములు నిశ్చేష్టములై చాఁపపఱచినట్లు పడెను. ఉత్తరుఁడు కూడఁ జచ్చినట్లు మూర్ఛపోయి నొగలమీఁదఁ జతికిలఁబడెను.

174. ఫల్గునుండు = అర్జునుఁడు. తురగంబులవాగెలు = గుఱ్ఱములపగ్గములను. తత్ తనువులు = వాని దేహములను. నూల్కొనన్ = పురికొనునట్లు. నివిరి = తడవి. తత్పరతన్ = మిక్కిలియాసక్తితో. మత్స్యభూమిభృత్ తనయునిన్ = విరాటరాజుకుమారుఁ డయినయుత్తరుని. ఊఁది = ఊని. ఒకభంగిన్ = ఒకవిధమున. తేర్చి = ధైర్యము నొందించి. గరిమంబుగన్ = గొప్పతనము కలుగునట్లుగా.

తా.—అర్జునుఁడు చూచి గుఱ్ఱములను పగ్గములు పట్టి లేవనెత్తి వానిని తట్టి యంత నుత్తరుని లేవఁదీసి వానివికృతరూపమును జక్కఁజేసి మనస్సునకు ధైర్యము కలుగుమాటలు చెప్పి గౌఁగిలించికొని యి ట్లనియె:

గీ. శంఖభేరీరవంబులు ♦ సామజముల, బృంహితంబులు వింతలే ♦ పృథులసైన్య
పరిచయోదాత్తు లగునర♦పాలసుతుల, కెలమిఁ బొందుము దీనికి ♦ నింత యేల.

చ. అనవుడు మత్స్యరాజసుతుఁ ♦ డాతని కిట్లనుఁ దొల్లి శంఖని
స్స్వనములు విందు భేరులర♦వంబులు విందుఁ గరీంద్రబృంహిత
ధ్వనులును విందు నద్భుతవి♦ధంబుగ నిట్లవి యెల్లఁ జిత్తమో
హన మొనరింపఁ జాలునె మ♦హానినదం బిది యోర్వ వచ్చునే. 176

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగెఁ ♦ జిత్తము నీఱయి పోయె నాకు నీ
రవమున నిమ్మహోగ్రకపి♦రాజపతాకయుఁ జూడ్కిఁ జీఁకటుల్
గవియఁగఁ గ్రాలెడున్ భవద♦ఖండితతేజము పర్వి యాత్మకున్
వివశతఁ జేయుచున్నయది ♦ విహ్వలభావము మాన నేర్చునే. 177

---

175. శంఖభేరీరవంబులు = శంఖములయొక్కయు నగారాలయొక్కయు ధ్వనులును. సామజములబృంహితంబులున్ = ఏనుఁగులగర్జితములును. పృథులసైన్యపరిచయ ఉదాత్తులు = గొప్పసైన్యములతోడి యలవాటుచే గొప్పవారలు. అగు నరపాలసుతులకున్ = అయిన రాజపుత్రులకు. వింతలు ఏ = క్రొత్తలా? ఎలమిన్ = ధైర్యమును.

తా.—గొప్పసేనలతో మెలఁగుచుండెడి నీవంటిరాజపుత్త్రులకు శంఖధ్వనులు మొదలగునవి క్రొత్తలు కావు. కావున నీవు దీనికి భయపడక ధైర్యము వహింపుము.

176. మత్స్యరాజసుతుఁడు = ఉత్తరుఁడు. శంఖనిస్స్వనములున్ = శంఖములధ్వనులను. భేరులరవంబులున్ = నగారాలశబ్దములను. కరీంద్రబృంహితధ్వనులును = ఏనుఁగులగర్జితధ్వనులను. విందున్. అవి. ఎల్లన్. ఇట్లు. అద్భుతవిధంబుగన్ = ఆశ్చర్యకర మయినవిధముగా. చిత్తమోహనము = మనస్సును కలంచుటను. ఒనరింపన్ చాలును ఎ = చేయఁజాలునా? మహానినదంబు = గొప్పధ్వని.

తా.—అని యర్జునుఁడు చెప్పఁగా నుత్తరుఁ డతని కిట్లనియె. ఇదివఱకు శంఖధ్వనులను భేరీధ్వనులను గజగర్జితములను విని యున్నాను, కాని యవి యిట్లు మనస్సునకు మోహము గలిగింపఁజాలవు, ఇది మిక్కిలి గొప్పధ్వని. దీని నే నోర్వఁజాలను.

177. ఈరవమునన్ = ఈధ్వనిచేత. దిశల్ = దిక్కులు. చిత్తము = మనస్సు. నీఱుఅయి = భస్మమయి. ఇమ్మహాత్ ఉగ్రకపిరాజపతాకయున్ = ఈ మిక్కిలిభయంకర మయినవానరశ్రేష్ఠముతోఁ గూడినధ్వజమును. చూడ్కిన్ = దృష్టియందు. కవియఁగన్ = క్రమ్మునట్లు. క్రాలెడున్ = ప్రకాశించుచున్నది. భవత్ అఖండితతేజము = నీయొక్క గొప్పదైనతేజస్సు. పర్వి = వ్యాపించి. ఆత్మకున్ = మనస్సునకు. వివశతన్ = పారవశ్యమును. విహ్వలభావము = మూర్ఛ. మానన్ నేర్చునే = విడుచునా?

తా.—ఈశంఖధ్వనిచేత నాచెవులు మాఁత పడి పోయినవి, దిక్కులు తిరుగుచున్నవి. నా మనస్సు దగ్ధ మయ్యెను. ఇది గాక యీభయంకర మయిన వానరధ్వజము నాకన్నులు కానని యట్లు చేయుచున్నది. నీమహాతేజస్సు నామనస్సును పరవశము చేయుచున్నది. ఇఁక నే నెట్లు మూర్ఛిల్లక యుందును?

క. అన విని తగుమాటల నా, తనికొండలపాటు పాండు♦తనయుండు క్రమం
బున డిందుపఱిచి యరదము, సనఁగా నెఱిఁగించి పట్టె ♦ శంఖము మఱియున్. 178

వ. ఇత్తెఱంగున నయ్యుత్తరకుమారు ధీరుం గావించికొని పాండవవీరుండు రథనేమి
నిస్వనజ్యానాదమేదురం బగుశంఖారవంబు సెలంగ నడచుసమయంబున నాచా
ర్యుండు దుర్యోధనున కిట్లనియె. 179

సీ. శ్రవణపుటంబులు ♦ వ్రయ్యంగఁ దాఁకి సం,క్షోభంబు గావించె ♦ గుణముమ్రోఁత
బ్రహ్మాండభాండంబు ♦ పగిలించి భూతని, శ్చైతన్య మొనరించె ♦ శంఖరవము
గగనభాగం బెల్లఁ ♦ గప్పి క్రాలుచు బెగ, డడరించె నుగ్రంపుఁ♦బడగపఱపు
మిఱుమిట్లు గొని చూడ్కి ♦ పఱివోవఁ బెఱిగి ప, రిభ్రాంతి సేసెఁ గి♦రీటకాంతి

---

178. ఆతనికొండలపాటు = ఆయుత్తరుని కలఁతను. డిందుపఱిచి = తగ్గించి. అరదము = తేరు. చనఁగాన్ = పోవుచుండఁగా. ఎఱిఁగించి = తెలిపి. మఱియున్ = మఱియొకమాఱు. శంఖమున్. పట్టెన్ = ఊఁదెను.

తా.—ఉత్తరుని మాట విని యర్జునుఁడు అతనిభయమును క్రమముగాఁ బోఁగొట్టి రథమును పోవ నిచ్చి ముందుగా నతనికిం దెలిపి మరల శంఖము నొత్తెను.

179. ధీరున్ = ధైర్యము గలవానిని. పాండవవీరుండు = అర్జునుఁడు. రథనేమినిస్వనజ్యానాదమేదురంబు = రథముయొక్క చక్రములయంచులధ్వనిచేతను అల్లెత్రాటిధ్వనిచేతను అధిక మయినది. శంఖఆరవంబు = శంఖధ్వని. ఆచార్యుండు = ద్రోణుఁడు.

180. గుణముమ్రోఁత = అల్లెత్రాటిధ్వని. శ్రవణపుటంబులు = దొప్పలవంటిచెవులను. వ్రయ్యంగన్ = పగులునట్లు. తాఁకి = తగిలి. సంక్షోభంబు = మిక్కిలి కలఁతను. శంఖరవము = శంఖధ్వని. బ్రహ్మాండభాండంబు = కుండవంటిబ్రహ్మాండమును. భూతనిశ్చైతన్యము = భూతములకుఁ దెలివిలేమిని, ఇట నిశ్చైతన్యము అనఁగా నవ్యయీభావసమాసము చేసి చైతన్యాభావ మని యర్థము కల్పింప వలెను. ఇట్లవ్యయీభావసమాసముగా నీశబ్దమున కెచ్చటను బ్రయోగము గాన రాదు. అయినను వ్రాఁతప్రతులయం దీపాఠమే కనఁబడుచున్నది. నైశ్చైతన్యము అను పాఠముపక్షమునందు నిశ్చైతన్యభావము—చైతన్యము లేనితనము అని యర్థము, ఈపాఠము యుక్తతరముగాఁ దోఁచుచున్నది. ఉగ్రంపుపడగపఱపు = భయంకర మయిన ధ్వజముయొక్క విరివి. గగనభాగంబు = ఆకాశప్రదేశమును. క్రాలుచున్ = ప్రకాశించుచు. బెగడు = భయమును. అడరించెన్ = కలిగించెను. కిరీటకాంతి. చూడ్కి = చూపు. మిఱుమిట్లుగొని = మిక్కిలిచెదరి. పఱివోవన్ = చెడునట్లు. పెఱిగి = అతిశయించి. వెలిఁగి = ప్రకాశించి యని పాఠాంతరము, అనుప్రాసాలంకృత మగుటచేఁ బూర్వపాఠమే యుక్తతరము. పరిభ్రాంతి = భ్రమమును. తెల్లము = స్పష్టము. వాసవునివరమునన్ = ఇంద్రునివరముచేత. కన్నమకుటంబున్ = పొందినకిరీటమును. వేఱుఅ కొన్నిఐనన్ = ఇతరము లయినపక్షమున. ఇట్లు. ఉజ్జ్వలఅద్భుతభంగులు ఐ = ప్రకాశించునవియు నాశ్చర్యకరములు నగు విధములు గలవియై. ఉన్నె = ఉండునా?

తా.—అల్లెత్రాటిధ్వని చెవులు బ్రద్ద లగునట్లు క్షోభము గలిగించుచున్నది. శంఖముధ్వని బ్రహ్మాండమంతయుఁ బగులునట్లు చేసి సర్వభూతములను మూర్ఛ నొందించుచున్నది. ధ్వజము కాంతి యాకా

తెల్ల మిది గాండివంబును ♦ దేవదత్త, మును గపిధ్వజమును వాస♦వునివరమునఁ
గన్న మకుటంబు నగు వేఱ ♦ కొన్ని యైన,నుజ్జ్వలాద్భుతభంగులై♦యున్నె యిట్లు.

ఉ. అచ్చెరు వైనవిక్రమము♦నగ్గలికన్ సమరంబు గోరి యీ
వచ్చుచు నున్నవాఁడు బల♦వద్రిపుభీషణబాహుఁ డైనవి
వ్వచ్చుఁడ యింక మిన్నక వి♦వాదము సేసినఁ బోవ దియ్యెడం
బొచ్చెము లేనిబల్మగలఁ ♦ బోరి కమర్పుము దర్ప మేర్పడన్. 181

వ. అని కృపాశ్వత్థామాదియోధవీరుల నవలోకించి. 182

క. మనమొనల దుర్నిమిత్తము, లనేకములు పుట్టఁ దొడఁగె ♦ న ట్లగుట జయం
బనుమానం బొకకార్యము, వినుఁడా మీ కెల్లఁ జూడ ♦ వెర వగు నేనిన్. 183

ఉ. ముందర రాజుఁ బుచ్చి బల♦ముల్ గలయంబడి గోవ్రజంబులన్
దందడిపెట్ట కుండఁ బిఱుఁ♦దన్ నడపింపఁగఁ బంచి గట్టిమై

---

శము నంతయు నావరించి ప్రకాశించుచు భయము కలిగించుచున్నది. కిరీటకాంతి చూపులు చెదరు నట్లు మహాప్రకాశముతో భ్రమింపఁజేయుచున్నది. కావున నిట్టి యత్యాటోపధ్వని గలది గాండీవమే. ఇట్టి ధ్వని గలది దేవదత్తశంఖమే, ఇట్టి విజృంభణము గలది వానరధ్వజమే. ఇట్టి మహాప్రకాశము గలది యింద్రుఁ డిచ్చినకిరీటమే కాని యితరము లైనయెడ నిట్లు అద్భుతము లై యుండవు. అలం. యథాసంఖ్యము.

181. అచ్చెరువు = ఆశ్చర్యము. ఐనవిక్రమము అగ్గలికన్ = అయిన పరాక్రమాతిశయము చేత. సమరంబు = యుద్ధమును. బలవద్రిపుభీషణబాహుఁడు = బలము గలశత్రువులకు భయంకరము లయినచేతులు గలవాఁడు. ఐనవివ్వచ్చుఁడు అ = అయినయర్జునుఁడే. ఇయ్యెడన్ = ఈవిషయమున. మిన్నక = ఊరక. వివాదము చేసినన్ = వాదులాడినపక్షమున. పోవదు = తప్పదు. దర్పము = అహంకారము. పొచ్చెము = కొఱఁత. బల్మగలన్ = గొప్పశూరులను.

తా.—ఇప్పుడు గొప్పపరాక్రమముతో మనమీఁదికి యుద్ధమునకు వచ్చుచున్నవాఁడు శత్రువులకు భయంకరుఁ డయినయర్జునుఁడే కాని యితరుఁడు కాఁడు. ఇఁక వాదులాడుటచే నుపయోగము లేదు. వీనితో యుద్ధము చేయుటకు గొప్పశూరుల నేర్పఱుపుము.

182. కృపఅశ్వత్థామఆదియోధవీరులన్ = కృపుఁడు అశ్వత్థామ మొదలుగాఁ గల శూరు లయిన జోదులను.

183. మనమొనలన్ = మనసేనలయందు. దుర్నిమిత్తములు = దుశ్శకునములు. వెరవు = యుక్తము. అగునేనిన్ = అయినయెడ. ఒకకార్యము. వినుఁడా యని యన్వయము.

తా.—మనసేనలయందు దుశ్శకునము లనేకములు తోఁచుచున్నవి, కావున మనకు జయము కలుగుట సందేహము, నే నొకయుపాయముఁ జెప్పెదను, అది మీకందఱకు యుక్త మని తోఁచెనేని వినుఁడు.

184. రాజున్ = దుర్యోధనుని. పుచ్చి = పంపి. బలముల్ = సేనలు. కలయంబడి = కలసి. గోవ్రజంబులన్ = ఆవులసమూహములను. దందడిపెట్టక ఉండన్ = ఉపద్రవపఱుప కుండునట్లు.

నందఱు నింతకుఁ వెనుక♦నై మొన లేర్చి చనంగ నెప్డు సం
క్రందననూతి డగ్గఱియెనే ♦ కయ్యము సేయుట కప్పు డిమ్ముగన్. 184

వ. అనిన విని సుయోధనుండు భీష్మ కృప కర్ణ వికర్ణులఁ దెసం గనుంగొని మున్న చెప్పితిం గాదె జూదంబునం బరాజయంబు బొంది పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున వసియింపను బదుమూఁడవయేఁడు జనపదంబున మన మెఱుంగ కుండఁ జరియింపనుం బూని కాదె భూమి వెలువడిరి యీపదుమూఁడవ యేఁటి కొఱంత గలుగం బార్థుండు దన్నెఱింగించికొనియె నేని నెప్పటియట్ల వనవాసంబునకుం జన వలయు నది మనము మోహంబునం గానమి యొండె వారు లోభంబున వచ్చుట యొండె నగుం గావున నెక్కువదక్కువలు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హులు రిత్తయు త్తరుండ కాక గాండీవియు నగుట మనకార్యంబు సఫలంబు సుశర్మ నక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ మనమును బట్టుట మత్స్యనగరంబునం గౌంతేయు లున్నవా రని శంకించి వారలు గూయివచ్చినం గనుటకుం గాదె యిట్లు నిశ్చయించి చేసినపనికి నిపుడు విచారం బేల యని పలికి వెండియు నిట్లనియె. 185

ఉ. అర్జునుఁ డైన నేమి సుర♦ లైనను నే మగు విద్విషచ్చిరో
పార్జిత మైనగోగణముఁ♦ బట్టితి మెవ్వరు వచ్చి రేని వి

---

పంచి = ఆజ్ఞాపించి. గట్టిమెఱ్ఱ = స్థిర మగువిధమున. ఇంతకున్ = వీని కన్నిటికిని. మొనలు = వ్యూహములను. ఏర్చి = తీర్చి. చనంగన్ = పోవుచుండఁగా. సంక్రందననూతి = ఇంద్రునికుమారుఁ డయిన యర్జునుఁడు. డగ్గఱియెనే = సమీపించునో. కయ్యము = యుద్ధము. ఇమ్ము = అనుకూలము. అగున్.

తా.—ముందు దుర్యోధనుఁడును, అతనివెనుక గోవులును, అటుపిమ్మట సేనలును, చివరను మనమందఱమును వ్యూహములు తీరి పోవుచున్నయెడ నర్జునుఁడు రాఁగానే యుద్ధము సేయుట కనుకూలముగా నుండును.

185. సుయోధనుండు = దుర్యోధనుఁడు. దెసన్ = దిక్కును. పరాజయంబు = ఓడుటను. కొఱంత = తక్కువ. పార్థుండు = అర్జునుఁడు. అది—అట్లు మరలవనవాసమునకుఁ బోవలసియుండుటను. మోహంబునన్ = అజ్ఞానముచేత. కానమి ఒండెన్ = కానకపోవుటయైనను. లోభంబునన్ = ఆశచేత. రిత్తఉత్తరుండు అ = వట్టి యుత్తరుఁడే. గాండీవియున్ = అర్జునుఁడును. సఫలంబు = ఫలముతోఁ గూడినది. కూయివచ్చినన్ = రక్షించువారై వచ్చినయెడ.

186. సురలు = దేవతలు. విద్విషత్ చిరఉపార్జితము = శత్రువులచేఁ జాలకాలముగా సంపాదింపఁబడినది, పాఠాం:—విద్విషత్ ఛిదాఉపార్జితము = శత్రువుల ఛేదించుటచే సంపాదింపఁబడినది యని యర్థము, దీనికన్నను బూర్వపాఠము ప్రశస్త మని తోఁచుచున్నది. గోగణమున్ = ఆవులమందను. విస్ఫూర్జితబాహుసంపదలు = ప్రకాశించుచున్న చేతులయొక్క యతిశయములను. మీఱి = అతిశయించి. నిర్మలఅతిస్ఫూర్జితకీర్తికారణరణఉద్ధతిన్ = పరిశుద్ధ మయిన

స్ఫూర్జితబాహుసంపదలు ♦ సూపుద మొండొరు మీఱి నిర్మలో
త్యూర్జితకీర్తికారణర♦ణోద్ధతి వెల్వెలఁ బాఱ నేటికిన్. 186

చ. మనముల నూలుకొల్పి యను♦మానము లెల్లను బాచి యేచి వా
హనములు నాయుధంబులును ♦ నాయిత మయ్యెడుభంగిఁ జేయుచున్
మొనలకు హెచ్చుగా మనము ♦ మున్ను గడంగినఁ గాక శత్రులం
గనుఁగొని యిట్లు లొండొరుమొ♦గంబులు సూచుచు నున్నఁ బోవునే. 187

( దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట. )

గీ. హరులహేషితములు♦ ననుకూలవాయుసం, చారములును మనకు♦జయముకలిమిఁ
దెలుపు చున్నయవి యు♦ధిష్ఠిరానుజుఁ డొక్కఁ, డీబలంబు గెలువ ♦ నెట్లు నేర్చు.

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదు రని యెఱుఁగఁ డకట ♦ నాయెదు రెదురన్
వివ్వచ్చుఁ జూపి సేనలు, గ్రొవ్వఱఁ బలుపలుకు లిట్లు ♦ ద్రోణుఁడు వలికెన్. 189

---

దియు మిక్కిలి యధిక మయినదియు నగు యశస్సునకుఁ గారణ మయిన యుద్ధముయొక్క యతిశయమునందు. వెల్వెలఁబాఱన్ = భయపడుట. ఏటికిన్ = ఏల ?

తా.—అర్జునుఁడు వచ్చినను దేవతలు వచ్చినను భయము లేదు. శత్రువు బహుకాలముగా సంపాదించినగోవులను బట్టితిమి. ఇఁక నెవ్వరు వచ్చినను ఒకరికంటె నొకరు అధికముగా మనబాహుబలము చూపవలెను. నిర్మల మయినయశస్సు గలిగించునట్టి యుద్ధము సంభవించినపుడు భయపడరాదు.

187. మనములన్ = మనస్సులను. నూలుకొల్పి = కుదిర్చికొని. అనుమానములు = సందేహములను. పాచి = విడిచి. ఏచి = విజృంభించి. ఆయితము = సిద్ధము. అయ్యెడుభంగిన్ = అగు విధమును. కడంగినన్ కాక = పూనిననే గాని. ఒండొరుమొగంబులు = ఒకరొకరి ముఖములను.

తా.—మన మనస్సులను గుదురుపఱచుకొని సందేహములు విడిచి వాహనములను ఆయుధములను సన్నద్ధము చేసికొని సేనల కుత్సాహము కలుగునట్లు మనము ముందుగా యుద్ధమునకుఁ బూనవలసినదే కాని శత్రువులు వచ్చినపుడిట్లొకరిమొగ మొకరు చూచుచుండుటచే నుపయోగము లేదు.

188. హరులహేషితములున్ = గుఱ్ఱముల సకిలింతలును. అనుకూలవాయుసంచారములును = అనుకూల మయిన గాలియొక్క వీచుటలును. జయముకలిమిన్ = గెలుపుగలుగుటను. యుధిష్ఠిరఅనుజుఁడు = ధర్మరాజుతమ్ముఁ డయిన యర్జునుఁడు.

తా.—గుఱ్ఱములసకిలింతలును వెనుకతట్టుగా వీచుగాలియును మనకు జయము గలుగు నని తెలుపుచున్నవి. కావున నర్జునుఁ డొక్కఁ డీబలమును గెలువఁజాలఁడు.

189. నాఎదురుఎదురన్ = నా యెట్టయెదుట, ఎదురెదురన్—వ్యు. ఎదురన్ + ఎదురన్—ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు వైకల్పికము, రూ. ఎదుర నెదురన్. వివ్వచ్చున్ = అర్జునుని. గ్రొవ్వఱన్ = ఉత్సాహము చెడునట్లు. పలుపలుకులు = పెక్కుమాటలు.

తా.—ఇతరులు విన్నయెడఁ బరిహసింతు రని యెఱుఁగక ద్రోణుఁడు నాయెట్టయెదుటనే యర్జునుని పొగడి సేనల కుత్సాహము చెడునట్లు పెక్కుమాట లాడెను.

గీ. రోష మొందెను రాజ్యాభి♦లాష మొందెఁ, గాక యీతనిరాకకుఁ ♦ గారణంబు
బీర మెఱుఁగమి నెదిరిని ♦ బెద్దఁ జేసి, పూని వందివిధంబునఁ ♦ బొగడ నేల. 190

వ. ఆచార్యులైనవారలు కార్యంబు దవ్వులం గనియెడువారు కయ్యంబు తెఱంగు వారల నడుగ వలవదు బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధశ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠీకాలంబుల నుచితాలాపంబులు వలుకుదురు గాని పోట్లాడెడువారు గారు వారిం గలనం గలసి నిలువ నీక పిఱిందిదెస నిలిపిన మనకు వారు విజయంబు గోరుచుందు రది లెస్స యనిన విని యశ్వత్థామ యతనికి ట్లనియె. 191

ఉ. కావలివారిఁ దోలి యెస♦కంబున గోవులఁ బట్టికొంటి నం
చీవెడమాట లేల ధర♦ణీశ్వర యింతకు మున్న వీటికిం
బోవవు శత్రునేపు నుడిపి ♦ పోయెడువాఁడవు గావు నీవు సై
న్యావలి నైనఁ జేడ్పడక ♦ యాతల కేగుట లేదు నేనియున్. 192

---

190. రోషము = కోపము. రాజ్యఅభిలాషము = రాజ్యమునందలి కోరిక. కాక = కాని. బీరము = పరాక్రమమును. ఎఱుఁగమిన్ = తెలియకపోవుటచేత. ఎదిరిని = శత్రువును. వందివిధంబునన్ = బట్టువలె. పాఠాం:—వెఱయెఱుఁగమిఅ = ఇతరకారణము నెఱుఁగనే యెఱుంగము అని యర్థము.

తా.—ఈయర్జునుఁ డిట్లు వచ్చుటకు కారణము మనమీఁదికోపమో లేక రాజ్యముమీఁదియాశయో కాని వేఱు కాదు. ద్రోణుఁడు పరాక్రమము సంగతి తెలియక బట్రాజువలె శత్రువును గొప్పగాఁ బొగడుట యుక్తము కాదు.

191. ఆచార్యులు = గురువులు. కార్యంబు = ఉపాయమును. దవ్వులన్ = దూరమునందు. కనియెడువారు = తెలియువారు. గురువులు ఉపాయము తెలిసినవారు గాని యుద్ధముచేయువారు కారు అనిభావము. కయ్యంబుతెఱంగు = యుద్ధముయొక్క విధమును. భోజనఅవసరంబులన్ = భోజనకాలములయందును. ఆయుధశ్రమసమయంబులన్ = ఆయుధవిద్య నేర్చుకొను కాలములయందును. నీతిశాస్త్రిగోష్ఠికాలంబులన్ = నీతిశాస్త్రిముయొక్క ప్రస్తావసమయములందును. ఉచితఆలాపంబులు = తగినమాటలను. కలనన్ = యుద్ధమునందు. పిఱిందిదెసన్ = వెనుకవైపున.

192. ఎసకంబునన్ = గొప్పతనముచేత. ఈవెడమాటలు = ఈవ్యర్థపుపలుకులు. ధరణీఈశ్వర = రాజా! దుర్యోధనుని సంబోధనము. వీటికిన్ = హస్తినాపురమునకు. పోవవున్ = పోవకున్నను. శత్రుఏపు = శత్రువుయొక్క గర్వమును. ఉడిపి = పోఁగొట్టి. పోయెడువాఁడవు కావున్ = పోవువాఁడవు కాకున్నను. నీవు. సైన్యఆవలిఐనన్ = సేనల సమూహమైనను. చేడ్పడక = కష్టము నొందక. పాఠాం:—పాల్పడక = పరాధీనులు కాక యని యర్థము. ఆతలకున్ = ఆచోటికి, హస్తినాపురమున కనుట. ఏగుట = పోవుట. లేమున్ ఏనియున్ = లేకున్నను. లేమున్ అనుచో సముచ్చయార్థకము ప్రయోగింపఁబడియుండుటచే ఏనియున్ అనునది పోవవున్, కావున్ అను క్రియలతోఁ గూడ నన్వయించును.

తా.—రాజా! యిదివఱ కవి హస్తినాపురమునకును బోలేను. నీవును శత్రువును జయించినవాఁ

క. సమరమున గెల్చి యొరురా, జ్యము గొనియును సుజనుఁ డిట్లు ♦ లాడఁడు సిరి జూ
దమునఁ గొని రజ్జు లేటికి, సమయం బరుదెంచెఁ దొంటి♦చందము గలదే. 193

ఉ. పాండవవీరులం గలన ♦ బాహుబలంబున నోర్చిరే సము
ద్దండత నీవు దొల్లి ద్రుప♦దక్షితిపాత్మజఁ గొల్వులోనికిం
దెం డని పుచ్చి యద్దెసకుఁ ♦ దెచ్చుట సౌబలునీతిఁ గాదె యా
తండ మరల్చుఁ గాక సము♦దగ్రత వచ్చువిరోధి నిప్పుడున్. 194

వ. అభ్యంగినవమానింపంబడినవాఁడు గావున ధార్తరాష్ట్రకులధూమకేతు వగుకపికేతువు దోఁచె నీకు దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింప వచ్చు నంతియ కాక దేవదానవుల కయినను దుర్జయుం డగునర్జునునకుం దలసూప వచ్చునే నయవిక్రమంబుల నతిలోకుం డగునతని నెవ్వరి కేనియుం బొగడ వలయుఁ బుత్రనిర్విశేషుం డగునిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంత యె యింక

---

డవుసుకావు. నీవుగాని సైన్యములుగాని శత్రువులచేఁ బాధనొందక యూరు చేరలేదు. ఇట్లుండఁగా కావలివారిని బాఱఁదోలి గోవులఁ బట్టుకొనుట గొప్పతన మని పొగడుకొనవలదు.

193. సమరమునన్ = యుద్ధమునందు. ఒరురాజ్యమున్ = శత్రువుయొక్క రాజ్యమును. సుజనుఁడు = సత్పురుషుఁడు. సిరిన్ = రాజ్యలక్ష్మిని. రజ్జులు = వ్యర్థపుమాటలు. తొంటిచందము = మునుపటివిధము.

తా.—యుద్ధమునందు శత్రువును జయించి యాతని రాజ్యము పొందినవాఁ డైనను సత్పురుషుఁ డిట్లాత్మస్తుతి చేసికొనఁడు, నీవు జూదముచే రాజ్యము నపహరించి యిట్లాత్మస్తుతి చేసికొనుట యుక్తము కాదు. ఇపుడు యుద్ధము వచ్చెను. ఇది జూదము కాదు.

194. నీవు. సముద్దండతన్ = గర్వముచేత. ద్రుపదక్షితిప ఆత్మజన్ = ద్రుపదరాజుకూఁతు రయిన ద్రౌపదిని. కొల్వులోనికిన్ = సభలోనికి. పుచ్చి = పంపి. అద్దెసకున్ = ఆయవస్థకు. తెచ్చుట. పాండవవీరులన్ = శూరు లయినపాండవులను. కలనన్ = యుద్ధమునందు. బాహుబలంబునన్ = భుజబలముచేత. ఓర్చిరే = జయించిరా? సౌబలునీతిన్ = శకునియొక్క నీతిచేత. కాదే. ఆతండు అ = ఆశకునియే. సముదగ్రతన్ = మిక్కిలి భయంకరుఁ డగుటచేత. వచ్చువిరోధిన్ = వచ్చునట్టి శత్రువును. ఇప్పుడున్. మరల్చున్ కాక యని యన్వయము.

తా.—తొల్లి నీవు ద్రౌపదిని సభకు రప్పించి యవమానపఱచుట పాండవులను బరాక్రమమున జయించి కాదు కదా! అప్పుడు శకుని గదా నీకు సహాయుఁడు. ఆశకునియే యిపుడుకూడ భయంకరాకారుండై వచ్చునట్టిశత్రువును జయించుఁ గాక.

195. అభ్యంగిన్ = అప్రకారము. ధార్తరాష్ట్రకులధూమకేతువు = ధృతరాష్ట్రునిదైన వంశమునకుఁ దోఁకచుక్కవంటివాఁడు. కపికేతువు = కోతిసిడము గల యర్జునుఁడు. కపికేతనుండు— అనుపాఠమునను నర్థము సమానము. తోఁచెన్ = కనఁబడెను. అధిక్షేపింపన్ = ఆక్షేపించుటకు. దుర్జయుండు = జయింప నలవి గానివాఁడు. నయవిక్రమంబులన్ = నీతిచేతను బరాక్రమముచేతను.

సిగ్గుమాలి రణంబు సేసినేనియు ద్రోణుండ సేయుఁ గాని యే నిట్టిదాని కోర్వ
నదియునుం గాక. 195

క. ప్రళయాంతకుఁడు బడబా, నలమును మృత్యువును నెదిరి♦నం గొఱఁతవడక్
నిలిపినను నిలుపు మార్కొ,ని, చెలఁగిననరుశరము లనవ♦శేషము సేయున్. 196

గీ. కుటిలబుద్ధు లిచటఁ ♦ గొనవు నెట్టన ఘన, దోర్బలంబు మెఱసి ♦ తొడరవలయు
నతఁడు గాండివమున ♦ నడ్డసాళులు వైవఁ, డరుల నంపవాన ♦ గురియుఁ గాని. 197

క. విను మట్టులు గా కున్నం, దనగోవులవెనుక మత్స్య♦ధరణీశుఁడు వ
చ్చిన మార్కొందుము నరుఁ డే, పున ముట్టిన నతనిపొంతఁ ♦ బోదుమె యధిపా.

వ. అనిన విని రాధేయుండు సక్రోధుండై యోధవీరలోకంబు నాలోకించి 199

చ. పడిగొని గోగణంబుఁ బొదు♦నం బఱతెంచితి రెల్లవారు ము
న్నొడఁబడి పాండునందనుల♦యున్నెడ యిమ్మెయిఁ గాన వేఁడి యి

---

అతిలోకుఁడు = లోకము నతిక్రమించినవాఁడు. పుత్రనిర్విశేషుండు = కొడుకునకన్న వేఱు కానివాఁడు. అగ్గించుట = కొనియాడుట.

196. ప్రళయాంతకుండున్ = ప్రళయకాలమునందలి యముఁడును. ఎదిరినన్ = ఎదిరించిన యెడ. కొఱఁతపడక్ = మిగులునట్లు. మార్కొని = ఎదిరించి. చెలఁగిన నరుశరములు = విజృంభించిన యర్జునుని బాణములు. అనవశేషము = మిగత లేనియట్లుగా.

తా.—యముఁడును బడబాగ్నియు మృత్యువును ఎదిరించినయెడఁ గొందఱిని వధించి కొందఱిని నిలిపినను నిలుపుదురు. అర్జునుని బాణములుమాత్రము ఎదిరించినవారిని నిశ్శేషముగా వధించును.

197. కుటిలబుద్ధులు = కుత్సితపుతలంపులు. కొనవు = పనికిరావు. నెట్టన = అనివార్యముగా. ఘనదోర్బలంబు = గొప్పబాహుబలము. మెఱసి = చూపి. తొడరవలయున్ = ఎదిరింపవలయును. అతఁడు = ఆ యర్జునుఁడు. గాండివమునన్. అరులన్ = శత్రువులను గూర్చి. అంపవాన = బాణవర్షము, అమ్ము + వాన. కురియున్ కాని. అడ్డసాళులు = పాచికలను. వైవఁడు.

తా.—జూదమునందువలెఁ గుత్సితపుబుద్ధు లిప్పు డుపయోగింపవు. అర్జునుఁడు గాండీవముచే శత్రువులమీఁద బాణవర్షము వర్షించుఁ గాని పాచిక లాడఁడు. కావున పరాక్రమము వహించి యుద్ధము చేయవలయును.

198. మార్కొందుము = ఎదిరింతుము. నరుఁడు = అర్జునుఁడు. ఏపునన్ = గర్వముచేత. ముట్టినన్ = తాఁకినయెడ. అతనిపొంతన్ = ఆయర్జునుని సమీపమునకు. అధిపా = రాజా! దుర్యోధనుని సంబోధనము.

తా.—రాజా! అట్లు గాక తనగోవులను మరల్చుటకై విరాటరాజే వచ్చినయెడ మేము వాని నెదిరింతుము అర్జునుఁడు వచ్చినయెడ నతనిమీఁదికిఁ బోఁజాలము.

199. రాధేయుండు = కర్ణుఁడు. సక్రోధుండు ఐ = కోపము గలవాఁడై. యోధవీరలోకంబున్ = శూరు లయిన జోదులసమూహమును.

200. ఎల్లవారున్ = అందఱును. మున్ను. ఒడఁబడి = అంగీకరించి. పాండునందనుల ఉన్న ఎడ = పాండుపుత్త్రులయున్నచోటును. ఇమ్మెయిన్ = ఈప్రకారము. కానన్ = తెలియుటకు.

ప్పుడు నరుఁ గాంచి మీ రతని♦పోటు నుతించుచు భీతి నిట్లు వా
విడిచి యనేకభంగిఁ బృథి♦వీపతి వీఱిఁడిఁ జేయు టొప్పునే. 200

చ. వెఱచితిరేని నిల్వుఁ డొక♦వీరున నొక్కఁడ చాలుఁ గాక యొం
దఱు వలయుం గపిధ్వజము♦ దవ్వుల వ్రేల్మిడిఁ ద్రుంచి వైచెదం
బఱపెదఁ దత్పిశాచముల♦ భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నెఱఁకులు నొంచెదం బొదులు♦ నించెద నర్జునగాత్రశాలలోన్. 201

శా. జ్యాఘోషం బతిభీషణం బయి దిశా♦చక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికల♦స్వాంతుండు గా నారద

---

వేఁడి = కోరి. వడిగొని = త్వరపడి. గోగణంబున్ = ఆవులమందను. పొదువన్ = పట్టుటకు. పఱతెంచితిరి = వచ్చితిరి. ఇప్పుడు. నరున్ = అర్జునుని. అతనిపోటు = ఆయర్జునుని శౌర్యమును. నుతించుచున్ = పొగడుచు. భీతిన్ = భయముచేత. వావిడిచి = నోరుతెఱచి, సంకోచము లేక యనుట. అనేకభంగిన్ = పెక్కువిధములచేత. పృథివీపతిన్ = రాజును. వీఱిఁడిన్ = అవివేకినిగా.

తా.—మీరందఱు మున్ను పాండవులను గనుపెట్టుటకై యావుల ముట్టడించుటకు సమ్మతించి వేగముగా వచ్చితిరి. ఇపు డర్జునునిఁ జూచి భయపడి యతనిపరాక్రమమును బొగడుచు రాజును దెగడుట యుక్తము కాదు.

201. వెఱచితిరి ఏనిన్ = భయపడినయెడ. వలయున్ = కావలయును. కపిధ్వజమున్ = కోఁతి గల టెక్కెమును. దవ్వులన్ = దూరమునందు. వ్రేల్మిడిన్ = శీఘ్రముగా. తత్ పిశాచములన్ = ఆటెక్కెమునం దున్న దయ్యములను. పఱపెదన్ = తోలెదను. తేరు. భగ్నమున్ = విఱువఁబడినదానిని. చేసెదన్. నెఱఁకులు = మర్మస్థానములయందు. నొంచెదన్ = నొప్పించెదను. అర్జునగాత్రశాలలోన్ = అర్జునునియొక్క గృహమువంటి దేహమునందు. పొదులు = బాణములసమూహములను. నించెదన్.

తా.—భయపడినయెడ మీరు యుద్ధమునకు రావలదు. ఒకశూరుని గెలుచుట కొకఁడే చాలును కావున నేనొక్కఁడనే యర్జునుని కపిధ్వజమును ద్రుంచి దానియందలి పిశాచములను బాఱఁదోలి యతనిరథమును విఱిచి సారథిని నొప్పించి యాతనిదేహమంతయు బాణములు నాటెదను.

202. జ్యాఘోషంబు = అల్లెత్రాటిమ్రోఁత. అతిభీషణంబు అయి = మిక్కిలి భయంకరమై. దిశాచక్రంబు = దిక్కులసమూహము. శరవ్యాఘాతంబునన్ = బాణములదెబ్బచేత. శాత్రవుండు = పగవాఁడు. వికలస్వాంతుండు గాన్ = భయపడిన మనస్సు గలవాఁ డగునట్లు. నారదశ్లాఘాపాత్రము ఐ = నారదునిపొగడ్తకుఁ జోటైనవాఁడనై. అనర్గళభుజాసంరంభతన్ = అడ్డులేనిబాహుల వేగము గలవాఁడ నగుటచేత. రౌద్రరేఖాఘోరఆకృతి = రౌద్రరసము యొక్క విధముచేత భయంకర మయినయాకారమును. అశంకన్ = నిర్భయముగా. ఏర్పడన్ = స్పష్ట మగునట్లు. మాడుఁడీ యని యన్వయము.

తా.—అల్లెత్రాటిధ్వని భయంకరముగా దిక్కులు నిండునట్లును, శత్రువు బాణముల వ్రేట్లు

శ్లాఘాపాత్రము నై యనర్గళభుజా♦సంరంభతన్ రౌద్రరే
ఖాఘోరాకృతి యేన చూపెద నశం♦కం జూడుఁడీ యేర్పడన్. 202

క. క్రోధజ్వాలలు నిగుడ వి, రోధిబలేంధనముఁ బొదువు♦క్రూరత్వమై దు
స్సాధ మగునర్జునాగ్ని ని, సాధించెద నేన పూని ♦ శరవర్షమునన్. 203

వ. పాండవమధ్యముండు పదుమూఁడువత్సరంబులు పూఁచి పట్టి కయ్యంబునకు వచ్చె నతనిలావును బీరంబును లోకంబునకు నెక్కి యున్నయవి యేనును గురుసేన యందు శక్తిశౌర్యంబులు గలవాఁడన పోలె వర్తించెదం గావున నే మిరువురము నొండొరులకు బాహుబలవిలాసంబును విక్రమక్రీడాకౌశలంబును బ్రకటించుట యుచితంబు గాదె యని వెండియు ని ట్లనియె. 204

సీ. అనుదినంబును నంత ♦ కంతకుఁ బెరిఁగెడి, యధిపతిమన్ననఁ♦యుప్పు దీర్ప
నర్జును నోర్చెద ♦ ననిలోన నే నని, యతనితోఁ బలికిన♦ప్రతిన నెఱపఁ
గర్ణార్జునులయందు♦ఘనుఁ డెవ్వఁడగునొక్కొ, యనుజనంబులసందే♦యంబుమాన్ప
జమదగ్నిసుతకృపా♦శ్రయమునఁ బడసిన, విలువిద్యకలరూపు ♦ వెలయఁ జేయఁ

నను భయపడిపోవునట్లును, నారదుఁడు శ్లాఘించునట్లును నేనే రౌద్రాకారంబున నాభుజబలముం జూపెదను. మీరు నిర్భయులై చక్కఁగాఁ జూచుచుండుము.

203. క్రోధజ్వాలలు = కోపమనెడు మంటలు. నిగుడన్ = వ్యాపింపఁగా. విరోధిబలఇంధనమున్ = శత్రువుల సైన్యము అను కట్టెను. పొదువు క్రూరత్వమైన్ = చుట్టుకొనునట్టి క్రూరత్వము చేత. దుస్సాధము = సాధింపరానిది. అగు అర్జునఅగ్నిని = అయిన యర్జునుఁడు అను నిప్పును. నేను అ. పూని. శరవర్షమునన్ = బాణముల వానచేత. సాధించెదన్. అలం. రూపకము.

తా.—క్రోధము అను మంటలతో శత్రుసేనయను కట్టెలను దహించునట్టి యర్జునుం డనునిప్పును నేనే బాణములవర్షముచే నార్చెదను.

204. పూఁచి = పూని. లావును = బలమును. బీరంబును = శౌర్యమును. బాహుబలవిలాసంబును = భుజబలముయొక్క యతిశయమును. విక్రమక్రీడాకౌశలంబును = పరాక్రమ మను నాటయందలి నేర్పును. ప్రకటించుట = తెలుపుట.

205. అనుదినంబును = ప్రతిదినమును. అంతకంతకున్ = అప్పటప్పటికి. పెరిఁగెడి అధిపతి మన్ననఅప్పు= వృద్ధిపొందునట్టి రాజుయొక్క గౌరవముయొక్క ఋణమును. ఓర్చెదన్ = ఓడించెదను. అనిలోనన్ = యుద్ధమునందు. అతనితోన్ = అదుర్యోధనునితో. పలికినప్రతిన = చెప్పిన ప్రతిజ్ఞను. నెఱపన్ = పూర్తిచేయుటకును. ఘనుఁడు = గొప్పవాఁడు. జమదగ్నిసుత కృపాఆశ్రయమునన్=పరశురామునియొక్క దయ నాశ్రయించుటచేత. పడసిన విలువిద్యకలరూపు=పొందిన ధనుర్విద్యయొక్కయథార్థమును. వెలయఁజేయన్ = వెల్లడిచేయుటకును. కనుటన్ = లభించుట చేత. పసులజాడన్ = పశువులవెంబడి.

గనుట నేఁడు పుణ్య♦దిన మయ్యె నాకు మీ, కెల్లఁ బోరు సూడ ♦ నిష్ట మేనిఁ
జూడుఁ డట్లు గాక ♦ వేడుక లేదేని, సంతసమునఁ జనుల♦జాడఁ బొండు. 205

వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కి ట్లనియె. 206

గీ. కయ్యమునక యెప్పుడుఁ ♦ గాలుద్రవ్వుదు కార్యగతికిఁ జొరవు నీతి♦యుతులు సమర
మధమసాధనముగ ♦ నాడుదు రర్థసం, సిద్ధిఁ బొందు తెఱఁగు ♦ సేయు నెడల. 207

క. అగు దేశకాలబలయుత, ముగఁ జేసినపోర నర్థ♦ములు మోఱకు లై
తెగఁబాఱి తమ్ము నెదిరిని, వగవక తొడరుటలఁ గీడు ♦ వర్తిల్లుఁ దుదిన్. 208

వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతు మేని. 209

సీ. శక్రాదిసురులతో ♦ సంగ్రామ మొనరించి, ఖాండవం బేర్చె నొ♦క్కరుఁడ కాఁడె
యాదవబల మెల్ల ♦ నాఁగఁ ద్రోచి సుభద్రఁ, గడిమిమైఁ దెచ్చె నొ♦క్కరుఁడ కాఁడె

---

తా.—నానాఁటికి అధికముగా దుర్యోధనుఁడు నన్ను గౌరవించుఋణమును దీర్చుటకును, నేను యుద్ధములో నర్జునుని జయింతు నని దుర్యోధనునితోఁ జెప్పిన ప్రతిజ్ఞను నెఱవేర్చుటకును, కర్ణార్జునులలో నెవ్వఁడు బలవంతుఁ డని జనులకుఁ గల సందేహమును తీర్చుటకును, బరశురాముని యనుగ్రహముచే సంపాదించిన ధనుర్విద్య యిట్టిదని వెల్లడిచేయుటకును నాకు సమయము దొరకుటవలన నేఁడు నాకు సుదినము. యుద్ధము చూచుటకు మీ కిష్ట మున్నయెడఁ జూడుఁడు లేనియెడఁ బశువుల వెంటఁ బొండు.

207. కయ్యమునకున్ = యుద్ధమునకు. కాలుద్రవ్వుదు — ఆరంభింతు ననుట. కార్యగతికిన్ = కార్యముయొక్క సిద్ధికి. చొరవు = ప్రవేశింపవు. అర్థసంసిద్ధిన్ = కార్యసిద్ధిని. పొందుతెఱఁగు = పొందునట్టి యుపాయమును. చేయుఎడలన్ = చేయు సమయములయందు. నీతియుతులు = నీతితోఁ గూడినవారు. సమరము = యుద్ధమును. అధమసాధనముగన్ = నీచ మయిన యుపాయమునుగా. ఆడుదురు = చెప్పుదురు.

తా.—నీ వెప్పుడును యుద్ధమునకే ముందుపోదువు, కార్యము సిద్ధించు నుపాయము నాలోచింపవు. కార్యసిద్ధి యగు నుపాయములయందు యుద్ధము అధమమయిన యుపాయ మని పెద్దలు చెప్పుదురు.

208. దేశకాలబలయుతముగన్ = దేశకాలముల బలముతోఁ గూడినట్లుగా. చేసినపోరన్ = చేసినయుద్ధమునందు. అర్థములు = కార్యములు. అగున్ అని యన్వయము. మోఱకులు ఐ = మూర్ఖులై. తెగఁబాఱి = తెగించి. వగవక = ఆలోచింపక. తొడరుటలన్ = ఎదిరించుటల చేత. తుదిన్ = చివరను. కీడు. వర్తిల్లున్ = కలుగును.

తా.—దేశకాలములకుఁ దగినట్లు యుద్ధము చేసినచోఁ గార్యసిద్ధి యగును. అట్లు గాక మూర్ఖులై తమ్ము శత్రువు నాలోచింపక పోరినయెడఁ బరాజయము కలుగును.

209. అక్కిరీటి = ఆయర్జునుఁడు.

210. శక్రఆదిసురులతోన్ = ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతలతో. సంగ్రామము = యుద్ధమును. ఏర్చెన్ = దహించెను. యాదవబలమున్ = యాదవసైన్యమును. ఆఁగన్ = అడ్డగిం

దిగ్విజయంబునఁ ♦ దేజంబు సేసె ని, క్కురువంశమునకు నొ♦క్కరుఁడ కాఁడె
బలములతో గంధర్వ♦పతి నోర్చి విడిపించెఁ, గౌరవేశ్వరుని నొ♦క్కరుఁడ కాఁడె
యని నివాతకవచు♦ లనుదానవుల నాతఁ, డొక్కరుండ కాఁడె ♦ యుక్కు మడఁచె
నమరులకు నజయ్యు♦ లగు కాలకేయుల, నొక్కరుండ కాఁడె ♦ యొడిచెఁ గర్ణ. 210

క. భూవరు లెల్లను నొక్కట, ద్రోవదికై తొడరి యతని♦తోఁ బెనఁగి కడుం
జేవ సెడి పోవు నప్పుడు, నీ వచ్చటఁ గలవా లేవా ♦ నిక్కము సెపుమా. 211

శా. కుంతీనందను లొక్కఁ డొక్కఁడ రిపు♦క్షోభంబు సంధిల్ల దు
ర్దాంతస్వైరపరాక్రమంబులు మహో♦త్సాహంబునం జేసి ర
త్యంతోదగ్రతఁ బల్కెదీ విచట బా♦హాశక్తి యిమ్మేదినీ
కాంతుం డియ్యకొనంగఁ బూనితి వృథా♦గర్వంబు నీ కేటికిన్. 212

---

ప్ర. గా. కడిమిమైన్ = పరాక్రమముచేత. తేజంబు = గొప్పతనమును. బలములతోన్ = సేనతోఁగూడ. గంధర్వపతిన్ = గంధర్వరాజును, చిత్రసేనుని. కౌరవఈశ్వరునిన్ = దుర్యోధనుని. అనిన్ = యుద్ధమునందు. అనుదానవులన్ = అనురాక్షసులను. ఉక్కు మడఁచెన్ = చంపెను. అమరులకున్ = దేవతలకు. అజయ్యులు = జయింపరానివారు. ఒడిచెన్ = ఓడించెను.

తా.—కర్ణా! అర్జునుఁ డొక్కఁడే కదా యింద్రుఁడు మొదలగు దేవతలను జయించి ఖాండవవనము దహించెను. యాదవసైన్యము నంతయుఁ బాఱఁదోలి సుభద్రను తెచ్చెను. దిగ్విజయము చేసి యీ కురువంశమున కంతకును గొప్పతనము గలిగించెను. ఘోషయాత్రయందు సేనాసహితముగా గంధర్వ రాజగు చిత్రసేనుని జయించి దుర్యోధనుని విడిపించెను. నివాతకవచు లనుదానవులను వధించెను. దేవతలకుఁ గూడ జయింపరాని కాలకేయులను జయించెను.

211. భూవరులు = రాజులు ఒక్కటన్ = ఒకటిగా. ద్రోవదికై = ద్రౌపదికొఱకు. తొడరి = ఎదిరించి. చేవ = బలము.

తా.—ద్రౌపదీస్వయంవరమునందు రాజులందఱు నొక్కటియై యర్జునునితో యుద్ధము చేసి యోడిపోవునపుడు నీవచట నుంటివా లేవా నిజము చెప్పుము.

212. రిపుక్షోభంబు = శత్రువులకుఁ గలఁత. సంధిల్లన్ = కలుగునట్లు. దుర్దాంత స్వైరపరాక్రమంబులు = అణఁపరానివియు స్వేచ్ఛచేఁ గలిగినవియు నగు పరాక్రమములను. మహత్ ఉత్సాహంబునన్ = గొప్పయుత్సాహముచేత. అత్యంతఉదగ్రతన్ = మిక్కిలి గొప్పతనముచేత. ఇచటన్. పల్కెదు = చెప్పుచున్నావు. ఇమ్మేదినీకాంతుండు = ఈరాజు, దుర్యోధనుఁడు. ఇయ్యకొనంగన్ = అంగీకరించుటచేత. బాహాశక్తి = భుజబలమును. పూనితి = పొందితివి.

తా.—పాండవులలో నొక్కఁడొక్కఁడును గొప్ప పరాక్రమముచే శత్రువుల జయించి యున్నాఁడు. నీవు దుర్యోధనుఁ డాదరించుటచేతఁ బరాక్రమము వహించి యిచట గొప్పగా మాటలాడుచున్నాఁడవు, ఈవ్యర్థగర్వము విడువుము.

గీ. ఏచి మున్నీరు చేయీఁత ♦ నీఁద నగ్ని, నుఱుక వాసుకికోఱలు ♦ వెఱుకఁ గడఁగి
నట్లు గాదె రాధేయ నీ♦వర్జునునకుఁ, బోర నెక్కటి మార్కొనఁ ♦ బూనుటరయ.

క. బలుగాలిఁ బేర్చుదావా, నల మొక్కరుఁ డార్పఁ బోయి♦నను దీఱునె నీ
చల ముడుగు సాహసమునం, గలదే మే లెట్లు నధిపుఁ ♦ గావఁగ వలదే. 214

గీ. కురువిభుండును భీష్ముండు ♦ గురుఁడు గురుతనూభవుండును నీవు నే♦నును గడంగి
కూడుకొని తాఁకుదము గాక ♦ క్రీడితోడ, నొంటి మార్కొన వశమె ము♦క్కంటికైన.

( కర్ణుఁడు కృపాచార్యు నధిక్షేపించి పలుకుట. )

క. అని పలికిన సంరంభం, బున నినసుతుఁ డిట్టు లను రి♦పులయెడఁ జిత్తం
బున నీవు ప్రియము గలుగుటఁ, గని కని నినుఁ దోఁడు పిలువఁ ♦ గాఁ బతి చేలే. 216

---

213. రాధేయ = కర్ణా! నీవు. పోరన్ = యుద్ధమునందు. ఎక్కటిన్ = ఒంటిగా. అర్జునునకున్. మార్కొనన్ = ఎదిరించుటకు. పూనుట. అరయన్ = ఆలోచింపఁగా. ఏచి = విజృంభించి. మున్నీరు = సముద్రమును. చేయీఁతన్ = చేతుల యీఁతచేత. ఈఁదన్ = ఈఁది దాఁటుటకును. అగ్నిన్ = నిప్పునందు. ఉఱుకన్ = దుముకుటకును. కడఁగినట్లుకాదె = ప్రయత్నించినట్లు కదా. అలం. ఉపమ.

తా.—కర్ణా! నీవు అర్జునునితో నొంటరిగా యుద్ధము చేయఁదలఁచుట సముద్రము నీఁది దాఁటుటకును నిప్పులో దుముకుటకును సర్పరాజు కోఱలు పెఱుకుటకును దలఁచినట్లు.

214. బలుగాలిన్ = పెనుగాలిచేత. పేర్చుదావఅనలము = విజృంభించునట్టి కారుచిచ్చును. తీఱునె = ఆఱునా? నీచలము = నీపట్టుదలను. ఉడుగు = విడువుము. సాహసంబునన్ = తెగువచేత. మేలు. కలదే యని యన్వయము. ఎట్లున్ = ఏవిధముననైనను. అధిపున్ = దుర్యోధనుని. కావఁగన్. వలదె.

తా.—పెనుగాలి వీచునపుడు మండుచున్న కార్చిచ్చును ఒకఁ డార్పఁజాలని యట్లు నీవొకఁడ వర్జునునితోఁ బోరఁజాలవు, నీపట్టుదల వదలుము. వ్యర్థముగాఁ దెగించినపక్షమునఁ గష్టము గలుగును. ఎట్లయినను మనమందఱము రాజును రక్షింపవలయును.

215. కురువిభుండును = దుర్యోధనుఁడును. గురుతనూభవుండును = అశ్వత్థామయును. క్రీడితోడన్ = అర్జునునితో. ముక్కంటికైనన్ = రుద్రునికైనను. ఒంటిన్. మార్కొనన్ = ఎదిరించుటకు. వశమె అని యన్వయము.

తా.—దుర్యోధనుఁడును భీష్ముఁడును ద్రోణుఁడును అశ్వత్థామయును నీవును నేనును చేరి యర్జునునితో యుద్ధము చేయవలయును గాని యతనితో నొంటరిగాఁ బోర శివునికిఁ గూడ శక్యము కాదు.

216. ఇనసుతుఁడు = సూర్యుని కుమారుఁ డయిన కర్ణుఁడు. సంరంభంబునన్ = ఆటోపముతో. రిపులయెడన్ = శత్రువులయందు. చిత్తంబునన్ = మనస్సునందు. ప్రియము = ప్రీతి. కనికని = చూచిచూచి. పతి = రాజు. చేల ఏ = మూఢుఁడే.

క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దాను ♦ బ్రదికినదినముల్
వేలారిచి తిం డ్రాతని, యోలము గని పిదప భీతి ♦ నోదుఁగుదు రాజిన్. 217

క. జన్నములు సేయునెడఁ బ, క్వాన్నంబులు గుడుచు చుండు ♦ మధిపతి నిన్నున్
జన్నియ విడిచె రణముతటిఁ, మిన్నక కినుపడక పొమ్ము ♦ మీగృహమునకున్. 218

గీ. ఏను వి ల్లందుకొనిన నీ♦రేడుభువన, ములును నడవడ వడఁకు నా♦యలఘుబాహు
బలముఁ దలఁపక పలికితి ♦ పార్థుఁ డనఁగ, నెంతవాఁ డొక్కరథికున ♦ కింత యేల.

వ. అనియె నిత్తెఱంగున నందఱుఁ బలుకుపలుకు లెల్ల వినుచు గాంగేయుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబును సువిహితంబునుగా నిట్లను ద్రోణాచార్యుండు నీతిపథంబునం బలికె నాచార్యతనయువచనంబు లుచితంబులు కృపాచార్యుం డాడినచందంబును దెఱంగు వడియున్న యది మన్నన గలమానిసి యగుట నంగ రాజునకు సంగరపాటవంబు లగుమాటలు దగుంగాక మాన్యుల నధఃకరింపనగునే యని వెండియు. 220

---

తా.—కృపునిమాట విని కర్ణుఁడు కోపముతో నిట్లనియె. నీవు శత్రువులయెడఁ బ్రీతికలవాఁడవని తెలిసితెలిసి నిన్ను దుర్యోధనుఁడు తోడుగాఁ దోడ్కొనివచ్చుట యుచితము కాదు.

217. వేలారిచి = వ్రేళ్లనాడించి. అతనిఓలము = రాజుయొక్క మఱుఁగును. తింద్రు = తినుదురు. అని యన్వయము. ఆజిన్ = యుద్ధమునందు. భీతులు = పిఱికివారు. ఒదుఁగుదురు = తొలఁగుదురు.

తా.—పిఱికివాండ్రు కుటుంబసమేతముగా నేలినవాని యన్నము చక్కఁగాఁ దిని యుద్ధము తటస్థించినపుడు తొలఁగిపోదురు.

218. జన్నములు = యజ్ఞములను. పక్వ అన్నంబులు = వండినయన్నములను. అధిపతి = రాజు. రణముతటిన్ = యుద్ధసమయమునందు. నిన్నున్. జన్నియవిడిచెన్ = యథేచ్ఛముగాఁ దిరుగ విడిచెను. కినుపడక = కోపపడక. మీగృహమునకున్. పొమ్ము.

తా.—నీవు యజ్ఞములయందుఁ బక్వాన్నములు భుజించుచుండుము, నిన్ను రాజయిన దుర్యోధనుఁడు యుద్ధసమయంబున ఆఁబోతునువలె స్వేచ్ఛగాఁ దిరుగవిడిచినాఁడు. నీవు కోపపడక యూరక యింటికిఁ బొమ్ము.

219. ఈరేడుభువనములును = పదునాలుగు లోకములును. నాఅలఘు బాహుబలమున్ = నా గొప్పదైన భుజబలమును. ఒక్కరథికునకున్ = ఒకశూరునకు.

తా.—నేను విల్లుపట్టినయెడఁ బదునాలుగులోకములును భయపడును. నాబలము తెలియక చెప్పితివి. అట్టి పరాక్రమము గల నాకు అర్జునుఁ డెంతమాత్రము. ఒకశత్రువును గుఱించి యింతవిచారింపవలసినది లేదు.

220. గాంగేయుండు = భీష్ముఁడు. కౌరవకేశ్వరున్ = దుర్యోధనుని. ధర్మార్థసంగతంబును = ధర్మముతోను అర్థముతోను గూడినదియు. సువిహితంబునుగాన్ = మిక్కిలి యుక్తమును అగునట్లుగా. నీతిపథంబునన్ = నీతిమార్గము చేత. ఆచార్యతనయు వచనంబులు = అశ్వత్థామమాటలు. తెఱంగు పడి = యుక్తమై. మన్నన = గౌరవము. అంగరాజునకున్ = కర్ణునకు. సంగరపాటవంబులు = యుద్ధమునందు నేర్పుగలవి. మాన్యులన్ = పూజ్యులను. అధఃకరింపన్ = అవమానించుట.

గీ. నేల ప్రొద్దెఱింగి ♦ చాలుమానిసి రణో, ద్యమ మొనర్చుఁ గాక ♦ తగినవారి
చెవికిఁ జేదు గాఁగ ♦ నవమానవాక్యంబు, లుడుగ కిట్లు వలుకు ♦ టొప్పునెట్లు.

క. బీరము లావును మిగులఁగ, వైరులు దఱి యైనఁ దొడర ♦ వచ్చినచోటన్
దూరమున వెరవుతోడి వి, చారము గలుగు టిది దగదె ♦ సద్బుద్ధులకున్. 222

గీ. అరులగుణము లైన ♦ నగ్గింతు రెప్పుడుఁ, గలయ బెరసినపుడు ♦ గలితనంబు
మెఱయుదురు మహాత్ము ♦ లెఱుఁగఁడు తుదిమొద, లెట్టివారి నితఁడు ♦ బెట్టు పలుకు.

వ. ఆచార్యు లైనవారలు పూజావాక్యంబుల కర్హులు గాక గర్హించుటకు విషయంబె యనుచుఁ గృపాశ్వత్థామలకరంబులకు నిజపాణిపుటంబులు సాఁచి యిట్లనుఁ బని చాలినంత గలదు విపక్షుండు వచ్చుచున్నవాఁడు విరోధంబునకు సమయంబు కాదు మన మందఱముం గూడికొని కయ్యంబు సేయుదము బలవద్వ్యసనంబు నందు భేదంబు గలుగు టొప్ప దని బుధులు సెప్పుదురు వేదంబు లొక్కవలనను

---

221. నేల = దేశమును. ప్రొద్దు = కాలమును. చాలు మానిసి = సమర్థుఁ డగు మనుష్యుఁడు. రణఉద్యమము = యుద్ధప్రయత్నమును. ఒనర్చున్ కాక = చేయుఁ గాక. తగినవారి చెవికిన్ = యోగ్యుల చెవికి. ఉడుగక = విడువక. ఎట్లు. ఒప్పున్ ? అని యన్వయము.

తా.—సమర్థుఁ డగువాఁడు దేశకాలముల నెఱిఁగి యుద్ధము చేయవలయును గాని యిట్లు పెద్దల నవమానించుట తగదు.

222. బీరము = వీర్యమును. లావును = బలమును. మిగులంగన్ = అతిశయించునట్లు. వైరులు = పగవారు. తఱి = సమయము. ఐనన్ = అయినప్పుడు. తొడరన్ = ఎదిరించుటకు. వచ్చినచోటన్ = వచ్చినపుడు. దూరమునన్ = ముందుగా. వెరవుతోడివిచారము = ఉపాయముతోఁగూడిన యాలోచనము. సత్‌బుద్ధులకున్ = మంచిబుద్ధిగలవారికి. తగదు ఎ ?

తా.—బలపరాక్రమములు గల శత్రువులు సమయము చూచి యుద్ధమునకు వచ్చినపుడు బుద్ధిమంతులు దూరదృష్టిగలిగి యాలోచించుట యుక్తము కాదా? (కర్ణుఁడు బుద్ధిహీనుఁ డనుట ధ్వనితము).

223. మహాత్ములు = గొప్పమనస్సు గలవారు. అరుల గుణములు ఐనన్ = శత్రువుల గుణములనుగూడ. అగ్గింతురు = పొగడుదురు. కలయన్ బెరసినపుడు = చేరవచ్చినప్పుడు. కలితనంబు = సామర్థ్యమును. మెఱయుదురు = చూపుదురు. తుదిమొదలు = అంతమును ఆదియును. బెట్టు = మిక్కిలి. పలుకన్ = నిందించును.

తా.—మహాత్ములు గుణము లున్నయెడ శత్రువులనుగూడఁ గొనియాడుదురు, శత్రువులు మీఁదికి వచ్చినపుడు పరాక్రమమును జూపుదురు, ఈకర్ణుఁడు కొనమొదలు తెలియనివాఁ డైనను గొప్పవారిని దూషించుచుండును.

224. అర్హులు = తగినవారు. గర్హించుటకున్ = నిందించుటకు. విషయంబు ఎ = పాత్రులా? కరంబులకున్ = చేతులకు. నిజపాణిపుటంబులు = తనదొప్పవంటిచేతులను. బలవత్‌వ్యసనంబునందున్ = గొప్పకష్టమునందు. భేదంబు = వేఱుపాటు. బుధులు = తెలిసినవారు. ఒక్కవలనను =

ధనుర్వేదం బొక్కవలనను గలమీయట్టిమహానుభావు లెందునుం గలరె కురుబలం
బున కొకటి వుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీతలన నిలుచు నట్లుగుటంజేసి.

క. క్షమియింప వలయు నొకఁ డెఱుఁ, గమి నేమే నన్న నంతఁ ♦ గటకటఁబడి భూ
రమణునికార్యస్థితి చి, త్తములం దెడ సేయునట్టి♦తరమే మీరల్. 225

వ. అనిన విని వార లి ట్లనిరి. 226

క. క్షమియింప నెవ్వరము భూ, రమణునికార్యమున కెవ్వ♦రము ద్రోణులచి
త్తము శాంతి వొందఁజేయుట, మముఁదెలుచుట యిట్టు లేల ♦మాకొలఁదులకున్.

వ. అనిన విని గాంగేయకర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి యశ్వత్థా
మను వేఁడికొని కృపాచార్యునిం దేర్చినం బ్రసన్నుండయి యోధవీరులఁ గలయం
గనుంగొని ద్రోణాచార్యుం డి ట్లనియె. 228

గీ. అలుక భీష్మునిపలుకుల♦యప్పుడ పోయె, మీఁదికార్యంబు నడపుఁడు ♦ వివార లింక
మోహసాహసములఁ గురు♦ముఖ్యుదెసకుఁ, గీడు రాకుండఁ దగఁ బరి♦కింపవలయు.

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ ♦ గని యించుకయుం

---

ఒకవైపునను. ధనుర్వేదంబు = ఆయుధవిద్య. కురుబలంబునకున్ = కౌరవసేనకు. ఒక్కటి = ఒక కష్టమగుట.

225. ఎఱుఁగమిన్ = అజ్ఞానముచేత. ఏమేన్ = ఏమైనను. కటకటఁబడి = కోపపడి. భూరమణునికార్యస్థితి = రాజకార్యముయొక్కయునికిని. చిత్తములందున్ = మనస్సులయందు. మీరల్. ఎడచేయునట్టితరముఏ = విఘ్నము చేయునట్టి తరగతివారా ?

తా.—మీరు క్షమింపవలెను. ఎవ్వఁడైన నొకఁడు తెలివిమాలి యొకమాట చెప్పినయెడ మీ రందులకుఁ గోపము నొంది రాజుకార్యమును చెఱుచునట్టివారు కారు.

227. భూరమణునికార్యమునకున్ = రాజుకార్యమునకు. శాంతి = చల్లఁబడుటను. తెలుచుట = తేర్చుట. మాకొలఁదులకున్ = మావంటివారికి. ఇట్టులు, ఏల యని యన్వయము.

తా.—మేము మన్నించుటకుఁ గాని రాచకార్యమును సాధించుటకుఁ గాని తగినవారము కాము. ద్రోణులకోపమును దీర్పవలసినదే గాని మా కేమి మన్ననయు వలదు.

228. కురుపతి = దుర్యోధనుఁడు. ప్రసన్నుండై = కోప ముడిగినవాఁడై.

229. భీష్మునిపలుకులయపుడ = భీష్ముఁడుమాటలాడి నప్పుడే. మోహసాహసములన్ = అజ్ఞానముచేతను తెగువచేతను. కురుముఖ్యుదెసకున్ = దుర్యోధనునివైపునకు. పరికింపవలయున్ = చూడవలయును.

తా.—నాకోపము భీష్మునిమాటలచేతనే పోయెను. ఇఁకఁ దెలియక కాని సాహసముచేతఁ గాని దుర్యోధనునకుఁ గీడు కలుగకుండునట్లు జాగ్రత్తగా మీఁదికార్యములు చేయుఁడు.

230. వాసవనందనుఁడు = ఇంద్రునికుమారుఁ డయిన యర్జునుఁడు. ఎంతయున్ = మిక్కలి. గాసిలి = కష్టపడి. ఇంచుకయున్ = కొంచెమైనను. సైరణచేయఁడు = సహింపఁడు. కనుమోసము లేక =

దా సైరణ సేయఁడు గను, మోసము లే కొక్కుమొగిన ♦ ముసరఁగవలయున్.

వ. అప్పుడు కురుపతి సమయకాలవిషయంబుగా నాడినమాటయుం గలదు దాని నిరూపించి యున్నరూపు గాంగేయుండు సెప్ప నర్హుఁ డనిన నతండు దుర్యోధనున కి ట్లనియె. 231

( భీష్ముఁ డర్జునునకు నజ్ఞాతవాసవత్సరసమాప్తి నిష్కర్షించుట. )

సీ. రెండవయేఁట నొ♦క్కం డధిమాస మి, ట్లెక్కి నయన్నెల ♦ తెల్లఁ గూర్చి
కొనఁ బదుమూఁడు హా♦యనములు దప్పక, నిన్నటితోడన ♦ నిండె నింత
యెఱిఁగియ తమపూన్కి♦యెల్లను దీర్చితి, మని పొడచూపె న♦ర్జునుఁడు నేఁడు
పాండుపుత్రులు ధర్మ♦పరులు ధర్మాత్మజుం, డేరి కధిష్ఠాత ♦ వారు ధర్మ
పథము దప్పుదు రే యన్ని♦పాటు లట్లు, పడినవారలు దఱియంగఁ ♦ బాఱి నేర్తు
రెట్లు దమకించి నీతివి♦హీనవృత్తిఁ, దమకు నొకకీడు వచ్చువి♦ధంబు గాఁగ. 232

ఉ. అట్టిద యైన నాఁడ తఱి♦యంబడి మూర్ఖతనంబు సేయ రే
నెట్టన ధర్మపాశముల ♦ నిల్చిరి కాలము వేచి యుండి రిం

---

చూపుతప్పు లేక, చక్కఁగాఁ జూచి యనుట. ఒక్కుమొగిన్ అ = ఒకపూనికచేతనే. ముసరఁగన్ వలయున్ = ముట్టడింపవలయును.

తా.—అర్జునుఁడు మిక్కిలి శ్రమపడి యున్నాఁడు. కావున మనమీఁద నెక్కువకోపము చూపును. అందువలన మన మందఱము నేమఱుపాటు లేక యొకట్టిగా వాని నెదుర్కొనవలయును.

231. సమయకాలవిషయంబుగాన్ = ప్రతిజ్ఞాకాలమును గుఱించి యనుట. నిరూపించి = నిశ్చయించి. ఉన్నరూపు = నిజమును.

232. అధిమాసంబు = అధికమాసము. హాయనములు = సంవత్సరములు. తమపూన్కి = తమప్రతిజ్ఞను. పొడచూపెన్ = కనఁబడెను. ధర్మపరులు = ధర్మము ప్రధానముగాఁ గలవారు. ఏరికిన్ = ఎవరికి. ధర్మఆత్మజుండు = ధర్మరాజు. అధిష్ఠాత = అధిపతియో. ధర్మపథము = ధర్మమార్గమును. అన్నిపాటులు = అన్నికష్టములు. తమకించి = వేగిరపడి. నీతివిహీనవృత్తిన్ = నీతిచే విడువఁబడినవిధమున. ఒకకీడు. వచ్చువిధంబు గాఁగన్ = వచ్చునట్లుగా. ఎట్లు. తఱియంగన్ పాఱిన్ = సమీపించుటకు. నేర్తురు అని యన్వయము.

తా.—రెండేసియేండ్ల కొక్కొకయధికమాసము వచ్చును. అట్లు అప్పు డపుడు వచ్చు నధికమాసములతోఁ జేర్చి లెక్కపెట్టినయెడ పదుమూఁడేండ్లు నిన్నటితోనే నిండెను. ఇది తెలిసియే యర్జునుఁడు తమప్రతిజ్ఞను నెఱవేర్చితి మని మనకు నేఁడు కనఁబడెను. పాండవులు ధార్మికులు అదిగాక వారికి ధర్మరాజు నాయకుఁడుగా నుండుటవలన వా రెంతమాత్రము ధర్మము తప్పరు. అన్నికష్టములను పొందినట్టి యాపాండవులు నీతి మాలి తమకు మరలఁ గష్టము గలుగు నట్లు త్వరపడి మనయెదుటఁ బడుదురా?

233. అట్టిదిఅ ఐనన్ = అట్లు వారుధర్మమును తప్పుటయే కలిగినయెడ. నాఁడుఅ = జూదమున నోడిననాఁడే. తఱియంబడి = కదియఁబడి. మూర్ఖతనంబు = మొఱకుఁదనమును. నెట్టన్ అ=

కట్టుదు వారు గొంత తమ♦యేడ్తెఱ జూపక మాన నేర్తురే
ముట్టఁగ వచ్చిరేని మన♦ముం దగ నోర్తుము గాక దానికిన్. 233

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డ♦వశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగినబ♦లంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు♦ నెల్లవిధంబుల కోర్చునట్లుగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి♦ నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగున్. 234

వ. అనిన విని కురుపతి దరహసితవదనుం డగుచు ని ట్లనియె. 235

గీ. మనకుఁ బాండురాజ♦తనయవర్గమునకు, నెట్లు పొందు గలుగు ♦ నేను రాజ్య
భాగ మీను సమర♦భంగిక విక్రమ, నిరతిఁ బూను టిదియ ♦ నిశ్చయంబు. 236

వ. అనిన నయ్యుభయపురవచనంబు లాకర్ణించి గురుం డిట్లనుఁ గార్యగతియును గయ్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లే రయినను నా యెఱింగిన

---

అనివార్యముగా. ధర్మపాశములన్=ధర్మము అను త్రాళ్ళచేత. వేచి=కాచి. తమయేడ్తెఱ=తమపరాక్రమమును. ముట్టఁగన్ = తాఁకుటకు.

తా.—పాండవులు నీతి తప్పువారే యైనయెడ జూదమున నోడిననాఁడే వారు యుద్ధమునకు వచ్చియుందురు. ధర్మమునకుఁ గట్టువడి వారు కాలమును నిరీక్షించుచుండిరి. ఇఁకఁ బ్రతిజ్ఞ నెఱవేఱినది కావున వారు తమపరాక్రమమును జూపక మానరు. మనమును అందుకు సన్నద్ధులమై యుండవలయును.

234. ఫల్గునుఁడు = అర్జునుఁడు. రాలచ్చికిన్ ఐ = రాజ్యలక్ష్మికై. పెనంగినబలంబులు = పోరినసేనలు. కుందు = పరాజయము. తొడరుట = తాఁకుట. ఎల్లవిధంబులకున్ = అన్నివిధములకును, జయాపజయముల కనుట. ఓర్చునట్లు = సహించునట్లు. కాక = కాని. ఇచ్చన్ = మనస్సునందు. తలఁచి = ఆలోచించి. ఒక్కమెయిన్ = ఒకవిధమున. ఇత్తఱిన్ = ఈసమయమునందు. పొందు = సంధి. అగుచేఁతయున్ = కలుగునట్టి కార్యమును. తగున్.

తా.—వచ్చినవాఁ డర్జునుఁ డగుటచే మనకు జయమే కలుగు నని నమ్మరాదు. యుద్ధమునందు రెండుపక్షములకు జయమే యెట్లు కలుగును. ఒకరికి జయమును మఱియొకరికి నపజయమును కలుగును. కావున జయాపజయముల రెంటికిని తెగించి యుద్ధము చేయవలెను. అందువలన నిపుడు చక్కఁగా నాలోచించి సంధి చేయుటయు నొకవిధమున యుక్తముగాఁ దోఁచుచున్నది.

235. కురుపతి = దుర్యోధనుఁడు. దరహసితవదనుండు= చిఱునవ్వుగల మోము గలవాఁడు.

236. పాండురాజతనయవర్గమునకున్ = పాండురాజుకొడుకుల సమూహమునకును. పొందు = సంధి. ఈను = ఇయ్యను. సమరభంగికిన్ ఐ= యుద్ధముయొక్క విధమునకే. విక్రమనిరతిన్ = పరాక్రమమునందలి యాసక్తిచేత.

తా.—నేను రాజ్యభాగ మియ్యను, కావునఁ బాండవులకును మనకును సంధి కుదురదు. పరాక్రమమును వహించి యుద్ధమునకుఁ బూనుటయే నా నిశ్చయము.

237. అయ్యుభయపురవచనంబులు = భీష్మదుర్యోధనుల యిద్దఱి మాటలను. ఆకర్ణించి = విని.

యంత యొక్క తెఱంగు సెప్పెద నీబలంబున నాలవపాలు గొని మహీపాలుండు సత్వరంబుగా ముందర పోవ వలయు నంతియ సేన తదనంతరంబ కదుపులం బొదివి కొని చన వలయుఁ దక్కటిసగంబుతో మనము నిలిచి మోహరించి యల్లనల్ల నరుగ వలయుఁ గవ్వడి యెయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయు నిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా సందడిం బడక నడచు గోవులు నిన్నెలవు గడచు మనమును ధనంజయునకుం జాలినయప్పుడ యాటఁ దోడుపడ నెవ్వరు గలిగినను వారికిం జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దాని కియ్యకొని రాజన్యునకు సైన్యంబుఁ బంచి యిచ్చి పుచ్చి పసులకుం దోడగుభాగంబునుం బంచి యున్నంతవట్టుచతురంగంబుల నియతి సేసికొని యాచార్యుండు నడుమను గృపాచార్యుండు వలపటను నాచార్యపుత్రుండు డాపటం గర్ణుండు ముందట వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లిక భూరిశ్రవః ప్రభృతియోధవీరు లెల్ల నెడ నెడం గలయ నిలుచునట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహసౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసి తాను వెనుక యయి నడపించుచుండె నట్టిసమయంబున. 237

చ. అరుదుగ నిట్లు లోకనికి ♦ నంతబలంబునకున్ మహోగ్రసం
గర మగుడున్ మనం బతుల♦కౌతుక మొంది కనుంగొనన్ సురే

---

కార్యగతియును = కార్యముయొక్క విధమును. కయ్యంబు భంగియున్ = యుద్ధముయొక్క విధమును. భూపతికంటెన్ = రాజుకంటె. మిగులన్ = అధికముగా. కనియెడువారు = తెలియువారు. ఒక్క తెఱంగు = ఒకవిధమును. మహీపాలుండు = రాజయిన దుర్యోధనుఁడు. సత్వరంబుగాన్ = వేగముతోఁ గూడినట్లుగా. అంతియ సేన = అంతమాత్రపుసైన్యము. తత్ అనంతరంబు అ = ఆరాజు వెనుకనే. కదుపులన్ = ఆవులమందలను. పొదివికొని = చుట్టికొని. మోహరించి = వ్యూహములు పన్ని. కవ్వడి = అర్జునుఁడు. కవిసెన్ = ఎదిరించునో. తలపడవలయున్ = తాఁకవలయును. మానవఈశ్వరుండు = రాజయిన దుర్యోధనుఁడు. సురక్షితంబుగాన్ = చక్కఁగాఁ గాపాడఁబడినట్లుగా. సందడిన్ = సంకటమును. ఇన్నెలవు = ఈప్రదేశమును. కడచున్ = దాఁటిపోవును. ధనంజయునకున్ = అర్జునునకు. చాలినఅప్పుడు అ = సమర్థుల మయినప్పుడే, వానిని జయించినప్పుడేయనుట. ఆటన్ = ఆయర్జునుని పక్షమునందు. సురనదీసూనుండు = ఆకాశగంగకొడు కయిన భీష్ముఁడు. ఇయ్యకొని = అంగీకరించి. రాజన్యునకున్ = దుర్యోధనునకు. పుచ్చి = పంపి. ఉన్నంతవట్టు చతురంగంబులన్ = మిగిలియున్న యెల్లచతురంగబలములను. ప్రభృతియోధవీరులు = మొదలుగాఁ గల శూరు లయిన భటులు. ఎడనెడన్ = అచ్చటచ్చట. మోహరించి = వ్యూహములు దీరి. సన్నాహసౌందర్యంబున్ = కవచముచేఁ గలుగుచక్కఁదనమును. తాలధ్వజంబు = తాటిచెట్టు టెక్కెమును.

238. అంతబలంబునకున్ = ఎల్లసేనకును. మహత్ ఉగ్రసంగరము = మిక్కిలి భయంకర మయిన యుద్ధము. అగుడున్ = కాఁగా. అతులకౌతుకము = అధిక మయిన వేడుకకలదైన,

శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కు విమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవముని పంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁ గాన్. 238

వ. అద్దివ్యయానరత్నంబునందు. 239

గీ. స్వర్గమున నున్న రాజులుఁ జక్రవర్తు, లును నిజోచితచ్ఛత్త్రంబులును నిజార్హ
చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ, గొలిచియుండిరి వేడ్కలు గొనలు నిగుడ.

క. పాండుమహీపాలుం డా, ఖండలుచేరువన పెద్దగద్దియ నమరీ
మండలి వీచోపు లిడఁగ, నుండి కనుంగొనుచు నుండె నుజ్జ్వలభంగిన్. 241

వ. అంత. 242

సీ. దేవదత్తాభీలరావంబు వెసఁ గర్ణ, ములు దీటుకొన లేటమొగము వడుచు
రథనేమిదళితధరాధూళి యంగంబు, లెల్లఁ గప్పఁగ వెలవెల్ల నగుచు

---

మనంబు = మనస్సును. ఒంది. లేక. మనంబు = మనస్సు అతులకౌతుకము = అధిక మయిన వేడుకను. పొంది = పొందుటచేత. కనుంగొనన్ = చూచుటకు. సురేశ్వరుఁడు = దేవేంద్రుఁడు. ప్రశంసకున్ = పొగడ్తకు. ఎక్కు విమానము = వచ్చునట్టి విమానమును. దేవమునిపంక్తులున్ = దేవతలయు మునులయు సమూహములును. సిద్ధగణంబున్ = సిద్ధులసమూహమును. కొల్వఁ గాన్. అంబరగతిన్ = ఆకాశముదారిచేత. వచ్చెన్.

తా.—ఈప్రకారముగా నొక యర్జునునకును కురుసేన కంతటికిని గొప్పయుద్ధము జరుగఁగా దానిం జూచుటకై దేవతలచేతను మునులచేతను సేవింపఁబడినవాఁడై దేవేంద్రుఁడు సుదర్శనం బను విమానము నెక్కి యాకాశమార్గమున వచ్చెను.

239. అద్దివ్యయానరత్నంబునందున్ = ఆవిమానశ్రేష్ఠమునందు.

240. నిజఉచితచ్ఛత్రంబులును = తమకుఁ దగిన గొడుగులును. నిజఅర్హచామరంబులున్ = తమకుఁ దగిన వింజామరలును. చెలువుఒందన్ = ప్రకాశింపఁగా. చారులీలన్ = చక్కనివిధమున. కొనలునిగుడన్ = కొనసాగఁగా, అతిశయింపఁగా ననుట. కొలిచి. ఉండిరి.

తా.—స్వర్గలోకమున నుండురాజులును జక్రవర్తులును దమకుఁ దమకుఁ దగినఛత్త్రచామరములచే నలంకరింపఁబడినవారై యుత్సాహముతో నింద్రుని సేవించు చుండిరి.

241. పాండుమహీపాలుండు = పాండురాజు. ఆఖండలుచేరువన్ అ = ఇంద్రునిసమీపమునందే. పెద్దగద్దియన్ = పెద్దసింహాసనమునందు. అమరీమండలి = దేవతాస్త్రీలసమూహము. వీచోపులు = వింజామరలు. ఇడఁగన్ = వీవఁగా. ఉజ్జ్వలభంగిన్ = ప్రకాశించువిధమున.

తా.—పాండురాజు ఇంద్రునిసమీపమునఁ బెద్దసింహాసనమునఁ గూర్చుండి దేవతాస్త్రీలు వింజామరలు వీచుచుండఁగా నుత్సాహముతోఁ జూచుచుండెను.

243. దేవదత్తఆభీలరావంబు = దేవదత్త మనుశంఖముయొక్క భయంకర మయినధ్వని. వెసన్ = శీఘ్రముగా. కర్ణములు = చెవులు. దీటుకొనన్ = నిండఁగా. లేటమొగము వడుచున్ = పెడమొగము నొందుచు. రథనేమిదళితధరాధూళి = రథముల చక్రముల యంచులచేఁ బగులఁగొట్ట

బహుళకపిధ్వజప్రభలు లోచనములు, మిఱుమిట్లుగొనం బర్వ మేడుపడుచు
నుద్భటాకారసముద్ధతి మనములు, త్తలపడం దోపంగం దల్లడిలుచు
నడచుకౌరవరాజసైన్యంబుం గదిసెం, దీంగ దిగిచినగతిం దనతేరు మెఱయ
రయమున్నైం జని ప్రళయభైరవసహస్ర, గర్జనోదగ్రతర్జనుం డర్జునుండు. 243

వ. ఇవ్విధంబునం గురుబలంబులం గ్రోశమాత్రంబునం గూడ ముట్టి క్రీడి తలయెత్తి చూచి యుత్తరున కిట్లనియె. 244

చ. ఇది యొక పెద్దగట్టి మొన యీ మొనముందట గోగణంబుతో
నదె యొకయల్పసైన్య మట యావల వేఱొక కొంతసేన య

---

బడిన నేలయొక్క దుమ్ము. అంగంబులు = దేహములను. ఎల్లన్. కప్పంగన్. వెలవెల్లన్ అగుచున్ = వెలవెలంబోవుచు. బహుళకపిధ్వజప్రభలు = అధిక మయిన కోంతిజెండాయొక్క కాంతులు. లోచనములు = కన్నులు. పర్వన్ = వ్యాపింపంగా. మేడుపడుచున్ = తెలివితప్పుచు, మెండుకొనుచున్ అని పాఠాంతరము, అతిశయించుచు నని యర్థము, అది యిట యుక్తము కాదు. ఉద్భటఆకారసముద్ధతి = భయంకర మయిన రూపముయొక్క యతిశయము. మనములు = మనస్సులు. ఉత్తలపడన్ = భయపడునట్లు. తోపంగన్ = కనంబడంగా. తల్లడిలుచున్. మనము లుత్తలపాటునందోపంగ ననుపాఠ మనస్పష్టము. నడచుకౌరవరాజసైన్యంబున్ = పోవుచున్న దుర్యోధనుని సేనను. తీంగతిగిచినగతిన్ = తీంగ లాగినట్లు. రయమునైన్ = వేగముచేత. చని. ప్రళయ...తర్జనుండు— ప్రళయ = ప్రళయకాలమునందలి, భైరవ = భైరవులయొక్క, సహస్ర = వేయియొక్క, గర్జన = అఱుపులవలె, ఉదగ్ర = భయంకర మయిన, తర్జనుండు = బెదరించుట గలవాండు, అర్జునుండు, గర్జనోగ్రతర్జనుం డగు నర్జునుండు— అని పాఠాంతరము. అర్థము సమానము. కదిసెన్ = సమీపించెను.

తా.—దేవదత్త మనుశంఖముయొక్క ధ్వనికిం సహింపంజాలక ముఖము త్రిప్పుచు, రథవేగముచే లేచినధూళి దేహములు కప్పుటచే వివర్ణ మగుచు, కోంతిజెండాము కాంతులకు కన్నులు చెదరి తెలివి తప్పుచు, అర్జునుని భయంకర మయిన యాకారముం జూచి భయపడి తల్లడిలుచుం బోవుచున్న కౌరవసేనను అర్జునుండు కన్నితీసినట్లు తనరథము బహువేగమునం బోవుచుండంగాం బ్రళయకాలమునందలి వేలకొలంది భైరవులు గర్జించునట్లు భయంకరముగా సింహనాదము చేయుచు సమీపించెను.

244. క్రోశమాత్రంబునన్ = కోసుదూరమునందు. కూడముట్టి = వెంబడించి. క్రీడి = అర్జునుండు.

245. పెద్దగట్టిమొన = పెద్దదియు దృఢము నగుసేన. ఈమొనముందటన్ = ఈ సేనకు ముందుగా. గోగణంబుతోన్ = ఆవులమందతో. అట ఆవలన్ = దానివెనుక. పంచిపెట్టన్ చనున్ = పంచిపెట్టి యుందురు. అంతటిలోనన్ = అంతసైన్యమునందును. వృథాఅభిమానగురుదబహుభాషి = వ్యర్థ మయిన పట్టుదలచేతను చెడుకావరముచేతను నధికముగా మాటలాడువాండు. ఐన కురురాజు = అయిన దుర్యోధనుండు.

తా.—మనకు ముందు ఒకపెద్దసేన యున్నది, దానికావలం గొంతసైన్య మావులమందతోం బోవుచున్నది, దానికి ముందు మఱికొంతసైన్యము పోవుచున్నది. ఇట్లు సేనను వీరు పంచిపెట్టి

ల్లదె యిటు పంచి పెట్టఁ జను ♦ నంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురు♦రా జెచటం జనుచున్న వాఁడొకో. 245

క. అరయుదము గాని యిమ్మో, హరమునకును డాపలించి ♦ యరదముఁ బోని
మ్మురవడి నతనికి యుఱికెద, నరుదుగ నెభ్భంగి నెవ్వ ♦ రడ్డం బైనన్. 246

ఉ. ఆతఁడు చిక్కెనేని బల ♦ మంతయు విచ్చు మరల్ప వచ్చు గో
వ్రాతము నట్లయైన సుక♦రంబుగ నంతట నెల్లఁ దీరు నీ
యాతతసేనయం దతని ♦ నారసి కానక యున్న వీరి ని
ట్లీతల డించి యాకదుపు ♦ నెద్దుఁగఁ బోదము గాక వ్రేల్మిడిన్. 247

క. విచ్చి చన కుండఁ బసులం, దెచ్చుట మునుమున్న వలయు ♦ తెఱఁ గావనికిం
జొచ్చి యది చక్కఁ బెట్టఁగ, నచ్చోటన దాయ మనకు ♦ నగపడెడు బలే. 248

క. అనిన విని యుత్తరుం డ, మ్మొన వలపటఁ బెట్టి యరద♦మును బోవఁగ ని

---

యుందురు, ఈసేనలలో మరభిమానముచేతను దురహంకారముచేతను అధికప్రసంగి యయినదుర్యోధనుఁ డెచట నున్నాఁడో తెలియదు.

246. అరయుదముగాని = తెలియుదముగాని. ఇమ్మోహరమునకును = ఈ వ్యూహమునకు. డాపలించి = సేనకుఎడమ ప్రక్కగాఁజేసి. అరదమున్ = తేరును. ఎభ్భంగిన్ = ఏప్రకారముగా. ఎవ్వరు. అడ్డంబైనన్. ఉరవడిన్ = మిక్కిలి వేగముచేత. అతనికిన్ అ = అదుర్యోధనునకే. ఉఱికెదన్.

తా.—దుర్యోధనుని వెదకి యెవ్వ రడ్డము వచ్చినను వానిమీఁదికే మొదటఁ బోవలయును. కావున ఈపెద్దసైన్యమునకుఁ బ్రదక్షిణముగా మనరథమును దోలుము.

247. ఆతఁడు = ఆదుర్యోధనుఁడు. విచ్చున్ = విరియును. గోవ్రాతమున్ = ఆవులమందను. సుకరంబుగన్ = సులువుగా. మరల్పన్ వచ్చున్. తీరున్ = చక్కఁబడును. ఈ ఆతతసేనయందున్ = ఈగొప్పసేనయందు. ఈతలన్ = ఈచోట. డించి = విడిచి. ఆకదుపున్ = ఆయావులమందను. ఎద్దుఁగన్ = వెంబడించుటకు. వ్రేల్మిడిన్ = శీఘ్రముగా. పోదము గాక.

తా.—మనము దుర్యోధనునిఁ బట్టుకొన్నయెడ ఈసేన యంతయు విఱిగి పోవును, సులభముగా నావుల మరల్పవచ్చును. అట్లు సర్వకార్యములను సాధింపవచ్చును. ఈగొప్పసేనలో నతఁడు కనఁబడనియెడ మనము వీరిని విడిచి అవులమందను శీఘ్రముగా వెంబడింతము.

248. విచ్చి = చెదరి. చనకఉండన్ = పోకుండునట్లు. మునుమున్న = మిక్కిలి ముందుగా. వలయుతెఱఁగు = కావలసినకార్యము. దాయ = శత్రువు, దుర్యోధనుఁడు.

తా.—అవులమంద చీలిపోకుండ మరలించికొని వచ్చుట మనకు ముఖ్యమయినపని. కావున మనము దాని సాధించినచో నచ్చటనే మనకు దుర్యోధనుఁడు తప్పక చిక్కును.

249. అమ్మొనన్ = అసేనను. వలపటన్ = కుడిప్రక్కను. సరసకున్ = దగ్గఱకు. కవ్వడి = అర్జునుఁడు. కలయఁగన్ = అంతటను.

చ్చిన సరస కరిగి కన్వడి, కను విచ్చి బలంబు నెల్లఁ ♦ గలయఁగఁ జూచెన్. 249

వ. ఇట్లు గలయం గనుంగొని మధ్యదక్షిణవామాగ్రపశ్చిమోత్తరభాగంబుల నిట్టిట్టి వారలు నడచు చున్నవారని సారథితో నేర్పడం బలికి వీరలలో నురగకేతనుండు లేఁడతండు గోవులం గొనిపోవ నోపు నిరామిషం బైనయీసేనతో నని సేయం బని లేదు వీర లెయిది యడ్డపడి తడవు సేయ కుండునట్లుగా ముట్టికొని పసులం బెట్టించి దొరయును గడవం బోవక యుండఁ బోదువ వలయు నని చెప్పి యతని నద్దెసకుఁ దేరు పఱుపం బనిచి గురుకృపగాంగేయులకుఁ జరణసమీపస్థలంబులం బడ రెండును గర్ణాభ్యర్ణప్రదేశంబులం జన రెండునుగా నాలు గేసి యమ్ము లేసిన సవ్యసాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తు లగునాప్తజనంబులతో నల్లన నర్జునుం డింత యొప్పి యుండునే యని యగ్గించి వెండియు.

( ద్రోణాచార్యుఁ డర్జునుం జూచి ప్రశంసించుట. )

మ. విలసద్గాండివచాలనోద్ధతి గన♦ద్విద్యుల్లతాలీల గా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సము♦ద్యద్గర్జ చందంబుగా

---

తా.—అర్జునుని మాట విని యుత్తరుఁ డాసేనకుఁ బ్రదక్షిణముగా రథము తోలఁగా నర్జునుఁ డాసేనసమీపమునకుఁ బోయి యాసేన నంతయుఁ జక్కఁగాఁ జూచెను.

250. మధ్యదక్షిణ వామఅగ్రపశ్చిమ ఉత్తరభాగంబులన్ = నడిమిభాగమునందును కుడివైపునను నెడమవైపునను ముందరివైపునను పడమటి ప్రక్కను ఉత్తరపుప్రక్కను. ఏర్పడన్ = స్పష్టముగా. ఉరగకేతనుండు = పాము టెక్కెముగాఁ గల దుర్యోధనుఁడు. నిరామిషంబు = సొమ్ము లేనిది. అని = యుద్ధమును. ఎయిది = తాఁకి. తడవు = ఆలస్యము. పెట్టించి = విడిపించి. కడవన్ పోవక = దాఁటిపోవక. పోవువలయున్ = ముట్టడింపవలెను. అద్దెసకున్ = ఆచోటికి. చరణసమీపస్థలంబులన్ = పాదములసమీపప్రదేశములయందు. కర్ణఅభ్యర్ణప్రదేశంబులన్ = చెవులసమీపప్రదేశములందు. సవ్యసాచిన్ = అర్జునుని. పరిసరవర్తులు = సమీపమున నున్నవారలు. అగ్గించి= పొగడి.

251. విలసత్ గాండివచాలనఉద్ధతి = ప్రకాశించుచున్న గాండివ మను ధనుస్సుయొక్క కదలించుటయొక్క యతిశయము. కనత్ విద్యుత్ లతాలీలన్ = ప్రకాశించుచున్న మెఱపు తీఁగవంటి విలాసము కలదికాఁగా. అలఘుస్ఫారకపి ధ్వజధ్వని=గొప్పదియై ప్రకాశించుచున్న కోఁతిటెక్కెముయొక్కధ్వని. సముద్యత్ గర్జచందంబుగాన్ = ఒప్పుచున్న మేఘగర్జనమువంటిది కాఁగా. తేరు. జలదఆకారతన్= మేఘముయొక్క యాకారమువంటి యాకారము గలిగియుండుటచేత. ఒప్పెన్. ఇతఁడు = ఈయర్జునుఁడు. పర్జన్య ఆకృతిన్ = ఇంద్రునియొక్క యాకారమువంటి యాకారముచేత. దోర్బల...స్ఫూర్తి—దోర్బల = భుజబలముచేత, తీవ్ర = భయంకరు లయిన, అరి = శత్రువులఅను, నిదాఘ = గ్రీష్మర్తువుయొక్క, దుర్విషహ = సహింపరాని, గర్వ = కావరముయొక్క, స్ఫూర్తి = అతిశయము. నిరూర్తికాన్ = రూపు మాసినది యగునట్లు. పొలిచెన్ = ప్రకాశించెను.

జలదాకారత నొప్పెఁ దే రితఁడు ప♦ర్జన్యాకృతిం బొల్చె నో
ర్బలతీవ్రారినిదాఘదుర్విషహగ♦ర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్. 251

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబులమొదలం బడ రెం డమ్ము లేసి పెద్దకాలం బేనిఁ బాసి యున్నవాఁడు గావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియు సోఁకములుగా రెం డమ్ము లేసె నని పలికి వెండియు ని ట్లనియె. 252

క. ఇడుమలఁ బడుమూఁ డేఁడులు, వడి కడుఁ గోపించి వచ్చె ♦ బలువిడి నీక
వ్వాడిఁ దఱియ నుఱికి వడి ని, ప్పుడ యిమ్ముతిప్రోవు నెల్లఁ ♦ బొరిగొనెడు బలే.

గీ. విపినవాసంబు నజ్ఞాత♦విధమువర్త
నంబు గడపి నవాభ్యుద♦యంబు నొంది
రాత్రిఁ బుచ్చి తోఁ తెంచుమా♦ర్తాండుమాడ్కిఁ
జూడ నుజ్జ్వలుఁ డగుచు న♦ర్జునుఁడు వొలిచె. 254

వ. అనియెఁ గృపాచార్యభీష్ములు పార్థబాణపాతప్రకారంబులు ప్రణామకుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గని సంతసిల్లిరి ధనంజయుండును దక్కిన

తా.—చలించుచున్న గాండీవము కొంతి మెఱపువలెను, కపిధ్వజధ్వని గర్జనము వలెను, తేరు మేఘమువలెను అర్జునుఁ డింద్రునివలెను బ్రకాశించుచున్నాఁడు, ఇఁక బలవంతు లగుశత్రువులు అను గ్రీష్మర్తువుయొక్క గర్వము నిర్మూల మగును. (ఇంద్రుఁడు వర్షాధిదేవత యనియు మేఘవాహనుఁ డనియుఁ బ్రసిద్ధ మగుటచే నర్జునునియందు నింద్రోపమ చెప్పఁబడినది.)

252. ప్రణామంబులుగాన్ = నమస్కారము లగునట్లు. సోఁకియు సోఁకములుగాన్ = తగిలియుఁ దగులనియట్లుగా.

253. ఇడుమలన్ = కష్టములను. బలువిడిన్ = మిక్కిలిపరాక్రమముచేత. తఱియన్ = సమీపమునను. ఇమ్ముతిప్రోవున్ = ఈయల్పసేనను. పొరిగొనెడున్ = చంపును.

తా.—ఈయర్జునుఁడు మూఁడేండ్లు కష్టపడి మిక్కిలి కోపముతో వచ్చినవాఁడు కావున దగ్గఱను వచ్చి యీయల్పసేనను బరాక్రమముచేఁ జంపక మానఁడు.

254. విపినవాసంబున్ = అరణ్యవాసమును. అజ్ఞాతవిధమువర్తనంబున్ = తెలియఁబడని విధముచేత నుండుటయును. కడపి = పుచ్చి. నవఅభ్యుదయంబున్ = క్రొత్తప్రకాశమును, క్రొత్తయుదయమును అని యర్థాంతరము. ఒంది. రాత్రిన్. పుచ్చి. తోఁతెంచుమార్తాండుమాడ్కిన్ = ఉదయించునట్టి సూర్యునివలె. అర్జునుఁడు. చూడన్. ఉజ్జ్వలుఁడు = ప్రకాశించువాఁడు. అగుచున్-పొలిచెన్ = ఒప్పెను.

తా.—వనవాసమును అజ్ఞాతవాసమును నెఱవేర్చి యర్జునుఁ డిప్పుడు రాత్రి కడచిన పిమ్మట నుదయించుసూర్యునివలెఁ బ్రకాశించుచున్నాఁడు.

255. పార్థబాణపాతప్రకారంబులు = అర్జునునిబాణములు పడుటలయొక్క విధములను. ప్రణామకుశలప్రశ్నంబులుగాన్ = నమస్కారములుగాను కుశలప్రశ్నములుగాను, పాదములయొద్దఁ బడినవి

వారికి దుర్నిరీక్షుం డగుచు నమ్మోహరంబుదెస ననాదరంబు సేసి గోవులపజ్జం
బోవుచుండె నతనిం జూచి సురనదీసూనుండు కురుపతులతో ని ట్లనియె. 255

క. చిరకాలమునకుఁ గంటిమి, నరు నక్కట వీఁడు సజ్జ♦నప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ, డరిభీకరుఁ డిట్టివార ♦ లవనిం గలరే. 256

క. మనచూడ్కికి వ్రేఁగయి యీ, తని యతులితమూర్తి యత్యు♦దాత్తతఁ గడునొ
ప్పినయది గంటిరె జగ, మెల్లను నేలఁగఁ దగు సముజ్జ్వ♦లత యూహింపన్.

క. వెనుకదెస వచ్చి కదిసియుఁ, దనరథము దొలంగ నిచ్చి ♦ తఱియఁ బడుట కొ
ల్లనితలఁపు గలిగి క్రేగం, టన మనలం జూచుచుం గ♦డచి యట నడచెన్. 258

క. మొనఁ గలయఁ జూచి యూరక, చను టధిపతి నరసి తా ని♦చటఁ గానక యా
తనిపజ్జ నరుగు తెఱఁ గగు, ననుమానము లేదు క్రోధ ♦ మగ్గలము మదిన్. 259

---

నమస్కారములుగాను, చెవులయొద్దఁ బడినవి కుశలప్రశ్నములుగాను ననుట. అంతరంగంబులన్ = మనస్సులయందు. దుర్నిరీక్షుండు = చూడ నశక్యమయినవాఁడు. అమ్మోహరంబుదెసన్ = ఆసేనవైపున. గోవులపజ్జన్ = ఆవులవైపునకు. సురనదీసూనుండు = భీష్ముఁడు.

256. చిరకాలమునకున్ = చాలకాలమునకు. నరున్ = అర్జునుని. సజ్జనప్రియుఁడు = సత్పురుషులకు ఇష్టుఁడు. సుహృత్పరతంత్రుఁడు = స్నేహితుల కధీనుఁడు. బాంధవహితుఁడు = చుట్టములకు మేలు చేయువాఁడు. అరిభీకరుఁడు = శత్రువులకు భయము చేయువాఁడు. అవనిన్ = భూమియందు.

తా.—ఈయర్జునుని బహుకాలమునకుఁ జూచితిమి. ఇతఁడు సత్పురుషులకుఁ బ్రియుఁడు. మిత్రులకు అధీనుఁడు, చుట్టములకు మేలొనరించువాఁడు, శత్రువులకు భయమును గలిగించువాఁడు. ఈయర్జునునివంటివారు లోకమున లేరు.

257. ఈతనిఅతులితమూర్తి = ఈయర్జునుని సాటిలేనియాకారము. మనచూడ్కికిన్ = మనచూపునకు. వ్రేఁగుఅయి = దుస్సహమై. అత్యుదాత్తతన్ = మిక్కిలి గొప్పతనముచేత. కడున్ = మిక్కిలి. ఒప్పినయది. సముజ్జ్వలత = గొప్పప్రకాశము కలిగి యుండుట. ఊహింపన్ = ఆలోచింపఁగా. జగము = లోకమును.

తా.—ఈయర్జునునియాకారము మనకంటికిఁ జూడ దుస్సహమై యున్నది. ఇతనితేజస్సు చూడఁగా నితఁడు లోకమంతయుఁ బరిపాలింపఁ దగినవాఁ డని తోఁచుచున్నది.

258. కదిసియున్ = చేరియు. తఱియఁబడుటకున్ = సమీపించుటకు. ఒల్లనితలఁపు = ఇష్టపడని యభిప్రాయము. క్రేగంటనుఅ = కడకంటిచేతనే. కడచి = దాఁటి.

తా.—వెనుకప్రక్కగా మనసమీపమునకు వచ్చియు మనయొద్దకు వచ్చునభిప్రాయము లేనివాఁడై తనరథమును తొలఁగించుకొని మనలను గడకంటం జూచుచు నావలకుఁ బోవుచున్నాఁడు.

259. మొనన్ = సేనను. అధిపతిన్ = దుర్యోధనుని. ఆతనిపజ్జన్ = ఆదుర్యోధనునియొద్దకు. అరుగు తెఱఁగు = పోవువిధము. అగున్. అగ్గలము = అధికము.

తా.—ఈయర్జునుఁడు ఈసేనవంతయుఁ బాఱఁ జూచి యూరక పోవుటచే దుర్యోధను నిచటఁ

చ. మనకును గౌరవేంద్రునకు ♦ మధ్యముఁ జొచ్చినయేని నాతఁ డ
ర్జునునకు నొంటిఁ జాలఁ డని ♦ రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ
డన నొకరుండు శక్తుఁడె ర♦యంబుమెయిన్ మన మెల్ల నిప్డు డా
తనికడ సేరఁగాఁ జనుట ♦ దప్పినఁ గార్యము దప్పు నెంతయున్. 260

గీ. వాసవాత్మజుండు ♦ వసుధేశనందను, ముట్టికొనిన నొకటి ♦ పుట్టెనేని
మనప్రయోజనంబు ♦ మఱియేమి పసు లవి, యేటి కొండుధనము ♦ లెల్ల నేల 261

వ. అని పలికి బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణతత్పరత్వంబున సరదంబు
సత్వరంబు సేసిన సేనాపతిం గని సైనికనికాయంబులుం గడఁగి చనం దొడంగె
నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవులకానలిమూఁకయు వానిం దఱిమి
కొని యతిరయంబున నరుగం దానును గెలనఁ గ్రోశద్వయమాత్రంబు నడచి
పురుహూతపుత్రుం డుత్తరున కిట్లనియె. 262

గానక వానిమీఁదికిఁ బోవుచున్నాఁ డని తోఁచుచున్నది సందేహము లేదు. అర్జునునకు దుర్యోధనుని మీఁద మిక్కిలి కోపము గలదు.

260. కౌరవఇంద్రునకున్ = దుర్యోధనునకును. మధ్యమున్ = మధ్యప్రదేశమును. ఆతఁడు = ఆదుర్యోధనుఁడు. ఒంటిన్ = ఒంటరితనముచేత. రుద్రుఁడున్ = శివుఁడును. ఎక్కటిన్ = ఒంటిగా. మార్కొనంగన్ = ఎదిరించుటకు. లేఁడు = చాలఁడు. ఒకరుండు = మఱియొకఁడు. రయంబుమెయిన్ = వేగముచేత. ఆతనికడ = ఆదుర్యోధనునిసమీపమును.

తా.—అర్జునుఁడు మనకును దుర్యోధనునకును నడుమఁ జేరినయెడ దుర్యోధనుఁ డొక్కఁడు అర్జునునితోఁ బోరఁ జాలఁడు. శివుఁడుగూడ నాయర్జునునితో నొంటరిగాఁ బోరఁ జాలఁడు, ఇంక నితరునిం జెప్ప నేల. కావున మన మందఱ మిప్డు దుర్యోధనునియొద్దకుఁ బోకున్నయెడఁ గార్యము చెడును.

261. వాసవఆత్మజుండు = ఇంద్రునికొడు కయిన యర్జునుఁడు. వసుధాఈశనందనున్ = రాజయిన ధృతరాష్ట్రునికుమారుఁ డయిన దుర్యోధనుని. ఒకటి = ఒకయాపద. ఒండుధనములు = ఇతరము లయినధనములు.

తా.—అర్జునుఁడు దుర్యోధనునిఁ దాఁకి యతని వధించెనేని మన ముండియు నేమిప్రయోజనము, అవలఁ బశువు లెందుకు? ధనము లేల? వాసవాత్మజుండు, వసుధేశనందనున్ అను సాభిప్రాయవిశేష్యములచేఁ బరికరాంకురాలంకారము.

262. రాజరక్షణతత్పరత్వంబునన్ = దుర్యోధనునికాపాడుటయం దాసక్తుఁ డగుటచేత. సత్వరంబు = వేగముతోఁ గూడినదానిని. సేనాపతిన్ = సేనానాయకుని, భీష్ముని. సైనికనికాయంబులున్ = సేనలసమూహములును. ఇప్పాటన్ = ఈప్రకారముగా. అమ్మేటిమొనయును = ఆగొప్పసేనయును. అతిరయంబునన్ = మిక్కిలి వేగముచేత. కెలనన్ = పార్శ్వమునందు. క్రోశద్వయమాత్రంబు = రెండుకోసులదూరము. పురుహూతపుత్రుండు = ఇంద్రునికొడు కయిన యర్జునుఁడు.

మ. ఇదె గోవర్గము సేర వచ్చితిమి పో ♦ నిం కేల సైన్యంబులుం
గదియన్ వే చనుదెంచె రెంటినడుము ♦ గాఁ జొచ్చి యీవచ్చును
న్మదవీరావలికిన్ భుజావిభవవి♦న్యాసంబు గాన్పించి మా
న్పెద గర్వంబు మరల్చెదం బసుల నా♦చేఁ జిక్కు రా జెమ్మెయిన్. 263

( యుద్ధారంభము. )

క. అనుటయు విరాటతనయుఁడు, మొన కడ్డముగాఁగఁ దూర్పు♦మొగ మై రథముం
గొని కట్టెదిరికిఁ బోయినఁ, దనమూఁపులు రెంచు నపుడు ♦ దలకుం గడవన్. 264

వ. తేరు సమ్ముఖంబు సేయించి పేరు వాడి క్రీడి కరతలం బెత్తి నిలునిలు మని యదల్చిన ఘోషంబుతోడన వెడలునిశితశరపరంపరలదట్టంపుఁబఱపున నంబరంబు నీరంధ్రం బగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గవిసి గుండియ లవిసి కురు బలంబు లెదురు నడవను మరలం బఱవను నుఱచి వెఱచఱచి హరితనయహ స్త లాఘవప్రశ స్తి దక్కం దక్కినచేష్టలు దక్కియుండె నతండు గోవుల వెనుకం బోవు

263. గోవర్గమున్ = ఆవులసమూహమును. ఈవచ్చుచున్నదవీరఆవలికిన్ = ఈవచ్చుచున్న యెక్కుడుమదము గల శూరులసమూహమునకు. భుజావిభవవిన్యాసంబు = చేతులసంపదయొక్క విలాసమును. ఎమ్మెయిన్ = ఏవిధమునను.

తా.—ఇదిగో మనము గోవులయొద్దకు వచ్చితిమి. ఇఁకఁ బోవలదు, సైన్యములుగూడ సమీప మునకు వచ్చినవి. ఈయావులకును సైన్యములకును నడుమఁ జొచ్చి యీవచ్చుచున్న శూరులకు నాబా హుబలము చూపి యావుల మరల్చెదను, ఇఁక దుర్యోధనుఁడు నా కెట్లెనను జిక్కును.

264. విరాటతనయుఁడు = విరాటునికొడుకు, ఉత్తరుఁడు. మొనకున్ = సేనకు. కట్టెది రికిన్ = ఎట్టయెదుటికి. పోయినన్. తనమూఁపులు = అర్జునుని భుజములు. తలకున్ కడవన్ = శిరస్సును దాఁటఁగా.

తా.—అర్జునుని మాట విని యుత్తరుఁడు తూర్పుమొగముగా రథమును బోనిచ్చి సేన కెదురు తోలఁగా నపుడు యుద్ధోత్సాహముచే నర్జునుని మూఁపు లుబ్బెను.

265. సమ్ముఖంబు = ఎదురు. పేరువాడి = పేరుచెప్పి. క్రీడి = అర్జునుఁడు. కరతలంబు = అరచేతిని. ఘోషంబుతోడన్ అ = ధ్వనితోడనే. వెడలు నిశిత శరపరంపరల దట్టంపుపఱ పునన్ = వెడలునట్టి వాఁడిబాణముల వరుసలయొక్క దట్టమయిన వ్యాప్తిచేత. అంబరంబు = ఆకా శము. నీరంధ్రంబు = సందులేనిది. తత్ అంధకారంబును = ఆబాణములచీఁకటియు. భయతిమిరం బును = భయముచేతఁ గలిగిన తిమిరవ్యాధియును. కవిసి = చుట్టుకొని. అవిసి = పగిలి. హరితన యహస్తలాఘవప్రశస్తి = అర్జునునియొక్క చేతుల లాఘవముయొక్క కొనియాడుట. పఱపించి = తోలించి. తెఱపి = సందును. వెలిచీర = తెల్లనివస్త్రమును. సారించి = సవరించి. కేతుకపి = టెక్కెముసందలి కోఁతి. గర్జిల్లన్ = అఱవఁగా. తదీయభూతంబులు = ఆకోఁతిసంబంధు లయిన

నల్పబలంబు బెదరి తూర్పుదెసకుం జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపి సూపి వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబులార్వ మార్వీరవంబును రథనేమినినదంబును బ్రతిపతాకినీతుములంబును గగనంబునం బొగడునమరులయెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసీకుహరంబు నిండిన నొండొండ మట్ట లెత్తుకొని నేల మట్టవియుచు నద్రువం బసులు వెసం దిరిగి మున్ను వివ్వచ్చుండు వచ్చినజాడ గైకొని దక్షిణదిశకుఁ జిఱ్ఱులువోడుచుచుం దెరలంబాఱెన. 265

క. గోవులతోఁ బొదువంబడి, పోవుచు నున్నట్టిగోప♦స్తోమంబు తదీ
యావసరంబున సరభస, మై వానిపిఱుందఁ దగిలి ♦ యమ్మెయిఁ బఱచెన్. 266

గీ. అప్పు డర్జునుండు ♦ దప్పక చూచి యీ, బలము పసుల కడ్డ♦పడక యుఁడ
నెడ సొరంగ వలయు ♦ నిట నెయ్యికొనుమని, పనిచె మత్స్యభూమి♦పాలసుతుని.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జన నిచ్చె రథంబు గోప♦సంఘముఁ దిరమై
కొని పొండు పసుల నోడక, యని తా నెలుఁగిచ్చి వీటి♦కై నూల్కొలిపెన్.

---

పిశాచములు. ఆర్వన్ = అఱవఁగా. మౌర్వీరవంబును = అల్లెత్రాటిధ్వనియును. రథనేమినినదంబును = తేరుచక్రముల యంచుల మ్రోఁతయును. ప్రతిపతాకినీ తుములంబును = ఎదిరిసేనయొక్క సంకులధ్వనియును. గగనంబునన్ = ఆకాశమునందు. అమరుల ఎలుంగులును = దేవతలధ్వనులును. చెలంగన్ = మ్రోయఁగా. సముదితసాంద్రసంరావంబు = కలసిన గొప్పదయిన ధ్వని. రోదసీకుహరంబు = భూమియొక్కయు ఆకాశముయొక్కయు సందును. ఒండొండ = క్రమక్రమముగా. మట్టలు = తోఁకలను. నేలమట్టు = భూతలము. అవిసి = పగిలి. చిఱ్ఱులువోడుచుచున్ = వేగిర పడుచు. తెరలన్ పాఱినన్ = మళ్లఁబడఁగా.

266. పొదువంబడి = చుట్టుకొని. గోపస్తోమంబు = గొల్లలసమూహము. తదీయఅవసరంబునన్ = ఆసమయమునందు. సరభసము ఐ = వేగముతోఁ గూడినదై. వానిపిఱుందన్ = ఆయావుల వెంట. అమ్మెయిన్ = ఆదిక్కున.

తా.—ఆవులతోఁ గూడఁ బోవుచుండినగొల్లలు ఆసమయము చూచి తాము ఆగోవులవెంబడిఁ బరుగెత్తిరి.

267. ఎడ = నడుమను. ఎయ్యికొనుము = వెంబడింపుము. మత్స్యభూమిపాలసుతునిన్ = విరాటరాజుకుమారుఁ డయిన యుత్తరుని. పనిచెన్.

తా.—అర్జునుఁ డప్పు డుత్తరునితో ఈసేన పశువుల కడ్డపడకుండునట్లు మనము నడుమఁ బ్రవేశింపవలయును, అట్లు రథము తోలు మని చెప్పెను.

268. పనిచినన్ = ఆజ్ఞాపింపఁగా. అమ్మెయిన్ = ఆప్రకారము. గోపసంఘమున్ = గొల్లలసమూహమును. తిరమై = నిలుకడకలదై. ఓడక = భయపడక. కొనిపొండు. అని. తాన్ = అర్జునుఁడు. ఎలుఁగిచ్చి = అఱచి. వీటికై = పట్టణమునకై. నూల్కొలిపెన్ = పురికొలిపెను.

వ. అట్టిసమయంబున. 269

క. కరితురగసమితిఁ గార్కొని, కురువీరులమొనలుమొగుళులకొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁ డు,ద్ధురమారుతచండభంగి ♦ దోఁపఁ దెరల్చెన్. 270

క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ నీక ♦ గాండీవి వెసం
బొదివి యటఁ గడపె నవియును, గొదగొని తమపాలము సొచ్చె ♦ గోపాలురతోన్.

వ. అని చెప్పిన విస్మయంబు నొంది. 272

గీ. పసులు పట్టువడిన ♦ పదపడి నరుఁ డెద్ది, యాచరించెఁ గౌర ♦ వాధినాథుఁ
డేమి సేసె బలము ♦ లెట్లయ్యె భీష్మాది, వీరు లెవ్విధంబు ♦ వార లైరి. 273

వ. అనవుడు. 274

---

తా.—అంత నుత్తరుఁడు రథమును బశువులకును సేనకును నడుమఁ దోలఁగా నర్జునుఁడు గొల్లలతో భయపడక పశువుల నూరికిఁ దోలుకొనిపొం డని యఱచి చెప్పెను.

270. కరితురగసమితిన్ = ఏనుఁగులయు గుఱ్ఱములయు సమూహముచేత. కార్కొని = దట్టమై. కురువీరుల మొనలు = శూరు లయిన కౌరవుల సేనలు. మొగులు కొమరునన్ = మేఘములవలె. కవియన్ = క్రమ్మఁగా. నరుఁడు = అర్జునుఁడు. శరవేగంబునన్ = బాణముల వేగముచేత. ఉద్ధురమారుతచండభంగి = గొప్పదయిన గాలియొక్క భయంకర మయిన విధమువంటి విధము. తోఁపన్ = తోఁచునట్లు. తెరల్చెన్ = తోలెను.

తా.—అంత నేనుఁగులతోను గుఱ్ఱములతోను గౌరవసేనలు మేఘములవలె మీఁదికి రాఁగా నర్జునుఁడు పెనుగాలివలె బాణవేగముచే వారిని పాఱఁదోలెను.

271. కదిసినబలములు = చుట్టుకొన్న సేనలు. విచ్చినన్ = విరియఁగా. గాండీవి = అర్జునుఁడు. కదుపులన్ = మందలను. పొదివి = ఆక్రమించి. కడపెన్ = దాఁటించెను. గొదగొని = చెలరేఁగి. గోపాలురతోన్ = గొల్లలతో. తమపాలము. చొచ్చెన్.

తా.—అట్లు మీఁదికి వచ్చిన సేనలు పాఱిపోఁగా నర్జునుఁ డావులను చెదరనీక యచ్చోటు దాఁటించెను. అంత నాయావులు కావలివారితోఁ గూడఁ దమపాలముం జేరెను.

272. విస్మయంబున్ = ఆశ్చర్యమును.

273. పట్టువడినపదపడి = చిక్కినపిమ్మట. నరుఁడు = అర్జునుఁడు. ఆచరించెన్ = చేసెను. కౌరవఅధినాథుఁడు = దుర్యోధనుఁడు. బలములు = సేనలు. భీష్మఆదివీరులు = భీష్ముఁడు మొదలగు శూరులు. ఎవ్విధంబువారలు = ఎట్టివారలు.

తా.—పశువులు చిక్కినపిమ్మట నర్జునుఁ డేమి కావించెను. సేనలును భీష్ముఁడు మొదలగు వారును నేమి చేసిరి.

274. అనవుడున్ = అని జనమేజయుఁ డడుగఁగా.

మ. నవతాదూర పురాణతానుపగతా ♦ నానాత్వసంశోభితా
వివిధత్వాపగమోజ్జ్వలా బహుకళా♦విర్భావశాలీ సము
ద్భవరాహిత్యనిరూఢ సూక్ష్మతరసం♦భావా మహాస్థూలమూ
ర్తివిశేషా నిరుపాధికా గుణమయా ♦ ధీవర్తనా నిష్క్రియా. 275

క. అంతఃకరణచతుష్టయ, శాంతిసముద్యద్వివేక♦సంపద్వేద్యా
చింతాతంతుత్రుటనా, త్యంతవిదగ్ధైకభజన♦తత్పరహృద్యా. 276

మాలిని. ప్రణమదవనవిద్యా♦ప్రౌఢసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా ♦ పద్మజాదిత్యసత్పో

---

275. నవతాదూర = క్రొత్తదనమునకు దూర మయినవాఁడా! క్రొత్తదనము లేనివాఁడా యనుట. పురాణతాఅనుపగతా = ప్రాఁతదనముచేఁ బొందఁబడనివాఁడా! ప్రాఁతదనము లేనివాఁడా యనుట. నానాత్వసంశోభితా = పలువిధములు గలవాఁ డగుటచేఁ బ్రకాశించువాఁడా! పలువిధములుగా నుండువాఁడా యనుట. వివిధత్వఅపగమఉజ్జ్వలా = పలువిధములు గలుగుట యొక్క లేమిచేఁ బ్రకాశించువాఁడా! పలువిధములు కానివాఁడా యనుట. బహుకళాఆవిర్భావశాలీ= పెక్కుఅంశములచేత నావిర్భవించుటచే నొప్పువాఁడా! అంశములచే ననేకము లయిన జన్మములు గలవాఁడా యనుట. సముద్భవరాహిత్యనిరూఢ = జన్మముయొక్క యభావముచేఁ బ్రసిద్ధుఁడయినవాఁడా! జన్మము లేనివాఁడా యనుట. సూక్ష్మతరసంభావా = మిక్కిలి సూక్ష్మమయిన స్వరూపము గలవాఁడా! మహాస్థూలమూర్తివిశేషా=మిక్కిలి స్థూల మయిన యాకారవిశేషముగలవాఁడా! సూక్ష్మస్థూలములకు రెంటికిని అధిష్ఠాన మయినవాఁడా యనుట. నిరుపాధికా= ఉపాధి లేనివాఁడా! గుణములు లేనివాఁడా యనుట. గుణమయా = పెక్కుగుణములు గలవాఁడా! ధీవర్తనా = బుద్ధిని ప్రేరించువాఁడా! నిష్క్రియా= క్రియలు లేనివాఁడా! ఇందుఁ బరస్పరవిరుద్ధవిశేషణములు చెప్పుటచేత హరిహరుఁ డిట్టిలక్షణములు గలవాఁ డని చెప్ప శక్యము కా దని భావము.

276. అంతఃకరణ...వేద్యా—అంతఃకరణచతుష్టయ = అంతఃకరణముల నాలిగింటియొక్క, మనోబుద్ధిచిత్తాహంకారములయొక్క, శాంతి = పరిశుద్ధిచేత, సముద్యత్ = పుట్టుచున్న, వివేక = తెలివియొక్క, సంపత్ = అతిశయముచేత, వేద్యా = తెలియఁ దగినవాఁడా! మనోబుద్ధిచిత్తాహంకారములయొక్క శాంతిచేతఁ గలుగువివేకము భగవంతునిఁ దెలియుటకు సాధనము అని తాత్పర్యము. చింతా......హృద్యా—చింతా = తలంపు అను, తంతు = దారముయొక్క, త్రుటన = తెంచుటయందు, అత్యంత = మిక్కిలి, విదగ్ధ = సమర్థులును, ఏక = ముఖ్య మయిన, భజన = భక్తియందు, తత్పర = ఆసక్తులు నగువారికి, హృద్యా = మనోహరుఁడా! సంకల్పవికల్పములు విడిచి భక్తిమాత్రమే వహించి యుండువారికి ఆనందము గలిగించువాఁ డని తాత్పర్యము.

277. ప్రణమత్...పద్మా—ప్రణమత్ = మ్రొక్కుచున్నవారియొక్క, అవన = రక్షించుట యను, విద్యా = చదువునందు, ప్రౌఢ = సమర్థములును, సంరూఢ = చక్కఁగాఁ బుట్టిన, కాంతి= కాంతులు గలవియు, ప్రణుత = పొగడఁబడినవియు నగు, చరణపద్మా = కమలములవంటిపాదములు

షణచతురదయావి♦స్ఫారితాలోక లోకా
పణనిపుణజనాంచ♦ద్భక్తివిక్రీతమూర్తీ. 277

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.



---

గలవాఁడా! మ్రొక్కినవారిని రక్షించునట్టి కాంతియుక్తము లయినపాదములు గలవాఁడా యని తాత్పర్యము. పద్మజ......ఆలోకా—పద్మజ = బ్రహ్మయొక్కయు, ఆదిత్య = దేవతలయొక్కయు, సత్ = సత్పురుషులయొక్కయు, పోషణ = రక్షించుటయందు, చతుర = నేర్పరి యయిన, దయా = కరుణచేత, విస్ఫారిత = విశాల మయిన, ఆలోక = చూపు గలవాఁడా! బ్రహ్మ మొదలగువారిని రక్షించునట్టి కరుణాకటాక్షము గలవాఁడా యని తాత్పర్యము. లోకాపణ...మూర్తీ—లోక = ప్రపంచము అను, ఆపణ = అంగడియందు, నిపుణ = సమర్థు లగు, జన = జనులయొక్క, అంచత్ = ఒప్పుచున్న, భక్తి = భక్తికొఱకు, విక్రీత = విక్రయింపఁబడిన, మూర్తి = స్వరూపము గలవాఁడా! భక్తికధీన మయినస్వరూపము గలవాఁడా యని తాత్పర్యము. నవతాదూర మొదలగు వానియందలి సంబోధనములు కృతిపతి యగు హరిహరనాథునివిశేషణములు.

శ్రీమత్......ప్రణీతంబు—శ్రీమత్ = గొప్పతనముగల, ఉభయకవి = సంస్కృతాంధ్రకవులకు, మిత్త్రి = స్నేహితుఁడును, కొమ్మనఅమాత్యపుత్త్రి = కొమ్మనమంత్రి కుమారుఁడును, బుధ ఆరాధన విరాజి = పండితుల సేవించుటచేఁ బ్రకాశించువాఁడు నగు, తిక్కనసోమయాజిప్రణీతంబు = తిక్కనసోమయాజిచేఁ జేయఁబడినది. ఇది—ముగిసెను.



శ్రీ రస్తు.
శ్రీహరిహరనాథాయ నమః.

# సవ్యాఖ్యానాంధ్ర మహాభారతము

## విరాటపర్వము, పంచమాశ్వాసము.

శ్రీసంపాదనచాతు, ర్యా సేవ్యపదారవింద ♦ యౌగికవిద్యో
ద్భాసితమూర్తిమయా వి, న్యాససమా నైకరూప ♦ హరిహరనాథా.

—( అర్జునుఁ డుత్తరునకుఁ గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట. )—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున విరోధివర్గంబుక్కు దక్కి వెక్కసపడి చూచు చుండ నిరర్గళభుజార్గళసంరంభవిజృంభణంబు శోభిల్లఁ బసులం బెట్టించి యనతిదూరవర్తి యగుకౌరవచక్రవర్తిదెసం గనుంగొని

---

శ్రీ...పదారవింద—శ్రీ = గొప్పతనముయొక్క, సంపాదన = సంపాదించుటయందు, చాతుర్య = నేర్పు గలవారిచేత, ఆసేవ్య = మిక్కిలి సేవింపఁదగిన, పదారవింద = కమలములవంటి పాదములు గలవాఁడా! సంపదను సంపాదించుటయందు నేర్పు గలవారిచే సేవింపఁ దగినపాదములు గలవాఁడా యని తాత్పర్యము. సేవించువారికి సంపదలు గలిగించునట్టి పాదములు గలవాఁడా యని భావము. లేక. సంపదను గలిగించుటయందు నేర్పు గలవియు మిక్కిలి సేవింపఁదగినవియు నగు పాదములు గలవాఁడా! యౌగిక...మూర్తిమయా—యౌగిక = యోగసంబంధి యయిన, విద్యా = విద్యచేత, జ్ఞానముచేత ననుట, ఉద్భాసిత = ప్రకాశింపఁజేయఁబడిన, తెలియఁబడిన యనుట, మూర్తిమయా = స్వరూపము గలవాఁడా! యోగముచేఁ గలుగుజ్ఞానముచే నెఱుంగఁబడువాఁడా యనుట. విన్యాససమా = నానావిధ మయినప్రపంచమునందు ఒకవిధ మయినవాఁడా! కార్యమయినప్రపంచము నానావిధముగాఁ దోఁచుచున్నప్పటికిని అందుఁ దానొకఁడేవిధముగాఁ బ్రకాశించువాఁడని తాత్పర్యము. నైకరూప = అనేకవిధము లయిన రూపములు గలవాఁడా! ప్రపంచముయొక్క నానావిధరూపములకును అధిష్ఠాన మయినవాఁడా యనుట. పాఠాం:—యౌగికవిద్యోద్భాసితమతిమూర్తిమయా = యోగజన్య మయిన జ్ఞానముచేఁ బ్రకాశింపఁ జేయఁబడిన యంతఃకరణమునందలి కూటస్థ స్వరూపమయినవాఁడా? యౌగికవిద్యోద్భాసితగుణమూర్తిమయా = యోగసంబంధియయిన ధ్యానముచేతఁ బ్రకాశించుచున్న సగుణరూపము గలవాఁడా! యోగులు ఏసగుణమూర్తిని ధ్యానింతురో యట్టిరూపముచేత వారలకు సాక్షాత్కరించువాఁ డనుట. వ్యాససమాసఏకరూప= వ్యష్టియందును సమష్టియందును నొకఁడేవిధ మయినస్వరూపము గలవాఁడా!

2. విరోధివర్గంబు = శత్రువులసమూహము. ఉక్కు = బలము. తక్కి = తగ్గి. నిరర్గళభుజఅర్గళసంరంభవిజృంభణంబు = అడ్డులేని గడియలవంటిబాహువులయొక్క వేగముయొక్క యతిశయము. అనతిదూరవర్తి = సమీపమున నున్నవాఁడు. కౌరవచక్రవర్తిదెసక = దుర్యోధనుని

ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు వఱపం బఱుప నప్పళించునప్పుడు కురువీరులు గూడుకొని మూఁడువేలరథంబులతోడను గాంగేయకర్ణులొక్కొక్కరుండు నేయింటితోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వడిదిక్కు మొగంబుగాఁ దిరిగి కట్టియెడఁ గదుపులు వట్టువడుటకు నిట్టూర్పు నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్రస్యందనంబుతోడ వెన్నుదన్ని నిలిచె నంతఁ దక్కటిబలంబులు నెయిదికొని యిమ్మై సరభసంబుగాఁ గవిసిన. 2

క. కనుఁగొని యెలనవ్వొలయ వ, దనమున గరువంపుఁజెన్ను ♦ దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతున కి, ట్లనుఁ గేవలవీరరసమ♦యాత్మకుఁ డగుచున్. 3

సీ. కాంచనమయవేది♦కాకనత్కేతనో, జ్జ్వలవిభ్రమమువాఁడు ♦ కలశజుండు
సింహలాంగూలభూ♦షితనభోభాగకే, తుప్రేంఖణమువాఁడు ♦ ద్రోణసుతుఁడు
కనకగోవృషసాంద్ర♦కాంతిపరిస్ఫుట, ధ్వజసముల్లాసంబు♦వాఁడు కృపుఁడు
లలితకంబుప్రభా♦కలితపతాకావి, హారంబువాఁడు రా♦ధాత్మజుండు

---

దిక్కును. ధనంజయుండు = అర్జునుఁడు. భూమింజయున్ = ఉత్తరుని. పఱపన్ = తోలుటకు. అప్పళించునప్పుడు = ప్రయత్నించునప్పుడు. తలకడచి = ముందుమిగిలి. నిగిడించుచున్ = పుచ్చుచు. మనుజపతియున్ = రాజైనదుర్యోధనుఁడును. అనుజసహితుండువై = తమ్ములతోఁ గూడినవాఁడై. సహస్రస్యందనంబుతోడన్ = వేయితేరులతో, సమాహారద్విగుసమాసము. వెన్నుదన్ని = వెంబడించి. తక్కటిబలంబులున్ = మిగిలినసేనలును. ఎయిదికొని = వెంబడించి. సరభసంబుగాన్ = వేగముతోఁ గూడినట్లుగా.

3. ఎలనవ్వు = చిఱునవ్వు. ఒలయన్ = వ్యాపింపఁగా. వదనమునన్ = ముఖమునందు. గరువంపుచెన్ను = గర్వముయొక్కచక్కఁదనము. తలకొనఁగాన్ = కలుగఁగా. కేవలవీరరసమయఆత్మకుఁడు = ముఖ్యమయిన వీరరసముచే నిండిన యాకారము గలవాఁడు.

తా.—అంత నర్జునుఁడు కౌరవసైన్యముం జూచి చిఱునవ్వు నవ్వుచు గర్వము గలవాఁడై వీరరసమయ మయిన యాకారముతో నుత్తరున కిట్లనియె.

4. కాంచన...వాఁడు—కాంచనమయ = బంగారువికారమయిన, వేదికా = యజ్ఞవేదిచేత, కనత్ = ప్రకాశించుచున్న, కేతన = టెక్కెముయొక్క, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, విభ్రమమువాఁడు = విలాసము గలవాఁడు. కలశజుండు = ద్రోణుఁడు. సింహ...వాఁడు—సింహలాంగూల = సింహముతోఁకచేత, భూషిత = అలంకరింపఁబడిన, (ఇది కేతువునకు విశేషణము,) నభోభాగ = ఆకాశప్రదేశమునందలి, కేతు = టెక్కెముయొక్క, ప్రేంఖణమువాఁడు = చలనము గలవాఁడు. ద్రోణసుతుఁడు = అశ్వత్థామ. కనక...వాఁడు—కనకగోవృష = బంగారుటాఁబోతుయొక్క, సాంద్ర = దట్టమయిన, కాంతి = కాంతిచేత, పరిస్ఫుట = ప్రకాశించుచున్న, ధ్వజ = టెక్కెముయొక్క, సముల్లాసంబువాఁడు = ప్రకాశము గలవాఁడు. కృపుఁడు. లలిత...వాఁడు—లలిత = మనోహరమయిన, కంబు = శంఖముయొక్క, ప్రభా = కాంతితో, కలిత =

మణిమయోరగరుచిజాల♦మహితమైన, పడగవాఁడు కురుక్షితి♦పతి మహోగ్ర
శిఖరఘనతాళతరు వగు♦సిడమువాఁడు, సురనదీసూనుఁ డేర్పడఁ ♦ జూచికొనుము.

క. గురునకుఁ బ్రదక్షిణంబుగ, నరదముఁ బో నిత్త మిమ్మ♦హాపురుషునెడం
బరిభవము వలవ దీతఁడు, కురుకులనృపతనయశిక్ష♦కుఁడు సుమ్మనఘా. 5

క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాత♦నాభీలుఁడు వ
ర్చస్త్రాసితరిపుఁడు ధను, శ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డ♦సదృశుఁడు శక్తిన్. 6

ఉ. ఈతనితోడికయ్యమున ♦ కియ్యకొనం దగ దేను దుష్పథ
ద్యూతజయోన్నతుం డగుసు♦యోధనునిం బరిమార్పఁ బోవుచో

---

కూడిన, పతాకా = టెక్కెముయొక్క, విహారంబువాఁడు = క్రీడకలవాఁడు. రాధా ఆత్మజుండు = రాధకొడుకు, కర్ణుఁడు. మణిమయఉరగరుచిజాలమహితము = రత్నములవికారమయినపాముయొక్క కాంతులసమూహముచే గొప్పది. వినపడగవాఁడు = అయినట్టి టెక్కెము గలవాఁడు. కురుక్షితిపతి = దుర్యోధనుఁడు. మహత్ ఉగ్రశిఖరఘనతాళతరువు = మిక్కిలి భయంకరమయినచివరలు గలదియు గొప్పదియు నగు తాటిచెట్టు. అగుసిడమువాఁడు = అయినట్టిధ్వజము గలవాఁడు. సురనదీసూనుఁడు = భీష్ముఁడు. ఏర్పడన్ = స్పష్టముగా. చూచికొనుము.

తా.—బంగారముచేఁ జేయఁబడిన యజ్ఞవేది ధ్వజము కలవాఁడు ద్రోణాచార్యుఁడు, సింహముయొక్క తోఁక ధ్వజముగాఁ గలవాఁడు అశ్వత్థామ. స్వర్ణమయ మయిన వృషభధ్వజము గలవాఁడు కృపాచార్యుఁడు. సుందర మయిన శంఖధ్వజము కలవాఁడు కర్ణుఁడు. రత్నములతోఁ జేయఁబడిన సర్పధ్వజము గలవాఁడు దుర్యోధనుఁడు. భయంకర మయిన తాటిచెట్టు టెక్కెముగాఁ గలవాఁడు భీష్ముఁడు. చక్కఁగాఁ జూచికొనుము.

5. ఇమ్మహాపురుషునెడన్ = ఈపూజ్యుఁ డయిన పురుషునివిషయమున. పరిభవము = తిరస్కారము. ఈతఁడు = ఈద్రోణాచార్యుఁడు. కురుకులనృపతనయశిక్షకుఁడు సుమ్ము = కురువంశమునందలి రాజపుత్త్రుల కాచార్యుఁడు సుమా. అనఘా = పాపము లేనివాఁడా! ఉత్తరునిసంబోధనము.

తా.—ఉత్తరా! మనము ద్రోణునకుఁ బ్రదక్షిణముగాఁ బోవలయును, ఇతఁడు మహాపురుషుఁడు, కురువంశపు రాజకుమారుల కందఱకు నాచార్యుఁడు. కావున నితనిం దిరస్కరింపఁ గూడదు.

6. శస్త్రప్రకారనిపుణుండు = ఆయుధములవిధమునందు సమర్థుఁడు. అస్త్రవిదుఁడు = అస్త్రముల నెఱింగినవాఁడు. దూరపాతనఆభీలుఁడు = దూరమునందలిదానిఁ బడఁగొట్టుటయందు భయంకరుఁడు. వర్చఃత్రాసితరిపుఁడు = తేజస్సుచే భయపెట్టఁబడిన శత్రువులు గలవాఁడు. ధనుశ్శాస్త్రపరిజ్ఞానఘనుఁడు = విలువిద్యయొక్క తెలియుటచేత గొప్పవాఁడు. శక్తిన్ = బలమునందు. అసదృశుఁడు = సాటి లేనివాఁడు.

తా.—ద్రోణాచార్యుఁడు అన్నివిధము లయినశస్త్రములను నస్త్రములను దెలిసినవాఁడు. బహుదూరమునందలి లక్ష్యములు పడునట్లు బాణప్రయోగము చేయువాఁడు. ఇతని బ్రహ్మవర్చసమును జూచి శత్రువులు భయపడుదురు. ధనుర్విద్యయందు మిక్కిలి పండితుఁడు. ఎక్కువబలము గలవాఁడు.

7. ఈతనితోడికయ్యమునకున్ = ఈద్రోణాచార్యునితోడి యుద్ధమునకు. ఇయ్యకొనన్ దగదు = అంగీకరింపరాదు. దుష్పథద్యూతజయఉన్నతుఁడు = కపటద్యూతమునందలి గెలుపుచే గొప్పవాఁడు.

శాతశరోత్కరం బితఁడు • చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము తాన మున్ననికిఁ • జొచ్చినఁ జొత్తము గాక పిమ్మటన్. 7

క. గురుపుత్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ దేఱి • చూడ నరిది సం
గరమున నీతని నీశ్వర, వరజనితుఁడు మేటి కౌర • వవ్యూహమునన్. 8

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా, చార్యుల కెన వచ్చు దివ్య • శరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా, చార్యక మొనరించె మాకు • శైశవముతఱిన్. 9

గీ. వీర లిరువురు మాన్యులు • వీరితోడి, కయ్యమున కిప్డు మన మంత • గాలుద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా • మెలఁగి రచట, మనరథం బల్ల నల్లనఁ • జనఁగ నిమ్ము.

శా. యోధాగ్రేసరుఁ డిద్ధ తేజుఁడు రణో • ద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమ బాహువీర్యుఁడు కురు • క్ష్మాపాలవాల్లభ్యల

---

పాఠాం:—జయఉద్ధతుండు = జయముచే గర్వించినవాఁడు. అగుసుయోధనునిన్ = అయినదుర్యోధనుని. పరిమార్పన్ = చంపుటకు. పోవుచోన్ = పోవునపుడు. శాతశరఉత్కరంబు = వాఁడి బాణములసమూహమును. అనికిన్ = యుద్ధమునకు.

తా.—ఈద్రోణాచార్యునితో మనము యుద్ధమునకుఁ బోరాదు. కపటపు జూదమునందు జయించి గర్వించి యుండు దుర్యోధనుని నేను వధింపఁ బోవునపుడు ఈతఁడు నామీఁద బాణములు చక్కఁగాఁ బ్రయోగించునో ప్రయోగింపఁడో చూడవలయును, అతఁడు మనమీఁదికి యుద్ధమునకు వచ్చిన పిమ్మట మనము అతనిమీఁదికిఁ బోవలయును గాని ముందుగాఁ బోరాదు.

8. గురుపుత్రుఁడు = ద్రోణునికొడుకు, అశ్వత్థామ. తేజఃనిధి = పరాక్రమమునకు గని. ఈతనిన్. సంగరమునన్ = యుద్ధమునందు. సురాసురులకైనన్ = దేవతలకైనను రాక్షసులకైనను. తేఱిచూడన్ = చక్కఁగాఁ జూచుట. అరిది = అశక్యము. ఈశ్వరవరజనితుఁడు = శివునివరముచేఁ బుట్టినవాఁడు. కౌరవవ్యూహమునన్ = కౌరవులసేనయందు. మేటి = ఉత్తముఁడు.

తా.—అశ్వత్థామ మిక్కిలి పరాక్రమవంతుఁడు, దేవదానవులు గూడ నీతనితోఁ బోరఁజాలరు, ఇతఁడు శివునివరమునఁ బుట్టినవాఁడు, కౌరవసేన కంతయు మేటి యయినవాఁడు.

9. ధైర్యధనుఁడు = ధైర్యమే ధనముగాఁ గలవాఁడు. ఎన = ఈడు. దివ్యశరవిదుఁడు = మేలిబాణముల నెఱింగినవాఁడు. మత్ పితృసఖుఁడు = నాతండ్రికి చెలికాఁడు. మాకున్. శైశవముతఱిన్ = బాల్యసమయమునందు. ఆచార్యకము = ఉపాధ్యాయత్వమును. ఒనరించెన్ = చేసెను.

తా.—ఈకృపాచార్యుఁడు మిక్కిలి ధీరుఁడు. అస్త్రవిద్యయందు ద్రోణాచార్యునకు సమానుఁడు. నాతండ్రికి స్నేహితుఁడు. చిన్నవాఁడు మాకు విద్య నేర్పినవాఁడు.

10. మాన్యులు = పూజ్యులు.

తా.—ద్రోణుఁడును కృపుఁడును బూజ్యులు గావున మనము వీరిమీఁదికిఁ ముందుగా యుద్ధమునకుఁ బోవలదు, వీ రెదురుపడినపుడు పనతేరును తిన్నగాఁ బోనిమ్ము.

11. యోధఅగ్రేసరుఁడు = శూరులయందు ముందు నడచువాఁడు. ఇద్ధతేజుఁడు = ప్రకా

లక్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలితశ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొకచీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్. 11

క. శౌర్యాటోపంబున దో, ర్వీర్యంబున నస్త్రశస్త్రవిత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును, దుర్యోధనుఁ డెపుడుఁ దన్నెదురు సేయంగన్. 12

చ. అతిదృఢవేధి పేరు గలయట్టిమగండు రణంబు గల్గె నేఁ
డితనికి నాకుఁ దెల్లముగ సిట్టియెడం బరికించి చూడుమీ
మతి గలఁగంగ నీక యనుమానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువిధంబుల నిద్దఱతారతమ్యముల్. 13

---

శించుచున్న తేజస్సు గలవాఁడు. రణఉద్యోగఅనురక్తుండు = యుద్ధప్రయత్నమునందుఁ బ్రీతి గలవాఁడు. దుస్సాధప్రక్రమబాహువీర్యుఁడు = సాధింపరాని యారంభము గల బాహుబలము గలవాఁడు. కురుక్ష్మాపాలవాల్లభ్యలక్ష్మీధామఆత్ముఁడు = కురురాజయిన దుర్యోధనునియొక్క ప్రియుఁ డగుట యనుసంపదకుఁ జోటైన తాను గలవాఁడు, దుర్యోధనునకుఁ బ్రియుఁ డనుట. జామదగ్న్యకలితశ్రేష్ఠఅస్త్రవిద్యాఆఢ్యుఁడు = జమదగ్నికొడుకయిన పరశురామునివలనఁ బొందఁబడిన మేలియాయుధవిద్యచే నొప్పినవాఁడు. ఈరాధేయుండు = ఈకర్ణుఁడు. పోరులన్ = యుద్ధములయందు. వీరవ్రాతమున్ = శూరులసమూహమును. ఒకచీరికిం గొనఁడు = లక్ష్యము చేయఁడు.

తా.—ఈకర్ణుఁడు శూరులయం దుత్తముఁడు. గొప్పతేజస్సు గలవాఁడు. యుద్ధమునందుఁ బ్రీతి గలవాఁడు. గొప్పబాహుపరాక్రమము గలవాఁడు. దుర్యోధనునకు స్నేహితుఁడు. పరశురామునివలన నస్త్రవిద్య నేర్చినవాఁడు. యుద్ధమున నెట్టిశూరుల నయినను లక్ష్యము చేయువాఁడు గాఁడు.

12. శౌర్యఆటోపంబునన్ = పరాక్రమముయొక్క యతిశయముచేతను. దోర్వీర్యంబునన్ = చేతులలావుచేతను. అస్త్రశస్త్రవిత్త్వమునను = అస్త్రములను ఆయుధములను నెఱిఁగినవాఁ డగుటచేతను. దుర్యోధనుఁడు. తన్నున్ = కర్ణుని. నాకును. ఎదురు. చేయంగన్. మాత్సర్యంబు = మేలోర్వనితనమును. చేయున్.

తా.—ఈకర్ణుఁడు శౌర్యమునందును బాహుబలమునందును, శస్త్రాస్త్రపాండిత్యమునందును నాకు ఎదురై నామీఁద మాత్సర్యము చేయుచుండును, దుర్యోధనుఁ డెప్పుడును నితనినే నాకుఁ బ్రతిభటునిగాఁ జెప్పును.

13. అతిదృఢవేధి = మిక్కిలి దృఢముగాఁ గొట్టువాఁడు. పేరు = కీర్తి. మగండు = శూరుఁడు. రణంబు = యుద్ధము. తెల్లముగన్ = స్పష్టముగా. మతి = బుద్ధిని. కలఁగంగనీక = కలఁతనొందనీయక. సాయకఉద్ధతిన్ = బాణములయతిశయమును. ప్రకటించుచోన్ = వెల్లడిచేయునప్పుడు. బహువిధంబులన్ = నానావిధములచేత. ఇద్దఱతారతమ్యముల్. చూడుమీ అని యన్వయము.

తా.—ఈకర్ణుఁడు వేగముగా బాణములు ప్రయోగించువాఁడు, మిక్కిలి శూరుఁడు. వీనికిని నాకును నేఁడు యుద్ధము కలిగినది కావున నిప్పుడు నీవు మేమొండొరులమీఁద బాణములు ప్రయోగించునప్పుడు కలఁతనొందక మాయిద్దఱితారతమ్యములను నిస్సంశయముగాఁ దెలిసికొనుము.

క. ఈయన ననుఁ గని వారణ, సేయం డితఁ డగ్గ మైనఁ ♦ జిచ్చఱపిడు గై
పోయి పయిఁ బడుదు నీవర, వా యించుక లేక పఱప ♦ వలయు రథంబున్. 14

ఉ. ఉగ్రుఁ డనూనమానమహి♦మోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవస♦మన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస న♦నార్యుఁడు కార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసి♦నప్పుడు పండువు నాకు నుత్తరా. 15

గీ. అరసికొని యెన్నిభంగుల♦నైన నితని, తేరు మనబారి కగపడు♦తెఱఁగు గాంచి
యడరి బాసట లైన యెవ్వ♦రడ్డపడిన, మెఱపు మెఱచినచాడ్పునఁ♦దఱియఁ జొరుము.

క. అస్మత్పితామహుం డతి, విస్మయజననప్రతాప♦విభవాగ్నిశిఖా

---

14. ఈయన = ఈకర్ణుఁడు. వారణచేయఁడు = అడ్డుచేయఁడు. అగ్గమైనన్ = ఎదురైనప్పుడు. చిచ్చఱపిడుగవై = అగ్నిమయమయినపిడుగు వంటివాఁడవై. అరవాయి = సంకోచము.

తా.— ఈకర్ణుఁడు నన్నుఁ జూచినయెడ నడ్డులేక మీఁదఁబడును, నేనును అతఁడు గనఁబడినప్పుడు మహాకోపముతో వానిమీఁదికిఁ బోదును. కావున నీవు వానిమీఁదికి సంకోచము లేక రథము తోలవలయును. సైరణసేయఁడు అను పాఠ మింతకన్న యుక్తతరము.

15. ఉగ్రుఁడు = క్రూరుఁడు. అనూనమానమహిమోన్నతచిత్తుఁడు = తక్కువకాని గర్వముయొక్క యతిశయముచే గొప్పదైనమనస్సుగలవాఁడు. అజయ్యవిక్రమోదగ్రుఁడు = జయింప నశక్యమయిన పరాక్రమముచే గొప్పవాఁడు. ఏయునెడన్ = బాణము ప్రయోగించునపుడు. హస్తలాఘవసమన్వితుఁడు = చేతులవేగముతోఁ గూడినవాఁడు. మాదెసన్ = మాయందు. సమగ్రకోపాగ్రహబుద్ధి = అధిక మయినకోపమును బట్టుదలయును గల బుద్ధి గలవాఁడు. కార్యమునందున్ = పనియందు. అనార్యుఁడు = అయోగ్యుఁడు. ధార్తరాష్ట్రాగ్రజుఁడు = ధృతరాష్ట్రునికొడుకులయందుఁ బెద్దవాఁ డయిన దుర్యోధనుఁడు. కదిసినప్పుడు = చేరినప్పుడు.

తా.— ఈదుర్యోధనుఁడు క్రూరుఁడు, అధిక మయినగర్వము గలవాఁడు, గొప్పపరాక్రమము గలవాఁడు, బాణప్రయోగమునందు హస్తలాఘవము గలవాఁడు. మామీఁద నెక్కుడుకోపము గలవాఁడై మాకు గొప్పయపకారము చేసిన దుష్టుఁడు. ఇతఁడు కనఁబడెనేని నాకు మిక్కిలి సంతోషము.

16. అరసికొని = వెదకికొని. ఎన్నిభంగులన్ ఐనన్ = ఎన్నివిధములచేతనైనను. మనబారికిన్ = మనయెదుటికి. తెఱఁగు = విధమును. అడరి = విజృంభించి. బాసటలై = సహాయమై. మెఱచినచాడ్పునన్ = మెఱసినట్లు. తఱియన్ = సమీపముగా. చొరుము = ప్రవేశింపుము.

తా.— ఏవిధముననైనను ఈదుర్యోధనునిరథమును వెదకి కనుపెట్టి యతని కెవ్వరు సహాయము వచ్చినను నిలువక యతిశీఘ్రముగా వానిమీఁదికి రథము తోలుము.

17. అస్మత్పితామహుండు = మాతాత, భీష్ముఁడు. అతివిస్మయ.....కానసుఁడు — అతివిస్మయ = మిక్కిలి యాశ్చర్యముయొక్క, జనన = కలిగించునట్టి, ప్రతాపవిభవ = పరాక్రమాతిశయము అను, అగ్నిశిఖా = నిప్పుమంటచేత, భస్మీభూత = బూడిద యయిన, ప్రతిపక్ష = శత్రువులయొక్క,

భస్మీభూతప్రతిప, క్షుస్మయకాననుఁడు ప్రథమ♦గణ్యుఁడు బుద్ధిన్. 17

క. బహుమహితాయుధవిద్యా, రహస్యసంవేది ధార్త♦రాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముఁడై, సహాయుఁ డగు వారలకు న♦చటఁ దా నునికిన్.

క. వివిధము లగు లక్ష్యంబుల, నవలీలఁ దునియ నాట♦ నవియఁగ నేయున్
భువనైకధన్వి నత్యు, గ్రవిచేష్టితు నోర్చెఁ బరశు♦రాముం బోరన్. 19

క. శంతనునందనునరదము, పొంతం బో వలవ దలుక♦ వుట్టి యతఁడు భూ
కాంతునకు సైన్యమునకుం, జెంతం జేరంగ నీక♦ సిలుగులఁ బెట్టున్. 20

వ. అని యిట్లు వేఱువేఱం జూపి క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరోత్సుకుం
డగుసమయంబున సస్మితుం డగుచు నశ్వత్థామ రవితనయు నవలోకించి యిట్లనియె.

---

స్మయ = గర్వము అను, కాననుండు = అడవి గలవాఁడు. బుద్ధిన్. ప్రథమగణ్యుఁడు = మొదట నెన్నఁ దగినవాఁడు.

తా.—మా తాత యగు భీష్ముఁడు గొప్పపరాక్రమముచేత శత్రువులగర్వమును రూపు మాపినవాఁడు, మిక్కిలి బుద్ధిమంతుఁడు.

18. బహుమహితఆయుధవిద్యారహస్యసంవేది=అనేకము లయినయుత్తమము లయినయాయుధవిద్యలయొక్క రహస్యములను చక్కఁగాఁ దెలిసినవాఁడు. ధార్తరాష్ట్రులకును = ధృతరాష్ట్రుని కొడుకులకును. హితంబుఅ = మేలునే. అచటన్. తాను. ఉనికిన్ = ఉండుటచేత. సహాయుఁడు = తోడు.

తా.—ఈభీష్ముఁడు ఆయుధవిద్యల నన్నిటిని చక్కఁగా నెఱింగినవాఁడు, దుర్యోధనాదులయందును మాయందును సమబుద్ధి నుంచి మాయిద్దఱికిని క్షేమమే కోరుచుండును, అయినను వారియొద్దఁ దా నున్నవాఁడు కావున వారికి సహాయుఁడై వచ్చెను.

19. వివిధములు = పలువిధములు. అగులక్ష్యంబులన్ = అయినగుఱులను. తునియన్ = తునుకలగునట్లును. నాటన్ = గ్రుచ్చునట్లును. అవియఁగన్ = నశించునట్లును. ఏయున్. భువనఏకధన్విన్ = లోకమున కంతయు నొకఁడే విలుకాఁడైనవానిని. అతిఉగ్రవిచేష్టితున్ = మిక్కిలి భయంకర మయిన పనులు గలవానిని. పోరన్ = యుద్ధమునందు. ఓర్చెన్ = ఓడించెను.

తా.—ఈభీష్ముఁడు ఎట్టిలక్ష్యములనైనను ఏవిధమునఁ గాని తప్పక కొట్టుటయందు మిక్కిలి సమర్థుఁడు. గొప్పశూరుఁ డయినపరశురాముని యుద్ధమునందు జయించినవాఁడు.

20. శంతనునందనుఅరదముపొంతన్ = శంతనుమహారాజుకుమారుఁ డయిన భీష్ముని తేరియొద్దకు. భూకాంతునకున్ = రాజయినదుర్యోధనునకును. చెంతన్ = సమీపమునందు. సిలుగులన్ పెట్టున్ = కష్టములను గలిగించును.

తా.—నీవు భీష్మునిరథమునొద్దకుఁ బోవలదు. అతఁడు కోపించి మనలను దుర్యోధనునొద్దకును సైన్యమునొద్దకును బోనీయక కష్టపఱచును.

21. ఏర్పడన్ = స్పష్ట మగునట్లు. సమరఉత్సుకుండు = యుద్ధమున కెమ రయినవాఁడు. సస్మితుండు = చిఱునవ్వుతోఁ గూడినవాఁడు. రవితనయున్ = సూర్యునికుమారుఁ డయినకర్ణుని. అవలోకించి = చూచి.

క. నిను నీవ పొగడికొని పలి, కినపలుకులు పెక్కు గలవు ♦ క్రీడి యనికి వ
చ్చినవాఁ డిదె పులివలె మా, ర్కొన రాదే కర్ణ సేన♦కుం బ్రియ మెసఁగన్. 22

క. తలఁకు గల దేని శకునిం, బిలిచి విచారింపఁ బొమ్ము ♦ పృథివీపతి నీ
తలన తనకార్యఖడ్గం, బులమో పెక్కించె రిత్త♦పోవునె నీకున్. 23

వ. అనిన విని యతండు క్రోధఘూర్ణమానతారకుం డగుచు ని ట్లనియె. 24

చ. తలఁకెడువానికిన్ మగఁడ ♦ తా నటఁ న న్నడకించువాఁ డిసీ
పలుకకు భీతున ట్లొదుఁగఁ ♦ బొలునె శూరుఁడు నిన్ను నచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడ ♦ కాఁ డట వాసవుఁ డైన నేమి నా
బలముఁ జలంబు నేరిమియు ♦ బంటుతనంబును నీవ చూడుమీ. 25

క. అని కడఁగునినసుతునకు, మును ద్రోణుఁడు ద్రోణనంద♦నుఁడుఁ గృపుఁడును శాం

---

22. పలుకులు = మాటలు. పెక్కు = అనేకములు. క్రీడి = అర్జునుఁడు. అనికిన్ = యుద్ధమునకు. ప్రియము = సంతోషము.

తా.—కర్ణా! నీవింతవఱకు నిన్నుఁ బొగడికొని పెక్కుమాటలు చెప్పితివి, అర్జునుఁడు పులివలె యుద్ధమునకు వచ్చినాఁడు. నీవు సేనకు సంతోషము కలుగున ట్లెదుర్కొని యుద్ధము సేయుము.

23. తలఁకు = భయము. విచారింపన్ = ఆలోచించుటకు. పృథివీపతి = రాజయినదుర్యోధనుఁడు. తనకార్యఖడ్గంబులమోపు=తనయొక్క మంత్రకార్యములయొక్కయు యుద్ధముయొక్కయు బరువును. నీతలన్ అ. ఎక్కించెన్. నీకున్. రిత్తపోవునె = వ్యర్థముగాఁ బోవునా?

తా.—నీకు భయము కలిగినపక్షమున శకునితో నాలోచించి మరల జూదమాడింపుము. దుర్యోధనుఁడు నీమీఁదనే తనకార్యభార ముంచి యుండుటచేత నీ కూరకుండ శక్యము కాదు.

24. క్రోధఘూర్ణమానతారకుండు = కోపముచేఁ దిరుగుడుపడుచున్న కనుగ్రుడ్లు కలవాఁడు.

25. తలఁకెడువానికిన్ మగఁడ = భయపడువానికి ఎక్కువయినవాఁడా! మిక్కిలి భయపడువాఁడా యనుట. తానఁట = తానా? అశ్వత్థామయా యనుట. అడకించువాఁడు = గేలి చేయువాఁడు. ఇసీ = ఛీ. భీతునట్లు = పిఱికివానివలె. శూరుఁడు. ఒదుఁగన్ పొలునువె = దాఁగియుండునా? నచ్చివె = నమ్మియా? కలనికిన్ = యుద్ధమునకు. నరుఁడుఅ = అర్జునుఁడే. వాసవుఁడు = ఇంద్రుఁడు. చలంబున్ = పట్టుదలయును. నేరిమియున్ = నేర్పును. బంటుతనంబును = శౌర్యమును.

తా.—అశ్వత్థామా! నీవు భయపడువారిలో మొదటివాఁడవు, నీవా నన్ను గేలి చేసెదవు, ఛీ, మాటలాడ వలదు, శూరుఁడు నీవలెఁ బిఱికివానియట్లు వెనుదీయఁడు, నిన్ను నమ్మి నేను యుద్ధమునకు వచ్చినవాఁడను గాను. అర్జునుఁడు కాక వానియబ్బ యింద్రుఁ డయినను నాకు భయము లేదు, నాపరాక్రమమును నీవే చూడుము.

26. కడఁగుఇనసుతునకున్ = పూనునట్టి కర్ణునికంటె. మును = ముందుగా. ద్రోణనందనుఁడున్ = అశ్వత్థామయును. శాంతనవుఁడున్ = భీష్ముఁడును. కడఁగుట = పూనుటను. అవలోకించి = చూచి. అతిఉదగ్రతన్ = మిక్కిలి గొప్పతనముతో. కడఁగెన్ = పూనెను.

తనవుఁడుఁ గడఁగుట దుర్యో, ధనుఁ డవలోకించి యత్యు♦దగ్రతఁ గడఁగెన్. 26

వ. ఇవ్విధంబున నయ్యేవురు దొరలును ధరణీశుండును సరభసంబుగా బరవసంబు సేసిన దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ ప్రముఖనిఖిలకురుకుమారనికాయంబును శకునిసైంధవప్రభృతిబంధుజననివహంబును బాహ్లికసోమదత్తాదిసామంతనికురుంబును మఱియునుం గల వివిధయోధవీరనిచయంబును నొక్కటఁ గరటిఘటాఘోటకఘట్టరథయూథపదాతివితతిసంరంభశుంభ త్సేనాసమూహసహితంబుగాఁ ద్రోచి నడచిన. 27

చ. ధరణి వడంకె ధూళి దివిఁ ♦ దాఁకెను భానుఁడు గానరాఁడు బం
ధురవివిధప్రకారపటు♦తూర్యరవంబులఁ బొంగె దిక్కులా
స్ఫురితమహాయుధో(గ్రరుచి♦పుంజవిజృంభణఘోర మయ్యె నం
తరము సహస్రనేత్రముఖ♦దైవతమండలదుర్నిరీక్ష మై. 28

---

తా.—ఇట్లు చెప్పి కర్ణుఁ డర్జునునిమీఁదికిఁ బోఁగా నంతకు మున్నె ద్రోణుఁడును అశ్వత్థామయుఁ గృపుఁడును భీష్ముఁడును పోవుటను జూచి దుర్యోధనుఁడు గూడ నర్జునునిమీఁదికిం బోయెను.

27. ధరణీఈశుండును = రాజయినదుర్యోధనుఁడును. సరభసంబుగాన్ = వేగముతోఁ గూడినట్లుగా. బరవసంబు = ఆటోపమును. ప్రముఖనిఖిలకురుకుమారనికాయంబును = మొదలుగాఁ గల యెల్లకురుకుమారులయొక్క సమూహమును. ప్రభృతిబంధుజననివహంబును = మొదలుగాఁ గల చుట్టములసమూహమును. ఆదిసామంతనికురుంబంబును = మొదలుగాఁ గల సామంతరాజులసమూహమును. వివిధయోధవీరనిచయంబును = నానావిధములు గల భటులయొక్కయు శూరులయొక్కయు సమూహమును. ఒక్కటన్ = ఒకటిగా. * కరటి...సహితంబుగాన్ = కరటిఘటా = ఏనుఁగులసమూహముయొక్కయు, ఘోటకఘట్ట = గుఱ్ఱములగుంపుయొక్కయు, రథయూథ = తేరులసమూహముయొక్కయు, పదాతివితతి = కాల్బలములసమూహముయొక్కయు, సంరంభ = వేగిరపాటుచేత, శుంభత్ = ప్రకాశించుచున్న, సేనాసమూహ = సేనలగుంపుతో, సహితంబుగాన్ = కూడినట్లుగా. త్రోచి = మీఱి.

28. ధరణి = భూమి. ధూళి = దుమ్ము. దివిన్ = ఆకాశమును. తాఁకెను. భానుఁడు = సూర్యుఁడు. కానఁడు. రాఁడు. దిక్కులు. బంధుర......రవంబులన్—బంధుర=దట్టము లయిన, వివిధప్రకార = నానావిధములు గల, పటు = సమర్థము లయిన, తూర్య = వాద్యములయొక్క, రవంబులన్ = ధ్వనులచేత, పొంగెన్ = అతిశయించెను. అంతరము = నడిమిభాగము. సహస్రనేత్రముఖదైవతమండలదుర్నిరీక్షముఐ = ఇంద్రుఁడు మొదలగు దేవతలసమూహముచేఁ జూడరానిదై. ఆస్ఫురిత......ఘోరము—ఆస్ఫురిత = మిక్కిలి ప్రకాశించుచున్న, మహత్ ఆయుధ = గొప్ప యాయుధములయొక్క, ఉగ్ర = భయంకరము లయిన, రుచి = కాంతులయొక్క, పుంజ = సమూహముయొక్క, విజృంభణ = రేఁగుటచేత, ఘోరము = భయంకరము. ఆయ్యెన్.

తా.—అప్పుడు భూమి కదలెను, ఆకాశ మంతయు దుమ్ము క్రమ్మెను, సూర్యుఁ డగపడఁ

( అర్జునుఁడు కౌరవసైన్యంబుల నుఱుమాడుట. )

వ. అట్టియెడ నుద్భటహాసోల్లాసభాసురముఖుం డగుచు శతమఖనందనుండు. 29

చ. గుణమున లస్తకంబునను ♦ గోటియుగంబునఁ గేలఁ దార భీ
షణముగ నుప్పతిల్లి రభ♦సంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట న♦రాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహర♦కర్పరముం బగిలింప నుగ్రతన్. 30

క. తలపడి తలమీఱినకా, ల్బలములఁ బొడిసేయు మఱియుఁ ♦ బైపైఁ బీనుం
గులఁ ద్రొక్కికొనుచు వెస ముం, గలిమొనఁ గవియుటకు వేడ్క ♦ గడలుకొనంగన్.

క. తనదృష్టియు ముష్టియుఁ దగ, ననువున మున్నెత్తి యేయు ♦ నతఁ డప్పుడు నిగి

---

డయ్యెను, దిక్కులనంతటను వాద్యధ్వనులు నిండెను, భూమ్యాకాశములమధ్యభాగము ఆయుధముల కాంతులచే నిండినదై దేవతలకును జేఱి చూడ నలవికాకుండెను.

29. ఉద్భటహాసఉల్లాసభాసురముఖుండు = భయంకర మయిననవ్వుయొక్క కాంతిచేఁ బ్రకాశించుచున్నముఖము గలవాఁడు. శతమఖనందనుండు = ఇంద్రునికుమారుఁ డయినయర్జునుఁడు.

30. గుణమునన్ = అల్లెత్రాటినుండియు. లస్తకంబునను = వింటినడిమిభాగమునుండియు. కోటియుగంబునన్ = వింటికొప్పులజంటనుండియు. కేలన్ = చేతులనుండియు. తారుఅ = తామే, బాణములు తమయంతనే యనుట. భీషణముగన్ = భయంకరముగా. ఉప్పతిల్లి = పుట్టి. రభసంబునన్ = వేగముచేత. రేఁగినమాడ్కిన్ = వెడలినవో యనునట్లు. తీవ్రమార్గణనికరంబులు = కఱకుబాణములసమూహములు. ఒక్కటన్ = ఏకకాలమునందు. అరాతిబలంబులన్ = శత్రుసేనలను. కప్పన్. ఉగ్రతన్ = భయంకర మగుటచేత. గాండివక్వణనము = గాండివధనుస్సుయొక్క ధ్వని. రోదసీకుహరకర్పరమున్ = భూమ్యాకాశములమధ్యప్రదేశముయొక్క చిప్పను. పగిలింపన్.

తా.—బాణములు అల్లెత్రాను వింటినడుము వింటికొప్పులు చేతులు వీని యన్నిటినుండియుఁ బుట్టి తమయంతనే యతివేగముగా వెడలుచున్నవో యనునట్లు గుంపులుగుంపులుగా శత్రుసేనలమీఁదఁ బడఁగా గాండివధ్వనికి బ్రహ్మాండము మీఁదిచిప్ప పగులఁగా. అలం. ఉత్ప్రేక్షాతిశయోక్తులు.

31. తలపడి = తాఁకి. తలమీఱినకాల్బలములన్ = ముందుకు వచ్చిన కాల్బలములను. ముంగలిమొన = ముందరిసేన. కవియుటకున్ = తనమీఁదికి వచ్చుటకు. వేడ్క = వినోదము. కడలుకొనంగన్ = అతిశయింపఁగా.

తా.—అర్జునుఁడు తనయెదుటికి వచ్చినపదాతిసైన్యమును జూర్ణము చేసి యంతఁ దక్కినసేనలు ఆపీనుఁగులను ద్రొక్కికొనుచుఁ దనమీఁదికి వచ్చుటకు వేడుకపడినవాఁడై.

32. తనదృష్టియున్ = తనచూపును. ముష్టియున్ = పిడికిలియు. అనువునన్ = ఉపాయముచేత. మున్ను = ముందుకు. ఎత్తి = పూని. ఏయుఅతఁడు = ప్రయోగించునట్టి యర్జునుఁడు. నిగిడ్చినన్ = ప్రయోగింపఁగా. అపుడు. కోలల్ = బాణములు. సపాటంబునన్ = చదరముగా. కాయములు = దేహములను. పదియున్, పదేనన్, ఉచ్చిపోయెన్ = దూసిపోయెను.

డ్చినఁ గాయముల సపాటం, బునఁ బడియుఁ బదేను నుచ్చి♦పోయెం గోలల్. 32

చ. ఉడుగక వెండియున్ సుభటు♦ లొక్కమొగిన్ వెస నంటఁ దాఁకి క
వ్వడిపటుబాణభాస్వదని♦వార్యసముద్ధతిఁ జేసి మంటలో
మిడుతలు సొచ్చిన ట్లయిన♦ మేటిమగల్ గని యీడఁబోక బ
ల్విడి మఱియున్ వడిం బొదువ♦ వ్రేల్మిడిఁ ద్రుంచె నతండు దోడుతోన్. 33

గీ. అంత కంతకుఁ గడిసి సై♦న్యములు వచ్చి, ముట్టి శస్త్రాస్త్రసంచయ♦మున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గి♦రీటి గాండి, వంబుపరిచలనంబు దీ♦వ్రంబు గాఁగ. 34

సీ. గోరఁ జీరినమాడ్కిఁ♦గొన్నింటిఁ జక్కసాఁ, బాలుగా వ్రయ్యలు♦ వాపి వాపి
బాడిన నఱకిన♦భంగిఁ గొన్నింటిఁ దు, త్తునియలుగా బిట్టు♦ త్రుంచి త్రుంచి

---

తా.—అర్జునుఁడు ధనుస్సును దృఢముగాఁబట్టి గుఱియందుఁ జూపు నిలిపి బాణములు ప్రయోగింపఁగా నవి యొక్కొక్కటియుఁ బెక్కండ్రశరీరముల భేదించికొని పోయెను.

33. ఉడుగక = వెనుదీయక. సుభటులు = మేలిబంట్లు. ఒక్కమొగిన్ = ఒకపూనికతో. అంటన్ తాఁకి = మీఁదికి వచ్చి. కవ్వడి.....సముద్ధతిఁ జేసి—కవ్వడి = అర్జునునియొక్క, పటు= సమర్థము లగు, బాణ = బాణములయొక్క, భాస్వత్ = ప్రకాశించుచున్న, అనివార్య = అడ్డగింపరాని, సముద్ధతిన్ చేసి = అతిశయముచేత. మేటిమగల్ = గొప్పశూరులు. ఈడఁబోక = వెనుదీయక. బల్విడిన్ = గొప్పపరాక్రమముచేత. పొదువన్ = ఎదుర్కొనఁగా. తోడుతోన్ = వెంటనే. వ్రేల్మిడిన్ = శీఘ్రముగా. త్రుంచెన్.

తా.—కౌరవభటులు కొందఱు మరల నర్జునునిమీఁదికిఁ బోయి యతనిబాణములచే హతులగుటను జూచి మరల గొప్పశూరులగువారు వెనుదీయక యాతనిమీఁదికిఁ బోఁగా నతఁడు వారినిగూడ వధించెను.

34. అంతకంతకున్ = అప్పటప్పటికి. శస్త్రాస్త్రసంచయమునన్ = ఆయుధములయు అస్త్రములయుసమూహముచేత. నభంబు = ఆకాశము. దీటుకొనునట్లు = నిండునట్లు. కిరీటి = అర్జునుఁడు. గాండివంబుపరిచలనంబు = గాండివముయొక్కతిరుగుట. తీవ్రంబుకాఁగన్ = సహింపరానిది కాఁగా.

తా.—అంత సైనికులు మఱిమఱి మీఁదికి వచ్చి నానావిధము లయిన యాయుధములు ప్రయోగింపఁగా నర్జునుఁడు గాండివమునందు బాణములు సంధించుచు.

35. అక్షత...వల్గనుండు...అక్షత = గాయము లేని; ధ్వజ= టెక్కెమును, సూత= సారథియును, హయత్వ = గుఱ్ఱములును గలిగిన దగుటచేత, లసత్ = ప్రకాశించుచున్న, అఫల్గు = వ్యర్థముకాని, రథ = తేరియొక్క, వల్గనుండు = నడక గలవాఁడు. అగుఫల్గునుండు= అయిన యర్జునుఁడు. గోరన్ = గోటితో. చీరినమాడ్కిన్ = చీల్చినట్లు. చక్కసాఁబాలుగాన్ = చెరిసగముగా. వ్రయ్యలువాపివాపి= తునుకలు చేసి చేసి. తుత్తునియలుగాన్ = మిక్కిలి తునుకలుగా. బిట్టు = మిక్కిలి. ఇడ్డవసిగన్ = పెట్టినట్లుగా. ఇనుమంతలుగాన్ = చిన్నచిన్నవిగా. స్థుఱు

వెస నంపమున నిడ్డ♦వసిగఁ గొన్నిటి నిసు, మంతలుగా నుఱు♦మాడి యాడి
పనివడి ఱోలఁ గొ♦ట్టినలీలఁ గొన్నింటిఁ, జిఱునుగ్గుగాఁ బొడి♦సేసి చేసి
యడరి పొదివిన బలమునా♦నాయుధములఁ, బ్రతిహతంబులఁగావించె♦నతిరయమున
నక్షతధ్వజసూతహ♦యత్వలసద, ఘ్లురథవల్గనుం డగు♦ఫల్గునుండు. 35

క. ఆమెయిన వివిధవర్మ, స్తోమం బఱుపుల్లు సేసి ♦ సునిశితబాణో
ద్దామప్రసారవిభవ, శ్రీ మార్తుర కద్భుతంబు ♦ సేసెం గడిమిన్. 36

క. గర్జద్గుణుఁ డై పగతుర, జర్జరితాంగులుగఁ జేసె ♦ సాయకజాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ, నిర్జరవరనందనుండు ♦ నిమిషార్ధమునన్. 37

శా. శక్తిస్ఫారధనంజయాయతభుజా♦సంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశ♦త్రువ్రాతముల్ శోణితా

మాడియాడి = చూర్ణముచేసిచేసి. పనివడి = పూని. ఱోలన్ = ఱోటియందు. కొట్టినలీలన్ = దంచి నట్లు. చిఱునుగ్గుగాన్ = సన్నపొడిగా. అడరి = విజృంభించి. పొదివినబలము నానాయుధములన్ = చుట్టుకొన్న సేనయొక్క నానావిధములయిన యాయుధములను. అతిరయమునన్ = మిక్కిలివేగముచేత. ప్రతిహతంబులన్ = కొట్టఁబడినవానినిగా. కావించెన్ = చేసెను.

తా.—అర్జునుఁడు తన టెక్కెమునకును సారథికిని గుఱ్ఱములకును గొంచెమైనను దెబ్బ తగులక యప్రతిహతమైన రథగతి గలవాఁడై శత్రుసేనలు ప్రయోగించినయాయుధములను గొన్నిటిని గోటితోఁ జీల్చినట్లు చెరిసగముగాఁ జీల్చెను. కొన్నిటిని బాడిసతోఁ జెక్కినట్లు చిన్నచిన్నముక్కలుగా ఖండించెను. కొన్నిటిని అంపమునఁ గోసినట్లు చూర్ణము చేసెను. కొన్నిటిని ఱోట దంచినట్లు సన్నపొడిగాఁ జేసెను. ఇట్లు వారు ప్రయోగించినయాయుధముల నన్నిటిని త్రుంచెను.

36. ఆమెయిన్ అ = అవిధముననే. వివిధవర్మస్తోమంబు = నానావిధము లయిన కవచముల సమూహమును. అఱుపుల్లుచేసి = చూర్ణములు చేసి. సునిశిత......శ్రీ—సునిశిత = మిక్కిలి వాఁడి యయిన, బాణ = బాణములయొక్క, ఉద్దామ = భయంకర మయిన, ప్రసార = పరఁగుటయొక్క, విభవ = అతిశయముయొక్క, శ్రీ = సంపద. మార్తురకున్ = శత్రువులకు. అద్భుతంబు = ఆశ్చర్యమును. చేయన్. కడిమిన్ = పరాక్రమముచేత.

తా.—ఆవిధముగానే వారికవచములను గూడఁ జూర్ణములు గావించి తనబాణప్రయోగలాఘవమునకు శత్రువు లాశ్చర్యపడునట్లు పరాక్రమించి.

37. నిర్జరవరనందనుండు = ఇంద్రునికుమారుఁ డయిన యర్జునుఁడు. గర్జత్ గుణుఁడువి = ధ్వనించుచున్న యల్లెత్రాడు గలవాఁడై. సాయకజాలస్ఫూర్జన = బాణసమూహముయొక్క యతిశయమును. చూపఱు = చూచువారు. పొగడఁగన్. నిమిషఅర్ధమునన్ = అరనిమిషములో. పగతురన్ = శత్రువులను. జర్జరితఅంగులుగన్ = మిక్కిలి శిథిలము లయిన దేహములు గలవారగునట్లు. చేసెన్.

తా.—అర్జునుఁడు వారిని ప్రహరించుచుఁ దనబాణవేగమును జూచువారు పొగడుచుండఁగా నరనిముసములోపల శత్రువులదేహములను గాయములు గావించెను.

38. శక్తి...వ్రాతముల్—శక్తి = పరాక్రమముచేత, స్ఫార = ప్రకాశించుచున్న, ధనంజయ = అర్జునునియొక్క, ఆయత = నిడుపు లయిన, భుజా = బాహువులచేత, సంరంభ = వేగముచేత,

సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమ♦శ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబులక్రియన్ ♦ రంజిల్లి యొప్పెం గడున్. 38

చ. తదవసరంబునన్ దొర లు♦దగ్రతఁ ద్రోచిన వజ్రఘట్టముల్
మదమున నొక్కపెట్ట బల♦మర్దనసూనురథంబు గ్రక్కునం
బొదివెఁ దురంగకింకిణుల♦భూరిరవంబుఁ గరీంద్రఘంటికా
భ్యుదితనినాదమున్ రథవ♦రోత్థితఘోషము నుత్కటంబుగన్. 39

గీ. అట్టియెడ వేల్పు వచ్చిన♦యట్లు మేను, వొంగ నలిరేఁగి పాండవ♦పుంగవుండు
మత్స్యనృపనందనునిబలు♦మాటతోడి, యేపు సెవికిని జూడ్కి కి♦ నింపునొసఁగ.

---

గాండీవ = గాండీవధనుస్సునుండి, నిర్ముక్త = విడువఁబడిన, క్రూర = భయంకరము లయిన, శర = బాణములయొక్క, ఆవలీ = సమూహముచేత, దళిత = చీల్పఁబడిన, శత్రువ్రాతముల్ = శత్రువుల సమూహములు. శోణితఆసిక్తఆకారతన్ = నెత్తురుచే నంతటను దడుపఁబడినయాకారములు గలవి యగుటను. సాంద్ర...క్రియన్—సాంద్ర = దట్టము లయిన, కుసుమ = పువ్వులయొక్క, శ్రేణీ= సమూహముయొక్క, వికాస = వికసించుటచేత, ఉల్లసత్ = ప్రకాశించుచున్న, రక్తఆశోకతరు = ఎఱ్ఱనియశోకవృక్షములయొక్క, వ్రజంబులక్రియన్ = సమూహములవలె. రంజిల్లి = ఎఱ్ఱవాఱి. కడున్ = మిక్కిలి. ఒప్పెన్.

తా.—అర్జునుఁడు గాండీవమునుండి ప్రయోగించినబాణములచే శత్రువులదేహములు గాయములై నెత్తుటం దడుపఁబడిన వగుటవలనఁ జక్కఁగా వికసించినపువ్వులు గల రక్తాశోకవృక్షముల వలెఁ బ్రకాశించెను. అలం. ఉపమ.

39. తత్అవసరంబునన్ = ఆసమయమునందు, ఉదగ్రతన్ = పరాక్రమము గలవా రగుట చేత. త్రోచినన్ = ఎదిరింపఁగా. వజ్రఘట్టముల్ = వజ్రసమూహములు, వానివంటి సైన్యము లనుట. ఒక్కపెట్టన్ = ఏకకాలమున. బలమర్దన సూనురథంబు = ఇంద్రునికుమారుఁ డయిన యర్జునుని తేరును. తురంగకింకిణుల భూరిరవంబున్ = గుఱ్ఱముల చిఱుగంటల గొప్పధ్వనియును. కరిఇంద్ర ఘంటికాఅభ్యుదితనినాదమున్ = గజశ్రేష్ఠముల గంటలవలనఁ బుట్టినమ్రోఁతయును. రథవరఉత్థిత ఘోషమున్ = శ్రేష్ఠము లయిన తేరులవలనఁ బుట్టినధ్వనియును. ఉత్కటంబుగన్ = అధికమగునట్లు. పొదివెన్ = చుట్టెను.

తా.—అప్పుడు రాజులు అర్జును నెదిరింపఁగా నుత్తమము లయిన సైన్యములు అర్జునునిరథము చుట్టు ముట్టెను. ఆసమయమున గుఱ్ఱములకుఁ గట్టిన చిఱుగంటలధ్వనియును, ఏనుఁగులకుఁ గట్టియున్న పెద్దగంటలశబ్దమును, రథములధ్వనియును అధికముగా వినవచ్చెను.

40. వేల్పువచ్చినఅట్లుల = దేవతయావేశించినట్లు. మేను = దేహము. పొంగన్. నలిరేఁగి=విజృంభించి. పాండవపుంగవుండు=పాండుపుత్త్రులయం దుత్తముఁ డయిన యర్జునుఁడు. మత్స్య నృపనందనునిబలుమాటతోడిఏపు = విరాటరాజుకుమారుఁ డయినయుత్తరునిగొప్పమాటతోఁ గూడిన విజృంభణము. ఇంపున్ = సంతోషమును. ఒసఁగన్ = కలిగింపఁగా.

క. మేదురదీర్ఘతరం బగు, నాదం బెడతెగక గుణము♦నను వడి నిగుడం
గోదండము సంతతవల, యోదాత్తస్ఫురణ వెలుఁగు♦చుండఁగ నేసెన్. 41

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడా♦త్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభా♦స్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోక మంతటను వి♦స్తీర్ణంబు లై యౌగప
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమా♦ర్తాండున్ విడంబించుచున్. 42

క. నరు లొరులు దృశ్యములపైఁ, బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు ♦ పడుఁ దప్పక య
ప్పరుసున నరుఁ డేయునిశిత, శరములు లక్ష్యములు దప్పి ♦ చన వించుకయున్.

---

తా.—అప్పుడు దేవత యావేశించిన ట్లుప్పొంగ యర్జునుఁడు విజృంభించినవాఁడై యుత్తరుఁడు శ్లాఘించుట తనచెవికిని అతనియుత్సాహము తనచూపునకును సంతోషము గలిగింపఁగా.

41. మేదురదీర్ఘతరంబు = దట్ట మయినదియు మిక్కిలి నిడుపైనదియు, అగునాదంబు = అయినధ్వని. గుణమునను = అల్లెత్రాటినుండి. నిగుడన్ = వ్యాపింపఁగా. కోదండము = ధనుస్సు. సంతతవలయోదాత్తస్ఫురణన్ = ఎడతెగని మండలముయొక్క గొప్పప్రకాశముచేత, మండలాకారముగా ననుట.

తా.—అల్లెత్రాటినుండి మహాధ్వని యెడతెగక మ్రోయుచుండునట్లును, ధనుస్సు ఎల్లప్పుడు మండలాకారముగా నుండునట్లును అర్జునుఁడు ఎడతెగక బాణములు ప్రయోగించెను.

42. ఒకమాత్రన్ = ఒకనిమిషమునందు, వితత.....సంతానముల్—వితత = అధిక మయిన, ప్రసార = వ్యాప్తికలవియును, నిబిడ = దట్టము లయినవియును, అతిఉగ్ర = మిక్కిలి భయంకరము లయినవియు నగు, అస్త్ర = బాణములయొక్క, సంతానముల్ = సమూహములు. సకలఅనీకములందున్ = ఎల్లసేనలయందును. పర్వన్ = వ్యాపింపఁగా. నరుభాస్వత్ మూర్తి = అర్జునిప్రకాశించుచున్నయాకారము. దీప్తికలాపంబులు = కిరణములసమూహములు. విస్తీర్ణంబులుఐ = పరవినవై. యౌగపద్యకృతవ్యాప్తిన్ = ఏకకాలమునందుఁ జేయఁబడినవ్యాప్తిచేత. వెలుంగన్ = ప్రకాశించుచుండఁగా. ఒప్పెసఁగుమార్తాండున్ = ప్రకాశించునట్టి సూర్యుని. విడంబించుచున్ = పోలుచు. శోభిల్లెన్ = ప్రకాశించెను.

తా.—ఏకకాలమునందే సేనలయం దంతటను బాణములు ప్రయోగించుచున్న యర్జునుఁడు ఏకకాలమునందుఁ గిరణములను భూమియం దంతటను వ్యాపింపఁజేయుసూర్యునివలెఁ బ్రకాశించెను.

43. నరులు = మనుష్యులు. ఒరులు = ఇతరులు. దృశ్యములపైన్ = లక్ష్యములమీఁద. పరఁగింపఁగన్ = నిగిడింపఁగా. చూడ్కులు = చూపులు. అప్పరుసునన్ = ఆవిధమున. నరుఁడు = అర్జునుఁడు. ఏయునిశితశరములు = ప్రయోగించునట్టి వాఁడిబాణములు. లక్ష్యములు = గురులను. ఇంచుకయున్ = కొంచెమైనను. తప్పి. చనవు = పోవు.

తా.—మనుష్యులు వస్తువులఁ జూచునపుడు వారిచూపులు ఆవస్తువులమీఁదఁ దప్పక పడునట్లు అర్జునుఁడు ప్రయోగించుబాణములు లక్ష్యములమీఁదఁ దప్పక పడుచుండెను.

క. గజఘోటకరథసూత, ధ్వజకంకటయోధగాత్ర ♦ తతియం దెచటన్
విజయధనుర్ముక్తశర, వ్రజములు దవులంగఁ బడక ♦ వారణ నిగుడున్. 44

చ. కవదొన లేల పూనె నొకొ ♦ కవ్వడి నా వల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నప ♦ సవ్యకరంబున మార్చి మార్చి గాం
డివము ధరింపఁగా శరప ♦ టిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి చూ
పు వెరవుతోన వీడ్వడక ♦ పొం దొడఁగూడెడు నెప్డు చూచినన్. 45

క. సమవిషమవినిమ్నోన్నత, సమీపదూరస్థలములు ♦ సదృశములు గఁ జి
త్తముక్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము ♦ చను నవితథమై. 46

---

44. గజ.....తతియందున్—గజ= ఏనుఁగులయొక్కయు, ఘోటక= గుఱ్ఱములయొక్కయు, రథ = తేరులయొక్కయు, సూత = సారథులయొక్కయు, ధ్వజ = టెక్కెములయొక్కయు, కంకట = కవచములయొక్కయు, యోధగాత్ర = భటులశరీరములయొక్కయు, తతియందున్ = సమూహమునందు. ఎచటన్ = ఏచోటనైనను. విజయధనుర్ముక్తశరవ్రజములు = అర్జునునివింటనుండి విడువఁబడినబాణములసమూహములు. తవులంగన్ పడక = చిక్కుపడక. అవారణన్ = అడ్డులేమిచేత. నిగుడున్ = వ్యాపించును.

తా.—అర్జునుఁడు ప్రయోగించినబాణములు ఏనుఁగులు గుఱ్ఱములు రథములు సారథులు ధ్వజములు కవచములు భటశరీరములు వీనిలో నెచ్చటఁ బ్రయోగింపఁబడునో దానిమీఁద నడ్డులేకపడుచుండెను.

45. కవ్వడి = అర్జునుఁడు. కవదొనలు = జంటయమ్ములపొదులను. ఏల. పూనెనుఒకో నాన్ వలదు = ఎందుకు ధరించినాఁ డని యనవలదు. ఉగ్రసంగరఉత్సవమునన్ = భయంకర మయిన యుద్ధము అను పండుగునందు. సవ్యపాణిన్ = ఎడమచేతను. అపసవ్యకరంబునన్ = కుడిచేతను. మార్చిమార్చి. గాండివము ధరింపఁగాన్. శరపటిష్ఠతయున్ = బాణములసామర్థ్యమును. పొరిన్ = క్రమముగా. చేయి. మార్చి. చూపువెరవుతోన్ అ = చూపుయొక్క యుపాయముతోనే. వీడ్వడక = తడఁబడక. పొందు = సౌకర్యము. ఎప్డు. చూచినన్. ఒడఁగూడెడున్ = కలుగును.

తా.—అర్జునుఁడు జంటయమ్ములపొదులను దాల్చుటకుఁ గారణము లే దన వలదు. అతఁడు యుద్ధమునందు మార్చి మార్చి యెడమచేతను గుడిచేతను గాండివమును ధరించునపుడు రెండుచేతులతోను మార్చిమార్చి సౌకర్యముగా బాణములు తీయుటకు రెండమ్ములపొదులును గావలసినవే.

46. సమ.....స్థలములు—సమ = సమ మయినవియు, విషమ = హెచ్చుతగ్గు లగునవియు, వినిమ్న = పల్లము లయినవియు, ఉన్నత = మిట్ట లయినవియు, సమీప = దగ్గఱ యయినవియు, దూర = దూరములు నగు, స్థలములు = చోటులు. సదృశములుగన్ = సమాన మగునట్లుగా. చిత్తముక్రియన్ = మనస్సువలె. క్రీడిరథము = అర్జునునితేరు. సమరమహిన్ = యుద్ధభూమియందు. అవిహతగతులను = అడ్డుపడనినడకలచేత. అవితథముఐ = వ్యర్థముకానిదై. చనున్ = పోవును.

తా.—అర్జునునితేరు సమవిషమాదిస్థలములయందుఁ గొంచెమైనను భేదము లేక మనస్సువలె అప్రతిహతముగా సంచరించెను.

వ. వెండియు నతండు. 47

మ. బల మెల్లన్ వెస రెండుపాయలుగ శుం♦భద్వేగుఁ డై చొచ్చి యా
వలగా నడ్డము వచ్చి నాలువుగ దు♦ర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీ♦లాయానదుర్దాంతుఁ డై
వలయంబుల్ సని చించి చిక్కుపఱిచెన్ ♦ వైకల్యసంపాది యై. 48

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబునఁ దదీయ
రథంబు కౌరవసైన్యంబునందు సంచరించునయ్యవసరంబున. 49

గీ. రత్నకేతనములు ♦ రాజితశేఖరం, బులును రుచిరఘంటి♦కలును బార్థ
బాణనిహతిఁ దునిసి♦ పడుఁ గౌరవులచేటు, దెలుప డుల్లు నుల్క♦ములునుబోలె. 50

క. నరుభల్లంబుల నగ్రిమ, చరణంబులు ద్రెస్సి మ్రొగ్గ♦ జవనాశ్వంబుల్
కరుణ మెయి రాహుతులకున్, శరణం బగు మనుచు మ్రొక్కు♦చందం బొందెన్.

---

48. బలము = సేన. వెసన్ = శీఘ్రముగా. శుంభత్ వేగుఁడువై = గొప్పవేగము గలవాఁడై. నాలువుగన్ = నాలుగుపాయ లగునట్లు. దుర్వారఉద్ధతిన్ = అడ్డగింపరానియతిశయముచేత. నానాశకలఆకృతిన్ = నానావిధము లయినఖండములయాకారమువంటి యాకారమును. పొరయన్ = పొందునట్లు. లీలాయానదుర్దాంతుఁడువై = విలాసముతోడి నడకచే నణఁపరానివాఁడై. వలయంబుల్ = మండలాకారములుగా. వైకల్యసంపాదివై = వికలత్వమును గలిగించువాఁడై. చించి. చిక్కుపఱిచెన్.

తా.—అర్జునుఁడు సేన యంతయు రెండుభాగము లగునట్లు నడుమఁ దనరథమును బోనిచ్చి యటువెనుక నాలుగుభాగము లగునట్లు అడ్డముగాఁ బోయి యావలఁ జిన్నచిన్నఖండము లగునట్లు మూలమూలను మండలాకారముగాఁ జొచ్చి సేనయంతయు విచ్చిపోవునట్లు చిక్కుపఱిచెను.

49. అంబుధిలోనన్ = సముద్రమునందు. విహరించుచందంబునన్ = తిరుగునట్లు. తదీయరథంబు = ఆయర్జునునిదైనతేరు. సంచరించుఅయ్యవసరంబునన్ = తిరుగునప్పుడు.

50. రత్నకేతనములున్ = రత్నాలటెక్కెములును. రాజితశేఖరంబులును = ప్రకాశించుచున్నకిరీటములును. రుచిరఘంటికలును = కాంతిగలగంటలును. పార్థబాణనిహతిన్ = అర్జునునిబాణములదెబ్బచేత. తునిసి = తెగి. డుల్లుఉల్కములునుబోలెన్ = పడునట్టి కొఱవులో యనునట్లు. పడెన్. ఉల్కములు—రూ. ఉల్కలు, "కంఠరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" అని బాలవ్యాకరణసూత్రము.

తా.—అర్జునునిబాణములదెబ్బలచే రత్నమయము లయినటెక్కెములును గిరీటములును గంటలును దెగి కౌరవులనాశమును దెలుపుటకై కొఱవులుపడుచున్నవో యనునట్లు పడెను. అలం. ఉత్ప్రేక్ష.

51. నరుభల్లంబులన్ = అర్జునునిబాణములచేత. అగ్రిమచరణంబులు = ముందటికాళ్ళు. ద్రెస్సి = తెగి. మ్రొగ్గుజవనఅశ్వంబుల్ = ముందరికిఁ బడునట్టి వడిగలగుఱ్ఱములు. కరుణమెయిన్ = దయచేత. రాహుతులకున్ = రౌతులకు. శరణంబు = రక్షకుఁడవు. అనుచున్. మ్రొక్కుచందంబు = మ్రొక్కునట్టివిధమును. ఒందెన్. అలం. ఉత్ప్రేక్ష.

క. దంతిఘటాసంతానము, కుంతీసుతునారసములఁ ♦ గూలినతతిఁ ద
త్యంతనిబిడాభ్రముల దివి, యెంతయు సొంపారుభంగి ♦ నిల చెలువొందెన్. 52

క. వలుపులుఁ గాఁడులుఁ బగ్గం, బులుఁ దనయస్త్రంబు లడరి ♦ పొడిసేసిన వి
చ్చలవిడిఁ బాటెమరథ్యం, బుల నేయఁడు దివిజరాజ♦పుత్రుఁడు కృపతోన్. 53

గీ. అర్జునాస్త్రఖండి♦తాతపత్రధ్వజ, చామరములు గాలిఁ ♦ జదలఁ దూలఁ
జిహ్నములవిభూతిఁ ♦ జెందంగఁ గని యొప్పె, నప్పు డాడుచున్న♦యట్ట లచట. 54

క. ఒకమరి కిరీటికట్టెది, రికి నతిముతిఁ బోయి రేని ♦ రెండవమా టి
య్యకొనుట కోర్వఁగ లేరై, రొకళ్ళుఁ గురురాజసేన ♦ యోధులలోనన్. 55

---

తా.—అర్జునిబాణములచే ముందరికాళ్లు తెగి ముందరికిఁ బడుచున్నగుఱ్ఱములు దయ యుంచి మారౌతులను రక్షింపు మని యర్జునునకు మ్రొక్కుచున్నవో యనున ట్లుండెను.

52. దంతిఘటాసంతానము = ఏనుఁగులగుంపుల సమూహము. కుంతీసుతునారసములన్ = అర్జునుని బాణములచేత. కూలినతతిన్ = పడినప్పుడు. ఇల = భూమి. అత్యంతనిబిడఅభ్రములన్= మిక్కిలి దట్టము లయిన మేఘములచేత. దివి = ఆకాశము. ఎంతయున్ = మిక్కిలి. సొంపారుభంగిన్ = ప్రకాశించునట్లు. చెలువొందెన్ = ప్రకాశించెను.

తా.—అర్జునిబాణములచేఁ గూలిన యేనుఁగులచేఁ గప్పఁబడినభూమి మేఘములచేఁ గప్పఁబడిన యాకాశమువలె నుండెను. అలం. ఉపమ.

53. తనఅస్త్రంబులు = తనబాణములు. విచ్చలవిడిన్ = స్వేచ్ఛగా. పాటెమరథ్యంబులన్ = పరుగెత్తుగుఱ్ఱములను. దివిజరాజపుత్రుఁడు = ఇంద్రుని కుమారుఁ డయిన యర్జునుఁడు. కృపతోన్ = దయతో. ఏయఁడు = కొట్టఁడు.

తా.—తనబాణములచేఁ బలుపులు మొదలయినవి తెగి విచ్చలవిడిగాఁ బరువిడుగుఱ్ఱముల నర్జునుఁడు కనికరముచే సంహరింపఁడు.

54. అర్జునఅస్త్రఖండిత ఆతపత్ర ధ్వజచామరములు = అర్జునుని బాణములచే నఱకఁబడిన గొడుగులును టెక్కెములును వింజామరలును. గాలిన్. చదలన్ = ఆకాశమునందు. తూలన్ = ఎగురఁగా. అప్పుడు. అచటన్. ఆడుచున్నఅట్టలు = ఆడుచున్న మొండెములు. చిహ్నములవిభూతిన్ = రాజచిహ్నముల సంపదను. చెందంగన్ = పొందుటను. కని. ఒప్పెన్.

తా.—అర్జునుఁడు ఖండించిన గొడుగులును టెక్కెములును వింజామరలును గాలి కాకాశమున కెగురఁగా నచటఁ దలలు తెగి యాడుచున్న మొండెములు వానిని రాజచిహ్నములుగాఁ బొంది ప్రకాశించెను.

55. కిరీటికట్టెదిరికిన్ = అర్జునుని యెట్టయెదుటికి. అతిముతిన్ = ఉత్సాహముతో. కురురాజసేనయోధులలోనన్ = దుర్యోధనుని సేనయందలి భటులలోపల. ఒకళ్ళున్ = ఒకరును. రెండవమాట. ఇయ్యకొనఁగన్ = ఒప్పుకొనుటకు. ఓర్వఁగన్. లేరు వీరి.

తా.—దుర్యోధనునిసేనయం దెవ్వరును ఒకమా అర్జుననియెదుటికిఁ బోయినవారు మరల వానియెదుటికిఁ బోఁజాలక పోయిరి.

సీ. మండితధ్వజదండ♦మండలంబులఁ గిట్టి, విటతాటనంబుగా ♦ విఱిచి విఱిచి
చటులఖురోద్భటా♦శ్వశ్రేణిఁ బొదివి ర, యంబునఁ దునిమి తూఁ♦టాడి యాడి
రాజితబహువిధ♦రథసమూహముఁ జొచ్చి, గజిబిజి యగునట్లు ♦ గలఁచి కలఁచి
మదభరభీషణ♦మాతంగముల ముట్టి, చిందఱవందఱ ♦ చేసి చేసి
పటుపదాతిచయము♦పై రౌద్రరసమహో, గ్రముగ నడరి నేలఁ ♦ జమరి చమరి
సవ్యసాచిబాణ♦సంఘంబు మత్తశుం, డాలఘోరలీలఁ ♦ గేళి సలిపె. 56

ఉ. శిక్షితచిత్రసంగరవి♦శేషములం బ్రతిహేతిఖండనా
దక్షతపెంపుసొంపునను ♦ దైవబలంబున నత్తఱిన్ సహ
స్రాక్షతనూజసారథిర♦థాశ్వచయధ్వజముల్ పరాస్త్రిశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురు♦సైన్యము వెక్కస మంది బెగ్గిలన్. 57

---

56. మండితధ్వజదండమండలంబులన్ = ప్రకాశించుచున్న టెక్కెముల స్తంభముల సమూహములను. కిట్టి = తాఁకి. విటతాటనంబుగన్ = తాఱుమాఱుగా. చటులఖురఉద్భటఅశ్వశ్రేణిన్ = చలించుచున్న గిట్టలచే భయంకరము లయిన గుఱ్ఱముల సమూహమును. పొదివి = చుట్టి. రయంబునన్ = వేగముగా. తునిమి = ఖండించి. రాజితబహువిధరథసమూహమున్ = ప్రకాశించుచున్న పెక్కువిధము లగు తేరుల సమూహమును. గజిబిజి = నలఁగినవి. మదభరభీషణ మాతంగములన్ = మదముయొక్క యతిశయముచే భయంకరము లయిన యేనుఁగులను. పటుపదాతిచయముపైన్ = సమర్థు లగు కాల్బౌగసమూహముమీఁద. రౌద్రరసమహత్ ఉగ్రముగన్ = రౌద్రరసముచే మిక్కిలి భయంకర మగునట్లు. అడరి = విజృంభించి. చమరిచమరి = ఱాచిఱాచి. సవ్యసాచిబాణసంఘంబు = అర్జునుని బాణములసమూహము. మత్తశుండాలఘోరలీలన్ = మదించిన యేనుఁగుయొక్క భయంకర మయిన విలాసమువంటి విలాసముచేత. కేళి = క్రీడను. చలిపెన్.

తా.—అర్జునునిబాణములసమూహము యుద్ధరంగమునందు ధ్వజస్తంభములను విఱిచియు, గుఱ్ఱములఁ జంపియు, రథముల నలఁగఁగొట్టియు, నేనుఁగుల ఖండించియు, కాల్బలముల నేలకు ఱాచియు మదపుటేనుఁగువలె విహరించెను.

57. శిక్షితచిత్రసంగరవిశేషములన్ = నేర్చిన వింతలయిన యుద్ధముయొక్క భేదములయందు. ప్రతిహేతిఖండనాదక్షతపెంపుసొంపునను = శత్రువుయొక్క యాయుధములయొక్క ఖండించుటయందలి నేర్పుయొక్క యతిశయముయొక్క యందముచేతను. దైవబలంబునన్ = దైవబలముచేతను. పరఅస్త్రిశస్త్రిక్షతి = శత్రువులయొక్క బాణములచేతను ఆయుధములచేతను గాయము. లేక. కురుసైన్యము. వెక్కసము = దుస్సహత్వమును. బెగ్గిలన్ = భయపడునట్లు. ఒప్పెన్. పాఠాం:—నివ్వెఱఁగంది = మిక్కిలి నిశ్చేష్టత నొంది యని యర్థము.

తా.—అప్పుడు నానావిధము లయిన యుద్ధములయందును అర్జునుఁడు శత్రువులు ప్రయోగించు నాయుధములను మీఁదికి రాకుండునట్లు ఖండించుచుండుటవలనను, దైవబలంబువలనను, అర్జునుని సారథికిని రథమునకును గుఱ్ఱములకును ధ్వజమునకును గొంచెమైనను శత్రువులయాయుధములు తగులక యుండెను.

క. తేజోధనుఁ డగునరుఁ డు, ద్భ్రాజితగతి నడుము మెఱసి ♦ బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు, నోజం గురుబలము పేర్చి ♦ యుడిపెం దోడ్తోన్. 58

గీ. కాలపక్వంబు లైనలో ♦ కముల జముఁడు, బారిసమరెడుచాడ్పున ♦ మారి మసఁగి
యుగ్రరూపుఁ డై శౌర్యస ♦ ముగ్రబాహు, సంపదుద్దాముఁ డగుక్రీడి ♦ సంపె రిపుల.

వ. అట్టియెడ మున్ను తురంగమఖురాదులం దూలినకెందూళియుం, బైపయి నెగయు పరబలంబునెత్తుట జొత్తిల్లుచు నుచ్చి చనువివ్వచ్చునిశితశరపరంపరలును, సైనిక నికర శరీరంబులపై సుడిసి తడిసి రుధిరశీకరవికిరణపరిణతం బగుసమీరణంబును, ధారాళకరాళరక్తపరిషిక్తవిశ్వంభరాభాగంబునుం గలయంగెంపు సంపాదించి యకాలసంధ్యనావహించినం దనుచితవ్యాపారపారంగతంబులై పొడచూపినయుడు

---

58. తేజోధనుఁడు = ప్రతాపమే ధనముగాఁ గలవాఁడు. కాంతియే ధనముగాఁ గలది యని బడబాగ్నిపక్షమున నర్థము. అగునరుఁడు = అయిన యర్జునుఁడు. ఉత్ భ్రాజితగతిన్ = మిక్కిలి ప్రకాశించుచున్నగమనముచేత. బడబాగ్ని. దళంబై = అధికమై. జలనిధిన్ = సముద్రమును. త్రెక్కొనియెడు ఓజన్ = త్రాగునట్టివిధమున. కురుబలము పేర్చి = కౌరవసైన్యముయొక్క యతిశయమును. తోడ్తోన్ = వెంటనే. ఉడిపెన్ = పోఁగొట్టెను.

తా.—బడబాగ్ని సముద్రమధ్యమునుండి నీరుత్రాగి సముద్రవేగము నణంచునట్లు అర్జునుఁడు కురుసేన నడుమఁ జేరి దాని గర్వము నణఁచెను.

59. జముఁడు = యముఁడు. కాలపక్వంబులు = కాలముచేఁ బండినవి, చావునకు సమీపించినవి యనుట. ఐనలోకములన్ = అయినజనములను. బారిసమరెడుచాడ్పునన్ = చంపువిధమున. ఉగ్రరూపుఁడువై = భయంకర మయిన యాకారము గలవాఁడై. శౌర్యసముగ్రబాహుసంపత్ ఉద్దాముఁడు = శౌర్యముచే నిండిన బాహువులసంపదచే నధికుఁడు. అగుక్రీడి = అయినయర్జునుఁడు. రిపులన్ = శత్రువులను. చంపెన్.

తా.—ప్రళయకాలమునందు మృత్యువు లోకములఁ జంపునట్లు అర్జునుఁడు కురుసైన్యములఁ జంపెను.

60. తురంగమఖురఆదులన్ = గుఱ్ఱములగిట్టలు మొదలగువానిచేత. తూలిన ♦ కెందూళియున్ = ఎగిరిన ఎఱ్ఱనిదుమ్మును. పైపైన్ = మీఁదుమీఁదుగా. నెగయుపరబలంబునెత్తుటన్ = ఎగురునట్టి శత్రుసేనలనెత్తురుచేత. జొత్తిల్లుచున్ = ఎఱ్ఱవాఱుచు. ఉచ్చి = తూఱి. చనువివ్వచ్చునిశితశరపరంపరలును = పోవునట్టి యర్జునునియొక్క వాఁడిబాణములవరుసలును. సైనికనికరశరీరంబులపైన్ = సేనాజనుల సమూహముయొక్క దేహములమీఁద. సుడిసి = వ్యాపించి. రుధిరశీకరవికిరణపరిణతంబు = నెత్తురుతుంపురుల వెదచల్లుటయందు సమర్థ మయినది. పాఠాం:—రుధిరశీకరనికరవికీర్ణరవికిరణ పరిణతంబు = నెత్తురుతుంపురులసమూహముచే వ్యాపింపఁబడినదై సూర్యునికిరణములవలెఁ బరిణమించినది యని యర్థము. అగుసమీరణంబును = అయినగాలియును. ధారాళకరాళరక్తపరిషిక్తవిశ్వంభరాభాగంబునున్ = ధారలుగల భయంకర మయిననెత్తుటిచే నంతటను దడుపఁబడినభూప్రదేశమును. కలయన్ = అంతటను. కెంపు = ఎఱ్ఱఁదనమును. సంపాదించి = కలిగించి. అకాలసంధ్యన్ = అకాలమునందలి సంధ్యను. ఆవ

గణంబులుంబోలెఁ బొలుచు ధనంజయసాయకదళితకుంజరకుంభవికీర్ణమౌక్తికవిసరంబులవలనను; సముదీర్ణమదవేగదుర్నివారవారణవిదారణంబు లగు నర్జునాస్త్రపాతంబుల బెదరి తేంట్లెగయుట పొగ లెగయుటయుం బ్రతిభటబాణఘట్టనంబునం బాండవమధ్యమకాండప్రకాండంబుల నిబిడజ్వాలలు నిగుడుట మంటయునుగా, మూర్తం బగుతదీయక్రోధదవానలంబు ఛటచ్ఛటాశబ్దంబులచాడ్పునం జెలంగుచున్న యుధిష్ఠిరానుజనిష్ఠురభల్లభజ్యమానబలవదరాతిఖరాస్థినిస్వనంబులవలనను;

---

హించినన్=కలిగింపఁగా. తత్ ఉచితవ్యాపారపారంగతంబులువి = ఆయకాలసంధ్యకుఁ దగినవ్యాపారమునందుసమర్థములై. పొడచూపినఉడుగణంబులుంబోలెన్ = ఉదయించిన నక్షత్రములసమూహమువలె. పొలుచు...విసరంబులవలనను—పొలుచు= ప్రకాశించుచున్న, ధనంజయ= అర్జునునియొక్క, సాయక =బాణములచేత, దళిత = నఱకఁబడిన, కుంజర = ఏనుఁగులయొక్క, కుంభ = కుంభస్థలములవలన, వికీర్ణ = రాలిన, మౌక్తికవిసరంబులవలనను = ముత్యాలసమూహములవలనను.

తా.—గుఱ్ఱములత్రొక్కుళ్లచే లేచిన యెఱ్ఱనిదుమ్మును, నెత్తుటిచేఁ గప్పఁబడిన యర్జునునిబాణములును, సైనికులశరీరమునందలి నెత్తుటితుంపురలను జల్లుచు వీచెడి వాయువును, నెత్తుటిచేఁ దడిసి యెఱ్ఱనైనయుద్ధభూమియును, చేరి యాకాశము నెఱ్ఱగాఁ జేసి యకాలసంధ్య కలుగునట్లు చేయఁగా నందుకుఁ దగిన ట్లుదయించిననక్షత్రములో యనునట్లు అర్జునునిబాణములచే నఱకఁబడినయేనుఁగుల కుంభస్థలములనుండి రాలినముత్యములు ప్రకాశించెను.

సముదీర్ణ.....విదారణంబులు—సముదీర్ణ = మిక్కిలి యతిశయించిన, మదవేగ = మదాతిశయముచేత, దుర్నివార = అడ్డగింపరాని, వారణ = ఏనుఁగులయొక్క, విదారణంబులు = భేదించునవి. అగు అర్జునఅస్త్రపాతంబులన్ = అయినట్టి యర్జునుని బాణములపడుటలచేత. తేంట్లు = తుమ్మెదలు. ప్రతిభటబాణఘట్టనంబునన్ = శత్రువులబాణములయొరయికచేత. పాండవమధ్యమకాండప్రకాండంబులన్ = అర్జునునియొక్క బాణశ్రేష్ఠములయందు. నిబిడజ్వాలలు = దట్టమయిన మంటలు. నిగుడుట = వ్యాపించుట. మూర్తంబు = ఆకారము గలది. అగు తదీయక్రోధదవానలంబుఛటచ్ఛటాశబ్దంబులచాడ్పునన్ = అయినట్టి యాయర్జునునికోపము అను కార్చిచ్చుయొక్క చిటచిట యను ధ్వనులవలె. చెలంగుచున్ = మ్రోయుచు. ఉన్న.....నిస్వనంబులవలనను—ఉన్న = ఉన్నట్టి, * యుధిష్ఠిరఅనుజ=ధర్మరాజుతమ్ముఁ డయిన యర్జునునియొక్క, నిష్ఠుర = కఱకు లయిన, భల్ల = బాణములచేత, భజ్యమాన = విఱువఁబడుచున్న, బలవత్ = బలవంతు లగు, అరాతి = శత్రువులయొక్క, ఖర = కఠినము లయిన, అస్థి = ఎముకలయొక్క, నిస్వనంబులవలనను = ధ్వనులవలనను.

తా.—మదపుటేనుఁగుల భంజించునట్టి యర్జునునిబాణములకు భయపడి యెగురునట్టి తుమ్మెదలు పొగలుగాను, శత్రుబాణముల యొరయికవలన నర్జునునిబాణములయందుఁ గలుగుమంటలు మంటలుగాను, గల యర్జునునికోపము అను కార్చిచ్చుయొక్క ఛటచ్ఛటాధ్వనులో యనునట్లు అర్జునునిబాణములచేఁ బగుల్పఁబడుశత్రువులయెముకలధ్వనులు చెలంగెను.

ఎడనెడన్ = అచ్చటచ్చట. తొట్టితొట్టి=ప్రవహించిప్రవహించి. మడువులుగట్టుశోణితంబు= మడుఁగు లగుచున్న నెత్తురు. వెలిగొడుగులు = తెల్లనిగొడుగులు. పుండరీకంబులును = తెల్లతామర

తొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టుశోణితంబు నీళ్లు సందుఁ బడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును వింజామరలు మరాళపుంజంబును నై కొలంకులచందంబు నొంద వాని కరిగెడుకొదమతుమ్మెదపదువులపగిదిఁ దొరఁగు నాఖండలతనయఖండితపరవీరకాలాయసనారాచశకలంబులవలనను; కిరీటిశరపాటవపరిస్ఫోటితరిపుకపాలగళితమస్తిష్క పలలపంకంబునను, నలుదెసల నంతంతఁ గదియం జాఁగి పడి యున్న కృత్తచరణంబులను, వెడపడనికి రొంపి గలంచి వరుజులు పదిలంబుగా నమర్చినకేదారంబు తెఱంగు దోఁచుటకు నీడై చతురహాలికుండు సల్లుపరువంపుమొలకలచెలువునఁ జెల్లు డుల్లుఫల్గునాశుగసంతాడనవికీర్ణశత్రు

---

లును. వింజామరలు = తెల్లనిచామరములు. మరాళపుంజంబును నై = హంసలసమూహమునై. కొలంకుచందంబు = కొలనియొక్కవిధముయొక్కవిధమును. ఒందన్ = పొందఁగా. దీనికిఁ గర్త సంగ్రామంబు. ( దానికిన్=ఆకొలంకునకు. అరిగెడుకొదమతుమ్మెదపదువులపగిదిన్ = పోవునట్టి కోడెతుమ్మెదలసమూహములవలె. తొరఁగు...శకలంబులవలనను—తొరఁగు= పడుచున్న, ఆఖండలతనయ = ఇంద్రునికుమారుఁ డయినయర్జునునిచేత, ఖండిత = నఱకఁబడిన, పరవీర = శత్రుశూరులయొక్క, కాలాయస =కారినుముతోఁ జేయఁబడిన, నారాచ = బాణములయొక్క, శకలంబులవలనను = ముక్కలవలనను.

తా.—నెత్తురుమడుఁగులు నీళ్లుగాను, తెల్లగొడుగులు తెల్లతామరలుగాను, వింజామరలు హంసలుగాను గలిగి యుద్ధరంగము కొలనువలె నుండఁగా నర్జునునిచే నఱకఁబడినశత్రువుల యినుపబాణములతునక లాకొలనికిఁ బోవు కొదమతుమ్మెదలవలె నుండెను.

కిరీటి.....పంకంబునను—కిరీటి = అర్జునునియొక్క, శర = బాణములయందలి, పాటవ = బలిమిచేత, పరిస్ఫోటిత = పగుల్పఁబడిన, రిపుకపాల = శత్రువులపుఱ్ఱెలవలన, గళిత = పడిన, మస్తిష్క-పలలపంకంబునను= మెదడుమాంసముల బురదచేతను. నలుదెసలన్ = నాలుగుదిక్కులయందును. కదియన్=తాఁకునట్లు. చాఁగి=దీర్ఘముగా. ఈ కృత్తచరణంబులవలనను=నఱకఁబడిన పాదములచేతను. వెదపదనికిన్=విత్తనములు చల్లుసమయమునకు. రొంపి = బురదను. కలంచి= కలియఁబెట్టి. వరుజులు = గనిమలను. పదిలంబుగాన్ = భద్రముగా. అమర్చినకేదారంబు తెఱంగు = అమర్చినట్టి వరిమడియొక్కవిధము. ఈడై = తగినదై. (కర్త సంగ్రామంబు). చతురహాలికుండు = నేర్పరి యగుకాఁపు. చల్లుపరువంపుమొలకలచెలువునన్ = చల్లినట్టి మండెపోసినవిత్తనములవలె. జెల్లు = మిక్కిలి. డుల్లు......వ్రజంబులవలనను—డుల్లు = పడునట్టి, ఫల్గున = అర్జునునియొక్క, ఆశుగ = బాణములచేత, సంతాడన = కొట్టుటలచేత, వికీర్ణ = రాలిన, శత్రుశేఖరవజ్ర = శత్రువులకిరీటములందలి రవలయొక్క, వ్రజంబులవలనను = సమూహములవలనను.

తా.—అర్జునునిచేఁ బగులఁగొట్టఁబడినశత్రువులపుఱ్ఱెలనుండి పడు మెదడురాశి రొంపివలెను, అతనిచే నఱకఁబడినసైనికులకాళ్లు గనిమలవలెను, నుండుటచే యుద్ధభూమి విత్తుటకు రొంపి చేసి గనిమలమర్చిన వరిమడివలె నుండఁగా నర్జునునిబాణములు తగిలి రాలునట్టి శత్రుకిరీటంబులవజ్రములు సేద్యగాఁడు మొలకపోసి చల్లువిత్తనములో యనునట్లుండెను.

శేఖరవజ్రవ్రజంబులవలనను; సంగ్రామం బభిరామం బయ్యును ఘోరప్రకారం
బయ్యె నమ్మహాభయంకరసంకులసమరంబున. 60

చ. ఉఱక విరోధిసైన్యముల ♦ నుక్కడఁగంగ నుల్లసద్గతిం
బఱప రథద్విపాశ్వములు ♦ పాండవమధ్యము తేరివీథియం

సంగ్రామంబు = యుద్ధము. అభిరామంబు = మనోహరము. ఘోరంబు = భయంకరము. అమ్మహత్ భయంకర సంకులసమరంబునన్ = అట్టి మిక్కిలిభయము గలిగించు దొమ్మియుద్ధమునందు.

♦ కెందూళియుం బైపయి నెగయన్ అనుపాఠము అసమాపకక్రియకు ననన్వయంబువలనను సముచ్చయమున కౌనర్థక్యమువలనను ఆదరణీయము గాదు.

§ విశ్వంభరాభాగంబునన్ అను సప్తమ్యంత పాఠమునందు, విశ్వంభరాభాగము ధారాళక రాళరక్తపరిషిక్తమయి యుండుటంజేసి దానియందుఁ గెంపు సంపాదించుటకు నెత్తుట జొత్తిల్లిన నిశిత శరపరంపరలు మొదలగునవి యనపేక్షితము లగును. రక్తపరిషిక్తవిశ్వంభరాభాగంబునన్ సంగ్రామం బున నకాలసంధ్య నావహించునదియని రక్తపరిషిక్తేతివిశేషణ సామర్థ్యాపరిహారమునకై యన్వయించుట యనవద్యమగుటవలనం బ్రథమాంతపాఠమే ప్రశస్తము.

* యుధిష్ఠిరానుజనతి నిష్ఠురేత్యాదిపాఠము తత్పురుషసమాస పూర్వపదమయినయతినిష్ఠురభ ల్లశబ్దమునకు తత్సమాస బహిర్భూతమయిన యుధిష్ఠిరానుజశబ్దముతో నన్వయము ఘటిల్లమి బలవంత మయిన యేకదేశాన్వయదోషము నావహించుటంజేసి పరిహరణీయము. సాధ్యసమాసము ఆంధ్రికల్పి తము కావున సాంస్కృతికతత్పురుషసమాసమునకు బహిర్భూతమే యగును. ధనంజయసాయక అర్జు నాస్త్రపాత అని ముందటను, ఆఖండలతనయఖండిత, కిరీటి శరపాటన, ఫల్గునాశుగ యని వెనుకను సమాసమే సమాదృతమగుటవలన సమాసపాఠమె కవిసమ్మత మని తెలియుచున్నది, ఇట్లు పాండవమ ధ్యము కాండప్రకాండంబులయనుటకన్నను పాండవమధ్యమకాండప్రకాండంబుల యని సిద్ధసమాసపా ఠమె సముచితము.

| వానికరిగాడు కొదమతుమ్మెదపదువులపగిదిన్ అన్నచో, వానికిన్ అను బహువచనాంతము కొలంకును బోధింపను. పుండరీకంబులను బోధింమనను నెడ, అప్పుడు తత్సహపతితములయిన నీళ్ళను మరాళపుంజంబునుగూడ బోధింపవలెను. అవి కొదమతుమ్మెదపదువుల కరుగంద్రగినవి కావు. అందువ లన బహువచనపాఠము యుక్తము గాదు.

$ కృత్తకరచరణంబులను = నఱకఁబడిన చేతులచేతను పాదములచేతను అని యర్థము. ప్రాణ్యంగములకు ఏకవద్భావము నియతమగుటచేఁ గృత్తకరచరణంబునను అని యుండవలయు.

61. ఉఱక = లక్ష్యముసేయక. విరోధిసైన్యములన్ = శత్రుసేనలను. ఉక్కడఁగఁగన్ = బలము చెడునట్లు. ఉల్లసత్ గతిన్ = ప్రకాశించుచున్ననడకచేత. పఱపన్ = తోలఁగా. పాండవ మధ్యము తేరివీథియందున్ = అర్జునునిరథముదారియందు. రథద్విపఅశ్వములు = తేరులును ఏనుఁగు లును గుఱ్ఱములును, కృతసమాస మయినద్విపాశ్వశబ్దముతో రథశబ్దమునకు సమాసము చేసి బహు వచనము ఉపపాదనీయము. అఱవఱలువి = శిథిలములై. పడన్ = పడుచుండుటను. కని= చూచి. ఇక్కడన్ = ఈదిక్కునకు. అత్తెఱఁగువి = అవిధమై. పోముచె = పోవమా? పోవుదము మనుట. ఎడతెంపిగన్ = దూరముగా. పాయఁబాఱఁగన్ = విచ్చిపోఁగా.

దఱి... లై పడం గని భయంపడి యిద్దెస వచ్చెనేని న
ఁగయి పోమె యంచు నెడఁ దెంపిగఁ గొందఱు వాయఁబాఱఁగన్. 61

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలుభటులఁ జూచి యెడలు ♦ వడఁకఁగ మేనుల్
దూలఁగఁ దముఁ దాఁకకయును, నాలము సాలించి కొంద ♦ ఱవలఁ జనంగన్.

గీ. ప్రొద్దు గ్రుంకిన మఱి కాని ♦ పోనఁడొక్కొ, క్రీడి యని కొంద ఱాజికి♦నీడఁబోవ
బలమునెల్లను దెగటాఱఁ♦బఱపి కాని, తక్కఁడెట్టులు ననుచుఁ గొంఁ♦దఱు చలింప.

క. తరతరమ ప్రజలఁ దునిమెడు, నరునప్పటియెత్తికోలు♦నకు సురవిద్యా
ధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి ♦ పుట్టునొ యనుచున్. 64

క. తమతమయొద్దిబలంబులు, క్రమవిరళము లైన నొరలు ♦ గాండివిపై ను

తా.—అర్జునుఁడు సేనలమీఁదికి రథము తోలింపఁగా నతని తేరిమార్గమునందుఁ దేరులు మొద లగునవి చూర్ణములై పోవుటను జూచి తమమీఁది కర్జునుఁడు వచ్చినయెడఁ దాముకూడ నట్లే యగుదుమని కొందఱు సైనికులు భయపడి దూరముగాఁ దొలఁగిరి.

62. వాలమ్ములు = వాఁడిబాణములు. తాఁకి=తగిలి. ధరన్=నేలయందు. వ్రాలుభటులన్ = పడునట్టిశూరులను. ఎడలు = మనస్సులు. మేనుల్ = దేహములు. తూలఁగన్ = వడఁకఁగా. తమున్ = తమ్ము. తాఁకకయును = ఎదుర్కొనకపోయినను. ఆలము = యుద్ధమును. చాలించి. అవలన్ = అవతలివైపునకు. చనంగన్ = పోఁగా.

తా.—కొందఱు భటు లర్జునునిబాణములు తగిలి క్రిందఁ బడుటను జూచి మఱికొంద ఱర్జునుఁడు తమమీఁదికి రాక పోయినను భయపడి యుద్ధము విడిచి పోయిరి.

63. క్రీడి = అర్జునుఁడు. ప్రొద్దు = సూర్యుఁడు. గ్రుంకినన్ కాని = అస్తమించిననే గాని. ఆజికిన్ = యుద్ధమునకు. ఈడఁబోవన్ = వెనుదీయఁగా. బలము = సేనను. తెగటాఱన్ = చచ్చునట్లు. పఱపికాని = బాధించియే కాని. తక్కఁడు = తప్పఁడు. చలింపన్ = భయపడఁగా.

తా.—కొంద ఱర్జునుఁడు సూర్యుఁ డస్తమించిననే కాని పోవఁ డని యుద్ధమునకు వెనుదీసిరి. మఱికొందఱు సైన్యము నంతయుం జంపిననే కాని పోవఁ డని భయపడిరి.

64. తరతరముల = వరుసపెట్టియే. ప్రజలన్ = జనులను. తునిమెడునరుఅప్పటిఎత్తికోలునకున్ = నఱకునట్టి యర్జునునియప్పటిపూనికకు. సురవిద్యాధరఖేచరులును = దేవతలును విద్యాధరులును గంధర్వులును. తమదెసకున్ = తమదిక్కునకు. భీతిన్ = భయమును. పొరసిరి = పొందిరి.

తా.—అర్జునుఁడు వరుసపెట్టి జనులను చంపుటనుజూచి దేవతలు మొదలగువారు తమ్ముఁగూడఁ జంపునేమో యని భయపడిరి.

65. తమతమయొద్దిబలంబు = తమతమయొద్దనుండుసేనలు. క్రమవిరళములు = క్రమముగాఁ దగ్గినవి. ఐనన్ = కాఁగా. గాండివిపైన్ = అర్జుననిమీఁదికి. ఉగ్రముగన్ = భయంకరముగా. తఱుమటయున్ = కవియఁగా. అతఁడు = ఆయర్జునుఁడు. సమరఉల్లాసమునన్ = యుద్ధమునందలి సంతోషముచేత. దివ్యశరతత్పరుఁడువై = శ్రేష్ఠము లయిన బాణములయం దాసక్తి గలవాఁడై.

గ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున దివ్య♦శరతత్పరుఁ డై. 65

సీ. ఆచార్యు డెబ్బది♦యమ్ముల నాచార్య, పుత్రు నేడింటఁ గృ♦పునిఁ బదింట
దుష్ప్రహుఁ బండ్రెంట ♦ దుశ్శాసనునిఁ బది, యేనింట సౌబలు ♦ నెన్మిదింట
నమరనదీసూను ♦ నఱువదింటను నేసి, రవిసుతురథ్యసా♦రథుల నొంచి
వర్మమంతయుఁ ద్రుంచి ♦ వైచి మర్మాస్థిబం, ధములు భేదించి వి♦క్రమము నెఱపి
యిట్లు దొరలు నొవ్వ ♦ నేడ్తెఱఁ దనచేతి, కోలఁది సూపి క్రీడి ♦ సెలఁగి దేవ
దత్త మొత్తుటయును ♦ దత్సైన్యములు సెడ, విఱిగి పాఱె భీష్ము♦మఱువు సొచ్చె.

క. గాంగేయుఁ డవష్టంభో, త్తుంగతనుం డగుచు నిట్లు ♦ దూలినకురుసే
నాంగంబులఁ బురికొలిపి సు, సంగతములు సేసె సమర ♦ సమ్ముఖములుగాన్. 67

వ. ఇట్లు భగ్నబలసమాశ్వాసనోద్భాసి యగు భీష్మభుజబలంబుప్రాపున మాతంగ

---

తా.—రాజు లందఱు తమసైన్యము క్రమముగాఁ దగ్గుటను జూచి యర్జునునిమీఁదికిఁ బోఁగా నతఁడు సంతోషముతో మేలిబాణములను ధనుస్సునందుఁ గూర్చె.

66. ఆచార్యుఁ = ద్రోణుని. అమ్ములన్ = బాణములచేత. ఆచార్యపుత్రున్ = అశ్వత్థామను. దుష్ప్రహున్—ఇతఁడు దుర్యోధనునితమ్ములలో నొకఁడు. సౌబలున్ = శకునిని. అమరనదీసూనున్ = భీష్ముని. రవిసుతురథ్యసారథులన్ = కర్ణునిగుఱ్ఱములను సారథిని. నొంచి = నొప్పించి. వర్మము = కవచమును. మర్మఅస్థిబంధములు = మర్మస్థానము లయినయెముకగూళ్ళను. విక్రమము = పరాక్రమమును. నెఱపి = నిండించి. ఏడ్తెఱన్ = ఉత్సాహముచేత. తనచేతికోలఁది = తనభుజపరాక్రమమును, క్రీడి = అర్జునుఁడు. చెలఁగి = విజృంభించి. ఒత్తుటయును = ఊఁదఁగా. తత్సైన్యములు = వారిసేనలు.

తా.—అప్పు డర్జునుఁడు ద్రోణుఁడు మొదలగువారిమీఁద బాణములు ప్రయోగించి కర్ణునిగుఱ్ఱములను సారథిని నొప్పించి వానికవచమును బగిల్చి జీవస్థానముల భేదించి యిట్లు రాజులనందఱి నొప్పించి తనపరాక్రమము చూపి దేవదత్త మనుశంఖమును బూరింపఁగా సైన్యము లన్నియు విచ్చి భీష్మునిమఱువు సొచ్చెను.

67. గాంగేయుఁడు = గంగకొడు కయినభీష్ముఁడు. అవష్టంభఉత్తుంగతనుండు = పూనికచే ఉన్నత మయినదేహము గలవాఁడు. తూలినకురుసేనాఅంగంబులన్ = చెదరిన కురుసేనలయవయవములను. పురికొలిపి = ప్రేరేచి. సుసంగతములు = చక్కఁగాఁ గూడినవానిని. సమరసమ్ముఖములుగాన్ = యుద్ధమునకు ఎదురుమోము గలవిగా.

తా.—భీష్ముం డుత్సాహము గలవాఁడై భయపడినసేనలను బురికొల్పి చేర్చి యుద్ధమున కభిముఖులు గావించెను.

68. భగ్నబలసమాశ్వాసనఉద్భాసి = విచ్చిపోయిన సేనల యూఱడించుటచేఁ బ్రకాశించువాఁడు. భీష్మభుజబలంబుప్రాపునన్ = భీష్మునిబాహుబలముయొక్క యండచేత. మాతంగతురంగస్యందనసందోహంబులతోడన్ = ఏనుఁగులయు గుఱ్ఱములయు తేరులయుసమూహములతో. కుంభ

తురంగస్యందనసందోహంబులతోఁ గుంభసంభవకృపాశ్వత్థామకర్ణవికర్ణప్రముఖ నిఖిలయోధజనంబులు సుయోధనుముందటఁ బన్ని నిలిచినం జూచి సవ్యసాచి ప్రత్యేకప్రధనకుతూహలాయత్తచిత్తుం డగుచు నుత్తరున కి ట్లనియె. 68

ఉ. కందము లప్పళించి తుర♦గంబుల నించుక నిల్పు వైరిసే
నం దెలియంగఁ జూడుము ఘ♦నప్రకరంబునుబోలెఁ గాలుకొం
చుం దఱ నైనదంతిఘట ♦ సుందరకేతనరాజి గ్రాలఁగా
ముందర నిల్వఁ గట్టెదిరి♦మోహర మున్నవిధంబు గాంచితే. 69

గీ. కర్ణకేతనంబు ♦ గ్రాలెడు నల్లదె, యాతఁ డాజికేళి♦కౌతుకమునఁ
గడఁగివచ్చుటయును ♦ గలిగియున్నది మున్న, తొడరవలయు నతని♦తోడ మనము.

వ. అని మఱియును. 71

చ. రయమునఁ గిట్టి యాతనిప♦రాక్రమలీల యడంచి నొంచి దు
ర్జయుఁ డని నమ్మి యున్నకురు♦రాజునకున్ వగ పుట్టఁ జేసెదన్

సంభవ = ద్రోణుఁడు. ప్రముఖనిఖిలయోధజనంబులు = మొదలుగాఁ గల యెల్లశూరు లయిన జనులు. సుయోధనుముందటన్ = దుర్యోధనునియెదుట. పన్ని = వ్యూహములు తీరి. సవ్యసాచి= అర్జునుఁడు. ప్రత్యేకప్రధనకుతూహలాయత్తచిత్తుండు = ఒక్కొక్కనితో యుద్ధము చేయుట యందలి యుత్సాహమున కధీన మయినమనస్సు గలవాఁడు.

69. కందములు = మూఁపులను. అప్పళించి = చఱచి. తురగంబులన్ = గుఱ్ఱములను. వైరిసేనన్ = శత్రువులసేనను. ఘనప్రకరంబునుబోలెన్=మేఘములసమూహమువలె. కాలుకొంచున్= అతిశయించుచు. తఱచు = దట్టము. ఐనదంతిఘట = అయిన యేనుఁగులగుంపు. సుందరకేతనరాజి= చక్కనిటెక్కెములసమూహము. గ్రాలఁగాన్ = ప్రకాశింపఁగా. కట్టెదిరిమోహరము = ఎట్ట యెదుట నున్నవ్యూహము. పాఠాం.—దంతిభటసుందరకేతనరాజి ! = ఏనుఁగులయు భటులయు చక్కనిటెక్కెములయు సమూహము అని యర్థము. ఇట్లు ఘటాశబ్దమునకు బదులు భటశబ్దమును చొనిపి యొకటేసమాసపదముగాఁ బాఠమును గల్పించుట ముందున్న నిల్వన్ అనునసమాపక్రియకుఁ గర్తృభావాపత్తివలనను ద్వంద్వసమాసానురూపతవలనను నసాదరణీయము.

తా.—ఉత్తరా ! నీవు గుఱ్ఱములను చఱచి కొంచెము నిలిపి శత్రుసేనను జూడుము. మనయెదుట ముందరను టెక్కెములతో నొప్పుచున్న యేనుఁగుగుంపు నిలుచునట్లు తీరియున్న శత్రువ్యూహమును చూడుము.

70. కర్ణకేతనంబు = కర్ణునిటెక్కెము. గ్రాలెడున్ = ప్రకాశించుచున్నది. ఆజికేళికౌతుకమునన్ = యుద్ధము అను నాటయందలి వేడుకచేత. తొడరవలయున్ = ఎదిరింపవలయును.

తా.—అదిగోఁ గర్ణునిటెక్కెము గానవచ్చుచున్నది. అతఁడును యుద్ధమునకు రానుత్సాహము గలవాఁడై యున్నాఁడు. మనము ముందుగా వానితో యుద్ధము చేయవలయును.

72. రయమునన్ = శీఘ్రముగా. కిట్టి = తాఁకి. ఆతనిపరాక్రమలీల = ఆకర్ణునిపరాక్రమముయొక్కవిలాసమును. నొంచి = నొప్పించి. దుర్జయుఁడు = గెలువరానివాఁడు. వగ =

హయములఁ బోవ నిమ్మనుడు ♦ నాతఁడు నాతనిలావు నచ్చి ని
ర్భయమునఁ దేరు పోఁ బఱపె ♦ భాస్కరిసూతికి సమ్ముఖమ్ముగన్. 72

( అర్జునుఁడు చిత్రాంగదప్రభృతికురుకుమారుల నిర్జించుట. )

వ. ఇవ్విధంబున వృషభంబున కాదకొను బెబ్బులియునుంబోలె రాధేయు దెస నడచు కవ్వడిం గని చిత్రాంగదుండును జిత్రరథుండును సంగ్రామజిత్తును దుష్ప్రహుండును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుండును శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁ గలకురుకుమారవర్గంబు నిరర్గళప్రకారంబు లగురథచిత్రప్రచారంబులు మెఱయ మొనలకుం దలకడచి చటులపటుబాణవేణికాపరంపరలు నిగుడ నొక్కపెట్ట కవిసిన నతండును గుణధ్వని తంత్రీనాదంబుగా నావిండ్లవా రొత్తుకాఱుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె నట్టియెడ వికర్ణుండు. 73

క. తలమీఱి నిశితశరమం, డలిఁ గప్పెం బార్థు నుత్క♦టక్రోధమునన్
విలు విఱుగ నేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు ♦ దోర్బలలీలన్. 74

---

దుఃఖమును. పుట్టఁజేసెదన్ = కలిగించెదను. హయములన్ = గుఱ్ఱములను. అతఁడున్ = అయుత్తరుఁడును. అతనిలావున్ = అయర్జునునిబలమును. నచ్చి = నమ్మి. భాస్కరసూతికిన్ = సూర్యునికుమారుఁ డయిన కర్ణునికి. సమ్ముఖమ్ముగన్ = ఎదురుగా. తేరు. పోన్. పఱపెన్ = తోలెను.

తా.—ఈకర్ణునిఁ దాఁకి జయించి దుర్యోధనునకు నితఁడు గొప్పశూరుఁ డని కలిగి యున్న నమ్మకమును బోఁగొట్టి దుఃఖము కలిగింపవలెను. తేరు తోలు మనఁగా నుత్తరుఁ డర్జునునిబలమునందలి నమ్మకముచే భయము లేనివాఁడై కర్ణుని కెదురుగాఁ దేరు తోలెను.

73. వృషభంబునకున్ = ఎఁబోతునకు. అదికొను బెబ్బులియునుంబోలెన్ = కస్సువేయు పెద్దపులివలె. రాధేయుదెసన్ = కర్ణునిదిక్కునకు. కవ్వడిన్ = అర్జునుని. కురుకుమారవర్గంబు = కౌరవపక్షమునందలి కుమారులసమూహము. నిరర్గళప్రకారంబులు = అడ్డులేనివిధములు గలవి. రథచిత్రప్రచారంబులు = తేరులయొక్క నానావిధము లయిననడకలు. మొనలకున్ = సేనలకు. తలకడచి = ముందుమిగిలి. చటులపటుబాణవేణికాపరంపరలు = వేగముగలవియు సమర్థములు నగు బాణములప్రవాహములయొక్క వరుసలు. ఒకపెట్టున = ఏకకాలమునందే. గుణధ్వని = అల్లెత్రాటిమ్రోఁత. తంత్రీనాదంబుగాన్ = తంత్రులధ్వనికాఁగా. ఆవిండ్లవారు = ఆశూరులు. ఒత్తుకాఱుగాన్ = శ్రుతియిచ్చువారు కాఁగా, రూ. ఒత్తుకాండ్రు.

74. తలమీఱి = ముందు మిగిలి. ఉత్కటక్రోధమునన్ = ఎక్కుడుకోపముచేత. పార్థున్ = అర్జునుని. నిశితశరమండలిన్ = వాఁడిబాణములసమూహముచేత. నరుఁడు = అర్జునుఁడు. దోఃబలలీలన్ = చేతులబలిమియొక్క విలాసముచేత. విలు = వికర్ణునిధనుస్సును.

తా.—వికర్ణుఁడు ముందు మిగిలి యర్జునునిమీఁద బాణములు ప్రయోగించెను. అంత నర్జునుఁడు వానిధనుస్సు ఖండించి యుద్ధరంగమునుండి పాఱఁదోలెను.

క. ఇంతయుఁ గనుఁగొనియును శ,త్రుంతపుఁ డోసరిల కాజి ♦ దోహల మలరం
గౌంతేయుతోడఁ దలపడి, వింత లయినకూర్మనఖర♦విశిఖము లేసెన్. 75

వ. అర్జునుండును. 76

క. సూతుఁ బదింటను నైదిట, నాతనియంగంబు నొంచి ♦ యంత నిలువమిన్
శాతఘనశరము వే కొని, యాతల వెడలంగ నేసి ♦ యసువులఁ బాపెన్. 77

గీ. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి ♦ యివ్విధమున
నొక్కఁ డొక్కఁడ తలపడు ♦ టుడుపఁ దలఁచి
వివిధబాణపరంపర ♦ వెల్లిగొలిపె
భయరసముపఱ్ఱుపెట్టునఁ ♦ బగఱు వాఱ. 78

క. అందఱు రథికులు పఱవఁగ, నిం దేటికి మున్ను వచ్చి ♦ రిస్సీ యని సం

---

75. ఓసరిలక = వెనుదీయక. ఆజిదోహలము=యుద్ధమునందలియాశ. కౌంతేయుతోడన్= అర్జునితో. కూర్మనఖరవిశిఖములు=తాఁబేటిగోళ్ళయాకారమువంటి యాకారముగల బాణములను.

తా.—వికర్ణునిపాటు చూచియుఁ దొలఁగిపోక శత్రుంతపుఁడు యుద్ధమునం దుత్సాహము గలవాఁడై యర్జునునిమీఁదికిఁ బోయి వాఁడిబాణములు ప్రయోగించెను.

77. సూతున్ = తేరు తోలువానిని. అతనిఅంగంబున్= ఆశత్రుంతపుని దేహమును. నిలువమిన్ = నిలువకపోవుటచేత. శాతఘనశరము = వాఁడి యయిన గొప్పబాణమును. వే = శీఘ్రముగా. అతల = ఆశత్రుంతపునితలను. వెడలంగన్ = తొలఁగునట్లు. ఏసి = కొట్టి. అసువులన్= ప్రాణములను. పాపెన్ = పోఁగొట్టెను.

తా.—ఆశత్రుంతపునిసారథిని పదిబాణములచేతను, శత్రుంతపుని నైదుబాణములచేతను నొప్పించి యంతటితో నతఁడు నిలువక పోఁగా నర్జునుఁడు గొప్పవాఁడిబాణముచె నాతని శిరస్సు ఖండించి వాని వధించెను.

78. తలపడుట = ఎదిరించుటను. ఉడుపన్ = పోఁగొట్టుటకు. భయరసముపఱ్ఱుపెట్టునన్= భయము అను నీటిప్రవాహముయొక్క దెబ్బచేత. పగఱు= శత్రువులు. వివిధబాణపరంపర = నానావిధము లయినబాణములవరుసను. వెల్లిగొలిపెన్ = ప్రవహింపఁజేసెను.

తా.—అర్జునుఁ డిట్లు శత్రుంతపుని వధించి యిఁక నొక్కొక్కరుగాఁ దనమీఁదికి రానియట్లు చేయఁ దలఁచి శత్రువులందఱు భయపడి పఱుగెత్తునట్లు నానావిధబాణములు ప్రవాహముగాఁ బ్రయోగించెను.

79. రథికులు = రథముననుండి యుద్ధము చేయుశూరులు. పఱవఁగన్ = పఱుగెత్తఁగా. సంక్రందనసుతున్ = అర్జునుని. గర్వోద్ధతుఁడువై = గర్వముచే నతిశయించినవాఁడై. తెగి. మార్కొనియెన్.

తా.—అందఱు నిట్లు యుద్ధరంగమునుండి పఱుగెత్తుటను జూచి యిట్లు పఱుగెత్తువారు వీ రేల

క్రందనసుతు మార్కొనియెఁ ద, గం దెగి సంగ్రామజిత్తు ♦ గర్వోద్ధతుఁడై. 79

క. తలపడి వాలమ్ములు పైఁ, నల వేర్పడ నినుచుటయును ♦ నలుక న్పొడమినం
దల దునిమి వైచె నాతని, బలసూదనసూనుఁ డొక్క ♦ పటుభల్లమునన్. 80

గీ. అపుడు రాధేయుఁ డిమ్మెయి ♦ ననుజుపాటుఁ, జూచి యేనుంగునకు సిళ్ళు ♦ సూపినట్లు
కవిసిహాయముల మత్స్యభూ ♦ కాంతతనయు, నేసి పండ్రెండుశరముల ♦ నేసె నరుని.

ఉ. కేసరివిక్రముండు కపి ♦ కేతనుఁ డుత్తత వైరివీరసం
త్రాసకరప్రకార మగు ♦ దర్ప మెలర్పఁగ బాణజాలవి
న్యాసమునన్ వెసం బొదివె ♦ నర్కసుతున్ గరుడుండు పాము ను
ద్భాసితపక్షుఁ డై పొదువు ♦ భంగి సురావలి పిచ్చలింపఁగన్. 82

---

యుద్ధమునకు రావలయు నని వారిని నిందించుచు సంగ్రామజిత్తు మిక్కిలి గర్వముతో నర్జునుం జాఁకెను.

80. వాలమ్ములు = వాఁడిబాణములను. పైన్ = అర్జునునిమీఁద. అలవు = ఉపాయము. ఏర్పడన్ = తేటపడునట్లు. నినుచుటయున్ = నిందింపఁగా. అలుక = కోపము. పొడమినన్ = కలుగఁగా. బలసూదనసూనుఁడు = ఇంద్రునికుమారుఁ డయినయర్జునుఁడు. ఒక్కపటుభల్లమునన్ = ఒకవాఁడిబాణముచేత.

తా.—అ ట్లెదిరించి యర్జునునిమీఁదఁ గఱకుబాణములు ప్రయోగింపఁగా నర్జునుఁడు కోపించి ఒక్కబాణముచే సంగ్రామజిత్తుతలఁ ద్రుంచెను.

81. రాధేయుఁడు = కర్ణుఁడు. ఇమ్మెయిన్ = ఈవిధముగా. అనుజుపాటున్ = తమ్ముని చావును. సిళ్లు = బరికోలలను. కవిసి = తాఁకి. హాయములన్ = గుఱ్ఱములను. మత్స్యభూకాంత తనయున్ = విరాటరాజకుమారుఁ డయినయుత్తరుని. శరములన్ = బాణములచేత. నరున్ = అర్జునుని. ఏసెన్ = కొట్టెను.

తా.—అప్పుడు కర్ణుఁడు తనతమ్ముఁడు చచ్చుటకు బరిగోలలతోఁ బొడిచినయేనుంగువలెఁ గోపించినవాఁడై యర్జునునిఁ దాఁకి యతనిగుఱ్ఱములను సారథిని నొప్పించి యర్జునునిఁ బండ్రెండుబాణములచేఁ గొట్టెను.

82. కేసరివిక్రముండు = సింహముయొక్కపరాక్రమమువంటి పరాక్రమము గలవాఁడు. కపికేతనుఁడు = కోఁతిటెక్కెము గలవాఁడు, అర్జునుఁడు. వైరివీరసంత్రాసకరప్రకారము = శత్రుశూరులకు భయమును గలిగించునట్టి విధము గలది. అగుదర్పము = అయినగర్వము. ఎలర్పఁగన్ = ప్రకాశింపఁగా. గరుడుండు = గరుత్మంతుఁడు. ఉద్భాసితపక్షుఁడుఐ = ఉన్నతములై ప్రకాశించుచున్న టెక్కెలు గలవాఁడై. పామున్. పొదువుభంగిన్ = పట్టునట్లు. సురఆవలి = దేవతలసమూహము. పిచ్చలింపఁగన్ = పొగడఁగా. అర్కసుతున్ = కర్ణుని. బాణజాలవిన్యాసమునన్ = బాణములసమూహముయొక్క ప్రయోగించుటచేత. వెసన్. పొదివెన్.

తా.—గరుత్మంతుఁడు టెక్కెలను విదిర్చుచుఁ బామును బట్టువిధమున, దేవతలు పొగడునట్లు అర్జునుఁడు బాణములు ప్రయోగించుచు మహోత్సాహముతోఁ గర్ణుని నెదిరించెను.

క. ఇరువురు వీరులు నిట్లొం, డొరువులఁ దలపడుట సూచి ♦ యుత్కటమగున
చ్చెరుపాటుఁ గౌతుకంబు న, డర నూరక యుండె నయ్యె♦డం గురుసేనల్. 83

మ. ప్రళయాంభోధరముక్తసాంద్రవిసర♦త్పాషాణవర్షంబు మి
క్కిలియై శైలముఁ గప్పునట్లు నరున♦క్షీణాస్త్రసంతాన మి
ట్టలమై కప్పినఁ దీవ్రమారుతము గా♦ఢవ్యాప్తి జీమూతమం
డలిఁ బోలెన్ విరియించె భానుజుఁ డవ♦ష్టంభోజ్జ్వలాకారుఁడై. 84

క. విల్లును దానును శిఖ రా, జిల్లఁగ వెలుఁగొందువహ్ని♦చెలువంబున శో
భిల్లుటఁ గని కురుసైన్యము, లెల్లను దూర్యములు మ్రోయ ♦ నేడ్తెఱఁ జెలఁగెన్.

క. రవితనయుబాణములు వా, సవనందనుఁ బొదివినపుడు ♦ సంతోషముఁ ద

---

83. తలపడుట = తాఁకుటను. ఉత్కటము = అధికము. అచ్చెరుపాటున్ = ఆశ్చర్యమును. కౌతుకంబును = కుతూహలమును. అడరన్ = అతిశయింపఁగా. అయ్యెడన్ = ఆసమయమునందు.

తా.—కర్ణార్జును లిద్దఱు నొకరినొకరు దాఁకుటను జూచి కౌరవసేనలు ఆశ్చర్యమును వేడుకయును గలవై యూరక చూచుచుండెను.

84. ప్రళయ...వర్షంబు—ప్రళయఅంభోధర = ప్రళయకాలమునందలి మేఘముచేత, ముక్త = విడువఁబడిన, సాంద్ర = దట్టమయిన, విసరత్ = వ్యాపించుచున్న, పాషాణవర్షంబు = రాళ్ళవాన. మిక్కిలియై = అధికమై. శైలమున్ = పర్వతమును. కప్పునట్లు. నరుఅక్షీణఅస్త్రసంతానము = అర్జునునియొక్క తఱుఁగులేని బాణములసమూహము. ఇట్టలమై = అధికమై. కప్పినన్. తీవ్రమారుతము = పెనుగాలి. గాఢవ్యాప్తిన్ = అధికమయిన వీచుటచేత. జీమూతమండలిన్ పోలెన్ = మేఘములసమూహమునువలె. భానుజుఁడు = కర్ణుఁడు. అవష్టంభఉజ్జ్వలఆకారుఁడునై = పరాక్రమముచేఁ బ్రకాశించుచున్న యాకారము కలవాఁడై. విరియించెన్ = తొలఁగించెను.

తా.—ప్రళయకాలమేఘము పర్వతముమీఁదఁ బాషాణవర్షము కురియునట్లు అర్జునుఁడు గర్ణునిమీఁద బాణములు ప్రయోగింపఁగాఁ గర్ణుఁడు పరాక్రమము వహించి పెనుగాలి మేఘములను విరియించునట్లు ఆబాణములను దొలఁగించెను.

85. తానును = కర్ణుఁడును. శిఖ = మంట. రాజిల్లఁగన్ = ప్రకాశింపఁగా. వెలుఁగొందువహ్నిచెలువంబునన్ = ప్రకాశించునట్టి యగ్నివలె. శోభిల్లుటన్ = ప్రకాశించుటను. కని. కురుసైన్యములు. తూర్యములు = వాద్యములు. ఏడ్తెఱన్ = ఉత్సాహముచేత. చెలఁగెన్ = ఒప్పెను.

తా.—కర్ణుఁడు తా నగ్నివలెను అతనిధనుస్సు నిప్పుమంటవలెను ప్రకాశించుటం జూచి కురుసైన్యములు మిక్కిలి సంతోషించి వాద్యములు మ్రోయించెను.

86. రవితనయుబాణములు = కర్ణునిబాణములు. వాసవనందనున్ = అర్జునుని. పొదివినపుడు = తాఁకినపుడు. సంతోషమున్. తత్ వివిధఅస్త్రములు = ఆయర్జునుని నానావిధము లయిన బాణములు. అతనిపైన్ = ఆకర్ణునిమీఁద. కవియన్ = తగులఁగా. విషాదంబున్ = దుఃఖమును.

ద్వివిధాస్త్రములు లాతనిపైఁ, గవియ విషాదంబు నొందుఁ ♦ గౌరవసేనల్. 86

వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాండీవి కర్ణున కిట్లనియె. 87

సీ. సభలఁ బలుకు దీవు ♦ సరి లేరు నా కని, యిదె రణంబు వచ్చె ♦ నెల్లవారి
తెలియఁగ వచ్చు దీనఁ ♦ బెఱచోట రజ్జైన, యట్లు పూరగింప ♦ నగునె యిచట. 88

క. మాటలు పెక్కాడితి వీ, పోటుమగలు వినఁగ నింకఁ ♦ బోవుట దగ దె
ప్పాట నది గాక తమ్ముని, పాటును గన్నారఁ గంటి ♦ పాఱకు మింకన్. 89

గీ. పలుక వచ్చుఁ గాక ♦ పలికినయట్టుల, చేయ వచ్చునెట్లు ♦ దాయ యొందుఁ
బోయె దట్లు ద్రుపద♦పుత్రికఁ బఱుపంగఁ, గాంచి నగినఫలము ♦ గందు గాక.

క. ఏ నపుడు ధర్మపాశా, ధీనుఁడ నై కోపమునకు ♦ దీ కొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ, బో నయ్యెం గాక యింకఁ ♦ బోవ్వా యిచటన్. 91

వ. అనిన విని రాధేయుం డిట్లనియె. 92

---

తా.—కర్ణునిబాణము లర్జునునిమీఁదఁ బడునపుడు సంతోషమును, అర్జునునిబాణములు కర్ణుని మీఁదఁ బడినప్పుడు దుఃఖమును కౌరవసేనలకుఁ గలుగుచుండెను.

87. ఏట్లు = బాణప్రయోగములను. ఆడుచున్ = చేయుచు. గాండీవి = అర్జునుఁడు.

88. రణంబు = యుద్ధము. పెఱచోటన్ = మఱియొకచోట. రజ్జుఅయినఅట్లు = బింకములు పలికినట్లు. పూరగింపన్ఆగునుఎ = నెఱవేర్పవచ్చునా ?

తా.—నీవు సభలలో నాకెదురులే రని చెప్పుకొంటివి. ఇప్పుడు యుద్ధము వచ్చెను. కావున నీశౌర్య మందఱికిని దెలియవచ్చును. ఇంటిలో బింకము లాడినట్లు యుద్ధమున శక్యము కాదు.

89. ఈపోటుమగలు = ఈగొప్పశూరులు. ఎప్పాటన్ = ఏవిధముననైనను. తమ్మునిపాటును = సంగ్రామజిత్తుచావును.

తా.—ఈశూరు లందఱు వినఁగాఁ బెక్కుమాట లాడితివి. కావున నిపుడు నీవు యుద్ధమునుండి వెడలిపోరాదు. అదిగాక నేను నీతమ్ముఁడగుసంగ్రామజిత్తును చంపుటను గన్నులారఁ జూచితివి, ఇఁక నోడక యుద్ధము చేయుము.

90. దాయ = ఓపగవాఁడా! కర్ణునిసంబోధనము. ద్రుపదపుత్రికన్ = ద్రౌపదిని. పఱుపంగన్ = బాధింపఁగా. నగినఫలము = నవ్వినఫలమును. కందుగాక = పొందుదువు గాని.

తా.—బింకము లాడవచ్చును గాని యట్లు చేయుట శక్యము కాదు. సభలో ద్రౌపది నవమానించినపుడు నీవు చూచి నవ్వినఫలమును పొందక యిపుడు తప్పించుకొని పోఁ జాలవు.

91. ధర్మపాశఅధీనుఁడను ఐ = ధర్మము అను త్రాటికి లోఁబడినవాఁడనై. దీకొన = అవకాశము. ఒనరింపన్ కాన్ = చేయుటకు. మెయిమెయిన్ = బాధలేక. పోన్ అయ్యెన్ = పోవుట కల్గెను.

తా.—అపుడు నేను ధర్మమునకుఁ గట్టుపడి కోపము చేయకుండుటచే నీవు తప్పించుకొని పోయితివి. ఇపుడు పోఁ జాలవు.

ఉ. అప్పుడు ధర్మహానికి భ♦యంపడి నిల్చితివో కడంకతో
నిప్పుడు వచ్చినాఁడ విట ♦ నెల్లను జేయుదు గాక యన్నపైఁ
దప్పు ఘటించి నీవు నొక♦తాలిమి గల్గిన వాఁడ వై నెపం
బొప్పినఁ జెల్లె నీనిలుపు ♦ నోపును జూతము గాక యిచ్చటన్. 93

క. సమయంబు నడపినను రా, జ్యముభాగం బీరె యెట్లు ♦ ననునాస నర
ణ్యమున వసించితి గాక ని, జమునకు నీయందు ధైర్య♦సారము గలదే. 94

క. మును నీ వచట నచటఁ జే, సినబంటుతనంబు లెల్లఁ ♦ జెప్పఁగ విందుం
గనినఁ గదా నమ్ముదు నవి, యనుమానము నాకు నీభ♦యస్థితిఁ గనుటన్. 95

(కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము.)

వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును బీభత్సుండై గాండీవవిక్షేపక్షోభిత
నభోభాగుం డగుచుం గానీనుపై నానానిశితవిశిఖంబులు నినిచె నట్లయ్యిరువురును

---

93. ధర్మహానికిన్ = ధర్మము చెడుటకు. కడంకతోన్ = పూనికతో. అన్నపైన్ = ధర్మరాజుమీఁద. ఘటించి = మోపి. ఒకతాలిమి గల్గినవాఁడవువై = ఒకయోర్పుగలవాఁడవై. ఒప్పినన్ = కలుగఁగా. చెల్లెన్ = సాగెను. ఇచ్చటన్. నీనిలుపున్ = నీయొక్క నిలుచుటయును. ఓపును = ఓపికయును. పాఠాం:—చేయుదుఁ గాక. ఏకవాక్యతాభంజక మగుటవలనను పద్య మంతటను అర్జునవిషయమే ప్రకృతమై యుండఁగా నడుమఁ గర్ణునివిషయము అప్రకృత మగుటవలనను నుత్తమ పురుషపాఠ ముచితము కాదు.

తా.—అప్పుడు ధర్మహానికి వెఱచి యిపుడు పరాక్రమము చూప వచ్చితివి కాఁబోలు. అన్నమీఁద సాకుపెట్టి యోపిక కలిగినట్లు చెప్పికొనుటకు నీ కప్పుడు సాకు దొరకినది. ఇపుడు నీసామర్థ్యము చూచెదను.

94. సమయంబు = ప్రతిజ్ఞను. ఎట్లున్ = ఎట్లైనను. రాజ్యముభాగంబు. ఈరె = ఇయ్యరా? అనునాసన్ = అనునట్టి యాశచేత. ధైర్యసారము = దిట్టతనముయొక్క యతిశయము.

తా.—వనవాసమును అజ్ఞాతవాసమును నెఱవేర్చినయెడ దుర్యోధనుఁ డెట్లైనను రాజ్యభాగ మీయక పోఁ డని యాశపడి నీ వడవిలో నుంటివి గాని నిజముగా నీకంత ధైర్యము లేదు.

95. బంటుతనంబులు = పరాక్రమములను. అనుమానము = సందేహము. నీభయస్థితిన్ = నీయొక్క భయముతోడి యునికిని. కనుటన్ = చూచుటచేత.

తా.—తొల్లి నీ వచ్చటచ్చట శౌర్యము చూపినట్లు విని యున్నాఁడను, నీపిఱికితనమును జూచినవాఁడను గావున నాయెదుటఁ జూపినం గాని నేను వాని నమ్మను.

96. గాండీవవిక్షేపక్షోభితనభఃభాగుండు = గాండీవముయొక్క త్రిప్పుటచేఁ గలఁత పెట్టఁబడిన యాకాశప్రదేశము గలవాఁడు. కానీనుపైన్ = కర్ణునిమీఁద. నానానిశితవిశిఖంబులు = నానావిధము లయినకఱకుబాణములను. దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియన్ = దేవాసురులయొక్క యుద్ధముతోఁ బోల్కిగల పరాక్రమముయొక్క విధముచేత. పొలిచిరి=ప్రకాశించిరి, పాఠాం:—

దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియం బొలిచి రట్టిసమయంబున. 96

క. రవిదీప్తులు సొర నేరమిఁ, గవిసెఁ జీఁకట్లు పవన♦గమనం బడఁగెన్
వివిధాస్త్రంబుల నంబర, మవిరళముగఁ బొదువఁబడుట ♦ నద్భుతభంగిన్. 97

ఉ. అప్పుడు కర్ణుసైన్య మమ♦రాధిపనందనుఁ జుట్టు ముట్టఁ దే
రుప్పరవీధిమై వలయ ♦ మొప్ప వెసం బఱపించి క్రీడి పెన్
గుప్పలుగా రథావలిని ♦ ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచున్
దప్పక భానుసూను మెయి ♦ దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98

వ. రాధేయుండును. 99

క. తఱిమి పయి నడరుటయు విలు, విఱుగంగా నేసె నరుఁడు ♦ విక్రమలీలం
గొఱఁతపడ నీక కర్ణుఁడు, మెఱుఁగు లడరుశక్తి సురలు ♦ మెచ్చఁగ నైచెన్. 100

---

అర్జునుండును గుపితుండై = అర్జునుఁడును కోపము గలవాఁడై యని యర్థము. ఇది ప్రతిజగ్రాహ తాన్ పార్థః ప్రీయమాణో మహారథః అనుమూలమునకు విరుద్ధము.

97. వివిధఅస్త్రంబులన్ = నానావిధము లగు బాణములచేత. అంబరము=ఆకాశము. అవిరళముగన్=సందు లేనియట్లు. పొదువఁబడుటన్ = కప్పఁబడుటచేత. అద్భుతభంగిన్ = ఆశ్చర్య మగు విధమున. రవిదీప్తులు = సూర్యునికాంతులు. చొరన్ నేరమిన్ = ప్రవేశింపఁజాల కుండుటచేత. పవనగమనంబు = గాలివీచుట. అడఁగెన్.

తా.—అప్పు డాకాశమంతయు బాణములచేఁ గప్పఁబడుటవలన సూర్యకిరణములు ప్రసరింపక చీఁకట్లు గ్రమ్మెను. గాలి వీవక నిలిచెను.

98. అమరఅధిపనందనున్ = ఇంద్రుని కుమారుఁ డయిన యర్జునుని. క్రీడి = అర్జునుఁడు. ఉప్పరవీధిమైన్ = ఆకాశమార్గమునందు. వలయము = మండలాకారము. పఱపించి = తోలించి. పెన్ కుప్పలుగాన్ = పెద్దరాసులుగా. రథఆవళిని = తేరులసమూహమును. ఘోటతతిన్ = గుఱ్ఱములసమూహమును. కరిరాజిన్ = ఏనుఁగులగుంపును. కూల్చుచున్. భానుసూను మెయి = కర్ణుని దేహమును. ఉల్లసిల్లినన్ = ప్రకాశింపఁగా.

తా.—అప్పుడు కర్ణునిసేన యర్జునునిమీఁదికిఁ బోఁగా నర్జునుఁడు తనరథమును మండలాకారముగాఁ దోలించి యాసైన్యములను వధించుచుఁ గర్ణునిదేహము తాఁకునట్లు బాణములు ప్రయోగించుచుఁ బ్రకాశింపఁగా.

99. రాధేయుండును = కర్ణుఁడును.

100. పయిన్ = మీఁదికి. అడరుటయున్ = రాఁగా. నరుఁడు = అర్జునుఁడు. విలు = ధనుస్సు. కర్ణుఁడు. విక్రమలీలన్ = పరాక్రమముయొక్క విలాసమును. కొఱఁతపడన్ ఈక = తగ్గనీయక. మెఱుఁగులు = కాంతులు. అడరుశక్తి = అతిశయించునట్టి శక్తి యను నాయుధమును. సురలు = దేవతలు.

తా.—కర్ణుఁడు తఱుముకొని మీఁదికి రాఁగా నర్జునుఁడు వాని విల్లు విఱిచెను. కర్ణుఁడు తన పరాక్రమమునకుఁ గొఱఁత రానీయక దేవతలు పొగడునట్లు శక్తి యను నాయుధమును అర్జునునిమీఁదఁ బ్రయోగించెను.

గీ. వైచుటయును సవ్య♦సాచి కౌరవ్యులు, విస్మయంబుతోడి♦వెఱపు నొంద
నధికరయము మెఱయ ♦ నది పెక్కుతునియలు, చేసె నంతరమున ♦ శితశరముల.

వ. అట్టియెడ నినతనయుమన్నించుజోదులు దెగి పయిం బడినఁ గ్రోధారుణనయన
పల్లవితంబును దంతకాంతిస్తబకితంబును గుంభస్థలఫలితంబును నగుతదీయకరటి
ఘటావికటవిటపిపటలంబు నాత్మీయవిశిఖవ్యాపారమహావాతంబునం బడలుపడం
గూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లుబీభత్సుం గని యతండు బొమముడి
నెక్కొన వేఱొక్కవి ల్లెత్తికొని. 102

క. తురగముల నాలుగిట ను, త్తరు నాఱిట నెనిమిదిట ర♦థముఁ బదిటను వా
నరు నఱువదిశరముల న, న్నరునంగంబులను బెలుచ ♦ నాటఁగ నేసెన్. 103

వ. ఇత్తెఱంగున. 104

సీ. రోషంబు భీషణ♦రూప మై చెలు వొంద, నతులకేతువు శిఖ ♦ యై వెలుంగ
శరజాలములు పటు♦జ్వాల లై నిగుడ న, ర్కతనూభవోగ్రాగ్ని ♦ ప్రజ్వరిల్లు

---

101. వైచుటయును = ప్రయోగింపఁగా. సవ్యసాచి = అర్జునుఁడు. విస్మయంబుతోడివెఱపున్ = ఆశ్చర్యముతోడి భయమును. అధికరయము = మిక్కిలివేగము. అంతరమునన్ = నడుమను. శితశరములన్ = వాఁడిబాణములచేత.

తా.—కర్ణుఁడు ప్రయోగించినశక్తిని కౌరవులు ఆశ్చర్యమును భయమును బొందునట్లు వేగముగా వాఁడిబాణములచే నడుమనే పెక్కుతునియలుగా ఖండించెను.

102. ఇనతనయుమన్నించుజోదులు = కర్ణుఁడు గౌరవించునట్టి భటులు. తెగి = సాహసించి. క్రోధఅరుణనయనపల్లవితంబును = కోపముచే నెఱ్ఱనయినకన్నులచేఁ జిగిరించినదియు. దంతకాంతిస్తబకితంబును = దంతములకాంతులచేఁ బూగుత్తులు గలదియు. కుంభస్థలఫలితంబునున్ = కుంభస్థలములచే ఫలములు గలదియును. అగు తదీయకరటిఘటావికటవిటపిపటలంబున్ = అయినట్టి వారిదైన యేనుఁగులసమూహము అను భయంకర మయినవృక్షములసమూహమును. ఆత్మీయవిశిఖవ్యాపారమహావాతంబునన్ = తనదైన బాణములవ్యాపారము అను పెనుగాలిచేత. పడలుపడన్ = రాసులుపడునట్లు. చండమూర్తి = భయంకరమయినయాకారమును. శోభిల్లుబీభత్సున్=ప్రకాశించునట్టి యర్జునుని. అతండు = కర్ణుఁడు. నెక్కొనన్ = కలుగఁగా. అలం. రూపకము.

103. తురగములన్ = గుఱ్ఱములను. వానరున్ = కోఁతిని, టెక్కెమునందలి వానరుని. అన్నరుఅంగంబులను = ఆయర్జునుని యవయవములను. పెలుచన్ = కోపముచేత.

తా.—కర్ణుఁడు నాలుగుబాణములచేత నర్జునుని గుఱ్ఱములను, ఆఱుబాణములచే నుత్తరుని, నెనిమిదిబాణములచే రథమును, బదిబాణములచే హనుమంతుని, నఱువది బాణములచే నర్జునుని నొప్పించెను.

105. రోషంబు = కోపము. భీషణరూపము ఐ = భయంకర మయినయాకారము కలదై. చెలువుపొందన్=ప్రకాశింపఁగా. అతులకేతువు=సాటిలేనిధ్వజము. శిఖ ఐ=అగ్రమై. శరజాలములు= బాణములసమూహములు. పటుజ్వాలలు ఐ = గొప్పమంటలై. నిగుడన్ = వ్యాపింపఁగా. అర్కత

నుద్ధతి సైఁపక ♦ యుజ్జ్వలదివ్యప, తాక మెఱుంగు గా ♦ దళితధరణి
రథనేమిరవము గ♦ర్జనము గ శరపరం, పరలు ధారలు గాఁగఁ ♦ బరఁగి యడరె
నర్జునాంబుదం బ♦నన్యసామాన్యస, ముద్యమమున ముఖప♦యోరుహముల
కాంతి దఱిఁగి యపుడు ♦ కౌరవసేనాస, రోవరంబు దీన♦భావ మొంద. 105

క. వెండియు నుడుగక రవిసుతుఁ, డొండొండ నిశాతసాయ♦కోత్కరము సము
ద్దండతఁ బై నించిన నా, ఖండలనందనుఁడు గెంపు ♦ గనుఁగవఁ గదురన్. 106

క. శిరము లలాటంబును గం, ధరమును బాహువులు నురము ♦ దండడి వ్రయ్యన్
గిరిపైఁ బిడుగులు దొరఁగెడు, పరుసున దృఢదీప్తశాత♦భల్లము లేసెన్. 107

---

నూభవఉగ్రఅగ్ని = కర్ణుఁ డను భయంకర మగునిప్పు. ప్రజ్వరిల్లుఉద్ధతి = మండునట్టి యతిశయమును. సైఁపక = సహింపక. ఉజ్జ్వలదివ్యపతాక = ప్రకాశించునట్టి మేలిటెక్కెము. మెఱుంగుగాన్ = మెఱుపుకాఁగా. దళితధరణీరథనేమిరవము = పగుల్పఁబడిన భూమి గల తేరియొక్క యంచులమ్రోఁత. గర్జనముగన్ = ఉఱుముకాఁగా. శరపరంపరలు = బాణములవరుసలు. ధారలుకాఁగన్ = వానకాళ్ళకాఁగా. పరఁగి = ఒప్పి. అర్జునఅంబుదంబు = అర్జునుఁడు అను మేఘము. కౌరవసేనాసరోవరంబు = కురుసేన యను మేలికొలను. ముఖపయోరుహములకాంతి = మోములు అను కమలములకాంతి. తఱిఁగి = తగ్గి. దీనభావము = దైన్యమును. ఒందన్. అనన్యసామాన్యసముద్యమమునన్ = ఇతరములయందు సాధారణము కాని ప్రయత్నముచేత. అడరెన్ = అతిశయించెను.

తా.—కోపమే యాకారముగాను ధ్వజము కొనగాను బాణములు మంటలుగాను గలిగి కర్ణుం డనునగ్ని మండుచుండఁగా దాని నార్పుటకై టెక్కెము మెఱపుగాను రథధ్వని యుఱుముగాను బాణధారలు వర్షధారలుగాను గలిగి యర్జునుఁడు అను మేఘము విజృంభించెను. అందుచేఁ గౌరవసేన యను కొలను ముఖము లను కమలములకాంతి చెడి దైన్యము నొందెను. (అర్జునుఁ డతిశయించుటయుఁ గర్ణుఁడు తగ్గుటయుఁ జూచి కౌరవసేన దుఃఖించె నని భావము) అలం. రూపకము.

106. వెండియున్ = మఱియు. ఉడుగక = విడువక. రవిసుతుఁడు=కర్ణుఁడు. ఒండొండ= క్రమక్రమముగా. నిశాతసాయకఉత్కరము = వాఁడిబాణములసమూహమును. సముద్దండతన్ = మిక్కిలి భయంకరుఁ డగుటచేత. పైన్ = మీఁద. నించినన్=నిండింపఁగా. ఆఖండలనందనుఁడు= ఇంద్రునికుమారుఁ డయినయర్జునుఁడు. కనుఁగవన్ = కన్నులజంటయందు. కెంపు = ఎఱ్ఱఁదనము. కదురన్ = కలుగఁగా.

తా.—అంతఁ గర్ణుఁడు నిలువక మరలఁ గఱకుటమ్ములు ప్రయోగించి నొప్పింపఁగా నర్జునుఁడు కోపము గలవాఁడై.

107. శిరము = తలయును. లలాటంబును = నెత్తియును. కంధరమును = కంఠమును. బాహువులున్ = చేతులును. ఉరమున్ = ఱొమ్మును. దండడిన్ = దట్టముగా. వ్రయ్యన్= పగులునట్లు. గిరిపైన్=కొండమీఁద. తొరఁగెడుపరుసునన్=పడునట్టివిధమున. దృఢదీప్తశాతభల్లములు = దిటవులును ప్రకాశము గలవియుఁ గఱకులును నగు బాణములను. ఏసెన్.

క. అతిముఖి నంగము లెల్లను, నుఱుమగ ని ట్లడరునర్జు♦నునియమ్ములకున్
వెఱచఱచి సూతపుత్రుఁడు, పఱచెం బుడమి యద్రువమత్స్య♦పతిసుతుఁ డార్వన్.

వ. ఇట్లు కర్ణుండు గయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి యుత్తరున కి ట్లనియె. 109

క. వీఁ డొకఁడు కురుబలంబున, వాఁడిమగం డనఁగఁ జాలు♦వాఁ డిభ్భంగిం
బోఁడిమి సెడియెను ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుము ♦ విక్రమమునకున్.

వ. అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించుచున్న డుత్తరుండు. 111

ఉ. వెక్కసపాటు భీతియును ♦ విహ్వలభావము నొంది యి ట్లను
న్మిక్కిలి యైనశౌర్యమును ♦ నిర్భర తేజము నంత కంత కి

తా.—కర్ణుని శిరస్సు మొదలగుసర్వాంగములును బ్రద్దలగునట్లు పిడుగులవంటివియు త్తమబాణములు ప్రయోగించెను.

108. అతిముఖిన్ = వేగముచేత. అంగములు = అవయవములు. నుఱుమగన్ = పొడియగునట్లు. అడరు అర్జునునిఅమ్ములకున్ = విజృంభించునట్టి యర్జునునిబాణములకు. సూతపుత్త్రుఁడు = కర్ణుఁడు. వెఱచఱచి = భయపడి. పుడమి = భూమి. అద్రువన్ = అదరునట్లును. మత్స్యపతిసుతుఁడు = ఉత్తరుఁడు. ఆర్వన్ = సంతోషించునట్లును. పఱచెన్ = పరుగెత్తెను.

తా.—అంతఁ గర్ణుఁడు తనయవయవము లన్నియు భేదించుచున్న యర్జునునిబాణముల కోర్వఁజాలక భూమి యదరునట్లు యుద్ధరంగమునుండి పరుగెత్తెను, దాని నుత్తరుఁడు సంతోషించెను.

109. కయ్యంబు = యుద్ధమును. పార్థుండు = అర్జునుఁడు.

110. వాఁడిమగండు = గొప్పశూరుఁడు. పోఁడిమిచెడియెను = ఓడిపోయెను. ద్రోణులవేఁడిమి = ద్రోణాచార్యులపరాక్రమము. విక్రమమునకున్ = పరాక్రమమునకు. మునుము = ఎదురు.

తా.—ఈకర్ణుఁడు కౌరవసేనయందు మిక్కిలి పేరు పొందిన శూరుఁడు. వీని జయించితిమి. ఇఁక మనము ద్రోణాచార్యుని నెదుర్కొనవలయును.

111. వీరఆవేశంబునన్ = వీరరసముయొక్క పూనికచేత. కౌరవఅనీకంబున్ = కౌరవులసేనను.

112. వెక్కసపాటు = కష్టమును. భీతియును = భయమును. విహ్వలభావమున్ = వివశత్వమును. మిక్కిలి = అధికము. ఐనశౌర్యమును = అయినట్టి శూరత్వమును. నిర్భరతేజమున్ = నిండిన పరాక్రమమును. ఎక్కుడులావున్ = వృద్ధిపొందుచున్న బలమును. మది = మనస్సు. ఎంతయున్ = మిక్కిలి. బెగ్గిలెన్ = భయపడెను. మేను = దేహము. చేష్టలన్ = పనులను. తక్కెన్ = విడిచెను. రథవ్యవహారము = తేరుపనిని. నిర్వహింపఁగన్ = నెఱవేర్చుట. అశక్యము.

తా.— భయపడి పరవశుఁడై యి ట్లనియె. నీశౌర్యమును పరాక్రమమును అప్పటప్పటికి వృద్ధి

క్లైక్కెడులావుఁ జూచి మది ♦ యెంతయు బెగ్గిలె మేను చేష్టలం
డక్కె నశక్య మింకిట ర♦థవ్యవహారము నిర్వహింపఁగన్. 112

గీ. పుట్టినంతనుండి ♦ యిట్టివి యెన్నఁడుఁ, గాన నెందు నట్లు ♦ గానఁ జోద్య
మంది యంతరంగ ♦ మవశతఁ బొందిన, కతన నింద్రియముల♦కడఁక దక్కె. 113

గీ. అనినఁ గొండొకన వ్వొల♦యంగఁ జూచి, యింద్రనందనుఁ డాతని ♦ కిట్టు లనియె
నేను గలుగంగ నీ కేమి ♦ యెలమి వాహ,నముల కుబ్బుగ సంచోద♦నంబు సేయు.

క. అనుటయు నాతఁడు దగ నూ, ర్కొనినం దా నుదితనినద♦కోదండుం డై
యనితరసులభోద్యమమున, ధనంజయుం డిట్టు లను న♦తనితో మఱియున్. 115

క. అరుణాశ్వంబులఁ బూనిన, యరదంబున వీఁడె నిడుప్ర ♦ లగుచేతులు బం
ధురకంధరంబు వెడలుప్ర, టురమును నై ద్రోణుఁ డొప్పె ♦ నుత్తర కంటే. 116

---

పొందుచున్న బలమును జూచి నాకు భయము కలుగుచున్నది. నాదేహము పరవశ మయ్యెను, ఇఁక నేను సారథ్యము సేయఁజాలను.

113. కానను = చూచినవాఁడఁ గాను. అట్లు కానన్ = అట్లగుటచేత. చోద్యము = ఆశ్చర్యమును. అంది = పొంది. అంతరంగము = మనస్సు. అవశతన్ = వశము కానిది యగుటను. పొందినకతనన్ = పొందినకారణముచేత. ఇంద్రియములకడఁక = ఇంద్రియములయొక్క వ్యాపారము. తక్కెన్ = తప్పెను.

తా.—నేను పుట్టినప్పటినుండి యిట్టి యుద్ధ మెప్పుడు చూచినవాఁడఁ గాను. ఇప్పుడు దీనిం జూచుటచే నామనస్సు పరవశమై యింద్రియములు నాయధీనములుఁ గాకున్నవి.

114. కొండొకనవ్వు = చిఱునవ్వు. ఒలయంగన్ = వ్యాపించునట్లు. ఇంద్రనందనుఁడు = అర్జునుఁడు. ఎలమిన్ = సంతోషముతో. వాహనములకున్ = గుఱ్ఱములకు. ఉబ్బుగన్ = ఉత్సాహము కలుగునట్లు. సంచోదనంబు = తోలుటను.

తా. ఉత్తరునిమాట విని యర్జునుఁడు చిఱునవ్వు నవ్వి యాతనితో నిట్లనియె. నే నుండఁగా నీకు భయము లేదు, నీవు సంతోషముతో గుఱ్ఱముల కుత్సాహము గలుగునట్లు రథము తోలుచుండుము.

115. నూల్కొనినన్ = పురికొనఁగా. ధనంజయుండు = అర్జునుఁడు. అనితరసులభఉద్యమమునన్ = ఇతరులకు సులభము గాని ప్రయత్నముచేత. ఉదితనినదకోదండుండువై = పుట్టిన ధ్వని గల విల్లు గలవాఁడై.

తా.—తనమాట కుత్తరుఁ డుత్సాహము నొందఁగా నర్జునుఁడు మిక్కిలియుత్సాహము గలవాఁడై ధనుస్సును మ్రోయించుచు నుత్తరునిం జూచి మఱియు నిట్లనియె.

116. అరుణఅశ్వంబులన్ = ఎఱ్ఱనిగుఱ్ఱములను. పూనినఅరదంబునన్ = వహించిన తేరియందు. బంధురకంధరంబున్ = విశాల మయినకంఠమును. వెడలుపుఉరమునున్ = విశాలమయినఱొమ్మును. ఐ = కలవాఁడై.

తా.—ఉత్తరా! ఎఱ్ఱనిగుఱ్ఱములు కట్టినరథమునందు దీర్ఘబాహువులును దట్టమయినకంఠమును విశాల మయినఱొమ్మునుం గలిగి ద్రోణుఁడు ప్రకాశించుచున్నాఁడు చూడుము.

వ. అని చూపి వెండియు ని ట్లనియె. 117

గీ. సకలకురుకుమార♦చాపశిక్షాచార్యుఁ, డాజి దుస్సహుండు ♦ సాంగవేద
వేది నీతిశాస్త్ర♦విదుఁడు దివ్యాస్త్రకో, విదుఁడు సుజనహితుఁడు ♦ విమలబుద్ధి.

వ. అని యగ్గించి. 119

క. తనతనయుకంటె నెమ్మన, మున నాకుం గూర్చు భావ♦మున గురులకు మా
ర్కొని యెదము రాజధర్మం, బునకీడునఁ జేసి యింత ♦ వుట్టఁగ వలసెన్. 120

చ. ఎదురుగఁ బోవ నిమ్ము రథ ♦ మీతని తేరికి నన్న నాతఁడుం
బదిలముతోడ రథ్యముల♦పగ్గము లేడ్తెఱ నూలుకొల్పి యు
న్నదగతి నట్లు చేసిన న♦మానుషవిక్రముఁ డైనద్రోణుఁడుం
గదలి యిభం బిభంబుఁ జెన♦కం జనుదెంచినలీల వచ్చినన్. 121

---

118. సకలకురుకుమారచాపశిక్షాఆచార్యుఁడు = ఎల్లకురుకుమారులకును విలువిద్య నేర్పుట కాచార్యుఁడు. ఆజిన్ = యుద్ధమునందు. దుస్సహుండు = సహింపరానివాఁడు. సాంగవేదవేది = అంగములతోఁ గూడిన వేదములు తెలిసినవాఁడు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అని వేదాంగము లాఱు. నీతిశాస్త్రవిదుఁడు = నీతిశాస్త్రము నెఱింగినవాఁడు. దివ్యఅస్త్రకోవిదుఁడు = శ్రేష్ఠము లగునస్త్రములయందుఁ బండితుఁడు. సుజనహితుఁడు = సత్పురుషులకుఁ బ్రియుఁడు. విమలబుద్ధి = నిర్మల మయినబుద్ధి గలవాఁడు.

తా.—ఈద్రోణుఁడు కురుకుమారుల కందఱకును విలువిద్య నేర్పినవాఁడు యుద్ధమునందు మిక్కిలిశూరుఁడు, వేదవేదాంగముల నెఱింగినవాఁడు. నీతిశాస్త్రమునందును బండితుఁడు దివ్యాస్త్రము లన్నియుఁ దెలిసినవాఁడు, సత్పురుషుల కిష్టుఁడు నిర్మల మయినబుద్ధి గలవాఁడు.

119. అగ్గించి = పొగడి.

120. తనతనయుకంటెన్ = తనకుమారునికంటె. భావమునన్ = మనస్సునందు. నాకున్ = నామీఁద. కూర్చున్ = ప్రేమ ఉంచును. రాజధర్మంబునకీడునఁ జేసి = రాజధర్మముయొక్క దోషముచేత.

తా.—ఈద్రోణుఁడు తనకుమారునిమీఁదికంటె నామీఁద నెక్కుడుప్రేమ గలవాఁడు. అట్టి గురువుతో యుద్ధము చేయవలసి యున్నది. రాజధర్మదోషముచే నిట్లు సంభవించినది.

121. ఆతఁడున్ = ఆయుత్తరుఁడును. పదిలముతోడన్ = జాగ్రత్తతో. రథ్యములపగ్గములు = గుఱ్ఱములపగ్గములను. ఏడ్తెఱన్ = ఉత్సాహముతో. నూలుకొల్పి = చక్కఁబఱచి. ఉన్నదగతిన్ = గొప్పనడకచేత. అమానుషవిక్రముఁడు = మనుష్యులసంబంధి కాని పరాక్రమము గలవాఁడు. ఇభంబు = ఏనుఁగు. ఇభంబున్ = ఏనుఁగును. చెనకన్ = తాఁకుటకు. చనుదెంచినలీలన్ = వచ్చినట్లు. కదిసి—అనుపాఠము వచ్చినన్ అనుదానికి వైలక్షణ్యాభావాపత్తిచే నుపేక్షణీయము.

తా.—అర్జునుఁడు ద్రోణుని తేరిమీఁదికి రథము తోలు మని చెప్పఁగా నుత్తరుఁ డట్లు తోలెను. అంత ద్రోణుఁడు ఏనుఁగుమీఁది కేనుఁగు పోవునట్లు అర్జునునిమీఁదికిఁ బోయెను.

వ. నరుఁడు నమస్కరించి గురున కి ట్లనియె. 122

క. అడవులఁ బెద్దయుఁ గాలం, బిడుములఁ గుడిచితిమి మాకు ♦ నిది దఱి యని యి
ప్పుడు వచ్చితిమి విపన్నుల, యెడఁ గృప సేయుటయ లెస్స ♦ యీ రలుగకుఁడీ.

——( అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు సేయుట. )——

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు ♦ నాకేశసుతుఁ
ధనురాచార్యుం డిరువది, సునిశితబాణముల నేసెఁ ♦ జూపఱు వొగడన్. 124

గీ. అర్జునుండు వాని ♦ నన్నింటి నడుమన, తునియ నేయుటయును ♦ ద్రోణుఁ డడరి
శతసహస్రసంఖ్య♦శరములు గప్పిన, నతఁడు నతనిఁ గప్పెఁ ♦ బ్రతిశరముల.

చ. అతిరథు లస్త్రశస్త్రవిదు ♦ లద్భుతబాహుబలుల్ పరాక్రమో
ర్జితయశు లిట్లు దాఁకి గురు♦శిష్యులు కౌరవసేనలోనిభూ

122. నరుఁడు = అర్జునుఁడు. గురునకుఁ = ద్రోణాచార్యునితో.

123. పెద్దయుఁ గాలంబు = చాలకాలము. ఇడుములఁ = కష్టములను. కుడిచితిమి = అనుభవించితిమి. తఱి = సమయము. విపన్నులయెడఁ = ఆపద నొందినవారియందు. లెస్స = మంచిది. ఈరు = మీరు. అలుగకుఁడు కీ.

తా.—మే మడవులయందుఁ జాలకాల ముండి కష్టపడి యున్నారము, ఆపన్ను లయినమాయందుఁ గరుణ యుంపుఁడు, మీరు మాపైఁ గోపము వహింపకుఁడు.

124. ఏయఁ = బాణములు వేయుటకు. వెఱతుఁ = భయపడుదును. ఏసినఁ గాని = కొట్టిననే గాని. అనుడుఁ = అని యర్జునుఁడు చెప్పఁగా. ధనురాచార్యుండు = విలువిద్య నేర్పినవాఁడగుద్రోణుఁడు. నాకఈశసుతుఁ = దేవేంద్రునికుమారుఁ డయినయర్జునుని. చూపఱు = చూచువారు. ఇరువదిసునిశితబాణములఁ = ఇరువది మిక్కిలి కఱకు లయినబాణములచేత. ఏసెఁ.

తా.—మీరు బాణము ప్రయోగించుటకు ముందుగా మీమీఁద నేను బాణప్రయోగము సేయఁ జాలను, అని యర్జునుఁడు చెప్పఁగా ద్రోణుఁ డర్జునునిపై నిరువదిబాణములు వేసి చూచువారిని సంతోషపఱిచెను.

125. అడరి = విజృంభించి. శతసహస్రసంఖ్యశరములఁ = నూఱువేల లెక్కగలబాణములచేత. ప్రతిశరములఁ = బదులుబాణములచేత.

తా.—అర్జునుఁ డాద్రోణునిబాణములను నడుమనే నఱుకఁగా ద్రోణుఁ డర్జునునిమీఁద లక్షబాణము లేసెను, అంత నర్జునుఁడును ద్రోణునిమీఁదఁ బెక్కుబాణములు ప్రయోగించెను.

126. అతిరథులు = గొప్పశూరులును, లెక్కలేనిశూరులతో యుద్ధము చేయువా రతిరథులు. అస్త్రశస్త్రవిదులు = బాణములను ఆయుధములను నెఱిఁగినవారును. అద్భుతబాహుబలుల్ = ఆశ్చర్యకర మయినచేతులలావు గలవారును. పరాక్రమఊర్జితయశులు = పరాక్రమముచే గొప్పకీర్తి కలవారును. గురుశిష్యులు = ద్రోణార్జునులు. బాణజాలసంవృతగగనఅంగణంబు = బాణములసమూహముచేఁ గప్పఁబడినయాకాశప్రదేశము గలది. అగునవీనమహత్ ఆహవవిభ్రమంబునఁ = అయినట్టి క్రొత్త

పతిసుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి బాణజాలసం
వృతగగనాంగణం బగునవీనమహాహవ విభ్రమంబునన్. 126

వ. అట్టియెడఁ గురుసైన్యంబుజనంబులు. 127

క. నరుఁ డొక్కరుండు దక్కఁగ, గురుఁడు గడఁగినపుడు మాఱుకొనఁ జాపధరుం
డొరుఁడు గలఁడె మఱి వెదకిన, హరుఁడు గలం డింకఁ గలుగు నన రా దెందున్.

క. ద్రోణుఁడు రయమున నేసిన, బాణము లెడతెగక యొక్కబాణముపోలెన్
శ్రేణి యయి వ్రాలఁ బార్థుఁడు, రేణువు గావించెఁ గంటె చిత్రగతిన్. 129

క. గురుశరములు సితపక్ష, స్ఫురణంబున నంచపిండుపోలుపు వహించెన్
నరుబాణతతి ఘనావలి, కరణి మిగుల నొప్పె నల్లగఱులచెలువునన్. 130

వ. అనుచుం గనుంగొను చుండ. 131

---

దగు గొప్పయుద్ధముయొక్క విలాసముచేత. కౌరవసేనలోనిభూపతిసుతకోటికిన్ = కౌరవసైన్యమందలి రాజపుత్త్రులసమూహమునకు. వెఱఁగుపాటు = ఆశ్చర్యమును. ఒనరించిరి.

తా.—మిక్కిలిశూరు లయినద్రోణార్జునులు ఆకాశమంతయు బాణములచేఁ గప్పఁబడునట్లు గొప్పయుద్ధము చేసి కౌరవసేనలోని రాజపుత్త్రుల కాశ్చర్యము గలిగించిరి.

128. నరుఁడు = అర్జునుఁడు. గురుఁడు = ద్రోణుఁడు. కడఁగినపుడు = పూనినప్పుడు. మాఱుకొనన్ = ఎదిరించుటకు. చాపధరుండు = విలుకాఁడు. ఒరుఁడు = ఇంకొకఁడు. హరుఁడు = శివుఁడు.

తా.—ద్రోణునితో యుద్ధము చేయుటకు అర్జునుఁ డొక్కఁడు తప్ప మఱియెవరును సమర్థులు కారు, ఇఁక వెదకిచూచినయెడ శివుఁడు సమర్థుఁ డయినం గావలయును, మఱియెవరును సమర్థులు లేరు.

129. రయమునన్ = వేగముచేత. శ్రేణి = వరుస. పార్థుఁడు = అర్జునుఁడు. రేణువు = చూర్ణము. చిత్రగతిన్ = ఆశ్చర్య మగువిధమున.

తా.—ద్రోణుఁడు ప్రయోగించినబాణములు ఒకబాణము వెంబడి యొక బాణముగా ఒక్కటె చాలుగా నర్జునునిమీఁదికిఁ బోవుటయు నంత నర్జునుఁడు వానిని చిత్రముగాఁ జూర్ణము కావించుచున్నాఁడు చూడుఁడు.

130. గురుశరములు = ద్రోణునిబాణములు. సితపక్షస్ఫురణంబునన్ = తెల్లనిఱెక్కల యొక్క ప్రకాశముచేత. అంచపిండుపోలుపు = హంసలసమూహముయొక్క కాంతివంటి కాంతిని. వహించెన్ = పొందెను. నరుబాణతతి = అర్జునునిబాణసమూహము. నల్లగఱులచెలువునన్ = నల్లనిఱెక్కలచక్కఁదనముచేత. ఘనఆవలికరణిన్ = మేఘములసమూహమువలె. మిగులన్. ఒప్పెన్.

తా.—ద్రోణునిబాణములు తెల్లనిఱెక్కలు కట్టిన వగుటచే హంసలవలె నున్నవి. అర్జునుని బాణములు నల్లఱెక్కలు కట్టిన వగుటచే మేఘములవలె నున్నవి. మేఘములకు హంసలు వెఱచును గావున అర్జునుని బాణములచే ద్రోణుని బాణములు కొట్టువడుచుండె నని ధ్వని.

శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీరమధుర జ్యానాద ముద్దామవీ
రవ్యాపారనిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్. 132

వ. ఇంద్రాగ్ని వాయువరుణదైవత్యంబు లగుశరంబులు గురుం డేసిన నరుండును దత్తద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు సేయుచు వచ్చె నయ్యిరువురుఁ బెల్లేయుసాయకంబు లంతరిక్షంబున దళంబై సంతమసంబు గలిగి యునికి నే బాణం బెక్కడఁ బాఱుటయుం దోఁప కుండె నట్టియెడఁ గుంభసంభవుబలంబు ససంరంభంబుగా నతని కడ్డంబు సొచ్చిన వివ్వచ్చుండు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబు లగుబాహుదండంబులను సకుండలంబు లగుకర్ణపాశంబులను సకిరీటంబు లగుశిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పు డావహిల్లినరుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె నిట్లు దుర్జయుం డగునర్జునుండు సైన్యంబు

---

132. గభీరమధురజ్యానాదము = గొప్పదియు మనోహరము నగు నల్లెత్రాటిమ్రోఁత. శ్రావ్యంబై = వినఁదగినదై. చెలఁగన్ = ఒప్పఁగా. ఉద్దామవీరవ్యాపారనిరూఢతన్ = భయంకర మయిన శూరులపనియందుఁ బ్రసిద్ధుఁ డగుటచేత. ప్రతిశరఆరంభంబు = ఎదిరిబాణములకార్యమును. మర్దించుచున్ = కొట్టుచు. సవ్యప్రౌఢిన్ = ఎడమచేతియొక్క నేర్పుచేత. దృఢఅపసవ్యగతిన్ = గట్టిదగు కుడిచేతియొక్క పొందికచేతను. ఆశ్చర్యంబుగాన్. ఏయుచున్. ఇద్దఱును. దివ్యఅస్త్రంబులన్ = శ్రేష్ఠము లయినబాణములచేత. సాదృశ్యంబు = పోలికి. అదృశ్యంబుగన్ = కనఁబడనిది యగునట్లు. పోరిరి.

తా.—ద్రోణార్జును లిద్దఱును అల్లెత్రాటిమ్రోఁత గంభీరముగా వినఁబడునట్లు గొప్పశౌర్యము వహించి యొకరిబాణముల నొకరు ఖండించుచు సవ్యాపసవ్యము లగు రెండుచేతులను ఆశ్చర్యము లగునట్లు దివ్యాస్త్రములు ప్రయోగించుచు సాటి లేని యట్లు గొప్పయుద్ధము చేసిరి.

133. ఇంద్రఅగ్నివాయువరుణదైవత్యంబులు = ఇంద్రుఁడు అగ్ని వాయువు వరుణుఁడు దేవతగాఁ గలవి. శరంబులు = బాణములను. తత్తత్దేవతాకంబులు = ఆయాదేవతలు గలవి. అగు అంబకంబులన్ = అయినబాణములచేత. ప్రతిహతంబులు = కొట్టఁబడినవిగా. పెల్లు = మిక్కిలి. ఏయుసాయకంబులు = ప్రయోగించుబాణములు. అంతరిక్షంబునన్ = ఆకాశమునందు. దళంబు ఐ = దట్టమై. సంతమసంబు = గాఢాంధకారము. కలిగిఉనికిన్ = కలిగియుండుటచేత. తోఁపక = తెలియక. కుంభసంభవుబలంబు = ద్రోణునిసైన్యము. ససంరంభంబుగాన్ = వేగముతోఁ గూడినట్లుగా. వివ్వచ్చుండు = అర్జునుఁడు. వ్రేల్మిడిన్ = శీఘ్రముగా. సకేయూరంబులు = బాహుపురులతోఁ గూడినవి. అగుబాహుదండంబులను = అయిన కఱ్ఱలవంటిచేతులచేతను. సకుండలంబులు = పోఁగులతోఁ గూడినవి. అగు కర్ణపాశంబులను = అయినమేలిచెవులచేతను. సకిరీటంబులు = కిరీటములతోఁ గూడినవి. అగు శిరోభాగంబులను = అయిన శిరఃప్రదేశములచేతను. ఆవహిల్లినరుధిరసాగరంబునకున్ = కలిగిన నెత్తురుసముద్రమునకు. రత్నాకరత్వంబు = రత్నములగని యగుటను. అల

దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నే ట్లాడుచున్నం జూచి
యతండు విస్మితుండై. 133

క. అర్జును నాహవంబున, నిర్జింపఁగ నగునె ఫాల♦నేత్రున కైనం
బర్జన్యసుతుఁడు శరవ, ర్షోర్జితమూర్తి యగు టరయ ♦ నుచితము కాదే. 134

వ. అని మఱియును దగినపలుకుల నగ్గింప నిలింపనికరంబు. 135

గీ. ఇంతప్రొద్దు కిరీటిక♦ట్టెదుర నిలువ, నెఱవ కున్నప్డు ద్రోణుండ ♦ వింటివాఁడు
నల్లవో తనయున్న సే♦నకు నొకండ, బలిమిఁ దలమీఱు నే యిట్లు ♦ నిలువ వలదె.

మ. అను చుండం ద్రిదశేంద్రసూనుఁడు రయం ♦ బత్యంతఘోరంబు గా
ఘనశాతోజ్జ్వలదుర్నివారవిలస♦త్కాండంబులన్ ద్రోణువా

---

వరించెన్ = కలిగించెను. బాహుపురులు మొదలగువానియందలిరత్నములచేత నెత్తురుసముద్రము రత్నాకర మను నన్వర్థనామము కలదానిం గావించె నని తా. దుర్జయుండు = గెలువ రానివాఁడు. భరంబుగన్ = కష్టమగునట్లు. విస్మితుండై = ఆశ్చర్యము నొందినవాఁడై.

134. ఆహవంబునన్ = యుద్ధమునందు. నిర్జింపఁగన్ = గెలుచుటకు. ఫాలనేత్రునకున్ ఐనన్ = నొసటఁ గన్ను గల శివునికైనను. వశమె = తరమా! పర్జన్యసుతుఁడు = ఇంద్రునికుమారుఁ డయినయర్జునుఁడును. శరవర్షోర్జితమూర్తి = బాణములు అను నుదకముయొక్క వర్షముచే గొప్పదయిన మూర్తిగలవాఁడు. అరయన్ = విచారింపఁగా. ఉచితముల = యుక్తమే.

తా.—అర్జునుని యుద్ధమునందు జయించుటకు రుద్రునకైనను శక్యము కాదు. వర్షాధిదేవత యగు నింద్రునికుమారుఁ డయినయర్జునుఁడు శరవర్షము కురియుట యుక్తమే.

135. అగ్గింపన్ = కొనియాడఁగా. నిలింపనికరంబు = దేవతలసమూహము.

136. కిరీటికట్టెదురన్ = అర్జునునియెట్టయెదుట. వింటివాఁడు = శూరుఁడు. నల్లవో = ఆశ్చర్యము. తనయున్న సేనకున్ — తనయొద్దనున్న సేనకంతయు ననుట. బలిమిన్ = పరాక్రమముచేత. తలమీఱున్ ఏ = మించుమిగులునా?

తా.—ఇంతసేపు అర్జునునితో యుద్ధము చేసినాఁడు కావున ద్రోణుఁడే శూరుఁడు. ఈసేనకంతయు నొకద్రోణుఁడే ముందు నిలిచి యున్నవాఁడు. ఇట్లు కదా నిలిచి యుద్ధము చేయవలయును.

137. త్రిదశఇంద్రసూనుఁడు = దేవేంద్రునికుమారుఁ డగునర్జునుఁడు. రయంబు = వేగము. అత్యంతఘోరంబుగాన్ = మిక్కిలి భయంకర మగునట్లుగా. ఘన...కాండంబులన్—ఘన = గొప్పవియు, శాత = కఱకు లయినవియు, ఉజ్జ్వల = ప్రకాశించునవియు, దుర్నివార = అడ్డగింపరానివియు నగు, విలసత్ = ప్రకాశించుచున్న, కాండంబులన్ = బాణములచేత. ద్రోణువాహనసూతధ్వజదేహముల్ = ద్రోణునియొక్క గుఱ్ఱములను సారథిని టెక్కెమును దేహమును. పొదివెన్ = కప్పెను. ఇట్లు. అస్త్రాబ్ధినిర్మగ్నున్ = అస్త్రములు అను సముద్రమునందు మునిఁగినవానినిగా. హాహానినదంబులు = అయ్యో యయ్యో యనుధ్వనులు. సర్వసైన్యంబులన్ = ఎల్లసేనలయందును. ఒక్కమొగిన్ = ఒకటేవిధముగా. పేర్చెన్ = అతిశయించెను.

హానసూతధ్వజదేహముల్ వొదివె ని♦ట్లస్త్రాబ్ధినిర్మగ్నుఁ జే
సిన హాహానినదంబు లోకము మొగిఁ జే♦ర్చెన్ సవ్యసైన్యంబులన్. 137

క. ఈమెయి నిజజనకభుజో, ద్దామబలము దోడుతోడఁ ♦ దఱుఁగుటయు రథ
స్తోమంబుఁ దాను నశ్వ, త్థామ వెసం దాఁకెఁ బాండు♦తనయునితోడన్. 138

( అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము సేయుట. )

చ. అతఁడును దీవ్రబాణముల ♦ నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శతమఖవృత్రసంగరము♦చందము దోఁచె వడిన్ ఛటచ్ఛటా
యితరవ మప్డు వేణువుల ♦ నేర్చుదవానలుమ్రోఁతభంగి ది
క్తతిఁ బరఁగెన్ మహాద్భుతము ♦ కౌరవసేనకు నావహిల్లఁగన్. 139

వ. అట్టియెడ. 140

చ. ఉఱక నరుండు ద్రోణసుతు♦యుగ్యములన్ వెస నొంచె నాతఁడుం
దెఱపి యొకింత గాంచి ఘన♦తీవ్రశరంబున నారిఁ ద్రుంచిక

తా.—ఇట్లు చెప్పుచుండఁగా నర్జునుఁడు మిక్కిలి వేగముతో ద్రోణునిగుఱ్ఱములను సారథిని టెక్కెమును దేహమును కఱకుబాణముల ముంచుటను జూచి సైనికు లందఱు హాహాకారములు కావించిరి.

138. ఈమెయిన్ = ఈవిధముగా. నిజజనకభుజఉద్దామబలము = తనతండ్రియొక్క చేతులయొక్క గొప్పబలము. తోడుతోడన్ = అప్పటప్పటికి. తఱుఁగుటయున్ = తగ్గఁగా. అశ్వత్థామ. రథస్తోమంబున్ = రథములసమూహమును. పాండుతనయునితోడన్ = అర్జునునితో. వెసన్ = శీఘ్రముగా. తాఁకెన్.

తా.—ఇట్లు క్రమక్రమముగా ద్రోణాచార్యునిబలము తగ్గుటను జూచి యశ్వత్థామ రథికుల సమూహముతో నర్జును నెదిరించెను.

139. తీవ్రబాణములన్ = వాఁడిబాణములచేత. మాఱుకొన్నన్ = ఎదిరింపఁగా. ఆశతమఖవృత్రసంగరముచందము = ప్రసిద్ధ మయినయింద్రునియొక్కయు వృత్రాసురునియొక్కయు యుద్ధముయొక్కవిధము. తోఁచెన్. ఛటచ్ఛటాయితరవము= ఛట ఛట యనుధ్వని. వేణువులన్= వెదుళ్ళను. ఏర్చుదవానలుమ్రోఁతభంగిన్ = దహించుకార్చిచ్చుయొక్కధ్వనివలె. మహత్ అద్భుతము = గొప్పయాశ్చర్యము. ఆవహిల్లఁగన్ = కలుగునట్లు. దిక్ తతిన్ = దిక్కులసమూహము నందు. పరఁగెన్ = వ్యాపించెను.

తా.—అప్పు డర్జునుఁడును వాఁడిబాణములచే నశ్వత్థామను గప్పుచు నెదుర్కొనఁగా వారియు పురియుద్ధము ఇంద్రవృత్రాసురులయుద్ధముం బోలి యుండెను. ఆయుధము లొండొంటిఁ దాఁకుటచేఁ గలుగు ఛటచ్ఛట ధ్వని వెదుళ్లను కాల్చునట్టి కాఱుచిచ్చు ధ్వనివలె దిక్కు లన్నియు వ్యాపించి కౌరవసేన కాశ్చర్యము కలిగించెను.

141. ఉఱక = లక్ష్యము సేయక. నరుండు = అర్జునుఁడు. ద్రోణసుతుయుగ్యములన్ = అశ్వత్థామ గుఱ్ఱములను. తెఱపి = అవకాశమును. ఘనతీవ్రశరంబునన్ = గొప్పవాఁడిబాణము

గ్గిఱిపినమాత్రలోన నతనిం బటుబాణచతుష్కయుగ్మ మే
డ్తెఱం దొడి మార్వి గ్రమ్మఱ ఘటించునెడన్ వడి సేసి యార్చినన్. 141

క. కురుసేనలోన నిట్లె, వ్వరుఁ జేసిన వారు లే ర • వార్యభుజావి
స్ఫురణోదగ్రుం డు గదే, గురుపుత్త్రుం డనుచు నమర • కోటి నుతించెన్. 142

చ. చిఱునగ వొప్ప గాండివము • చెచ్చెర సజ్యము సేసి సేన లు
క్కఱ రభసంబుమై నడరెఁ • గవ్వడి ద్రౌణియు నీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు • దండడి మార్కొని మండు చుండెఁ జి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగు • చాడ్పున నంబరవీథి నుగ్రమై. 143

వ. ఇవ్విధంబున ధనంజయు రయంబు నెనయు వేగంబున నేయ ద్రోణతనయు
తూణీరంబులు శరశూన్యంబు లయ్యెఁ దనతూణీరంబు లక్షయబాణంబు లగుటం

---

చేత. నారిన్ = అల్లెత్రాటిని. కన్ గిఱిపినమాత్రలోనన్ = కన్నుత్రిప్పినంతలోనే. పటుబాణచతుష్కయుగ్మము = దృఢము అయినబాణముల నాలుగులయొక్క జంటను. ఏడ్తెఱన్ = ఉత్సాహముతో. తొడి = కూర్చి. మార్వి = అల్లెత్రాటిని. క్రమ్మఱన్ = మరల. ఘటించునెడన్ = కూర్చు నవకాశమందు. ఆర్చినన్ = అఱవఁగా.

తా.—అప్పు డర్జునుఁడు అశ్వత్థామగుఱ్ఱములను నొప్పింపఁగా అశ్వత్థామ కొంచెము సందు చూచికొని యొక్కబాణముచే నర్జునునియల్లెత్రాడు నఱికి అంతక్షణములో నర్జునుఁడు మఱియొక యల్లెత్రాటిని కూర్చుకొనులోపల నెనిమిదిబాణములచే నతని నొప్పించి సింహనాదము చేసెను.

142. అవార్యభుజావిస్ఫురణోదగ్రుండు = అడ్డగింపరాని బాహువులబలిమిచే గొప్పవాఁడు. అమరకోటి = దేవతలసమూహము. నుతించెన్ = పొగడెను.

తా.—కౌరవసేనయందు యశ్వత్థామవలె నర్జునునియల్లెత్రాడు నఱికినవాఁడు లేఁడు, అశ్వత్థామ మిక్కిలి పరాక్రమము గలవాఁ డని దేవతలు పొగడిరి.

143. చెచ్చెఱన్ = మిక్కిలి శీఘ్రముగా. సజ్యము = అల్లెత్రాటితోఁ గూడినదిగా. సేనలు. ఉక్కఱన్ = బలము చెడునట్లు. కవ్వడి = అర్జునుఁడు. రభసంబుమైన్ = వేగముతో. అడరెన్ = విజృంభించెను. ద్రౌణియున్ = అశ్వత్థామయును. ఈడఁబోక = వెనుదీయక. దండడిన్ = తఱచుగా. తార్కొని = తగిలి. తొరఁగుచాడ్పునన్ = పడునట్లు. ఉగ్రమువి = భయంకరమై. మండుచున్. ఉండెన్.

తా.—అర్జునుఁడు చిఱునవ్వు నవ్వుచు శీఘ్రముగా గాండివము నెక్కిడి సేనలను వధించుచు నశ్వత్థామను తాఁకఁగా నశ్వత్థామయు వెనుదీయక యెదుర్కొని పోరెను, అప్పు డాకాశమందు బాణము లొకటితో నొకటి యొరసికొని మండుచుఁ బిడుగులు పడునట్లు పడుచుండెను.

144. ధనంజయురయంబున్ = అర్జునునియొక్క వేగమును. ఎనయు వేగంబునన్ = పోలినట్టి వేగముచేత. ఏయ ద్రోణతనయుతూణీరంబులు = ప్రయోగించునట్టి యశ్వత్థామ యమ్ములపొదులు. శరశూన్యంబులు = బాణములు లేనివి. అతనితూణీరంబులు = ఆయర్జునుని యమ్ములపొదులు.

జేసి యంతకంతకు నతిశయిల్లుపెల్లున నేయుచు నధికుం డగునప్పాండవమధ్యముం
గనుంగొని కృపాచార్యుండు చెంగటం దలమీఱిన. 144

( అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము సేయుట. )

క. గురుపుత్రునిరథము విడిచి, సరభసముగ నందు సవ్య♦సాచి గవియుడుం
దిర మై యాతఁడు శితశర, పరంపరలు గురిసె నుగ్ర♦బంధురగతులన్. 145

వ. పాండుపుత్రుండును జిత్రసంచారముల మెఱయుచు. 146

క. పటువిశిఖపంక్తి యత్యు, త్కటరయమున నిగుడఁ జేయఁ♦గా నవ్విధ మోఁ
దుట యైన మండె దీప్తో, ద్భటభంగిఁ గృపానలంబు♦ బలములు పొంగన్. 147

వ. ఇట్లు మండి శిఖంబోనికనకలిప్తఘనబాణంబు వనచరకేతువుం దాఁకించి వేఁడిమి
చూపి వివిధాస్త్రజ్వాలలు గవియించి దిక్కులు గలంగ నార్చినం గోపంబున
నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతని కేతనంబు దునిమి తరణికిరణానుకార

---

అక్షయబాణంబులు = తఱుఁగులేనిబాణములు గలవి. అతిశయిల్లుపెల్లునన్ = అతిశయించు గొప్ప తనముచేత. చెంగటన్ = సమీపమునందు. తలమీఱినన్ = ముందు మిగులఁగా.

145. గురుపుత్రునిరథము = అశ్వత్థామతేరును. సరభసముగన్ = వేగముతోఁ గూడినట్లుగా. సవ్యసాచి = అర్జునుఁడు. కవియుడున్ = ఎదుర్కొనఁగా. ఆతఁడు = ఆకృపుఁడు. తిరమువి = నిలుకడ గలవాఁడై. శితశరపరంపరలు = వాఁడిబాణములవరుసలు. ఉగ్రబంధురగతులన్ = భయంకరములును దట్టములు నగువిధములచేత.

తా.—అప్పు డర్జునుఁ డశ్వత్థామను విడిచి కృపాచార్యునిమీఁదికిఁ బోఁగాఁ గృపాచార్యుఁడును నర్జునునిమీఁదఁ గఱకుబాణములు ప్రయోగించెను.

146. చిత్రసంచారంబులన్ = నానావిధము లగునడకలచేత.

147. పటువిశిఖపంక్తి = వాఁడిబాణములసమూహమును. అతిఉత్కటరయమునన్ = మిక్కిలి యెక్కుడు వేగముచేత. నిగుడఁజేయఁగాన్ = వ్యాపించునట్లు చేయఁగా. అవ్విధము = అట్లు చేయుట. ఊఁదుటయినన్. కృపఅనలంబు = కృపాచార్యుఁ డనునిప్పు. బలములు = సేనలు. పొంగన్ = సంతోషించునట్లు. దీప్తఉత్భటభంగిన్ = ప్రకాశించునదియు భయంకరము నగు విధముచేత. మండెన్.

తా.—అర్జునుఁడు బాణములచేఁ గృపాచార్యు నొప్పింపఁగాఁ గృపాచార్యుండు కోపించి ఊఁదిననిప్పువలె మిక్కిలి విజృంభించెను.

148. శిఖన్ = జ్వాలాగ్రమును. పోనికనకలిప్తఘనబాణంబు = పోలినబంగారుమొలాముగలగొప్ప బాణమును. వనచరకేతువున్ = కోఁతిటెక్కెమును. వివిధఅస్త్రజ్వాలలు = నానావిధము లగుబాణములు అను మంటలను. కవియించి = వ్యాపింపఁజేసి. కలంగన్ = కలఁత నొందునట్లు. ఆర్చినన్ = అఱవఁగా. ఆటోపంబు = వేగిరపాటు. బలసూదనసూనుండు = ఇంద్రునికొడుకయినయర్జునుఁడు. అతని కేతనంబు = ఆకృపాచార్యునిటెక్కెమును. తునిమి = నఱికి. తరణికిరణ అనుకారపారంగతం

పారంగతంబు లగునారాచంబులు తదీయాంగంబుల నినుపం దొడంగిన రథచక్రర
క్షకు లగుచంద్రకేతుండును జిత్రాశ్వుండును మణిమంతుండును మంజుమాళియు
హేమవర్మయును సురథుండును సుషేణుండును నరిష్టుండును సుకేతుండును
నుక్కు మెఱయ నొక్కమొయిం దాఁకిన. 148

గీ. అన్ని వెడఁదవాతి♦యమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి♦యుక్కు మెఱయ
నతఁడు లీలఁ దునిమె♦ నందఱితలలును, ఘోరభంగి రక్త♦ధార లెగయ. 149

సీ. తునిమి తోడన యొక్క♦సునిశితశరమునఁ, గాఁడియు రెంట న♦క్షములఁ ద్రుంచి
హరుల నాల్గిటఁ జంపి ♦ యాలంపుటెలుఁగుతో, నొగలు మూఁ డమ్ముల♦నుగ్గు సేసి
ధనువును సూతుని♦తలయుఁ జెఱొక్కట, నఱికి లోచనముల ♦ నవ్వు నెఱయఁ
గృపుని నాలోకించి ♦ క్రీడి తద్వక్షఃస్థ, లంబునఁ గ్రూరభ♦ల్లంబు నాఁట
హతరథుండు నిపతి♦తాశ్వుండు సంఛిన్న, చాపుఁడును నికృత్త♦సారథియును
నయ్యు నొచ్చియును భు♦జార్గళసంరంభ, మతిశయిల్ల శక్తి ♦ నతఁడు వైచె. 150

---

బులు = సూర్యునికిరణములయొక్క పోలికయొక్క తుదముట్టినవి. అగు నారాచంబులు = అయిన బాణములను. తదీయఅంగంబులన్ = ఆకృపునివైన యవయవములయందు. నినుపన్ = నిండించుటకు. రథచక్రరక్షకులు = తేరుచక్రముల రక్షించువారు. ఉక్కు = బలము. ఒక్కమొయిన్ = ఒక్కటేమాఱుగా.

149. వెడఁదవాతిఅమ్ములు = వెడలుపుముఖము గల బాణములను. ఒక్కముష్టిన్ = ఒకపిడికిలిచేత. తొడిగి = సంధించి. ఉక్కు = బలము. రక్తధారలు = నెత్తురుధారలు. లీలన్ = విలాసముచేత.

తా.—అర్జునుఁ డొక్కటేపిడికిటఁ దొమ్మిదిబాణములను సంధించి యాచక్రరక్షకుల తొమ్మండ్రతలలను ఖండించెను.

150. తోడన్ = వెంటనే. సునిశితశరమునన్ = వాఁడిబాణముచేత. అక్షములన్ = బండికండ్లను. హరులన్ = గుఱ్ఱములను. ఆలంపుఎలుఁగుతోన్ = సింహనాదముతో. లోచనములన్ = కన్నులయందు. క్రీడి = అర్జునుఁడు. తత్ వక్షఃస్థలంబునన్ = ఆకృపునిఱొమ్మునందు. క్రూరభల్లంబు = కఱకుబాణమును. హతరథుండున్ = కొట్టఁబడినరథము గలవాఁడును. నిపతితఅశ్వుండున్ = చచ్చినగుఱ్ఱములు గలవాఁడును. సంఛిన్నచాపుఁడును = నఱకఁబడినవిల్లు గలవాఁడును. నికృత్తసారథియునున్ = నఱకఁబడిన సారథి కలవాఁడును. భుజఅర్గళసంరంభము = గడియమ్రాఁనివంటి బాహువులయొక్క వేగము. అతిశయిల్లన్ = అధిక మగునట్లు. శక్తి = శక్తి యను నాయుధమును. వైచెన్. పాఠాం:—నాల్గిటన్ ఆలంపుఁగోలలన్ = నాలుగు బాణములచేత నని యర్థము. ఆలంపుకోలతోన్ అనుపాఠ మనన్వితము.

తా.—అర్జునుఁడు పదుమూఁడుబాణము లెత్తి ఒకబాణముచేఁ గాఁడిని రెండుబాణములచే బండికండ్లను త్రుంచి నాలుగమ్ములచే గుఱ్ఱములను జంపి నొగలను మూఁడుబాణములచేఁ జూర్ణము చేసి యొకబాణముచే విల్లును మఱియొకబాణముచే సారథితలను ఖండించి నవ్వుచుఁ గృపునిఁ జూచి యొకబాణము

ఉ. మండుచు వచ్చు దానిఁ బది♦మార్గణముల్ గొని వేగ మొప్ప నా
ఖండలనందనుండు గడి♦కండలు సేసినఁ జూచి యప్పు డా
తం డుడివోక యెక్కుడు మ♦దంబున ఖడ్గము ఖేటకంబు ను
ద్దండతఁ గొంచుఁ దేరు డిగి ♦ తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. 151

వ. ఇట్లు గవిసిన. 152

క. పలకయు వాలును నింతిం, తలు దునియలు సేసె బాణ♦తతిఁ బాండవుఁ డి
ట్టల మైన వెఱఁగుపాటున, నిలిచె కృపుఁడు ద్రోణపుత్రు♦నిరథం బెక్కెన్. 153

గీ. అప్పు డే పడంగి ♦ యన్ని సేనలు భీష్ము, రథముపొంత కొదిఁగె ♦ రౌద్రరసవి
నోది యైనయర్జు♦నుఁడు ధనుశ్చాలన, దీప్తమూర్తి యగుచుఁ ♦ దిట్ట కుఱికె. 154

వ. ఇత్తెఱంగున నుఱక తఱియ నుఱికిన. 155

---

వానిటొమ్మున నాఁటెను. అట్లు కృపాచార్యుఁడు రథము విఱిగినను, గుఱ్ఱములు చచ్చినను, ధనుస్సు తెగినను, సారథి హతుఁ డయ్యును బాహుబలము విడువక యర్జునునిమీఁద శక్తి యను నాయుధమును ప్రయోగించెను.

151. దానిన్ = అశక్తిని. మార్గణముల్ = బాణములను. ఆఖండలనందనుండు = అర్జునుఁడు. కడికండలు = మిక్కిలి తునుకలు. ఉడివోక = తగ్గక. ఖేటకంబున్ = కేడెమును. ఉద్దండతన్ = పరాక్రమముచేత. రయము = వేగము.

తా.—అర్జునుఁడు తనమీఁదికి వచ్చు నాశక్తిని పదిబాణములచేఁ బెక్కుతునియలు కావింపఁగా నది చూచి కృపాచార్యుఁడు వెనుదీయక కత్తియును డాలును గొని తేరు దిగి యర్జును మీఁదికిఁ బోయెను.

153. పలకయున్ = డాలును. వాలునున్ = కత్తిని. పాండవుఁడు = అర్జునుఁడు. బాణతతిన్ = బాణములసమూహముచేత. ఇట్టలము = అధికము. ఐన వెఱఁగుపాటునన్ = అయినట్టి నిశ్చేష్టతతో. ద్రోణపుత్రునిరథంబు = అశ్వత్థామతేరును.

తా.—అర్జునుఁడు కృపాచార్యుని డాలును ఖడ్గమును నఱకఁగా నతఁ డేమియుం జేయనేరక యశ్వత్థామయొక్క తేరెక్కెను.

154. ఏపు = గర్వము. భీష్మురథముపొంతన్ = భీష్మునితేరియొద్దను. ఒదిఁగెన్ = పోయెను. రౌద్రరసవినోది = రౌద్రరసముచే వినోదించువాఁడు. ధనుశ్చాలనదీప్తమూర్తి = విల్లుయొక్కకదలించుటచేఁ బ్రకాశించుచున్న యాకారము గలవాఁడు. తిట్టకున్ = సేనాసమూహముమీఁదికి. ఉఱికెన్.

తా.—అపుడు సేన లన్నియు భయపడి భీష్ముని మఱుఁగు చొచ్చెను. అంత నర్జునుఁ డా సేనల మీఁది కుఱికెను.

155. ఉఱక = లక్ష్యము సేయక. తఱియన్ = సమీపమునకు.

క. బలములు దొరలుఁ బొదివి సం, కులయుద్ధము సేయఁ గ్రోధ♦ఘోరాకృతి యై
యిలఁ బ్రోవుగఁ జతురంగం, బుల వ్రేల్మిడిఁ బాండురాజ♦పుత్త్రుఁడు గూల్చెన్.

ఉ. చేతులతీఁట వ్రాఁగిటు ల♦శేషబలంబుల నుగ్గుసేసి మాం
సాతతపంక యై బహువి♦ధాయుధమీనము లొప్పఁ జామర
వ్రాతము ఫేనభంగి గ ని♦రంతరవీరశిరస్సరోరుహ
స్ఫీతవిభూతిఁ బొల్చునది ♦ సేసె రణస్థలియందు నెత్తుటన్. 157

గీ. ఇట్లు కౌరవానీకంబు ♦ నెల్లఁ గలఁచి, యాజి భీష్మునిదెసఁ బోవు♦క్రీడిఁ దాఁకెఁ
గొండతోఁ దాఁకుతగరు ను♦ద్దండవృత్తి, గోఁప వృషసేనుఁ డాహవ♦దోహలమున.

వ. విజయుండును. 159

గీ. భల్ల మొక్కట నాతని♦విల్లు దునిమి, యైదునారసములు వక్ష♦మాడ నేసె

156. బలములున్ = సేనలును. పొదివి = కవిసి. సంకులయుద్ధము = దొమ్మియుద్ధమును. పాండురాజపుత్త్రుఁడు = అర్జునుఁడు. క్రోధఘోరఆకృతిఐ = కోపముచే భయంకర మయినయాకారము గలవాఁడై. ఇలన్ = భూమియందు. ప్రోవుగన్ = రాశిగా. వ్రేల్మిడిన్ = శీఘ్రముగా. చతురంగంబులన్ = నాలుగంగములను, చతురంగసేన ననుట, రథగజతురగపదాతి చతురంగము, సంజ్ఞావాచక మగుటచేఁ గర్మధారయసమాసము.

తా.—సేనలతోఁ గూడ రాజులు తనమీఁదికి వచ్చి యుద్ధము చేయఁగా నర్జునుఁడు కోపము గలవాఁడై చతురంగసైన్యమును ఖండించెను.

157. అశేషబలంబులన్ = ఎల్లసేనలను. మాంసఆతతపంకఐ = మాంసము అను గొప్పబురద గలదై. బహువిధఆయుధమీనములు = పలువిధము లగు నాయుధములు అను చేఁపలు. ఒప్పన్ చామరవ్రాతము = వింజామరలసమూహము. ఫేనభంగి = నురుఁగువంటిది. కన్ = కాఁగా. నిరంతరవీరశిరస్సరోరుహస్ఫీతవిభూతిన్ = ఎడతెగనిశూరులతలలు అను కమలములయొక్క యెక్కుడు సంపదచేత. పొల్చునది = ప్రకాశించునట్టియేఱును. నెత్తుటన్. రణస్థలియందున్ = యుద్ధభూమియందు. చేసెన్.

తా.—ఇట్లు సేనల నన్నిటిని జంపి రణభూమియందు మాంసము బురదగాను ఆయుధములు మత్స్యములుగాను వింజామరలు నురుఁగుగాను శూరులశిరస్సులు కమలములుగాను గలిగిన నెత్తుటేఱును బ్రవహింపఁ జేసెను.

158. కౌరవఅనీకంబున్ = కౌరవసేనను. కలఁచిఅడి = కలఁతపెట్టి. ఆహవదోహలమునన్ = యుద్ధమునందలి యాశచేత. తాఁకుతగరుఉద్దండవృత్తి=ఎదుర్కొనునట్టి పొట్టేలియొక్క గొప్పవ్యాపారమువంటి వ్యాపారము. క్రీడిన్ = అర్జునుని.

తా.—ఈప్రకారముగాఁ గౌరవసైన్యమునంతయు జయించి భీష్మునిమీఁదికిఁ బోవుచున్న యర్జునుని కర్ణునికొడుకయినవృషసేనుఁడు కొండను పొట్టే లెదిరించునట్లెదిరించెను.

159. విజయుండును = అర్జునుఁడును.

160. భల్లముఒక్కటన్ = ఒకబాణముచేత. నారసములు = బాణములను. వక్షము =

నతఁడు సైరింప రానినొ ♦ వ్వడరుటయును, బెగ్గలంబున నరదంబు ♦ డిగ్గి పాఱె.

వ. అట్టియెడ దుశ్శాసనశకునిదుర్ముఖవివింశతివికర్ణులు దన్నుం బొదివికొనిన వారల రథరథ్యకేతువర్మంబులు జర్జరితంబులుగా నేసి గాసిచేసిన నందఱుం గనుకనిఁ బఱవం దొడంగినఁ బార్థుండును బ్రహర్షోల్లాసభాసురముఖుం డగుచు నుత్తరుం గనుంగొని. 161

గీ. కనకమయతాలకేతువు ♦ గ్రాలఁ జిరత, టిల్లతాలీలఁ గలిగి శో♦భిల్లునంబు దంబుచాడ్పున సురనదీ♦తనయుఁ డున్న, వాఁడు సూచితె మత్స్యభూ♦వరతనూజ.

——( అర్జునుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట. )——

క. బలువిడి మనదివ్యాస్త్రం, బులచవి చూపంగవలయుఁ ♦ బో నిమ్ము రథం బలసగతి నతనిదెస కని, పలికిన నతఁ డట్ల చేసెఁ ♦ బరమప్రీతిన్. 163

ఉ. శాంతనవుండు నప్డు నిజ♦శంఖము కౌరవరాజసైన్యముల్
సంతస మంద నొత్తుచు స♦సంభ్రమలీల నెదుర్కొనంగ దు

---

బొమ్మ. అడఁక = నాటునట్లు. సైరింపరానినొవ్వ = ఓర్వరానినొప్పి. అడరుటయును = కలుగఁగా. బెగ్గలంబునన్ = భయముచేత. అరదంబు = తేరునుండి.

తా.—ఒకబాణముచే వృషసేనుని విల్లు ఖండించి యయిదు బాణములను బొమ్మున నాటఁగా వృషసేనుఁ డానొప్పిని సహింపఁజాలక భయపడి తేరు దిగి పాఱిపోయెను.

161. రథరథ్యకేతువర్మంబులు = రథములను గుఱ్ఱములను జెండాలను కవచములను. జర్జరితంబులుగాన్ = మిక్కిలి శిథిలము లగునట్లు. కనుకనిన్ = వేగిరపాటుచేత. పార్థుండును = అర్జునుఁడును. ప్రహర్షఉల్లాసభాసురముఖుండు = పెద్దనవ్వుయొక్కప్రకాశముచేఁ బ్రకాశించుచున్న మోము గలవాఁడు.

162. కనకమయతాలకేతువు = బంగారువికారమయినతాటిచెట్టుసిడము. క్రాలన్ = ప్రకాశింపఁగా. చిరతటిల్లతాలీల = బహుకాల ముండునట్టి మెఱపుతీఁగయొక్క విలాసము. శోభిల్లు అంబుదంబుచాడ్పునన్ = ప్రకాశించునట్టి మేఘమువలె. సురనదీతనయుఁడు = భీష్ముఁడు. మత్స్యభూవరతనూజ! ఉత్తరునిసంబోధనము.

తా.—ఉత్తరా! బంగారువికారమయినతాటిచెట్టుసిడము గలవాఁడై భీష్ముఁడు నిశ్చలమయిన మెఱపుతోఁ గూడిన మేఘమువలెఁ బ్రకాశించుచున్నాఁడు చూడుము.

163. బలువిడిన్ = గొప్పపరాక్రమముచేత. మనదివ్యఅస్త్రంబులచవి = మనమేలిబాణములయొక్క రుచిని. అలసగతిన్ = తిన్ననినడకచేత. పరమప్రీతిన్ = గొప్పసంతోషముతో.

తా.—భీష్మునికి మనబాణములరుచి చూపవలయు. అతనిమీఁదికిఁ దిన్నగా రథమును పోనిమ్మనఁగా నుత్తరుఁడు సంతోషంబున నట్లు చేసెను.

164. శాంతనవుండున్ = భీష్ముఁడును. ససంభ్రమలీలన్ = వేగముతోఁ గూడినవిలాసముచేత. నరుండున్=అర్జునుఁడును. దుర్దాంతభుజాబలప్రకటదర్పము= అణఁపరానిబాహుబలముచేఁ గలిగినప్రసిద్ధమయినగర్వము. ఎలర్పన్ = ప్రకాశించునట్లు. దిగ్దంతినికాయకర్ణపుటదారణవిత్తమున్ =

ద్రాంతభుజాబలప్రకట♦దర్ప మెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతినికాయకర్ణపుట♦దారణవిత్తము దేవదత్తమున్. 164

సీ. మలసి ఱంకెలు వైచుచు ♦ మాఱుకొనిన, వృషభములభంగి నక్కురు♦వృషభు లిద్ద
ఱు సమదగతిఁ జేరునెడఁ జూచి♦రమరు లర్థి, ననిమిషత్వంబు దమకప్పు♦డచ్చుపడఁగ.

వ. ఇవ్విధంబునం గనుంగొనుచు వారలు దమలోన. 166

క. మనలను దానవులను గడ, చినయవి భుజబలము లస్త్ర♦శిక్షావిధముల్
గొనియాడఁ గోలఁది గా దీ, తని నాతఁడ యతని నితఁడ ♦ తగుఁ జెనయంగన్.

సీ. అనుచుండ సైన్యంబు♦ లార్పులుఁ బెడబొబ్బ,లును దూర్యనాదంబు♦లును జెలంగఁ
బేర్చి యొక్కుమ్మడి ♦ భీష్ము నగ్గింపంగ, నతఁడు నిశాతబా♦ణాష్టకమునఁ

---

దిగ్గజములసమూహముయొక్క దొప్పలవంటిచెవులయొక్క చీల్చుటచేఁ బ్రసిద్ధ మయినదానిని. దేవదత్తమున్. ఒత్తెన్ = ఊఁదెను.

తా.—అప్పుడు భీష్ముఁడు కురుసేన సంతోషించునట్లు తనశంఖము పూరించి యర్జునునిమీఁదికి రాఁగా నర్జునుండును బాహుబలముచే గర్వించి దిగ్గజముల చెవులను భేదించునట్టిదేవదత్త మనుశంఖమును పూరించెను.

165. మలసి = పూని. మాఱుకొనినవృషభములభంగిన్ = డీకొన్న యాఁబోతులవలె. అక్కురువృషభులు = ఆకౌరవశ్రేష్ఠులు, భీష్మార్జునులు. సమదగతిన్ = గర్వముతోఁ గూడినవిధముచేత. అమరులు = దేవతలు. అర్థిన్ = కోరికతో. అనిమిషత్వంబు = ఱెప్పపాటు లేనితనము. అచ్చుపడఁగన్ = స్పష్ట మగునట్లు. చూచిరి.

తా.—అప్పు డాఁబోతు లొకటితో నొకటి డీకొనునట్లు భీష్మార్జునులు ఒకరిమీఁది కొకరుపోవుటను దేవతలు తమకు ఱెప్పపాటు లేకుండుట సార్థక మగునట్లు చూచిరి.

167. దానవులను = రాక్షసులను. అస్త్రశిక్షావిధముల్ = బాణవిద్యయొక్కవిధములును. కడచినయవి = మీఱినవి. చెనయంగన్ = ఎదిరించుటకు. తగున్.

తా.—ఈభీష్మార్జునులు భుజబలమును నస్త్రవిద్యయును మనకంటెను రాక్షసులకంటెను నెక్కుడుగాఁ గలిగి యున్నారు. వీరిని కొనియాడ శక్యము కాదు. ఈయర్జునునితో యుద్ధము చేయుటకు ఆభీష్ముఁడే తగినవాఁడు, ఆభీష్మునితో యుద్ధము చేయుటకు ఈయర్జునుఁడే తగినవాఁడు.

168. ఆర్పులున్ = అఱపులును. పెడబొబ్బలును = పెద్దసింహనాదములును. తూర్యనాదంబులును = వాద్యములధ్వనులును. చెలంగన్ = మ్రోయఁగా. తూర్యనాదంబు లుల్లసిల్లన్ అని పాఠాంతరము, ఇందు యతిభంగము కావున నిది యుపేక్ష్యము. పేర్చి=విజృంభించి. ఒక్కుమ్మడిన్ = ఒకపూనికచేత. అగ్గింపంగన్ = పొగడఁగా. నిశాతబాణఅష్టకమునన్= వాఁడిబాణములయెనిమిదింటిచేత. పడగపైహనుమంతుఒడలును = టెక్కెముమీఁదనున్న హనుమంతునిదేహమును. బహుశరంబులన్ = పెక్కుబాణములచేత. దశవిశిఖమునన్ = పదిబాణములచేత, సమాహారద్విగుసమాసము. రథ్యములను = గుఱ్ఱములను. వాసవియును=అర్జునుఁడును. ఎసకము ఎసఁగు అగ్గలికన్ = మిక్కిలి యతిశయించుచున్నయుత్సాహముచేత. గాండివంబు. చక్రాకృతిప్రకాశవ

బడగపై హనుమంతు♦నెడలును బహుశరం, బుల సందుఁ జెలఁగెడు♦భూతములను
దశవిశిఖమున ర♦థ్యములను సారథి, నేసె వాసవియును ♦ నెసక మెసఁగు
నగ్గలిక గాండివంబు చ♦క్రాకృతిప్ర, కాశవహ్నిస్వరూపత ♦ గలిగి విడుపు
తెఱపి గానంగ రాకుండ ♦ మెఱసి యొప్ప, సాంద్రసాయకతతి నాక♦సంబుఁ గప్పె.

గీ. అర్జునుఁడు గవియించిన♦యంపమూడ, మంచు దళముగఁ గప్పిన ♦ మార్గణాంశు
జాలముల వెస విరియించె ♦ శాంతనవప, తంగుఁ డుద్ద్యోతమానప్ర♦తాపలీల.

క. అమరేంద్రతనయుఁ డుగ్రా, స్త్రములు వడిం గురియ నడుమఁ ♦ దరమిడి వానిం
దుమురుగఁ జేయుచు వచ్చెను, సమరోల్లాసంబు మెఱయ ♦ శంతనుసుతుఁడున్.

క. అర్జునుఁడు దివ్యబాణ, స్ఫూర్జితదోశ్శక్తి దనకుఁ ♦ జూపిన నతఁ డ

---

హ్నిస్వరూపత = చక్రాకారముచేఁ బ్రకాశించునట్టి నిప్పుయొక్క-రూపమువంటి స్వరూపము గలిగి యుండుట. విడుపుతెఱపి = విడుమరసందు. సాంద్రసాయకతతిన్ = దట్టమయిన బాణములసమూహముచేత. ఆకసంబున్. కప్పెన్.

తా.—అప్పుడు సేనలు గొప్ప యఱపులతోను సింహనాదములతోను వాద్యధ్వనులతోను తన్నుఁ బొగడుచుండఁగా భీష్ముఁడు ఎనిమిదిబాణములచే నర్జునుని జెక్కెముమీఁదనుండు హనుమంతునిఁ, బెక్కుబాణములచే వాహనుమంతునిఁ జుట్టియుండు పిశాచములను, బదిబాణములచే నర్జునునిగుఱ్ఱములను సారథిని నొప్పించెను, అంత నర్జునుండును నుత్సాహముతో గాండివధనుస్సు చక్రాకారమైన యగ్నివలెఁ బ్రకాశించుచుండఁగాఁ గొంచెమైనను సందు లేనియట్లు పెక్కుబాణములను బ్రయోగించెను.

169. కవియించినఅంపమూడమంచు = ప్రయోగించినబాణములు అను దట్టమయినమంచు. దళముగన్ = దట్టముగా. శాంతనవపతంగుఁడు = భీష్ముఁడు అనుసూర్యుఁడు. ఉత్ద్యోతమానప్రతాపలీలన్ = మిక్కిలి ప్రకాశించుచున్నపరాక్రమము అను వెండయొక్క-విలాసముచేత. మార్గణఅంశుజాలములన్ = బాణములు అనుకిరణములసమూహములచేత. విరియించెన్.

తా.—అర్జునుఁడు ప్రయోగించినబాణములు అను మూవమంచును భీష్ముఁడు అనుసూర్యుఁడు తనప్రతాపముఁ జూపి బాణము లనుకిరణములచేఁ దొలఁగించెను. అర్జునుఁడు ప్రయోగించినబాణములను భీష్ముఁడు ప్రతిహతములు గావించె నని భావము. అలం. రూపకము.

170. అమరఇంద్రతనయుఁడు = దేవేంద్రునికుమారుఁ డయినయర్జునుఁడు. ఉగ్రఅస్త్రములు = భయంకరము లయినబాణములను. తరమిడి = పరుసపెట్టి. తుమురుగన్ = చూర్ణ మగునట్లు. శంతనుసుతుఁడున్ = భీష్ముఁడును. సమరఉల్లాసంబు = యుద్ధమునందలి యుత్సాహము. మెఱయన్.

తా.—అర్జునుఁడు కఱకుబాణములను భీష్మునిపై వేగంబున నేయుచుండఁగా భీష్ముఁడు వానిని నడుమనే పరుసపెట్టి నఱకుచుండెను.

171. దివ్యబాణస్ఫూర్జితదోశ్శక్తి = దేవతాసంబంధి బాణములచేఁ బ్రకాశించుచున్న చేతుల లావును. అతిఊర్జితబలుఁడువై = మిక్కిలి యెక్కు-డయినబలము గలవాఁడై. నియమఉపార్జిత

తూర్యార్జితబలుఁడై నియమవోఁ, బార్జితఘోరాస్త్రవితతిఁ ♦ బ్రతిహతిఁ జేసెన్.
క. కవ్వడి యెమ్మెయి నేసిన, నవ్విధమున నాశరంబు ♦ లన్నియు దూరా
దవ్వులన నిలువరింపఁగ, వివ్వచ్ఛుఁడు గినిసి యేసె ♦ విలు విఱుగంగన్. 172
మ. తనకోదండము ఖండితం బగుటఁ గ్రో♦ధం బార మందాకినీ
తనయుం డప్డు సటావిలుంఠనసము♦ద్యత్కోపసింహాకృతిన్
ధను వొం డుద్ధతలీల నెత్తికొని య♦స్త్రశ్రేణిఁ బర్వించె న
ర్జునుపైఁ దాఁకిరి చక్రరక్షకులు నా♦ర్పుల్ నింగి ముట్టన్ వడిన్. 173
చ. విజయుఁడు వారి నెల్ల నొక♦వ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక
వ్రజము నడంచియున్ రథము♦వాజుల నొంచియు నాజికేళియం

---

ఘోరఅస్త్రవితతిన్ = వ్రతములచే సంపాదింపఁబడినభయంకరము లయినయస్త్రములసమూహము చేత. ప్రతిహతిన్ = కొట్టుటను. చేసెన్.

తా.—అర్జునుఁడు దివ్యాస్త్రములను బ్రయోగింపఁగా భీష్ముఁడు దివ్యాస్త్రములచే వానిని నివారించెను.

172. ఎమ్మెయిన్ = ఏవిధమున. ఆశరంబులు = ఆబాణములు. దూరాదవ్వులన్ అ = మిక్కిలిదూరమునందే. నిలువరింపఁగన్ = నిలుచునట్లు చేయఁగా. వివ్వచ్ఛుఁడు = అర్జునుఁడు. కినిసి = కోపించి.

తా.—అర్జునుఁ డేవిధముగా బాణములఁ బ్రయోగించినను భీష్ముఁ డావిధముననే యాబాణముల నన్నిటిని దూరమునందే ఖండించుచుండఁగా నర్జునుఁడు కోపించి భీష్ముని విల్లు నఱికెను.

173. తనకోదండము = తనవిల్లు. ఖండితంబు = నఱకఁబడినది. అగుటన్ = కాఁగా. క్రోధంబు = కోపము. ఆరన్ = నిండఁగా. మందాకినీతనయుండు = భీష్ముఁడు. సటావిలుంఠనసముద్యత్కోపసింహఆకృతిన్ = కేసరములపెఱుకుటచేఁ గలుగుచున్నకోపము గల సింహము యొక్క యాకారమువంటి యాకారముచేత. ఒండు = మఱియొక. ధనువు = ధనుస్సును. ఉద్ధతలీలన్ = గర్వముతోడి విధముచేత. అస్త్రశ్రేణిన్ = బాణములవరుసను. పర్వించెన్ = ప్రయోగించెను. చక్రరక్షకులున్ = చక్రములకాపాడువారును. ఆర్పుల్ = అఱపులు. నింగిన్ = ఆకాశమును. ముట్టన్. వడిన్. తాఁకిరి.

తా.—తనవిల్లు నఱుకుటఁ గోపించి కేసరములను బెఱుకఁగాఁ గోపించిన సింహమువలె నున్నవాఁడై భీష్ముఁడు మఱియొకధనుస్సు నెత్తికొని యర్జునుని మీఁదఁ బెక్కుబాణములు ప్రయోగించెను. అంత నతనిచక్రరక్షకులును సింహనాదములు చేయుచు నర్జునుం దాఁకిరి.

174. విజయుఁడు = అర్జునుఁడు. వారిన్ ఎల్లన్ = ఆచక్రరక్షకులనందఱను. ఒకవ్రేల్మిడిన్ = ఒకనిమిషములో. భీష్మసాయకవ్రజమున్ = భీష్మునిబాణములసమూహమును. రథమువాజులన్ = తేరిగుఱ్ఱములను. నొంచియున్ = నొప్పించియు. ఆజికేళియందున్ = యుద్ధము అను నాటయందు. అజితవిలాసముల్ = గెలువఁబడనివిలాసములను. మెఱయన్ = చూపఁగా. కుంభజముఖయోధవీరతతి = ద్రోణుఁడు మొదలుగాఁగల శూరు లయినయోధులసమూహము. విస్మయమున్ = ఆశ్చర్యమును. అందుచున్. ఉండెన్. సిద్ధఖేచరుల్ = సిద్ధులును గంధర్వులును. ప్రస్తుతి చేసిరి = పొగడిరి.

దజితవిలాసముల్ మెఱయ ♦ నప్పుడు విస్మయ మందు చుండెఁ గుం
భజముఖయోధవీరతతి ♦ ప్రస్తుతి సేసిరి సిద్ధఖేచరుల్. 174

క. కొండొకయెడఁ గని శాంతన, వుం డాఖండలతనూభ♦వునిడామూఁపు
ద్దండభుజబలము మెఱయఁ బ్ర, చండా స్త్రక్షతము సేసె ♦ సరభసవృత్తిన్. 175

చ. కినుక మనంబునం గదిరి ♦ క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిం
దునిమి నితాంతగాఢరయ♦దోర్విభవంబున నొండువిల్లు గై
కొని యెడుసందునన్ నినిచెఁ ♦ గ్రూరశరంబు లురంబునందు గ్ర
క్కున నతఁ డొల్లఁ బోయి రథ♦కూబర మూఁతగ నిల్చె సోలుచున్. 176

క. కనుఁగొని సూతుం డరదముఁ, గొనిపోయెం దొలఁగ నప్పుడు ♦ కుంతీతనయుం
డనిఁ దనివి సనక గుంపులు,గొని యున్నెడ లరసెఁ గలయఁ ♦ గురుసైన్యములన్.

వ. ఇట్లు ప్రేత్తి చూచి గాండీవంబు దొడసి గుణంబు సారించి కవదొనలు బిగియించి.

---

తా.—అర్జునుఁడు భీష్మునిచక్రరక్షకుల నొకక్షణములో వధించి భీష్ముఁడు ప్రయోగించినబాణములను వారించి యతనిగుఱ్ఱములను నొప్పించి యి ట్లెనురు లేక యుద్ధము చేయుచుండఁగా ద్రోణుఁడు మొదలగువా రాశ్చర్యపడిరి. సిద్ధులు మొదలగువారు పొగడిరి.

175. శాంతనవుండు = భీష్ముఁడు. కొండొకఎడ = కొంచెము అవకాశమును. కని. ఉద్దండభుజబలము = అధిక మయినబాహుబలము. అఖండలతనూభవునిడామూఁపు = ఇంద్రునికుమారుఁడయినయర్జునుని యెడమభుజశిఖరమును. సరభసవృత్తిన్ = వేగిరపాటుతోఁ గూడినవ్యాపారముచేత. ప్రచండఅస్త్రక్షతము= భయంకరము లయినబాణములచేఁ గొట్టఁబడినదానిని. చేసెన్.

తా.—భీష్ముఁడు కొంచెము సందు చూచికొని వాఁడిబాణములచే నర్జునుని యెడమమూఁపును నొప్పించెను.

176. కినుక = కోపము. మనంబునన్ = మనస్సునందు. కదిరి = కలిగి. క్రీడి = అర్జునుఁడు. పితామహువిల్లు = భీష్మునిధనుస్సును. వ్రేల్మిడిన్ = నిమిషములోపల. తునిమి. నితాంతగాఢరయదోఃవిభవంబునన్ = మిక్కిలి యెక్కు డయినవేగము గల చేతులయతిశయముచేత. క్రూరశరంబులు = కఱకుటమ్ములను. ఉరంబునందున్ = ఱొమ్మునందు. గ్రక్కునన్ = తటాలున. నినిచెన్ = నిండించెను. అతఁడు = ఆభీష్ముఁడు. ఒల్లఁబోయి= మూర్ఛిల్లి. సోలుచున్ = పరవశుఁడగుచు. రథకూబరము = తేరినొగ. ఊఁతగన్= ఆధార మగునట్లు. నిల్చెన్.

తా.—అర్జునుఁడు కోపము గలవాఁడై భీష్ముని విల్లు నఱకి యతఁడు మఱియొకవిల్లు గ్రహించునంతలోనే వేగముగా వాఁడియమ్ము లాతనిఱొమ్మునందు నాటెను, అంత భీష్ముఁడు మూర్ఛిల్లి తేరి నొగ మీఁద వ్రాలెను.

177. సూతుండు = భీష్మునిసారథి. అరదమున్ = తేరును. అనిన్ = యుద్ధమునందు.

తా.—అప్పుడు సారథి భీష్మునిరథమును దొలఁగఁ దోలుకొని పోయెను. అర్జునుఁడు యుద్ధమునందుఁ దృప్తి నొందక కౌరవసేనయందు గుంపులు గూడియున్న చోట్లను వెదకి చూచెను.

178. అట్టు = మెడను. తొడసి = తుడిచి. గుణంబు = అల్లెత్రాటిని. కవదొనలు = జంటయమ్ములపొదులను.

క. ఆచార్యసూర్యతనయకృ, పాచార్యప్రభృతిరథికు ♦ లందఱుఁ బ్రోవై
చూచుచు నుండఁగ నర్దెస, కేచి భుజాబలము మెఱయ ♦ సింద్రజుఁ డరిగెన్.

వ. అప్పు డశ్వత్థామ కర్ణున కిట్లనియె. 180

గీ. వీఁడె వచ్చు చున్న♦వాఁడు పార్థుఁడు మన, మేమి సేయువార ♦ మీవు దక్క
నొరులు నిలువరింప ♦ నోపెడువార లే, యోట లేక తాఁకి ♦ యోర్వవలదె.

క. అని తను నుల్లస మాడినఁ, గినిసి యినతనూజుఁ డేను ♦ గ్రీడి నిచట మా
ర్కొనుపీకఁ గన్నులారఁ, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ ♦ గవిసెం బెలుచన్.

క. దొరలును సుభటులుఁ గర్ణుని, యరదమునకు మున్న పొదివి ♦ రర్జును నచటం
గరి సొచ్చినతుంగమదువు, పరుసున మొన చాఁపకట్టు ♦ వడియె నతనిచేన్. 183

గీ. ఇవ్విధంబునఁ బోరెడు♦నింద్రతనయు, నుక్కులావును నం తంత ♦ కెక్కుడయ్యె

179. ఆచార్యసూర్యతనయకృపాచార్యప్రభృతిరథికులు = ద్రోణుఁడును కర్ణుఁడును కృపుఁడును మొదలుగాఁ గలశూరులు. అర్దెసన్ = ఆవోటికి. ఏచి = విజృంభించి. భుజాబలము = బాహుబలము. ఇంద్రజుఁడు = అర్జునుఁడు.

తా.—ద్రోణుఁడు కర్ణుఁడు కృపుఁడు మొదలుగాఁ గలశూరులు చూచుచుండఁగా నచ్చటికి నర్జునుఁడు విజృంభించి వచ్చెను.

181. పార్థుఁడు = అర్జునుఁడు. ఒరులు = ఇతరులు. నిలువరింపన్ = మరలించుటకు. ఓపెడువారలే = చాలెడువారా? ఓట = భయము.

తా.—వీఁడుగో అర్జునుఁడు వచ్చుచున్నాఁడు అతనిని నీవే నివారింపవలయును, గాని మఱి యెవ్వరును నిలుపఁ జాలరు, కావున నీవు భయము లేక యెదిరించి జయింపవలెను.

182. ఉల్లసమాడినన్ = పరిహాసము చేయఁగా. కినిసి = కోపించి. ఇనతనూజుఁడు = కర్ణుఁడు. మార్కొనుపీకన్=ఎదుర్కొనుశౌర్యమును. పెలుచన్= పరాక్రమముతో. కవిసెన్= తాఁకెను.

తా.—అశ్వత్థామ తన్నట్లెత్తి పొడుపుమాటలాడఁగాఁ గర్ణుఁడు కోపించి నే నిప్పు డర్జును నితో యుద్ధము చేసెదను నీవు చూచుచుండు మని చెప్పి యర్జునునిమీఁదికిఁ బోయెను.

183. సుభటులున్ = మేలిబంటులును. కర్ణునిఅరదమునకున్ మున్న = కర్ణునితేరునకు ముందుగానే. అర్జునున్. పొదివిరి. అతనిచేన్ = అయర్జునునిచేత. కరి= ఏనుఁగు. చొచ్చినతుంగమదువుపరుసునన్ = చొచ్చినట్టి తుంగలు గల మడుఁగువలె. మొన = సైన్యము. చాఁపకట్టు పడియెన్.

తా.—అప్పుడు కర్ణునికంటె ముందుగా రాజులును గొప్పబంటులును నర్జును నెదిరించిరి. ఏనుఁగు తుంగమడుఁగునువలె నర్జునుఁడా సేన నంతయుఁ గలఁచెను.

184. ఇంద్రతనయుఉక్కులావును = అర్జుని శౌర్యమును బలమును. మేనులు = దేహములు. తూలాడన్ = చలింపఁగా. అయోధముఖ్యులు = ఆశూరులయందు శ్రేష్ఠులు. ఆహవము = యుద్ధమును. తక్కి = విడిచి. అంతన్ అంతన్ = అచ్చటచ్చట. నిలిచిరి.

నలసి మేనులు దూలాడ♦నిలిచి రంత, నంత నయోధ్యాధముఖ్యు లా♦హవమునఁ దక్కి.

వ. అట్టియెడ నుత్తరుండు నరున కిట్లనియె. 185

చ. ఉడుగుర లేనికయ్యమున ♦ కోర్వఁగ వచ్చునె నాకు దప్పి పు
ట్టెడు నొకమాటు నాగ్రహము ♦ డింపవు నీవును జక్కఁ జేసి ప
చ్చడి గలపంగ మెండియును ♦ జండితనంబున వచ్చి వచ్చి పో
రెడు మొన లింకఁ జాల నో♦సరింప భవద్రథసూతకృత్యమున్. 186

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేను గలుగ నీకు నోహటింప నేల యంతియ వలసినం దురంగంబులఁ దోడు గడపెద నించుక సైరించి నిలువ వలయు నెల్లపనులును జక్కనయ్యె రా జొక్కఁడుండు గొంత యూఁతం డభిమాని మనలం గని సరకు గొనఁ డిప్పు డున్నచందంబు మనతోడం దలపడం గడంగుట దోఁచుచున్నయది తమ్ములు నాప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱసి దగ్గఱి యున్నవా రని కౌరవేశ్వరునిగట్టిమోహరంబుఁ జూపి యతనిం బురిగొల్పి యద్దిక్కు తేరు వోవ నిమ్మనుటయు నతండును దలకొని యట్ల చేయ నడరి యెడనెడ నడ్డపడుకురుబలంబులం జిఱునగవు నిగుడ మెఱుంగువాలమ్ముల దొలంగ జడియుచుం గదిసిన నమ్మేదినీవల్లభుండు. 187

---

తా.—ఈప్రకారము అర్జునుఁ డెంత యుద్ధము చేసినను నతని కప్పటప్పటికి బలశౌర్యములు హెచ్చెను. కౌరవవీరులు అలసి పరవశులై యుద్ధము చేయఁజాలక యచ్చటచ్చట నిలిచిరి.

186. ఉడుగుర = విడుపుర. లేనికయ్యమునకున్ = లేనియుద్ధమునకు. ఓర్వఁగన్. వచ్చునె. డింపవు = విడువవు. చక్కచేసి = ఖండించి. మొనలు = కౌరవుల సేనలు. చండితనంబునన్ = మొండితనముచేత. భవద్రథసూతకృత్యమున్ = నీతేరుతోలువానియొక్క పనిని. ఒసరింపన్ చాలన్ = చేయఁ జాలను.

తా.—ఇట్లు నీవు ఎడతెగక యుద్ధము చేయుచున్నాఁడవు, నేను సహింపఁజాలను. నాకు దప్పి గలుగుచున్నది. నీవు కొంచెమైనను కోపము విడువక సేనలను వధించుచున్నను ఆసేనలు మరల మొండితనముతో యుద్ధమునకు వచ్చుచున్నవి, కావున నేను నీకు సారథ్యము చేయఁజాలను.

187. ఓహటింపన్ = వెనుదీయుట. అంతియవలసినన్ = అంతమాత్రమే కావలసినయెడ. సైరించి = సహించి. రాజు = దుర్యోధనుఁడు. కడంగుట = పూనుట. ఆప్తభృత్యులున్ = కూరిమిసేవకులును. ఇరుగెలంకులన్ = ఇరుప్రక్కలయందును. అగ్గలికన్ = ఉత్సాహముచేత. కౌరవఈశ్వరునిగట్టిమోహరంబు = దుర్యోధనునిదృఢమయినవ్యూహమును. తలకొని = పూని. ఎడన్ ఎడన్ = అచ్చటచ్చట. మెఱుంగువాలమ్ములన్ = ప్రకాశించుచున్నవాఁడిబాణములచేత. జడియుచున్ = తోలుచు. ఆమ్మేదినీవల్లభుండు = ఆదుర్యోధనుఁడు.

( అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు సేయుట. )

క. పులి గోల వ్రేసినట్టి, ట్టులపురయంబునఁ గడంగు♦టయుఁ దద్వక్షః
స్థలమునఁ గిరీటి రెండ, మ్ములు నాటఁగ నేసె బాము♦ ముడిచినట్లుండన్. 188

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో, ణితధారలు మదముగా వి♦నిద్రకరీంద్రా
కృతిఁ గవిసి యతండేసెను, శతమఖసుతుఫాలతలము ♦ శాతశరమునన్. 189

గీ. రక్తధారలువెడలంగ♦రశ్మి వెలుఁగఁ, బొలుచుబాలార్కుచాడ్పునఁ♦జెలువుమిగిలి
ఫల్గునుండు ప్రతాపసం♦భరితమూర్తి, యగుచు శరకిరణంబులు ♦ నిగుడఁ జేసె.

శా. వానిం దీవ్రశరంబులం దునిమి గ♦ర్వం బెక్క నానాస్త్రసం
తానంబుల్ గురిసెన్ సుయోధనుఁడు దు♦ర్దాంతాకృతిన్ గోత్రభి

188. ఇట్లుల పురయంబునన్ = అధిక మగు వేగము చేత. కడంగుటయున్ = ఎదుర్కొనఁగా. తత్ వక్షఃస్థలమునన్ = ఆదుర్యోధనునిఱొమ్మునందు. కిరీటి = అర్జునుఁడు.

తా.—దుర్యోధనుఁడు కఱ్ఱతోఁ గొట్టినపులివలె నర్జునునిమీఁదికిరాఁగా నర్జునుఁడు కోపముతో రెండుబాణము లాదుర్యోధనునిఱొమ్మునందు నాటెను.

189. క్షతములన్ = గాయములనుండి. పెల్లుదొరఁగుశోణితధారలు = మిక్కిలి కాఱుచున్న నెత్తురుధారలు. మదముగాన్ = మదజలము కాఁగా. వినిద్రకరీంద్రఆకృతిన్ = జాగరూక మయిన గజశ్రేష్ఠముయొక్క యాకారమువంటి యాకారముతో. కవిసి = తాఁకి. అతండు = ఆదుర్యోధనుఁడు. శతమఖసుతుఫాలతలము= అర్జునునియొక్క నెత్తిప్రదేశమును. శాతశరమునన్ = కఱకుటమ్ముచేత. ఏసెను.

తా.—గాయములనుండి నెత్తురు కాఱుచుండుటచే మదము గాఱుచున్న యేనుఁగువలె దుర్యోధనుఁ డర్జునుఁ దాఁకి వానిలలాటమునందు వాఁడిబాణమును నాటెను.

190. రక్తధారలు = నెత్తురుధారలు. వెడలంగన్ = కాఱుచుండఁగా. రశ్మి = కాంతి. పొలుచుబాలఅర్కుచాడ్పునన్ = ప్రకాశించునట్టి బాలసూర్యునివలె. చెలువు = చక్కఁదనము. మిగిలి = అతిశయించి. ఫల్గునుండు = అర్జునుఁడు. ప్రతాపసంభరితమూర్తి = పరాక్రమము అనునెండచే నిండినయాకారము గలవాఁడు. అగుచున్. శరకిరణంబులు= బాణములు అను కిరణములను. నిగుడన్ చేసెన్ = వ్యాపింపఁజేసెను.

తా.—రక్తము కాఱుటచేఁ గాంతితోఁ గూడినబాలసూర్యునివలెఁ బ్రకాశించుచు నర్జునుఁడు ప్రతాపమును వహించి బాణకిరణములను దుర్యోధనునిపైఁ బ్రయోగించెను.

191. సుయోధనుఁడు = దుర్యోధనుఁడు. తీవ్రశరంబులన్ = కఱకుటమ్ములచేత. నానా అస్త్రసంతానంబుల్ = పలువిధము లగుబాణములసమూహములను. కురిసెన్. గోత్రభిత్సూనుండున్ = ఇంద్రునికుమారుఁ డయినయర్జునుఁడును. దుర్దాంతఆకృతిన్ = అణఁపరానియాకారముచేత. పటుసాయకఉత్కరమునన్ = బటువు లగుబాణములసమూహముచేత. భుజఆటోపము = బాహుపరాక్రమమును. చూపెన్. ఇట్లు. సమరంబు = యుద్ధము. ఏపుఆరఁగాన్ = అతిశయింపఁగా.

తా.—దుర్యోధనుఁ డాబాణములను కఱకుటమ్ములచే ఖండించి నానావిధబాణముల నర్జునుని

తన్వానుండుం బటుసాయకోత్కరమునం ♦ జూపెఁ భుజాటోప వి
శ్లేషం బేనుఁగుఁ దాఁకునట్లు సమరం ♦ బేపారఁగా నయ్యెడన్. 191

గీ. హస్తిపురిఁ బేరు గలమద♦హస్తి నెక్కి, క్రాలుకావలిరథములు ♦ గవియుదేర
నభ్రగజముపైఁ బర్జన్యుఁ ♦ డనఁగ నంప, వాన పరఁగ వికర్ణుండు ♦ వచ్చి తాఁకె.

ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురు♦వీరులకుం బ్రమదం బొనర్చుచుం
దాఁకినఁ గ్రోధవేగసము♦దగ్రత నెఱ్ఱనిచూడ్కిఁ జూచి పే
రాఁకలితోడ నున్నజము♦నాకృతి భీషణరేఖ యొప్పఁగా
బ్రేఁకనినారసంబు దొడి ♦ క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్. 193

గీ. ఫాలకుంభసంధిఁ ♦ బడి వాలమున వెస, నుచ్చిపోవుటయును ♦ నుర్వి యద్రువఁ
గూలె నగ్గజంబు ♦ కులిశచండాహతిఁ, బడుమహానగంబు♦భంగి దోఁప. 194

---

మీఁదఁ బ్రయోగించెను. అర్జునుఁడును దుర్యోధనునిపైఁ బెక్కుబాణము లేసెను. ఏనుఁ గేనుఁగుతోఁ బోరున ట్లయ్యుద్ధ మొప్పెను. అప్పుడు.

192. హస్తిపురిన్ = హస్తినాపట్టణమునందు. పేరు = ప్రసిద్ధి. మదహస్తి = మదపుటేనుఁగును. క్రాలుకావలిరథములు = ప్రకాశించునట్టి రక్షకము లయినరథములు. కవియుదేరన్ = వెంబడించి రాఁగా. అభ్రగజముపైన్ = మేఘము అను నేనుఁగుమీఁద. పర్జన్యుఁడు అనఁగన్ = దేవేంద్రుఁడో యనునట్లు. అంపవాన = బాణవర్షము. పరఁగన్ = ప్రకాశింపఁగా. వికర్ణుండు. వచ్చి. తాఁకెన్.

తా.—దుర్యోధనునితమ్ముఁ డయినవికర్ణుఁడు గొప్ప యేనుఁగు నెక్కి మేఘవాహనుం డగు నింద్రునివలె బాణవర్షము కురియుచు నర్జునుం దాఁకెను.

193. వీఁకన్ = పరాక్రమముచేత. ప్రమదంబు = సంతోషమును. ఒనర్చుచున్ = కలిగించుచు. తాఁకినన్ = ఎదిరింపఁగా. క్రీడి = అర్జునుఁడు. క్రోధవేగసముదగ్రతన్ = కోపముయొక్క వేగముచే నధికుం డగుటచేత. ఉన్నజము ఆకృతిన్ = ఉన్నట్టి యమునివలె. భీషణరేఖ = భయంకర మయినవిధము. ఒప్పఁగాన్. బ్రేఁకనినారసంబు = దుస్సహ మయినబాణమును. తొడి = తొడిగి. దృఢముష్టిన్ = గట్టిపిడికిలిచేత. కరిన్ = ఆవికర్ణునియేనుఁగును. ఏసినన్ = కొట్టఁగా.

తా.—ఇట్లు వికర్ణుఁడు కురువీరులు సంతోషించునట్లు అర్జును నెదిరింపఁగా నర్జునుఁడు కోపముచేఁ గన్ను లెఱ్ఱ చేసికొని చూచి యాఁకలిగొన్న యమునివలె భయంకరుండై యొకగొప్పబాణమును ఆవికర్ణునియేనుఁగుమీఁద నేసెను.

194. ఫాలకుంభసంధిన్ = నుదుటికిని కుంభస్థలమునకును నడుమను. వాలమునన్ = తోఁకనుండి. వెసన్ = శీఘ్రముగా. ఉచ్చిపోవుటయున్ = తూటిపోఁగా. ఉర్వి = భూమి. అద్రువన్ = అదరునట్లు. అగ్గజంబు = ఆయేనుఁగు. కులిశచండఆహతిన్ = వజ్రాయుధముయొక్క భయంకర మయినదెబ్బచేత. పడుమహత్‌నగంబుభంగి = పడునట్టి గొప్పపర్వతముయొక్క విధము. తోఁపన్. కూలెన్.

తా.—ఆబాణం బాయేనుఁగునొసటినుండి చొచ్చి తోఁకనుండి వెడలి పోఁగా నాయేనుఁగు వజ్రాయుధముచేఁ గొట్టఁబడినపర్వతముంబోలె నేలం గూలెను.

క. అరుణమణిమాలికావి, స్ఫురణంబున దంతితనువు ♦ చూడఁగ నొప్పెన్
ధరణిఁ బడియున్న బహుముఖ, పరిగతదావాగ్నిఁ బొల్చు ♦ పర్వతముక్రియన్. 195

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగైన వికర్ణుండు వెఱచఱచి పఱచి వివింశతిరథం బెక్క నాలోనన యట్టినారాచంబున రారాజునురంబు నొనాట నేసినఁ గరీంద్రుండు వడుటయు నరేంద్రుండు నొచ్చుటయుం గని ఱిచ్చపడురథికుల వివ్వచ్చుం డనర్గళప్రసారం బగుమార్గణాసారంబున ముంచిన వెగడుపడి విఱిగి పాఱి రిత్తెఱుంగునఁ దనచుట్టును బయలైన నయ్యురగకేతనుండును మరలె నిట్లు దొర విఱిగి కలను వాసి కాలుద్రోసి పోవుటయు నతిరథమహారథు లెల్లం జెల్లాచెదరగుటయుం జూచి సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనిం బఱవం దొడంగిన. 196

గీ. యూథపతితోడిదంతిస ♦ ముత్కరంబు, వెనుకఁ దగిలెడుసింగంబు ♦ విధము దోఁప
నార్పు నాదంబుగా నరుఁ ♦ డంటఁ దాఁకె, రాజుఁ దారును బాఱెడు ♦ రథికవరుల.

---

195. అరుణమణిమాలికావిస్ఫురణంబునన్ = కెంపులమాలికలప్రకాశముచేత. దంతితనువు= ఏనుఁగుదేహము. ధరణిన్ = భూమియందు. బహుముఖపరిగతదావఅగ్నిన్ = నానాముఖములచేఁ జుట్టఁబడినకార్చిచ్చుచేత. పొల్చుపర్వతముక్రియన్ = ప్రకాశించునట్టి కొండవలె. చూడఁగన్. ఒప్పెన్.

తా.—ఆయేనుఁగు పద్మరాగమాలికలతోఁ గూడియుండుటవలన నేలంబడియున్న ప్రుడు నానాముఖములఁ గార్చిచ్చుచేఁ జుట్టఁబడినపర్వతమువలె నుండెను.

196. వెఱచఱచి = భయపడి. అట్టినారాచంబునన్ = అట్టిబాణముచేత. రారాజుఉరంబు= రాజరాజైనదుర్యోధనునియొక్కఱొమ్మును. నొన్ = నొచ్చునట్లు. కరీంద్రుండు = గజశ్రేష్ఠము. నరేంద్రుండు = దుర్యోధనుఁడు. ఱిచ్చపడురథికులన్ = నిశ్చేష్టత నొందువారలను. అనర్గళప్రసారంబు = అడ్డులేనివ్యాపించుట గలది. మార్గణఆసారంబునన్ = బాణవర్షముచేత. వెగడుపడి = భయపడి. అయ్యురగకేతనుండును = ఆదుర్యోధనుఁడును. కలను = యుద్ధమును. వాసి = విడిచి. కాలుద్రోసిపోవుటయున్ = పాఱిపోవుటను. తెరలి = కలఁగి. కనుకనిన్ = తత్తఱపాటుతో.

197. యూథపతితోడిదంతిసముత్కరంబువెనుకన్ = ప్రధానగజముతోఁ గూడిన యేనుఁగుల సమూహమువెంబడిని. తగిలెడుసింగంబువిధము = పోవునట్టి సింహముయొక్కరీతి. తోఁపన్. అర్పు = అఱపు. నాదంబుగాన్ = గర్జనము కాఁగా. నరుఁడు = అర్జునుఁడు. రాజున్= దుర్యోధనుఁడును. తారును – రథికవరులును అనుట. పాఱెడురథికవరులన్ = పరుగెత్తునట్టి శూరశ్రేష్ఠులను. అంటన్ తాఁకెన్ = వెంబడించెను.

తా.—గజసమూహములకు రాజయిన ప్రధానగజముతోఁ గూడినయేనుఁగులగుంపును సింహము తఱుమునట్లు సింహగర్జనమువంటి గర్జనము గలవాఁడై యర్జునుఁడు దుర్యోధనునితోఁ గూడి పరుగెత్తుచున్నరథికులను దఱిమెను.

క. వెనుకొని కర్ణుని పెడతల, యును దుశ్శాసనుని వీఁపు ♦ నొక్కొక్క శరం
బున నేసె నప్పు డయ్యిన, తనయుం డిట్లనియె నతిర♦థశ్రేష్ఠులతోన్. 198

గీ. కూడ ముట్టెఁ గ్రీడి ♦ కురువంశమున కెల్ల, మూలకంద మీనృ♦పాలుఁ డితని
నిచటఁ గాచికొనుట ♦ యెల్లపౌరుషములు, సేఁత నిలిచి లావు ♦ సేయవలయు.

క. అన వినుచుఁ గురుపితామహుఁ, డును ద్రోణుఁడు ద్రోణపుత్త్రుఁ♦డును గృపుఁడును గ
ర్ణునిమాట సరకు సేయక, చను చుండఁగ దీనవృత్తి ♦ జనపతి వలికెన్. 200

క. లోకంబుతోడివారు గ, మీకుం జనునయ్య మగఁటి♦మికి గుఱి గాదే.
నా కెడ రైనయెడం దగఁ, జేకొని యది మీరు చక్కఁ♦జేయుట యరయన్.

వ. అనిన విని వారలు వెనుకవై యాశ్వాసనవచనంబులు వలుకుచుం బోవం బోవు
చున్నయన్నరేంద్రు నెలుంగెత్తి పిలిచి పార్థుం డిట్లనియె. 202

( అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట. )

---

198. వెనుకొని = వెంబడించి. కర్ణునపెడతలయును = కర్ణునితలయొక్క వెనుకటిభాగమును. ఇనతనయుండు = కర్ణుఁడు.

తా.—వెంబడించి కర్ణుని పెడతలయందును దుశ్శాసనునివీఁపుమీఁదను నొక్కొకబాణముప్రయోగింపఁగా నప్పుడు కర్ణుఁడు అచటికౌరవవీరులతో నిట్లనియె.

199. క్రీడి = అర్జునుఁడు. కూడఁ ముట్టెన్ = వెంబడించెను. ఈనృపాలుఁడు = రాజయిన యీదుర్యోధనుఁడు. మూలకందము = మొదటిమంప, ప్రధానుఁ డనుట. ఎల్లపౌరుషములు = ఎల్లపరాక్రమములను. చేఁత = చేయుట. లావు = పరాక్రమమును.

తా.—ఈయర్జునుఁడు మనలఁ దఱుముకొని వచ్చెను. దుర్యోధనుఁడు కురువంశమున కంతయుఁ బ్రధానుఁడు కాఁబట్టి యెట్లైనను నీతని రక్షించికొన్నయెడ నన్నిపరాక్రమములు చేసినట్లె యగును, కావునఁ బరుగెత్తక నిలిచి పరాక్రమము చూపవలయును.

200. కురుపితామహుఁడును = కౌరవులకుఁ దాత యయినభీష్ముఁడును. సరకుచేయక = లక్ష్యము చేయక. జనపతి = రాజయినదుర్యోధనుఁడు. దీనవృత్తిన్ = దుఃఖముతోడియునికిచేత.

తా.—కర్ణుని మాట విని యామాటను లక్ష్యము చేయక భీష్ముఁడు మొదలగువారు పోవుచుండఁగా దుర్యోధనుఁడు దుఃఖముతో నిట్లు చెప్పెను.

201. మీకున్. లోకంబుతోడివారుగన్ = లోకములోనివారితో సమాను లగుట. చనవయ్య = తగునా? ఎడరు = ఆపద. మగఁటిమికిన్ = పౌరుషమునకు. గుఱి = విషయము.

తా.—మీరు పరాయివారివలె నిట్లు నన్ను విడిచి పోవచ్చునా? నాకాపద గలిగినప్పుడు మీరు సహాయపడి యాయాపదను దొలఁగించుట గదా శౌర్యమునకు లక్షణము.

202. వెనుకవి = వెనుకనిలిచినవారై. ఆశ్వాసవచనంబులు = ఊఱడింపుమాటలను. అన్నరేంద్రున్ = ఆదుర్యోధనుని. ఎలుంగెత్తి = గొప్పకంఠధ్వనితో. పార్థుండు = అర్జునుఁడు.

ఉ. క్షత్త్రియుఁ డోడుటే తగదు ♦ కౌరవరాజ యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ జిన్న నను ♦ బోరికిఁ బిల్వఁగ మాని నాఁగ ని
ద్ధాత్త్రిఁ బ్రసిద్ధి కెక్కి బల ♦ దర్పసమగ్రుఁడ వైననీవు నీ
మిత్త్రులుఁ గూడ నిట్టయిన ♦ మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్. 203

సీ. ఏనుంగు నెక్కి పె ♦ క్కేనుంగు లిరుగడ, రాఁ బురవీథులఁ ♦ గ్రాలఁ గలదె
మణిమయం బైనభూ♦షణజాలముల నొప్పి, యొడ్డోలగంబున ♦ నుండఁ గలదె
కర్పూరచందన♦కస్తూరికాదుల, నింపు సొంపార భో♦గింపఁ గలదె
యతిమనోహర లగు♦చతురాంగనలతోడి, సంగతి వేడ్కలు ♦ సలుపఁ గలదె
కయ్యమున నోడి పోయినఁ♦గౌరవేంద్ర. వినుము నాబుద్ధి మరలి యీ♦తనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి♦చూఱ గలదె, జూద మిచ్చట నాడంగఁ♦ గాదు సుమ్ము.

---

203. ఓడుటఏ = పరుగెత్తుటా? నేక్. ఒకండక్ = అసహాయుఁడను. పృథాపుత్త్రుల లోనక్ = కుంతికొడుకులలో. చిన్నక్ = చిన్నవాఁడను. పిల్వఁగక్ = పిలుచుచుండఁగా. మాని = శౌర్యము గలవాఁడు. నాఁగక్ = అనఁగా. ఇద్ధాత్రిక్ = ఈభూమియందు. బలదర్పసమగ్రుఁడవు = బలగర్వముచే నిండినవాఁడవు. భూభుజుల్ = రాజులు. కొల్వక్. వత్తురె!

తా.—క్షత్త్రియునకు యుద్ధమునుండి పాఱిపోవుట తగదు, అదియునుం గాక నే నొకఁడను, కుంతికొడుకులలోఁ జిన్నవాఁడను. అట్టి నేను నిన్ను యుద్ధమునకుఁ బిలువఁగా శూరుఁడ వని ప్రసిద్ధి నొందినవాఁడవు బలవంతుఁడ వగు నీవును నీమిత్త్రులు నిట్లు పాఱిపోయినయెడ రాజులు నిన్ను మెచ్చి కొలువరు.

204. ఇరుగడక్ = రెండుప్రక్కలయందు. రాక్ = వచ్చుచుండఁగా. పురవీథులక్ = పట్టణపువీథులయందు. క్రాలక్ = ప్రకాశించుట. కలదుఏ = కలుగునా? మణిమయంబు = రత్నములు నిండినవి. ఐనభూషణజాలములక్ = అయినట్టి సొమ్ములసమూహములచేత. ఒడ్డోలగంబునక్ = గొప్పకొలువునందు. కర్పూరచందనకస్తూరికాదులక్ = పచ్చకర్పూరము గంధము కస్తూరి మొదలగువానిని. ఇంపు = సంతోషము. సొంపారక్ = అతిశయించునట్లు. భోగింపక్ = అనుభవించుట. అతిమనోహరలు = మిక్కిలి చక్కనివారు. అగుచతురఅంగనలతోడిసంగతిక్ = అయినట్టి నేర్పు గల స్త్రీలతోడికూడికచేత. చలుపక్ = చేయుట. కయ్యమునక్ = యుద్ధమునందు. నాబుద్ధి = నాయుపదేశమును. ఈతనువుక్ = ఈదేహమును. సుగతి = మంచిలోకమును. తొల్లింటిచూఱ = మునుపటికొల్ల.

తా.—కౌరవరాజా! యుద్ధరంగమునుండి పాఱిపోయినయెడ, రాజవీథులందుఁ బట్టపుటేనుంగు నెక్కి రెండుపార్శ్వములయందును నేనుఁగులు బలసిరాఁగా మారేఁగుటయు, రత్నమయము లయినయాభరణములు ధరించి కొలువుకూటంబునఁ గూర్చుండుటయు, కర్పూరచందనకస్తూరికాదిసుగంధద్రవ్యములను సంతోషముగా ననుభవించుటయు, చక్కని స్త్రీలతోఁ గూడి విహరించుటయు, ఇట్టి రాజభోగములు పొంద శక్యము కావు. కావున నీవు నామాట విని యుద్ధము చేసి హతుండవై యుత్తమలోకము నొందుము. ఇట మునుపటివలె జూదమాడి రాజ్యము కొల్లగొట్టుటకు శక్యము కాదు.

వ. అని వెండియు. 205

క. నీయట్టివాఁడు నిస్సీ, పోయెడిదే యిట్లు వ్రాకు ♦ పోకు మనుడు భూ
నాయకుఁడు మరలి పటుకో, పాయత్తతఁ ద్రొక్కఁబడ్డ♦యహిగతిఁ గవిసెన్. 206

వ. ఇట్లు గవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె భీష్మద్రోణాదియోధవీరులు నొక్కుమడి మగిడి యధిపతితోడన నిగిడి క్రీడియరదంబుఁ బొదివిరి తక్కినబలంబులు నంతకు మున్న కౌంతేయుదెస మరలి చూచుచుం బాఱుచునికిం జేసి యేలినవాఁడఱుమాటయును దొరలు దెగువకుం జొచ్చి తిరుగుటయుం గని తెంపు సేసి కూడికొని రభసంబునం జుట్టు ముట్టి యతనిపైఁ గ్రందుకొన నడరె నివ్విధంబున వివిధవ్యూహంబు లగుబహుయోధయూథంబులు గవిసి యనేకాస్త్రశస్త్రంబులు నానాప్రకారంబులఁ గుప్పంగూరలుగాఁ దొరఁగించినం బెరిఁగినశౌర్యసంరంభంబున విజృంభించి విజయుం డాశ్చర్యధుర్యనిరతిశయరయభరితభుజయుగళుం డయి రథరథ్యసారథిస్వాంగంబులు గాచికొని తనతోడంబుట్టువులప్రతిన లూహించి యొండు సేయ నొల్లక సపరివారంబుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టం దలంచి యింద్రదైవ

---

206. పోయెడిదివే = పోవుటయా? అనుడున్ = అనియర్జునుఁడు చెప్పఁగా. భూనాయకుఁడు = దుర్యోధనుఁడు. పటుకోపఆయత్తతన్ = అధిక మయిన కోపమున కధీనుఁ డగుటచేత. త్రొక్కఁబడ్డఅహిగతిన్ = త్రొక్కఁబడినపామువలె. కవిసెన్ = ఎదిరించెను.

తా.—నీవంటివాఁడు ఇట్లు యుద్ధము విడిచి పరుగెత్తరా దని నిందింపఁగా దుర్యోధనుఁడు త్రొక్కఁబడ్డపామువలెఁ గోపించి యుద్ధమునకు మరలెను.

207. ఒక్కుమ్మడిన్ = ఏకకాలమునందు. మగిడి = మరలి. అధిపతితోడన్అ = దుర్యోధనునితోనే. నిగిడి=పోయి. క్రీడిఅరదంబున్=అర్జునుని తేరును. కౌంతేయుదెసన్ =అర్జునుని దిక్కునకు. పాఱుచునికిన్ చేసి=పాఱుచుండుటచేత. ఏలినవాఁడు=దుర్యోధనుఁడు. అఱుమాటయును= పరాక్రమించుటయు. తెగువకున్=సాహసమునకు. రభసంబునన్=వేగముతో. క్రందుకొనన్=దట్టముగునట్లు. అడరెన్ = విజృంభించెను. వివిధవ్యూహంబులు= నానావిధములయిన వ్యూహములుగలవి, అగుబహుయోధయూథంబులు=అయినట్టి పెక్కుశూరులసమూహములు. అనేకఅస్త్రశస్త్రంబులు= అనేకము లయినబాణములను ఆయుధములను. నానాప్రకారంబులన్=పలువిధములచేత. కుప్పంగూరలుగాన్=కుప్పలుకుప్పలుగా. తొరఁగించినన్=ప్రయోగింపఁగా. పెరిఁగినశౌర్యసంరంభంబునన్=అతిశయించినపరాక్రమముయొక్క వేగముచేత. విజయుండు=అర్జునుఁడు. ఆశ్చర్య.....యుగళుండై— ఆశ్చర్య=ఆశ్చర్యముయొక్క, ధుర్య=భారము వహించునట్టిదియు, నిరతిశయ=మిక్కిలి గొప్పదియు నగు, రయ = వేగముచేత, భరిత = నిండిన, భుజ = చేతులయొక్క, యుగళుండు ఐ = జంటకలవాఁడై. రథరథ్యసారథిస్వాంగంబులు = రథమును గుఱ్ఱములను సారథిని తనయవయవములను. తనతోడంబుట్టువులప్రతినలు = తనతోఁబుట్టువగుభీమునిప్రతిజ్ఞలను, బహువచనము పూజ్యార్థకము. దుర్యోధనాదుల చంపెద నన్నభీమునిప్రతిజ్ఞ ననుట. ఊహించి = తలంచి. ఒండు = ఇతరమును, దుర్యోధనుని చావుట ననుట. సపరివారంబుగాన్=పరిజనులతోఁ గూడినట్లుగా. ధార్తరాష్ట్రులన్=

త్యంబును సత్యసంపాతంబును నరాతిసైన్యదైన్యసంపాదనంబును నగుసమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించిన. 207

గీ. ఆయుధములు విడిచి ♦ యంగముల్ సోలంగఁ, దలలు మెడలఁ జక్క ♦ నిలువ కొఱఁగ
నెల్లవారు నెఱుక ♦ యెడలి చొక్కొక్కి ని, ద్రాతిశయము గూరి ♦ నట్టు లైరి.

వ. అప్పుడు పాండవోత్తముం డుత్తరమాటలు దలంచి యుత్తరుం గనుంగొని. 209

సీ. ఇక్కురుసైన్యంబు ♦ సొక్కుదక్కకమున్న, గ్రక్కునఁ జనుము రా ♦ రాజు ద్రోణ
తనయుండుఁ జుట్టిన ♦ తలచుట్లు నల్లని, యవి సూతపుత్త్రశి ♦ రోంబరంబు
పచ్చనియది కుంభ ♦ భవకృపాచార్యుల, యుష్ణీషములు వెల్ల ♦ లుఱుక నీవు
దెమ్మింతవట్టును ♦ దేవనదీసూనుఁ, డియ్యస్త్రమునకు మా ♦ ఱెఱుఁగుఁ గాన
నతఁడు దెలిసి యుండు ♦ నాతనిదెస వోకు, మనిన మత్స్యరాజ ♦ తనయుఁ డెలమి
దొలఁక నొగలఁ బగ్గ ♦ ములుగట్టి చని వాని, నెల్లఁ దెచ్చి యరద ♦ మెక్కుటయును.

---

ధృతరాష్ట్రకొడుకులను. ఇంద్రదైవత్యంబును = ఇంద్రుఁడు దేవతగాఁ గలదియు. సత్యసంపాతంబును = సత్యమయిన పడుట గలదియును. అరాతిసైన్యదైన్యసంపాదనంబును = శత్రుసైన్యమునకు దైన్యము కలిగించునదియు. పాఠాం:—నిరతి......కరయుగళుండై = చేతులజంట కలవాఁడై యని యర్థము, ఇటఁ గరశబ్దప్రయోగము కన్నను భుజశబ్దప్రయోగము రసవత్తరము. సత్యసంపాదనంబును = సత్యమును అనువదించునది యని యర్థము. ఇది యిట ననుచితము. ప్రాసపోషకం బనునెడ నింద్రదైవత్యం బన్నచో నీప్రాస ముపక్రాంతము కాదు. దైవత్యసత్య, సైన్యదైన్య—ఇంతమాత్రముతో నే ప్రాసము విశ్రాంతము కానచ్చును.

208. అంగముల్ = దేహములు. సోలంగన్ = పరవశము కాఁగా. ఎఱుకలు = జ్ఞానములు. ఎడలి = పోయి. చొక్కుఒక్కి = మైమఱపు గలిగి. కూరినట్టులు = కలిగినట్లు.

తా.—అందఱును తమతమయాయుధములను విడిచి మైమఱచి తలలు వ్రేలాడవేసికొని తెలివి తప్పి నిద్రపోయిన ట్లుండిరి.

209. పాండవోత్తముండు = పాండవులయందు శ్రేష్ఠుఁ డయినయర్జునుఁడు.

210. చొక్కు = మైకమును. తక్కకమున్న = విడువకమునుపే. గ్రక్కునన్ = శీఘ్రముగా. రారాజు = దుర్యోధనుఁడును. ద్రోణతనయుండున్ = అశ్వత్థామయును. చుట్టినతలచుట్లు = చుట్టినపాగాలు. సూతపుత్త్రశిరఃఅంబరంబు = కర్ణునిపాగా. కుంభభవకృపాచార్యులఉష్ణీషములు = ద్రోణునియొక్కయుఁ గృపునియొక్కయుఁ దలగుడ్డలు. వెల్లలు = తెల్లనివి. ఉఱుక = భయపడక. ఇంతవట్టును — వీరితలగుడ్డల నన్నిటి నవుట. తెమ్ము. దేవనదీసూనుఁడు = భీష్ముఁడు. తెలిసి = జ్ఞానముకలిగి. ఎలమి = సంతోషము. తొలఁకన్ = అతిశయింపఁగా.

తా.—ఈకౌరవసేన మూర్ఛ తెలియుటకు మునుపే నీ వచటికిఁ బొమ్ము. దుర్యోధనుఁడును నశ్వత్థామయును జుట్టినపాగాలు నల్లనివి. కర్ణునితలగుడ్డ పచ్చనిది. ద్రోణాచార్యకృపాచార్యులపాగాలు తెల్లనివి. నీవు భయపడక వీని నన్నిటిని తెమ్ము. భీష్ముఁడు ఈయస్త్రమునకు బదులు తెలిసినవాఁడు

వ. ఈరథబృందంబులయిఱుకటంబు వెడలి నిలుత మని కదలినం గిరీటిం దాఁకి కురు
పితామహుండు శరవర్షంబులు గురిసిన. 211

క. ఆతనిరథ్యంబులఁ ద, త్సూతుని నొప్పించి సాంద్ర♦సునిశిత బాణ
వ్రాతంబు మేన నించి పృ, థాతనయుఁడు నిలిపి వెడలె ♦ దర్పోద్ధతుఁడై. 212

వ. ఇత్తెఱంగున నరదంబులయిఱుకటంబు గడచి యెడ గలుగ నిలిచి రాహునిగ్రహ
నిరాసభాసురుం డగుభానుండునుం బోలె వెలుంగుచున్నంత బలంబులు దెలిసిన.

గీ. కౌరవేశ్వరుండు ♦ కను విచ్చి దిక్కులు, గలయఁ జూచి పార్థుఁ ♦ గాంచి కడఁగి
యడరఁ జూచుటయును ♦ నమరనదీసూనుఁ, డతని కిట్టు లనియె ♦ నల్ల నగుచు.

క. ఇంత మెఱుంగవు సైన్యము, లింతపడియుఁ దలలు చీర ♦ లెఱుఁగక మోహా

---

కావున నతఁడు తెలివి గలిగి యుండును. కావున నతనియొద్దకుఁ బోవలదు. అని యర్జునుఁడు చెప్పఁగా నుత్తరుఁడు సంతోషముతోఁ బగ్గములను నొగల ముడిచి దిగి పోయి యాదుర్యోధనుఁడు మొదలగు వారి తలచీరలు దెచ్చి రథ మెక్కినపిమ్మట.

211. ఈరథబృందంబులఇఱుకటంబు = ఈ తేరులసమూహములయొక్క యిఱుకుపోటునుండి. కిరీటిన్ = అర్జునుని. కురుపితామహుండు = కౌరవులకు తాత యయినభీష్ముఁడు. శరవర్షంబు = బాణవర్షము.

212. ఆతనిరథ్యంబులన్ = ఆభీష్మునిగుఱ్ఱములను. తత్సూతునిన్ = ఆభీష్మునిసారథిని. సాంద్రసునిశితబాణవ్రాతంబు = దట్టము లయినవాఁడిబాణములసమూహమును. మేనన్ = శరీరమునందు. నించి = నిండించి. పృథాతనయుఁడు = కుంతికొడు కయినయర్జునుఁడు. దర్పఉద్ధతుఁడువి = గర్వముచే నధికుఁడై. నిలిపి. వెడలెన్.

తా.—అర్జునుఁడు గర్వించి భీష్మునిగుఱ్ఱములను సారథిని నొప్పించి యతనిదేహమునందుఁ గలుగు బాణములు నాటి యాభీష్ముని నిలువరించి పోయెను.

213. ఇత్తెఱంగునన్ = ఈవిధమున. ఎడ = దూరము. రాహునిగ్రహనిరాసభాసురుండు = రాహువుయొక్క పట్టుయొక్క తొలఁగించుటచేఁ బ్రకాశించువాఁడు. భానుండునున్ పోలెన్ = సూర్యునివలె. బలంబులు = సేనలు.

214. కౌరవఈశ్వరుండు = దుర్యోధనుఁడు. విచ్చి = తెఱచి. కలయన్ = అంతటను. పార్థున్ = అర్జునుని. కడఁగి = పూని. అడరన్ = ఎదుర్కొనుటకు. చూచుటయునున్ = ఆలోచించుచుండఁగా. అమరనదీసూనుఁడు = గంగకొడు కయినభీష్ముఁడు.

తా.—దుర్యోధనుఁడును మూర్ఛ తేఱి కనువిచ్చి యర్జునుం జూచి యతనిమీఁదికి యుద్ధమునకుఁ బోవఁ బ్రయత్నించుచుండఁగా భీష్ముఁడు నవ్వుచు దుర్యోధనునితో నిట్లు చెప్పెను.

215. ఇంత = ఇంతమాత్రము. ఇంతపడియున్ = ఇంతసేపును. తలలచీరలు = తలపాగాలు, పాగాలు పోవుట యనుట. మోహఆక్రాంతంబులు = మైమఱపుచే నాక్రమింపఁబడినవి. కౌంతేయుఁడు = అర్జునుఁడు. క్రౌర్యంబునకున్ = క్రూరత్వమునకు, చంపుట కనుట.

తా.—రాజా! ఇంతసేపు తలపాగలు పోవుటకూడఁ దెలియక సైన్యములు మూర్ఛపోయి

క్రాంతంబు లయ్యెఁ బని దెగఁ, గౌంతేయుఁడు సొరఁడు గాని♦ క్రౌర్యంబునకున్.

క. మెడ యొఱఁగఁ జేతికైదువు, పడ నిను నీ వెఱుఁగ కున్న♦భంగి గనియుఁ గ
వ్వడి యూర కుండు నబ్బె చె, ప్పెడుకొలఁదియె వానికరుణ♦పెంపు కుమారా.

వ. అతండు మన ప్రాణంబులపై రా నొల్లక నిలిచిన మన మింతట నిలుచుట కార్యంబు.

ఉ. మోహనబాణపాతమున♦ ముందలచీర లెఱుంగ కున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి♦ పార్థునిఁ దాఁకెడుబుద్ధిఁ గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవి♦చారతఁ బోయితిమేని వాఁడు ప్రా
ణాహుతి సేయఁడే మనల♦ నందఱ నొక్కట మార్గణాగ్నికిన్. 218

వ. కావున. 219

క. మన దేశమునకుఁ బోదము, మన మల్లనఁ దెరువు పట్టి♦ మత్స్యవిభునిగో
ధనముఁ గొని యతఁడు ప్రీతిఁ, జనుఁ గా కటు మనకు నంతె♦చల మేమిటికిన్. 220

---

యుండెను. అర్జునుఁడు క్రూరకృత్యమునకుఁ బూనియున్నచో నిప్పటికి మన మందఱము హతు లయి యుండవలసినవారము.

216. కైదువు = ఆయుధము. పడన్ = పడుచుండఁగా. భంగి = విధమును. కవ్వడి = అర్జునుఁడు. అబ్బె — ఆశ్చర్యము. వానికరుణపెంపు = ఆయర్జునునిదయయొక్క యతిశయము. చెప్పెడుకొలఁదియె = చెప్పెడుపాటిదియా?

తా.—దుర్యోధనా! నీవు మూర్ఛపోయి దేహము తెలియక యున్నప్పుడు అర్జునుఁడు నిన్ను వధింపక విడుచుటచే వాని దయాతిశయము తెలియుచున్నది.

217. కార్యంబు = యుక్తము.

218. మోహనబాణపాతమునన్ = సమ్మోహనాస్త్రము పడుటచే. ముందలచీరలు = తలపాగాలను. ఉన్న యీబాహుబలంబుతోన్ = ఉన్నట్టి యీభుజబలముతో. పార్థునిన్ = అర్జునుని. తాఁకెడుబుద్ధిన్ = ఎదిరించుతలంపుతో. క్రమ్మఱన్ = మరల. సాహసవృత్తిన్ చేసి = తెగువ యందలి యునికిచేత. అవిచారతన్ = ఆలోచన లేమిచేత. పోయితిమి ఏనిన్ = పోయినయెడ. ఒక్కటన్ = ఏకకాలమునందు. మార్గణఅగ్నికిన్ = బాణములు అను నిప్పునకు.

తా.—సమ్మోహనాస్త్రము మనపైఁ బడినప్పుడు అందఱము మూర్ఛిల్లి తలచీరలు పోవుట తెలియక యవమానపడి మరల మూర్ఖత్వముచేఁ దెగువ చేసి యర్జునునిమీఁదికిఁ బోవుదుమేని నతఁడు కోపించి మనల నందఱ వధించును.

220. అల్లనన్ = మెల్లగా. మత్స్యవిభునిగోధనమున్ = విరాటరాజుయొక్క యావులు అను ధనమును. చలము = పట్టుదల.

తా.—మనము వచ్చినదారిని మనదేశమునకుఁ బోదము, అర్జునుఁడు విరాటునిగోవులం దీసికొని సంతోషముతోఁ బోవుఁ గాక, మన కంతపట్టుదల వలదు.

—(*) దుర్యోధనుఁడు పరాజితుం డై మరలి తనపురంబునకుఁ బోవుట. (*)—

వ. అని చెప్పినపితామహుహితవచనంబు లాకర్ణించిసంగ్రామాతీతకాముండును గోపాటోపఘూర్ణమానమానసుండు నగునమ్మానవేశ్వరుండు నిట్టూర్పు నిగిడించి యుద్రేకంబు దక్కి నిలిచెం దక్కటివారలు నూర్జితం బగు నర్జునానలంబు నాలోకించి ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబున శౌర్యంబు సాలించి భీష్మవాక్యప్రకారంబు సేసి రిట్లుండ రాజు ముందర దమవచ్చినవంకన తిరిగి యరుగుచున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు సెలంగఁ గొండొకదవ్వు వెన్నడిం దఱిమి బిరుదులతోడిగొడుగులును నడియాలంబులతోడిసిడంబులును వైపించుకొని తృప్తిం బొంది మరలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయివచ్చెద నని చెప్పి గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారి వీడ్కొనినవాఁడై మిట్టకోలల రారాజుమకుటంబుమణులు డులిచి యతనికిం జెప్పినవాఁడై యఖర్వబాహాగర్వనిర్వాహణంబు మెఱయ నప్పుడు మధ్యందినమార్తాండప్రచండుం డగు చుండఁ గౌరవవీరు లతనిం దేఱి చూడనుం జాలక చని రతండును జూపఱం దోలి నిలిచిన మదపుటేనుంగుచందంబున నిలిచి విరాటతనయున కిట్లనియె. 221

---

221. పితామహుహితవచనంబులు = భీష్మునిహితము లయినమాటలను. సంగ్రామాతీతకాముండును = యుద్ధమునుండి పోయినకోర్కి కలవాఁడును. పాఠాం:—స్సంగ్రామాతికామియుఁ = యుద్ధమును మిక్కిలికోరువాఁడు ననియర్థము. ఈపాఠముమూలవిరుద్ధము "అతీతకామోయుధి సోఽత్యమర్షీ" యని మూలము. కోపఆటోపఘూర్ణమానమానసుండుఁ = కోపముయొక్కయతిశయముచేఁ దిరుగుడుపడుచున్నమనస్సు గలవాఁడును. అగు అమ్మానవేశ్వరుండు = అయినయాదుర్యోధనుఁడు. ఉద్రేకంబు = విజృంభణమును. తక్కి = విడిచి. ఊర్జితంబు = వృద్ధి పొందినది. అర్జునఅనలంబు = అర్జునుఁ డను నిప్పును. పాఠాం:—అర్జునాననంబు = అర్జునునిమోమును అని యర్థము, ఇదియు "ధనంజయాగ్నించ వివర్ధమానమ్" అను మూలమునకు విరుద్ధము. ఆలోకించి = చూచి. ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబునన్ = దుర్యోధనుని రక్షించుటయందలి యాసక్తిచేత. భీష్మ వాక్యప్రకారంబు = భీష్ముని మాటచొప్పున. శంఖరవజ్యానాదంబులు = శంఖముయొక్క ధ్వనియు నల్లెత్రాటిమ్రోఁతయు. చెలంగన్ = ధ్వనించుచుండఁగా. కొండొకదవ్వు = కొంతదూరము. వెన్నడిన్ = వెంబడి. అడియాలంబులతోడిసిడంబులును = గుఱుతులతోఁ గూడినటెక్కెములను. ప్రణామబాణంబులు = నమస్కారబాణములను. వీడ్కొనినవాఁడై = పోయివచ్చెదనని చెప్పినవాఁడై. మిట్టకోలలన్ = కఱకుటమ్ముల చేత. రారాజుమకుటంబుమణులు = దుర్యోధనుని కిరీటమునందలిరత్నములను. డులిచి = రాల్చి. అఖర్వబాహాగర్వనిర్వాహణంబు = తక్కువకానిచేతులకావరముయొక్క నెఱవేర్పుట. మధ్యందినమార్తాండప్రచండుండు = మధ్యాహ్నకాలమునందలి సూర్యునివలె భయంకరుఁడు. తేఱి = చక్కఁగా. చూపఱన్ = చూచువారిని.

గీ. పసులు మరలె శత్రు♦బలములు పీనుంగు, పెంట లయ్యె రాజు♦ పెద్దవారలుం
జీర లొలువం బడిరి ♦ సిగ్గఱి బిరుదులు, వైచి రింక మగుడ♦ వలదె మనకు. 222

క. హయముల మరల్పు మీత, ల్లియు బంధువు లెదలు సంచ♦లింప గుములు గ
ట్టి యెదురుసూతురు వారికిం, బ్రియముగ శీఘ్రమ్మునం బు♦రికిం బో వలయున్.

వ. అనిన నతండు రథంబు మగిడించినం జని చని. 224

గీ. కాలు తక్కువవారలు♦గలయం జెదరి, వెనుకం బడిపోవుచెడం దన్నుం♦గని భయమునం
బ్రాణదానంబు వేడినం♦ బార్థుం డభయహస్తమిచ్చుచు దయపెను♦పారం బలుకు.

వ. ఇట్లు నానావిధదీనదశాదందహ్యమాను లగు కృపణులం దనకృపామృతంబునం దడిపినం దేఱి వారు దీవించుచుం బ్రణమిల్లుచుం బొగడుచుం బోవుచుండ ధనంజయుండు భూమింజయుం జూచి. 226

గీ. కురుబలంబు గెలిచి ♦ గోవులం గ్రమ్మఱం, దెచ్చు చెల్ల నీయు♦దీర్ఘబాహు
బలముకాంగ నీవు♦పలుకుము వెలిం బుచ్చు, టుడుగు మధిపుపాల♦నొండు తెఱంగు.

---

222. శత్రుబలములు = శత్రువులసేనలు. సిగ్గఱి = సిగ్గుమాలి. వైచిరి = విడిచిరి.

తా.—మనము పశువుల మరల్చి శత్రుసేనల వధించి దుర్యోధనుండు మొదలగువారిం జయించి వారితలగుడ్డలను దీసికొని యవమానించితిమి. కావున నింక మనకుం మరలి పో వలసినదే కాని యింక వేఱు కార్యము లేదు.

223. హయములన్ = గుఱ్ఱములను. ఎదలు = మనస్సులు. సంచలింపన్ = అదరంగా. గుములుగట్టి = గుంపులుగూడి. ప్రియముగన్ = సంతోషము గలుగునట్లు.

తా.—మీతల్లి లోనగువారు మనస్సున దిగులుపడి గుంపులుగూడి నిన్నెదురుచూచు చుందురు, కావున మన మింక శీఘ్రముగాం బట్టణమునకుం బోయి వారికి సంతోషము కలిగింపవలయును, రథమును మరలింపుము.

225. కాలుతక్కువవారలు — శీఘ్రముగా నడవంజాలనివారనుట. ఎడన్ = నడుమను. పెనుపారన్ = అతిశయించునట్లు.

తా.—పరువిడంజాలని కౌరవసైనికులు వెనుకం జిక్కి పోవుచు దారినడుమ నర్జునుం జూచి భయపడి రక్షింపు మని వేడంగా నర్జునుండు వారి కభయం బొసంగి యూఱడించెను.

226. నానావిధదీనదశాదందహ్యమానులు = పలువిధము లగుదుఃఖములతోం గూడిన యవస్థల చేత మిక్కిలి దహింపం బడుచున్నవారు. అగుకృపణులన్ = అయిన దిక్కులేనివారిని. తనకృపా అమృతంబునన్ = తనదయ యనునీటిచేత. ప్రణమిల్లుచున్ = మ్రొక్కుచు. భూమింజయున్ = ఉత్తరుని.

227. నీయుదీర్ఘబాహుబలముకాంగన్ = నీయొక్క యతిశయించిన భుజబలమే యగునట్లు. అధిపుపాలన్ = రాజయినవిరాటునియొద్ద. ఒండుతెఱంగు = వేఱువిధమును. వెలిపుచ్చుట = వెల్లడిచేయుటను. ఉడుగుము = విడుపుము.

క. అనవుడు నీచేసినయీ, పని నాచేఁ గాక యునికి ♦ పతి యెఱుఁగఁ డొకో
జనులు నిజము సేయుదురే, నిను నెఱిఁగింపకయ చెప్ప ♦ నేర్తునె పొసఁగన్. 228

వ. అని యుత్తరుండు మఱియును. 229

క. నీవలచినయప్పుడ ధా, త్రీవల్లభుఁ డెఱుఁగునట్టి ♦ తెఱఁగు నడపెదన్
దేవేంద్రపుత్త్రి యే ననఁ, గా వేఱొకపేరు గలదె ♦ కార్యము నడపన్. 230

వ. అనువచనంబు లియ్యకొనుచుం జని శమీవృక్షసమీపంబున నిల్చి గాండీవాది సాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింప నియోగించి కపిధ్వజదేవదత్తకిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు సేయించి యెప్పటి సింహపతాకంబు రథంబున బంధింపం బనిచి విరాటతనయుండు నిజాయుధంబులు గైకొని రథికుం డయి వచ్చునట్లుగాఁ జేసి తొంటిచందంబునఁ దలచీర యలవరించికొని సారథి యై సవ్యసాచి నొగ లెక్క నట్టిసమయంబునఁ బురందరాది

తా.—కౌరవసేనను జయించి గోవుల మరల్చుట యంతయు విరాటునొద్ద నీవే చేసినట్లు చెప్పుదువు కాని నేను చేసినట్లు వెల్లడి చేయకుము.

228. అనవుడున్ = అని యర్జునుఁడు చెప్పఁగా. నీచేసినయీపని = నీవు చేసిన యీకార్యమును. కాకఉనికి = కాకుండుటను. పతి = విరాట రాజు. ఎఱుఁగఁడుఒకో = తెలియఁడా ? జనులు. నిజము, చేయుదురుఏ — నమ్ముదురా యనుట. పొసఁగన్ = ఒప్పునట్లు. చెప్పన్ నేర్తునుఎ = చెప్పఁజాలుదునా ?

తా.—అని యర్జునుఁడు చెప్పఁగా నీవు చేసిన యీపరాక్రమము నాకు సాధ్యము కాకుండుట విరాటరాజునకుఁ దెలియును, జనులును నేను చేసినట్లు నమ్మరు. కావున నీపేరుచెప్పకనే నీ సంగతి యంతయు వారికి నమ్మకము గలుగునట్లు చెప్పఁజాలను.

230. దేవఇంద్రపుత్త్రి = అర్జునా! నీవలసినఅప్పుడుఅ = నీవు కోరినప్పుడే. ధాత్రీవల్లభుఁడు = రా జయిన విరాటుఁడు. ఒకపేరు = ఒకగొప్పతనము.

తా.—అయినను నీవు కోరుపఱకు విరాటునకు నిన్నుఁ దెలియకుండునట్లు చేసెదను. నేను నీకు లోఁబడినవాఁడనే గాని కార్యము నడపుటకు స్వతంత్రుఁడను గాను.

231. ఇయ్యకొనుచున్ = అంగీకరించుచు. గాండివఆదిసాధనంబులు = గాండివము మొదలుగాఁ గల యాయుధములను. పూర్వప్రకారంబునన్ = మునుపటివలె. నిక్షేపింపన్ = ఉంచుటకు. నియోగించి = ఆజ్ఞాపించి. కపిధ్వజదేవదత్తకిరీటఆదిదివ్యపరికరంబులన్ = కోఁతిటెక్కెము దేవదత్తమనుశంఖము కిరీటము మొదలుగాఁ గల దేవతాసంబంధిసాధనములను. సవినయంబుగాన్ = వినయముతోఁ గూడినట్లుగా. అంతర్ధానంబు చేయించి = మఱుఁగగునట్లు చేసి. ఎప్పటి సింహపతాకంబు = ఎప్పటిసింహధ్వజమును, ఉత్తరునిధ్వజము ననుట. బంధింపన్ = కట్టుటకు. నిజఆయుధంబులు = తనయాయుధములను. రథికుండుఐ = రథము గలవాఁడై. తొంటిచందంబునన్ = మునుపటివలె. తలచీర = పాగాను. అలవరించికొని = సవరించుకొని. సవ్యసాచి = అర్జునుఁడు. పురందరఆదిబృందారకులును = ఇంద్రుఁడు మొదలుగాఁ గల దేవతలును. పాండుప్రముఖరాజలోకం

బృందారకులును దేవమునిసిద్ధగంధర్వాదులును పాండుప్రముఖరాజలోకంబును నాశ్చర్యహర్షాయత్తచిత్తు లయి సమరవిషయంబు లయినమాట లాడుచు నిజనివాసంబుల కరిగి రట నరుండు నుత్తరు నాలోకించి నీవిజయంబు పురంబున ఘోషింప గోపాలురం బుచ్చు మని యతం డది తెఱంగుగాఁ గైకొని యట్లచేయ నిట్లు నిగూఢంబుగాఁ బట్టణంబునకుం జనుచుండ నంతకు మున్న మత్స్యమహీవల్లభుం డాహవజయదర్పితవాహినీపరివృతుండై నగరంబు చొత్తెంచి. 231

గీ. మందిరాభ్యంతరమున కానందలీలఁ, బాండుపుత్త్రులుఁ దక్కటిబంధుజనులుఁ
దానుఁ జని విప్రులును వనితాజనంబు, సేస లొలుక సింహాసనాసీనుఁ డయ్యె.

వ. ఇవ్విధంబునం దనవిజయంబు గొనియాడ వచ్చిన వారి నెల్ల నభినందించి యుత్తరుం డెచ్చట నున్నవాఁ డని యడిగి వారలవలనం గురునాథుండు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదియోధవీరులు పెరసినబలంబులతోడ నడచి యుత్తరంబునఁ బసులం బట్టిన నతండు బృహన్నల సారథిఁగాఁ గైకొని యొక్కరుండ కుయివోవుట విని విషాదవేదనాదూయమానమానసుం డగుచు మంత్రులమొగంబు సూచి యిట్లనియె.

—(*) ఉత్తరుఁడు కురుసైన్యంబు గెలువఁ బోవుట విని విరాటుఁడు చింతించుట. (*)—

---

బును = పాండురాజు మొదలుగాఁ గల రాజులసమూహమును. ఆశ్చర్యహర్షఆయత్తచిత్తులు ఐ = ఆశ్చర్యమునకును సంతోషమునకును నధీన మయిన మనస్సు గలవారై. సమరవిషయంబులు = యుద్ధము విషయముగాఁ గలవి. నిజనివాసంబులకున్ = తమయిండ్లకును. నరుండున్ = అర్జునుఁడును. ఆలోకించి = చూచి. నీవిజయంబు = నీగెలుపును. ఘోషింపన్ = చాటుటకు. గోపాలురన్ = గొల్లలను. తెఱంగుగాన్ = యుక్తముగా. నిగూఢంబుగాన్ = రహస్యముగా. ఆహవజయదర్పితవాహినీపరివృతుండు ఐ = యుద్ధమునందలి గెలుపుచేత గర్వించినసేనచేతఁ జుట్టఁబడినవాఁడై. నగరంబు = పట్టణమును. చొత్తెంచి = చొచ్చి.

232. మందిరఆభ్యంతరమునకున్ = ఇంటిలోపలికి. ఆనందలీలన్ = సంతోషముయొక్క విధముచేత. తక్కటిబంధుజనులున్ = మిగిలినచుట్టాలును. విప్రులును = బ్రాహ్మణులును. వనితాజనంబున్ = స్త్రీజనమును. సేసలు = అక్షతలను. ఒలుకన్ = చల్లుచుండఁగా. సింహాసనాసీనుఁడు = సింహాసనమునందుఁ గూర్చున్నవాఁడు.

తా.—పాండవులతోను బంధువులతోను విరాటుఁడు అంతఃపురమునకుఁ బోయి బ్రాహ్మణులును ముత్తైదువలును దీవింపఁగా సింహాసనమునఁ గూర్చుండెను.

233. తనవిజయంబున్ = తనగెలుపును. అభినందించి = పొగడి. కురునాథుండు = దుర్యోధనుఁడు. ఆదియోధవీరులు = మొదలుగాఁ గలశూరు లయినభటులు. పెరసినబలంబులతోడన్ = కూడినసేనలతో. కుయివోవుట = రక్షకుఁ డయి పోవుటను. విషాదవేదనాదూయమానమానసుండు = దుఃఖముయొక్క బాధచేఁ గలఁగుచున్న మనస్సు గలవాఁడు.

చ. అసమున మీఁదెఱుంగక మ♦హాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం
బసులకుఁ గాయిగాఁ జనియెఁ ♦ బాపఁడు కౌరవసేన యేడ యొం
టి ననుట యేడ నా కిది గ♦డిందివిచారము పుట్టె సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు ♦ వేగమ పంపుఁడు చాలునట్లుగన్. 234

చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె ♦ నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా
వున నిట వీరికిన్ జయ మ♦వున్ వెఱ పేటికి నీకు నుత్తరుం
డని నొకరుండు నాకుము బృ♦హన్నల సారథి గాన గెల్చు న
య్యనిమిషకోటి నైన నతఁ ♦ డద్భుతవిక్రమజృంభణంబునన్. 235

చ. అన వినుచుం గలంగుహృద♦యంబునఁ దాపము నివ్వటిల్ల ని
ట్లను మఱియున్ విరాటుఁడు ర♦ణావనియందుఁ ద్రిగర్తసేనచే.
ననయము నొచ్చినట్టిజను ♦ లందఱుఁ దక్కఁగ నాటుఁ బోటుఁ దాఁ
కని ఘనయోధకోటి చనఁ ♦ గా వలయున్ బలుమై రయంబునన్. 236

---

234. అసమునన్ = అహంకారముచే. మీఁదు = రాఁబోవుదానిని. మహాత్ ఆగ్రహవృత్తిన్ = గొప్పపట్టుదలయందలి యునికిచేత. కడంగి = పూని. చెచ్చెరన్ = మిక్కిలి శీఘ్రముగా. కాయిగాన్ = రక్షకుఁడుగా. పాపఁడు = చిన్నవాఁ డయినయుత్తరుఁడు. చనియెన్. ఒంటిన్ = ఒంటరితనముచేత. ననుట = పోవుట. ఇది కడిందివిచారము = ఈగొప్పచింత. వెసన్ = శీఘ్రముగా.

తా.—చిన్నవాఁడు కనుక నుత్తరుఁడు మీఁదవచ్చునపాయము తెలియక పశువులను మరల్చుటకుఁ బోయినాఁడు కాని కౌరవసేనమీఁదికిఁ నతఁ డొంటరిగాఁ బోవుట యెంతమాత్రము తగదు. కాఁబట్టి యతనికి సహాయపడుటకై చాలినంతసేనం బంపుఁడు.

235. అనుటయున్ = అని విరాటుఁడు చెప్పఁగా. కంకుఁడు = ధర్మరాజు. అవున్ = అగును. వెఱపు = భయము. అనిన్ = యుద్ధమునందు. నాకుము = అనసము. అతఁడు = ఆయుత్తరుఁడు. అద్భుతవిక్రమజృంభణంబునన్ = వింత యయినపరాక్రమముయొక్క యతిశయముచేత. అయ్యనిమిషకోటిన్ ఐనన్ = ప్రసిద్ధమగు దేవతలసమూహము నైనను.

తా.—విరాటుని మాట విని ధర్మరాజు దక్షిణగోగ్రహణమందు మనకు సుశర్మ యోడిపోయెను గనుక నిచ్చటఁ గూడ మన యుత్తరునకే జయము కలుగును, భయపడ వలదు, యుద్ధమునకు ఉత్తరుఁ డొక్కఁడే పోయినను నతనికి బృహన్నల సారథిగా నున్నాఁడు కావున నతఁడు పరాక్రమముచే దేవతలనైనను సాధింపఁగలఁ డని పలికెను.

236. అనన్ = అని ధర్మరాజు చెప్పఁగా. కలంగుహృదయంబునన్ = కలఁగినమనస్సునందు. తాపము = దుఃఖము. నివ్వటిల్లన్ = నిండఁగా. రణఅవనియందున్ = యుద్ధభూమియందు. అనయమున్ = మిక్కిలి. తక్కఁగన్ = తప్ప. ఆటున్ పోటున్—గాయములు. తాఁకని ఘనయోధకోటి = తగులని గొప్పశూరులసమూహము. బలుమైన్ = బలము గలుగువిధమున. రయంబునన్ = వేగముగా. చనఁగాన్ వలయున్.

క. చని యక్కుమారుఁ జే మ, మ్మేనా యత్తైఱఁ గెఱఁగి మనకు ♦ నెయిదించుట పు
ట్టినకార్యమునకుఁ దగియెడు, పని యట విధి గడవ నగునె ♦ బ్రహ్మకు నైనన్.

వ. అనుచు నుత్తలపడునయ్యవసరంబున నుత్తరుఁడు పుత్తెంచినగోపాలురు పఱతెంచి
యతనిం గాంచి. 238

చ. కురుబలముం జయించి మన♦గోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరుఁ డిదె తాను సూతుఁడు ను♦దగ్రత వచ్చుచు నున్నవాఁడు త
త్తురగరథధ్వజాలి నొక♦ త్రుప్పుడు రాలదు మమ్ముఁ బిల్చి వే
పురి నెఱిఁగింపుఁ డన్న నృప♦పుంగవ వచ్చితి మేము నావుడున్. 239

గీ. అంతరంగంబు నిండి రెం♦డలువులందు
వెడలుసంతోషపూరంబు♦విధము దోఁపఁ
గన్నుఁగవ సమ్మదాశ్రులు ♦ గడలుకొనుచు
గండపులకాంకురములతోఁ ♦ గ్రమ్ముదేర. 240

---

తా.—ధర్మరాజు మాట వినియు విరాటుఁడు మనస్సులో దుఃఖము నాఁపఁజాలక మంత్రులతో నిట్లు చెప్పెను. దక్షిణగోగ్రహణమునఁ గష్టపడినవారు దక్కఁ దక్కినవారు అందఱును నుత్తరునకుఁ దోడుగాఁ బోవలయును.

237. ఎయిదించుట = పొందించుట. పుట్టినకార్యమునకున్ = సంభవించినపనికి. తగియెడుపని = తగినయుపాయము. అట్లున్ = అటుపిమ్మట. విధిన్ = దైవమును. కడవన్=దాఁటుట.

తా.—వారు పోయి యుత్తరుని సమాచారమును తెలిసికొని మనకుఁ దెలుపవలయును. ఇప్పు డిదియే దీనికిఁ దగినయుపాయము, అటువెనుక విధి యేర్పఱచినచొప్పున జరగును గాక.

238. ఉత్తలపడుఅయ్యవసరంబునన్=పరితాపపడుచున్నాసమయమునందు. పుత్తెంచినగోపాలురు= పంపినగొల్లలు. పఱతెంచి = పరుగెత్తి వచ్చి.

289. క్రమ్మఱించి = మరల్చుకొని. సూతుఁడున్ = సారథియును. ఉదగ్రతన్ = గొప్పతనముచేత. తత్తురగరథధ్వజఆలిన్ = ఆయుత్తరునిగుఱ్ఱములయొక్కయు తేరుయొక్కయు ధ్వజముయొక్కయు సమూహమునందు. ఒకత్రుప్పుడు=ఒకకొంచెము కూడ. నృపపుంగవ=రాజశ్రేష్ఠుఁడా! విరాటునిసంబోధనము. నావుడున్ = అనిగొల్లలు చెప్పఁగా.

తా.—ఉత్తరుఁడు కౌరవులం జయించి మనగోవుల మరలించికొని సారథితోఁ గూడ వచ్చుచున్నాఁడు, వానిగుఱ్ఱములు మొదలగువానికిఁ గొంచెమైనను దెబ్బ తగులలేదు. మమ్ముఁబోయి యీసంతోషవార్తను బట్టణమునందుఁ జెప్పుఁ డనఁగా మేము వచ్చితిమి యని చెప్పఁగా.

240. అంతరంగంబు = మనస్సునందు. అలువులందున్ = జలనిర్గమనమార్గములందు. వెడలుసంతోషపూరంబువిధము = వెడలుచున్నట్టి సంతోషప్రవాహముయొక్కతీరు. తోఁపన్ = తోఁచుచుండఁగా. కన్నుఁగవన్ = రెండుకన్నులనుండి. సమ్మదఅశ్రులు = ఆనందబాష్పములు. కడలుకొనుచున్ = అతిశయించుచు. గండపులకఅంకురములతోన్ = చెక్కిళ్లయందలి గగుర్పాటు అను మొలకలతో. క్రమ్ముదేరన్ = బయలు వెడలఁగా.

క. ఏమేమీ యని గోప, స్తోమముఁ బలుమాఱు నడుగు♦చున్ మెయి పొదలన్
భూమీశుఁ డపుడు మంత్రుల, మోములు గనుఁగొని సగర్వ♦ముగ ని ట్లనియెన్.

శా. వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై ♦ విస్ఫారఘంటాధ్వనిం
జాటం బంపుఁడు పేర్మి నుత్తరుజయా♦శ్చర్యంబుఁ బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహిత♦క్షోణీసురవ్రాతముం
ఘోటస్యందనవారణప్రతతులం ♦ గూడన్ సతూర్యంబుగన్. 242

క. ఉత్తమకన్యాజనములు, నుత్తరయును గంధమాల్య♦యుక్తముగఁ గుమా
రోత్తము నెదుర్కొనం దగు, నత్తెఱఁగును సంఘటింపుఁ ♦ డభిరామము గాన్.

వ. అని నియోగించి గోపాలురకుం గట్ట నిచ్చి కంకు నాలోకించి నెత్తం బొక పలక

---

తా.—మనస్సంతయు నిండి రెండుమార్గములసంతోషమే ప్రవహించుచున్నదియో యనునట్లు ఆనందబాష్పములు కనుదోయినుండి చెక్కిళ్లయందుఁ బులకాంకురములు గలిగించి ప్రవహింపఁగా.

241. గోపస్తోమమున్ = గొల్లలసమూహమును. పలుమాఱున్ = మాటిమాటికి. మెయి = దేహము. పొదలన్ = వృద్ధినొందఁగా. భూమీశుఁడు = విరాటరాజు. సగర్వముగన్ = గర్వముతోఁ గూడినట్లుగా.

తా.—విరాటుఁ డాశ్చర్యపడి యాగొల్లలను బలుమా ఱుత్తరునిసమాచార మడుగుచు దేహముప్పొంగినవాఁడై మంత్రులం జూచి గర్వముతో నిట్లనియె.

242. వీటన్ = పట్టణమునందు. విస్ఫారఘంటాధ్వనిన్ = ప్రకాశించుచున్నగంటలయొక్క ధ్వనితో. ఉత్తరుజయాశ్చర్యంబున్ = ఉత్తరునియొక్క యాశ్చర్యమయినగెలుపును. పేర్మిన్ = గొప్పతనముతో. చాటన్ పంపుఁడు. ఎదుర్కొనంగన్. పుణ్యాంగనాకోటిన్ = ముత్తైదువలసమూహమును. మహితక్షోణీసురవ్రాతమున్ = పూజ్యులయినబ్రాహ్మణులసమూహమును. కూడన్ = పరివేష్టించుటకు. ఘోటస్యందనవారణప్రతతులన్ = గుఱ్ఱములయొక్కయు రథములయొక్కయు నేనుఁగులయొక్కయు సమూహములను. సతూర్యంబుగన్ = వాద్యములతోఁ గూడినట్లుగా. పుచ్చుఁడు = పంపుఁడు.

తా.—ఏనుఁగులమీఁద గంటలు వాయించుచుఁ బట్టణమంతటను నుత్తరుని గెలుపును జాట నాజ్ఞాపింపుఁడు. అతని కెదురుగా ముత్తైదువలను బ్రాహ్మణులను బంపుఁడు, అతనిఁ బరివేష్టించివచ్చుటకై గుఱ్ఱములను రథములను నేనుఁగులను వాద్యములతోఁ బంపుఁడు.

243. ఉత్తమకన్యాజనములున్ = మేలి పెండ్లికానిపడుచులును. గంధమాల్యయుక్తముగన్ = గంధముతోను పుష్పమాలికలతోను గూడినట్లుగా. కుమారోత్తమున్ = కుమారశ్రేష్ఠుఁ డయినయుత్తరుని. ఎదుర్కొనన్. తగు అత్తెఱఁగును = తగినయావిధమును. అభిరామముగాన్ = మనోహరముగా. సంఘటింపుఁడు = సమకూర్పుఁడు.

తా.—ఉత్తరయును కన్యలును గంధమును పుష్పమాలలను దీసికొని యుత్తరు నెదుర్కొనునట్లు కావింపుఁడు.

244. నియోగించి = ఆజ్ఞాపించి. కట్టనిచ్చి = వస్త్రములు బహుమానముగా నిచ్చి. నెత్తంబు = జూదము. ఒకపలక = ఒకయాట ననుట. ఉబ్బుమైమాటగాన్ = సంతోషముతోడి మాటగా.

యోడుదమే యని యుబ్బుమైమాటగాఁ బలికిన నతండు నీవు సుమాళంబున నున్నవాఁడవు నేఁడు నీతోడ నాడి జయింప రాదు వెఱతు ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగు సైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి పలక ముందటికిఁ దిగిచికొనుచు నిందు ర మ్మనవుడుఁ బాండవాగ్రజుండు జూదం బాడుట యెంతలెస్స యనుచుం జేరి యాడం దొడంగునప్పుడు మఱియు ని ట్లనియె. 244

గీ. జూద మాడి ధర్మ♦సూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగ♦నను బణంబు
గాఁగ నొడ్డి యాడి ♦ కాఱియపడఁడె య, ట్లగుట దీనితోడి♦యర్థి గీడు. 245

వ. అని పలికి యాడుచుండుసమయంబున. 246

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితో♦న్మాదంబుమై ని ట్లనుం
గురుసైన్యంబుల మ్రుట్టి గెల్చి యెలమిన్ ♦ గోవర్గముం దెచ్చె ను
త్తరుబాహాబలశౌర్యసారము లుదా♦త్తంబుల్ గదే యెందు నె
వ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులై♦శ్వర్యం బవార్యంబుగన్. 247

---

సుమాళంబునన్ = సంతోషముతోడి పారవశ్యముతో. తత్ప్రదేశంబునన్ = ఆచోట. సారెలు = పాచికలను. పాండవఅగ్రజుండు = ధర్మరాజు. ఎంతలెస్స = ఏమి మంచిది ? పలకశబ్దము ఉకారమధ్యముగా పలుక యని కొందఱందురు. అది ఫలకశబ్దభవ మౌటచే అకారమధ్యమే యనుట యుచితము. శబ్దరత్నాకరమునందును నట్లే వ్రాయఁబడియున్నది. పలుక యనఁగాఁ పెల్లన యని యర్థము.

245. ధర్మసూనుఁడు = ధర్మరాజు. అనుజులను = తమ్ములను. ప్రియాంగనను = భార్యను. పణంబుగాఁగన్ = పందెముగా. కాఱియపడఁడుఎ = కష్టపడఁడా ? దీనితోడిఅర్థి = ఈజూదము తోడి యాశ. కీడు.

తా.—ధర్మరాజు జూదమాడి రాజ్యమును దమ్ములను భార్యను బందెముగాఁ బెట్టి పోఁగొట్టుకొని శ్రమపడెను, కావున జూదమాడుట యుక్తము కాదు.

247. నరనాథుండు = విరాటరాజు. ప్రమోదసంపత్ ఉదిత ఉన్మాదంబుమైన్ = సంతోషాతిశయముచేతఁ గలిగినపారవశ్యముచేత. మ్రుట్టి = తాఁకి. ఎలమిన్ = సంతోషముచే. గోవర్గమున్ = ఆవులమందను. ఉత్తరుబాహాబలశౌర్యసారములు = ఉత్తరునియొక్క భుజబలముయొక్కయు శౌర్యముయొక్కయు నతిశయములు. ఉదాత్తంబుల్ = గొప్పవి. ఎక్కాలమున్ = ఎప్పుడైనను. కులఐశ్వర్యంబు = వంశముయొక్క గొప్పతనము. అవార్యంబుగన్ = అడ్డగింపరానిది యగునట్లు.

తా.—విరాటుఁడు సంతోషముచే మైమఱచి యిట్లనియె. ఉత్తరుఁడు కౌరవసేనను జయించి గోవులం దెచ్చెను. వానిబలపరాక్రమములు మిక్కిలి గొప్పవి. ఇదివఱ కెవ్వరైనను ఎచ్చటనైనను ఎప్పుడైనను ఇట్లు తమవంశమున కౌన్నత్యంబు కలుగునట్లు పరాక్రమము చూపినవారు లేరు.

వ. అనిన విని కంకుం డతని కి ట్లనియె. 248

చ. కురుపతి భీష్మ కర్ణ కృప ♦ కుంభజముఖ్యమహోగ్రయోధవి
స్ఫురణము నోర్వఁ జాలి రణ♦భూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుఁడ జయించెనేని వసు♦ధావర యింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధరఁ బ్ర♦సిద్ధికి నెక్కఁడె యాతఁ డొక్కఁడున్. 249

గీ. అనినఁ గటకటఁబడి యిట్టు ♦ లాడు టెల్ల, నతనివిజయము సందియ♦ మనుటగాదె
యింతవట్టు సైరించితి ♦ నీవు గాన, నింక నీమాట లుడుగుము ♦ కంకభట్ట.

వ. అనుచు విరాటుండు కటంబు లదరఁ గన్నులఁ గెంపు గదురఁ బలకచప్పు డగ్గలం
బుగా నాడుచున్న సరకు సేయక యుధిష్ఠిరుండు వెండియు ని ట్లనియె. 251

చ. కురుబల మేల దైత్యసుర♦కోటులు వచ్చిన గెల్వ రాదె యు
త్తరునకు నాబృహన్నల ర♦థంబుపయిం బరవాహినీభయం

---

249. కురుపతి......విస్ఫురణముఁ—కురుపతి = దుర్యోధనుఁడును, భీష్మ = భీష్ముఁడును, కర్ణ = కర్ణుఁడును, కృప = కృపుఁడును, కుంభజ = ద్రోణుఁడును, ముఖ్య = మొదలుగాఁ గల, మహత్ ఉగ్ర = మిక్కిలి భయంకరు లయిన, యోధ = శూరులయొక్క, విస్ఫురణముఁ = పరాక్రమమును. రణభూమిఁ = యుద్ధరంగమునందు. భుజాబలము = చేతులబలిమి. ఉల్లసిల్లఁ = ప్రకాశింపఁగా. వసుధావర = విరాటరాజా! ధరఁ = భూమియందు.

తా.—ఉత్తరుఁడే దుర్యోధనుఁడు మొదలుగాఁ గల మహాశూరులను జయించినయెడ నంతకంటె నెక్కుడాశ్చర్యము లేదు, రాజా! భూమియం దతఁడు ఒక్కఁడే మహాశూరుఁ డని ప్రసిద్ధి పొందును.

250. కటకటఁబడి = కోపపడి. అనుట = అనుట. అతనివిజయము = ఆయుత్తరుని గెలుపు. ఈవు గానఁ = నీవు కనుక. ఇంతవట్టు = ఇంతవఱకు. సైరించితిఁ = ఓర్చితిని. కంకభట్ట! ధర్మరాజు సంబోధనము.

తా.—ధర్మరాజు మాట విని విరాటరాజు కోపించి యుత్తరునిగెలుపువిషయమై నీవు సందేహముగాఁ జెప్పుచున్నాఁడవు. నీవు కావున నింతవఱకు మన్నించితిని. ఇఁక నిట్టి మాటలు చెప్పవలదు.

251. కటంబులు = చెక్కిళ్లు. కెంపు = ఎఱ్ఱఁదనము. కదురఁ = కలుగఁగా. పలకచప్పుడు = జూదమాడుపలకయొక్క ధ్వని. అగ్గలంబుగాఁ = అధిక మగునట్లు. సరకుసేయక = లక్ష్యము చేయక. యుధిష్ఠిరుండు = ధర్మరాజు.

252. ఆబృహన్నల — ఆయర్జునుఁ డనుట. రథంబుపయిఁ = తేరిమీఁద. పరవాహినీభయంకరభుజసారముల్ = శత్రుసేనలకు భయమును గలిగించునట్టి చేతులబలములను. మెఱయఁగాఁ = ప్రకాశింపఁజేయుటకు. తఱిఁ = సమయమును. కాంచితిఁ. అంచుఁ. విక్రమఉద్ధురగతిఁ = పరాక్రమముచే గొప్పది యగువిధమున. ఆజికేళినిరతుండు అయి = యుద్ధము అను నాటయం దాసక్తుఁడయి. దుర్దమలీలఁ = అణఁపరానివిలాసముతో. ఉండఁగఁ. ఉత్తరునకుఁ. కురుబలము =

కరభుజసారముల్ మెఱయఁ ♦ గాఁ దటఁ గాంచితి నంచు విక్రమో
ద్ధురగతి నాజికేలినిర♦తుం డయి దుర్దమలీల నుండఁగన్. 252

వ. అనిన విని సక్రోధహాసోల్లాసవికృతాననుం డై మత్స్యమహీనాథుండు. 253

ఉ. వింతలు సాల నీవలన ♦ వింటిమి గాని ధరిత్రి నెందు నే
మింతకు మున్ను సారథుల ♦ నెవ్వరిఁ జూడము వైరివీరదు
ర్దాంతభుజావిలాస మడ ♦ రం దెగి పోరుల నస్త్రశస్త్రవి
క్రాంతిఁ గడంగువారి నని ♦ కన్నుల నిప్పులు రాలు చుండఁగన్. 254

క. నాకొడుకుపోటుమాటలు, నీకేటికిఁ బొసఁగ నాడ ♦ నేరవు మాత్సర్యో
ద్రేకమునఁ బలుకు చుండుట, మాకు సహింపంగ రాదు ♦ మానుము విప్రా.

క. అనినం జలమునఁ గుంతీ, తనయాగ్రజుఁ డిట్టు లనియె ♦ దరహాసం బా

---

కౌరవసైన్యము. ఏల? దైత్యసురకోటులు = రాక్షసులయొక్కయు దేవతలయొక్కయు సమూహములు. వచ్చినన్. గెల్వన్. రాడె?

తా.—బృహన్నల రథముమీఁదనుండి తనపరాక్రమము చూపుటకు సమయము దొరకె నని యుద్ధమునందలియుత్సాహముతో నెదురులేక విజృంభించి యుండునపుడు, ఉత్తరుఁడు కురుసేనను మాత్రమే గాదు దేవాసురుల నైనను జయింపఁ గలఁడు.

253. సక్రోధహాసఉల్లాసవికృతఆననుండువై = కోపముతోఁ గూడిన నవ్వుయొక్క యతిశయముచేత వికార మయినమోము గలవాఁడై. మత్స్యమహీనాథుండు = విరాటరాజు.

254. నీవలనన్. వింతలు. చాలన్. వింటిమి. ధరిత్రిన్ = భూమియందు. ఏము—మేము, విరాటుఁ డనుట. వైరి.....విలాసము—వైరివీర = శత్రువీరులయొక్క, దుర్దాంత = అణఁపరాని, భుజావిలాసము = బాహువులవిలాసము. అడరన్ = విజృంభించుచుండఁగా. తెగి = తెగించి. పోరులన్ = యుద్ధములయందు. అస్త్రశస్త్రవిక్రాంతిన్ = బాణములయందును ఆయుధములయందును బరాక్రమముచేత. కడంగువారిన్ = పూనువారిని. సారథులన్ = తేరుకడపువారిని. ఇంతకుమున్ను. ఎందున్. చూడము.

తా.—నీవు చెప్పినది యాశ్చర్యముగా నున్నది. పరాక్రమవంతు లగు శత్రువులు ఎదిరించునపుడు యుద్ధములయందు శస్త్రాస్త్రముల నేర్పుతోఁ బరాక్రమమును జూపునట్టి సారథులను మే మెచ్చటను ఎన్నఁడును చూచి యుండ లేదు. అని మిక్కిలి కోపముతో.

255. పోటుమాటలు = శౌర్యపుపలుకులు. పొసఁగన్ = తగునట్లు. ఆడన్ = చెప్పుటకు. నేరవు = శక్యము కావు. విప్రా! ధర్మరాజుసంబోధనము. మాత్సర్యఉద్రేకమునన్ = మోఱసఁ దనముయొక్క యతిశయముచేత.

తా.—కంకభట్టా! నాకొడుకుయొక్క పరాక్రమమును గొనియాడుటకు నీకేమి కష్టము? ఇట్టి తెలివిమాలినమాటలు మేము వినఁ జాలము, ఇఁక నిట్లు పలుక వలదు.

256. చలమునన్ = పట్టుదలచేత. కుంతీతనయ అగ్రజుఁడు = ధర్మరాజు. దరహాసంబు =

ననమున ముసుఁగుపడఁగ న, జ్జననాయకుతోడ నట్ల♦శంకితభంగిన్. 256

ఉ. ఆహవకేళివేడుక బృ♦హన్నల చిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని ♦ సారథిఁగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీపసుల ♦ నొక్కఁడుఁ దక్కక యుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గాఁ వలయుఁ ♦ దప్పదు నాపలు కట్ల చూడుమీ. 257

క. అని యంతట నిలువక య, మ్మనుజేశ్వరు మొగముఁ జూచి ♦ మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం, బనుపు బృహన్నలజయంబు ♦ భవ్యవిచారా. 258

(విరాటుండు కంకుని సారె గొని వ్రేయుట.

గీ. అనిన రౌద్రరసము ♦ మనమున నడరంగఁ, బడగ యెత్తునురగ♦పాలు రేఖ
నెనయుచేత సారెఁ ♦ గొని వ్రేసెఁ బతి పేడి, గడన యుడుగు మన్న♦నుడుగ వనుచు.

---

చిఱునగవు. అననమునన్ = మోమునందు. ముసుఁగుపడఁగన్ = చుట్టుకొనఁగా. ఆశంకిత భంగిన్ = జంకులేనివిధమున. అజ్జననాయకుతోడన్ = ఆవిరాటరాజుతో. ఇట్టులు. అనియెన్.

తా.—విరాటుని మాట విని ధర్మరాజు తనపట్టుదల వదలక చిఱునవ్వు నవ్వుచు విరాటునితో నిర్భయముగా నిట్లు చెప్పెను.

257. బృహన్నల. ఆహవకేళివేడుక = యుద్ధము అను నాటయందలి వినోదము. చిత్తమునందున్ = మనస్సునందు. ఎలర్చినన్ = ప్రకాశింపఁగా. సాహసవృత్తిన్ = తెగువయందలి యునికిచేత. ఉత్తరునిన్. సారథిన్ కాన్. కొనిపోయి. సత్వరఉత్సాహతన్ = వేగముతోను ఉత్సాహముతోను గూడినవాఁడగుటచేత. కౌరవవ్యూహమున్ = కౌరవసేనను. ఓర్చి = గెలిచి. ఒక్కఁడున్ = ఒకటికూడ. తక్కక = తప్పక.

తా.—బృహన్నలయే యుద్ధమునం దుత్సాహము కలవాఁడై యుత్తరునిఁ దనకు సారథిఁగాఁ జేసికొని కౌరవసేనను జయించి నీపసుల నన్నిటిని దెచ్చి యుండవలయును గాని వేఱు గాదు. నామాట తప్పదు.

258. అమ్మనుజఈశ్వరుమొగమున్ = ఆవిరాటరాజు ముఖమును. భవ్యవిచారా = మంచియాలోచనము గలవాఁడా!

తా.—ధర్మరాజంతటితో నిలువక రాజా! పట్టణమందు బృహన్నలజయమును జాటింపు మని విరాటుని మొగము చూచి పలికెను.

259. అనినన్=అని ధర్మరాజు చెప్పఁగా. రౌద్రరసము—కోపము. అడరంగన్=అతిశయింపఁగా. ఉరగపాలురేఖన్ = ఆదిశేషుని విలాసమును. ఎనయుచేతన్=పోలినచేతితో. సారెన్=పాచికను. పతి=విరాటరాజు. పేడిగడవ=నపుంసకుఁ డయిన బృహన్నలయొక్క స్తోత్రమును. వ్రేసెన్ = కొట్టెను. ఇందు పడగకును అఱచేతికిని, ఉరగపాలునకును విరాటునిబాహువునకును ఉపమానోపమేయభావము.

తా.—ధర్మరాజు చెప్పినమాట విని విరాటుఁడు ఎక్కుడు కోపము గలవాఁడై నపుంసకుని పొగడ వల దన్నను బొగడుచున్నాఁడ వని తనచేతిపాచికతో ధర్మరాజును గొట్టెను.

వ. ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక గదురనిహ్నాదయంబుతోడం పాంచాలిదెసం జూడ్కి మలఁగ నూర కుండె నన్నారీరత్నంబును రయంబునం జేరి వ్రేటుగంటిఁ దొరఁగురుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చేరువ నున్న కనకకలశంబుజలంబులం గరతలంబు దడిపికొని తుడుచునప్పుడు మత్స్యమహీవల్లభుం డీశోణితంబు పైచీరం బట్టుటకుఁ గతం బేమి యని తన్నడిగిన సైరంధ్రి యతని కిట్లనియె. 260

గీ. విమలవంశంబునను బుణ్యవృత్తమునను, వఱలునీతనిరక్తంబు వసుమతీశ
ధరణిపై నెన్నిబిందువుల్ దొరఁగె నన్ని, వర్షములుగల్గు నిందనావర్షభయము.

వ. అని చెప్పి యుత్తమద్విజశోణితపాతం బెట్లునుం గీడు గావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిభ్భంగిం జేసితి నని వెండియుఁ గొండొకకీలాలంబు దొరఁగం దుడుచు చుండె నంత నట నుత్తరు నెదుర్కొనం బోయి. 262

క. మంగళతూర్యరవములు సె, లంగఁగ మౌక్తికవిమిశ్రలలితాక్షతవృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బు, ణ్యాంగనలును భద్రవాక్యయంబులతోడన్. 263

---

260. అజాతశత్రుండు = ధర్మరాజు, సాభిప్రాయవిశేష్యము. అలుక = కోపము. కదురని హ్నాదయంబుతోడన్ = కలుగని మనస్సుతో. పాంచాలిదెసన్ = ద్రౌపదివైపున. చూడ్కి = చూపు. మలఁగన్ = మరలునట్లు. అన్నారీరత్నంబును = ఆయుత్తమ స్త్రీయును. రయంబునన్ = వేగముచేత. వ్రేటుగంటిన్ = దెబ్బచేతఁ గలిగినగాయమునుండి. తొరఁగురుధిరంబున్ = కాఱునట్టి నెత్తురును. ఉత్తరీయంబునన్ = పైటచేత. అచ్చేరువన్ = ఆసమీపమున. ఉన్నకనకకలశంబు జలంబులన్ = ఉన్నట్టిబంగారుపాత్రయందలి నీళ్లయందు. కరతలంబు=అఱచేతిని. మత్స్యమహీవల్లభుండు = విరాటరాజు. ఈశోణితంబు = ఈనెత్తురును. కతంబు = కారణము.

261. విమలవంశంబునను = పరిశుద్ధ మయిన కులముచేతను. పుణ్యవృత్తమునను = పవిత్ర మయిన నడవడిచేతను. వఱలు ఈతనిరక్తంబు = ఒప్పుచున్న యీకంకభట్టుయొక్క నెత్తురు. వసుమతీశ = రాజా! ధరణిపైన్ = నేలమీఁద. ఎన్నిబిందువుల్ = ఎన్ని బొట్లు. తొరఁగెన్ = పడునో. అనావర్షభయము = వర్షము లేమివలని భయము. ఇందున్. కల్గున్.

తా.—ఈకంకభట్టు మంచివంశమునఁ బుట్టి సదాచారము కలవాఁడు కావున నితని నెత్తు రెన్ని బిందువులు నేలమీఁదఁ బడునో యన్ని సంవత్సరము లీదేశమున వర్షము కురియదు.

262. ఉత్తమద్విజశోణితపాతంబు = ఉత్తమబ్రాహ్మణునియొక్క నెత్తురు పడుట. కొండొకకీలాలంబు = కొంచెము నెత్తురు.

263. మంగళతూర్యరవములు = మంగళవాద్యముల ధ్వనులు. చెలంగఁగన్ = మ్రోఁగుచుండఁగా. విప్రులున్ = బ్రాహ్మణులును. పుణ్యాంగనలును = ముత్తైదువలును. భద్రవాక్యయంబులతోడన్ = మంగళకరము లయిన మాటల సమూహములతో, ఆశీర్వాదములతో ననుట. మౌక్తికవిమిశ్రలలిత అక్షతవృష్టిన్ = ముత్తెములతోఁ గలసిన మనోహరము లయిన యక్షతల వర్షమును.

ఉ. అత్తఱిఁ గన్యకాజనస♦హస్రముఁ దాను జేరి వేడ్కమై
నుత్తర చందనార్ద్రకుసు♦మోత్కరముల్ నవరత్నసంచయో
దాత్తసువర్ణపుష్పములు ♦ దండడి చల్లెఁ గిరీటిమీఁద న
య్యుత్తరుపైఁ బ్రమోదకల♦నోత్కటసంభ్రమసంభృతంబుగన్. 264

ఉ. తక్కటివారలుం గని ము♦దం బలరారఁగఁ గౌఁగిలించుచుం
మ్రొక్కుచు నాదటం దనదు♦మోముపయిం దనివోనిచూడ్కులం
గ్రిక్కిఱియించుచుం బొదివి ♦ గెల్పు నుతింపఁగ రాజపుత్త్రుఁ డ
య్యెక్కుడుమాట కోరువక ♦ యిట్లను నర్హజనంబుతోఁ దగన్. 265

చ. కురుబలముల్ జయించుటయు ♦ గోవులఁ దెచ్చుటయుల్ బృహన్నలా
స్ఫురితభుజాబలంబునన ♦ చూవె నిజం బిది నాక యేల యె

---

తా.—బ్రాహ్మణులును ముత్తైదువలును దీవించుచు మంగళవాద్యములు మ్రోయుచుండఁగా ముత్తెములను నక్షతలను నుత్తరునిమీఁదఁ జల్లిరి.

264. అత్తఱిన్ = ఆసమయమునందు. ఉత్తర. కన్యకాజనసహస్రముల్ = పెండ్లికానిపడుచుల వేయిమంది. కిరీటిమీఁదన్ = అర్జునునిమీఁదను. ప్రమోద...సంభృతంబుగన్—ప్రమోద = సంతోషముయొక్క, కలనా = పొందికచేత, ఉత్కట = అధిక మయిన, సంభ్రమ = వేగిరపాటుచేత, సంభృతంబుగన్ = నిండినది యగునట్లుగా. చందనఆర్ద్రకుసుమ ఉత్కరముల్ = గందముచేఁ దడిసిన పువ్వులసమూహమును. నవరత్నసంచయఉదాత్త సువర్ణపుష్పములున్ = తొమ్మిదిరత్నముల సమూహమును శ్రేష్ఠము లయిన బంగారుపువ్వులును. దండడి = దట్టముగా.

తా.—అప్పు డుత్తరయు వేయుమందికన్యలును నుత్తరు నెదుర్కొని మిక్కిలి సంతోషముతో నర్జునునిమీఁదను నుత్తరునిమీఁదను గందపునీటఁ దడిసిన పువ్వులను నవరత్నములను బంగారుపువ్వులను జల్లిరి.

265. తక్కటివారలున్ = మిగిలినవారలును. ముదంబు = సంతోషము. అలరారఁగన్ = అతిశయింపఁగా. ఆదటన్ = ప్రీతితో. తనివోనిచూడ్కులన్ = తృప్తిపడనిమాపులను. క్రిక్కిఱియించుచున్ = మిక్కిలి వ్యాపింపఁజేయుచు. పొదివి = చుట్టుకొని. గెల్పు = జయమును. నుతింపఁగన్ = పొగడఁగా. రాజపుత్త్రుఁడు = ఉత్తరుఁడు. అయ్యెక్కుడుమాటకున్ = ఆపొగడ్తకు. అర్హజనంబుతోన్ = తగినవారితో.

తా.—మిగిలినవారందఱు నుత్తరునిఁ జూచి మిక్కిలి సంతోషించినవారై కొంద ఱతనిఁ గౌఁగిలించియుఁ గొంద ఱతనికి మ్రొక్కియు నతని జయమును పొగడఁగా నతఁ డంతటిగొప్పతనమున కోర్వక తగినవారితో నిట్లు చెప్పెను.

266. కురుబలముల్ = కౌరవసైన్యమును. బృహన్నలా స్ఫురితభుజాబలంబునన్ అ చూవె = బృహన్నలయొక్క ప్రకాశించుచున్న బాహువులబలముచేతనే సుమా. ఇది. నిజంబు. నాకున్ అ ఏల = నాకుమాత్రమే. యేమి ? ధ్రువంబుగన్ = నిశ్చయముగా. ఇట్టి సహాయసంపదన్ = ఇట్టి

వ్వారికిని గెల్వవచ్చునె ధ్రు♦వంబుగ నిట్టిసహాయసంపదం
బొరయక యున్న మీకెఱుఁగఁ బోలునె ♦ నాబ్రదు కెట్టిభంగియో. 266

వ. అని సారథ్యప్రశంసాప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచారవచనంబుల చందంబున సంక్రందననందను నుతించుచుఁ జనుదెంచి రాజమందిరద్వారంబుఁ జేరునవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయప్రవేశంబు తెఱంగు విన్నవించిన సారథికసారథులం జూచువేడ్కమనంబు వేగిరపెట్టెడు నయ్యిరువుర నియ్యెడకుం జయ్యనఁ దోడితె మ్మనువిభుని పలుకులు విని ధర్మతనయుండు పణిహారితో నల్లన నిట్లనియె. 267

క. ఇన్నెత్తురు గనుఁగొనిన బృ, హన్నల కోపించు నన్ను ♦ నతిభక్తిమెయిన్
మన్నించుఁ గాన రాజుం, దన్ను విచారింప కేమి ♦ దప్పు దలఁచునో. 268

వ. ఇది లెస్సగాఁ దుడుచునంతకుఁ దదీయప్రవేశం బించుకవడి వారింపుము పదంపడి రా నిత్తు గాని యంతకు నుత్తరుం డొక్కరుండు వచ్చునట్లుగాఁ జేయుము. 269

---

తోడుయొక్క యతిశయమును. పొరయక = పొందక. ఉన్నన్. ఎవ్వారికిని. గెల్వన్. వచ్చునె ? నాబ్రదుకు. ఎట్టిభంగి ఓ = ఎట్టివిధమో. మీకున్. ఎఱుఁగన్, పోలదునె = తెలియదా యనుట.

తా.—కౌరవుల జయించి పశువుల మరలించి దెచ్చుటయంతయు బృహన్నలపరాక్రమముచేతనే చేయఁగలిగితిని గాని, యితని సాహాయ్యము లేనియెడ, నేనే కాదు, ఎట్టివాఁడును గౌరవుల జయింపఁ జాలఁడు. నాశక్తి మీకుఁ దెలియనిది కాదు.

267. సారథ్యప్రశంసాప్రకారంబుగాన్ = తేరుతోలుటయొక్క పొగడుటయొక్క విధముగా, సారథ్యమును పొగడినట్లుగా ననుట. అతిఉపచారవచనంబులచందంబునన్ = మిక్కిలి యుపచారపు మాటలవిధమున. సంక్రందననందనున్ = అర్జునుని. నుతించుచున్ = పొగడుచు. రాజమందిరద్వారంబున్ = రాచనగరువాకిటికి. ప్రతిహారి = ద్వారపాలకుఁడు. ససంభ్రమగతిన్ = వేగముతోఁ గూడినసడకచేత. భూవల్లభునకున్ = విరాటరాజునకు. ప్రణమిల్లి = మ్రొక్కి. భూమింజయప్రవేశంబు తెఱంగు = ఉత్తరునియొక్క వచ్చుసమాచారమును. అరథికసారథులన్ = ఆశూరుని సారథిని, ఉత్తరుని బృహన్నల ననుట. చయ్యనన్ = శీఘ్రముగా. విభునిపలుకులు = రాజుమాటలను. ధర్మతనయుండు = ధర్మరాజు. పణిహారితోన్ = ద్వారపాలకునితో. అల్లనన్ = మెల్లగా.

268. నన్నున్ = ధర్మరాజును. అతిభక్తిమెయిన్ = మిక్కిలి. భక్తితో. మన్నించున్ = గారవించును. తన్నున్ = బృహన్నలను. విచారింపక = ఆలోచింపక. తప్పు = కీడును.

తా.—బృహన్నల నామీఁద మిక్కిలి భక్తి గలవాఁడు కావున ఈనెత్తురు చూచెనేని కోపపడి రాజునంతరము తనయంతరము విచారింపక యేమైనను గీడు చేయును.

269. తదీయప్రవేశంబు = ఆబృహన్నలదైన ప్రవేశమును. ఇంచుకవడి = కొంచెము సేపు. వారింపుము = నిలుపుము. పదంపడి = పిమ్మట.

క. అని చెప్పి హర్షసంభ్రమమున నజ్జననాయకుండు ♦ మునుఁగుట నది యే
మని యడుగఁ దలంపమిఁ దన, కను వగు కార్యము ఘటించి ♦ యతనిం బుచ్చెన్.

చ. అతఁడును బార్థు నిల్పి విన♦యంబున నుత్తరుఁ దోడి తెచ్చినం
బితృచరణాంబుజంబులకుఁ ♦ బ్రీతి మెయిం బ్రణమిల్లె నాతఁ డా
పతియును జిక్కఁ జేర్చె గరు♦పాఱెడు మేనును హర్షబాష్పసం
ప్లుత మగు నాననంబు నయి ♦ పుత్త్రునిఁ బెద్దయుఁబ్రొద్దు గౌఁగిటన్. 271

వ. ఇవ్విధంబున నాలింగితుం డయి భూమింజయుండు పునఃపునఃప్రణామంబు సేసి కంకునిం గనుంగొని సగౌరవంబుగా నమస్కరించి మొగంబుగంటి సూచి యిది యేమి యని యడిగిన. 272

క. ఏ నీజయంబు వొగడఁగఁ, దా నప్పుడు పేడిఁ బొగడె ♦ దానం గోపం
బూనిన సైరింపక నా, చే నడిచితి సారెఁ గొని వి♦శృంఖలవృత్తిన్. 273

---

270. హర్షసంభ్రమమునన్ = సంతోషముచేఁ గలిగిన వేగిరపాటునందు. అజ్జననాయకుండు = ఆవిరాటరాజు. తలంపమిన్ = తలఁపకుండుటచేత. అనువు = అనుకూలము. అగు కార్యము = అయిన పనిని. ఘటించి = చేసి. అతనిన్ = ఆద్వారపాలకుని. పుచ్చెన్ = పంపెను.

తా.—ఇట్లు విరాటరాజు సంతోషాతిశయముచే మైమఱచి తనమాటలను వినక యుండునపుడు ధర్మరాజు ద్వారపాలకునితోఁ దన కనుకూలము లగుమాటలు చెప్పి పంపెను.

271. అతఁడును = ఆద్వారపాలకుఁడును. పార్థున్ = అర్జునుని. తోడితెచ్చినన్ = తీసికొని రాఁగా. అతఁడు = ఆయుత్తరుఁడు. పితృచరణఅంబుజంబులకున్ = తండ్రియొక్క కమలములవంటి పాదములకు. ప్రీతిమెయిన్ = ప్రీతితో. ప్రణమిల్లెన్ = మ్రొక్కెను. ఆపతియును = ఆరాజును. గరుపాఱెడు మేనును = గగుర్పాటుగల దేహమును. హర్షబాష్ప సంప్లుతము = ఆనందబాష్పములచేఁ దడుపఁబడినది. అగు ఆననంబున్ = అయినముఖమును. అయి = కలవాఁడై. పెద్దయుఁ బ్రొద్దు = చాలసేపు. చిక్కఁజేర్చెన్ = గట్టిగాఁ జేర్చుకొనెను.

తా.—అంత నాద్వారపాలకుఁ డర్జును నచ్చట నిలిపి యుత్తరునిమాత్రమే విరాటునొద్దకుఁ దీసికొని రాఁగా నుత్తరుఁడు తండ్రిపాదములకు నమస్కరించెను, విరాటరాజు పులకిత మయిన దేహమును నానందబాష్పములచేఁ దడిసిన మోమును గలవాఁడై యుత్తరుని చాలసేపు గట్టిగాఁ గౌఁగిలించికొనెను.

272. ఆలింగితుండు ఐ = కౌఁగిలింపఁబడినవాఁడై. పునః పునః ప్రణామంబు = పలుమాఱు నమస్కారమును. మొగంబుగంటి = మోమునందలి గాయమును.

273. తాను = కంకుఁడు. పేడిన్ = బృహన్నలను. ఊనినన్ = కలుగఁగా. సైరింపక = ఓర్వక. నాచేన్ = నాచేతితో. సారెన్ = పాచికను. కొని. విశృంఖలవృత్తిన్ = అడ్డులేని వ్యాపారముచేత. అడిచితిన్ = కొట్టితిని.

తా.—నేను నీజయమును గొనియాడఁగా నితఁడు బృహన్నలను గొనియాడెను. అంతఁ గోపము గలవాఁడనై పాచికతో నీతనిఁ గొట్టితిని.

క. అని పతి పలికిన విని నె, మ్మనమున భయసంభ్రమములు ♦ మల్లడిగొన న
మ్మనుజేంద్రనందనుం డి, ట్లను సత్యాదరము మెఱయ ♦ నాతనితోడన్. 274

గీ. తప్పు సేసితి రీ రిట్లు ♦ దగునె వీర, లేమిగతిఁ బల్కినను నది ♦ యెల్ల మనము
గైకొనవలయుఁ గా కిట్లు ♦ గాదు గూడ, దని నిషేధించు టొప్పనె ♦ మనుజనాథ.

వ. అని మఱియును. 276

క. సవినయముగఁ బ్రార్థింపుఁడు, పవిత్రచారిత్రు లైన♦పరమద్విజు లి
ట్లవమతు లై కోపించిన, నవనీశుల కేల కల్గు ♦ నాయువు సిరియున్. 277

వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁ బట్టి విరాటుండు భయభక్తియుక్తంబుగా వేఁడి కొనినం బాండవాగ్రజుండు నగుచు నాకు నలుక యెక్కడిది యితండును గీడు తెరువువాఁడు గాఁ డిది యొక్కప్రొద్దుకీడున నయ్యెం గాని యని తాను రాజుదెసఁ బ్రసన్నుం డగుట దెలియునట్లుగా నుత్తరుతోడం బలికిన నమ్మహీవల్లభుండు సంత

---

274. పతి = విరాటరాజు. నెమ్మనమునన్ = నిండుమనస్సునందు. భయసంభ్రమములు = భయమును తత్తఱపాటును. మల్లడిగొనన్ = చుట్టుకొనఁగా. అమ్మనుజేంద్రనందనుండు = అవిరాటరాజుకొడు కయిన యుత్తరుఁడు. అతిఆదరము = మిక్కిలిప్రీతి.

తా.—విరాటుని మాట విని యుత్తరుఁడు మనస్సునందు భయమును దత్తఱపాటును గల వాఁడై మిక్కిలి ప్రీతితో విరాటునితో నిట్లు చెప్పెను.

275. ఈరు = మీరు. తప్పు. చేసితిరి. వీరలు — ఈ కంకుఁ డనుట. ఏమిగతిన్ = ఏమి విధమున. పల్కినను = చెప్పినప్పటికిని. కైకొనవలయున్ = అంగీకరింపవలయును. నిషేధించుట= ఆక్షేపించుట. మనుజనాథ! విరాటుని సంబోధనము.

తా.—రాజా! మీరు చేసినది తప్పు, ఇట్లు చేయ రాదు. వీ రెట్లు చెప్పినను అది సరి యని మన మంగీకరింపవలసినది గాని యాక్షేపించుట తగదు.

277. సవినయముగన్ = వినయముతోఁ గూడినట్లుగా. పవిత్రచారిత్రులు = పరిశుద్ధ మయిన నడవడి గలవారు. ఐనపరమద్విజులు=అయిన యుత్తమబ్రాహ్మణులు, అయిన యుత్తమక్షత్రియులు అని యర్థాంతరము. అవమతులు ఐ=అవమానింపఁబడినవారై. కోపించినన్. అవనీశులకున్=రాజులకు. ఆయువు = ఆయుస్సును. సిరియున్ = సంపదయును. ఏల. కల్గున్ ?

తా.—కావున నిప్పుడు వీరిని వేఁడుకొనుఁడు, సదాచారము గల యుత్తమబ్రాహ్మణులకుఁ (శూరులయిన యుత్తమక్షత్రియులకు) గోపము గలిగినయెడ రాజుల కాయుస్సును సంపదయును నశించును.

278. పాటిగాన్ పట్టి = యుక్తముగా నాదరించి. భయభక్తియుక్తంబుగాన్ = భయముతోను భక్తితోను గూడినట్లుగా. పాండవాగ్రజుండు = ధర్మరాజు. అలుక = కోపము. ఇతండును= ఈవిరాటుఁడును. కీడుతెరువువాఁడు = చెడుమార్గము గలవాఁడు. ఒక్కప్రొద్దు కీడునన్ = ఒక సమయదోసముచేత. ప్రసన్నుండు = కోపము లేనివాఁడు. అమ్మహీవల్లభుండు = అవిరాటరాజు.

సిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచినయాబృహన్నల నాదరించి నిజనందను నాలోకించి యి ట్లనియె. 278

( విరాటుఁ డుత్తరుని సమరప్రకారం బడుగుట. )

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ♦ ద్రోణసుతుండును గర్ణుఁడుం బశు
ప్రాణపరాయణత్వమున ♦ దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ గురియఁ ♦ బార్థివుఁడున్ వెనుదన్ని చూడ న
క్షీణజవంబునం గవియు♦సేనకు మార్కొన నగ్గలించితే. 279

ఉ. బాసట లేదు క్రొవ్వడర ♦ బంటుతనంబునఁ దాఁకి తేనియుం
బాసినచోటఁ బాయుఁ బెఱ♦పట్టులవీరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొక♦మోహర మిమ్ముల మ్రొగ్గనేని నా
సాసల నొక్కరుండ యను♦నాగ్రహవృత్తి బలంబు పైఁ బడున్. 280

తత్ అవసరంబునన్ = ఆసమయమునందు. నిజనందనున్ = తనకొడుకును, ఉత్తరుని. ఆలోకించి = చూచి.

279. పశుత్రాణపరాయణత్వమునన్ = పశువుల కాపాడుటయే ముఖ్యమైనపనిగాఁ గలవారగుటచేత. దర్పసముజ్జ్వలభంగిన్ = గర్వముచేఁ బ్రకాశించువిధమున. ఉల్లసత్ బాణపరంపరల్ = ప్రకాశించుచున్న బాణములవరుసలను. పార్థివుఁడున్ = రాజయిన దుర్యోధనుఁడును. వెనుదన్ని = వెనుకనిల్చి. అక్షీణజవంబునన్ = తక్కువకాని వేగముచేత. కవియుసేనకున్ = తాఁకునట్టి సేనతో. మార్కొనన్ = ఎదిరించుటకు. అగ్గలించితి ఏ = ఉత్సహించితివి గదా!

తా.—ద్రోణుఁడు మొదలగువారు పశువులఁ గాపాడఁ బూని మిక్కిలి గర్వముతో బాణములు ప్రయోగించుచుండఁగా దుర్యోధనుఁడు వెనుకనుండి పురికొలుపుచుండఁగా మహావేగమున విజృంభించుచుండు కౌరవసేనను ఎట్లెదిరించితివి.

280. బాసట = తోడు. క్రొవ్వు = గర్వము. అడరన్ = అతిశయింపఁగా. బంటుతనంబునన్ = శూరత్వముచేత. తాఁకితి ఏనియున్ = నీవెదిరించినప్పటికిని. పాసినచోటన్ = తొలఁగినచోట. పాయున్ = తొలఁగును. పెఱపట్టులవీరులు = ఇతరస్థలమునందలి శూరులు. ఉదగ్రవృత్తిమైన్ = గర్వముతోఁ గూడిన వ్యాపారముచేత. మూసికొనంగన్ = చుట్టుకొనుటకు. వత్తురు. ఒకమోహరము = ఒకవ్యూహము. ఇమ్ములన్ = సుఖముగా. మ్రొగ్గన్ ఏనిన్ = పడితేని. పాఠాం:—అమ్ములన్ = బాణములచేత. మ్రగ్గన్ ఏనిన్ = చచ్చినయెడ నని యర్థము. ఒక్కరుండు అ అను ఆగ్రహవృత్తిన్ = ఒక్కఁడే యను పట్టుదలతోఁ గూడినయునికిచేత. ఆసాసలన్ = నానాదిక్కులనుండి. బలంబు = సైన్యము. పైన్. పడున్.

తా.—నీ కొవ్వును సహాయులు లేరు, సహాయులు లేకున్నను శౌర్యముతో నెదిరింతువేని ఒక్కొకచోట శత్రువులు తొలఁగి పోయినను మఱియొకచోటనుండి వీరులు చుట్టుముట్టి నొప్పింతురు, ఒకవ్యూహమును భేదించినను నంతటితోఁ బోక తక్కినసైన్యము నలుదిక్కులనుండియు వచ్చి యొక్కఁడే కదా యనుపూనికతో మీఁదఁబడును.

గీ. ఒకఁడు పరశురాము ♦ నోర్చినవాఁ డొక్కఁ, డంపు ధనువునకు గు♦రుండు దాన
వారివరమునఁ బుట్టి ♦ యక్షీణబలవిక్ర, మముల నొక్కఁ డొప్పు ♦ మాఱు లేక.

ఉ. తక్కటివారలుం సురల ♦ దైత్యుల నైనను బోర గెల్వఁగా
నక్కురుసేన మేటిమగ ♦ లాధృతరాష్ట్రతనూజు లాజి నె
క్కొక్కఁడ ధాత్రి యంతయును ♦ నోర్వఁగఁ జాలుదు రట్టివారి నీ
వెక్కటి దాఁకి నొవ్వకయ ♦ యెమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా. 282

ఉ. గోవుల నెట్టు లాఁగితి వ♦కుంఠితవిక్రముఁ డైనరాజరా
జేవిధి మానభంగమున ♦ కెల్లను నోర్చి పలాయమానుఁ డై
నీవిజయంబు సైఁచి ఘన♦నిందకు నియ్యకొనంగఁ జాలెఁ బు
త్రా వెఱఁ గయ్యెడుం రణవి♦ధం బఖిలంబు నెఱుంగఁ జెప్పుమా. 283

---

281. ఒకఁడు—భీష్ముఁడు. ఓర్చినవాఁడు = జయించినవాఁడు. ఒక్కగురుండు—ద్రోణుఁడు. ధనువునకున్ = విలువిద్యకు. గురుండు = ఆచార్యుఁడు. ఒక్కఁడు—అశ్వత్థామ. దానవారివరమునన్ = శివునివరముచేత. అక్షీణబలవిక్రమములన్ = తఱుఁగులేనిబలముచేతను బరాక్రమము చేతను. మాఱు = ఎదురు. లేక. ఒప్పున్.

తా.—వారిలో భీష్ముఁడు పరశురాముని జయించినవాఁడు, ద్రోణుఁడు విలువిద్యకంతకు నాచార్యుఁడు, అశ్వత్థామ శివునివరమునఁ బుట్టి బలపరాక్రమముల నెదురు లేనివాఁడు.

282. అక్కురుసేనన్ = ఆకౌరవసేనయందు. తక్కటివారలున్ = మిగిలినవారలును. పోరన్ = యుద్ధమునందు. సురలన్ = దేవతలనైనను. దైత్యులన్ ఐనను = రాక్షసులనైనను. మేటిమగలు = గొప్పశూరులు. ఆధృతరాష్ట్రతనూజులు = ఆధృతరాష్ట్రునికొడుకులు. ఆజిన్ = యుద్ధమునందు. ధాత్రి = భూమిని. ఓర్వఁగన్ = జయించుటకును. ఎక్కటి = అసహాయుఁడవై. దాఁకి. నొవ్వకయున్ = బాధపడకయే. ఎమ్మెయిన్ = ఏవిధమున.

తా.—ఆకౌరవసేనయందుఁ దక్కినవారు కూడ యుద్ధమున దేవాసురులనైనను గెలువఁ జాలినవారు. ధృతరాష్ట్రునికొడుకులును మిక్కిలి శూరులు. ఒకొక్కఁడును భూమినంతయు జయింపఁ జాలుదురు. నీవొక్కఁడవే యట్టి గొప్పశూరుల నెదిరించి కొంచెమైనను గాయము నొందక యెట్లు జయించితివో నాతోఁ జెప్పుము.

283. ఆఁగితివి = కాపాడితివి. అకుంఠితవిక్రముఁడు = వెనుకకుపోనిపరాక్రమము గలవాఁడు. ఐనరాజరాజు = అయినదుర్యోధనుఁడు. ఏవిధిన్ = ఏప్రకారము. ఓర్చి = సహించి. పలాయమానుఁడు ఐ = పరుగెత్తుచున్నవాఁడై. నీవిజయంబు = నీగెలుపును. సైఁచి = సహించి. ఘననిందకున్ = గొప్పయపకీర్తికి. ఇయ్యకొనంగన్ = అంగీకరించుటకు. వెఱఁగు = ఆశ్చర్యము. రణవిధంబు = యుద్ధముయొక్కవిధమును. అఖిలంబున్ = అంతయును.

తా.—ఉత్తరా! నీ వావుల నెట్లు రక్షించితివో శూరుఁ డగుదుర్యోధనుఁ డవమానమునకును నిందకును బాలై నీజయము సహించి యెట్లు పరుగెత్తెనో యాశ్చర్యముగా నున్నది. ఆయుద్ధము యొక్కవిధ మంతయుఁ జెప్పుము.

చ. అనవుడు నాతఁ డిట్లనియె ♦ నక్కురుసేనల నేను గెల్వ గో
ధనమును నే మరల్ప మన♦దైవబలంబునఁ జేసి దేవసం
జనితుఁడు నాఁగ నర్హ మగు♦చందమువాఁడు మహాత్ముఁ డొక్కరుం
డని ననుఁ గాచెఁ గౌరవుల ♦ నందఱ గెల్చె మరల్చె గోవులన్. 284

వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 285

గీ. ధూళి పెల్లుగ నెగయంగ♦ నేల గోడి, వడఁగఁ జనుమూఁకఁ గని వడ♦వడ వడంకి
పాఱుదేరంగ నమ్మహా♦భాగుఁ డప్పు, డోడ కోడకు మని నన్నుఁ ♦ గూడ వచ్చి.

వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపైఁ బెట్టిన నే నతనియాజ్ఞకు మిగుల
కుండితి. 287

ఉ. కౌరవసేన్యగోగణముఁ ♦ గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజుఁ గానక యు♦పాంతమునం దొలఁగించి వేగ నా

---

284. అనవుడున్ — అని విరాటుఁ డడుగఁగా. అతఁడు = ఆయుత్తరుఁడు. గెల్వన్ = జయింప లేదు. మరల్పన్ = మరలింపలేదు. మనదైవబలంబునఁ జేసి = మనదైవబలముచేత. దేవసంజనితుఁడు = దేవునివలనఁ బుట్టినవాఁడు. నాఁగన్ = అనునట్లు. అర్హము = పూజ్యము. అగుచందమువాఁడు = అయినవిధము గలవాఁడు. మహాత్ముఁడు = గొప్పమహిమ గలవాఁడు. ఒక్కరుఁడు = ఒకఁడు. అనిన్ = యుద్ధమునందు.

తా.—అని విరాటుఁ డడుగఁగా నుత్తరుఁ డిట్లనియె. కురుసేనను జయించుటను గాని యావులను మరలించుటను గాని నేను జేయ లేదు. మనకు దైవము అనుకూల మగుటవలన దేవపుత్త్రుఁడో యనునట్లు దివ్యరూపము గలవాఁడును గొప్పప్రభావము గలవాఁడును నగు నొకమహాపురుషుఁడు వచ్చి యుద్ధమునందు నన్ను రక్షించి కౌరవుల జయించి గోవుల మరలించెను.

285. అత్తెఱఁగు = ఆవిధమును. అవధరింపుము = వినుము.

286. ధూళి = దుమ్ము. పెల్లుగన్ = అధికముగా. ఎగయంగన్ = రేఁగునట్లును. నేల. గోడిపడఁగన్ = అణఁగునట్లును. చనుమూఁకన్ = పోవుచున్న సేనను. కని. పాఱుదేరంగన్ = పరుగెత్తఁగా. అమ్మహాభాగుఁడు = ఆగొప్పభాగ్యము గలవాఁడు. ఓడకుము = పరుగెత్తకుము.

తా.—నేను దుమ్ము రేఁగునట్లును భూమి యణఁగునట్లును పోవుచున్న కౌరవసేనను జూచి భయపడి పరుగెత్తఁగా నామహానుభావుఁడు నాయొద్దకు వచ్చి పరుగెత్తకు మని చెప్పి.

287. మగుడన్ = మరల. మిగులక = మీఱక.

258. గోగణమున్ = ఆవులమందను. ముట్టి = తాఁకి. అందున్—ఆసేనలో. ఆరసి = వెదకి. రాజున్ = దుర్యోధనుని. ఉపాంతమునన్ = సమీపమునందు. తీవ్రశరంబులన్ = వాఁడిబాణములచేత. ఆబలంబుదుర్వారరయంబు = ఆసేనయొక్క యడ్డగింపరానివేగమును. మాన్చి = పోఁగొట్టి. అర్చుచున్ = సింహనాదము చేయుచు. పశుసంఘమున్ = ఆవులమందను. ఇద్దెసన్ = ఈదిక్కునకు. వెల్చెన్ = తోలెను.

తే రటు దోలి యడ్డపడి ♦ తీవ్రశరంబుల నబ్బాలుఁ బుదు
ర్వారరయంబు మాన్చి పశు♦వర్గము నిద్దెస వెల్చె నార్చుచున్. 288

గీ. చెదర కుండఁ బసులఁ ♦ బొదివి యించుక మేర, యిక్క డరుగుదెంచి♦ యెలమి మగిడి
కడచి పోవుచున్న♦కౌరవపతి ముట్ట, నడరినంత సేన ♦ లతనిఁ గూడె. 289

మ. కురురాజున్ సబలంబుగాఁ గదిసినన్ ♦ ఘోరాహవం బయ్యె నం
దరదంబుల్ నుఱుమయ్యె నశ్వములు ను♦గ్గయ్యెం గరివ్రాతముల్
ధర దంతంబుల యూఁతగా నొఱగె ను♦ద్యద్బాహుదృప్యద్భటో
త్కరముల్ దిట్టినయట్లు గూలెఁ గలయం ♦ దద్బాణపాతంబునన్. 290

క. శత్రుంతపాదు లగునృప, పుత్రులుఁ బేరు గలయోధ♦పుంగవులును ద

---

తా.—కౌరవసేన యావులను దోలుకొనిపోఁగా నామహానుభావుఁడు దాని వెంబడించి యచట దుర్యోధనుఁడు లేకపోవుటచేఁ దేరు కొంచె మవతలికిఁ దోలించి కఠినబాణములచే నచటి సేనను బాఱఁదోలి యావుల మరలించెను.

289. పొదివి = చుట్టి. ఇంచుకమేర = కొంచెముదూరము. ఇక్కడ = ఈవైపునకు. అరుగుదెంచి = వచ్చి. ఎలమిన్ = ఉత్సాహముతో. మగిడి = మరలి. కడచి = దాఁటి. కౌరవపతిన్ = దుర్యోధనుని. ముట్టన్ = తాఁకుటకు. అడరినంతన్ = పోయినంతట.

తా.—ఆమహానుభావుఁడు పశువులు చెదరిపోకుండఁ గొంతదూరము తోలుకొని వచ్చి విడిచి మరలి పోయి దుర్యోధనుని తాఁకఁగా సేన లన్నియు దుర్యోధనునకుఁ దోడుపడెను.

290. కురురాజున్ = దుర్యోధనుఁడును. సబలంబుగాన్ = సేనతోఁ గూడినట్లుగా. కదిసినన్ = ఎదిరింపఁగా. ఘోరఆహవంబు = భయంకరమయినయుద్ధము. అయ్యెన్. అందున్ = ఆయుద్ధమునందు. తత్ బాణపాతంబునన్ = ఆమహాత్మునిబాణములదెబ్బచేత. అరదంబుల్ = తేరులు. నుఱుము అయ్యెన్ = పొడి యయ్యెను. అశ్వములు = గుఱ్ఱములు. నుగ్గు అయ్యెన్ = చూర్ణ మయ్యెను. కరివ్రాతముల్ = ఏనుఁగులసమూహములు. ధరన్ = భూమియందు. దంతంబులు అ = దంతములే. ఊఁతగాన్ = ఆధార మగునట్లుగా. ఒఱగెన్ = వ్రాలెను. ఉద్యత్ బాహుదృప్యత్ భటఉత్కరముల్ = ప్రకాశించుచున్న చేతులచే గర్వించుచున్న భటులసమూహములు. కూలెన్.

తా.—అప్పుడు దుర్యోధనుఁడు సేనలతోఁ నామహానుభావునిఁ దాఁకఁగా గొప్పయుద్ధమై యామహాత్మునిబాణములచే రథములును గుఱ్ఱములును నేనుఁగులును భటులును నశించిరి.

291. శత్రుంతపాదులు = శత్రుంతపుఁడు మొదలుగాఁ గలవారలు. అగునృపపుత్రులున్ = అయినరాజకుమారులును. పేరు = ప్రసిద్ధి. కలయోధపుంగవులును = కలిగినట్టి శూరశ్రేష్ఠులును. తత్ చిత్రశరనిహతిన్ = ఆమహానుభావునివింత లగుబాణములదెబ్బచేత. సంగరధాత్రిన్ = యుద్ధభూమియందు. పడిరి. వారిన్ = ఆపడినవారిని. ఎన్నన్ = లెక్కపెట్టుటకు. తరమువి = అల వ్యమై. ఉండున్.

చ్చిత్రశరనిహతి సంగర, ధాత్రిఁ బడిరి వారి నెన్నఁ ♦ దడవై యుండున్. 291

గీ. మొనలు దెరలినఁ గర్ణుండు♦ముంచి తాఁక, నమ్మహావీరుఁ డాతని♦యనుజుఁ జంపి
హరులనొప్పించిసూతునో♦నాడనేసి,యంగముల బాణములునించి♦యతనిఁబఱపె.

క. గురుఁడు దలపడిన నతఁ డ, చ్చెరువుగ దివ్యాస్త్రవితతిఁ ♦ జిక్కువఱిచి త
ద్వరసుతుఁడుఁ గృపుఁడుఁ దాఁకినఁ, దెరలిచి భీష్మునకుఁ గవిసె ♦ దృఢరభసమునన్.

మ. అతనిం దీవ్రశరంబులం బొదివె నా♦నాస్త్రంబు లేసెన్ నదీ
సుతుఁడుం దత్సమయంబునం గినిసి యా♦శూరుండు చాపంబు ద్రుం
చి తదీయాంగము నొంచినన్ వివశుఁడై ♦ చేడ్పడ్డచో సూతుఁ డు
ద్గతభీతిం దొలఁగంగఁ దోలె రథముం ♦ దత్ప్రాణరక్షార్థియై. 294

తా.—శత్రుంతపుఁడు మొదలగు రాజకుమారులును మఱియు గొప్పశూరులును నామహాను భావునిబాణములచే యుద్ధరంగమునఁ జచ్చిరి. వారిని లెక్కపెట్టుటకుఁ జాలసేపు పట్టును.

292. మొనలు = సేనలు. తెరలినన్ = తొలఁగఁగా. ముంచి = ఆక్రమించి. అమ్మహావీరుఁడు = ఆగొప్పశూరుఁడు. ఆతనిఅనుజున్ = ఆకర్ణునితమ్ముని, సంగ్రామజిత్తును. హరులన్ = గుఱ్ఱములను. సూతున్ = సారథిని. నోన్ = నొమ్చునట్లు. ఆడన్ఏసి = గ్రుచ్చుకొనునట్లు కొట్టి. అంగములన్ = అవయవములయందు. నించి = నిండించి. అతనిన్ = ఆకర్ణుని. పఱపెన్ = తోలెను.

తా.—సేనలు విరిసి పరుగెత్తుటం జూచి కర్ణుఁ డామహానుభావు నెదిరింపఁగా నతఁడు కర్ణునితమ్ముఁ డగుసంగ్రామజిత్తును జంపి గుఱ్ఱములను సారథిని నొప్పించి దేహ మంతయు బాణములచేఁ గొట్టి కర్ణుని యుద్ధరంగమునుండి పాఱఁదోలెను.

293. గురుఁడు = ద్రోణాచార్యుఁడు, తలపడినన్ = ఎదిరింపఁగా. దివ్యఅస్త్రవితతిన్ = శ్రేష్ఠము లయినబాణములసమూహముచేత. చిక్కువఱిచి = నొప్పించి. తత్వరసుతుఁడున్ = ఆద్రోణునియుత్తమపుత్త్రుఁ డయినయశ్వత్థామయును. తాఁకినన్ = ఎదిరింపఁగా. తెరలిచి = తొలఁగించి. దృఢరభసమునన్ = ఎక్కుడువేగముచేత. భీష్మునకున్. కవిసెన్.

తా.—అంత నతఁడు తన్నెదిరించినద్రోణాచార్యుని నశ్వత్థామను గృపాచార్యుని జయించి భీష్మునిమీఁదికిఁ బోయెను.

294. అతనిన్ = అభీష్ముని. తీవ్రశరంబులన్ = కఱకుటమ్ములచేత. పొదివెన్ = కప్పెను. నదీసుతుఁడున్ = భీష్ముఁడును. నానాఅస్త్రంబులు = పలువిధము లయినబాణములను. ఏసెన్. ఆశూరుండు. తత్సమయంబునన్ = ఆకాలమునందు. కినిసి = కోపించి. చాపంబున్ = విల్లును. త్రుంచి = నఱికి. తదీయఅంగమున్ = అభీష్మునిదైనదేహమును. నొంచినన్ = నొప్పింపఁగా. వివశుఁడువి = మైమఱపు గలవాఁడై. చేడ్పడ్డచోన్ = బాధపడఁగా. సూతుఁడు = సారథి. ఉద్గతభీతిన్ = పుట్టినభయముచేత. తత్ప్రాణరక్షాఅర్థివి = అభీష్మునిప్రాణములకాపాడుటను గోరినవాఁడై. రథమున్. తొలఁగంగన్. తోలెన్.

తా.—భీష్మునిమీఁద వాఁడిబాణములు ప్రయోగించెను, భీష్మఁడును నానావిధబాణము లత నిపైఁ బ్రయోగించెను, అంత నామహానుభావుఁడు కోపించి భీష్ముని విల్లు నఱికి బాణములచే దేహమును

క. తమతమబలములతో ని, ట్లమితభుజావీర్యు లైన ♦ యారథికవరుల్
క్రమమునఁ దలపడి యోడిన, సమరవిహారమునఁ దనివి ♦ సనక యతండున్ 295

మ. ధరణీనాథుఁడు దాను దమ్ములును దు♦ర్దాంతోద్ధతిం గూడి మో
హర మత్యూర్జితభంగి నేర్చికొని యు♦ద్యద్విక్రమం బొప్ప బం
ధురసంరంభత నున్నఁ జూచి బలవ♦ద్దోఃస్తంభలీలాభయం
కరరేఖావలమానచాపుఁ డయి వీఁ♦కం దాఁకె నాసేనతోన్. 296

క. కౌరవపతియనుజన్ముల, దూరమునన్ విశిఖనిహతిఁ ♦ దోలఁగ జడియుచుం
జేరి వికర్ణునికరి నొక, నారసమునఁ గూల్చి కదసి ♦ నరపతి నొంచెన్. 297

గీ. రాజు నొచ్చిన విఱిగిరి ♦ రథికవరులు, విభుఁడు దోడన తిరిగె న♦వ్వీరుఁ డపుడు

---

నొప్పింపఁగా భీష్ముఁడు మూర్ఛపోయెను, అంత సారథి భయపడి భీష్ముని ప్రాణముల రక్షించుటకై తేరు తొలఁగఁ దోలుకొని పోయెను.

295. అమితభుజావీర్యులు = కొలఁదిలేని బాహుపరాక్రమము గలవారు. ఆరథికవరుల్ = ఆరథికశ్రేష్ఠులు. తలపడి = తాఁకి. సమరవిహారమునన్ = యుద్ధము అను క్రీడయందు.

తా.—ఇట్లామహానుభావుఁడు అశూరులందఱు తమతమసేనలతో నోడిన పిమ్మట యుద్ధమునందుఁ దృప్తి నొందక.

296. ధరణీనాథుఁడు = రాజయినదుర్యోధనుఁడు. దుర్దాంతఉద్ధతిన్ = అణఁపరానిగర్వముచేత. మోహరము = వ్యూహమును. అతిఊర్జితభంగిన్ = మిక్కిలి యధిక మగువిధమున. ఏర్చికొని = ఏర్పఱచికొని. ఉద్యత్విక్రమంబు = వృద్ధిపొందుచున్న పరాక్రమము. బంధురసంరంభతన్ = అధిక మయినయుత్సాహము గలవాఁ డగుటచేత. బలవత్......చాపుఁడు—బలవత్ = ఎక్కువబలము గల, దోఃస్తంభ = స్తంభములవంటిచేతులయందు, లీలా = విలాసముచేత, భయంకర = భయమును గలిగించునట్టి, రేఖా = విధముచేత, వలమాన = తిరుగుచున్న, చాపుఁడు = విల్లు గలవాఁడు. వీఁకన్ = పరాక్రమముతో. ఆసేనతోన్. తాఁకెన్.

తా.—ఒకచోట దుర్యోధనుఁడు తమ్ములతోఁ గూడ నొకవ్యూహ మేర్పఱచికొని యుత్సాహముతో నుండుటను జూచి యామహానుభావుఁడు బాణప్రయోగము చేయుచు నాసేనమీఁదికిఁ బోయెను.

297. కౌరవపతిఅనుజన్ములన్ = దుర్యోధనునితమ్ములను. విశిఖనిహతిన్ = బాణములదెబ్బచేత. జడియుచున్ = తోలుచు. వికర్ణునికరిన్ = వికర్ణునియేనుఁగును. ఒకనారసమునన్ = ఒకబాణముచేత. కూల్చి = పడఁగొట్టి, నరపతిన్ = దుర్యోధనుని. కదిసి = సమీపించి. నొంచెన్ = నొప్పించెను.

తా.—దుర్యోధనునితమ్ములను బాణములచే దూరముగాఁ బాఱఁదోలి వికర్ణుని యేనుఁగు నొక్కబాణముచేఁ జంపి దుర్యోధనుని నొప్పించెను.

298. రాజు = దుర్యోధనుఁడు. నొచ్చినన్. రథికవరులున్ = రథికశ్రేష్ఠులును. విఱిగిరి = విచ్చిరి. విభుఁడున్ = రాజును. తోడన = వెంటనే. తిరిగెన్ = మరలెను. అవ్వీరుఁడు = అశూరుఁడు.

దోలి యాచిక్కుమూఁకల ♦ తోడఁ గూడ, నతని దవ్వుల నడవికి ♦ నడచి మగిడె.

వ. ఇది యమ్మహాపురుషుచేసినపౌరుషం బనిన విని యచ్చెరు వంది విరాటుండు. 299

గీ. ఆతఁ డెవ్వఁడొకో ♦ యమ్మహాత్మునిఁ గనుంగొనఁ గౌఁగిలింప ♦ వినయ మొప్ప
నర్ఘ్యపాద్యవిధుల ♦ నర్చింప భక్తిసం, యుక్తి నెపుడుఁ గొలిచి ♦ యుండ వలయు.

క. ఎచ్చోట నున్నవాఁ డతఁ, డిచ్చోటికి నేల రాఁడొ ♦ యిప్పు డనుడుఁ దా
నచ్చట నంతర్హితుఁ డై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి ♦ యెల్లిటిలోనన్. 301

ఉ. దేవకుమారకుండ యగుఁ ♦ దేజముచందము చూడ నాతఁ డీ
గోవులఁ గ్రమ్మఱించుటకుఁ ♦ గూడినయంతియ కాదు నాకు సం

---

తోలి = తఱిమి. ఆచిక్కుమూఁకలతోడన్ కూడన్ = ఆబాధపడుచున్నట్టి సేనలతోడఁ గూడ. అతనిన్ = ఆదుర్యోధనుని. దవ్వులన్ = దూరముగా. అడవికిన్ — అడవివఱకనుట. అడచి = తోలి. మగిడెన్ = మరలెను.

తా.—దుర్యోధనుఁడు నోచ్చుటయు గర్థిస లందఱు భయపడి పరుగెత్తఁగా దుర్యోధనుఁడును వారివెంటఁ బరుగెత్తెను. అంత నామహానుభావుఁడు తనచేఁ దఱుమఁబడి కష్టముతోఁ బరువిడుచున్న సేనలతోఁ గూడ దుర్యోధనుని మిక్కిలి దూరముగాఁ దఱుమఁగొట్టి మరలెను.

299. అమ్మహాపురుషుచేసినపౌరుషంబు = ఆగొప్పపురుషుఁడు చేసినపరాక్రమము. అచ్చెరువు = ఆశ్చర్యమును.

300. వినయము = అడఁకువ. అర్ఘ్యపాద్యవిధులన్ = అర్ఘ్యపాద్యముల చేయుటచేత. అర్చింపన్ = పూజించుటకును. భక్తిసంయుక్తిన్ = భక్తితోడి కూడికచేత.

తా.—ఆమహానుభావుఁ డెవ్వఁడో? ఆతనిని చూచి కౌఁగిలించి యడఁకువతో నాతని నర్ఘ్య పాద్యాదులఁ బూజించి భక్తితో నెప్పుడు నతని సేవించుట యుక్తము.

301. అనుడున్—అని విరాటుఁడు చెప్పఁగా. అంతర్హితుఁడువై = మఱుఁగుపడినవాఁడై. ఇచ్చన్ = ఇచ్చవచ్చినట్లు. చనియెన్. నేఁటియెల్లిటిలోనన్ = నేఁటి రేపటిలో. తోఁచున్ = అగపడును.

తా.—ఆమహానుభావుఁ డెచ్చట నున్నవాఁడు. ఇప్పు డిచటి కేల రాఁడు అని విరాటుఁ డడుగఁగా నుత్తరుఁ డిట్లు చెప్పెను. అతఁ డచ్చటనే మఱుఁగై తనయిచ్చ మెయిఁ బోయెను, నేఁడో రేపో యిచటికి వచ్చును.

302. అతఁడు. తేజముచందము = పరాక్రమముయొక్క విధమును. చూడన్. దేవకుమారకుండు = దేవునికుమారుఁడే. అగున్. ఈగోవులన్ = ఈయావులను. క్రమ్మఱించుటకున్ = మరలించుటకు. కూడినఅంతియ = చాలినంతమాత్రమే. కాదు. సంభావనచేయువత్సలతభంగులన్ = మన్ననచేయునట్టి ప్రేమయొక్క విధములచేత. తాన్. మనవంశము = మనకులమును. కావను = ఆపదనుండి రక్షించుటకును. ప్రోవనున్ = అన్నవస్త్రాదు లిచ్చి పోషించుటకును. తలఁపు = కోరిక. కల్గుట. తెల్లముచేసెన్ = స్పష్టపఱిచెను.

భావన సేయువత్సలత♦భంగులఁ దా మనవంశ మంతయుం
గావను బ్రోవనుం దలఁపు♦ గల్గుట దెల్లము సేసె నెంతయున్. 302

వ. అని చెప్పి యుత్తరుం డతనిం బ్రమోదాయత్తచిత్తుం జేసె నట్టిసమయంబునఁ గౌంతేయాగ్రజుండు ముఖప్రాంతంబు పైచీరచెఱంగునం బొదివికొని ధనంజయునిం జక్కం జూడక యుండె విరాటుండు కిరీటిపరాక్రమంబు క్రమంబున నిట్లు దన తనయునివలన వినియునుం దెలియక యెప్పటినపుంసకత్వబుద్ధితోడన సంభావించి పోవం బనిచిన బృహన్నలయును జతురంబుగాఁ బలికితి యిదియ తెలుపుతెఱంగు ధర్మనందనునకు నింతకు మిక్కిలి యెఱింగింప కుండునదియని వైరాటితో నల్లనఁ జెప్పుచుఁ జనియె నజ్ఞనాయకుండును గంకునిం బొమ్మని యుచితపరివారపరివృతుండయి భూమింజయు నంతిపురంబునకుం దోడ్కొని యరిగి సుధేష్ణాసందర్శనసమాచారంబు నడపి యతం డడుగఁ ద్రిగర్తపతి నోర్చిన తెఱం గెఱింగించె నట నరుండు నాట్యశాలకుం బోయె. 303

—(*) అర్జునుఁ డుత్తరకు బొమ్మపొత్తికలుగాఁ గురువీరులశిరోంబరంబు లిచ్చుట. (*)—

గీ. చెలులుఁ దానును నుత్తర♦యెలమిఁ దన్నుఁ, గాంచుటయుఁ బ్రీతియెసలార♦గారవించి

---

తా.—ఆమహానుభావుని తేజస్సు చూడఁగా నతఁడు దేవకుమారుఁడే యని తోఁచును. ఇప్పుడు గోవులను దెచ్చి యిచ్చుటకు మాత్రమే కాదు. అతఁడు నాయందుఁ గనఁబఱచినప్రీతిని జూడఁగా మనవంశ మంతయు రక్షింపఁ దలఁచి యుండునట్లు నాకుఁ దెలిసెను.

303. ప్రమోదాయత్తచిత్తున్ = సంతోషమున కధీన మయినమనస్సు గలవానిని. కౌంతేయాగ్రజుండు = ధర్మరాజు. ముఖప్రాంతంబు = మోముయొక్క సమీపప్రదేశమును. పైచీరచెఱంగునన్ = ఉత్తరీయముయొక్క యంచుచేత. పొదివికొని = కప్పికొని. ధనంజయునిన్ = అర్జునుని. కిరీటిపరాక్రమంబు = అర్జునునిపరాక్రమమును. తనతనయునివలనన్ = తనకుమారునివలన. నపుంసకత్వబుద్ధితోడన్ అ = పేడితనపుతలంపుతోనే. సంభావించి = గౌరవించి. చతురంబుగాన్ = నేర్పుగా. పలికితి = చెప్పితివి. ఇదియ = ఇట్లు చెప్పుటయే. తెలుపుతెఱంగు = తెలుపునట్టి విధము. వైరాటితోన్ = విరాటునికుమారుఁ డయినయుత్తరునితో. అల్లనన్ = మెల్లగా. అజ్ఞనాయకుండును = ఆవిరాటరాజుకూడ. ఉచితపరివారపరివృతుండయి = తగినపరిజనముచేఁ జుట్టఁబడినవాఁడై. భూమింజయున్ = ఉత్తరుని. అంతిపురంబునకున్ = లోపలియింటికి. సుధేష్ణాసందర్శనసమాచారంబు = సుధేష్ణయొక్క చూచుట యను నాచారమును. నడపి = జరపి. త్రిగర్తపతిన్ = సుశర్మను. ఓర్చిన తెఱంగు = జయించినవిధమును. నరుండు = అర్జునుఁడు.

304. చెలులున్ = చెలికత్తెలును. ఎలమిన్ = సంతోషముతో. కాంచుటయున్ = చూడఁగా. ప్రీతి = సంతోషము. ఎసలారన్ = అతిశయింపఁగా. కొమ్మ! ఉత్తరసంబోధనము. ఇందము = ఇదిగోఁ దీసికొనుము. అంబరములు = వస్త్రములను.

బొమ్మపొత్తిక లడిగితి • కొమ్మ యిందఁ, మనుచు నిచ్చెఁ దాఁ దెచ్చిన • యంబరములు.

వ. ఇవ్విధంబునఁ గృతకృత్యుం డయి యథాపూర్వంబుగా మజ్జనభోజనంబులు సలిపి ధర్మనందననివాసస్థలంబునం దేకాంతంబునం దాఁ దేవరును ద్రౌపదియును గూడఁ బడునట్టి తెఱంగు సంఘటించి సమాగమసముచిత ప్రకారంబు నడపి గోగణనివర్తనంబును రణప్రవర్తనంబును నన్యోన్యవిదితంబు లైనయనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కి ట్లనియె. 305

క. మొగ మొప్పదు నా దెస నీ, జగతీనాథునకు నే వి • చారించియునుం
దగ దీనికిఁ గారణ మిది, యగు నని యేర్పఱుప నేర • నయ్యెద నెట్లున్. 306

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 307

క. ఒండేమియు లేదు వీరా, టుం డాత్మతనూజుఁ బొగడు • చును దుగ్ధముదో

---

తా.—ఉత్తర చెలికత్తెలతోఁ దనయొద్దకు రాఁగా నీ వడిగిన బొమ్మచీర లివిగోఁ దీసికొ మ్మని తాను దెచ్చినవస్త్రముల నుత్తర కిచ్చెను.

305. కృతకృత్యుఁడువి = చేయఁబడిన చేయవలసినకార్యములు గలవాఁడై. యథాపూర్వంబుగాన్ = ఎప్పటియట్లు. మజ్జనభోజనంబులు = స్నానమును భోజనమును. ధర్మనందననివాసస్థలంబునన్ = ధర్మరాజు నునికిపట్టునందు. ఏకాంతంబునన్ = రహస్యముగా. తాను = పాండవులు. దేవరును = అయిదుగురును. కూడఁబడునట్టి తెఱంగు = చేరునట్టివిధమును. సంఘటించి = చేసి. సమాగమసముచితప్రకారంబు = చేరుటయందుఁ దగినవిధమును. కలసినపుడొకరికొకరు చేయవలసిన నమస్కారము ఆలింగనము మొద లయినయాచారము ననుట. గోగణనివర్తనంబును = ఆవులమందను మరలించుటయును. రణప్రవర్తనంబునున్ = యుద్ధముయొక్క నడపుటయును. అన్యోన్యవిదితంబులు = ఒండొరులకుఁ దెలిసినవి. ఐనఅనంతరంబుఅ = అయినపిమ్మటనే. దక్షిణగోగ్రహణసమాచార మర్జుననకును ఉత్తరగోగ్రహణసమాచారము ధర్మరాజు మొదలయినవారికిని దెలిసినపిమ్మట ననుట. అగ్రజున్ = అన్నను, ధర్మరాజును. బీభత్సుండు = అర్జునుఁడు.

306. ఈజగతీనాథునకున్ = ఈధర్మరాజునకు. నా దెసన్ = నాదిక్కున. మొగము ఒప్పదు—నావైపు తిరిగి చూడఁ డనుట. విచారించియునున్ = ఆలోచించికూడ. ఏర్పఱుపనేర నయ్యెదన్ = నిశ్చయింపఁజాలను. భూతంబున లజికి లిడంతం బగు నగుధాతు వనుప్రయుక్తం బగు” అనుబాలవ్యాకరణసూత్రమునకు ఇటఁ దద్ధర్మాకొనుప్రయోగము విరుద్ధముగా నున్నది, చిన్నయసూరిమతము ప్రకారము నేరనైతిని నెట్లున్ అని చెప్పవలెను.

తా.—ధర్మరాజు నావైపు తిరిగిచూడ కున్నాఁడు, ఇందుకుఁ గారణ మాలోచించినను నాకుఁ దెలియకున్నది.

307. యుధిష్ఠిరుండు = ధర్మరాజు.

308. ఒండు = వేఱుకారణము. ఆత్మతనూజున్ = తనకొడుకును. పొగడుచును = పొగడఁగా. దుగ్ధమదోగ్ధండతా = అణఁపరానిక్రొవ్వలవంటి చేతులు గలవాఁ డగుట. పగఱన్ = శత్రువులను. ఓర్చుటకున్ = జయించుటకు. ఏమికొఱఁత = ఏమిలోపము. అంటిన్.

ర్దండత గల్గుబృహన్నల, యుండఁ గొఱఁత యేమి పగఱ ♦ నోర్చుట కంటిన్. 308

గీ. అనినఁ బేడిఁ బొగడె ♦ దని యవివేకియై, కోప మడర సారె ♦ గొని యతండు
వ్రేసె నెత్తు రప్రుడు ♦ వెడలఁ బోయినఁ జీరఁ, గప్పికొంటి నీవు ♦ గానకుండ. 309

క. అని చెప్పి గంటి సూపిన, ననిలతనూభవుఁడు గనలి ♦ యాదుష్టాత్ముం
దనయాదిబంధుయుతముగ, ననిచెద జముప్రోలి కనియె ♦ నంగము వొంగన్.

వ. కిరీటియుం గోపించి. 311

క. తనకొలఁది యెఱుంగనియి, మ్మనుజాధము నిప్పుడ పట్టి ♦ మర్దింపక త
క్కినఁ గాదు వీనిరాజ్యము, నిను నంతయుఁ జేరుఁగా క♦నియె ధర్మజుతోన్. 312

చ. అనవుడు నాతఁ డిట్లు లను ♦ నక్కట యింతకు ముంద రేమియున్
మనల నెఱుఁగఁ డవ్విభుని♦మాటునఁ బూనిక దీర్చికొంటి మా

తా.—దీనికి వేఱుకారణము లేదు. విరాటురా జుత్తరుఁడు కౌరవుల జయించె నని పొగడఁగా నేను బరాక్రమశాలి యగుబృహన్నల తోడుండుటచే జయించుటకు సందేహము లే దని చెప్పితిని.

309. పేడిన్ = నపుంసకుని. అడరన్ = అతిశయింపఁగా. వ్రేసెన్ = కొట్టెను. వెడలఁ బోయినన్ = కాఱఁగా.

తా.—అని నేను జెప్పఁగా విరాటుఁడు నపుంసకునిఁ బొగడెదవా యని కోపించి తెలివిమాలినవాఁడై నన్నుఁ బాచికతోఁ గొట్టెను. అప్పుడు నెత్తురు కాఱఁగా నీకుఁ దెలియకుండుటకై వస్త్రముతోఁ గప్పికొని యుంటిని.

310. గంటి = గాయమును. అనిలతనూభవుఁడు = భీముఁడు. కనలి = కోపించి. ఆదుష్ట ఆత్మున్ = ఆచెడ్డమనస్సు గలవిరాటుని. తనయఆదిబంధుయుతముగన్ = కుమారులు మొదలగు బంధువులతోఁ గూడినట్లుగా. జముప్రోలికిన్ = యమునిపట్టణమునకు. అనిచెదన్ = పంపెదను. అంగము = దేహము. పొంగన్ = ఉప్పొంగఁగా. అనియెన్.

తా.—అని చెప్పి గాయము చూపఁగా భీముఁడు కోపించి వీరావేశంబున విరాటుని అతనికొడుకులను చుట్టాలను వధించెద నని చెప్పెను.

312. తనకొలఁది = తనయంతరమును. ఎఱుంగనిఇమ్మనుజఅధమున్ = తెలియని యీనీచుఁడయినవిరాటుని. మర్దింపక = చంపక.

తా.—తనయంతరము తెలియక నీ కిట్టి యపకారము చేసిననీచుఁ డయినయీవిరాటు నిప్పుడే చంపి వీనిరాజ్యము నిన్నుఁ జేరునట్లు చేయవలయు నని ధర్మరాజుతోఁ జెప్పెను.

313. అనవుడున్ = అని భీమార్జునులు చెప్పఁగా. అక్కట = అయ్యో! ఇంతకున్ ముందర = ఇంతకుఁ బూర్వము. అవ్విభునిమాటునన్ = ఆవిరాటునిమఱుఁగున. పూనిక = ప్రతిజ్ఞను. ఒకఎగ్గు = ఒక్కకీడును. చేఁత = చేయుట. ఉచితంబువె = తగునా? దురుద్ధతి = చెడుగర్వమును. వహించినన్ = పొందినయెడ.

తని కొకయెగ్గు సేఁత యుచితంబె యెఱింగెడునట్లు గాఁగఁ బో
యినఁ గనియుక్ దురుద్ధతి వహించినఁ జూతము గాక పిమ్మటన్. 313

వ. అని పలికి వారలకందు మాన్పి యిది యట్ల కాక యొండు దగునే యనుచుఁ దక్షిణవారిదెసయుం గనుంగొనిన నెల్లవారు నుపశమించిరి తదనంతరంబ తమ్ము నెఱింగించు తెఱంగు దలపోసి వా రందఱు విరాటుకొలువుకూటంబునకుం బోయి బయలుమెఱసి యుండువారుగా నిశ్చయించి యారాత్రి గడపి వేగుటయుం గృతస్నాను లయి పాండుసూనులు సమయవిహితాచారంబులు నడపి యుచిత ప్రకారంబున. 314

క. తెలుపు లగుచీరలను బూఁ,తలఁ బువ్వుల నొప్పి రాజతనయానుగుణో
జ్జ్వలమాననీయవేషము, లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్. 315

క. చని ధర్మసుతుఁడు సింహా, సనమున భీమాదు లాత్మసముచితరుచిరా
సనముల సభాస్థలిం గయి,కొని పంచాగ్నులును బోలెఁ గూర్చున్నంతన్. 316

---

తా.—భీమార్జునుల మాట విని ధర్మరాజిట్లనియె. విరాటుఁడు మనము పాండవుల మనుట కొంచెమేని నెఱుంగఁడు. ఇదిగాక మనమాతని సంరక్షణముననుండి యజ్ఞాతవాసప్రతిజ్ఞ తీర్చికొంటిమి. అట్టివానికి మనము కీడు సేయరాదు. మన మాతనియొద్దకుఁ బోయి పాండుపుత్త్రుల మనుట దెలిపికొన్నపిమ్మటఁ దెలిసియు నతఁడు మనల నవమానించునేని నప్పుడు చూతము.

314. కందు = కోపమును. ఒండు = వేఱు. ఉపశమించిరి = శాంతినొందిరి. తదనంతరంబ = అటుపిమ్మటనే. తెఱంగు = ఉపాయమును. బయలుమెఱసి = బయలుపడి, తమస్వరూపము తెలిపి యనుట. వేగుటయుఁన్ = తెల్లవాఱినపిమ్మట. కృతస్నానులు ఐ = చేయఁబడినస్నానము గలవారై. సమయవిహిత ఆచారంబులు = ప్రాతఃకాలమున విధింపఁబడిన యాచారములను, సంధ్యావందనాద్యనుష్ఠానముల ననుట. ఉచితప్రకారంబునన్ = తగినవిధమున.

315. తెలుపులు = తెల్లనివి. పూఁతలన్ = గంధపుపూఁతలచేత. రాజతనయఅనుగుణఉజ్జ్వలమాననీయవేషములు = రాజకుమారులకుఁ దగినవియుఁ బ్రకాశించుచున్నవియు గౌరవింపఁ దగినవియు నగు నలంకారములు. అలవడన్ = కలుగునట్లు. కూడుకొని = కలిసికొని. నగరికిన్ = రాజగృహమునకు.

తా.—తెల్లని వస్త్రములు మొదలగువానిని ధరించి రాజపుత్త్రులకుఁ దగినవేషములు గలవారై యయిదుగురును గలసి రాజగృహమునకుఁ బోయిరి.

316. భీమఆదులు = భీముఁడు మొదలగువారు. ఆత్మసముచితరుచిరఆసనములన్ = తమకుఁ దగిన చక్కనిగద్దియలను. కయికొని = గ్రహించి. పంచాగ్నులును పోలెన్ = అయిదగ్నులవలె. దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము, ఆవసథ్యము, సభ్యము, ఈయయిదును పంచాగ్నులు, సంజ్ఞయందు సంఖ్యావాచకముతోఁ గర్మధారయము.

తా.—అట్లు పోయి ధర్మరాజు విరాటునిసింహాసనమునందును భీమార్జుననకులసహదేవులు వారివారికిఁ దగినయాసనములయందును గూర్చుండి పంచాగ్నులవలెఁ బ్రకాశించుచుండఁగా.

గీ. వేడ్కఁ దొడి పూసి కట్టి యు◆ద్వీరటుఁడుత్త, రుండు దోఁ జనుదేరఁ గొ◆ల్వుండుబుద్ధి
నచటి కేతెంచి కని విస్మ◆యంబునొంది, యెల్లిదంబుగఁ దలఁచుచు◆నిట్టులనియె.

క. ఇది యేమి కంక నీ వు,న్మదవృత్తిని శంక దక్కి ◆ నాగద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి, నదియును గాకిపుడు డిగవ◆హంకారమునన్. 318

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కిట్లనియె. 319

సీ. నడదివియలు సేసె◆ నగరికి మాణిక్య, మకుటముల్ పూనిన◆మనుజపతులఁ
దగునాజ్ఞ సూయాణ◆ముగ నొనరించె మం,చిగ నేలనాలుగు◆చెఱఁగులకును
బ్రీతార్థిజనుల స◆చేతనత్యాగధ్వ, జములుగా నన్ని దే◆శముల నిలిపె
దిక్కు లన్నింటను ◆ దెలు పారుపూఁత గా,వించె నుజ్జ్వలయశో◆విభ్రమంబు
రాజసూయాధ్వరప్రవ◆ర్తకుఁడు నిత్య, సత్యభాషామహావ్రత◆శాలి పాండు
రాజదుగ్ధపయోనిధి◆రాజు ధర్మ,రాజు సుమ్ము మత్స్యావనీ◆రమణ యితఁడు.

---

317. తొడి = ఆభరణములు ధరించి. పూసి = గంధము పూసికొని. కట్టి = వస్త్రములు ధరించి. తోన్ = వెంట. చనుదేరన్ = రాఁగా. కొల్వుండుబుద్ధిన్ = కొలువుచేయు తలంపుతో. విస్మయంబున్ = ఆశ్చర్యమును. ఎల్లిదంబుగన్ = చులకఁదనముగా.

తా.—విరాటుఁడు ఉత్సాహముతో నాభరణములు మొదలగువానిని ధరించి యుత్తరునితో కొలువుకూటమునకు వచ్చి యచట ధర్మరాజు తనసింహాసనమునఁ గూర్చుండి యుండుటం జూచి తన్నవమానపఱచుటగాఁ దలంచుచు నిట్లు చెప్పెను.

318. ఉన్మదవృత్తిని = ఎక్కువగర్వము గల యునికిచేత. శంక = భయమును. తక్కి = విడిచి. నాగద్దియపైన్ = నాసింహాసనముమీఁద.

తా.—కంకభట్టా! నీవు గర్వముచే భయము లేనివాఁడవై నాసింహాసనమునఁ గూర్చుండుటయే గాక నేను వచ్చినను నహంకారముచే దిగక యున్నాఁడవు. ఇది యేమి?

319. మందహాసంబు = చిఱునగవును. సంక్రందననందనుండు = అర్జునుఁడు.

320. మాణిక్యమకుటముల్ = కెంపులకిరీటములను. పూనినమనుజపతులన్ = ధరించినరాజులను. నగరికిన్ = రాజగృహమునకు, తనగృహమున కనుట. నడదివియలు = నడచుచున్న దివ్వటీలుగా. చేసెన్. మంచిగన్ = బాగుగా. నేలనాలుగుచెఱఁగులకును = భూమియొక్క నాలుగు అంచులకును. తగన్. ఆజ్ఞ. సూయాణముగన్ = దండయాత్రనుగా. ఒనరించెన్ = చేసెను. ప్రీత అర్థిజనులన్ = సంతోషించినయాచకజనులను. సచేతనత్యాగధ్వజములుగాన్ = ప్రాణములతోఁ గూడిన యీవిని దెలుపుకేతువులుగా. అన్నిదేశములన్. నిలిపెన్. ఉజ్జ్వలయశోవిభ్రమంబు = ప్రకాశించుచున్నకీర్తియొక్క విలాసమును. దిక్కులు అన్నింటను = అన్నిదిక్కులయందును. తెలుపారుపూఁత = తెల్లనైనపూఁతనుగా. కావించెన్. రాజసూయఅధ్వరప్రవర్తకుఁడు = రాజసూయయాగమును చేసినవాఁడు. నిత్యసత్యభాషామహావ్రతశాలి = ఎల్లప్పుడును సత్యము పలుకుట యను గొప్పవ్రతముచే నొప్పువాఁడు. పాండురాజదుగ్ధపయోనిధిరాజు = పాండురాజు అను పాలసముద్రమునకు చంద్రుఁడు. మత్స్యఅవనీరమణ = మత్స్యదేశమునకు రాజా!

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మ♦హిం దగ దిగ్విజయంబు సేసె వీ
ర్యాతిశయర్ద్ధి వాసవుమ♦హాసన మైనను నెక్క నర్హుఁ డు
ద్ద్యోతితమూర్తి కౌరవకు♦లోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీచిఱుత♦గద్దియకుం దగఁడే నరేశ్వరా. 321

( అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱింగించుట. )

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబునం బెనంగొన నితండు ధర్మతనయుం డయేని భీమార్జుననకులసహదేవులుం బాంచాలియు నేరి యని యడిగినఁ గవ్వడి యి ట్లనియె. 322

చ. వలలుఁ డనంగ నీనగర ♦ వంటలవాఁ డయి నిల్చి వేడ్కకుం
బులిఁ గరిఁ గేసరిం దొడరి ♦ పోరఁగఁ బంచినఁ బోరు జెట్టిమ

---

తా.—విరాటరాజా ! కెంపులకిరీటములు ధరించి నిలువఁబడి నగరికి నడదివియలో యనునట్లుండు మహారాజులచే సేవింపఁబడువాఁడును, భూమియందు నాలుగుదిక్కులను దండయాత్ర లేకయే తన యాజ్ఞామాత్రమున స్వాధీనము చేసికొన్నవాఁడును, యాచకులకుఁ గోరినట్లు దానము లిచ్చి వారిచే యెల్లదేశములందును బ్రాణముతోఁ గూడిన దానధ్వజములుగా నిలిపినవాఁడును, ఎల్లదిక్కులయందును నిండినయశస్సు గలవాఁడును, రాజసూయమహాక్రతువు నొనర్చినవాఁడును, సత్యవాక్యుండును, పాండురాజకుమారుఁడు నగుధర్మరాజు ఇతఁడు.

321. అజాతశత్రుఁడు = పుట్టనిశత్రువులు గలవాఁడు. మహిన్ = భూమియందు. తగన్. దిగ్విజయంబు చేసెన్. వీర్యఅతిశయఋద్ధిన్ = పరాక్రమముయొక్కయతిశయము చేతను సంపద చేతను. వాసవుమహత్ ఆసనముఐనను = దేవేంద్రునిగొప్పసింహాసనమైనను. ఎక్కన్. అర్హుఁడు = తగినవాఁడు. ఉద్ద్యోతితమూర్తి = మిక్కిలి ప్రకాశించుచున్నయాకారము గలవాఁడు. కౌరవకులఉద్వహుఁడు = కౌరవవంశమునందు శ్రేష్ఠుఁడు. ఆర్యనికాయసంతతఖ్యాతచరిత్రుఁడు = పెద్దలసమూహముచే నెల్లప్పుడును పొగడఁబడిన నడవడి గలవాఁడు. ఈచిఱుతగద్దియకున్ = ఈచిన్నసింహాసనమునకు. తగఁడుఏ ? నరేశ్వరా = రాజా ! విరాటునిసంబోధనము.

తా.—విరాటరాజా ! కౌరవవంశమునందుఁ బుట్టినవాఁడును, శత్రువులే లేనివాఁడును, మేలియాచారముగలవాఁడును, దిగ్విజయము చేసినవాఁడు నగు నీధర్మరాజు పరాక్రమముచేతఁగాని సంపద చేతఁగాని యింద్రుని సింహాసనము నెక్కుటకుఁ దగినవాఁడు. ఇఁక నీచిన్నసింహాసనమునకుఁ దగునని చెప్పవలయునా ?

322. విస్మయసంశయంబులు = ఆశ్చర్యమును సందేహమును. ధర్మతనయుండుఅఏనిన్ = ధర్మరాజే యయినయెడ. పాంచాలియున్ = ద్రౌపదియును. ఏరి = ఎక్కడనున్నారు ? కవ్వడి = అర్జునుఁడు.

323. నీనగరన్ = నీయింటియందు. కరిన్ = ఏనుఁగును. కేసరిన్ = సింహమును. తొడరి = ఎదిరించి. పోరఁగన్ = జగడమాడుటకు. పంచినన్ = ఆజ్ఞాపించినయెడ. విఱుచున్ = ఓడించును. కడంగి = పూని. ప్రబలుండు = అధిక మయినబలము గలవాఁడు. విచ్చలవిడిన్ = స్వేచ్ఛ

ల్లుల విఱుచుచుం గడంగి ప్రబ♦లుం డనఁగాఁ జరియించుచుండు వి
చ్చలవిడి భీముఁ డితఁ డవి♦షహ్యపరాక్రమదుర్దముం డనిన్. 323

గీ. బకమహాసురు నిర్జించి ♦ బ్రాహ్మణులకుఁ
బ్రీతిఁ గావించెఁ గిమ్మీరు♦పే రడంచి
వనము నిష్కంటకము సేసె ♦ ఘను హిడింబుఁ
గూల్చి యాతనిచెలియలిఁ ♦ గొనియె నితఁడు. 324

క. నీమెచ్చువారువంబులఁ, దా మచ్చిక నరయు నిత్య♦తాత్పర్యమునన్
దామగ్రంథి యనఁగ నొక, నామము ధరియించె నితఁడు ♦ నకులుం డధిపా.

క. శత్రునృపకాలకూటము, మిత్రామృతవృష్టి బుధస♦మీహితసిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి, పాత్ర మితఁడు మాద్రితొలుత♦పట్టి నృపాలా. 326

---

చేత. అనిన్ = యుద్ధమునందు. అవిషహ్యపరాక్రమదుర్దముండు= సహింపరానిపరాక్రమముచే వశఁ పరానివాఁడు.

తా.—నీయింట వలలుఁ డనుపేరుతో వంటలు చేయుచు వినోదముగాఁ బులులు మొదలగువాని తోను మల్లురతోను పోరుచు మిక్కిలి బలము గలిగి యుద్ధములందుఁ బరాక్రమవంతుఁ డని పేరు పడసినయాతఁడు భీముఁడు.

324. బకమహాసురున్ = బకుఁ డను గొప్పరాక్షసుని. నిర్జించి = జయించి. ప్రీతిన్ = సంతోషమును. వనము = అడవిని. నిష్కంటకము = శత్రువులు లేని దానినిగా. ఘనున్ = గొప్పవానిని.

తా.—ఈభీముఁడు బకాసురునిఁ జంపి యేకచక్రాపురములోని బ్రాహ్మణులకు సంతోషము చేసినవాఁడు. కిమ్మీరుఁ డనురాక్షసుని వధించి యడవిలోనివారికి బాధ లేని యట్లు చేసినవాఁడు. హిడింబాసురుని జయించి యతని చెల్లెలిని హిడింబను పెండ్లియాడినవాఁడు.

325. నీమెచ్చువారువంబులన్ = నీవు మెచ్చుకొనునట్టి గుఱ్ఱములను. మచ్చికన్ = ప్రీతితో. నిత్యతాత్పర్యమునన్ = ఎడతెగనియాసక్తితో. అరయున్ = విచారించును. అధిపా = రాజా!

తా.—దామగ్రంథి యనుపేరు గలవాఁడై నీగుఱ్ఱములను విచారించుచున్న యీతఁడు నకులుఁడు.

326. నృపాలా = రాజా! విరాటరాజుసంబోధనము. శత్రునృపకాలకూటము = శత్రురాజులకు విషము వంటివాఁడు. మిత్రామృతవృష్టి= స్నేహితులకుఅమృతపువానవంటివాఁడు. బుధసమీహితసిద్ధిక్షేత్రము = పండితులకోర్కులపంటకుఁ బొలమువంటివాఁడు. సజ్జనసంస్తుతిపాత్రము= సత్పురుషులపొగడ్తకుఁ దగినవాఁడు. మాద్రితొలుతపట్టి = మాద్రియొక్క మొదటికొడుకు, నకులుఁ డనుట.

తా.—శత్రువులను వధించువాఁడును మిత్రులసంతోషపఱచువాఁడును పండితులకు కోర్కెల నిచ్చువాఁడును సత్పురుషులచేఁ గొనియాడఁబడుచున్నవాఁడు నగు నీదామగ్రంథి మాద్రిపెద్దకొడుకయిన నకులుఁడు.

క. నీపాలికి వచ్చి నిఖిల, గోపాలకముఖ్యవృత్తిఁ ♦ గొలువు వడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య, క్ష్మాపాలక మెలఁగు వీఁడె ♦ సహదేవుండున్. 327

క. సుకుమారమానసుఁడు గుం,తికిఁ బ్రాణము ప్రాణ మితఁడు ♦ తేజోగణ్యుం
డకుటిలుఁడు రాజనీతి, ప్రకారసంవేది వంశ♦పావనుఁడు నృపా. 328

వ. అని యిట్లు ధర్మజభీమనకులసహదేవులం గ్రమంబునం జూపి చెప్పి మఱియు ని
ట్లనియె. 329

క. విను సైరంధ్రీవేషం,బున మాలిని యనఁగ బరఁగి ♦ పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం, దనకడ మెలఁగుసతి ద్రుపద♦తనయ మహీశా. 330

క. ఆచపలాక్షికిఁగా మన,కీచకు లందఱను రాత్రి ♦ గీటడఁచె రహ
స్యోచితవిధమున గంధ, ర్వాచరణముపేర భీముఁ ♦ డతిభీమముగాన్. 331

( విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట. )

---

327. నిఖిలగోపాలకముఖ్యవృత్తిన్ = ఎల్లగొల్లలకును ప్రధానునియొక్క వ్యాపారముచేత. మత్స్యక్ష్మాపాలక = విరాటరాజా !

తా.—రాజా ! నీయొద్ద గొల్లల కందఱకును ప్రధానుఁడై గోవుల మేపుచుఁ దంత్రీపాలుఁ డనుపేరు గలయితఁడు సహదేవుఁడు.

328. నృపా = రాజా ! సుకుమారమానసుఁడు = కోమల మయినమనస్సు గలవాఁడు. గుంతికిన్ = కుంతీదేవికి. ప్రాణముప్రాణము = ప్రాణమునకును బ్రాణము, మిక్కిలి ప్రియుఁ డనుట. తేజఃగణ్యుండు = పరాక్రమముచేఁ బొగడఁ దగినవాఁడు. అకుటిలుఁడు = కపటము లేనివాఁడు. రాజనీతిప్రకారసంవేది = రాజనీతియొక్క విధమును జక్కఁగాఁ దెలిసినవాఁడు. వంశపావనుఁడు = కులమును పవిత్రము చేయువాఁడు.

తా.—రాజా ! ఈసహదేవుఁడు కోమల మయినమనస్సు గలవాఁడును గుంతీదేవికి మిక్కిలి ప్రియుఁడును బరాక్రమశాలియును గపటము లేనివాఁడును రాజనీతియందుఁ బండితుండును కులవంశమున కంతయుఁ గీర్తి కలిగించువాఁడును.

330. సైరంధ్రీవేషంబునన్ = గట్టువాలువేషముచేత. పరఁగి = ప్రసిద్ధినొంది. పూతచరిత్రంబునన్ = పరిశుద్ధమయిననడవడితో. కేకయభూవరనందనకడన్ = కేకయరాజుకూఁతు రయినసుధేష్ణయొద్ద. మెలఁగుసతి = ఉన్నస్త్రీ. మహీఈశా = రాజా !

తా.—మాలిని యనుపేరు వహించి సైరంధ్రీవేషముతో మంచినడవడి గలదై సుధేష్ణయొద్ద నుండునది ద్రౌపది.

331. ఆచపలఅక్షికిన్ కాన్ = ఆస్త్రీకొఱకై. గీటడఁచెన్ = చంపెను. రహస్యఉచితవిధమునన్ = రహస్యముగాఁ దగినవిధముచేత. గంధర్వఆచరణముపేరన్ = గంధర్వులపని యనుపేరిట. అతిభీమముగాన్ = మిక్కిలి భయంకరముగా.

తా.—ఆద్రౌపదికిఁ గానే భీముఁడు గంధర్వులు చంపినా రన్నపేరు పెట్టి రహస్యముగా రాత్రిపూటఁ గీచకులనందఱిం జంపెను.

వ. అనియె నప్పుడు వృకోదరుండు. 332

సీ. షండరూపమునఁ బ్ర♦చ్ఛన్నుఁడై వచ్చి క, న్నియలకు నెల్లను ♦ నృత్తగీత
వాద్యనైపుణ మన♦వద్యశిక్షావిధి, నలవరించుచు బృహ♦న్నల యనంగఁ
బరఁగునీతండు బీ♦భత్సుండు సుమ్మని, చూపి యమ్మత్స్యరా♦జునకుఁ జెప్పి
వెండియుఁ బలుకు నా♦ఖండలు నోడించి, ఖాండవ మేర్చె నా♦తండు దన్ను
గారవించిన నెక్కటి ♦ కాలకేయ, వర్గములఁ బరిమార్చె ని♦వాతకవచ
సంఘముల నోర్చె గంధర్వ♦సమితి గెలిచి, ధార్తరాష్ట్రాగ్రజుని చెఱ♦దలఁగెనితఁడు.

వ. అనిన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం గలుగుసందేహావేశంబు వినయసంభ్రమంబులు నిగుడ నీ కునికిం జిక్కుపడి యున్ననిజజనకునకు నర్జును జూపి యుత్తరుం డిట్లనియె. 334

గీ. ఈతఁ డింతకు మీకుఁ ద ♦ న్నెఱుఁగఁ జెప్ప
వలవ దని నియమించినఁ ♦ దెలియఁ బలుక

332. వృకోదరుండు = భీముఁడు.

333. షండరూపమునన్ = నపుంసకరూపముచేత. ప్రచ్ఛన్నుఁడువై = కప్పఁబడినవాఁడై. నృత్తగీతవాద్యనైపుణము = ఆటలయందును పాటలయందును వాద్యములయందును నేర్పును. అనవద్యశిక్షావిధిన్ = దోషములేని నేర్పుటయొక్క విధముచేత. అలవరించుచున్ = కలిగించుచు. బీభత్సుండు సుమ్ము = అర్జునుఁడు సుమా. ఆఖండలున్ = ఇంద్రుని. ఖాండవము = ఖాండవ మనువనమును. ఏర్చెన్ = కాల్చెను. ఆతండు—అయింద్రుఁడు. ఎక్కటి = అసహాయుఁడై. కాలకేయవర్గములన్ = కాలకేయు లనురాక్షసులసమూహమును. పరిమార్చెన్ = చంపెను. నివాతకవచ సంఘములన్ = నివాతకవచు లనురాక్షసులసమూహములను. ఓర్చెన్ = ఓడించెను. గంధర్వసమితి = గంధర్వులసమూహమును. ధార్తరాష్ట్రఅగ్రజునిచెఱ = ధృతరాష్ట్రుని కొడుకులలోఁ బెద్దవాఁ డయినదుర్యోధనునిచెఱను. ఇతఁడు = ఈయర్జునుఁడు. తలఁగెన్ = తొలఁగించెను.

తా.—నపుంసకవేషముతోఁ దననిజరూపము తెలియకుండునట్లు నీయొద్దకు వచ్చి పడుచుల కాటపాటలు నేర్పుచు బృహన్నల యనుపేరు గలయీతఁ డర్జునుఁడు. అని విరాటరాజునకుం జెప్పి మరల, నీయర్జునుఁడు ఇంద్రుని జయించి ఖాండవవనమును దహించెను. ఇంద్రుఁడు మెచ్చి తన్నుఁ బ్రార్థింపఁగాఁ గాలకేయులు నివాతకవచు లనురాక్షసులను జయించెను, చిత్రసేనుఁడు మొదలగు గంధర్వుల నోడించి దుర్యోధనుని చెఱనుండి విడిపించెను అని చెప్పెను.

334. అద్భుతరసఆక్రాంతంబు = ఆశ్చర్యరసముచేఁ జుట్టఁబడినది. అంతరంగంబునన్ = మనస్సునందు. సందేహఆవేశంబు = సందేహముయొక్క పూనిక. వినయసంభ్రమంబులు = అడఁకువను తత్తఱపాటును. నిగుడన్ ఈక = వ్యాపింపనియ్యక. ఉనికిన్ = ఉండుటవలన. నిజజనకునకున్ = తనతండ్రియగువిరాటరాజునకు. ఆశ్చర్యము కలిగినను సందేహము కలిగియుండుటవలన ధర్మరాజు మొదలగువారియెడ విరాటునకు వినయసంభ్రమంబులు కలుగ కుండుటవలన నుత్తరుఁడు మరల నమ్మకము కలుగునట్లు విరాటునకుం జెప్పె నని భావము.

335. ఇంతకున్ = ఇంతవఱకు. నియమించినన్ = ఆజ్ఞాపించుటవలన. తెలియఁబలుకన్ =

నలికి యొకదేవసన్నిభుం ♦ డంటిఁ గాని
నిన్న యంతయుఁ దాఁ గదా ♦ నిర్వహించె. 335

చ. ఒకరుఁడు తాను భీతి వెగ ♦ డొందెడు రెండవ నన్ను నెట్టకే
లకుఁ దగఁ దేర్చునప్పుడు బ♦లంబులతోఁ గురురాజు సూడ దా
నికి మది శంక లేక మహా♦నీయపరాక్రముఁ డైనయాకిరీ
టికిఁ జనుఁ గాక యివ్విధము ♦ డెప్పర మన్యుల కోర్వ వచ్చునే. 336

చ. తము నెఱిఁగించి యల్ల నుచి♦తప్రియభాషల నన్ను సూతకృ
త్యమునకుఁ జొన్ప నేను ప్రమ♦దంబున నప్పటి కియ్యకొంటి లో
కముసమరంబునట్ల యని ♦ కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యములఁ జరింపఁ జేత భర ♦ మై తుదిఁ బల్మఱు నోహటించితిన్. 337

---

తెలియఁ జెప్పుటకు. అలికి = భయపడి. ఒకదేవసన్నిభుండు = ఒకదేవతతో సమానుఁడు. నిర్వహించెన్ = నెఱవేర్చెను.

తా.—ఈయర్జునుఁడు తన్నుఁ దెలియఁ జెప్పవల దని యాజ్ఞాపించుటచే నేను జెప్ప వెఱచితిని గాని నిన్న యితఁడే కౌరవుల జయించినవాఁడు.

336. తాను = అర్జునుఁడు. ఒకరుఁడు = ఒకఁడు. భీతిన్ = భయముచేత. వెగడు = తల్లడమును. ఒందెడురెండవవానిన్ = పొందునట్టి నేను రెండవవాఁడ ననుట. ఎట్టకేలకున్ = మిక్కిలి కష్టముతో. తేర్చునప్పుడు=సమాధానపఱచునప్పుడు. కురురాజు=దుర్యోధనుఁడు. బలంబులతోన్= సేనలతో. దానికిన్—తా నొకఁడే యగుటకు నన్ను సమాధానపఱచుటను దుర్యోధనుఁడును సేనలును జూచుటకు ననుట. మదిన్=మనస్సునందు. శంక=భయము. లేక. ఇవ్విధము=ఇట్లు చేయుట. మహనీయపరాక్రముఁడు = గొప్పపరాక్రమము గలవాఁడు. ఐనఈకిరీటికిన్ = అయినట్టి యీయర్జునునకు. చనున్ కాక = తగును గాని. అన్యులకున్ = ఇతరులకు. డెప్పరము = అశక్యము. ఓర్వన్ వచ్చునఏ ?

తా.—కౌరవసేన నెదిరించుటకు అర్జునుఁడు తా నొక్కఁడే యుండుటయు రెండవవాఁ డను నేను భయపడి యుండుటయు నన్నుఁ దా నూఱడించి సారథ్యమున కియ్యకొలుపుట మొదలగువాని నంతయు దుర్యోధనుఁడును సేనలును జూచుచుండుటయు వీస కన్నిటికిఁగూడ భయపడక కౌరవసేన నంతయు నెదిరించుట యనఁగా నీయర్జునుని కొక్కనికే సాధ్య మయ్యెను గాని యిఁక నెట్టివానికిని సాధ్యము కాదు.

337. తమ్మున్ = పాండవుల ననుట. ఉచితప్రియభాషలన్=తగినమంచిమాటలచేత. సూతకృత్యమునకున్ = సారథ్యమునకు. చొన్పన్ = ప్రవేశపెట్టఁగా. లోకముసమరంబునట్లు=అ=లోకమునందలి సామాన్యయుద్ధమువంటిదే. అని. అప్పటికిన్ = ఆసమయమునకు. ప్రమదంబునన్ = సంతోషముతో. ఇయ్యకొంటిన్ = అంగీకరించితిని. కయ్యముతీవ్రతకున్ = యుద్ధముయొక్క భయంకరత్వమునకు. రథ్యములన్ = గుఱ్ఱములను. చరింపన్ చేఁత = తోలుట. భరముఐ= కష్టమై. తుదిన్ = కడపట. పల్మఱున్ = మాటిమాటికి. ఓహటించితిన్ = వెనుదీసితిని.

క. మొగ మోడఁ డితఁడు కౌరవ, జగతీశుఁడు విఱిగినపుడు ♦ జవమున వెనుకం
దగిలి యిది జూద మాడఁగ, నగునెడ గా దఱుమ వలయు ♦ ననియె నతనితోన్.

సీ. అనిన నతఁడు వెఱఁగు ♦ నత్యాదరంబును, సంతసంబు మానస♦మున బెరయ
నవయవముల సంభ్రమా♦వేశ మేర్పడ, గారవమున విజయుఁ ♦ గౌఁగిలించె. 339

క. వినయంబు మిగులఁ గుంతీ, తనయాగ్రజపాదపీఠ♦తలమున ఫాలం
బను వొందఁ జాఁగి మ్రొక్కి య,తనికౌఁగిలి వడసె సమ్మ♦దము దళుకొత్తన్.

గీ. ప్రీతి నలుమడింప ♦ భీమునిఁ గవల నా, లింగనంబు సేసి ♦ యంగకములఁ
బులక లెగయఁ గేలు ♦ దల మోడ్చి ధర్మజు, నాననమున దృష్టి ♦ యడర నిలిచె.

---

తా.—అర్జునుఁడు తాము పాండవుల మనుట నాకుఁ జెప్పి మంచిమాటలతో నన్నుఁ దేఱ కడపు మనఁగా లోకమునందలిసామాన్యయుద్ధమువంటిదే యని యొప్పుకొంటిని గాని యటుపిమ్మట నాయుద్ధము ఘోర మగుటచేఁ జక్కఁగా గుఱ్ఱముల నడుపఁజాలక పలుమాఱు వెనుదీసితిని.

338. ఇతఁడు=ఈయర్జునుఁడు. మొగమోడఁడు= దాక్షిణ్యపడఁడు. కౌరవజగతీఈశుఁడు= కురువంశపురాజయినదుర్యోధనుఁడు. విఱిగినపుడు = ఓడిపోయిపరుగెత్తునప్పుడు. జవముతోన్ = వేగముతో. అగుఎడ = తగినచోటు. అఱుమన్ వలయున్ = పరాక్రమింపవలయును.

తా.—ఈయర్జునుఁడు దుర్యోధనుఁ డోడి పాఱిపోవునపుడు అతని వెంబడించి యిది జూదమాడుచోటు కాదు ఇచటఁ బరాక్రమము చూపవలయును అని కొంచెమైనను దాక్షిణ్యము లేక యతనితోఁ జెప్పెను.

339. అతఁడు = ఆవిరాటుఁడు. వెఱఁగున్ = ఆశ్చర్యమును. అతిఆదరంబును = మిక్కిలి ప్రీతియును. సంతసంబున్ = సంతోషమును. మానసమునన్ = మనస్సునందు. బెరయన్ = కలుగఁగా. సంభ్రమఆవేశము = తొట్రుపాటుయొక్క పొందిక. ఏర్పడన్ = కలుగఁగా. విజయున్ = అర్జునుని.

తా.—ఉత్తరుని మాట విని విరాటుఁడు మనస్సున నాశ్చర్యమును నాదరమును సంతోషమును శరీరమున వేగిరపాటును గలవాఁడై యర్జునుని గౌఁగిలించికొనెను.

340. వినయంబు = అడఁకువ. మిగులన్ = అతిశయింపఁగా. కుంతీతనయఅగ్రజపాదపీఠతలమునన్ = ధర్మరాజుయొక్క పాదముల పీఁటయొక్క ప్రదేశమునందు. ఫాలంబు= నెత్తి. అనువు ఒందన్ = ఒప్పునట్లు. సమ్మదము = సంతోషము. తళుకొత్తన్ = ప్రకాశింపఁగా.

తా.—ఆటుపిమ్మట విరాటరాజు ధర్మరాజు పాదములకు మ్రొక్కెను, అప్పుడు ధర్మరాజు విరాటరాజును గౌఁగిలించికొనెను.

341. ప్రీతి = సంతోషము. నలుమడింపన్ = నాలుగంతలు కాఁగా. కవలన్ = నకులసహదేవులను. అంగకములన్ = అవయవములయందు. పులకలు = గగుర్పాటులు. ఎగయన్ = కలుగఁగా. కేలు = చేతులను. తలన్. మోడ్చి. ధర్మజుఆననమునన్ = ధర్మరాజుముఖమునందు. చూడ్కి = చూపు. అడరన్ = వ్యాపింపఁగా. నిలిచెన్.

ఉ. అత్తఱి లేచి వచ్చి తన♦యన్నలఁ దమ్ములఁ గానిపించె న
య్యుత్తరు నర్జునుండు దగ ♦ నొందఁగ నప్పుడ పిల్వఁ బంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్త్రసచి♦వోత్కరసోదరవర్గపుత్త్రకో
దాత్తభటాదియోగ్యుల ము♦దంబునఁ బాండవదర్శనార్థమై. 342

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగా ధర్మతనయసేవాతత్పరుం డై తదనుమతి సముచిత
రుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుధేష్ణ
కెఱింగింపం బనిచి పాంచాలిం దగిన తెఱంగున గారవించునట్లు గావించె నట్టి
యెడ ధనంజయుం డతని కిట్లనియె. 343

గీ. చాల దుస్తర మైనయ♦జ్ఞాతవాస, వత్సరంబు భవద్గర్భ♦వాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖా♦వాసచిత్త, వృత్తి నేము నిర్భయులమై ♦ విందులట్ల.

వ. అనిన విని విరాటుం డతని కిట్లనియె. 345

---

తా.—అప్పు డెక్కుడుప్రీతితో భీముని నకులసహదేవులను గౌఁగిలించుకొని విరాటుఁడు సంతోషముతోఁ గేలుమోడ్చి శిరమునం గీలించి ధర్మరాజుముఖము చూచుచు నిలువఁబడెను.

342. అత్తఱిన్ = ఆసమయమునందు. అర్జునుండు. తనఅన్నలన్ = ధర్మజభీములను. తమ్ములన్ = నకులసహదేవులను. ఉత్తరున్. కానిపించెన్ = కనఁబఱచెను. తగవు = యుక్తత. మాత్స్యఉత్తముఁడు = విరాటరాజు. ఆర్య...యోగ్యులన్—ఆర్య = పూజ్యులును, మిత్త్ర = స్నేహితులును, సచివఉత్కర = మంత్రులసమూహమును, సోదరవర్గ = తమ్ములసమూహమును, పుత్త్రక = కొడుకులును, ఉదాత్త = ఉత్తము లగు, భట = శూరులును, ఆది = మొదలుగాఁగల, యోగ్యులన్ = తగినవారిని. పాండవదర్శనార్థముఐ = పాండవులను చూచుటకొఱకై. ముదంబునన్ = సంతోషముతో. పిల్వన్ పంచెన్.

తా.—అప్పుడు అర్జునుఁడు లేచివచ్చి యుత్తరునకుఁ దనయన్నదమ్ములను జూపెను, విరాటుఁడు పాండవులదర్శనమునకై పెద్దలు మొదలగువారిని వెంటనే పిలిపించెను.

343. సమస్తజనసమేతంబుగాన్ = ఎల్లజనులతోఁ గూడినట్లుగా. ధర్మతనయసేవాతత్పరుండుఐ = ధర్మరాజుయొక్క సేవించుటయందు దాసక్తుఁడై. తత్ అనుమతిన్ = ఆధర్మరాజు నాజ్ఞచేత. సముచితరుచిరఆసనమునన్ = తగినమనోహర మయినపీఁటయందు. అంతఃపురవర్తులన్ = అంతఃపురమున నున్నవారిని. పాంచాలిన్ = ద్రౌపదిని.

344. చాలన్ = మిక్కిలి. దుస్తరము = దాఁటరానిది. ఐన అజ్ఞాతవాసవత్సరంబు = అయినట్టియజ్ఞాతవాసము చేయవలసినసంవత్సరమును. భవత్ గర్భవాసగుప్తివలనన్ = నీయొక్క గర్భమునందు వసించుటచేఁ గలిగినసంరక్షణముచేత. అతిసుఖఆవాసచిత్తవృత్తిన్ = మిక్కిలిసుఖ మైనయునికి యనుమనోవ్యాపారముచేత. నిర్భయులముఐ = భయము లేనివారమై. విందులట్ల = బంధువులవలె. కడపితిమి.

తా.—మేము మీయింటనుండి దుస్తర మయినయీయజ్ఞాతవాసవ్రతమును సుఖముగాఁ గడపితిమి.

ఉ. ఏ నన వేఱ యొక్కఁడనె ♦ యి ట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గానన దేశ వాసములఁ ♦ గాఱియ కోర్చి యడంగి యుండి యీ
పూనిక దీర్చి మీ రెలమిఁ ♦ బొందుట యెల్లను బుణ్యదేవతా
నూనదయాసమృద్ధి నను ♦ నొందుట గాదె సురేంద్రనందనా. 346

వ. అని పలికి ధర్మనందనుం జూచి. 347

చ. ధరణియుఁ బట్టణంబు హయ♦దంతిరథంబును గోవులున్ భటో
త్కరము నమాత్యవర్గమును ♦ గాఁ గలరాజ్య మితండ యేలు ని
ర్భరమున నేనుఁ బుత్త్రిలును ♦ బంధులుఁ దమ్ములుఁ గొల్చి యుండెదం
గరిపురి కెత్తునట్టిపని ♦ గల్గిన నోపినయంత సేసెదన్. 348

చ. అన విని యుత్తరుండు దగ ♦ నజ్జనపాలకుతోడ ని ట్లను
న్మన కొక రాజ్యముం గలదె ♦ నన్నును నిన్నును నిన్న మొన్న వీ

---

346. ఏను అనన్. వేఱుఅ ఒక్కఁడనుఎ = అన్యుఁడనా ? ఇట్లు అనఁగాన్. తగునయ్య ? మీరు. ఇమ్మెయిన్=ఈవిధముగా. కానన దేశ వాసములన్= అడవిప్రదేశముల నుండుటలచేత. కాఱియ యన్ = కష్టమునను. ఓర్చి. అడంగి = దాఁగి. ఈపూనికి = ఈప్రతిజ్ఞను. ఎలమిన్ = సంతోషమును. పుణ్య...సమృద్ధి—పుణ్యదేవతా = పుణ్యదేవతయొక్క, అనూన = తక్కువకాని, దయాసమృద్ధి= దయయొక్క యతిశయము. ననున్. ఒందుటకాదె= పొందుట కదా ? సురేంద్రనందనా= దేవేంద్రునికుమారుఁడా ! అర్జునునిసంబోధనము.

తా.—అర్జునా ! నేను బరాయివాఁడను గాను. కావున నీ విట్లు నా కుపచారవాక్యములు చెప్పవలదు. మీరు వనవాసకష్టమంతయు సహించి ప్రతిజ్ఞతీర్చుకొని యిట్లు సంతోషము నొందుట నాభాగ్యముగా నెంచుచున్నాఁడను.

347. ధర్మనందనున్ = ధర్మరాజును.

348. ధరణియున్ = భూమియును. పట్టణంబున్. హయదంతిరథంబును = గుఱ్ఱములును ఏనుఁగులును తేరులును, హయదంతిరథంబులు ననియెడు పాఠము చ్యుతసంస్కారదోషగ్రస్తమగుటచే ననాదరణీయము. గోవులున్ = ఆవులును. భటఉత్కరమున్ = భటులసమూహమును. అమాత్యవర్గమును = మంత్రులసమూహమును. కాన్ = మొదలుగా. కలరాజ్యము. నిర్భరమునన్ = మిక్కిలిగొప్పగా. ఇతండుఅ = ఈధర్మరాజే. ఏలున్. నేనున్ = విరాటుఁడును. పుత్త్రిలును. బంధులున్ = చుట్టాలును. ఉండెదన్ = ఉండెదము. కరిపురికిన్ = హస్తినాపురమునకు. ఎత్తునట్టిపని = దండెత్తుకార్యము. కల్గినన్. ఓపినఅంత = చాలినంత. చేసెదన్ = చేసెదము.

తా.—ఇఁక నీరాజ్యమునంతయు ధర్మరాజే యేలవలసినది. మేమందఱ మీతనిఁ గొలిచి యుందుము. హస్తినాపురమునకు దండెత్తిపోవలసినయెడ దానికిని చాలినంత తోడ్పడుదుము.

349. అజ్జనపాలునితోడన్ = ఆవిరాటరాజుతో. ఇట్లు. అనున్ = చెప్పును. నన్నును— ఉత్తరుని. నిన్నున్ — విరాటుని. నిన్న. మొన్న. వీరు—ఈపాండవులు. అనితరసాధ్యశత్రువిజ

రనితరసాధ్యశత్రువిజ♦యంబునఁ గాచినయప్డు గల్గఁ జే
సినయది దక్క దాని మఱి ♦ సెప్పఁగ నేటికి నింత వింతగన్. 349

వ. అది సిద్ధం బట్ల చెల్లుం గాక యించుకవిశేషంబు గలదు వినుము. 350

చ. సవినయవృత్తిఁ గొల్వ మిటఁ ♦ జన్నదినంబుల వీరు నీఱు పైఁ
గవిసిననిప్పులట్ల యధికం ♦ బగుతేజము దోఁప కున్కి ని
ట్టివిధముసాపరాధతను ♦ డెందము లూఱటఁ బొంది యుండ నే
రవు మన కట్లు గానఁ దగఁ ♦ బ్రార్థన సేయుట యుక్త మిత్తఱిన్. 351

వ. అదియునుం గాక. 352

క. ధనవర్గంబులు వీ రి, చ్చినయవి య ట్లగుట వేడ్క ♦ సేయవు తగ నూ
తన మగుకానిక యీవల, యును వే తో డ్తేరఁ బనుపు ♦ ము త్తరఁ బ్రీతిన్. 353

వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర మంత్రులమొగంబు సూచి

---

యంబునన్ = ఇతరులకుసాధ్యముకాని శత్రువులగెలుపుచేత. కాచినయప్డు = కాపాడినప్పుడు. కల్గన్ చేసినఅది = కలిగించినది. తక్కన్ = తప్ప.

తా.—విరాటునిమాట విని యుత్తరుఁ డతనితో నిట్లనియె. నిన్న నన్నును మొన్న నిన్నును రక్షించి శత్రువుల జయించి మనకు వీ రిచ్చినదే కాక వేఱురాజ్య మెక్కడిది? కావున దానిని వీరికి మన మిచ్చునట్లుగాఁ జెప్పరాదు.

350. చెల్లుంగాక — ధర్మరాజే రాజ్య మేలుఁ గాక. విశేషంబు = అతిశయము.

351. సవినయవృత్తిన్ = అడఁకువతోఁ గూడిన యునికిచేత. ఇటన్ = ఇచ్చట. చన్న దినంబులన్ = కడచినదినములయందు. వీరు, నీఱు = బూడిద. పైన్ = మీఁద. కవిసిననిప్పులట్లుఅ = కప్పిననిప్పువలె. తేజము = పరాక్రమము. తోఁపకఉన్కిన్ = తెలియ కుండుటచేత. కొల్వము = సేవింప కుంటిమి. ఇట్టివిధము సాపరాధతను = ఇటువంటి యపరాధముతోఁ గూడియుండుటచేత. డెందములు = మనస్సులు.

తా.—వీ రిన్నిదినములు మనయింటఁ బ్రచ్ఛన్నులై యుండుటచేత మనము వారిని చక్కఁగా గౌరవింపక వారివిషయమై యపరాధము చేసినవార మగుటవలన మనమనస్సులయందుఁ గలకొఱఁత తీఱునట్లు వీరు మనపైఁ బ్రసన్నులగుటకు వీరిం బ్రార్థింపవలయును.

353. ధనవర్గంబులు = ధనరాసులు. వేడ్క = సంతోషమును. నూతనము = క్రొత్త. అగుకానిక = అయినకానుకను. ప్రీతిన్ = సంతోషముతో. ఉత్తరన్. తోడ్తేరంగన్ = తోడి తెచ్చుటకు. పనుపుము = ఆజ్ఞాపింపుము.

తా.—వీ రిచ్చినధనరాసులనే మనము వీరి కిచ్చుట యుక్తము కాదు. కాఁబట్టి వీరికి నూతనమయినకానుక నిచ్చుటకై యుత్తరం బిలువఁ బంపుము.

354. అలరన్ = సంతోషింపఁగా. కుమారికన్ = ఉత్తరను. నియోగించినన్ = ఆజ్ఞాపింపఁగా. ప్రియంబునన్ = సంతోషముతో. తత్కార్యశ్రవణసంప్రీత = ఆకార్యముయొక్క వినుటచే

కుమారిక నలంకరించి కొనితెం డని నియోగించిన వారును బ్రియంబునం జని తత్కార్యశ్రవణసంప్రీత యగుసుధేష్ణయనుమతంబు నొందిన. 354

క. పదనికి రాఁ బులు గడిగిన, మదనాస్త్రము రేఖ గలిగి ♦ మానినిమెయి చె
న్నొదవఁ గయిసేసి రప్పుడు, ముదితాజనములు ప్రమోద♦మున లలితముగన్.

—(*) విరాటునిమంత్రు లుత్తరను బాండవులయొద్దకుఁ దోడ్తెచ్చుట. (*)—

వ. ఇట్లు శృంగారంబు సేసిన నమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలికలతోడిగొడుగు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు దోడ్తేర ధారానికరమనోహర యగు పర్జన్యలక్ష్మియుంబోలె నచ్చు చున్నం గని విరాటుం డెదురుపోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివికొని పాండవాగ్రజునగ్రభాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి సపరివారంబుగా దండప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యి ట్లనియె. 356

క. ఎఱుఁగమిచీఁకటి నీపె, ద్దఱికంబు దలంప నేమి ♦ తప్పు గలిగినన్
మఱచి దయఁ జూడు మి ట్లిం, దఱు నీకుం బనులు సేయఁ ♦ దగుదురు వీరల్.

---

సంతోషించినది. అనుమతంబున్ = అంగీకారమును. ఒందినన్ = పొందఁగా. సుధేష్ణయనుమతంబునన్ అను పాఠమునందు మహావాక్య మనన్వితము.

355. పదనికిన్=వాఁడిమికి. రాన్=వచ్చుటకు. పులు=మాలిన్యమును. కడిగినమదనఅస్త్రరేఖ = కడిగిన మన్మథునిబాణముయొక్కవిధము. మానినిమెయి = ఉత్తరయొక్కదేహము. చెన్నుఒదవన్ = అంద మగునట్లు. ముదితాజనములు = స్త్రీజనములు. ప్రమోదమునన్=సంతోషముతో. లలితముగన్ = చక్కఁగా. కయిసేసిరి = అలంకరించిరి.

తా.—పదనుపుట్టుటకై తోమిన మన్మథబాణమువలె నుండునట్లు ఉత్తరను స్త్రీలు చక్కఁగా నలంకరించిరి.

356. అమ్ముద్దియకున్= ఆయుత్తరకు. ముక్తాఫలప్రాలంబమాలికలతోడిగొడుగు=ముత్తెముల వ్రేలాడుదండలతోఁ గూడినగొడుగును. అయ్యమాత్యులు= ఆమంత్రులు. ధారానికరమనోహర= ఉదకధారలసమూహముచే మనోజ్ఞము. అగుపర్జన్యలక్ష్మియుంబోలెన్ = అయిన మేఘుకాంతివలె. ధారాధరనికరమనోహర యనుపాఠము ఉపమేయానురూపం బగుటవలనను విశేష్యాయోగ్యం బగుటవలనను విచారణీయము. పొదివికొని = చుట్టుకొని. పాండవఅగ్రజుఅగ్రభాగంబునకున్ = ధర్మరాజు నెదుటిప్రదేశమునకు. అచ్చెలువన్ = ఆయుత్తరను. సపరివారంబుగాన్ = పరిజనముతోఁ గూడినట్లుగా. దండప్రణామంబు = దండాకార మయిన నమస్కారమును.

357. ఎఱుఁగమిచీఁకటిన్ = అజ్ఞానాంధకారముచేత. నీపెద్దతికంబు = నీగొప్పతనమును. తలంపన్ = తెలియను.

తా.—నేనుఅజ్ఞానముచే నీగొప్పతనము తెలియక యేమి తప్పు చేసినను దానినంతయు మఱచి నీ వనుగ్రహము చేయవలయును, వీరందఱు నీకు సేవకులై యుందురు.

వ. అని నిజానిజతనూజులం జూచి మఱియును. 358

క. ఇమ్ముద్దియ నర్జునునకు, ని మ్మొనరిపని బంధుజనుల • కిందఱకుఁ గడుఁ
సమ్మత మెల్లప్రజకు నే, నిమ్మెయి నినుఁ జేరి బ్రదుకు • టిష్టం బధిపా. 359

క. అని పలికిన విని కుంతీ, తనయాగ్రజుఁ డింద్రసుతువ•దన మాలోకిం
చిన నాతఁ డిట్టు లను న, మ్మనుజేంద్రుఁడు వినుచు నుండ • మత్స్యాధిపుతోన్.

క. ఈకన్నియఁ గోడలిఁగాఁ, గైకొనియెదఁ గాని యిది ద•గ దుచితవృత్తిన్
నాకడను యబల మెలఁగుట, లోకము శంకించు నన్ను • లోలాత్మునిఁగాన్. 361

వ. అదియునుంగాక నృత్తగీతాదులయెడ నీకోమలికి గురుండ నైననాకు నివ్విధంబు
ధర్మంబు గాదు గావున. 362

మ. హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌ•ర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁ డాచారపవిత్రుఁ డంచితకళా•దక్షుం డుదారుండు గా

---

358. నిజఅనుజతనూజాలన్ = తనతమ్ములను గొడుకులను.

359. ఇమ్ముద్దియన్ = ఈయుత్తరను. అర్జునునకున్. ఇమ్ము. ఇమ్మెయిన్ = ఈవిధమున. ఎల్లప్రజకున్ = ఎల్లజనమునకును.

తా.—ధర్మరాజా ! యీయుత్తరను అర్జునున కిచ్చి వివాహము చేయుము. ఇట్లు చేయుట మాచుట్టాల కందఱకును సమ్మతము, నేను నిన్నాశ్రయించి బ్రదుకుట యెల్లజనులకు నిష్టము.

360. కుంతీతనయఅగ్రజుఁడు = ధర్మరాజు. ఇంద్రసుతువదనము = అర్జునునిముఖమును. ఆలోకించినన్ = చూడఁగా. అతఁడు = ఆయర్జునుఁడు. అమ్మనుజఇంద్రుఁడు = ఆధర్మరాజు. మత్స్యఅధిపుతోన్ = విరాటరాజుతో.

తా.—విరాటునిమాట విని ధర్మరాజు అర్జునుని మోము చూచెను. అప్పు డర్జునుఁడు ధర్మరాజు వినునట్లు విరాటరాజుతో నిట్లు చెప్పెను.

361. ఈకన్నియన్ = ఈయుత్తరను. ఉచితవృత్తిన్ = తగినవిధముచేత. ఇది = ఈకార్యము—నేను పెండ్లాడుట. నాకడన్ అ = నాయొద్దనే. అబల = ఉత్తర. మెలఁగుటన్ = తిరుగుటచేత. లోలఆత్మునిన్ కాన్ = చంచలస్వభావము కలవానినిగా. శంకించున్ = సందేహించును.

తా.—నే నీయుత్తరను గోడలిఁగా గ్రహించెదను. నాయొద్దనే యిది యిన్నాళ్లుండుటవలన జనులు నాయందు నేమేనిదోషము తలంతురు కావున నేను దీనిం బెండ్లాడరాదు.

362. నృత్తగీతఆదులయెడన్ = ఆటలు పాటలు మొదలగువానివిషయములయందు. ఇకోమలికిన్ = ఈ స్త్రీకి, ఉత్తరకు.

363. హరిమేనల్లుఁడు = కృష్ణునిమేనల్లుఁడును. బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి = భుజబలముచేత దృఢ మయినపరాక్రమముయొక్క యతిశయము గలవాఁడును. త్రైలోక్యసుందరుఁడు = ముల్లోకములయందును చక్కనివాఁడును. ఆచారపవిత్రుఁడు = నడవడిచేతఁ బరిశుద్ధుఁడును. అంచితకళాదక్షుండు = ఒప్పుచున్న చతుష్షష్టి కళలయందు సమర్థుఁడును. ఉదారుండు = దాతయును.

తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు వి♦ద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించఁగాక యభిమ♦న్యుం డీసరోజాననన్. 363

వ. అనిన విని మత్స్యమహీకాంతుం డత్యంతసంతుష్టాంతరంగుం డై. 364

గీ. అర్జునునివియ్య మనియెడు♦నంతకంటెఁ, గడవఁ బెంపు నా కెయ్యది ♦ కార్యనిశ్చ
యంబు ధర్మతనూభవుం♦డానతిచ్చు, వాఁడు మన మెల్లఁ గావించు♦వారమదియు.

గీ. అనిన నతని కిట్టు♦లనుఁ బాండవాగ్రజుం, డింద్రతనయుఁ డుచిత♦మెఱిఁగి పలికె
నిట్లు సేయువార ♦ మిప్పుడు సుట్టాల, కెల్లఁ జెప్పి పుచ్చుఁ♦ డీశుభంబు. 366

వ. అని నిశ్చయించి పలికిన విరాటుండును గౌరవాన్వయసంబంధంబున మాత్స్య వంశంబు పావనం బయ్యె నని పలుకుచు ధర్మజభీమార్జుననకులసహదేవులకుఁ గ్రమంబున నుత్తరఁ బ్రణామంబు సేయించిన వారు దీవించి యంతఃపురగమనం బునకు ననుజ్ఞ సేయ నచ్చెలువ నెచ్చెలులుం దానును దత్సమయసముచితపరివార

---

కాతరసంరక్షకుఁడు = భయపడినవారిని రక్షించువాఁడును. ఆర్యసమ్మతుఁడు = పెద్దల కిష్టుఁ డయిన వాఁడును. విద్యావైభవఉల్లాసి = విద్యలయొక్క యతిశయముచేఁ బ్రకాశించువాఁడును. అతిఉరు తేజుఁడు = మిక్కిలి గొప్పతేజస్సు గలవాఁడును నగు. అభిమన్యుండు. ఈసరోజఆననన్ = కమలమువంటిమోము గల యీయుత్తరను. వరించక కాక = పెండ్లియాడవలసినది.

తా.—కృష్ణుని మేనల్లుఁడు సకలసుగుణసంపన్నుఁడు నగు నాకొడుకయిన యభిమన్యుఁ డీయుత్తరను బెండ్లియాడఁ దగును.

364. అత్యంతసంతుష్టఅంతరంగుండు ఐ = మిక్కిలి సంతోషించినమనస్సు గలవాఁడై.

365. అర్జునునివియ్యము = అర్జునునివియ్యంకుఁడు. అనియెడు అంతకంటెన్ = అనుటకంటె. కడవన్ = హెచ్చగుటకు. పెంపు = గొప్పతనము. నాకున్. ఎయ్యది? కార్యనిశ్చయంబు = కార్యముయొక్క యేర్పాటును. ధర్మతనూభవుండు = ధర్మరాజు. ఆనతిచ్చువాఁడు = ఆజ్ఞాపింపవలసినది.

తా.—అర్జునునకు వియ్యంకుఁ డనుటకంటె గొప్పగౌరవము నా కెద్దియు లేదు. ఇఁకఁ జేయవలసినదానిని ధర్మరాజు నిర్ణయించినయెడ మన మట్లు చేయుదము.

366. అనినన్ = అని విరాటుఁడు చెప్పఁగా. పాండవఅగ్రజుండు = ధర్మరాజు. ఇంద్రతనయుఁడు = అర్జునుఁడు. ఉచితము = యుక్తమును.

తా.—విరాటుని మాట విని ధర్మరాజు విరాటునితో నిట్లు చెప్పెను. అర్జునుఁడు చెప్పినది యుక్తము, అట్లే చేయుదము, ఈశుభవార్తను బంధువుల కందఱకుఁ జెప్పి పంపుఁడు.

367. కౌరవఅన్వయసంబంధంబునన్ = కౌరవవంశముతోడి వియ్యముచేత. పావనంబు = పవిత్రము. ప్రణామంబు = నమస్కారమును. అంతఃపురగమనంబునకున్ = అంతఃపురమునకుఁ బోవుటకు. అచ్చెలువ = ఆయుత్తర. నెచ్చెలులున్ = కూరిమిచెలికత్తెలును. తత్సమయసముచితపరివారపరివృత ఐ = ఆసమయమునకుఁ దగినపరిజనముచేఁ జుట్టఁబడినదై. మౌహూర్తికులన్ = జ్యోతిశ్శాస్త్రము తెలిసిన

పరివృత మై యరిగినయనంతరంబ మహాహూర్తికుల రావించి లగ్ననిరూపణంబు సేసి యాదవపాంచాలాదిబంధుజనంబుల నెల్లఁ బెండ్లికిం బిలువ రెండుదెఱంగుల వారును గాలరులం బనిచి రజాతశత్రుండును విరటు గారవించి తా రతనిపాల నజ్ఞాతవాసంబు సుఖవృత్తి నడపికొనుట వాక్రుచ్చి యతనిగుణంబులు గొనియాడి నీవు మాకు వాసుదేవునట్ల కాక సామాన్యబంధుండవే యని సంభావించి వినయనిభృతుం డగునతనిం దిగిచి పునఃపునరాలింగనంబు సేసిన నతండును ససంభ్రమసముచితపరిజనసముపనీయమానంబు లగు నానావిధోపకరణంబులం గాంతేయులకు వివిధోపచారంబు లాచరించి మహార్హమజ్జనభోజనంబులు నడపె నంత నక్కడ దుర్యోధనుండు నిజపురంబునకుఁ జని చని నడుమ విడిసినయెడం గర్ణశకునిదుశ్శాసనులదుర్మంత్రంబు వట్టి గాంగేయునివచనంబు లప్రమాణంబులు సేసి ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱింగి యాతనిపాలికి దూతం బుత్తెంచిన వాఁడు నేతెంచి కాంచి యి ట్లనియె. 367

గీ. సాగి యజ్ఞాతవాసవత్సరదినములు, నిండ కుండంగ మున్న పార్థుండు బయలు
మెఱసి సమయంబు దప్పె నీ వెఱిఁగి దీని, కేది దగు నది సేయుము మేదినీశ.

వారిని. లగ్ననిరూపణంబు = లగ్నముయొక్క నిశ్చయమును. యాదవపాంచాలఆదిబంధుజనంబులన్ = యాదవులు పాంచాలురు మొదలుగాఁ గలచుట్టాలను, కృష్ణుఁడు ద్రుపదుఁడు మొదలగు చుట్టాల నను‌ట. రెండుతెఱంగులవారును = పాండవులపక్షమువారును విరాటునిపక్షమువారును. కాలరులన్ = దూతలను. అజాతశత్రుఁడును = ధర్మరాజును. సుఖవృత్తిన్ = సుఖముతోఁడి యునికిచేత. వాసుదేవునట్ల = కృష్ణునివంటివాఁడవే. సంభావించి = గౌరవించి. వినయనిభృతుండు = అడఁకువచేఁ గదలనివాఁడు. తిగిచి = లాగి. పునఃపునరాలింగనంబు = మాటిమాటికిఁ గౌఁగిలించుకొనుటను. ససంభ్రమసముచితపరిజనసముపనీయమానంబులు = వేగిరపాటుతోఁ గూడినవారును దగినవారు నగు సేవకులచేఁ దేఁబడుచున్నవి. అగునానావిధఉపకరణంబులన్ = అయినట్టిపలువిధము లగు వస్తువులచేత. కాంతేయులకున్ = కుంతికొడుకులకు. వివిధఉపచారంబులు = పలువిధము లయిన యుపచారములను. ఆచరించి = చేసి. మహార్హమజ్జనభోజనంబులు = ఉత్తమ మయినస్నానమును భోజనమును. విడిసినయెడన్ = దిగినచోట. దుర్మంత్రంబు = దురాలోచనమును. గాంగేయునివచనంబులు = భీష్మునిమాటలను. అప్రమాణంబులు = ప్రమాణంబులు కానివిగా. ఇయ్యకొనమి = అంగీకరింపకుండుటను. పుత్తెంచినన్ = పంపఁగా. ఏతెంచి = వచ్చి.

368. సాగి = జరగి. మున్న అ = ముందుగానే. పార్థుండు = అర్జునుఁడు. బయలు మెఱసి = బయలుపడి. సమయంబు = ప్రతిజ్ఞను. మేదినీ ఈశ = రాజా! ధర్మరాజుసంబోధనము.

తా.—ధర్మరాజా! అజ్ఞాతవాససంవత్సరము నిండకమునుపే యర్జునుఁడు బయలుపడుటచేఁ బ్రతిజ్ఞ తప్పెను. కావున నీవు దీనికిఁ దగినట్లు చేయవలయును.

వ. అని పునర్వనవాసకరణంబు దోఁప నాడిన నవ్వి యధిష్ఠితసత్యవ్రతుం డయిన యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 369

క. నిండె సమయాబ్దములు నిం, కొండన లే దిప్పుడ చని సు♦యోధనుతో భీ
ష్మునకును గురునకు వినఁగా, నిండె ననుము నిండె నిండె ♦ నిక్కంబునకున్.

చ. అని తగఁ జెప్పి పుచ్చెఁ జని ♦ యాతఁడు దప్పక చెప్పె నంతయున్
విని ధృతరాష్ట్రసూనుఁడు వి♦వేకవిహీనత నాఁటిరాత్రి కొ
ల్వున గురుభీష్మకర్ణకృప♦లుం దనతమ్ములు నుండ ధర్మనం
దనునకు దూతఁ బుచ్చినవి♦ధంబు ప్రకాశము సేయ కిట్లనున్. 371

గీ. మనము మోసపోయి ♦ యనిమిషపతిసూతి, తోడఁ బొడిచితిమి య♦దోషవృత్తి
నతఁడు సమయకాల ♦ మంతయుఁ గడచిన, పచ్చనో యెఱుంగ♦వలయు నిజము.

క. అనిన విని యేఁటిమాటలు, వినువారలు నగరె యేను ♦ విన్వచ్చుఁడు వ
చ్చినయప్పుడ తెలుపనే వల, దనుమానము సమయకాల ♦ మట మును గడచెన్.

---

369. పునర్వనవాసకరణంబు = మరలవనవాసము చేయుట. అధిష్ఠితసత్యవ్రతుండు = పొందఁబడినసత్యవ్రతము కలవాఁడు. యుధిష్ఠిరుండు = ధర్మరాజు.

370. సమయఅబ్దములు = ప్రతిజ్ఞాసంవత్సరములు. నిండెన్. ఒండు = వేఱుగా. అనన్ = చెప్పుటకు. లేదు.

తా.—ప్రతిజ్ఞాకాలము గడచినది సంశయము లేదు. నీవు పోయి దుర్యోధనునితో భీష్మద్రోణులు వినునట్లు దృఢముగాఁ జెప్పుము.

371. పుచ్చన్ = పంపఁగా. అతఁడు = ఆదూత. ధృతరాష్ట్రసూనుఁడు = దుర్యోధనుఁడు. వివేకవిహీనతన్ = వివేకముచే విడువఁబడినవాఁ డగుటచేత. కొల్వునన్ = సభయందు. పుచ్చినవిధంబు = పంపినవిధమును. ప్రకాశము చేయక = వెల్లడిచేయక.

తా.—అట్లు చెప్పి దూతను బంపఁగా నాదూత దుర్యోధనున కావివరమంతయుఁ జెప్పెను. అంత దుర్యోధనుఁ డారాత్రి సభలో ద్రోణభీష్ములు మొదలగువా రుండునపుడు తాను ధర్మరాజునకు దూతను బంపినసమాచారమును వారికిఁ దెలుపకయే యిట్లు చెప్పెను.

372. అనిమిషపతిసూతితోడన్ = ఇంద్రునికుమారుఁ డయినయర్జునునితో. అదోషవృత్తిన్ = దోషము లేనియునికిచేత. పొడిచితిమి = యుద్ధము చేసితిమి.

తా.—మనము మోసపోయి కపటము లేనివార మగుటచే నర్జునునితో యుద్ధము చేసితిమి. కాని యతఁడు ప్రతిజ్ఞ యంతయు నెఱవేఱినపిమ్మట బయలుపడినాఁడా కాఁడా యని యిప్పుడైనను నిజముగా నెఱుంగవలయును.

373. ఏను—భీష్ముఁడు. విన్వచ్చుఁడు = అర్జునుఁడు. అటన్ మును = అంతకుమున్నె.

తా.—దుర్యోధనుని మాట విని భీష్ముఁ డిట్లనియె. ఇట్లు చెప్పుట తగదు. ఇట్లాడినచో విన్నవారలు నవ్వుదురు. ప్రతిజ్ఞాకాలము దాఁటిన దని యర్జునుండు వచ్చినప్పుడే నేను జెప్పితిని. ఇఁక నావిషయమున సందేహింపవలదు.

క. అనవుడు భీష్ముని పలుకులు, విని యందఱు సమ్మతించి ♦ వీఁడే యే ఫ
ల్గునుఁ డనిరి పతియుఁ బురికిం, జనియెను మఱునాఁడు విరళ♦సైన్యంబులతోన్.

(శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ బాండవులఁ జూడ వచ్చుట.)

వ. ఇవ్విధంబునం బ్రకాశులై పాండునందనులు శమీవృక్షనిక్షిప్తసమస్తసాధనంబులు పూజాపూర్వకంబుగాఁ దెచ్చికొని యుపప్లావ్యంబున వసియించి మత్స్యమహీనాథుండు పంపు సేయం బెంపు మిగిలి పౌరజానపదనానావిధోపహారంబులు గైకొనుచు బహురత్నంబులకు భాజనంబులై మహనీయవిభూతి శోభిల్లుచున్నంత వాసుదేవుండు బలభద్రపురస్సరంబుగా సాత్యకిసమేతుండై సుభద్రాభిమన్యులం దోడ్కొని కృతవర్మయుఁ బ్రద్యుమ్నుండును సాంబుండును యుయుధానుండును రుక్మిండును నక్రూరుండును నింద్రసేనాదిపాండవసారథులును రథారూఢులై కొలిచి రా మఱియు ననేకయాదవకుమారులును గరితురగస్యందననిబిడంబు లగు బలంబులతోడ నిరుకెలంకుల నడవం జనుదెంచి. 375

గీ. భవ్యవిభవంబుతో నుప♦ప్లావ్యపురము,సొచ్చి సంభ్రమమునఁ బాండు♦సుతులు దనకు

374. ఫల్గునుఁడు = అర్జునుఁడు. వీఁడేయే = తెలివిమాలినవాఁడా ? పతియున్ = రాజయిన దుర్యోధనుఁడును. విరళసైన్యంబులతోన్ = తక్కువపడిన సేనలతో. పురికిన్ = హస్తినాపట్టణమునకు. చనియెను.

తా.—భీష్ముని మాటలను విని యందఱును సమ్మతించి యర్జునుం డంత తెలివిమాలినవాఁడు కాఁ డని పలికిరి. అంత మఱునాఁడు దుర్యోధనుఁడు హతశేషము లగు సేనలతో హస్తినాపురము చేరెను.

375. ప్రకాశులై = బయలుపడినవారై. శమీవృక్షనిక్షిప్తసమస్తసాధనంబులు = జమ్మిచెట్టునం దుంపఁబడినయెల్ల యాయుధములను. పూజాపూర్వకంబుగాన్ = పూజ ముందు కలుగునట్లుగా. ఉపప్లావ్యంబునన్ = ఉపప్లావ్య మనుపట్టణమునందు. మత్స్యమహీనాథుండు = విరాటరాజు. పంపు = ఆజ్ఞను. పెంపు = అతిశయము చేత. పౌరజానపదనానావిధఉపహారంబులు = పట్టణమునందలి జనులయొక్కయుఁ బల్లెలయందలిజనులయొక్కయుఁ బలువిధము లయినకానుకలను. బహురత్నంబులకున్ = పెక్కుశ్రేష్ఠవస్తువులకు. భాజనంబులై = చోటులై. మహనీయవిభూతి = గొప్పసంపద. శోభిల్లన్ = ప్రకాశింపఁగా. వాసుదేవుండు = కృష్ణుఁడు. బలభద్రపురస్సరంబుగాన్ = బలరాముఁడు ముందు పోవువాఁ డగునట్లుగా. సాత్యకిసమేతుండై = సాత్యకితోఁ గూడినవాఁడై. ఇంద్రసేనఆదిపాండవసారథులును = ఇంద్రసేనుఁడు మొదలుగాఁ గల పాండవులయొక్క తేరు నడపువారును. రథఆరూఢులై = రథము నెక్కినవారై. అనేకయాదవకుమారులును = పెక్కండ్రు యదువంశమునఁ బుట్టినపిల్లవాండ్రును. కరితురగస్యందననిబిడంబులు = ఏనుఁగుల చేతను గుఱ్ఱముల చేతను తేరుల చేతలు నిండినవి. ఇరుకెలంకులన్ = రెండుపార్శ్వములయందును. చనుదెంచి = వచ్చి.

376. భవ్యవిభవంబుతోన్ = మంగళకర మగుసంపదతో. ఉపప్లావ్యపురము = ఉపప్లావ్య మనుపట్టణమును. సంభ్రమమునన్ = సంతోషముతో. వచ్చినన్ = రాఁగా. ఆహ్లాదము = సంతో

నెదురు వచ్చిన నాహ్లాద ♦ మెసక మెసఁగఁ, దత్సమాగమయోగ్యవి♦ధంబు నడపె.

వ. బలదేవప్రముఖులకును దదీయసందర్శన సముచితసమాచారంబు లొనర్చి సుభద్రాభిమన్యులం బాంచాలిపాలికిం గొనిపోవ నభ్యంతరజనంబుల నియోగించి.

క. లలితమణిమయవిభూషణ, ములు రుచిరాంబరములును బ్ర♦మోద మెడఁ దని
ట్టలముగ హరి కుంతీపు, త్త్రుల కెల్లను నిచ్చి పిదప ♦ ద్రోవది కిచ్చెన్. 378

వ. ఇట్లు గట్ట నిచ్చి వేలు వేల రథకరితురగదాసదాసీజనంబుల నొసంగి పద్మనాభుండు పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరారు చుండెఁ దదనంతరంబ. 379

సీ. ద్రుపదభూవిభుఁడు పు♦త్త్రులుఁ దానుఁ జతురంగ, బలములతో వచ్చి♦పాండుసుతులఁ
గాంచి వారలు దన్నుఁ ♦ గరము సంప్రీతిమై, గారవింపఁగ నుండెఁ ♦ గాశిరాజు
శైబ్యుండుఁ బదపడి ♦ సైన్యసమేతులై, చనుదెంచి ధర్మనం♦దనునిచేయు
సత్కారముల గాఢ♦సమ్మదంబునఁ బొంది, రవ్విరాటుండును ♦ నంతవట్టు

---

షము. ఎసకమెసఁగన్ = అతిశయింపఁగా. తత్సమాగమయోగ్యవిధంబు = ఆపాండవులతోఁ గూడుటయందుఁ దగినమర్యాదను. నడపెన్.

తా.—గొప్పవిభవముతో నుపప్లావ్యపురమునకు రాఁగాఁ బాండవులు సంతోషించి వారికెదురుగాఁ బోయిరి. అంతఁ గృష్ణుఁడు వారితోఁ జేరునపుడు చేయవలసినమర్యాదను జరపెను.

377. బలదేవప్రముఖులకును = బలరాముఁడు మొదలుగాఁ గలవారికిని. తదీయసందర్శనసముచితసమాచారంబులు = వారి దైనమాటయందుఁ దగిననడవడులను. ఒనర్చి = చేసి. పాంచాలికిన్ = ద్రౌపదియొద్దను. అభ్యంతరజనంబులన్ = అంతఃపురమునందలిజనులను. నియోగించి = ఏర్పఱచి.

378. హరి = కృష్ణుఁడు. లలితమణిమయవిభూషణములున్ = చక్కనివియు రత్నమయములు నగుసొమ్ములను. రుచిరఅంబరములును = చక్కనివస్త్రములను. ప్రమోదము = సంతోషము. ఎడఁదన్ = మనస్సునందు. నిట్టలముగన్ = అధికము కాఁగా. ద్రోవదికిన్ = ద్రౌపదికి.

తా.—అప్పుడు కృష్ణుఁడు రత్నాలసొమ్ములను శ్రేష్ఠము లయినవస్త్రములను సంతోషముతోఁ బాండవులకును ద్రౌపదికి నిచ్చెను.

379. రథకరితురగదాసదాసీజనంబులన్ = తేరులను ఏనుఁగులను గుఱ్ఱములను పనివాండ్రను పనికత్తెలను. పద్మనాభుండు = కృష్ణుఁడు. అలరారుచుండెన్ = ప్రకాశించుచుండెను. తత్ అనంతరంబ = అటుపిమ్మటనే.

380. ద్రుపదభూవిభుఁడు = ద్రుపదరాజు. చతురంగబలములతోన్ = నాలు గంగములు గల సేనలతో. పాండుసుతులన్ = పాండురాజుకొడుకులను. కరము = మిక్కిలి. సంప్రీతిమైన్ = ఎక్కువప్రీతితో. ఉండెన్ = ఉండిరి. పదపడి = పిమ్మట. సైన్యసమేతులు ఐ = సైన్యములతోఁ గూడినవారై. ధర్మనందనుఁడు = ధర్మరాజు. చేయుసత్కారములన్ = చేయుపూజలచేత. గాఢసమ్మదంబును = ఎక్కువసంతోషమును. అంతవట్టువారలకున్ = వారల కందఱకును. తత్ తత్ ఉచితప్రకారములన్ = వారివారికిఁ దగినవిధములచేత. ప్రియంబు = సంతోషము. తలకొనన్ =

వారలకుఁ దత్తదుచితప్ర♦కారములఁ బ్రి
యంబు దలకొన సంవిధా♦నంబు సేసె
మఱియు బహుదేశములబంధు♦మాన్యమిత్త్రి
వర్గములు వేడ్కఁ బెండ్లికి ♦ వచ్చెఁ గలయ. 380

వ. ఇవ్విధంబున రెండుదెఱంగులచుట్టంబులు నైన భూపతులు దమతమవిభవంబులు మెఱసి వచ్చి యుండ విరాటునిపురంబున నుత్సవంబు సాటించిన. 381

క. కలువడములు మణితోరణ, ములుఁ గట్టిరి క్రముకకాండ♦మోచాస్తంభం
బులు నాటిరి కుంకుమమునఁ, గలయ నలికి ముగ్గు లిడిరి ♦ కర్పూరమునన్. 382

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్ట♦ణంబు వివాహో
త్సవమాధవలక్ష్మికి లలి, తవనంబై యెలమికలిమి♦తానల మయ్యెన్. 383

---

కలుగునట్లు. సంవిధానంబు = ఏర్పాటును. మఱియున్. బహు...వర్గములు—బహుదేశముల = పెక్కుదేశములయందలి, బంధు = చుట్టములయు, మాన్య = పూజింపఁదగినవారలయు, మిత్త్రి = స్నేహితులయు, వర్గములు = సమూహములు.

తా.—ద్రుపదరాజు కొడుకులతోను జతురంగసైన్యముతోను వచ్చి పాండవులచే గౌరవింపఁబడి సంతోషముతో నుండెను. కాశిరాజును శైబ్యుండును సకలసైన్యములతో ధర్మరాజునొద్దకు వచ్చి యతనిచే సత్కరింపఁబడిరి. విరాటరాజు వారల కందఱకును నానావిధముల సమ్మానము చేసెను. మఱియు బహుదేశములనుండి బంధువులును మిత్త్రులును వివాహమునకై వచ్చిరి.

381. భూపతులు = రాజులు. తమతమవిభవంబులు = తమతమసంపదలచేత.

382. కలువడములు = ధ్వజస్తంభములయందుఁ గట్టెడుబంగారుకలువపూదండలను. మణితోరణములున్ = రత్నాలతోరణములును. కట్టిరి. క్రముకకాండమోచాస్తంభంబులు = పోఁకగడలను అరఁటిస్తంభములను. నాటిరి. కుంకుమమునన్. కలయన్ = అంతటను. అలికి. కర్పూరమునన్ = పచ్చకర్పూరముచేత. ముగ్గులు. ఇడిరి.

తా.—ఆపట్టణమునందు జనులు ధ్వజము లెత్తి వానికి బంగారుకలువపూదండలను గట్టి ద్వారములయందు రత్నాలతోరణములను గట్టి పోఁకచెట్లను అరఁటిస్తంభములను నాటి గృహములయందంతటను గుంకుమపువ్వుతో నలికి పచ్చకర్పూరమున ముగ్గులు పెట్టిరి.

383. వివిధఅలంకరణంబులన్ = నానావిధము లయినయలంకారములచేత. నవకాంతి = క్రొత్తకాంతిని. వహించి. వివాహఉత్సవమాధవలక్ష్మికిన్ = వివాహోత్సవము అను వసంతర్తువుయొక్క సంపదకు. లలితవనంబుఐ = చక్కనియుద్యానవనమై. ఎలమికలిమితానలము = సంతోషముయొక్క యతిశయమునకుఁ జోటు, వికాసముయొక్క యతిశయమునకుఁ జోటు అని యర్థాంతరము.

తా.—ఆపట్టణమప్పుడు వివాహోత్సవమునకై చేసినయలంకారములచేత వసంతర్తువునం దుద్యానమువలె నొప్పి యావివాహోత్సవమునకు నెంతయుఁ దగి యుండెను. జనులందఱు మిక్కిలి సంతోషమునం బొదలుచుండిరి.

ఉ. తాను సుధేష్ణయున్ సుతులుఁ ♦ దమ్ములు బంధులు గంధమాల్యనా
నానవరత్నభూషణమ♦నఃప్రియమాంగలికప్రసాధనా
నూనవిభూతి మత్స్యవిభుఁ ♦ డుజ్జ్వలలీల వహించి భూమిదే
వానయనాదికృత్యపరు ♦ లై నిజజనంబుల గారవించుచున్. 384

వ. గరువంపుసంభ్రమంబుతోడ నిజమందిరంబునందు. 385

సీ. అమలరత్నప్రదీ♦పావలి మెఱుఁగిడఁ, బనిచి మణిస్తంభ♦పంక్తి క్రొత్త
జిగి దళుకొత్తున♦ట్లుగఁ దొడయించి వి, చిత్రవితానముల్ ♦ చెలువు మిగులఁ
గట్టించి నూత్నము♦క్తాదామములతోడఁ, గుసుమమాలిక లెడ ♦ గ్రుచ్చి వ్రేలఁ
గీలింప నియమించి ♦ క్రేవల మంగళ, భూరుహపల్లవ♦తోరణములు
సంఘటింప నియోగించి ♦ చందనమునఁ, బరిణయాగార మలుకంగఁ ♦ బాణి యాణి
గలుగుముత్తియముల ముగ్గు♦గా నొనర్పఁ, జతురపుణ్యాంగనాజన♦తతి నమర్చె.

---

384. మత్స్యవిభుఁడు = విరాటరాజు. తాను. సుధేష్ణయున్. గంధ......విభూతిన్— గంధ = గంధముచేతను, మాల్య = పూదండలచేతను, నానానవరత్నభూషణ = పలువిధములయిన తొమ్మిదిరత్నములు పొదిగినసొమ్ములచేతను. మనఃప్రియ = మనస్సునకు సంతోషము గలిగించునట్టి, మాంగలిక = మంగళార్హములైన, ప్రసాధన = అలంకారములచేతను, అనూన = తక్కువకాని, విభూతిన్ = సంపదను. ఉజ్జ్వలలీలన్ = ప్రకాశించుచున్నవిలాసముచేత. భూమిదేవానయనాది కృత్యపరులు = బ్రాహ్మణులను తోడ్కొని వచ్చుట మొదలగుకార్యములయందు దాసక్తి గలవారు.

తా.—విరాటరాజు తనభార్య మొదలగువారితోఁ గూడినవాఁడై గంధమాల్యములు మొదలగుమంగళాలంకారములు ధరించి బ్రాహ్మణులను బిలుచుకొని వచ్చుట మొదలగుపనులు చేయువారిని ఆయాపనులయందు నియోగించుచు.

385. గరువంపుసంభ్రమంబుతోడన్ = అధికమయినసంతోషముతో. నిజమందిరంబునందున్ = తనగృహమునందు.

386. అమలరత్నప్రదీపఆవళి = నిర్మలమయినరత్నాలదీపములసమూహమును. మెఱుఁగు ఇడన్ = మెఱుఁగుపెట్టుటకు. పనిచి = ఆజ్ఞాపించి. మణిస్తంభపంక్తి = రత్నాలస్తంభముల సమూహమును. క్రొత్తజిగి = క్రొత్తకాంతి. తళుకొత్తునట్లుగన్ = ప్రకాశించునట్లుగా. విచిత్రవితానముల్ = చక్కని మేలుకట్లను. చెలువు = చక్కఁదనము. మిగులన్ = అతిశయించునట్లు. కట్టించి. నూత్నముక్తాదామములతోడన్ = క్రొత్తముత్యాలదండలతో. కుసుమమాలికలు=పూదండలను. ఎడన్ = నడుమను. వ్రేలన్ = వ్రేలాడునట్లు. కీలింపన్ = కట్టుటకు. నియమించి = ఏర్పఱచి. క్రేవలన్ = పార్శ్వములయందు. మంగళభూరుహపల్లవతోరణములు = మంగళకరము లయిన చెట్లయొక్క చివుళ్లతోరణములను. సంఘటింపన్ =కూర్చుటకు. నియోగించి = ఆజ్ఞాపించి. చందనమునన్. పరిణయఅగారము = పెండ్లియింటిని. పాణి = నీరును. ఆణి = వజ్రపుపదనమును. చతురపుణ్యాంగనాజనతతిన్ = నేర్పరు లగుముత్తైదువజనములసమూహమును. అమర్చెన్.

క. వైదికలౌకికవిధిసం, పాదితవివిధార్హవస్తు♦భరితత్వమునన్
వేదిక పొలుపగునట్లుగ, మోదమునం బురోహితుండు ♦ మునుకొని చేసెన్.

క. ఉత్తర నలంకరింప ను, దాత్తాభరణాదివస్తు♦తతి యొసఁగి నరేం
ద్రోత్తముఁడు నేర్పు గలచెలి, కత్తియలం బనిచెఁ బ్రీతి ♦ గడలుకొనంగన్. 388

(అభిమన్యుని వివాహమహోత్సవము.)

వ. ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుం డగు మత్స్యమహీనాథుండు మౌహూర్తికాదిశిష్టజనులు పరివేష్టింప నుండి లగ్నం బాసన్నం బగుచు వచ్చెనని ధర్మతనయున కెఱింగింపం బనిచిన నతండు ననుజతనుజసహితంబుగా నలంకృతుండై వివిధప్రసాధనశోభితు లగుసమస్తబంధుజనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరు గలవారు

---

తా.—విరాటరాజు రత్నదీపములకు మెఱుంగు పెట్టించి మణిస్తంభములను దుడిపించి చక్కని మేలుకట్లు కట్టించి ముత్యాలదండలను పూలమాలికలను వ్రేలాడఁ గట్టించి పార్శ్వములయందు మంగళవృక్షములచిగుళ్లతోరణములు గట్టించి ముత్తైదువులచేఁ బెండ్లిమంటపమును గంధపునీట నలికించి మేలిముత్తెములతో ముగ్గులు పెట్టించి గృహ మంతట నలంకారము గావించెను.

387. వైదిక.....భరితత్వమునన్—వైదిక = వేదమునందుఁ జెప్పఁబడినవియు, లౌకిక = లోకప్రసిద్ధములు నగు, విధి=నియమములచేత, సంపాదిత = సంపాదింపఁబడిన, వివిధ = పలువిధము లయిన, అర్హ = యోగ్యము లయిన, వస్తు = పదార్థములచేత, భరితత్వమునన్ = నిండిన దగుటచేత. వేదిక = పెండ్లియరఁగు. పొలుపు = అందము. మోదమునన్ = సంతోషముతో. మునుకొని = పూని.

తా.—అప్పుడు పురోహితుఁడు వేదోక్తవిధిని లోకాచారమును ననుసరించి పెండ్లికిఁ గావలసినవస్తువుల నన్నిటిని సమకూర్చి వేదిక నలంకరింపఁగా.

388. ఉదాత్తఆభరణఆదివస్తుతతి = మేలియాభరణములు మొదలగువస్తువులసమూహమును. ఒసఁగి = ఇచ్చి. నరేంద్రఉత్తముఁడు = రాజశ్రేష్ఠుఁ డయినవిరాటుఁడు. ప్రీతి = సంతోషము. కడలుకొనంగన్ = అతిశయింపఁగా. పనిచెన్ = ఆజ్ఞాపించెను.

తా.—విరాటుఁ డంత సంతోషముతో నుత్తర నలంకరించుటకై యుత్తమము లగు నాభరణములు మొదలగువాని నిచ్చి నేర్పుగల చెలికత్తియల కాజ్ఞాపించెను.

389. వైవాహికవర్తన సంవిధానసావధానుండు = వివాహమంగళముయొక్క జరిగించుటయొక్క యేర్పఱచుటయందు హెచ్చరికతోఁ గూడినవాఁడు. మౌహూర్తికఆదిశిష్టజనులు = జ్యోస్యులు మొదలుగాఁగల పెద్దలు. పరివేష్టింపన్ = చుట్టుకొనఁగా. ఆసన్నంబువై = సమీపించినదై. ధర్మతనయునకున్ = ధర్మరాజునకు. పనిచినన్ = పంపఁగా. అతండున్ = ఆధర్మరాజును = అనుజతనుజసహితంబుగాన్ = తమ్ములతోను కొడుకులతోను గూడినట్లుగా. వివిధప్రసాధనశోభితులు. నానావిధము లయినయలంకారములచేఁ బ్రకాశించువారలు. భద్రగజఆరూఢున్ = భద్రజాతియేనుఁగు నెక్కినవానిని. పేరు = ప్రసిద్ధి. వారువంబులను = గుఱ్ఱములను. పట్టపుఘట్టంబు = కొలఁ

వంబులను మట్టపుధట్టంబు సేసికొని మణిగణంబులు నంబరనికరంబులుఁ బుష్ప
పుంజంబులు ఫలప్రచయంబులు లోనుగాఁ గలయోగ్యవస్తువుల విస్తరిల్లినక్రంత
నడవ మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వంది
జనవాక్యసంతానంబులుఁ జెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటుమందిరంబున
కేతెంచి శంఖజయఘంటాపణవాదనిక్వణంబులతోడ నెదుర్కొని చల్లుసేసలు
గైకొనుచుం జొత్తెంచిన. 389

క. విరటుఁడు సంభ్రమమును నా, దరమును భక్తియును నాత్మఁ ♦ దలకొనఁ బూజా
పరుఁడై సమయసముచితా, చరణంబులు నిర్వహించె ♦ సమ్మదలీలన్. 390

గీ. విహితపరిపాటితో విప్ర♦వృద్ధజనులు, పుణ్యకర్మపరంపరఁ ♦ బూని నడప
నర్థిఁ గృష్ణయుధిష్ఠిర♦పార్థమత్స్య, వరులు దెర యొద్ద నవ్వధూ♦వరుల నిలిపి.

వ. సాంవత్సరికదత్తకాలకళావిశేషంబున మంగళతూర్యరవంబులు సెలంగ నుత్తర
యెత్తించిన. 392

---

దియైనసేనను. మణిగణంబులుఁ = రత్నాలసమూహములును. అంబరనికరంబులుఁ = వస్త్రముల సమూహములును. పుష్పపుంజంబులుఁ = పువ్వులసమూహములును. ఫలప్రచయంబులుఁ = పండ్లసమూహములును. లోనుగాఁ = మొదలుగా. యోగ్యవస్తువులఁ = తగినపదార్థములచేత. విస్తరిల్లినక్రంత = అతిశయించినప్రధానద్రవ్యము. మంగళతూర్యనాదంబులు = మంగళవాద్యధ్వనులు. విప్రాశీర్వాదంబులు = బ్రాహ్మణులదీవనలు. మాగధగానంబులును = వంశావళి చదువువారిపాటలును. వందిజనవాక్యసంతానంబులుఁ = బట్రాజులమాటలసమూహములును. చెలంగఁ = మ్రోఁగఁగా. వాసుదేవపురస్సరంబుగాఁ = కృష్ణుఁడు ముందు గలుగునట్లుగా. నిక్వణంబులతోడఁ = ధ్వనులతో. సేసలు = అక్షతలను. చొత్తెంచినఁ = ప్రవేశింపఁగా.

390. సంభ్రమమును = సంతోషమును. ఆత్మఁ = మనస్సునందు. తలకొనఁ = కలుగఁగా. పూజాపరుఁడువి = పూజించుటయందు దాసక్తుఁడై. సమయసముచితఆచరణంబులు = సమయమునకుఁ దగినయాచారములను. సమ్మదలీలఁ = సంతోషాతిశయముచేత. నిర్వహించెఁ = చేసెను.

తా.—విరాటుఁడు భయభక్తులతోఁ బూజించి యప్పుడు చేయవలసినయాచారములను నడపెను.

391. విప్రవృద్ధజనులు = బ్రాహ్మణులయందుఁ బెద్ద లయినవారు. విహితపరిపాటితోఁ = విధింపఁబడినక్రమముతో. పుణ్యకర్మపరంపర = పవిత్రము లయినకర్మములయొక్క వరుసను. పూని. నడపఁ. అర్థిఁ = ప్రీతితో. కృష్ణయుధిష్ఠిరపార్థమత్స్యవరులు = కృష్ణుఁడును ధర్మరాజును అర్జునుఁడును విరాటుఁడును. అవ్వధూవరులఁ = ఆపెండ్లికూఁతును పెండ్లికుమారుని. తెరయొద్దఁ. నిలిపి.

తా.—అప్పుడు బ్రాహ్మణులు చేయవలసినకర్మకలాపమును నడపఁగాఁ గృష్ణుఁడు మొదలగువారు ఉత్తరను అభిమన్యుని దెరయొద్ద నిలిపి.

392. సాంవత్సరికదత్త కాలకళావిశేషంబునఁ = జోస్యునిచే నియ్యఁబడినకాలముయొక్క

ఉ. వీనులఁ దియ్య మెక్కఁ మును ♦ విన్కిఁ బరస్పరరాగవృత్తి లోఁ
నూనినఁ జూచు వేడుకల ♦ నువ్విళు లూరెడు నెమ్మనంబు ల
చ్చోఁ నొకయింత సేపు నెడ ♦ సొచ్చుట కోర్వక యుండ నున్నయ
మ్మానినియుం గుమారుఁడును ♦ మారవికారము లంకురింపఁగన్. 393

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు. 394

సీ. వరుచూడ్కి ముద్దియ♦వదనంబుపైఁ బాఱి, తివుటమై నునుఁగాంతి♦తీపుఁ గ్రోలు
సుందరీరత్నంబు♦చూపు మనోహరు, నడుగులయొప్పుపై ♦ నల్ల నడరుఁ
బతివిలోకనములు ♦ పడఁతుకమైతీఁగఁ, గలయంగఁ బలుమాఱు ♦ మెలఁగుచుండు
వెలఁదికటాక్షముల్♦విభునిపైఁ గ్రమమున, నెగసి మోమున సోఁకి♦ మగిడివచ్చు

---

భాగముయొక్క భేదమునందు, జ్యోతిషికుఁడు చెప్పినశుభముహూర్తమున ననుట. మంగళతూర్యరవంబులు = మంగళవాద్యధ్వనులు.

393. వీనులకా=చెవులయందు. తియ్యము = ప్రీతి. ఎక్కఁగా = అతిశయించునట్లు. విన్కిఁగా= వినుటచేత. పరస్పరరాగవృత్తి = ఒండొరులమీఁదియనురాగరూప మయిన మనోధర్మము. లోఁగా = మనస్సులయందు. ఊనినకా = నాటుకొనఁగా. ఉవ్విళులు ఊరెడు నెమ్మనంబులు = ఆశపడునట్టి నిండుమనస్సులు. అచ్చోఁగా = అప్పుడు. ఒకయింతసేపుకా = కొంచెము సేపుకూడ. ఎడసొచ్చుటకుకా = ఆలస్య మగుటకు. ఓర్వక. ఉండకా. ఉన్నఅమ్మానినియుకా = ఉన్నట్టి యాయుత్తరయును. కుమారుఁడును = అభిమన్యుఁడును. మారవికారములు= మన్మథబాధలు. అంకురింపఁగకా= మొలకలెత్తఁగా.

తా.—ఆయుత్తరాభిమన్యులు ఒండొరుల సౌందర్యాదిగుణములను మున్ను విన్నవారలు గావున నొండొరులపై ననురాగము గలిగి యెప్పు డెప్పు డొండొరులం జూతమని కొంచెమైనను ఆలస్యమును సహింపనివా రగుటచే అప్పుడు మన్మథవికారము కలవారైరి.

394. అన్యోన్యఅవలోకనంబు = ఒండొరుల చూచుటను.

395. వరుచూడ్కి = పెండ్లికొడుకుచూపు. ముద్దియవదనంబుపైకా = ఉత్తరమోముమీఁద. తివుటమైకా=కోరికతో. నునుఁగాంతితీపు=నున్నని కాంతియొక్కమాధుర్యమును. గ్రోలుకా=త్రాగును. తా.—అభిమన్యుని చూపు ఉత్తరమోమున వ్రాలి దానిసౌందర్యమునకు నానందము నొందును. సుందరీరత్నంబు చూపు=స్త్రీరత్న మయినయుత్తరయొక్కచూపు. మనోహరు అడుగులఒప్పుమైకా= ప్రియుఁ డయిన యభిమన్యునియొక్క పాదముల చక్కఁదనముమీఁద. అల్లకా=తిన్నగా. అడరుకా= పరఁగును. తా.—ఉత్తరచూపు అభిమన్యునిపాదములమీఁదఁ బ్రసరించును. ఇందుచే నుత్తర సిగ్గుచేఁ దలవంచుకొని యుండుట ధ్వనితము. పతివిలోకనములు = వరునిచూపులు. పడఁతుక మైతీఁగకా = ఉత్తరయొక్క తీఁగవంటిదేహమునందు. కలయంగకా = అంతటను. పలుమాఱుకా = మాటిమాటికి. మెలఁగుచుండుకా = తిరుగుచుండును. తా.—అభిమన్యుఁ డుత్తరదేహ మంతయుఁ బలుమాఱు చూచుచుండెను. వెలఁదికటాక్షముల్= ఉత్తరయొక్క క్రేగంటిచూపులు. విభునిపైకా=

నొండొరువులలేఁజెమటల ♦ నూని వ్రేఁగు, పడినచాడ్పున నవయవ♦భంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు ని♦ద్దఱవిశాల, నయనదీప్తులు నెఱుకువ♦ బయలుపడఁగ. 

వ. తదనంతరంబ. 396

గీ. ఒండొరులదోయిళుల నిను♦పొందఁ జేయు, నక్షతప్రకరంబు ల♦న్యోన్యమస్త
కములఁ బోసిరి మందార♦కల్పలతలు, విరులగముల నొండొంటిపైఁ ♦ గురియునట్లు.

చ. లలితతనూవిలాసముల ♦ లజ్జకతంబునఁజేసి మున్ను వి
చ్చలవిడిఁ బర్వఁగా వెరవు ♦ చాలక యోరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు వోయునెడ♦లం దగ వొందిన నూలుకొల్పి యి
మ్ములఁ బచరింతు రొండొరుల♦మోహనమూర్తులపై వధూవరుల్. 398

---

మగనిమీఁద. క్రమమునన్. మగిడి = మరలి. తా.—ఉత్తరచూపులు క్రమముగాఁ బాదముల నుండి యభిమన్యునిమోమువఱకు వ్యాపించి యచ్చట నభిమన్యునిచూపు తగులు నని వెంటనే మరలును. ఇద్దఱ విశాలనయనదీప్తులన్ = ఆయిద్దఱియొక్క నిడుపులయిన కన్నులకాంతులును. ఎఱుకువ = అభిప్రాయము. బయలుపడఁగన్ = వెల్లడి యగునట్లు. ఒండొరువులలేఁజెమటలన్ = ఒకరొకరి యొక్క చిఱుచెమటలయందు. ఊని = తగిలి. వ్రేఁగుపడినచాడ్పునన్ = చిక్కుపడినవో యనునట్లు. అవయవభంగులందున్ = అవయవములయొక్క విధములయందు. తగిలి. మఱపునన్ = పారవశ్యముచేత. తడయున్ = నిలుచును. తా.—ఆవధూవరుల యిద్దఱిచూపులు ఒకరొకరియవయవములయందు వ్యాపించి యచ్చటఁ గలిగియుండు చిఱుచెమటలఁదగులుకొన్నవియో యనునట్లు పరవశములై యచ్చట చ్చటనే చాలసేపు నిలిచి యుండినవి.

397. ఒండొరులదోయిళులన్ = ఒకరొకరిదోసిళ్లయందు. నినుపఒందఁ జేయు అక్షతప్రకరంబులు = నిండించునట్టి యక్షతలసమూహములను. మందారకల్పలతలు = మందారవృక్షమును కల్పవృక్షపుఁదీఁగయును. విరులగములన్ = పువ్వులసమూహములను. ఒండొంటిపైన్. కురియునట్లు. అన్యోన్యమస్తకములన్ = ఒండొరులశిరస్సులయందు. పోసిరి.

తా.—ఆవధూవరులు దోసిళ్లయం దక్షతల నుంచుకొని మందారకల్పలత లొండొంటిపైఁ బువ్వులు గురియునట్లు ఒండొరులశిరస్సులమీఁదఁ బోసిరి. ఇక్కడ మందారవృక్షమునకును అభిమన్యునకును గల్పలతకును నుత్తరకును అక్షతప్రకరంబులకును విరులగములకును నుపమానోపమేయభావము.

398. లలితతనూవిలాసములన్ = చక్కనిదేహములయొక్క విలాసములయందు. లజ్జకతంబునఁ జేసి = సిగ్గు అను కారణముచేత. విచ్చలవిడిన్ = స్వేచ్ఛగా. పర్వఁగాన్ = ప్రసరించుటకు. వెరవు = అవకాశము. చాలక. ఓరలువాఱుచూపులన్ = ఓరగాఁ బ్రసరించుచూడ్కులను. లలిన్ = సంతోషముతో. పోయునెడలన్ = పోయునప్పుడు. తగవు = అవకాశము. ఒందినన్ = కలుగుటచేత. ఒండొరులమోహనమూర్తులపైన్ = ఒకరొకరిచక్కనిదేహములమీఁద. నూలుకొల్పి = నిలిపి. అవ్వధూవరుల్ = ఆయాలుమగలు. ఇమ్ములన్ = సంతోషముతో. పచరింతురు = పఱపుదురు.

తా.—ఆవధూవరులు అంతకు మున్ను సిగ్గుచే నొకరినొకరుచక్కఁగాఁ జూచికొన నవకాశము

గీ. చిత్తమునగాఢరాగంబు ♦ చేతఁ జూపు, తెఱఁగు దోఁపఁ గెంపారెడు♦తీఁగఁబోఁడి
మృదులపాణిఁ గుమారుండు♦మెలపుమైఁ గ్ర, హించెఁ బల్లవాలంబిమ♦త్తేభలీల.

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. 400

క. పెనుఁగుదుట నిడినచూతం, బును నవమాలికయుఁబోలెఁ ♦ బొలు పొంది రతం
డును నమ్ముగ్ధయు నేకా, సనమున నున్నపుడు నూత్న♦సౌభాగ్యమునన్. 401

సీ. కోర్కులు గెడగూడు♦కొని పార మెయిదిన, చిత్తంబు లూఱటఁ ♦ జిగుళ్లు లొత్తఁ
బులకాంకురములకుఁ ♦ దలతాఁకుడై యిరు, మేనును మన్వంబు ♦ మిగిలి పొదలఁ

---

లేనివారై తలఁద్రాలు పోసికొనునపు డవకాశము కలుగుటవలన నొకరినొకరు చక్కఁగాఁ జూచి కొనిరి.

399. చిత్తమునగాఢరాగంబు = మనస్సునందలి యధికమయిన యనురాగమును. చేతన్ = చేతితో. చూపుతెఱఁగు = చూపునట్టివిధము. తోఁపన్ = తోఁచునట్లు. కెంపుఆరెడుతీఁగఁబోఁడి మృదులపాణిన్ = ఎఱ్ఱనైన యుత్తరయొక్క మెత్తనిచేతిని. కుమారుండు = అభిమన్యువు. పల్లవఆలంబిమత్తేభలీలన్ = చిగురును గ్రహించునట్టి మదపుటేనుఁగువలె. మెలపుమైన్ = మెలఁకువతో. గ్రహించెన్ = పట్టెను. పాఠాం:—చేఁతఁజూపు. చేఁతన్=కార్యముచేత ననియర్థము, ఈపాఠము ఉత్ప్రేక్షానురూపమగుటచే నుపేక్షణీయము. హస్తముచేత ననునర్థము చెప్పునపుడు పాణియందు ఎఱ్ఱఁదనము వర్ణించుటచే రాగము ఎఱ్ఱరంగుగలది యని కవిసమయసిద్ధమగుటవలన నుత్ప్రేక్ష యుక్తమగుచున్నది.

తా.—అప్పుడు మనస్సులో నున్నయనురాగమును హస్తము దెలుపుచున్నదియో యనునట్లు ఎఱ్ఱగా నున్న యయ్యుత్తరహస్తమును అభిమన్యువు మదపుటేనుఁగు చివురును గ్రహించునట్లు మెల్లగాఁ బట్టెను.

400. పాణిగ్రహణంబుఆచరించి — పెండ్లియాడి.

401. పెనుకుదుటన్ = పెద్దపాదునందు. ఇడినచూతంబును = పెట్టినమామిడిచెట్టును. నవమాలికయున్‌పోలెన్ = విరజాజితీఁగయునువలె. అతండును. అమ్ముగ్ధయున్ = ఆయుత్తరయును. ఏకఆసనమునన్ = ఒకపీఁటయందు. నూత్నసౌభాగ్యమునన్ = క్రొత్తయలంకారముతో. పొలుపొందిరి = ప్రకాశించిరి.

తా.—ఒకపీఁటమీఁదఁ గూర్చుండిన యవ్వధూవరులు ఒకపాదునందు నాటిన మామిడియును విరజాజియునువలెఁ బ్రకాశించిరి.

402. గెడగూడుకొని = జతగాఁ గూడికొని. పారము = తుదను. ఎయిదినచిత్తంబులు = పొందినమనస్సులు. ఊఱటన్ = తృప్తిచేత. చిగుళులుఒత్తన్ = చిగిరింపఁగా, సంతోషింపఁగా. తా.—ఉత్తరాభిమన్యులకోర్కులు ఈడేఱి మనస్సులకు సంతోషము కలుగఁగా.। పులకాంకురములకున్ = గగుర్పు మొలకలకు. తలతాఁకుడువి = తలలను తాఁకునవియై. ఇరుమేనును = రెండుదేహములును. మన్వంబు=కోమలత్వము. మిగిలి=అతిశయించి. పొదలన్= ఒప్పఁగా. తా.—కోమలము లైన యిద్దఱిదేహములును గగుర్పాటు నొందిన వగుటచే నొకరిపులకలు మఱియొకరిదేహమునకుఁ దగులుచుండెను. పులకాంకురంబులు తలకొత్తఁగా నని పాఠాం, పులకాంకురములు ప్రకాశింపఁగా నని

దఱి వేచి చనఁ బోయి ♦ తడఁబడి మార్గతి, వడి చూపు లాదట ♦ బయలుపడఁగఁ
జెమటలతావులు ♦ తమలోనఁ గలసి వే, ఱొక్కసౌరభ మయి ♦ చొక్కు సేయ
గాఢసంస్పర్శభంగులు ♦ గలుగునట్టి, హోమసమయకృత్యంబుల ♦ నొదవుసౌఖ్య
రసము పెన్నిట్ట పోరిఁ బోరిఁ ♦ గ్రమ్ముదేర, సమ్మదాంబుధిఁ దేలిరి ♦ సతియుఁ బతియు.

వ. ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణిభూషణంబులు రుచిరాంబరంబులుఁ గర్పూరాదిసుగంధద్రవ్యంబులుఁ దాంబూలంబులతోడిపళ్లెరంబులఁ బచరించి పాండవులకు వాసుదేవపూర్వకంబుగాఁ బురోహితప్రకరంబునకుం గట్ట నిచ్చి యాజ్ఞసేనీసుభద్రలకు ననురూపాభరణపరిధానంబు లంతఃపురవర్తులైనయర్హజనంబులచేతం బుచ్చి సౌభద్రునకు భద్రసామజసప్తశతియును లోకోత్తరతురంగదశసహస్రంబును సలక్షణగోపంచలక్షయు రథంబులు రెండువేలును దాసదాసీజనంబు లక్షయు మఱియు నానాప్రకారంబు లగుధనంబులు

---

యర్థము. తఱి = సమయమును. వేచి = కాచి. చనన్ పోయి = పోఁబోయి. తడఁబడి. మార్గతి పడి = వేఱుమార్గమును పొంది. చూపులు. ఆదటన్ = ప్రీతితో. బయలుపడఁగన్ = బయలును పొందఁగా. తా.—సమయమును గనిపెట్టి యొకరినొకరు చూచుకొనునప్పుడు ఒండొరులచూపులు తగిలి చూడ్కులు తడఁబాటు నొంది వేఱుమార్గమునఁ బోయి శూన్యము లయ్యెను. చెమటల తావులు = చెమటలవాసనలు. తమలోనన్ = తమయందు. వేఱుఒక్కసౌరభముఅయి = వేఱు వాసనయై. చొక్కు = పారవశ్యమును. చేయన్. తా.—ఇద్దఱిచెమటలును గలసినపుడు వాని మంచి వాసనకుఁ బరవశులైరి. గాఢసంస్పర్శభంగులు = గట్టితాఁకుళ్లయొక్క విధములు. కలుగునట్టి హోమ సమయకృత్యంబులన్ = కలుగునట్టి హోమకాలమునందలి కార్యములయందు. ఒదవుసౌఖ్యరసము పెన్నిట్ట = కలుగునట్టి సుఖరసముయొక్క పెద్దప్రవాహము. పోరిన్ పోరిన్ = మాటిమాటికి. క్రమ్ముదేరన్ = కలుగుచుండఁగా. తా.—హోమము చేయునప్పుడు ఒండొరులదేహములకు గాఢ స్పర్శము కలుగుటచే నధిక సుఖము పొందుచుండిరి. సతియున్ = స్త్రీయును, ఉత్తరయును. పతియున్ = భర్త యయినయభిమన్యుఁడును. సమ్మదఅంబుధిన్ = సంతోష మనుసముద్రమునందు. తేలిరి. తా.—ఇట్లు ఉత్తరాభిమన్యులు పరమానందము నొందిరి.

403. నిర్వహించి = నెఱవేర్చి. మణిభూషణంబులున్ = రత్నాలసొమ్ములను. రుచిరఅంబరంబులున్ = చక్కనివస్త్రములను. కర్పూరఆదిసుగంధద్రవ్యంబులున్ = పచ్చకర్పూరము మొదలగు మంచివాసన గల ద్రవ్యములను. పచరించి = పఱపి. వాసుదేవపూర్వకంబు గాన్ = కృష్ణుఁడుముందు కలుగునట్లుగా. పురోహితప్రకరంబునకున్ = పురోహితులసమూహమునకు. యాజ్ఞసేనీసుభద్రలకున్ = ద్రౌపదికిని సుభద్రకును. అనురూపఆభరణపరిధానంబులు = తగినసొమ్ములను వస్త్రములను. అంతః పురవర్తులు = అంతఃపురమున నున్నవారు. అర్హజనంబులచేతన్ = తగినజనులచేత. పుచ్చి = పంపి. సౌభద్రునకున్ = అభిమన్యునకు. భద్రసామజసప్తశతియును = భద్రజాతియేనుఁగుల యేడునూఱు లును. లోకఉత్తరతురంగదశసహస్రంబును = లోకమునందు శ్రేష్ఠము లయినగుఱ్ఱములపదివేలును. సలక్షణగోపంచలక్షయున్ = మంచిలక్షణములతోఁ గూడినగోవుల యయిదులక్షలును. నానాప్రకా

నరణం బిచ్చె సమ్మాననీయమహోత్సవంబు మంగళసంవిధానసావధానపుణ్యాంగ నలవలనను నృత్తగీతాదివైచిత్ర్యమనోహరవారనారీజనంబులవలనను వినూత్నరత్న మయభూషణాది దీప్తివిశేషవిరాజమానులగుసుకుమారులచతురపరిహాసాదివిలాసం బులవలనను ప్రభూతవిభవవిభ్రాజితు లగురాజసూనులమాననీయగరిమలలిత విహా రవిశేషంబులవలనను పాంచాలయాదవకేకయాది బాంధవమహితమహిమాం చితసంచరణంబులవలనను నానందనిష్యందిపాండునందనసౌహార్దంబువలనను మ త్స్యమనుజపతిమందిరంబు పరమసంపద్భరితం బై యుండె నని చెప్పిన విని వైశంపాయనమునితో జనమేజయుం డిట్లనియె. 403

క. కుంతీనందను లట్లు, త్యంతవిభవ మెసఁగఁ బరిణయము సేసి సుహృ
త్సంతోషోజ్జ్వలు లై తద, నంతర మెబ్భంగి నడచి రనవుడుఁ బ్రీతిన్. 404

---

రంబులు = పలువిధములు గలవి. అరణంబు = వివాహకాలమునం దల్లుని కిచ్చెడుధనము. అమ్మహ నీయమహత్ ఉత్సవంబునన్ = ఆపూజ్య మయినగొప్పవేడుకయందు. మంగళ......అంగనలవలనను— మంగళసంవిధాన = శుభకార్యములు చేయుటయందు, సావధాన = జాగ్రత్తగల, పుణ్యాంగనలవల నను = ముత్తైదువలవలనను. నృత్తగీతఆదివైచిత్ర్యమనోహరవారనారీజనంబులవలనను= ఆటలుపాటలు మొదలగువానియొక్క విశేషములచేత చక్కనివేశ్యాజనములవలనను. వినూత్న......విరాజమానులు— వినూత్న = మిక్కిలి క్రొత్తవైన, రత్నమయ = రత్నవికారము లయిన, భూషణ= సొమ్ములు, ఆది= మొదలగువానియొక్క, దీప్తివిశేష = కాంతియొక్కయతిశయముచేత, విరాజమానులు = ప్రకాశిం చుచున్నవారు. అగుసుకుమారులచతురపరిహాస ఆదివిలాసంబులవలనను = అయినట్టి సుకుమారులయొక్క నేర్పుగల పరిహాసము మొదలుగాఁగలవిలాసములచేతను. ప్రభూతవిభవవిభ్రాజితులు=గొప్పసంపదచేఁ బ్రకాశించువారు. అగురాజసూనులమాననీయగరిమలలితవిహారవిశేషంబులవలనను = అయినట్టి రాజ పుత్రులయొక్క గౌరవింపఁదగిన గొప్పతనముచేఁ జక్కనిక్రీడలయొక్క యతిశయములవలనను. పాంచాల...సంచరణంబులవలనను—పాంచాల = పాంచాలరాజులును, యాదవ = యాదవులును, కేకయ = కేకయరాజులును, ఆది = మొదలుగాఁ గల, బాంధవ = చుట్టములయొక్క, మహిత = శ్రేష్ఠము లయిన, మహిమ = గొప్పతనముచేత, అంచిత = ఒప్పుచున్న, సంచరణంబులవలనను = విహా రములవలనను. అనందనిష్యందిపాండునందనసౌహార్దంబువలనను = సంతోషమును గలిగించుచున్న పాండవులయొక్క స్నేహమువలనను. మత్స్యమనుజపతిమందిరంబు = విరాటరాజు నగరు. పరమ సంపత్ భరితంబువి = గొప్పసంపదలచే నిండినదై.

404. కుంతీనందనులు = కుంతికొడుకులు. అట్లు. అత్యంతవిభవము = ఎక్కుడుసంపద. ఎసఁ గన్ = అతిశయించునట్లు. పరిణయము = వివాహమును. సుహృత్ సంతోషఉజ్జ్వలులువి = మిత్రుల సంతోషముచేఁ బ్రకాశించినవారై. తత్ అనంతరము = అటుపిమ్మట. ఎభ్భంగిన్ = ఏవిధమున. నడ చిరి. అనవుడున్—అని జనమేజయుండడుగఁగా. ప్రీతిన్ = వైశంపాయనుఁడు సంతోషముతో.

తా.—అట్లు పాండవులు వివాహమును గొప్పవిభవముతో నడపి మిత్రులతోఁ గలసి సంతో షము నొందినవారై పిమ్మట నేమి చేసిరి యని జనమేజయుఁ డడుగఁగా వైశంపాయనుండు సంతో షముతో.

చ. అమృతమయాత్మ భక్తిసుగ•మానుభవోజ్జ్వలదివ్యవర్త్మ ష
ట్సమయగతానుభావ పురు•షత్రయతావివృతస్వభావ ని
ర్మమహృదయైకవాస ముని•రంజననిత్యవిలాస దోషసం
గమవినికర్తనా పరమ•గౌరవధుర్యపదప్రవర్తనా. 405

క. దుర్వహపటుతాపత్రయ, నిర్వాపణకరణ బోధ•నిర్మలజనహృ
త్పర్వాచరణ మహాసుర, గర్వహరణ తత్త్వసంప్ర•కాశనకరుణా. 406

---

405. అమృతమయఆత్మ=మోక్షరూప మయినస్వరూపము గలవాఁడా! భక్తి...వర్త్మ—భక్తి= భక్తిచేత, సుగమ = సులువుగాఁ బొందఁ దగినదియు, అనుభవ = జ్ఞానముచేత, ఉజ్జ్వల = ప్రకాశించునదియు నగు, దివ్యవర్త్మ = శ్రేష్ఠ మయినమార్గము గలవాఁడా! మొదట భక్తిచేతను పిదపఁ జ్ఞానముచేతను బొందఁ దగినవాఁడా యని తాత్పర్యము. షట్సమయగతఅనుభావ = ఆఱుమతము లను బొందినమహిమ గలవాఁడా! శైవము, శాక్తము, వైష్ణవము, గాణాపత్యము, సౌరము, కాపాలికము అను నీయాఱుమతములవారిచేతను బూజింపఁబడువాఁడా యని తాత్పర్యము. పురుషత్రయతావివృతస్వభావ = పురుషులమువ్వురగుటచేత వెల్లడి చేయఁబడిన స్వరూపము గలవాఁడా! క్షరుఁడు అక్షరుఁడు పరమాత్మ యను మువ్వురుపురుషులుగా వెలసినవాఁడా యని తాత్పర్యము, క్షరుఁ డనఁగాఁ బంచభూతములు, అక్షరుఁ డనఁగా జీవుఁడు అని భేదము. నిర్మమహృదయఏకవాస = మమకారము లేనివారిమనస్సే ముఖ్య మయినవాసస్థానముగాఁ గలవాఁడా! సన్న్యాసులచే ధ్యానింపఁ బడువాఁడా యని తాత్పర్యము. మునిరంజననిత్యవిలాస = ధ్యానించువారిని సంతోషపఱచునట్టినిత్య మైనవిలాసము గలవాఁడా! దోషసంగమవినికర్తనా = దోషములసంబంధమును బోఁగొట్టువాఁడా! అవిద్యాదిదోషములను బోఁగొట్టువాఁడా యని తాత్పర్యము. పరమగౌరవధుర్యపదప్రవర్తనా = ఎక్కువగౌరవముయొక్క భారమును వహించునట్టి స్థానముయొక్క ప్రవర్తింపఁ జేయువాఁడా! సర్వోత్తమ మయినమోక్షపదమును ఇచ్చువాఁడా యని తాత్పర్యము.

406. దుర్వహ......కరణ—దుర్వహ = ఓర్వరాని, పటు = గొప్పదైన, తాపత్రయ = తాపములమూఁడింటియొక్క, నిర్వాపణ = పోఁగొట్టుటయొక్క, కరణ = చేయువాఁడా! [illegible]త్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అని తాపములు మూఁడు, అందు ఆధ్యాత్మికము—శరీర[illegible]గుతాపము, క్షుత్పిపాసాజ్వరాదులు; ఆధిభౌతికము—భూతములవలనఁ గలుగుతాప[illegible]దిబాధలు; ఆధిదైవికము—దైవమువలనఁ గలుగుతాపము, వర్షవాతాదులు; వీనిని పోఁగొట్టువాఁడా యని తాత్పర్యము. బోధనిర్మలజనహృత్ పర్వఆచరణ [illegible]మ లయినజనులయొక్క మనస్సులకు సంతోషము చేయువాఁడా! జ్ఞాని[illegible] వాఁడా యని తాత్పర్యము. మహత్ ఆసురగర్వహరణ= గొప్పరా[illegible] వాఁడా! తత్త్వసంప్రకాశనకరుణా = యథార్థమును వెల్లడిచేయునట్టి [illegible] భక్తులకు స్వస్వరూపమును దెలుపువాఁడా యని తాత్పర్యము.

మాలిని. నిగమకుసుమగంధో♦న్మేషభూతాభిధానా
సగుణవిగుణలీలా♦సౌమ్యసాక్షిత్వతానా
జగదవనవిధాన♦స్థైర్యదత్తావధానా
నగశరధినివాసా♦నందసంస్తూయమానా. 407

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

---

407. నిగమ...అభిధానా—నిగమ = వేదము అను, కుసుమ = పుష్పముయొక్క, గంధ వాసనయొక్క, ఉన్మేషభూత = వికాసరూప మయిన, అభిధానా = నామము కలవాఁడా! వేద లయందు బోధింపఁబడిననామము గలవాఁడా యని తా. సగుణ......తానా—సగుణ = గుణముల గూడినదియు, విగుణ = గుణములు లేనిదియు నగు, లీలా = విలాసములయందు, సౌమ్య = శ మయిన, అంటని దైన యనుట, సాక్షిత్వ = సాక్షిభావమె, తానా = స్వభావముగాఁ గలవాఁ సగుణభావమునందును నిర్గుణభావమునందును నంటక సాక్షిభూతుఁ డైనవాఁడా యని తాత్పర్య జగదవనవిధానస్థైర్యదత్తఅవధానా=లోకముయొక్క రక్షించుటయందును మఱుఁగుపఱచుటయం నిలుకడ గలవాఁ డగుటయందు, దత్త = ఇయ్యఁబడిన, అవధానా = ఎచ్చరిక గలవాఁడా! ముల సృజించుటయందును రక్షించుటయందును జాగరూకుఁ డయినవాఁడా యని తాత్పర్యము, రక్షించువాఁ డనియు, హరుఁడు హరించువాఁ డనియు హరిహరరూపుఁ డగుటచే నిట్లు చెప్ప నది. నగశరధినివాస ఆనందసంస్తూయమానా = పర్వతమునందును సముద్రమునందును నుని గలుగుసంతోషముచేఁ జుట్టఁబడినవాఁడా! హరుఁడు కైలాసమునందును హరి పాలసముద్రమునం నివసించి సంతోషించుచుండువాఁ డని తాత్పర్యము.

శ్రీమత్......ప్రణీతంబు—శ్రీమత్ = గొప్పతనముగల, ఉభయకవి = సంస్కృత మిత్త్ర = స్నేహితుఁడును, కొమ్మనఅమాత్యపుత్త్ర = కొమ్మనమంత్రికుమారుఁడును, రాజి = పండితుల సేవచేఁ బ్రకాశించువాఁడు నగు, తిక్కనసోమయాజిప్రణీతం యాజిచేఁ జేయఁబడినది. ఇది—ముగిసెను.